శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము

## ప్రథమ భాగము.

(ప్రథమాధ్యాయాంతము)





గ్రంథకర్త

కావ్యరత్న, వేదాంతరత్న, వేదాంతతీర్థ, వేదాంతవాచస్పతి

శ్రీమాన్

కందాడై శేషాచార్యులు

శ్రీః.

శ్రీమతే రామానుజాయనమః.

# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము

ఇది,

భగవద్బాదరాయణమహర్షి ప్రణీత

శ్రీమచ్ఛారీరక మీమాంసా శాస్త్రంబునకు

భగవద్రామానుజప్రణీత

శ్రీభాష్యమునకు సరియయిన తెనుగున

కావ్యరత్న, వేదాంతరత్న, వేదాంతతీర్థ, వేదాంతవాచస్పతి

శ్రీమాన్

## కందాడై శేషాచార్యుల వారిచే

రచియింపఁబడి

స్వకీయ

వేదాంత ముద్రాయంత్రమున

ముద్రింపఁబడి

ప్రచురింపఁబడినది.

**MADRAS**

1922.



కావ్యరత్న, వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతి
శ్రీమాన్
కందాడై శేషాచార్యులవారు

    

శ్రీమతేరామానుజాయనమః.

# శ్రీమదాంధ్రశ్రీభాష్యము

## ప్రథమాధ్యాయము. జిజ్ఞాసాధికరణము.

### ప్రథమపాదము



అఖిల భువన జన్మ స్థేమ భఙ్గాదిలీలే
వినత వివిధ భూత వ్రాత రక్షైకదీక్షే।
శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమ పరస్మిఞ్ శేముషీ భక్తిరూపా॥

శ్లో. పారాశర్య వచస్సుధా ముపనిషద్దుగ్ధాబ్ధి మధ్యోద్ధృతాం
సంసారాగ్ని విదీపన వ్యపగతప్రాణాత్మ సఞ్జీవినీమ్।
పూర్వాచార్యసురక్షితాం బహుమతివ్యాఘాతదూరస్థితా
మానీతాంతు నిజాక్షరై స్సుమనసో భౌమాః పిబన్త్వన్వహమ్॥

చ. అఖిల జగజ్జని స్థితి లయాదులు లీలలుగాఁ, బదానమ
న్నిఖిల విచిత్ర భూతచయ నిస్తుల రక్షయె దీక్షగాఁ, త్రయీ
శిఖరమునన్ వెలింగెడు విశిష్టము బ్రహ్మము శ్రీనివాసుఁ డా
సుఖమయునందు నాదుమతి శోభిలుఁ గావుత భక్తిరూపమై.

శా. వేదాంతామృతవార్ధి వెన్నయు, భవోద్వేలాగ్ని వీతాసులా
నాదుర్జీవులజీవగఱ్ఱి, బహుపూర్వాచార్య గుప్తంబు, నా
నాదృష్టిప్రవిభక్తి దవ్వగుటచే నైజాక్షరానీత, మా
వేదవ్యాసవచస్సుధన్ సుమనసుల్ వేడ్కన్ భువిం ద్రావరే.

శ్రీభాష్యప్రతిజ్ఞ:—భగవద్బోధాయనమహర్షి బ్రహ్మసూత్రములకు వృత్తియనంబడునట్టి మిక్కిలి గొప్పదయిన యొక వ్యాఖ్యను వ్రాసియుండిరి.

[1]టఙ్క—ద్రమిడాచార్యులు మొదలగు పూర్వాచార్యులు ఆవృత్తిని సంగ్రహముగఁ జేసి చిన్న చిన్న గ్రంథములుగా రచియించియుండిరి. [2]ఆబోధాయన మహర్షి మొదలగు వారి మతము ననుసరించి బ్రహ్మసూత్రములకు ప్రకృతిప్రత్యయముల యర్థముల కనుగుణముగ వాఖ్యానమును జేయుచున్నాఁడను.

## ౧॥ సూ॥ అథాతో బ్రహ్మజిజ్ఞాసా.

టీ॥ అథ = అనంతరము, అతః = ఇందువలన,

బ్రహ్మజిజ్ఞాసా = బ్రహ్మవిచారము, (కర్తవ్యా = చేయఁదగినది.)

తా॥ (అథ) అనంతరము—సాంగ వేదాధ్యయన ద్వారా కర్మవిచారముచేసిన తరువాత; (అతః) ఇందువలన—కర్మవిచారము చేయుటచే కర్మఫలములు స్వల్పములనియు, అస్థిరములనియును తెలియవచ్చుటవలన, (బ్రహ్మజిజ్ఞాసా) అటుపైని అనంతమై స్థిరమగు ఫలమును (మోక్షమును) ఇచ్చునట్టి బ్రహ్మవిచారము చేయఁదగినది.

శ్రీభాష్యము:—

"అథ" శబ్దార్థము:—ఈ సూత్రములోని "అథ" అను శబ్దమునకు అనంతరమని యర్థము.

"అతః" శబ్దార్థము:—"అతః" అను శబ్దము కడచినది హేతువగుటను తెలుపుచున్నది. అనఁగా పూర్వముచేసినట్టి కర్మముల యొక్క ఫలములు అనిత్యములని తెలియుటవలన ననియర్థము. వేదవేదాంతములను సాంగముగాఁ జదివి కర్మజ్ఞానమువలనఁ గలిగెడి ఫలము స్వల్పమనియు, అస్థిరమనియు నెఱింగినవాఁడగుటచే మోక్షమున నభిలాష గలిగినవానికి అటుపైని గలుగునది అనంతమై స్థిరమగు ఫలమును (మోక్షమును) ఇచ్చునట్టి బ్రహ్మజ్ఞానమునఁ గోరిక యే కదా!

వ్యాకరణవిషయము:—బ్రహ్మజిజ్ఞాసయనఁగా బ్రహ్మమును తెలియఁ గోరుట. "బ్రహ్మణః జిజ్ఞాసా" అని విగ్రహవాక్యము. ఇచట బ్రహ్మశబ్దముపై నుండెడి షష్ఠీవిభక్తి "కర్తృకర్మణోఃకృతి" అనఁగా కృత్ప్రత్యయాంతశబ్దముతో

(1) టంకాచార్యుల వారు బ్రహ్మసూత్రములకు వాక్యములను కృపచేసియున్నారు. వాక్యములనఁగా సూత్రములలోఁ జెప్పినవానిని జెప్పనివానినిఁ గూడ యుక్తులచే విమర్శించెడు గ్రంథము. ఈ వాక్యములకును బ్రహ్మసూత్రములకును ద్రమిడాచార్యుల వారు భాష్యములను వ్రాసియున్నారు.

(2) విశిష్టాద్వైత సిద్ధాంతము ఋషులకాలమునుండి అనాదిగవచ్చునదియనియు ఈ సిద్ధాంతపరములగు సూత్రార్థములే ఋషిసమ్మతములుగాన మిక్కిలి విశ్వసనీయములనియును ఇందువలన సూచితమగుచున్నది.

నన్వయము గలుగునప్పుడు [1]కర్తృవాచకమునకును కర్మవాచకమునకును షష్ఠియగును అనుపాణిని సూత్రమునుబట్టి కర్మార్థమున వచ్చినది. (ఇది తెలుఁగు భాషలో ద్వితీయగానే వ్యవహరింపఁబడును)

శంక:—బ్రహ్మము యొక్క జిజ్ఞాస అనఁగా బ్రహ్మ సంబంధముగల జిజ్ఞాసయను సంబంధార్థక షష్ఠిని జెప్పుకొనినను, బ్రహ్మము జిజ్ఞాసకు కర్మమగుట కూడ ఒక సంబంధమే గనుక బ్రహ్మమును తెలియఁగోరుట అనెడి యర్థము తేలుచున్న దన్న యెడల,

సమాధానము:—వాస్తవమే. అయినను సాక్షాత్తుగా అర్థము నిచ్చెడి షష్ఠిని వదలుకొని అను మానముపై అర్థము నిచ్చెడి సంబంధషష్ఠిని పరిగ్రహించుట న్యాయ విరుద్ధము కావున కర్మషష్ఠియే యిచట గ్రహింపఁబడుచున్నది.

శంక:—"ప్రతిపదవిధానాచ షష్ఠీ న సమస్యతే" అనఁగా 'ప్రత్యేకముగా విధింపఁబడిన షష్ఠితో సమాసము జేయఁగూడ'దను వార్తికమును బట్టి యిచ్చట కర్మషష్ఠికి సమాసమెట్లు గలుగు? ననిన,

సమాధానము:— "కృద్యోగాచ షష్ఠీసమస్యతే" అనఁగా కృత్ప్రత్యయముతో అన్వయించెడి షష్ఠికి సమాసము వచ్చుననుట దానికి ప్రతిప్రసవము గాఁగలదు. అనఁగా అపవాదమున కపవాదము గలదు. దీనింబట్టి యిచట సమాసము సిద్ధించుచున్నది.

బ్రహ్మశబ్దార్థము:--స్వభావముచే తిరస్కరింపఁబడిన సకలదోషములు గలవాఁడును అసంఖ్యేయములగు కల్యాణగుణ సముదాయము గలవాఁడును అగు పురుషోత్తముఁడని బ్రహ్మశబ్దార్థము. అన్ని చోట్లను బ్రహ్మశబ్దము బృహత్త్వము (పెద్దతనము) అనెడి గుణమునుబట్టి ప్రవర్తించును. అందు స్వరూపమును బట్టియు గుణములను బట్టియు బృహత్త్వము (పెద్దతనము) ఎవ్వని యందు అంతములేని యతిశయము గలదై యుండునో వాఁడని బ్రహ్మశబ్దమునకు ముఖ్యమయిన యర్థము. అట్టివాఁడు సర్వేశ్వరుఁడే. కావున బహ్మశబ్దము ముఖ్య

(1) ఉదాహరణములు. భగవతో రక్షణం=భగవంతుడు రక్షించుట. ఇచట రక్షించువాఁడగుటచేఁ గర్తయగు భగవంతునిఁ జెప్పుచు "భగవతః" అనునది షష్ఠీని భక్తిలోనున్నది. జగతాంపాలక ఈశ్వరః=జగత్తులను పాలించువాఁడు ఈశ్వరుఁడు ఇచ్చట పాలింపఁబడునవి యగుటచేఁ గర్మములైన జగత్తులను జెప్పెడిశబ్దము "జగతాం" అను షష్ఠీవిభక్తితోఁ బ్రయోగింపఁ బడియున్నది

ముగా సర్వేశ్వరునే తెలియఁజేయునది. కావున నట్టిబృహత్త్వగుణలేశమును బట్టి తదితరపదార్థములను దెలియఁజేయుటయం దిది. [1]ఔపచారికముగఁ బ్రయోగింపఁబడుచున్నది. ఒక్కశబ్దమున కనేకముఖ్యార్థములను కల్పించుట యుక్తముకాదు. కావుననే [2]భగవచ్ఛబ్దము పురుషోత్తముని యందు ముఖ్యార్థమనియు మిగిలినవారియందు ముఖ్యార్థము కాదనియును జెప్పఁబడినది. [3]తాపత్రయము వలన బాధపడుచున్నవారిచే మోక్షమును బొందుటకై తెలియఁగోరఁదగినవాఁడు సర్వేశ్వరుఁడే గనుక వారి జిజ్ఞాసకువిషయభూతముగఁ జెప్పఁబడిన బ్రహ్మము సర్వేశ్వరుఁడే.

జిజ్ఞాసాశబ్దార్థము:—జిజ్ఞాసయనఁగా తెలిసికొనవలయు ననుకోరిక. కోరికకు ప్రయోజనము కోరఁబడువస్తువు గనుక నిచ్చట కోరికయనఁగాఁ గోరఁబడుబ్రహ్మజ్ఞానము విధింపఁబడుచున్నది.

కర్మవిచారము చేసిన పిదప బ్రహ్మవిచారముచేయవలసినది

మీమాంసా శాస్త్రముయొక్క పూర్వభాగమునఁ దెలుపఁబడిన కర్మము వలన అల్పాస్థిరమగు స్వర్గాదిఫలము కలుగుచున్నది. ఉత్తరభాగమునఁ దెలుపఁబడిన బ్రహ్మజ్ఞానమువలన అనంతమై నాశరహితమగు మోక్షఫలము కలుగుచున్నది. కావున ప్రథమమున కర్మవిచారముచేసి పిదప అందువలననే-అనఁగా కర్మవిచారము చేయుటచేతనే-కర్మము స్వల్పమయి నట్టియు

(1) ఔపచారికము అనగా ముఖ్యార్థముకానిది. ఎట్లన, గంగాశబ్దమునకు గంగాప్రవాహము ముఖ్యార్థము. కను "గంగాయాం ఘోషః, అనఁగా గంగయందు గొల్లపల్లెయున్నది" అను వాక్యమున గంగాశబ్దమునకు లక్షణచే గంగాతీరమని చెప్పఁబడిన యర్థము ఔపచారికార్థ మనఁబడుచున్నది.

(2) భగవచ్ఛబ్దముయొక్క ప్రయోగమును గురించి విష్ణుపురాణమున నిట్లుచెప్పఁబడియున్నది శ్లో. తత్ర పూజ్యపదార్థోక్తి పరిభాషాసమన్వితః। శబ్దోయం నోపచారేణ అన్యత్ర హ్యుపచారతః॥ (విష్ణు ౬-౫-౭౭) అనగా గౌరవనీయమగు పదార్థమును తెల్పుటయును పరిభాషయును (సాంకేతికము) అను వానితో గూడిన ఈ భగవచ్ఛబ్దము ఆ పురుషోత్తమునియందు అముఖ్యముగా ప్రవర్తింపదు అనగా ముఖ్యముగా ప్రవర్తించును. తక్కిన వారియందు అముఖ్యముగా ప్రవర్తించును.

(3) తాపత్రయము:— ఆధ్యాత్మికము ఆధిభౌతికము ఆధిదైవికము అనెడి మూడుదుఃఖములు. అందు శారీరమనియు, మానసమనియు ఆధ్యాత్మికము రెండువిధములు. శారీరతాపములు వ్యాధులు. మానసతాపములు కామక్రోధాదులు. శార్దూలాది జంతువులవలనను పిశాచాదులవలనను గలుగునవి ఆధిభౌతికములు. శీత వాతాదుల వలన గలుగునవి ఆధిదైవికములు.

అనిత్యమయినట్టియు ఫలమునిచ్చునదని తెలియవచ్చుటవలన బ్రహ్మవిచారము చేయఁదగినదని చెప్పబడినది. కావుననే వృత్తికారులగు భగవద్బోధాయనులీ సూత్రమునకు "వృత్తాత్కర్మాధిగమాదనంతరం బ్రహ్మవివిదిషా" అనఁగా "కడచిన కర్మజ్ఞానమునకు తరువాత బ్రహ్మమును దెలియఁగోరుట" అని యర్థమును వ్రాసియున్నారు.

పూర్వమీమాంసోత్తర మీమాంసలు రెండును ఒక్కటియేశాస్త్రమని సమర్థించుట.

మఱియు కర్మబ్రహ్మ మీమాంసలు అనఁగా పూర్వమీమాంసయును (కర్మవిచారము) ఉత్తర మీమాంసయును (బ్రహ్మవిచారము) ఈ రెండును ఒక్కటియే శాస్త్రమని "సంహితమేతచ్ఛారీరకం జైమినీయేన షోడశలక్షణేనేతి శాస్త్రైకత్వసిద్ధిః" అనఁగా "ఈ బ్రహ్మమీమాంస జైమిని సంబంధియగు [1]పదునాఱు అధ్యాయముల గ్రంథముతో జేరియున్నది కావున శాస్త్ర మొక్కటియగుట సిద్ధించును" అనువాక్యముచే భగవద్బోధాయనులే తెలియఁజేయఁబోవుచున్నారు. ప్రతిపాదింపఁబడు విషయములకు భేదముండుటనుబట్టి [2]షట్కభేదంబును అధ్యాయభేదంబును గలిగినట్లే పూర్వోత్తరమీమాంసలకు భేదము గలిగినది. కావున మీమాంసాశాస్త్రము "అథాతో ధర్మజిజ్ఞాసా" అను (పూర్వమీమాంసాశాస్త్రముయొక్క మొదటి) సూత్రము మొదలుకొని "అనావృత్తిశ్శబ్దాదనావృత్తిశ్శబ్దాత్" అను (ఉత్తరమీమాంసా శాస్త్రము యొక్క అంతిమ) సూత్రమువఱకు సంగతి విశేషములతో అనఁగా పూర్వోత్తర గ్రంథముల సంబంధ విశేషముతోఁ గూడుకొని యున్నది.

వేదాధ్యయనవిధి నిరూపణము

అదెట్లులనిన, ప్రథమమున "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" (తై. ఆరం. ౨-ప్ర. ౧౫-అను) (వేదము అధ్యయనము చేయఁదగినది) అను విధివాక్యము వేదాక్షరగ్రహణరూపమగు వేదాధ్యయనమును విధించుచున్నది. వేదాధ్యయనమన నెట్టిది? దాని నెట్లు చేయవలయును? అనఁగా "అష్టవర్షం బ్రాహ్మణముపనయీత తమధ్యాపయేత్" (ఎనిమిదవయేట బ్రాహ్మణబాలుని నుపనయనముచేసి వేదముల నభ్యసింపఁజేసి

(1) కర్మస్వరూపాదులను నిరూపించు పూర్వమీమాంసా సూత్రములు పండ్రెండు అధ్యాయములును దేవతాస్వరూపమును నిరూపించుటకై సంకర్షణ మనఁబడు నాలుగు అధ్యాయములును జేరి జైమినిసంబంధియగు గ్రంథము పదునాఱధ్యాయములు గలదని శ్రీమహాచార్యుల వారు అధికరణార్థ సంగ్రహమున వ్రాసియున్నారు.

(2) ఆఱధ్యాయములుగల గ్రంథభాగమునకు షట్కమని పేరు.

జేయవలయును) అనియు "శ్రావణ్యాం ప్రౌష్ఠపద్యాం వా ఉపాకృత్య యథా విధి। యుక్తశ్ఛన్దాంస్యధీయీత మాసాన్ విప్రోఽర్ధ పఞ్చమాన్" (మను,౪-అ. ౯౫-శ్లో) (శ్రావణపూర్ణిమనాడు గాని భాద్రపదపూర్ణిమనాడు గాని శాస్త్రాను సారముగ ఉపాకరణమును జేసి బ్రాహ్మణుఁడు శ్రద్ధాయుక్తుఁడై నాలుగున్నరమాసములు వేదముల నభ్యసింప వలయును) అనియు నీమొదలగు శాస్త్రవాక్యములు వేదాధ్యయనమునకుఁ గావలసిన వ్రతములు నియమములు మొదలగు అంగములను విధించుచున్నవి. ఇట్లు సద్వంశమునందు జన్మించినవాఁడును, సదాచార సంపన్నుఁడును, కోపము లేకుండుట మొదలగు ఆత్మగుణములు గలవాఁడును, వేదాధ్యయనపరుఁడును అగు ఆచార్యునిచే ఉపనయనమును బొందిన వాఁడై ఉపాకరణము మొదలగు వ్రత నియమములు గల శిష్యుఁడాచార్యుని చే సంథ చెప్పుకొని వేదములను గ్రహించుటయే వేదాధ్యయనమని ఇందువలనఁ దెలియుచున్నది. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను విధివాక్యమునందుండు 'అధ్యేతవ్యః' అనుక్రియకు "స్వాధ్యాయః" (వేదము)అనుపదము కర్మగఁదెలియ వచ్చుచున్నది. కావున అధ్యయన మనునది వేదములయొక్క సంస్కారము. ఏదైన నొకవస్తువును మఱియొక కార్యమున కుపయుక్తమగు నట్లు జేయుటను సంస్కారమందురు. వేదము లట్టి సంస్కారమును బొందఁదగిన వగుట యుక్తమే. అదెట్లులనిన, అధ్యయన మను సంస్కారమును బొందుట చేఁగదా వేదములు ధర్మార్థకామమోక్షము లనెడి చతుర్విధ పురుషార్థములను, వానిని బొందుటకు సాధనములను దెలియఁజేయునవియు, జపాదుల చేతను స్వయముగఁగూడ అట్టిపురుషార్థములను గలుగఁజేయునవియును అగుచున్నవి. ఇట్లు అభ్యసింపఁబడిన వేదములు ఉపయుక్తాంశములను స్వాభావికముగానే తెలియఁజేయునవిగ గన్పట్టుచున్నందున "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" అను శాస్త్రవిధికి, మంత్రములతోను నియమములతోను వేదాక్షరసమూహము గ్రహింపవలయునని అనఁగా అర్థజ్ఞానముతో నిమిత్తము లేకుండ కేవలము వేదాక్షరములను ఉచ్చరింపవలయునని విధించుటయే, తాత్పర్యమని సిద్ధమగుచున్నది.

---

(1) అర్థజ్ఞానముతో నిమిత్తములేకుండ కేవల వేదాక్షరములను గ్రహించుట వేదాధ్యయనమని శ్రీబాదరాయణుల మతము. "అధ్యయనమాత్రవతః" అను సూత్రమున ఈవిషయమును దెలియఁజేయఁ బోవుచున్నారు. తరువాతి వ్యాఖ్యాతలర్థజ్ఞానముతో వేదముల నభ్యసించుటను వేదాధ్యయన మనుచున్నారు.

ఇట్లు వేదాధ్యయనము చేసిన పురుషుఁడు, తాను గ్రహించిన వేదములవలన తెలియఁబడుచున్న అర్థములను వాని ప్రయోజనములను చూచాయగా కనుఁగొని పిదప వానిస్వరూపవిధములను నిర్ణయించునదియు వేదవాక్య విచారరూపమును నగుమీమాంసా శాస్త్రవిచారమున స్వయముగనే ప్రవర్తించుచున్నాఁడు. ఇట్లు ప్రవర్తించి యందు యజ్ఞాదికర్మ స్వరూపాదులు నిరూపింపఁబఁడగా యజ్ఞాదికర్మ ఫల మల్పమనియు, అస్థిరమనియును దెలిసికొని తానధ్యయనము చేసిన వేదములోనే యొక్క భాగమయిన ఉపనిషద్వాక్యయలయం దమృతత్వము (మరణము లేక పోవుట) అనఁగా మోక్షము అనెడి అనంతస్థిరఫలమును చూచాయగఁ దెలిసికొనిపిదప దానిని నిర్ణయించునదై వేదాంతవాక్య విచారరూపమగు శారీరకమీమాంసాశాస్త్రమును చదువుచున్నాఁడు. అట్లు కేవలకర్మఫలములు క్షయించుననియు బ్రహ్మజ్ఞానము నిత్యఫలదాయ కంబనియు వేదాంత వాక్యములు తెలియఁజేయుచున్నవి.

ఎట్లన:—ఛాందోగులు"తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే; ఏవమేవాముత్ర పుణ్యచితోలోకః క్షీయతే" (ఛాం. ౮. ప్ర.౧ఖ ౦. ౬వా) అనఁగా ఈ లోకమున రాజసేవాది కర్మములచే సంపాదింపఁబడిన ఫలము ఎట్లుక్షీణించు చున్నదో అట్లే పరలోకమునఁగూడ పుణ్యముచే సంపాదింపఁ బడిన స్వర్గాదిఫలము క్షీణించు చున్నదనియు, వాజసనేయులు "అన్తవదేవాస్యతద్భవతి" (బృ. ౫ అ ౮. బ్రా. ౧౦ వా) అనఁగా జ్ఞానసంయుక్తముకాని కర్మము అంతముకలదియే యగుచున్నదనియు, కాఠకులు "నహ్యధ్రువైః ప్రాప్యతే (ధ్రువం)" (కఠ.౨-వ.౧౦ వా) అనఁగా అనిత్యములగు (కర్మములచే) నిత్యఫలము పొందఁబడదనియు, ఆథర్వణికులు "ప్లవాహ్యేతే అదృఢాయజ్ఞరూపాః" (౧ ము. ౨ఖ.౭వా) అనఁగాయజ్ఞరూపములగు కర్మములు, శిథిలములయిన నావలవంటి వనియు, (అనఁగాసంసార సాగరము నుండి దరిఁ జేర్చుటకు సమర్థములైనవి కావనియు) "పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్ నాస్త్యకృతః కృతేన తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం తస్మై సవిద్వానుపసన్నాయ సమ్యక్ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ యేనాక్షరంపురుషం వేద సత్యం ప్రోవాచ

కర్మఫల మనిత్య మని నిరూపించు శ్రుతివాక్యములు

తాం తత్త్వతో బ్రహ్మవిద్యాం" (౧ము ౨ఖ. ౧౨వా) అనఁగా, "వేదవేదాంతము లను సాంగముగఁ జదివిన బ్రాహ్మణుఁడు కర్మములచేత సంపాదింపఁబడు ఫలములను పరీక్షించి (అనఁగా మీమాంసా న్యాయములచే నిరూపించి) నిత్యుఁడగు పరమపురుషుఁడు అనిత్యమగు కర్మమువలనఁ బొందఁబడఁడని ఎఱిఁగి ఎవ్వఁడు వైరాగ్యముఁ బొందునో వాఁడు సమిధలను చేతఁబట్టుకొని వేదాంత శాస్త్రవేత్తయు బ్రహ్మసాక్షాత్కారవంతుఁడు నగునాచార్యునాశ్రయించునది. ఆయాచార్యుఁడిట్లు తనను లెస్సగ నాశ్రయించినవాఁడును శాంతచిత్తుఁడును బాహ్యేంద్రియ నిగ్రహవంతుఁడును అగునా శిష్యునకు నిత్యుఁడును నాశ రహితుఁడును నగుపరమపురుషునిఁ దెలిసికొనుటకు సాధనమైన విద్యను యథార్థముగఁ దెలియఁజేయుననియును" చెప్పుచున్నందున దీనిచేఁ గర్మ ఫలము అనిత్యమని స్పష్టమగుచున్నది.

బ్రహ్మజ్ఞానమునిత్య ఫలదాయకం బని నిరూపించు శ్రుతి వాక్యములు

తైత్తిరీయులు "బ్రహ్మవిదాప్నోతిపరం" (తై-ఆ-౨అ. ౧అను. ౭వా) అనఁగా బ్రహ్మమునుపాసించువాఁడు పరమపదమును బొందుచున్నాఁడనియు "నపునర్మృత్యవేతదేకంపశ్యతి" అనుశ్రుతివాక్యము బ్రహ్మమును సాక్షాత్కరించుకొనినవాఁడు మరల జన్మమరణాది రూపమగు సంసారమును బొందఁడనియు, ఛాందోగులు "నపశ్యో మృత్యుంపశ్యతి" (ఛా. ౭ ప్ర-౨౬ ఖ-౨ వా) బ్రహ్మమును జూచువాఁడు మృత్యువును జూడఁ డనియు "స స్వరాడ్భవతి" (ఛా.౭ప్ర.౨౫. ఖ ౨ వా) అనఁగా అట్టివాఁడు కర్మవశ్యుఁడు గాఁడనియు "తమేవం విద్వానమృత ఇహభవతి నాన్యఃపన్థా అయనాయవిద్యతే" (పు.సూ-౨౦వా) అనఁగా పురుషోత్తముని ఈలోకమున ఈప్రకార ముపాసించువాఁడు జననమరణాది రహితమగు మోక్షమును బొందుచున్నాఁడు. భగవంతునిఁ బొందుట కితకంటె వేఱొకమార్గము లేదనియు, "పృథగాత్మానం ప్రేరితారంచమత్వా జుష్టస్తత స్తేనామృతత్వమేతి" (శ్వే౧అ-౬వా) అనఁగా ఆత్మను తత్ప్రేరకుఁడగు భగవంతునిని వేఱుగా (వేఱుఅని) తెలిసి కొని, దానివలనఁ ఆభగవంతునిచే ననుగ్రహింపఁబడినవాఁడై మోక్షమును బొందుచున్నాఁడనియు నిట్లుఁ జెప్పుచుండుటచే బ్రహ్మజ్ఞానమ నిత్యఫలము నిచ్చునదియని స్పష్టమగుచున్నది.

అద్వైతి:—సాంగముగ వేదాధ్యయన మొనర్చుటచే కర్మములవలన స్వర్గాదిఫలము గలుగు చున్నదనియు అట్టిస్వర్గాది ఫలము అనిత్యమనియు బ్రహ్మోపాసనమువలన జననమరణాదిదుఃఖరహిత మైనట్టియు మోక్షమనఁ బఱునట్టియు ఫలము గలుగు చున్నదనియుఁ దెలియవచ్చుచున్నది గదా! ఈసంగతుల నుదెలిసికొనిన తరువాత మోక్షేచ్ఛగల యధికారి బ్రహ్మ విచారమునఁ బ్రవర్తింపవచ్చునే. ఇట్లుండ వాఁడుకర్మ విచారమునఁ బ్రవర్తింప నేల ?

అథశబ్దార్థమును గుఱించిఅద్వైతులకును విశిష్టాద్వైతులకును గాఁదగిన వాదప్రతివాదములు.

భాష్యకారులు:—అటులయినచో సాంగవేదాధ్యయన మొనర్చుట చేతనే సర్వము తెలియవచ్చుచున్నదిగాన అట్టివాఁడు వేదాంత వాక్య విచారము నందును బ్రవర్తింప నక్కఱలేదు

అద్వైతి:— సత్యము. చూచాయగా తెలియుట కలదు. అయినను న్యాయములయొక్క (యుక్తుల యొక్క) సహాయముగల వాక్యమే నిశ్చితమగు అర్థమును దెలియఁజేయును. కావున చూచాయగా నర్థముఁ దెలిసినను సంశయములును విపర్యయములును (విరుద్ధార్థములును) గలుగక మానవు. కాఁబట్టి ఆనిర్ణయమునకై వేదాంతవాక్యవిచారము చేయవలసినది ఆవశ్యకమే.

భాష్యకారులు:— అట్లే కర్మవిచారము సయితము చేయఁదగినదని యెఱుంగుము.

## ——లఘుపూర్వపక్షము.——

అద్వైతి:— బ్రహ్మజిజ్ఞాసకు అవశ్యముగ దేని యపేక్ష యుండునో అదియే కడచినది యని చెప్పవలయును. బ్రహ్మవిచారము కర్మవిచారము నపేక్షింపదు. ఏలయన, వేదమందలి యుపనిషద్భాగమును అధ్యయనముఁ జేసిన వాఁడు ఇంతకుమునుపు కర్మవిచారమును జేసియుండనివాఁ డయినను వేదాంత వాక్యార్థవిచారమునం బ్రవర్తింపవచ్చును గదా!

భాష్యకారులు:—[1]కర్మాంగాశ్రయములయిన [2]ఉద్గీథాద్యుపాసనములు

(1) కర్మాంగాశ్రయములు=కర్మ [illegible]వభూతములగు నుద్గీథాదులతో సంబంధించినవి.

(2) ఒక్కొక సామమునకు, ప్రస్తావమనియు, ఉద్గీథమనియు ప్రతిహారమనియు, ఉపద్ర

వేదాంతశాస్త్రమునందే విచారింపఁబడుచున్నవిగదా! మొదట కర్మవిచారమును జేయక వేదాంతవాక్యార్థ విచారమునఁ బ్రవర్తించినవానికి అట్టి యుద్గీథాద్యు వాసనములను విచారించుట కెట్లు శక్యమగును?

అద్వైతి:— వేదాంతశాస్త్రముచే ప్రధానముగ ప్రతిపాదింపఁబడుజ్ఞాన మిట్టిదియని నీవుబొత్తిగా, నెఱుఁగవు. అనాదియగు అవిద్య నానావిధ భేదజ్ఞానమును గలుగఁజేయుచున్నది. ఆమూలముగ జననమరణాది దుఃఖరూపంబగు సంసారము గలుగుచున్నది. అందు మగ్నుఁడగుమానవుని యొక్క సర్వ దుఃఖ మూలకారణంబగు అవిద్యనుబోఁగొట్టుటకు (౪)ఆత్మైకత్వవిజ్ఞానమును వేదాంత శాస్త్రము ప్రతిపాదించుచున్నది. కేవల భేదజ్ఞానము నవలంబించియుండు కర్మ విచారము అట్టివేదాంత విచారమునం దెచ్చట నుపయోగపడుచున్నది? ఇంతి యగాక దానికి విరుద్ధమైనదిగ నున్నది. ఉద్గీథాదివిచారము కర్మతో సంబంధించి నదియేమైనను బ్రహ్మజ్ఞాన సదృశమగుటవలన వేదాంతశాస్త్రమునందు చేయఁ బడుచున్నదే కాని వేదాంతశాస్త్రముతో సాక్షాత్తుగా సంబంధించినందువలనఁ గాదు. కావున శాస్త్రమున నేది ప్రధానమో దానికిఁగావలసిన దానినే కడచిన దానినిగాఁ జెప్పనలయును.

భాష్యకారులు:— సత్యము. కర్మసంయుక్తమైన జ్ఞానమే మోక్షసాధనమని శ్రుతులు చెప్పుచున్నందున బ్రహ్మవిచార మవశ్యముగఁ గర్మవిచారము నపేక్షించుచున్నది. కావుననే బ్రహ్మసూత్రకారులు 'సర్వాపేక్షాచ

---

నమనియు, నిధనమనియును అయిదు విభాగములు కలవు. ఇవి భక్తులనియును గూడ పిలువఁబడుచున్నవి. ఆ యయిదుభక్తులలో ప్రస్తావము హింకారపురస్సరముగ గానము చేయుబఁడుచున్నది. ఉద్గీథము ప్రణవపురస్సరముగ గానము చేయఁబడుచున్నది. అందు పంచవిధసామోపాసనమును గూడ 'లోకేషుపఞ్చవిధం సామోపాసీత' అను వాక్యము విధించుచున్నది. ఒకచోట నీ యయిదుసామావయవములలో నొక్కొక్కయవయవమును గుఱించి ప్రత్యేకముగసయితముఁ ఉపాసనము విధింపబఁడుచున్నది. ఈ సందర్భమున "ఓమిత్యేత దక్షరముద్గీథ ముపాసీత" అను వాక్యముద్గీథోపాసనమును విధించుచున్నది.

(౪) ఆత్మైకత్వవిజ్ఞానము=అన్ని శరీరములనుండునట్టి ఆత్మయొక్కటియే యనియు అది యే బ్రహ్మమనెడిజ్ఞానము.

యజ్ఞాది శ్రుతేరశ్వవత్' (బ్ర.సూ-3అ-4పా-26సూ) అనుసూత్రముచే బ్రియాణసాధన భూతమగు నశ్వమునకుఁ గంత మొదలగు నుపకరణము లావశ్యకములైనట్లు మోక్షసాధనభూతమగు బ్రహ్మవిద్యకు 'యజ్ఞేనదానే'నేత్యాదిశ్రుతి ప్రమాణనియమితములగు యజ్ఞాదులన్నియు ఆవశ్యకములని మూడవ అధ్యాయమునఁ జెప్పఁబోవుచున్నారు. ఇట్లు అపేక్షితమగు కర్మము దెలియఁబడనిపక్షమున [1]ఏకర్మములతో సంయోగము తగునో యేకర్మములతో సంయోగము తగదో తెలిసికొనుట యశక్యము. కావున కర్మజ్ఞానమే కడచినది యని చెప్పఁదగును.

అద్వైతి:—ఇట్లు చెప్పుట యుక్తముకాదు. ఎట్లనిన, బ్రహ్మము సకల విశేష ప్రత్యనీకచిన్మాత్రం బనెడి, అనగా [2]నిర్విశేష చిన్మాత్రంబనెడి జ్ఞానము వలననే యవిద్య నివర్తించును. అవిద్య నివర్తించుటయే మోక్షము. ఇట్లుండ కర్మమనునది బ్రాహ్మణాది వర్ణములు బ్రహ్మచర్యాద్యాశ్రమములు వీనిచే సాధింపఁబడు యజ్ఞాది కామ్యకర్మములు నిత్యకర్మములు మొదలుగాగల అనేకభేదములకు స్థానమైనది. అట్టికర్మము భేదజ్ఞాననివృత్తిరూపమగు యజ్ఞాననివృత్తి కెట్లు సాధనము కాఁగలదు? "అంతవ దేవాస్యతద్భవతి". అనియు "తద్య థేహ కర్మచితోలోకః క్షీయతే, ఏవమేవాముత్రపుణ్యచితోలోకః క్షీయతే" అనియు "బ్రహ్మ విదాప్నోతి పరం"

కర్మము భేదజ్ఞాననిష్ఠమయి నందున నిర్విశేషచిన్మాత్ర బ్రహ్మజ్ఞానమును గలుగఁజేయ నేరదు

---

(1) జ్ఞానమునకు నిత్యనైమిత్తిక కర్మములతో సంయోగము తగును; కామ్య నిషిద్ధ కర్మములతో సంయోగము తగదు.

(2) విశేషమనగా భేదము. నిర్విశేషమనగా భేదములు లేనిది. సజాతీయభేదమనియు విజాతీయభేదమనియు, స్వగతభేదమనియును భేదము మూడువిధములుకలది. ఒకజాతిలోఁ జేరిన రెండుపదార్థములకుండు పరస్పరభేదము అనగా ఒకగోవునకును మఱియొకగోవునకునుండునట్టిభేదము సజాతీయభేదము. భిన్నజాతిలోఁజేరిన రెండుపదార్థములకుండునట్టి భేదము అనగా గోవునకును అశ్వమునకు నుండునట్టి భేదము విజాతీయభేదము తనలోఁ దనకుండు భేదము అనగా గోవునకుండు సాస్నా (మెడక్రింద వ్రేలాడుచర్మము) లాంగూలా (తోఁక) దిభేదము స్వగతభేదము. చైతన్యమాత్రమగు బ్రహ్మమునకంటె విజాతీయమై చేతనా చేతనవిశిష్టమగు నీప్రపంచ మంతయుఁను భ్రాంతివశమున బ్రహ్మమునందు కల్పింపబడినదిగాన వాస్తవమునకు బ్రహ్మవ్యతిరిక్తముగ ప్రపంచమను నదొకటియు లేదు. కావునదానినుండి బ్రహ్మమునకు విజాతీయ భేదము లేదు. బ్రహ్మ మొక్కటియేగాని యనేకములుకాదు. కావున నతనికి సజాతీయభేదము లేదు. బ్రహ్మమునకాకారములేదుగాన నతనికి స్వగతభేదమునయితము లేదు. ఇట్లు త్రివిధభేదములేని కేవల చైతన్యము బ్రహ్మమని యద్వైతులు చెప్పుదురు.

అనియు "బ్రహ్మవిద్బ్రహ్మైవభవతి" (ము. 3 ము.౨ఖ-౯ వా) (బ్రహ్మమును దెలిసికొనినవాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడు.) అనియు "తమేవ విదిత్వా అతిమృత్యుమేతి" (శ్వే. 3-అ. ౮-వా) (ఆబ్రహ్మమునే తెలిసికొనిన వాఁడు జననమరణాద్యతీతుఁడగుచున్నాఁడనియు) ఇత్యాదిశ్రుతులుగూడ కర్మములు అనిత్యఫలదాయకములుగాన మోక్షవిరుద్ధములనియు జ్ఞానమే మోక్షసాధన మనియును దెలియఁజేయుచున్నవి.

జ్ఞానము కర్మము నపేక్షించునది యనునంశము (1)వస్తువిరుద్ధము మఱియునీవిషయమై, "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసానాశకేన" యనుశ్రుత్యర్థమును బాగుగ పరిశీలింపగా నిచట "వివిదిషంతి" (తెలియఁగోరుచున్నారు) అనియున్నందున కర్మముఁజ్ఞానమును సంపాదించుకొనవలయున నెడియిచ్ఛను. చిత్తశుద్ధిద్వారా గలుగఁజేయుచున్నదని సిద్ధమగుచున్నది గాని జ్ఞానమును గలుగఁజేయుచున్నదని సిద్ధమగుటలేదు. ఇట్లుజ్ఞానమును గలుగఁ జేసికొనవలయుననే యిచ్ఛగలిగినప్పుడు శమదమాది గుణములు జ్ఞానము గలుగుటకు అంతరంగోపాయములని "శాంతోదాంత ఉపరత స్తితిక్షుస్సమా హితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యేత్ (బృ.౬-అ.౪-బ్రా.౨3 వా)" (అంతరింద్రియ బహిరింద్రియ నిగ్రహము గలవాఁడును వైరాగ్యసంపన్నుఁడును సహనశీలుఁడును నగువాఁడు ఏకాగ్రచిత్తుఁడై తనయందే తననుచూచునది) అను శ్రుతియే వక్కాణించుచున్నది.

కర్మము వివిదిషను మ్యాత్రము గలుగజేయుచున్నది

కాఁబట్టి యిట్ల నేక జన్మములు ఫలాపేక్ష లేకయే యొనర్చిన యజ్ఞాది కర్మములవలన పాపము నశించిన మానవునికి జ్ఞానసంపాదనమునకు కోరిక గలుగఁగా "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయం" (ఛా.౬-ప్ర.౨-ఖ. ౧-వా.) (ఈ జగత్తు సృష్టికి పూర్వ మొక్కటియే యై రెండవది లేనిదియునై యుండెడిసత్తు అనఁగా బ్రహ్మమే ఆయెను) అనియు "సత్యం జ్ఞాన మనం

---

(1) కర్మము భేదజ్ఞానవాసనను గలుగజేయు నదియు, అనిత్యములగు స్వర్గాదిఫలములనిచ్చునదియును.జ్ఞానమన్ననో భేదజ్ఞానమును బోగొట్టునదియు నిత్యమగు మోక్షఫలము నిచ్చునదియును. కావున ఈరెండు పరస్పరము విరుద్ధములు. కాబట్టి యీరెంటిలో నొకటి మఱియొకదానిని యపేక్షించి యుండుటయును విరుద్ధము. ఇట్లు అద్వైతులు చెప్పుదురు.

తం బ్రహ్మ" (తై-ఆన-౨అ-౧ అను-౯వా) (మిథ్యాభూతము కానిదియు,జడము కానిదియు పరిచ్ఛిన్నము కానిదియు బ్రహ్మము) అనియు "నిష్కళం నిష్క్రియం శాంతం"(శ్వే-౬అ-౧౯వా)(అవయవములు లేనిదియు, కదలిక లేనిదియు, శాంతమైనదియు బ్రహ్మము) అనియు "అయమాత్మా బ్రహ్మ" (బృ-౬అ.౪బ్రా. ౫వా)(ఈ యాత్మయే బ్రహ్మము) అనియు "తత్త్వమసి" (ఛా.౬.ప్ర.౮.ఖ.౭.వా) (ఆ బ్రహ్మమే నీవు) అనియు ఈ మొదలుగాఁగల వేదాంతవాక్యములయర్థమును దెలిసికొనుటవలన నట్టి మానవుని యవిద్య నివర్తించుచున్నది.

అట్టి వాక్యార్థ జ్ఞానమునకు శ్రవణంబును, మననంబును నిదిధ్యాసనంబును మిక్కిలి యుపయోగకరములు. ఆత్మయొక్కటియే యను జ్ఞానమును వేదాంతవాక్యములు ప్రతిపాదించుచున్నవి యనెడి తత్త్వము నెఱింగిన యాచార్యునివలన న్యాయయుక్తమగు నర్థమును గ్రహించుట శ్రవణమనఁబడుచున్నది. ఇట్లు ఆచార్యునిచే నుపదేశింపఁబడిన యర్థము యుక్తమే అని యుక్తులతోఁ దనలో తాను నిర్ధారణచేసికొనుట మనన మనఁబడుచున్నది. ఇట్టి జ్ఞానమునకు విరుద్ధమయిన అనాదిభేదజ్ఞాన వాసనను బోఁగొట్టుకొనుటకై ఈయర్థమునే ఎల్లప్పుడు తలంచుచుండుట నిదిధ్యాసనమనఁబడుచున్నది. కావున నిట్టి శ్రవణ మనన నిదిధ్యాసనములవలన భేదజ్ఞానము వాసనతోఁ గూడ నశించిన మానవుని యవిద్యను వాక్యార్థజ్ఞానము పోఁగొట్టును. కావున ఇట్టి శ్రవణమున కవశ్యముగఁ గావలసిన దానినే బ్రహ్మవిచారమునకుఁ బూర్వము గడచిన దానినిగాఁ జెప్పవలయును.

శ్రవణమననాదులు వాక్యార్థజ్ఞానమున కావశ్యకములు

[1]నిత్యానిత్యవస్తువివేకంబును, [2]శమదమాదిసాధనసంపత్తియు, [3]ఇహాముత్రచఫలభోగ విరాగంబును [4]ముముక్షుత్వంబును అనెడి ఈసాధన చతుష్ట

(1) నిత్యా నిత్యవస్తు వివేకము = బ్రహ్మము నిత్యమనియు మిగిలినదంతయును అనిత్యమనియును దెలిసికొనుట.

(2) శమదమాది సాధనసంపత్తి=శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము శ్రద్ధ అను నాలును గలుగుట. మనస్సులౌకికవ్యాపారములులేనిదై యుండుట అనగా కామక్రోధాదులులేక యడఁగియుండుట శమమనబడును. బాహ్యేంద్రియములన్నియు వ్యాపారములులేనివై యుండుట దమమనఁబడును. ఉపరతి యనగా సన్యాసము. శీతోష్ణములు, లాభాలాభములు, జయాపజయములనెడి ద్వంద్వములను సహించుట తితిక్ష యనబడును. నిద్ర, బద్ధకము, పొరపాటు ఇవిలేకమనస్సునిలకడగానుండుట సమాధానమనఁబడును. ఆచార్యోపదేశమునందును, వేదాంతములయందును నమ్మకము శ్రద్ధయనంబడును.

(3) ఇహాముత్రచ ఫలభోగవిరాగము = ఈలోకములోని యైశ్వర్యాది ఫలములయందును పరలోకములోని స్వర్గాదిఫలముల యందును కోరికలేక పోవుట.

(4) ముముక్షుత్వము = మోక్షమునందిచ్ఛగలవాడగుట.

యము అట్టి శ్రవణమున కావశ్యకము. అది లేనియెడల బ్రహ్మజిజ్ఞాస గలుగ నేరదు. బ్రహ్మజ్ఞానమును గలుగఁజేయుటకు శమద మాదులు అంతరంగోపాయములు అనెడి యర్థస్వభావ మును బట్టియే యీనాలుగు సాధనములు బ్రహ్మవిచార ముఁజేయుటకుఁబూర్వమాచరింపవలసినవని తెలియవచ్చు చున్నది.

బ్రహ్మవిచారమునకుఁ బూర్వము సాధన చతుష్టయానుష్ఠాన మావశ్యకము

అదెట్లనిన, బ్రహ్మస్వరూపమునుఁ గప్పివేయునట్టి యవిద్యయే కారణముగా గలదియు అసత్యమైనదియునగు భేదజ్ఞానమే సంసారబంధ మునకుఁ గారణము. అందువలననే సంసారబంధముకూడ నసత్యమయి నది. ఇట్టి సంసారబంధ మసత్యమైన దగుటవలన నది జ్ఞానముచేతనే సమూ లముగా నివర్తింపఁబడుచున్నది. కావున. 'తత్త్వమసి' ఇత్యాది మహా వాక్యముల వలనఁగలుగు జ్ఞానమే అట్టి యసత్యమగు సంసారబంధమును నివ ర్తింపఁజేయునది. అందువలన నిట్టి జ్ఞానోత్పత్తినిఁగలుగ జేయుటకుఁ గాని, లేక జ్ఞానకార్యమగు నజ్ఞాననివృత్తిని అనఁగా మోక్షమును గలుగఁజేయుటకుఁగాని కర్మములు యేమాత్రము ఉపయోగింపవు. అయితే జ్ఞానమునందిచ్ఛను గలుగఁజేయుటకు మాత్రము కర్మములు ఉపయోగపడుచున్నవి. అవి పాపమూలములగు రజస్తమోగుణములను బోగొట్టి సత్వగుణమును వృద్ధి పఱచుచున్నవి. ఈయుపయోగమునుఁ బట్టి శ్రుతియందుఁగూడ "బ్రాహ్మ ణావివిదిషంతి" అనుచోటఁ (కర్మమూలముగ) జ్ఞానమును సంపాదించుట కిచ్ఛ యించుచున్నారని మాత్రము చెప్పఁబడియున్నది. ఇట్లు బ్రహ్మవిచారము నకు కర్మజ్ఞానముతో నుపయోగము లేనట్లు సిద్ధమగుచున్నందున నిత్యానిత్య వస్తు వివేకము, మున్నగు నాలుగు సాధనముల యనుష్ఠానమే బ్రహ్మవిచార మునకు పూర్వము కడచినదిగఁ జెప్పవలయునని పూర్వపక్షమురాఁగా,

## లఘుసిద్ధాంతము

భాష్యకారులు:—అవిద్యా నివృత్తియే మోక్షమనియు, అది బ్రహ్మ జ్ఞానమువలననే గలుగునదనియుఁ జెప్పినదానిని యొప్పుకొనెదము. అయితే అవిద్య నివర్తించుటకై వేదాంత వాక్యములలో విధింపఁబడుజ్ఞాన మిట్టిదియని విమర్శింప వలసియున్నది. అది కేవలము వాక్యార్థజ్ఞానమా? లేక తన్మూల మగు ఉపాసనారూపమగు జ్ఞానమా? అది వాక్యార్థజ్ఞానమనుట

యుక్తముగాదు. ఏలయన, వాక్యములయొక్క అర్థమును దెలిసికొనినంతమాత్రముననే అవిద్య నివర్తించునట్లైన, వాక్యమును జదివినతోడనే వాక్యార్థము విశదమగుచున్నది, కావున నిందులకై దీనిని వేదాంత శాస్త్రము విధింపనవసరము లేదు. ఇంతియగాక వాక్యార్థము తెలిసినంతమాత్రముననే అవిద్య నివర్తించుటయును గూడ యసంభవము.

అద్వైతి:— భేదజ్ఞానముయొక్క వాసన యున్నంతవఱకు వేదాంత వాక్యములు అవిద్యను నివర్తింపఁ జేయఁగల జ్ఞానమును గలుగఁ జేయనేరవు. ఒకవేళ నవి యట్టి యవిద్యానివర్తకమగు జ్ఞానమును గలుగఁజేసినను అవిద్యా కార్యమగు భేదజ్ఞాన మందఱికిని వెంటనే నివర్తింపకపోవుట యొకదోషముగ నెన్నఁదగదు. ఎట్లన, చంద్రుఁ డొక్కఁడే యనుజ్ఞానమున్నను గొందఱికి అనేక చంద్రులున్నటులఁ గానఁబడును. భేదజ్ఞానము నివర్తింపక పోయినను దానికిఁ గారణమగు అవిద్య జ్ఞానోత్పత్తిచే నశింపఁబడినది, కాఁబట్టి ఛిన్నమూలమగు భేదజ్ఞానము సంసారబంధమున కెంతమాత్రము హేతువు గానేరదు.

భాష్యకారులు:— అది యుక్తముగాదు. కారణరూపములగు "తత్త్వమసి" ఇత్యాది మహావాక్యము లుండఁగఁ దత్కార్యరూపమయిన అవిద్యానివర్తకజ్ఞానము గలుగలేకుండుట యసంభవము. భేదజ్ఞాన వాసనయున్నను ఉపదేశాదులవలన అవిద్యానివర్తకమగు జ్ఞానము గలుగవచ్చును. వాక్యార్థ జ్ఞానము గలిగిన పిమ్మటఁ గూడ అనాదివాసనవలన భేదజ్ఞానము అనువర్తించు ననుట నీతరముగాదు. ఏలయన, బ్రహ్మేతరమైన సర్వమును మిథ్యయను నీమత ప్రకారము భేదజ్ఞానమునకుఁ గారణభూతమగునట్టి యీవాసనగూడ మిథ్య యేగదా, కాఁబట్టి అది జ్ఞానము కలిగినతోడనే నివర్తించవలయును. జ్ఞానము కలిగినను మిథ్యారూపమగు వాసన నివర్తించనియెడల ఆవాసనను నివర్తింపఁ జేయునట్టిది జ్ఞానముకంటె మఱియొకటి యెద్దియును లేదు. కావున దాని కెన్నటికిని నివర్తియే లేకపోవును. మఱియు వాసనా కార్యమగు భేదజ్ఞానమునకు మూలభూతమగు అవిద్య నశించిన తరువాతను గూడ భేదజ్ఞాన మనువర్తించు ననెడిమాట మూర్ఖులు చెప్పుదురు. చంద్రుఁడొక్కఁడే యనెడి జ్ఞానమున్నను అనేకచంద్రులు కనుఁబడుట విరుద్ధము కాదు. ఏలయన, అనేకచంద్రులు కనఁబడుటయనెడి మిథ్యాజ్ఞానమునకు సత్యమగు నేత్రజాడ్యము కారణము, కావున నది చంద్రుఁడొక్కఁడేయను ఉపదేశ జ్ఞానముచే నివర్తింపఁదగినది కాదు.

రజ్జువును సర్పముగ భ్రమించిన వానికి అది సర్పము గాదు రజ్జువు అనెడి యాప్తోపదేశమువలన గలుగు రజ్జుజ్ఞానముచే సర్పభ్రాంతిమూలకములగు భయపలాయనాదులు నివర్తించునటుల చంద్రుఁడొక్కఁడే యనెడి జ్ఞానముచే చంద్రుఁడనేకముగఁ గానంబడుట యనెడి మిథ్యాజ్ఞాన మెందువలన నివర్తించ దని శంకింపఁబనిలేదు. ఏలయన, అనేకచంద్రదర్శన రూపమగు మిథ్యాజ్ఞానము తత్కారణమగు నేత్రజాడ్యమును బోఁగొట్టు నౌషధాదులవలన నివర్తించు నది గాని చంద్రుఁడొక్కఁడే యనెడి యాప్తోపదేశమువలనఁ గలుగు జ్ఞాన ముచే నివర్తించునదిగాదు. నీవు జెప్పిన ప్రకారము భేదజ్ఞానవాసన పోయిననే యవిద్యానివర్తక జ్ఞానముగలుగునను పక్షమునయట్టి జ్ఞానమెన్నఁడును గలుగనే కలుగదని చెప్పవచ్చును. ఎట్లన, భేదజ్ఞానవాసన యనాదిగ వృద్ధిపొందుచు వచ్చునదిగాన అది యపరిమితమైయున్నది. కాఁబట్టి స్వల్పకాలములో నభ్య సింపఁబడు నద్వైతభావనవలన నది నివర్తించుట దుర్లభము.

ఈపైనఁగను పఱచిన హేతువులను బట్టి వేదాంతవాక్యములయందు మోక్షసాధనముగ విధింపఁబడినది కేవల వాక్యార్థజ్ఞానమాత్రమేకాక తదితర మై యుపాసనమనియు ధ్యానమనియును వ్యవహరింపఁబడు వేఱొక జ్ఞానమని చెప్పఁదగును. శ్రుతులవలనఁ గూడనిటులనే దెలియవచ్చుచున్నది. ఎట్లనిన, "విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత" (బృ-౬అ-౪బ్రా-౨౧వా) అనఁగా దెలిసికొని ధ్యానమును జేయవలశినదనియు "అనువిద్య విజానాతి" (ఛా. ప్ర-౧౨ఖ ౬వా) అనఁగా దెలిసికొని ధ్యానముఁ జేయుచున్నాఁడనియు "ఓమిత్యేవాత్మానంధ్యాయథ" (ము-౨ము-౨ఖ-౬వా) అనఁగా ఓంఅనియే పరమాత్మను ధ్యానముఁ జేయుఁడనియు "నిచాయ్యతం మృత్యుముఖాత్ప్రముచ్యతే" (కఠ.౧అ-3వ-౧౫ వా) అనఁగా పరబ్రహ్మమును బాగుగ ధ్యానించి మృత్యుముఖమునుండి విడువఁ బడుననియు "ఆత్మానమేవ లోకముపాసీత" (బృ3అ.౪బ్రా.౧౫వా) అనఁగాపర మాత్మనే ప్రాప్యునిగ నుపాసింపవలయుననియు "ఆత్మావా అరేద్రష్టవ్యశ్శ్రో తవ్యోమన్తవ్యో నిదిధ్యాసితవ్యః". (బృ.౬అ-౫బ్రా-౬వా) అనఁగాపరమాత్మ యే చూడఁదగిన వాఁడు, వినఁదగినవాఁడు, విచారింపఁదగినవాఁడును, ధ్యానిం పఁదగినవాఁడుననియు "సోన్వేష్టవ్యస్సవిజిజ్ఞాసితవ్యః" (ఛా. ౮ ప్ర-౭ఖ౧ వా)

ఉపాసనము మోక్ష సాధనమని ప్రతి పాదించు శ్రుతులు

అనఁగా పరమాత్మయే వెదుకఁదగినవాఁడును, విచారింపఁ దగినవాఁడుననియు' నీవిధమున శ్రుతులు జెప్పుచు నుపాసనమును మోక్షసాధనముగఁ దెలియఁ జేయుచున్నవి.

"నిదిధ్యాసితవ్యః" ఇత్యాది వాక్యములకు సమానార్థములగుటంజేసి "అనువిద్యవిజానాతి"అనియు"విజ్ఞాయ ప్రజ్ఞాంకుర్వీత"అనియు నీమొదలగుశ్రుతివాక్యములు, వాక్యార్థజ్ఞానము ధ్యానోపకారక మగుటవలన, దానిని 'విజ్ఞాయ'(తెలిసికొని) అనియు, 'అనువిద్య' (తెలిసికొని) అనియు నీపదములచేత [1]అనువదించుచు "విజానాతి" (ధ్యానింపుచున్నాఁడు) అనియు "ప్రజ్ఞాంకుర్వీత" (ధ్యానము జేయవలశినది)అనియు నీ పదముల మూలముగ ధ్యానమును[2]విధించుచున్నవి."ఆత్మావాఅరేద్రష్టవ్యశ్శ్రోతవ్యోమన్తవ్యః"అనెడి శ్రుతి వాక్యము "శ్రోతవ్యః" అనియు"మన్తవ్యః" అనియు నీపదములచే శ్రవణ మననములను అనువాదరూపముగఁ దెలియఁజేయుచున్నది గాని వానిని విధింపుచుండలేదు. ఏలయన, వేదములు అర్థములను దెలియజేయుటయే స్వభావముగ గలవిగాన వేదాధ్యయన మొనర్చినవాఁడు వేదప్రతిపాదితములగు నుపయుక్తార్థములను సహజముగనే దెలిసికొనుచున్నాఁడు. అదివానికిఁ బ్రాప్తమైనదియేగాన అందులకై యొకశాస్త్రవిధి యవసరములేదు. ఆ యర్థములను దెలిసి కొనిన తరువాత వాని యాథార్థ్యము నెఱుంగుటకై యాయర్థములను దనలోఁదాను మననమును జేసికొనుచున్నాఁడు గాన వానికదియును బ్రాప్తమైనదియే. అందులకైయును ఒక శాస్త్రవిధి యవసరములేదు. అందువలన "నిదిధ్యాసితవ్యః" అనుపదముచేఁ జెప్పఁబడిన ధ్యానమే మోక్షసాధనముగ విధింపఁబడుచున్నది. బ్రహ్మసూత్రకారులుగూడ "ఆవృత్తి రసకృదుపదేశాత్" అను సూత్రమున వేదాంత వాక్యములయందు మోక్షసాధనముగ విధింపఁబడినది ధ్యానమేయని తెలియఁబఱచియున్నారు. ఈ హేతువులనుబట్టి మోక్షసాధనముగ విధింపఁబడినది ధ్యానము అనఁగా నుపాసనమని తెలియవచ్చుచున్నది.

శ్రవణమననములు అనువాదమాత్రములు ధ్యానముమాత్రమే విధింపఁబడుచున్నది.

---

(1) ఒకస్థలమున విధింపబడిన దానిని స్థలాంతరమున మరల పేర్కొనుటను అనువదించుట లేక నను వాదమందురు.

(2) ప్రమాణాంతరములచే దెలిసికొనుటకు శక్యముగాని దానిని క్రొత్తగ నియమించుటను విధించుటలేక విధియందురు.

మఱియు మోక్షసాధనము నుపదేశించు శ్రుతులలో కొన్ని తావుల నుపక్రమమునందు పాసనమును దెలియఁజేయు "ఉపాసీత"అను క్రియాపదమును బ్రయోగించి యుపసంహారమునందా (యుపాసనమును దెలియఁజేయు) "ఉపాసీత"అను క్రియాపదమునకు బదులుగ (జ్ఞానమును దెలియఁజేయు) "వేద"అను క్రియాపదమును బ్రయోగించియుండుట వలనను, మఱికొన్ని తావులయం దుపక్రమమున (జ్ఞానమును దెలియఁజేయు)"వేద"అను క్రియాపదమును బ్రయోగించి యుపసంహారమునం(దాజ్ఞానమును దెలియఁజేయు) "వేద"అనుక్రియాపదమునకు బదులుగ(ఉపాసనమును దెలియ జేయు)"ఉపాసీత" అను క్రియాపదమును బ్రయోగించియుండుటవలనను;[1] మోక్షసాధనముగ విధింపఁబడు జ్ఞానము ఉపాసనారూపమయినది యని యేర్పడుచున్నది. ఎట్లన:—

ఛందోగులు "మనోబ్రహ్మేత్యుపాసీత" (ఛా. 3-ప్ర.౧౮-ఖ. ౧-వా) అనఁగా మనస్సును బ్రహ్మదృష్టితో నుపాసించునది యనెడి యుపక్రమవాక్యమునందు (ఉపాసనమును దెలియఁజేయునట్టి) "ఉపాసీత" అను క్రియాపదమును బ్రయోగించి "భాతిచ తపతిచ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద" అనఁగా నెవ్వఁడిట్లు తెలిసికొనునో అనఁగా నుపాసముజేయునో వాఁడు కీర్తిచేతను (గొప్పదనపు ప్రసిద్ధిచేతను) యశస్సుచేతను (సౌలభ్యపు ప్రసిద్ధిచేతను) ప్రకాశించుచున్నాఁడు బ్రహ్మవర్చస్సుచేతను వెలుగుచున్నాఁడు అనెడి ఉపసంహారవాక్యమున (ఉపాసనమును దెలియఁజేయు) "ఉపాసీత" అను క్రియాపదమును బ్రయోగించుటకు బదులుగ (జ్ఞానమును దెలియఁజేయు) 'వేద' అను క్రియాపదమును బ్రయోగించియున్నారు.

వాజసనేయులు "నసవేద అకృత్స్నో హ్యేషః" (బృ. 3-అ.౪-బ్రా. ౭-వా) అనఁగా వాఁడు (జీవునియుపాసించువాఁడు) పరమాత్మను దెలిసికొనువాఁడు (ఉపాసించువాఁడు)కాడు. వీఁడు(జీవుడు) సంపూర్ణుడు కాడుగదా అనెడి

(1) ఉపక్రమోపసంహారములు ఏకరూపములుగనుండవలయునను శాస్త్రనియమముగలదు. అయితే "ఉపాసీత"అను క్రియాపదమును బ్రయోగింప వలసినతావున"వేద"అనుక్రియాపదమును"వేద"అనుక్రియాపదమును బ్రయోగింపవలసినతావున"ఉపాసీత" అనుక్రియాపదమును బ్రయోగించుటవలనను శ్రుతులయందీరెండు క్రియాపదములును సమానార్థకములుగ గన్పట్టుచున్నవి. కావున మోక్షసాధనముగ నుపదేశింపఁబడినది కేవల వాక్యార్థజ్ఞానమాత్రమే కాక సదియుపాసనారూపమగు జ్ఞానమని యేర్పడుచున్నది. కావుననే సూత్రకారులు గూడ "ఆవృత్తిరసకృదుపదేశాత్"(బ్ర సూ. ౪-అ. ౧పా.౧సూ)అను సూత్రమున మోక్షసాధనముగ విధింపబడిన బ్రహ్మవేదనమును పదేపదే యాచరింప వలసినదానినిగ జెప్పియున్నారు.

యుపక్రమవాక్యమున(జ్ఞానమును దెలియఁజేయు)"వేద" అను క్రియాపదమును బ్రయోగించి "ఆత్మేత్యేవోపాసీత" (పరమాత్మను ఆత్మయనియే=ఉపాసకుని ప్రత్యగాత్మకు ఆత్మయనియే యుపాసించునది) అనెడి యుపసంహార వాక్యమున (జ్ఞానమును దెలియజేయు) "వేద" అను క్రియాపదమును బ్రయోగించుటకు బదులుగ (ఉపాసనమును దెలియఁజేయు) "ఉపాసీత" అను క్రియాపదమును బ్రయోగించియున్నారు.

ఛందోగులు"యస్తద్వేద యత్స వేద స మయైతదుక్తః"(ఛా.౪-ప్ర.౧-ఖ ౪-వా) (ఏ రైక్వుడు బ్రహ్మమునెఱింగెనో వానినిగుఱించియు వాడెఱింగిన బ్రహ్మమును గుఱించియుఁ నేను చెప్పితిని) అనెడి యుపక్రమవాక్యమున (జ్ఞానమును దెలియఁజేయు) "వేద" అను క్రియాపదమును బ్రయోగించి ''అనుమ ఏతాం భగవో దేవతాం శాధి,యాం దేవతాముపాస్సే"(ఓపూజ్యుఁడా నీవే దేవత నుపాసించుచున్నావో ఆ దేవతను నాకు వివరించి దెలుపుము) అను ఉపసంహారవాక్యమున (జ్ఞానమును దెలియజేయు) ''వేద" అను క్రియాపదమును బ్రయోగించుటకు బదులుగ (ఉపాసనమును దెలియఁజేయునట్టి) ''ఉపాస్సే" అను క్రియాపదమును బ్రయోగించియున్నారు.

ఉపాసనము (ధ్యానము) స్మృతి సంతానరూపము

ఇట్లు వేదాంతవాక్యములచే మోక్షసాధనముగ విధింపఁబడు ధ్యానము తైలధారవలెనే అవిచ్ఛిన్నమగు స్మృతిసంతానరూపమయినది (ఎడతెగని స్మరణము). కనుకనే ఛందోగులు - "ధ్రువాస్మృతిః స్మృతిలమ్భే సర్వగ్రంథీనాం విప్రమోక్షః" అనఁగా ధ్రువ స్మృతి (వేరొక చింతనలేక తదేకచింతనలోనుండుట) కలుగుచున్నది. అట్టి ధ్రువమగుస్మృతి గలిగినట్టయిన సర్వబంధములు విడిపోవుచున్నవనియెడి వాక్యమున ధ్రువస్మృతినే మోక్షసాధనముగఁ జెప్పియున్నారు.

ఉపాసనము(ధ్యానము) సాక్షాత్కారరూపమయినదనుట.

ఇట్టి ధ్రువస్మృతియనునది దర్శనసమానాకారమైనది (అనఁగా చూచుచుట వంటిది). ఎట్లన, "భిద్యతే హృదయగ్రంథిశ్ఛిద్యంతే సర్వసంశయాః క్షీయంతేచాస్య కర్మాణి తస్మిన్ దృష్టేపరావరే" అనఁగా నాపరాత్పరుఁడగు పరమాత్మను సాక్షాత్కారముచేసికొనుటచే నజ్ఞానరూపమగు బంధము భేదింపఁబడుచున్నది. సమస్తసంశయములును ఛేదింపఁబడుచున్నవి. మఱియు వాని కర్మ

ములన్నియు (సంచితాగామి కర్మములు) నశించుచున్నవి అను శ్రుతివాక్యము పైనఁ గనుపఱుపఁబడిన శ్రుతివాక్యములతో నేకార్థముగలదగుటచే అచ్చట మోక్షోపాయముగ విధింపఁబడిన ధ్యానము సాక్షాత్కార రూపమైనదిగ విశదమగుచున్నది. కాఁబట్టి ఆత్మావా "అరే ద్రష్టవ్యః" ఇత్యాదిశ్రుతి వాక్యము నిదిధ్యాసనమును దర్శన సమానాకారమైనట్లు విధించుచున్నది. భావనాప్రకర్షమువలన స్మృతియే దర్శనరూపముగఁ బరిణమించుచున్నది. వాక్యకారులు దీనినంతయును సవిస్తరముగ వివరించియున్నారు. ఎట్లన, "వేదన ముపాసనం స్యాత్తద్విషయే శ్రవణాత్" అనువాక్యముననన్ని యుపనిషత్తులయందును మోక్షసాధనముగా విధింపఁబడిన జ్ఞానము ఉపాసనమని చెప్పియున్నారు. మఱియు వారు "సకృత్ప్రత్యయం కుర్యాచ్ఛబ్దార్థస్య కృతత్వాత్ప్రయాజాదివత్" అను వాక్యమున ప్రయాజాదికర్మలవలె వేదనము (జ్ఞానము) నొకసారి యాచరింపవలయును, అంతమాత్రముననే విధివాక్యార్థము సిద్ధమగునని పూర్వపక్షము జేసి "సిద్ధంతూపాసన శబ్దాత్" (అది యుపాసనమనఁబడునదిగాన పదేపదే యాచరింపఁబడునట్టిది) యనుచు ఉపాసనమే మోక్షసాధనమని నిర్ణయించి యున్నారు. "ఉపాసనం స్యాద్ధ్రువాస్మృతిః దర్శనాన్నిర్వచనాచ్చ" అనఁగా ఉపాసనమే ధ్రువస్మృతియగును, అట్లు కనఁబడుటవలనను వివరణ వాక్యములుండుటవలనను అనువాక్యముచే పదేపదే యాచరింపఁబడునట్టి యుపాసనారూపమగు జ్ఞానమే ధ్రువస్మృతి యనియును వర్ణించియున్నారు. మఱియు నిట్టి ధ్రువస్మృతిని దర్శనరూపమైన దానినిగా ప్రతిపాదించి యున్నారు. దర్శనరూపమనఁగా ప్రత్యక్షమగుట యని యెఱుంగునది.

ఉపాసనము (ధ్యానము) ప్రీతి రూపమై యుండుట

ఇట్లు మోక్షసాధనమును ప్రత్యక్షతారూపమును అగు ధ్రువస్మృతి యొక్క (ఉపాసనముయొక్క) విశేషరూపమును గుఱించి "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన యమే వైషవృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వాం" (ము. 3-ము. ౨-ఖ. 3-వా) అనఁగా ఈపరమాత్మ వేదాధ్యయనముచేతను, బుద్ధిచేతను, ఎక్కువగా వినుటచేతను, పొందఁబడఁడు. అయితే ఈపరమాత్మ యెవనినిఁ బ్రేమించుచున్నాఁడో ఆతఁడే యీ పరమాత్మను పొందుటకుఁ దగినవాఁడు. అట్టివానికే యీ ఫరమాత్మ తన స్వరూపమును బాగుగఁ గనుపఱచుచున్నాఁడు అని శ్రుతిచెప్పుచున్నది. ఇందు

వలన శ్రవణ మనన నిదిధ్యాసనములు మాత్రమే పరమాత్మను బొందుటకు ఉపాయములు గావనియు నీపరమాత్మచే వరింపఁబడుటయే యతనిఁజేరుటకు ఉపాయమనియుఁ దెలుపఁబడియె. ఎక్కువ ప్రియమైన పదార్థమే గదా వరింపఁ దగినది! ఎవ్వఁడు పరమాత్మను ఎక్కువగఁ బ్రేమించునో వానినా పరమాత్మయు నెక్కువగఁ బ్రేమించును. అట్టివాఁడు తనను పొందుటకు సాధనమగు ఉపాసనమును పరమాత్మయే స్వయముగ వానికి నియ్యఁ బ్రయత్నించుచున్నాఁడు. ఈ విషయమును భగవంతుఁడే స్వయముగఁ జెప్పియున్నాఁడు. ఎట్లన,

శ్లో॥ "తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే॥

(గీతా. ౧౦-అ. ౧౦- శ్లో.)

ఓయర్జునుఁడా. నాయెందెల్లెడల నాసక్తి గలిగి నన్నుఁ బ్రీతిపూర్వకముగ నాశ్రయించువారలకు నన్నుఁ జేరుట కుపయోగమగు జ్ఞానమును నేనే యిచ్చుచున్నాను. ఎందువలననఁగా:—

శ్లో॥ ప్రియోహిజ్ఞానినోత్యర్థం అహం సచ మమ ప్రియః (గీతా-౭అ-౧౭శ్లో)

జ్ఞానియగు వాఁడు నాకత్యంతప్రియుఁడు. జ్ఞానికి నే నత్యంత పి్రియుడను.

కాఁబట్టి స్మరింపఁబడు పదార్థము మిగులప్రియమైన దగుటంజేసి సాక్షాత్కారరూపమయిన యీస్మృతియును స్వయముగ నెవనికి మిగులఁ బ్రియమైనదియో వాఁడే పరమాత్మచే వరింపఁ దగినవాఁడు. అట్టిమానవుఁడే ఆపరమాత్మను బొందుచున్నాఁడు.

ఇట్టి ధ్రువమైన స్మృతియే (ఉపాసనమె) భక్తియనియును బిలువఁబడుచున్నయది. ఉపాసన భక్తి శబ్దములు పర్యాయశబ్దములుగదా! శ్రుతిస్మృతులు గూడ నిటులనే జెప్పుచున్నవి. ఎట్లన, "తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి" (ఆపరమాత్మనే యుపాసించి నాశరహితమగు మోక్షమును బొందుచున్నాఁడనియు, "తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పన్థా విద్యతేఽ యనాయ" (పు.సూ. ౧౭ వా) (పరమాత్మను నిట్లిధమున నుపాసించినవాఁడు నాశరహితమగు మోక్షమునుఁ బొందుచున్నాఁడు, అందులకై వేఱొక మార్గమెద్దియును లేదు) అన్నశ్రుతి

ప్రీతిరూపమగు ఉపాసనమే భక్తి యనుట

వాక్యములు ఉపాసన మనంబడుభక్తియే మోక్షసాధనమని స్పష్టముగఁ జెప్పు చున్నవి. మఱియు భగవంతుఁడు స్వయముగ నిటులఁ జెప్పుచున్నాఁడు:—

శ్లో॥ "నాహం వేదైర్న తపసా న దానేన నచేజ్యయా।
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాంయథా॥
భక్త్యా త్వనన్యయా శక్యఅహమేవం విధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుంచ పరంతప॥
(గీతా । ౧౧. అ. ౫౩, ౫౪. శ్లో.)

ఓ అర్జునా! నీవు నన్నెటులఁజూచితివో యటులనెవ్వండును వేదముల నధ్యయనముజేసిగాని, తపస్సుజేసిగానిఁ దానము లొనరించిగాని, యజ్ఞము లొనర్చిగాని నన్నుఁ గనుఁగొననేరఁడు. అయితే అసాధారణమగు భక్తిచే నన్ను యథార్థముగఁగనుఁగొనుచున్నాఁడు, తెలిసి కొనుచున్నాడు, మఱియుఁ బొందు చున్నాడు.

శ్లో॥ పురుష స్సపరః పార్థ భక్త్యాలభ్యస్త్వనన్యయా (గీత॥౮అ ౨౨ శ్లో)
ఓయి అర్జునుఁడా అట్టిపురుషోత్తముఁడు భక్తిచే బొందఁదగిన వాఁడు.

ఇట్లు ధ్రువానుస్మృతియనంబడు భక్తికి హేతువులు యజ్ఞాదికర్మములని "యజ్ఞాది శ్రుతేరశ్వవత్" (బ్ర-సూ॥ ౩-అ.౪- పా.౨౬-సూ) అను సూత్రముచే బ్రహ్మసూత్రకారులు సయితము అంగీకరించి యున్నారు "వివిదిషంతియజ్ఞేన" ఇత్యాది శ్రుతిప్రకారము యజ్ఞాదికర్మములు బ్రహ్మజ్ఞానమునందు ఇచ్ఛను గలుగఁజేయుటయందు ఉపయుక్తములే. అయినను, ధ్యానరూపమయి నట్టిదియుఁబ్రతిదినమనుష్ఠింపఁబడునట్టిదియు, అభ్యసింప నభ్యసింపనతిశయమును బొందునట్టిదియు, మరణపర్యంతము అనువర్తించునట్టిదియు నగు నావేదనము (ఉపాసనము) బ్రహ్మప్రాప్తికి సాధనభూతమయినదిగాన దానిం గలుగ జేయుటకై సమస్తములైన యాశ్రమకర్మములు యావజ్జీవముఅనుష్ఠింపఁ బడ వలసినవి. బ్రహ్మసూత్రకారులు గూడ "ఆప్రయాణాత్తత్రాపి హి దృష్టం" (బ్ర. సూ. ౪-అ.౧-పా.౧౨.సూ) అనెడి సూత్రమున మరణపర్యంతము ఉపాసనము ననుష్ఠింపవలసినది అనిచెప్పఁబోవుచున్నారు. మఱియు "అగ్నిహోత్రాదితు తత్కార్యాయైవ తద్దర్శనాత్ "(బ్ర. సూ. ౪-అ.౧-పా. ౧౬సూ) అనియెడి సూత్రముచే అగ్నిహోత్రాది కర్మములు ఉపాసనమును గలుగఁ

యజ్ఞాదికర్మములిట్టి భక్తి గలుగుటకు హేతువులు

జేయుటకైయే యేర్పడినవనియు, అట్లుశ్రుతియందుఁగూడ కనుఁబడుచున్నదనియు, "సహకారిత్వేనచ" (బ్ర.సూ.3-అ. ౪-పా.33-సూ) అనియెడి సూత్రమున ఆశ్రమకర్మములు ఉపాసనమునకు సహకారు లగుటం జేసి జ్ఞానిచేఁగూడ ననుష్ఠింపబఁడవలసినవియే అనియుఁ జెప్పియుండుటచే సమస్తములగు వర్ణాశ్రమకర్మములను జ్ఞానోత్పత్తికి సాధనములుగ నంగీకరించి యున్నారు.

వాక్యకారులు "తల్లబ్ధిర్వివేక విమోకాభ్యాస క్రియా కల్యాణానవసాదానుద్ధర్షేభ్యస్సంభవా న్నిర్వచనాచ్చ" అనఁగా వివేకము, విమోకము, అభ్యాసము, క్రియా, కల్యాణము, అనవసాదము, అనుద్ధర్షము అను నీవివేకాదులవలన నుపాసనము లభించును. అటులనుపపత్తియు వివరణ శ్రుతియు నుండుట వలన అని చెప్పుచున్నారు. అట్టి వివేకాదుల స్వరూపమును గూడ నిట్లుకృపజేసియున్నారు:—

జ్ఞానోత్పత్తిని గుఱించి వాక్యకారుల మతము

వివేకలక్షణము:— "జాత్యాశ్రయనిమిత్తాదుష్టా దన్నాత్కాయశుద్ధిర్వివేకః" జాతిదుష్ట పదార్థములచేత అనఁగా ఉల్లిమొదలగు వానిచేతఁగాని ఆశ్రయదుష్టపదార్థములచేత అనఁగా ఛండాలాన్నము మొదలగు వానిచేతఁగాని నిమిత్తదుష్ట పదార్థములచేతఅనఁగా ఎంగిలియన్నము మొదలగు వానిచేఁగాని దూషితముగానట్టి యాహారముచే శరీరమును పరిశుద్ధముచేసికొనుట వివేకమనఁబడును. "ఆహారశుద్ధౌ చిత్తశుద్ధిః చిత్తశుద్ధౌ ధ్రువాస్మృతిః" (ఛా. ౭-ప్ర.౨౬-ఖ.౨ వా) అనఁగా ఆహారశుద్ధికలిగి ననంతఃకరణశుద్ధి కలుగుననియు అన్తఃకరణశుద్ధి కలిగిన నవిచ్ఛిన్నస్మృతి అనగా నుపాసనము కలుగునని యెడి ఛాందోగ్యవాక్యము దీనిని వివరించుచున్నది.

విమోకలక్షణము:—"విమోకః కామానభిష్వంగః"అనఁగా కామము యొక్క అభిష్వంగము (విషయముల ననుభవించిగాని నిలువలేకపోవుట.) లేకపోవుట విమోకమనఁబడును. "శాన్తఉపాసీత" (ఛా.3-ప్ర. ౧౪-ఖ.౧-వా) అనగా రాగద్వేషాదులు లేనివాఁడై యుపాసింపవలయునను ఛాందోగ్య వాక్యము దీనిని వివరించుచున్నది.

అభ్యాసలక్షణము :—"ఆరంభణసంశీలనం పునఃపునరభ్యాసః" అనఁగా ధ్యానింపవలసినదానిని మాటిమాటికిఁ దలంచుట అభ్యాసమనఁబడును.

"సదాతద్భావభావితః" (గీతా. ౮-అ.౬-శ్లో) అనఁగా నెల్లప్పుడు భగవద్ధ్యానము లేనియెడల నిలువలేనివాఁడు అనెడి శ్రీభగవద్గీతా వాక్యము దీనిని వివరించుచున్నది. (ద్రమిడ) భాష్యకారునిచే స్మృతి వాక్యమే దీనికి వివరణ వాక్యముగ నుదహరింపఁబడినది.

క్రియాలక్షణము:— 'పఞ్చమహా యజ్ఞాద్యనుష్ఠానం శక్తితః క్రియా" అనఁగా [1]పఞ్చమహాయజ్ఞాదులను శక్తికొలఁది యనుష్ఠించుట క్రియ యనఁబడును. "క్రియావానేష బ్రహ్మవిదాంవరిష్ఠః"(ముం. 3-ము.౧-ఖ.౪-వా) అనగా క్రియావంతుఁడు బ్రహ్మోపాసకులలో శ్రేష్ఠుఁడను ముండకోపనిషద్వాక్యము దీనిని వివరించుచున్నది. అట్టి క్రియ యజ్ఞాదికర్మములే యని "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా నాశకేన" (బృ.౬-అ. ౪-బ్రా.౨౨.వా.) అనఁగా బ్రాహ్మణులు వేదాధ్యయనముచేతను యజ్ఞముచేతను దానముచేతను నాశరహితమగు తపస్సుచేతను ఆపరమాత్మ నుపాసింపఁగోరుచున్నారను వాక్యముచే వాజసనేయులు పఠించుచున్నారు.

కల్యాణలక్షణము:— "సత్యార్జవ దయాదానాఽహింసానభిధ్యాః కల్యాణాని" అనగా సత్యము = భూతహితము, ఆర్జవము = మనోవాక్కాయములు ఏకరూపముగనుండుట, దయా=స్వప్రయోజనము నపేక్షింపకయే పరుల దుఃఖములను సహింపఁజాలకుండుట, దానము=లోభరాహిత్యము, అహింసా=కరణత్రయముతోను పరులను పీడింపకుండుట, అనభిధ్యా = పరులొనర్చిన యపకారమును చింతింపకుండుట అనునవి కల్యాణములన బడుచున్నవి. "సత్యేనలభ్యః" (ము. 3- ము. ౫- వా) అనఁగా పరమాత్మ భూతహితముచే బొందదగిన వాడనెడి ముండకోపనిషద్వాక్యమును "తేషామేవైష విరజో బ్రహ్మలోకః" (ప్రశ్న.౧ప్ర.౧౫.౧౬.వా) అనఁగా అట్టివారికే యీరజోగుణరహితమగు బ్రహ్మలోకము ప్రాప్తించునని ప్రశ్నోపనిషద్వాక్యమును దీనిని వివరించుచున్నవి.

అనవసాదలక్షణము:—"దేశకాల వైగుణ్యాచ్ఛోక వస్త్వాద్యనుస్మృతేశ్చ తజ్జం దైన్య మభాస్వరత్వంమనసోఽవసాదః" అనగా దేశకాలములు

---

(1) (౧) బ్రహ్మయజ్ఞము=అధ్యాపనము(౨)పితృయజ్ఞము=తర్పణము (3) దేవయజ్ఞము=దేవతలనుగురించినహోమము (౪) భూతయజ్ఞము=భూతబలి (౫) నృయజ్ఞము=అతిథి సత్కారము అనునీ యయిదును పంచ మహాయజ్ఞము లనబడుచున్నవి.

మంచివి కాక పోవుటవలనను, గతించిన దుఃఖములను గలుగఁజేసెడి వస్తువులు మొదలగు వానిని స్మరించుకొనుటవలనను గలిగెడి మనస్సుయొక్క దైన్యము అనఁగా ప్రకాశింపక పోవుట అవసాదమనఁబడుచున్నది. అట్టిదైన్యము నొందక మనసును స్థిరముగానుంచుకొనుట అనవసాద మనఁబడును. "నాయమాత్మాబల హీనేన లభ్యః" (ము. 3-ము-౨-ఖ-౪వా) అనఁగా ఈపరమాత్మను మనోబలము లేనివాఁడు పొందనేరఁడనెడి ముండకోపనిషద్వాక్యము దీనిని వివరించుచున్నది.

అనుద్ధర్షలక్షణము:—"తద్విపర్యయజా తుష్టి రుద్ధర్షః" అనఁగా దేశ కాలములు మంచివి యగుటచేతను, ప్రియవస్తువును స్మరించు కొనుట చేతను గలుగు సంతోషము ఉద్ధర్షమనఁబడును. అట్టి సంతోషములేకుండుట అనఁగా అతిసంతోషముచే మనోవికారము నొందక మనసును స్థిరముగా నుంచుకొనుట అనుద్ధర్ష మనఁబడును. "శాన్తోదాన్తః" (బృ. ౬-అ. ౪-బ్రా. ౨3-వా) అనఁగా బాహ్యేంద్రియనిగ్రహము గలవాఁడును, మనోనిగ్రహము గలవాఁడును అనియి ట్లుఉపాసనకుని గురించిచెప్పునట్టి వాజసనేయవాక్యము దీనిని వివరించుచున్నది.

ఈపైన గనుపఱుపఁబడిన వివేకాది నియమములతో వర్ణాశ్రమ కర్మ ములనాచరించుటచే బ్రహ్మవిద్య గలుగుచున్నది. ఎట్లన, "విద్యాంచా విద్యాంచ యస్తద్వేదోభయంసహ। అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే" (ఈ శా. ౧౧. వా) అనఁగా ఎవ్వఁడు (విద్యాం) పరమాత్మోపాసనమును (అవిద్యాం ) తదంగభూతమగు కర్మమును (సహవేద) ఈరెంటిని ఏకకాలమున ననుష్ఠింప వలసిన వానినిగఁ దెలిసికొనెనో వాఁడు, (అవిద్యయా) వర్ణాశ్రమవిహిత కర్మములననుష్ఠించుటచే,(మృత్యుం) జ్ఞానోత్పత్తికి విరుద్ధమగు సంచితకర్మమును (తీర్త్వా) దాటి అనఁగాఁ తిరస్కరించి (విద్యయా) జ్ఞానముచే(ఉపాసనముచే), (అమృతం)పరమాత్మను,(అశ్నుతే) పొందుచున్నాఁడని శ్రుతియే చెప్పుచున్నది. ఈ శ్రుతియందు "అవిద్యా" శబ్దమునకు శాస్త్రనియమితమగు వర్ణా శ్రమ కర్మమని యర్థము. ఏలయన, జ్ఞానోత్పత్తికి విరుద్ధమగు సంచితకర్మము నతిక్రమించుటకు సాధనభూతముగఁ బ్రసిద్ధమగు అవిద్యయనునది అనఁగాజ్ఞానేతర మయినది శాస్త్రనియమితమగు కర్మమే అయియుండవలయును. కావుననే శ్రీవిష్ణుపురాణమునందును,

వివేకాది నియమ యుక్తములైన వర్ణాశ్రమ కర్మములేజ్ఞానో త్పత్తికి హేతువు లనుట.

శ్లో॥ ఇయాజ సోపి సుబహూన్ యజ్ఞాన్ జ్ఞానవ్యపాశ్రయః।
బ్రహ్మవిద్యా మధిష్ఠాయ తర్తుం మృత్యు మవిద్యయా॥
(విష్ణు. ౬-అం. ౬-అ. ౧౨-శ్లో.)

అనఁగా కేశిధ్వజుఁడను రాజు శాస్త్రజ్ఞానముఁగలవాఁడై ఉపాసనారూపమగు జ్ఞానమే సాధింపఁదగినదని నిశ్చయించుకొని అవిద్యచే అనఁగా శాస్త్రనియమితమగు వర్ణాశ్రమ కర్మముచే మృత్యువును అనఁగా జ్ఞానోత్పత్తికి విరుద్ధమగు సంచితకర్మమును బోఁగొట్టుకొనుటకై యనేకములగు యజ్ఞముల నాచరించెనని చెప్పఁబడియె.

జ్ఞానోత్పత్తికి విరుద్ధమగు అనఁగా ప్రతికూలమగు కర్మము పుణ్యపాపరూప మయినది. ఇట్లు పుణ్యపాపములు బ్రహ్మజ్ఞానము గలుగుటకు ప్రతికూలము లగుటంజేసి యనిష్టఫలదాయకము లగుటవలన శాస్త్రమునం దీరెండును పాపమనియే వ్యవహరింపఁబడుచున్నవి. ఈ పాపము జ్ఞానమును గలుగఁజేయుటకు సాధనమగు శుద్ధసత్వమునకు అనఁగా సత్వగుణమునకు ప్రతికూలములగు రజస్తమోగుణములను వృద్ధిపఱచునదియై యందుమూలమున జ్ఞానోత్పత్తికిఁ బ్రతికూలమయిన దగుచున్నది. "ఏష ఏవాసాధు కర్మ కారయతి తం యమధో నినీషతి" (కౌషీ. 3-అ.౯-వా) అనఁగా సర్వేశ్వరుఁడెవనిని అధోగతిఁ బొందింపవలయునని తలంచునోవానిచె సర్వేశ్వరుఁడే పాపకర్మమును జేయించుచున్నాఁడను శ్రుతివాక్యమువలనను పాపము జ్ఞానోత్పత్తికి (మోక్షమనంబడు ఉత్కృష్టగతికి హేతుభూతమగు పరమాత్మోపాసనము గలుగుటకు) ప్రతికూలమయినదని తెలియవచ్చుచున్నది.

(జ్ఞానోత్పత్తికివిరుద్ధమయిన కర్మముపుణ్యపాప రూపమయినది.)

రజస్తమోగుణములు యథార్థజ్ఞానమును గప్పివేయున వనియు, సత్వగుణము యథార్థజ్ఞానమును గలుగఁజేయునదనియును "సత్వాత్సంజాయతే జ్ఞానం" (గీ. ౧౪-అ. ౧౭-శ్లో.) (సత్వగుణము వలన జ్ఞానము కలుగుచున్నది) ఈ మొదలగు శ్లోకములచే భగవద్గీతలయందు భగవంతుఁడు స్వయముగనే ప్రతిపాదించియున్నాఁడు. కావున జ్ఞానము గలుగవలయునన్న పాపము బొత్తుగ పోవలయును. ఫలము నపేక్షింపకయే వర్ణాశ్రమ ధర్మముల ననుష్ఠించుటచే పాపము పోవుచున్నది. "ధర్మేణ పాప మపనుదతి" (తై. ౬-ప్ర. నారా. ౫౦-అను.) అనఁగా

ధర్మముచేత (వర్ణాశ్రమ ధర్మానుష్ఠానముచేత) పాపమును బోఁగొట్టుచున్నాఁడు అనువాక్యముచే తైత్తిరీయు లిట్లు తెలియఁజేయుచున్నారు.

ఈపైన గనుపఱచిన హేతువులనుబట్టి పరబ్రహ్మమును బొందుటకు సాధనభూతమగు జ్ఞానము ఆశ్రమకర్మములనన్నిఁటి నపేక్షించి యుండు నదని సిద్ధమగుచున్నది. ఇటుల నపేక్షితమగు కర్మముయొక్క స్వరూపమును, కేవలకర్మములు అల్పాస్థిరమగు ఫలము నిచ్చునవి అనెడి యంశమును కర్మ విచారముచేయుటచేతనే తెలిసికొనఁదగినవి కావున అట్టికర్మవిచారమే బ్రహ్మ విచారము చేయుటకు పూర్వము కడచినది అని చెప్పఁదగును.

నిత్యానిత్య వస్తువివేకము మొదలగునవి యన్ననో మీమాంసాశాస్త్రమును (కర్మవిచార బ్రహ్మవిచారము లనఁబడు పూర్వమీమాంసోత్తరమీమాంసా శాస్త్రములను) సమగ్రముగఁ జదువక కలుగవు. ఎట్లన, పూర్వోత్తర మీమాంసలను జదివి అందుమూలముగ ఫలభేదమును (కర్మఫలము స్వర్గాద్యనుభవ రూపమనియు బ్రహ్మవిద్యా ఫలము మోక్షరూపమనియును), సాధనభేదమును (స్వర్గాద్యనుభవమునకు యజ్ఞాదులు సాధనములనియు మోక్షమున కుపాసనము సాధనమనియును), అంగకలాపమును (అట్టిస్వర్గాద్యనుభవమునకు సాధనములగు యజ్ఞాదులకు ప్రయాజాది కర్మము లంగములనియు, మోక్షసాధనమగు ఉపాసనమునకు వివేక విమోకాదు లంగములనియును), అధికారిభేదమును (కర్మఫలమునకుఁ దగినవాఁడు బుభుక్షువనియు(భోగేచ్ఛగలవాఁడు)మోక్షఫలమునకుఁ దగినవాఁడు ముముక్షువనియు), ఇదియంతయును నిర్ణయించుకొనని పక్షమున కర్మస్వరూపమును (కర్మము యాగాత్మకమనియు ఉపాసనాత్మకమనియును), కర్మఫల స్వరూపమును (యాగాదిరూపమగు కర్మముయొక్క ఫలము స్వర్గాదిభోగరూపమయిన దనియు, ఉపాసనారూపమగు కర్మముయొక్క ఫలము మోక్షరూపమయినదనియును), అది స్థిరమనియును (మోక్షఫలము నిత్యమయిన దనియును), ఇది యస్థిరమనియును (స్వర్గాదిఫలము అనిత్యమనియును), ఆత్మ నిత్యుఁడనియును ఇది యంతయును దెలిసికొనుట దుర్లభము.

సాధన చతుష్టయానుష్ఠానము మీమాంసాశాస్త్రమును జదివిన పిమ్మట కలుగునది.

శమదమాదులు జ్ఞానముగలుగుటకు సాధనములనెడి యంశము వినియోగమునుబట్టి నిశ్చయింపఁదగినది. (వినియోగమనగా దీనికిది యంగమని తెలియఁజేయుట) వినియోగమన్ననో శ్రుతులవలనను, లిఙ్గములవలనను (సూచనలవలనను) దెలిసికొనదగినది. అది కర్మవిచారంబనెడి పూర్వమీమాంసా శాస్త్రముయొక్క మూడవ అధ్యాయమున విచారింపఁబడునది గదా!

శమదమాదులు జ్ఞానోత్పత్తికి హేతువులగుటయును కర్మవిచారమువలననే దెలిసికొనదగినది.

[1]ఉద్గీథాద్యుపాసనములు కర్మముల కొకసమృద్ధిని (అతిశయమును) గలుగజేయుటకై యేర్పడినవయినను అవి బ్రహ్మదృష్టిరూపములు అనఁగా బ్రహ్మముగాని దానిని బ్రహ్మముగ భావించుట యనెడి బ్రహ్మదృష్టితో గూడియుండునవి. కావున అవి బ్రహ్మజ్ఞానము నపేక్షించునవి. అందువలన అవి వేదాంతశాస్త్రముననే విచారింపఁదగినవి. ఇంతియగాక నాకర్మములును ఫలాపేక్షలేకయే యనుష్ఠింపఁబడు పక్షమున, బ్రహ్మవిద్యను గలుగజేయునవి. కావున వానికొకయతిశయమును గలుగజేయునట్టి యీయుద్గీథాద్యుపాసనము లీశాస్త్రముతోనే సంబంధించినవి. అట్టి యుద్గీథాదులను విచారించుటకై కర్మస్వరూపమును దెలిసికొనియుండుట యావశ్యకమనెడి యంశము వేదాంతు లందఱును అంగీకరించినదియే.

ఉద్గీథాద్యుపాసనములు వేదాంతశాస్త్రముననే విచారింపఁ దగినవి.

---

## మహాపూర్వపక్షము.

అద్వైతి:— అశేషవిశేషప్రత్యనీకచిన్మాత్రమగు అనగా [2]నిర్విశేషచిన్మాత్రమగు బ్రహ్మమె పరమార్థము (సత్యము) తదతిరిక్తమయినదంతయు అనగా జ్ఞాత (తెలివిగలవాడు)అనియు, జ్ఞేయము(తెలియఁబడునది) అనియు నీమొదలగు నానావిధ పదార్థములును వానినుండి గలుగు జ్ఞానభేదమును నీమొదలగునదంతయు నట్టి బ్రహ్మమునందు గల్పింపఁబడిన దగుటవలన మిథ్యాభూతమయినది (అసత్యమయినది). శ్రుతులును, బ్రహ్మసూత్రములును, పురాణేతిహాసాదులును ఇటులనే ప్రతిపాదించుచున్నవి. ఎట్లన,

నిర్విశేషచిన్మాత్రబ్రహ్మమే సత్యమని శ్రుతులు మొదలగునవి ప్రతిపాదించుచున్నవి.

1. ౯ వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయబడిన ౫ వ వివరణమును చూడుము.
2. ౧౧ వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయబడిన ౭ వ వివరణమును చూడుము.

ఛందోగులు "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం" (ఛా. ౬-ప్ర. ౨-ఖ. ౧-వా)(ఈపరిదృశ్యమానమగు ప్రపంచము సృష్టికి పూర్వము (సదేవ) సన్మాత్ర స్వరూపమే అయినదియు అనఁగా [1]విజాతీయభేదములేనిదియు, (ఏకమేవ) ఒక్కటియే అయినదియు అనఁగా [1]సజాతీయభేదము లేనిదియు, (అద్వితీయం) రెండవది లేనిదియును అనగా [1]స్వగతభేదములేనిదియునగు బ్రహ్మము గానేయుండెనని పఠించుచున్నారు.

శ్రుతిప్రమాణ నిదర్శనము.

ఆథర్వణికులు "అథ పరా యయా తదక్షర మధిగమ్యతే యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యంతి ధీరాః" (ము. ౧-ము. ౧-ఖ .౬-వా) (ఓశౌనకా! ప్రత్యక్షప్రమాణమునకును, అనుమాన ప్రమాణమునకును విషయము కానిదియు, పేరులేనిదియు, నలుపు మొదలగు వర్ణములు లేనిదియు, నిత్యమయినదియు, సర్వత్ర వ్యాపించి యుండునదియు, సర్వమున కాధారమయినదియు, మిక్కిలి సూక్ష్మమయినదియు నగు ఏయక్షరమును (బ్రహ్మమును) బుద్ధిమంతులు భూతకారణముగఁ దెలిసికొనుచున్నారో ఆ యక్షరమునఁ దెలిసికొనుటకు సాధనభూతమయిన పరవిద్య (బ్రహ్మవిద్య) యికమీఁదఁ జెప్పఁబడును) అని పఠించుచున్నారు.

తైత్తిరీయులు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" (తై. ఆన. ౧-అను. ౧-వా) (మిథ్యాభూతము కానిదియు, జడముకానిదియు, పరిచ్ఛేదము లేనిదియు బ్రహ్మము) అని పఠించుచున్నారు.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు "నిష్కళం నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరంజనం" (శ్వే. ౬-అ. ౧౯-వా) (అవయవములులేనిదియు, చలనములేనిదియు, ఊర్మిషట్కము (ఆకలి, దప్పి, శోకము, మోహము, ముసలితనము, మృత్యువు అనునీయాఱు) లేనిదియు, కర్మసంబంధములేనిదియు, కర్మఫలములేనిదియును బ్రహ్మము) అని పఠింపఁబడెను.

కేనోపనిషత్తునందు "యస్యామతం తస్య మతం మతం యస్య న వేదసః అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాత మవిజానతాం" (కే. ౨-ఖ. 3-వా) (బ్రహ్మము మనస్సునకు గోచరము కాదగనిది అని ఎవనికి నిశ్చయమో వానికి బ్రహ్మము

---

1. ౧౧ వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయబడిన ౨ వ వివరణమును చూడుము.

మననమునకు గోచరమగునదియే యగుచున్నదని నిశ్చయము. బ్రహ్మము మననమునకు గోచరము కాఁదగినదని ఎవనికి నిశ్చయమో వాడు బ్రహ్మము నెఱుఁగడని నిశ్చయము. బ్రహ్మము జ్ఞానమునకు అనఁగా శ్రవణమునకు గోచరము కాదగినది అని ఎవరికి నిశ్చయమో వారికి బ్రహ్మము జ్ఞానమునకు అనఁగా శ్రవణమునకు గోచరము కానిదియే యగుచున్నదని నిశ్చయము. బ్రహ్మము జ్ఞానమునకు అనఁగా శ్రవణమునకు గోచరము కాదగనిది అని ఎవరికి నిశ్చయమో వారికి బ్రహ్మము జ్ఞానమునకు అనఁగా శ్రవణమునకు గోచరము అగునదియే యగుచున్నది అని నిశ్చయము. అనఁగా బ్రహ్మము శ్రవణ మననములకు విషయము కాదగనిది) అనిపఠింపఁబడియే.

వాజసనేయులు "నదృష్టేర్ద్రష్టారం పశ్యేః నమతేర్మన్తారం మన్వీథాః" (బృ.౫-అ.౪-బ్రా. ౨-వా) (శ్రవణముచేయువానిని శ్రవణమునకంటె వేఱుగా దెలిసికొనకుము. మననము చేయు వానిని మననమునకంటె వేఱుగాఁ దలంపకుము. అనఁగా జ్ఞాతయు (తెలిసికొనువాడు), మన్తయు (మననము చేయువాడు) బ్రహ్మముకాదు) అని పఠించుచున్నారు.

తైత్తిరీయులు "ఆనన్దో బ్రహ్మ" (తై. భృగు.౬-అను) (ఆనందము బ్రహ్మము) అని పఠించుచున్నారు.

వాజసనేయులు "ఇదం సర్వం యదయమాత్మా" (బృ.౪-అ.౪-బ్రా.౬-వా.) (ఈ పరిదృశ్యమానమగు ప్రపంచమంతయును ఆత్మయె (బ్రహ్మమె) అనఁగా ఈ జగమంతయు బ్రహ్మమునందు భ్రాంతిమూలముగ కల్పింపఁబడినది) అనియు, "నేహ నానాస్తి కిఞ్చన మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి"(బృ.౬-అ.౪-బ్రా ౧౯-వా.)(ఇచ్చట భేదముకలదిమొక్కటియును లేదు ఎవ్వఁడిచ్చట బేదము కలిగియుండునట్లు తెలిసికొనుచున్నాడో వాఁడు అవిద్యనుండి యవిద్యను అనగా జనన మరణ పరంపరా రూపమగు సంసారమును బొందుచున్నాఁడు) అనియు"యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి యత్ర త్వస్య సర్వ మాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్ తత్కేన కం విజానీయాత్" (బృ.౪-అ.౪-బ్రా.౧౪-వా)(ఎప్పుడు బేదమున్నట్లు గనుపడుచున్నదో అప్పుడు ఒకఁడు మఱియొకనిని దెలిసికొనుచున్నాఁడు అనఁగా నెప్పుడు ఏనికి అనేక వస్తువులున్నట్లు మనస్సున తోఁచునో అప్పుడే మఱియొకనినిఁ దెలిసికొనునట్లు తట

ష్ఠించును. అయితే ఎప్పుడు వీనికి అంతయును ఆత్మయె (బ్రహ్మమే) అను నిశ్చయము గలుగునో అప్పుడు ఏ యెవడు ఏ మఱియొకనిని ఏ మఱియొక దానిచేతఁ దెలిసికొనును? ఏ యెవడు ఏ మఱియొకనిని ఏ మఱియొకదానిచేత మననము చేయును?) అనియును పఠించుచున్నారు.

ఛందోగులు "వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం"(ఛా.౬-ప్ర.౧-ఖ.౪-వా)(ఘటాది వికారములు నామధేయములును వ్యావహారికములు అనఁగా కల్పితములు మృత్తిక మాత్రము సత్యము, ఎట్లో, అట్లే నామరూపాత్మకమగు నీజగత్తంతయు కల్పితము, బ్రహ్మమొక్కటియే సత్యము) అని పఠించుచున్నారు.

తైత్తిరీయులు "యదాహ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరం కురుతే అథ తస్య భయం భవతి" (తై. ఆనంద. ౭-అను. ౨-వా) (ఎప్పుడు వీడు ఈబ్రహ్మమునందు కొంచము భేదమును చేయుచున్నాడో అనఁగా భేదమున్నట్లు దెలిసి కొనుచున్నాడో అప్పుడు వీనికి సంసారభయము గలుగుచున్నది) అని పఠించుచున్నారు.

సూత్రకారులు సయితము [1]"నస్థానతోఽపి పరస్యోభయలిఙ్గం సర్వత్ర హి" (బ్ర. సూ. 3-అ. ౨-పా. ౧౧-సూ.) అనుసూత్రమున వేదాంతములయందంతట బ్రహ్మము నిర్విశేషమని జెప్పియున్నందున స్వాభావికముగ గాని ఉపాధివశమునగాని (మఱియొకదాని చేరిక వలనగాని) బ్రహ్మమున కుభయలిఙ్గములు అనఁగా సవిశేషము ([2]సజాతీయ, విజాతీయ, స్వగతభేదములు గలది) అగుటయు, నిర్విశేషము (సజాతీయ, విజాతీయ, స్వగతభేదములులేనిది) అగుటయునులేవనియు అది నిర్విశేషాత్మమగు నేకలిఙ్గమే యనియును, "మాయామాత్రంతు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్"(బ్ర.సూ.3-అ.౨-పా. 3-సూ) అనుసూత్రమున నిరూపింపనలవి గాని స్వరూపముగలది యగుటవలన స్వాప్నికసృష్టి అనఁగా స్వప్నమునఁగనుపడునదంతయు మాయామాత్రము అనఁగా వాస్తవమునకు లేనిదై యున్నట్లు గానబడునది, అట్లే యీపరిదృశ్యమానమగు జగత్తంతయు మాయయే యనియునుఁ దెలియఁజేసియున్నారు.

బ్రహ్మసూత్రప్రమాణనిదర్శనము.

---

1. ఈ సూత్రమునందలి"ఉభయలిఙ్గ" శబ్దమునకు సవిశేషమగుటయు నిర్విశేషమగుటయునని యొడి యర్థమును శంకరాచార్యులవారు వ్రాసియున్నారు.శ్రుతప్రకాశికయందీశబ్దము సాకారమగుటయు, నిరాకారమగుటయునని యీవిధముగ వివరింపఁబడినది.

2. ౧౧ వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయబడిన ౨ ఎ.వివరణమును చూడుము.

పురాణప్రమాణ నిదర్శనము

ఈవిషయమును గురించి శ్రీవిష్ణుపురాణమునందిట్లు జెప్పఁబడియె:—

శ్లో॥ ప్రత్యస్తమితభేదం యత్సత్తామాత్ర మగోచరం।
వచసా మాత్మసంవేద్యం తజ్జ్ఞానం బ్రహ్మసంజ్ఞితం॥

(విష్ణు. ౬-అం. ౭-అ. ౫౩-శ్లో.)

తా. భేదమేదియు లేనిదియు [1]అనఁగా [1]సజాతీయ విజాతీయ భేదములు లేనిదియు, సత్తా (ఉనికి) మాత్రమయినదియు అనఁగా స్వగతభేదము లేనిదియు, ఇంద్రియవిషయముకానిదియు, స్వయంప్రకాశమయినదియును ఏదియో ఆ జ్ఞానము బ్రహ్మమను పేరుగలది.

శ్లో. జ్ఞానస్వరూపమత్యంత నిర్మలం పరమార్థతః ।
తమేవార్థస్వరూపేణ భ్రాంతిదర్శనతస్స్థితం ॥

(ప్రణమ్య * * * * * కథయామి)

(విష్ణు. ౧-అం. ౨-అ-౬శ్లో.)

తా. పరమార్థమున జ్ఞానస్వరూపుఁడును మిక్కిలి నిర్మలుఁడును అనఁగా విశేషము లేవియు లేనివాఁడును, భ్రాంతిజ్ఞానమువలన జడపదార్థముగ గనుపడుచున్నవాఁడునగు బ్రహ్మమును నమస్కరించి చెప్పెదను.

శ్లో. పరమార్థస్త్వమేవైకో నాన్యోస్తి జగతఃపతే॥

(విష్ణు. ౧- అం. ౪- అ. ౩౮- శ్లో.)

తా. ఓ జగన్నాథా! నీ వొక్కఁడవే సత్యమయిన వాఁడవు నీకంటె వేఱయిన దేదియు లేదు.

శ్లో. యదేతద్దృశ్యతే మూర్తమేతజ్జ్ఞానాత్మనస్తవ ।
భ్రాంతిజ్ఞానేన పశ్యంతి జగద్రూప మయోగినః ॥

(విష్ణు. ౧- అం. ౪- అ. ౩౯-శ్లో.)

తా. ఓ జగన్నాథా! జడమయినది యేది కనుఁబడుచున్నదో అదిజ్ఞానస్వరూపుఁడవగు నీ యొక్క (జ్ఞానమయమగు) రూపము. జ్ఞానులు కాని వారు తమ భ్రాంతిజ్ఞానముచేత దానిని జగత్తుగఁ జూచుచున్నారు.

---

1. ౧౧ వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయబడిన ౨ వ వివరణమును చూడుము.

శ్లో॥ జ్ఞానస్వరూపమఖిలం జగదేతదబుద్ధయః।
అర్థస్వరూపం పశ్యన్తో భ్రామ్యన్తే మోహసంప్లవే॥
(విష్ణు. ౧- అం. ౪- అ. ౪౦-శ్లో.)

తా॥ జ్ఞానస్వరూపమైన యీజగత్తు నంతయు జ్ఞానులుకాని వారు జడపదార్థస్వరూపముగఁ జూచుచున్నవారై సంసారసముద్రమునం దిటునటు త్రొట్రుపడుచున్నారు.

శ్లో॥ యే తు జ్ఞానవిదశ్శుద్ధచేతసస్తేఽఖిలం జగత్।
జ్ఞానాత్మకం ప్రపశ్యన్తి త్వద్రూపం పరమేశ్వర॥
(విష్ణు.౧-అం.౪-అ. ౪౧- శ్లో)

తా॥ ఓపరమేశ్వర! ఎవరు జ్ఞానులును నిర్మలమయిన మనస్సుగలవారునో వార లీసమస్తజగత్తును జ్ఞానస్వరూపమయిన నీ రూపముగాఁ జూచుచున్నారు.

శ్లో॥ తస్యాత్మపరదేహేషు సతోఽప్యేకమయం హి తత్।
విజ్ఞానం పరమార్థో హి ద్వైతినోఽతథ్యదర్శినః॥
(విష్ణు ౨-అం. ౧౪-అ. ౩౧-శ్లో.)

తా॥ తన శరీరమునందుండినను, ఇతరుని శరీరమునందుండినను యథార్థమున కన్నిశరీరములయందు నుండునట్టి జ్ఞానము (ఆత్మ) యొక్కటియే. ఈ యథార్థమును ద్వైతమును వాదించువార లెఱుఁగరు.

శ్లో॥ యద్యన్యోఽస్తి పరః కోఽపి మత్తః పార్థివసత్తమ।
తదైషోఽహమయంచాన్యో వక్తుమేవమపీష్యతే॥
(విష్ణు. ౨-అం. ౧౩-అ ౯౦-శ్లో.)

తా॥ ఓరాజశ్రేష్ఠుఁడా! నాకంటెవేఱుగ మఱియొకఁడు అనఁగా (అన్యః) [1]సజాతీయుఁడుగాని(పరః) [1]విజాతీయుఁడుగాని యున్నపక్షమున, అప్పుడు, వీఁడు, నేను, వాఁడు, మఱియొక్కఁడు అనియిట్లుఁగూడఁ జెప్పవచ్చును.

శ్లో॥ వేణురన్ధ్ర విభేదేన భేదష్షడ్జాది సంజ్ఞితః
అభేదవ్యాపినో వాయో స్తథాఽసౌ పరమాత్మనః॥
(విష్ణు. ౨-అం.౧౪-అ. ౩౨-శ్లో)

(1) ౧౧-న పత్రముయొక్క క్రింది భాగమున వ్రాయఁబడిన ౨-న వివరణమును చూడుము.

తా॥ భేదములేనిదియు, వ్యాపించునదియునగు వాయువునకు పిల్లంగ్రోవియొక్క రంధ్రముల భేదముచేత షడ్జమనియు, ఋషభమనియు, గాంధారమనియు నీవిధమగు (స్వర) భేదములు ఎట్లో అట్లే గొప్పదియు, అపరిచ్ఛిన్నమునగు నాయాత్మకు భేదము.

శ్లో॥ సోఽహం స చ త్వం స చ సర్వమేతదాత్మస్వరూపం త్యజ భేదమోహం।
ఇతీరితస్తేన స రాజవర్యస్తత్యాజ భేదం పరమార్థదృష్టిః॥
(విష్ణు. ౨-అం. ౧౬-అ. ౨౩- శ్లో)

తా॥ అట్టి నేనును, నీవును, అతఁడును, ఇదియంతయును ఆత్మస్వరూపము. గనుక భేదపుమోహమును అనఁగా భేదజ్ఞానరూపమగు నజ్ఞానమును వదలుము. ఆరాజశ్రేష్ఠుఁడిట్లు అతనిచే నుపదేశింపఁబడి పరమార్థజ్ఞానము కలవాడై భేదమును విడిచిపెట్టెను.

శ్లో॥ విభేదజనకే జ్ఞానే నాశమాత్యంతికంగతే।
ఆత్మనో బ్రహ్మణో భేదమసన్తం కఃకరిష్యతి॥
(విష్ణు. ౬-అం. ౭-అ. ౯౬-శ్లో)

తా॥ భేదములను గలుగఁజేసెడి జ్ఞానము అనఁగా భేదజ్ఞానరూపమగు నజ్ఞానము మిక్కిలి నాశమును బొందినదగు చుండఁగా ఆత్మకును బ్రహ్మమునకును వాస్తవముగ లేని భేదము నెవ్వఁడు కలుగఁజేయును ?

ఈవిషయమును గురించి భగవద్గీతలయం దిట్లు జెప్పబడియె.

శ్లో॥ అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః।
(గీతా. ౧౦-అ. ౨౦-శ్లో)

తా॥ ఓయర్జునా! నేను సమస్తశరీరములయందు నుండెడి యాత్మనుగా నున్నాను.

శ్లో॥ క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
(గీతా. ౧౩-అ. ౩-శ్లో)

తా॥ ఓయర్జునా! నన్ను అన్నిశరీరములయందు నాత్మనుగా నెఱుంగుము.

శ్లో॥ న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరం।
(గీతా. ౧౦-అ. ౩౯-శ్లో)

తా॥ ఓయర్జునా! నన్ను విడిచి యుండునట్టి జంగమ స్థావర రూపమైన పదార్థ మేదియును లేదు.

ఇవి మొదలుగా గల వస్తుస్వరూపమును దెలియఁజేసెడి శాస్త్రవాక్యములు [1]నిర్విశేషచిన్మాత్రబ్రహ్మమె అనఁగా విశేషములు లేనిదై జ్ఞానమాత్రమే యయిన బ్రహ్మమే సత్యము మిగిలిన దంతయును మిథ్య అనఁగా నసత్యమని దెలియఁజేయుచున్నవి.

భాష్యకారులు:—బ్రహ్మవ్యతిరిక్తమయినదంతయు అనఁగా బ్రహ్మము తప్ప తక్కినదంతయును మిథ్యయంటివే మిథ్యయనఁగా నేది?

అద్వైతి:— ముందు (ఒకవస్తువు ఒకవిధముగ) తెలియఁబడి (చక్కఁగాఁ బరిశీలించుటచేఁ గలిగెడి) ఆ వస్తువునుగుఱించిన యథార్థజ్ఞానముచే (మొదటఁగలిగిన జ్ఞానము) నివర్తింపఁదగినది యగుస్థితి మిథ్యాత్వ మనఁబడును. ఉదాహరణము.

మిథ్యాత్వ లక్షణము

(చీఁకటిలో నేలమీఁదఁబడియుండెడి) త్రాడు సర్పముగఁ దెలియఁబడినదగుచు (దీపమును దీసికొని వచ్చి పరిశీలించి చూచుటచేఁ) గలుగుత్రాడు అనెడి యథార్థవస్తుజ్ఞానముచే సర్పమనెడి (భ్రాంతి) జ్ఞానము నివర్తించుట. ఇచట (అంధకారమను) దోషమువలనఁ గదా త్రాటియందు సర్పమనెడి భ్రమ గలిగినది. అటులనే చిన్మాత్రస్వరూపమగు బ్రహ్మమునందు దేవతలనియు, తిర్యక్ జంతువులనియు, మనుష్యులనియు, స్థావరములనియు నీవిధములగు బేదములతో గూడియున్నట్టి యీజగత్తు అనెడి భ్రమ దోషవశమునఁ గలిగి బ్రహ్మస్వరూపమును గుఱించిన యథార్థజ్ఞానముచే ఆభ్రమ నివర్తియగుచున్నది. కావున కల్పనా రూపమగునట్టి యీ జగత్తంతయు మిథ్యయనఁబడుచున్నది.

ఇట్లు చిన్మాత్రస్వరూపమగు బ్రహ్మమునందు జగద్రూపమగు కల్పనను గలుగఁజేయుటకు హేతుభూతమగు దోషమేదియనఁగా, యథార్థ స్వరూపమును గప్పివేయుచు నానావిధములై చిత్రవిచిత్రములగు విక్షేపములను అనఁగా అధ్యాసములను (ఆరోపములను) గలుగఁజేయునదియై "సత్" (ఉండునది) అని గాని "అసత్" (లేనిది) అని గాని చెప్పుటకు అశక్యమైనదై యనాదియగు నవిద్యయే (అజ్ఞానమే) యట్టిదోషము. ఎట్లన,

అవిద్యా లక్షణము

(1) ౧౧-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణమునుచూడుము.

ఛందోగులు "అనృతేన హి ప్రత్యూఢాః"(ఛా. ౮-ప్ర. 3-ఖ. ౨ వా) అనఁగా జనులు అవిద్యచే బ్రహ్మమునుండి వేఱు జేయఁబడిరనియు, [1] "తేషాం సత్యానాం సతా మనృత మపిధానం" (ఛా.౮-ప్ర. 3-ఖ. ౧-వా) అనఁగా సత్యమగు బ్రహ్మమునకు అవిద్యయే యొక మూఁత (బ్రహ్మమును గప్పివేయునది) యనియును పఠించుచున్నారు.

అవిద్యను గుఱించిన శ్రుతిస్మృతి ప్రమాణములు

యజుర్వేదమున "నాఽసదాసీన్నో సదాసీత్తదానీంతమ ఆసీత్తమసా గూఢ మగ్రే ప్రకేతం" (తై. బ్రా. ౨-అష్ట.౮-ప్ర.౯-అను) [సృష్టికిపూర్వము "అసత్" (లేనిదియును) అనఁగా కుందేటికొమ్మువంటి పదార్థమును లేదు "సత్" (ఉండునదియును) లేదు. అప్పుడు తమస్సు (గప్పివేయునట్టి యవిద్య) యుండెననియు, జ్ఞానము (బ్రహ్మము) అట్టి యవిద్యచేఁ గప్పఁబడె] ననియును పఠింపఁబడియె.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం" (శ్వేతా. ౪-అ. ౧౦-వా.) [మాయను ప్రకృతి (అవిద్య) గాను మాయగలవానిని పరబ్రహ్మముగాను ఎఱుంగుము] అని పఠింపఁబడియె.

వాజసనేయులు "ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే"(బృ. ౪-అ ౫-బ్రా. ౧౯-వా) [పరబ్రహ్మము అవిద్యామూలముగ నానారూపములు గలవాఁడగుచున్నాడు] అని పఠించుచున్నారు.

భగవద్గీతలయందు "మమ మాయా దురత్యయా"(భ. గీ. ౭-అ. ౧౪-శ్లో) (బ్రహ్మాత్మైక్యజ్ఞానము లేని వానిచే నామాయ యతిక్రమింపనశక్యము గునది) అని చెప్పఁబడియె.

మాణ్డూక్యోపనిషత్తునందు "అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే" (మాణ్డూ. ౨-ఖ ౨౧-వా) [అనాదియగు నవిద్యచే నిద్రబోవుచున్న అనఁగా నజ్ఞానములోఁబడియున్న జీవుఁడు ఎప్పుడు మేల్కొనుచున్నాఁడో (జ్ఞానము గలవాఁడగుచున్నాఁడో) అప్పుడు నిత్యమగు పరబ్రహ్మమును దెలిసికొనుచున్నాఁడు] అని పఠింపఁబడియె

(1) "తేషాం" "సత్యానాం" "సతాం" అనుబహువచనము వివక్షితముకాదు కావున "సత్యమగు బ్రహ్మము" అనియర్థము వ్రాయబడియె. ...

[1]నిర్విశేషచిన్మాత్రమగు బ్రహ్మమే "సత్" (ఉండునది) అనియు "అసత్" (లేనిది) అనియును చెప్పనశక్యమైనట్టియు, అనాదియగు నవిద్యచేఁ గప్పఁబడిన స్వరూపము గలదై తనయందుండు నానావిధభేదములను దెలిసికొనుచున్నదని యీపైన గనుపఱపఁబడిన శ్రుతిస్మృతివాక్యములు మొదలగు వానివలన విశద మగుచున్నది. దీనిని గుఱించి శ్రీవిష్ణుపురాణమునం దిట్లుఁజెప్పఁబడియె.

శ్లో॥ జ్ఞానస్వరూపో భగవాన్యతోऽసా వశేషమూర్తిర్న తువస్తుభూతః।
తతో హి శైలాబ్ధిధరాది భేదాన్ జానీహి [2]విజ్ఞానవిజృమ్భితాని॥
(విష్ణు. 2-అం. 12-అ. 39- శ్లో)

తా॥ భగవంతుఁడు జ్ఞానమేస్వరూపముగఁ గలవాఁడు. కావున నీప్రపంచమంతయును వాని యాకారమే. వాఁడీపర్వతాదిపదార్థములు కాఁడు. కాఁబట్టి ఇదిపర్వతమనియు, ఇది సముద్రమనియు నీమొదలగు భేదములు అవిద్యామూలముగ, నాజ్ఞానస్వరూపుఁడగు భగవంతునియందువిలసిల్లు వానినిగా నెఱుంగుము.

శ్లో॥ యదా తు శుద్ధం నిజరూపి సర్వం కర్మక్షయే జ్ఞాన మపాస్తదోషం।
తదా హి [3]సంకల్పతరోః ఫలాని భవంతి నో వస్తుషు వస్తుభేదాః॥
(విష్ణు. 2-అం 12-అ ౪0-శ్లో)

తా॥ ఎప్పుడు ప్రతిబంధకములగు కర్మములు నశింపఁగా అవిద్యారహిత మయినదియు పరిశుద్ధమైనదియునగు జ్ఞానము స్వాభావికమగు స్వరూపముతో నుండునో అనఁగా రాగద్వేషాదులు నశించుటచే వానిని నుండి కలుగు భేదజ్ఞానము లేనిదిగనుండునో అప్పుడు సంకల్పము అనఁగానవిద్యయనెడి వృక్షముయొక్క ఫలములగు (అవిద్యామూలకములగు) పర్వతసముద్రాది భేదము లెంతమాత్ర మును దోఁచవు.

శ్లో॥ తస్మాన్న విజ్ఞాన మృతేऽస్తి కిఞ్చిత్ క్వచిత్కదాచిత్ ద్విజ వస్తుజాతం।
విజ్ఞానమేకం నిజకర్మభేదవిభిన్నచిత్తైర్బహుధాऽభ్యుపేతం॥
(విష్ణు. 2-అం. 12-అ.౪3- శ్లో)

(1) 11-వ పత్రముయొక్క క్రింది భాగమున వ్రాయఁబడిన 2-వ వివరణమును చూడుము.

(2) "వివిధం జ్ఞాయతేऽనేన" అనఁగా వివిధముగా దీనిచేతఁ దెలియఁబడును అనువ్యుత్పత్తినిబట్టి యిచట విజ్ఞానమనినయవిద్యయని యర్థము.

(3) "సమన్తాత్ కల్ప్యతే అనేన" అనగా అంతట దీనిచే కల్పింపఁ బడుచున్నది అను వ్యుత్పత్తిని బట్టి యిచట సంకల్పమనిన యవిద్య యనియర్థము.

తా॥ ఓ మైత్రేయుఁడా విజ్ఞానము (బ్రహ్మము) తప్ప మఱియేవస్తువులు నెచ్చటను నెన్నఁడును లేవు. ఆవిజ్ఞానమొక్కటియే కలదు. కర్మభేదమువలన భేదములుగల మనస్సు గలవారిచే (భేదబుద్ధిగలవారిచే) నది యనేక విధములుగ (అనేకాత్మలుగ) నంగీకరింపఁబడనది.

శ్లో॥ జ్ఞానం విశుద్ధం విమలం విశోకం। అశేషలోభాది నిరస్తసంగం।
ఏకం సదైకం పరమః పరేశస్స వాసుదేవో న యతోఽన్యదస్తి॥
(విష్ణు. ౨-అం.౧౨-అ.౪౪- శ్లో)

తా॥ పరిశుద్ధమయినదియు అనఁగా అజ్ఞానము లేనిదియు, నిర్దోషమయినదియు అనఁగా భేదజ్ఞానము లేనిదియు, దుఃఖము లేనిదియు, కామక్రోధమోహ మద మాత్సర్యములన్నిటితో సంబంధము లేనిదియు, ఒక్కటియే యైనదియు, జన్మవృద్ధ్యాదులు లేనిదియు, గొప్పదియునగు జ్ఞానమే ఆపరమేశ్వరుఁడగు వాసుదేవుఁడు. అతని కంటె వేఱయిన దేదియును లేదు.

శ్లో॥ సద్భావ ఏవం భవతో మయోక్తో జ్ఞానంయథా సత్యమసత్యమన్యత్।
ఏతత్తు యత్సంవ్యవహారభూతం తత్రాపిచోక్తం భువనాశ్రితం తే॥
(విష్ణు. ౨-అం.౧౨-అ.౪౫- శ్లో)

తా॥ ఇట్లు వస్తుస్థితి నాచే నీకుఁ దెలియఁజేయఁబడియె. జ్ఞానమెట్లు సత్యమో అట్లే మిగిలిన దంతయు నసత్యమనియు, ఏజ్ఞానము లోకముచే నాధారముగ నాశ్రయింపఁబడినదై అంతటను వ్యవహారమునకు విషయమైనదిగ నున్నదో దానికి హేతుభూతమయినది యవిద్యయే యనియును నాచేఁ జెప్పబడియె.

ఇట్లు "సత్" (ఉండునది) అనియు "అసత్" (లేనిది) అనియును జెప్పుటకు అశక్యమగునట్టి యీ యవిద్య, నిర్విశేషచిన్మాత్రబ్రహ్మమే ఆత్మ(జీవుఁడు) అనెడిజ్ఞానమువలన నివర్తించుచున్నది యని శ్రుతులు తెలియజేయుచున్నవి. ఎట్లన,

(బ్రహ్మాత్మైక్యజ్ఞానము అవిద్యను నివర్తించుచున్నది.)

"నపుర్మృత్యవే తదేకం పశ్యతి" అనుశ్రుతివాక్యము బ్రహ్మ మొక్కటియే సత్యమని యెఱింగిన వానికి మరల నవిద్యగలుగదని చెప్పుచున్నది.

ఛందోగులు "న పశ్యో మృత్యుంపశ్యతి" (ఛా. ౭-ప్ర.౨౬-ఖ. ౨-వా) అనఁగా బ్రహ్మమును దెలిసికొనిన వాఁడు అవిద్యను పొందఁడని పఠించు చున్నారు.

తైత్తిరీయులు "యదా హ్యేవైష ఎతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయంప్రతిష్ఠాం విన్దతే అథ సోఽభయం గతో భవతి" (తై-ఆ-౭-అను. ౨-వా.) అనఁగా ఎప్పుడీ జీవుఁడు ప్రత్యక్షాదిప్రమాణములకు విషయముగానిదియు, శరీర రహితమైనదియు, ఇట్టిదియని చెప్పనశక్యమైనదియు, ఆధార రహితమైనదియునగు బ్రహ్మమునందు అభయమునకై(తనకుసంసారభయములేక యుండుటకై)నిష్ఠ గలవాఁడగుచున్నాఁడో అప్పుడు అభయమును బొందు చున్నాఁడని పఠించుచున్నారు.

ముండకోపనిషత్తునందు "భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వ సంశయాః, క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టేపరావరే (ము.౨-ము. ౨ఖ. ౯. వా) అనఁగా కార్యకారణ రూపమగు యీపరబ్రహ్మమే తానుఅని సాక్షాత్తుగ తెలియఁబడినదగుచుండఁగా హృదయమునకు బంధకముపంటిదైన యవిద్య విడిపోవుచున్నదనియు, సంశయములన్నియు విడఁగొట్టఁ బడుచున్న వనియు, కర్మములుగూడ క్షయించుచున్నవనియును, "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ము. 3-ము. ౨-ఖ. ౯—వా) బ్రహ్మమేతానని తెలిసికొనిన వాఁడు బ్రహ్మమే యగుచున్నాఁడనియును పఠింపఁబడియె.

శ్వేతాశ్వతరోపనిషత్తు నందు "తమేవం విదిత్వా ఽతిమృత్యుమేతి నాన్యః పన్థా అయనాయ విద్యతే" (శ్వే. 3-అ. ౮-వా) అనఁగా పరబ్రహ్మము నిట్లుఁదెలిసికొనినవాఁడు అవిద్య నతిక్రమించుచున్నాఁడనియు, మోక్షమునకు దీనికంటె వేఱొకమార్గములేదనియును పఠింపఁబడియె.

ఈపై వాక్యములయందుండు"మృత్యు"శబ్దమునకు అవిద్యయని యర్థము "ప్రమాదంవై మృత్యు మహం బ్రవీమి సదాఽప్రమాద మమృతత్వం బ్రవీమి" (భారత. ఉద్యోగ.౪౧-అ. ౪-శ్లో) అనఁగా ప్రమాదమును(భ్రాంతిని గలుగఁజేసెడి యవిద్యను) మృత్యువుగను అవిద్య లేక పోవుటను అమృతత్వము గను నేను తలఁచుచున్నానసెడి సనత్సుజాతీయ వచన మిందుకుఁ బ్రమాణము

"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"(తై.ఆన.౧.అను.౧-వా)అనఁగా మిథ్యాభూతముకానిదియు, జడముకానిదియు, పరిచ్ఛేదము లేనిదియు బ్రహ్మమనియు, "విజ్ఞాన మానందంబ్రహ్మ" (బృ.౫-అ. ౯-బ్రా. ౨౮-వా) [బ్రహ్మమే విజ్ఞాన స్వరూపమును దుఃఖము లేనిదియు]నని ఇట్లు బ్రహ్మస్వరూపమును నిరూపించు వాక్యములచే నిశ్చయింపఁబడునట్టి [1]నిర్విశేష చిన్మాత్ర బ్రహ్మాత్మైక్యజ్ఞానమే (బ్రహ్మము ఆత్మయు నొక్కటియేయను జ్ఞానమే)"అథయోఽన్యాం దేవతాముపాస్తేఽన్యోఽసావహ మన్యోఽస్మీతినస వేద(బృ. 3-అ. ४-బ్రా. ౧౦-వా) (ఎవ్వఁడు దేవతవేఱు నేనువేఱు అను భావనతో ఒకదేవత నుపాసించుచున్నాఁడో వాఁడు జ్ఞానరహితుఁడు)అనియు "అకృత్స్నో హ్యేషః" "ఆత్మేత్యేవోపాసీత" (బృ. 3-అ. ४-బ్రా. ౭-వా) (ప్రాణనాదులను ప్రత్యేకముగ నుపాసించునట్టి యీజీవుడు అసంపూర్ణుఁడు గనుక సర్వము ఆత్మయే (బ్రహ్మమే) అని యుపాసింపవలయును) అనియు "తత్త్వమసి" (ఛా. ౬-ప్ర. ౮-ఖ. ౭-వా) (ఆబ్రహ్మము నీవు) అనియు "త్వంవా అహమస్మి భగవో దేవతే అహంవై త్వమసి భగవోదేవతే తద్యోఽహంసోఽసౌ యోఽసౌసోఽహం" (ఓమద్భగైశ్వర్య సంపన్నురాలైనదేవతా నీవేనేను నేనేనీవుఅనియు కాఁబట్టి నెవ్వఁడనో యితఁడును వాఁడే ఇతఁడెవ్వఁడో నేను నతఁడే) యనియు నీమొదలగు శ్రుతివాక్యములచే నిశ్చయింపఁబడుచున్నది.

సూత్రకారుఁలు సయితము" ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతిచ" (బ్ర. సూ. ४-అ. ౧-పా. 3-సూ) అను సూత్రముచే పరబ్రహ్మమే ఆత్మయని ముముక్షువులు ఉపాసించుచున్నారనియు, అటులనే శాస్త్రములును తెలియఁజేయుచున్నవనియు చెప్పుచు ఇట్టి బ్రహ్మాత్మైక్యజ్ఞానమునే తెలియఁజేయఁబోవుచున్నాఁరు

వాక్యకారుఁలుకూడా"ఆత్మేత్యేవతు గృహ్ణీయాత్ సర్వస్యతన్నిష్పత్తేః" అనఁగాసర్వమునాత్మయందే (బ్రహ్మమునందే) కల్పింపఁబడినది గాన సర్వము బ్రహ్మమనియే తెలిసికొన వలయునని చెప్పుచు ఈయర్థమునే వివరించియున్నాఁరు

కావున బ్రహ్మాత్మైక్యజ్ఞానముచే (బ్రహ్మమే యాత్మయనెడి జ్ఞానముచే) మిథ్యారూపమైనట్టి అవిద్యామూలకమగు భేదజ్ఞానరూపమయిన బంధము సమూలముగ నివర్తింపఁబడు చున్నదనుట యుక్తము.

---

(1) ౧౧-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణమును చూడుము.

భాష్యకారులు:—ఇది పర్వతమనియు, ఇది సముద్రమనియు, ఇది పృథివియనియు నిట్లు పర్వత సముద్రాదులను పరస్పరము భిన్న పదార్థములను గఁ దెలిసికొనుట ప్రత్యక్షసిద్ధము. ఇట్లు ప్రత్యక్షసిద్ధమగు భేదజ్ఞానమునకు నివృత్తిగలుగుట కేవలము ప్రత్యక్షవిరుద్ధము. ఇట్లుండ ప్రత్యక్షసిద్ధమగు భేద జ్ఞానమును శాస్త్రజ్ఞానమెట్లు నివర్తింపఁ జేయగలదు?

అద్వైతి:—ఇది త్రాడుగాని సర్పము కాదు అను జ్ఞానముచే నింతకు ముందు ప్రత్యక్షసిద్ధమయిన సర్పము అను జ్ఞానమెట్లు నివర్తింపఁబడుచున్నది? అటులనే శాస్త్రజ్ఞానము భేదజ్ఞానమును నివర్తించుచున్నది.

భాష్యకారులు:—అది సరికాదు. ప్రత్యక్షమూలమగు శాస్త్రమున కును ప్రత్యక్షజ్ఞానమునకును విరోధమెట్లు గలుగునని నేనడుగగా (సర్పము అను) యొక ప్రత్యక్షజ్ఞానమునకును (త్రాడుఅను) మఱియొక ప్రత్యక్షజ్ఞానమునకు నుండు విరోధమును సాటితీసికొని వచ్చెదవే అది యెట్లు పొసగును?

అద్వైతి:—అయితే నేనింతకు పూర్వము చెప్పిన ప్రకారము ఒక్క జాతిలోనే చేరిన రెండు జ్ఞానములకు విరోధము గలుగునపుడు దేనినేది నివర్తించునని నిర్ణయింపఁ దగును?

భాష్యకారులు:—అప్పుడా రెండు జ్ఞానములలో దోషవిశిష్టమగు జ్ఞాన ము దోషరహితమగు జ్ఞానముచే నివర్తింపఁబడుచున్నదని నిర్ణయింపఁదగును.

అద్వైతి:—మీరంగీకరించినట్టి యీ నిర్ణయపద్ధతియే శాస్త్రజ్ఞానమున కును ప్రత్యక్షజ్ఞానమునకును విరోధము సంభవించునపుడు సయితము నిర్ణయ హేతువు కాఁగలదు. ఎట్లనఁగా, బాధ్య బాధక భావమును నిర్ణయించుటకై (ఇది బాధింపఁబడదగినది ఇదిబాధించునది యనెడి యంశమును నిర్ణయించు టకై) కోటీలు రెండును తుల్యబలములగుచు నొకటి దోషవిశిష్టమగుటయు, రెండ వది దోషరహితమగుటయు, ఏదియైన నొక దానిని పేక్షించియుండుటయు లేక దేనిని అపేక్షింపక యుండుటయును ఈమొదలగునవి హేతువులు గానేరవు. అటుల నవి యట్టి హేతువులగు పక్షమున నొక దోషము గన్పట్టు చున్నది. ఎట్లన, దీపము వెలుఁగునపుడు అది ఒక్కటే జ్వాలగ నున్నటుల ప్రత్యక్షముగఁ

జూచుచున్నాము. దీనిని బాగుగఁ బరిశీలించి విచారించిన పక్షమున వత్తియు, నూనెయును క్రమముగ క్షీణించుచు ననేకములై వేఱువేఱగు జ్వాలలు ఒకదాని వెంటనొకటి బయలు వెడలునట్లుజేయుచున్నవని విశదపడును. అయితే ప్రకృతమున అనేకములై వేఱువేఱగు జ్వాలలొొకదానివెంట నొకటి బయలు వెడలు చున్నవనెడి యనుమానము ఒక్కటే జ్వాల యనెడి ప్రత్యక్షజ్ఞానమును బాధించునది యని నిరూపించుటకు ఈపైనఁ గనుపఱుపఁబడిన బాధ్యబాధక భావ నిర్ణయ హేతువులు నిరుపయోగములు. ఒక్కటేజ్వాలగ మనకు ప్రత్యక్షముగ గనపడుచున్నందున అనుమానము ప్రత్యక్షమును బాధింపఁజాలకున్నది. ఇది యొక దోషము.

శాస్త్రకారు లందఱును రెండు ప్రమాణములకుపరస్పరము విరోధము సంభవించు నట్లయిన వానిలో నేది సావకాశ మయినదియో (ఏది మఱియొక విధముగ సమాధానము చెప్పుకొనుట కవకాశ మిచ్చునదియో) అది బాధింపఁబడగగినదనియు మఱియు నేది నిరవకాశమయినదియో (ఏది మఱియొక విధముగ సమాధానము చెప్పుకొనుట కవకాశ మియ్యనిదియో) అది బాధించునది అనియును నిర్ణయించుచున్నారు.

నిరవకాశమగు ప్రమాణము సావకాశమగు ప్రమాణమును బాధించును.

ప్రకృతమున ననేకములయి వేఱువేఱగు జ్వాలలు అతితీవ్రముగ నొకదానివెంట నొకటి బయలు వెడలుటవలన దీప మొక్కటే జ్వాలగఁ గన్పట్టుచున్నదని సమాధానము చెప్పుకొనుటకు అవకాశము గలదు. గనుక పైనఁ జూపింపఁబడిన బాధ్యబాధక భావ నిర్ణయ పద్ధతి ప్రకారము దీపమొక్కటే జ్వాలయను ప్రత్యక్షజ్ఞానము సావకాశమగుచు అందుచే బాధ్యము అనఁగా బాధింపఁ బడఁదగినది అనిపించుకొనుచున్నది. దీప మనునది యనేకములై వేఱువేఱగు జ్వాలలు యనెడి యనుమానమును ప్రత్యక్షమునువలె మఱియొక విధముగ సమాధానము చెప్పుకొనుటకు ఏదియు నవకాశము లేదు. కావున అనుమానము బాధకము అనఁగా బాధించునది యనిపించుకొనుచున్నది.

ఈపైన గనపఱచిన బాధ్యబాధకభావనిర్ణయ పద్ధతి ప్రకారము ప్రత్యక్షమూలమగు ననుమానము ప్రత్యక్షజ్ఞానమును బాధించు చందమున ప్రత్యక్షమూలమగు శాస్త్రజ్ఞానముగూడ ప్రత్యక్షజ్ఞానమును బాధించుచున్నది. ఏలయన, వేదశాస్త్రము ఆద్యంతరహితమై అవిచ్ఛిన్నమగు సంప్రదాయానుసారముగ వచ్చునది. కావున దానియందు లేశమయినను దోషముండునని చెప్పుట యసంభవము. అందువలన శాస్త్రముచేఁ బ్రతిపాదింపఁబడునట్టి యంశము దోషవిశిష్ట మయిన దనుకొని సమాధానము జెప్పుకొనుట కేదియు నవకాశము లేదు. కావున శాస్త్రము నిరవకాశము. అందుచే శాస్త్రజ్ఞానము బాధకము అనఁగా మఱియొక విధమైన జ్ఞానమును బాధించునది. ఇట్టిశాస్త్రము నిర్విశేష (విశేషములేవియులేని అనఁగా[1] సజాతీయ విజాతీయ స్వగత భేదములులేని) నిత్య (కాల పరిచ్ఛేదములేని) శుద్ధ (అవిద్యారహితమై) ముక్త (జన్మమరణాది రహితమై) బుద్ధ (ప్రకాశస్వరూపమై) స్వప్రకాశ(స్వయంప్రకాశమై) చిన్మాత్ర (జ్ఞానమాత్రస్వరూపమగు) బ్రహ్మమే ఆత్మయని బోధించుచున్నది. ఇట్లు శాస్త్రముచే బోధింపఁబడిన బ్రహ్మైక్యజ్ఞానము, దోషవిశిష్టములయిన ప్రత్యక్షాది ప్రమాణములనుండి సిద్ధమగు జ్ఞాతృ (తెలివిగలవాఁడు) జ్ఞేయాది (తెలియఁబడునది) నానావిధ భేదజ్ఞాన రూపమయినట్టి బంధమును నివర్తింపఁ జేయుట యనునది యుక్తమయిన సంగతియే. ఎట్లన, అనాదిగనుండు భేదజ్ఞానవాసన యనెడి యవిద్యయే యొక దోషము. ఆయవిద్యారూపమగు దోషముచే ప్రత్యక్షజ్ఞానము దూషితమయినది. అట్టి ప్రత్యక్షజ్ఞానమూలముగ ఇది పర్వతమనియు, ఇది సముద్రమనియు, ఇది పృథివి యనియు నీవిధమగు భేదజ్ఞానము గలుగుచున్నది. ఇట్లు ప్రత్యక్షజ్ఞానము దోషదూషిత మగుటచేత అందుమూలముగ నానావిధభేదజ్ఞానము గలుగుచున్నది గాని వాస్తవమునకు అట్టి భేదజ్ఞానము సత్యమయినది కాదు అని సమాధానముజెప్పుకొనుట కవకాశము గలదు. అందువలన ప్రత్యక్షజ్ఞానము సావకాశమయి బాధ్యమనిపించుకొనుచున్నది అనఁగా నీపైనఁ గనపఱచిన ప్రకారము నిరవకాశమగు శాస్త్రజ్ఞానముచే సావకాశమగు ప్రత్యక్షజ్ఞానము బాధింపఁబడుచున్నది యనుట.

ప్రత్యక్షప్రమాణమున కును శాస్త్రమునకును విరోధముగలుగు నప్లైనశాస్త్రముప్రత్యక్షమును బాధించును.

---

(1) ౧౧-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణమును చూడుము

భాష్యకారులు:— శాస్త్రము ఆద్యంతములు లేనిదై అవిచ్ఛిన్నమగు సంప్రదాయానుసారముగ వచ్చునదే. అయినను "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" (స్వర్గమును గోరువాఁడు జ్యోతిష్టోమయాగమును జేయవలయును) అని యీవిధమున భేదజ్ఞానము నవలంబించునదగుటచే నట్టి శాస్త్రము సయితము బాధింపఁబడఁదగినదగుచున్నదే?

అద్వైతి:— సత్యమే. [1]పూర్వాపరాపచ్ఛేదమున పరశాస్త్రము పూర్వశాస్త్రమును బాధించు చందమున వేదశాస్త్రముయొక్క యుత్తర

(1) జ్యోతిష్టోమయాగమున ప్రాతస్సవనమను కర్మమున బహిష్పవమానమునకై అయిదుగురు ఋత్విజులు యజ్ఞశాలనుండి వెలుపటికి నడతురు. అప్పుడు వారిలో ముందు నడచువానికచ్చను వెనుకటివాఁడు పట్టుకొని ఒకనివెంట నొకఁడు నడవవలసినది. వారిలో నధ్వర్యుని (యజుర్వేదతంత్రము నడపువాని) వెంటను ప్రస్తోతయు, ప్రస్తోత వెంటను ప్రతిహర్తయు, ప్రతిహర్త వెంటను ఉద్గాతయు (సామవేదతంత్రము నడపువాడు), ఉద్గాత వెంటను బ్రహ్మయు, బ్రహ్మము వెంటను యజమానుఁడును (యజ్ఞకర్త) అను నీక్రమమున వారు నడచునది. అప్పుడు వారిలో నెవ్వడయినను తాను పట్టుకొనిన కచ్చను వదలినయెడను ఆవదలుటకు అపచ్ఛేదమని పేరు. అప్పుడు ఉద్గాత తానుపట్టుకొనిన కచ్చను వదలుటచే నాకర్మమునకు విఘ్నము కలిగినయెడను దక్షిణల నొసంగకనే యాకర్మమును ముగించి దానిని మరల నాచరించునది. ఇప్పుడు తానింతకు ముందు యియ్యదలచుకొనిన దక్షిణల నిచ్చునది యని యీవిధమగు ప్రాయశ్చిత్తము నొకశాస్త్రము విధించుచున్నది. అటులనె ప్రతిహర్త తానుపట్టుకొనిన కచ్చను వదలుటచే నాకర్మమునకు విఘ్నము కలిగినయెడను సర్వవేదసమును అనఁగా తనకుగల యాస్తి నంతయు నిచ్చునది అనియు నీవిధమగు ప్రాయశ్చిత్తమును మఱియొక శాస్త్రము విధించుచున్నది.

ఇచ్చట ఉద్గాతయు ప్రతిహర్తయును వేఱువేఱు ప్రయోగములలో కచ్చను వదలినయెడను వానివానిని గురించిన ప్రాయశ్చిత్త శాస్త్రము వానివానిని గురించి ప్రవర్తించును. ఒక్క ప్రయోగముననే వీరిద్దఱును ఒక్కమాఱు కచ్చలను వదలినయెడను ఉద్గాతయొక్క యపచ్ఛేదమును గురించిన ప్రాయశ్చిత్తశాస్త్రము మాత్రమే ప్రవర్తించును. ఏలయన, అతఁడు వర్గమునకు ప్రధానుఁడు మఱి ముప్రధానమయిన అపచ్ఛేదమునకే ప్రాయశ్చిత్తము జేయవలసినది లేక వికల్పముగానును చేయవచ్చును. ఒక్క ప్రయోగముననే ముందొక్కఁడును తరువాత నొక్కఁడును కచ్చను వదలినయెడను, తరువాతి అపచ్ఛేదమును (కచ్చను వదలుటను) గురించి ప్రాయశ్చిత్తమును విధించు నట్టి శాస్త్రము ప్రవర్తించును గాని మొదటి యపచ్ఛేదమును (కచ్చను వదలుటను) గురించి ప్రాయశ్చిత్తమును విధించుశాస్త్రము ప్రవర్తింపదు అని పూర్వమీమాంసా శాస్త్రమున నిర్ణయింపఁబడియె. ఇందువలన పూర్వ (మొదటి) శాస్త్రమునకంటె పర (తరువాతి) శాస్త్రము ప్రబలమయినదని యేర్పడుచున్నది. దీనినే పూర్వాపరాపచ్ఛేదన్యాయమందురు. పూర్వమీమాంసలో ౬ వ అధ్యాయమున ౫-వ పాదమున ౧౮-వ అధికరణమును (౪౯-౫౪. సూత్రములను) చూడుము.

భాగమగు వేదాంతశాస్త్రమనెడి పరశాస్త్రము నిరవకాశమయినదగుటం జేసి దానియొక్క పూర్వభాగమగు కర్మకాండ మనెడి పూర్వశాస్త్రమును తప్పక బాధించుచున్నది. బ్రహ్మము నకు వాస్తవముగ గుణము లేవియును లేకుండుటం జేసి, ఉపనిషద్వాక్యములలోం గూడ సగుణబ్రహ్మోపాసనమును (గుణవిశిష్టమగు బ్రహ్మమును గురించిన యుపాసనమును) ప్రతిపాదించు నట్టివాక్యములు, యీ పైనం గనపఱుపంబడిన పూర్వాపరాపచ్ఛేదన్యాయ ప్రకారము, బ్రహ్మము నిర్గుణము (గుణములు లేనిది) అనిచెప్పునట్టి వాక్యములచే బాధింపంబడుచున్నవి.

పూర్వశాస్త్రమున కంటె పరశాస్త్రము ప్రబలమయినది.

భాష్యకారులు:— అయితే "యస్సర్వజ్ఞ స్సర్వవిత్"(ము. ౧- ము ౧-ఖ. ౭-వా)[ఏపరబ్రహ్మము సమస్తమునుసామాన్యముగను, విశేషముగను తెలిసికొనినవాండో] అనియు "పరాస్య శక్తిర్వివిధైవశ్రూయతే స్వాభావికీజ్ఞాన బలక్రియాచ" (శ్వే. ౬- అ. ౮- వా) [పరబ్రహ్మముయొక్క శక్తి యుత్కృష్ట మయినదిగ శ్రుతులనుండి వినంబడుచున్నది. వానికి స్వభావసిద్ధములగు జ్ఞాన మును బలమును క్రియయును గలవు] అనియు "సత్యకామ స్సత్యసఙ్కల్పః" (ఛా. ౮-ప్ర. ౧-ఖ. ౫-వా) [పరబ్రహ్మము సత్యకాముండును సత్యసఙ్కల్పుం డును] అనియు నీవిధముగ బ్రహ్మము గుణములు కలదియని ప్రతిపాదించు శాస్త్రము లెట్లు బాధింపంబడందగినవి?

అద్వైతి:—బ్రహ్మము గుణము లేవియును లేనిది యని ప్రతిపాదించు వాక్యముల సామర్థ్యముచే నవి బాధింపంబడందగినవి. ఎట్లన, "అస్థూలమ నణ్వహ్రస్వ మదీర్ఘం" (బృ. ౫-అ. ౮-బ్రా. ౮-వా) [బ్రహ్మము స్థూలమయినది కాదు, సూక్ష్మమయినది కాదు, పొట్టిది కాదు, పొడుగైనది కాదు] అనియు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" (తై, ఆనం. ౧-అను. ౧-వా) మిథ్యా భూతముకానిదియు, జడముకానిదియు, పరిచ్ఛేదము (పరిమితి) లేనిదియు బ్రహ్మ ము] అనియు, "నిర్గుణం" (బ్రహ్మము గుణములు లేనిది) అనియు "నిరఞ్జనం". (శ్వే. ౬-అ. ౧౯-వా) [బ్రహ్మము అవయవములు లేనిది] అనియు నీమొదలుగా గలయుపనిషద్వాక్యములు బ్రహ్మము గుణములు లేనిదనియు, వికారమునొందని దనియు, నిత్యమయిన దనియు, చైతన్యస్వరూప మయిన దనియును దెలియం జేయుచున్నవి. మఱికొన్ని యుపనిషద్వాక్యములు బ్రహ్మము గుణములు కల

సగుణ (భేద) శ్రుతుల కంటె నిర్గుణ (అభేద) శ్రుతులు ప్రబలములని నిరూపించుట.

దని చెప్పుచున్నవి. అయితే నిషేధింపఁబడఁదగిన గుణములను జెప్పునట్టి వాక్యములకంటె (సగుణబ్రహ్మమును ప్రతిపాదించునట్టి వాక్యములకంటె) నట్టిగుణములను నిషేధించునట్టి వాక్యములు (నిర్గుణబ్రహ్మమును ప్రతిపాదించునట్టి వాక్యములు) పరముల (తరువాతివ) గుటవలన నెక్కువ బలముగలవి. కావున పూర్వాపరాపచ్ఛేదన్యాయప్రకారము, సగుణబ్రహ్మమును ప్రతిపాదించునట్టి వాక్యములు నిర్గుణబ్రహ్మమును ప్రతిపాదించునట్టి వాక్యములచే బాధింపఁబడుట యొకః దోషము కానేరదు.

భాష్యకారులు:— "సత్యం జ్ఞానమనంతం" అను శ్రుతి వాక్యముచేఁ దెలియఁజేయఁబడునట్టి సత్యము, జ్ఞానము మొదలగునవి గుణములుగఁ దెలియవచ్చుచున్నవే?

అద్వైతి:—అట్లుకాదు. ఏలయన, [1]సామానాధికరణ్యమును బట్టి యిచట సత్యజ్ఞానాది పదములన్నియును ఒక్కటే యర్థమును దెలియఁ జేయునవిగఁ గన్పట్టుచున్నవి.

---

☞ సామానాధికరణ్యమును గురించి విశిష్టాద్వైతు లిట్లు చెప్పుచున్నారు.

(1) సమానం = సాధారణమయిన (పొదువయిన) అధికరణం = (విశేషణములకు అధారభూతమగు) విశేష్యము అని సమానాధికరణ శబ్దమున కర్థము. గనుకనే "భిన్నప్రవృత్తి నిమిత్తానాం శబ్దానాం ఏకస్మిన్నర్థే వృత్తిస్సామానాధికరణ్యం" అనఁగా వేఱువేఱు అర్థములను బోధించుటకు ద్వారభూతములగు శబ్దములకు సాధారణమగు నొక పదార్థము నందు వృత్తి అనఁగా పర్యవసానము సామానాధికరణ్యమనఁబడునని లక్షణవాక్యము చెప్పుచున్నది. ఎట్లన,

శబ్దములు మూడు విధములుగ గన్పట్టుచున్నవి. కొన్ని శబ్దములువిశేషణము (గుణవాచకము) లగుటవలనను విశేష్యము (వస్తువాచకము) లగుటవలనను యొక్కటియే యర్థమును దెలియఁజేయునవిగ గానఁబడుచున్నవి. ఉదాహరణము. "ఘటః (కుండ) కుంభః (కుండ)" మఱియు "నీలం (నల్లని) కృష్ణం (నల్లని)" ఈ మొదలగు శబ్దములు. ఇచట ఘట కుంభ శబ్దములు ఘటత్వము (కుండయొక్కధర్మము) కుంభత్వము (కుండయొక్కధర్మము) అనెడిగుణములను దెలియఁ చేయునవియగుట వలనను, ఘటము (కుండ) కుంభము (కుండ) అనెడి వస్తువులను దెలియఁజేయునవియగుటవలనను ఒక్కటియే యర్థముగలవి. అటులనే నీలకృష్ణశబ్దములునునీలత్వము (నలుపు) కృష్ణత్వము (నలుపు) అనెడిగుణమును దెలియఁజేయునవి యగుటవలనను నీలః (నల్లనివస్తువు) కృష్ణః (నల్లనివస్తువు) అనియిట్లువస్తువాచకములగుటవలనను ఒక్కటియే యర్థముగలవి. కొన్ని శబ్ధములువిశేషణము (గుణవాచకము) లగుటవలనను విశేష్యము (వపస్తువాచకము) లగుటవలనను వేఱువేఱుయర్థములను దెలియఁజేయునవిగఁగన్పట్టుచున్నవి. ఉదాహరణము. "గౌః (ఆవు) అశ్వః (గుఱ్ఱము) మహిషః (దున్న)" మఱియు "నీలం (నల్లని) శుక్లం (తెల్లని) పీతం (పచ్చని)" ఈ మొదలగు శబ్దములు.

భాష్యకారులు:—ఆ పదములు అనేకములగు గుణములను గలిగి యుండు పదార్థమును దెలియఁజేయునవిగ నంగీకరించినను అవి ఒక్కటే యర్థమును

---

గోశబ్దము, అశ్వశబ్దము, మహిషశబ్దము మొదలగునవిగోత్వము(గోవుయొక్క ధర్మము) అశ్వత్వము (అశ్వముయొక్క ధర్మము)మహిషత్వము (మహిషముయొక్క ధర్మము)అనెడిగుణములను దెలియఁజేయునవియునుగోవు, అశ్వము, మహిషముఅనెడి వస్తువులను దెలియఁజేయునవియును. అయితే గోత్వాశ్వత్వాదులు భిన్నభిన్న గుణములయినందున గోశబ్దము మొదలగునవి గుణవాచకములగునప్పుడును, గోవు అశ్వము మొదలగు వస్తువులు భిన్న పదార్థములయినందున యీశబ్దములు వస్తువాచకములగునప్పుడును వేఱువేఱుఅర్థములను దెలియజేయుచున్నవి. ఇటులనే "శుక్లం" ఇత్యాది శబ్దములు గూడ గుణవాచకములగుటవలనను వస్తువాచకములగుటవలనను వేఱువేఱు అర్థములను దెలియఁజేయునవి యని యోచించునది. మఱికొన్ని శబ్దములు విశేషణముల(గుణవాచకముల) గుటవలన భిన్నార్థములుగలవిగను విశేష్యముల(వస్తువాచకముల) గుటవలన నేకార్థముగలవిగను గన్పట్టుచున్నవి. ఉదాహరణము. "దేవదత్తః శ్యామః లోహితాక్షః" ఇత్యాదిశబ్దములు. దేవదత్తశబ్దముదేవదత్తత్వము(దేవదత్తునిధర్మము)అనెడిగుణమును దేవదత్తుఁడనెడి వస్తువును దెలియఁజేయునది. శ్యామశబ్దము శ్యామత్వము(శ్యామవర్ణము)అనెడి గుణమును శ్యామవర్ణముగలవస్తువును దెలియఁజేయునది.అయితే దేవదత్తత్వమును గుణమును శ్యామత్వమనెడి గుణమును భిన్నములు ( వేఱువేఱు అయినవి) గాన యీశబ్దములు విశేషణములగుటవలన (గుణవాచకములగుటవలన) వేఱువేఱు అర్థముగలవి."దేవదత్తః" (దేవదత్తుఁడు) "శ్యామవర్ణః" (శ్యామవర్ణుఁడు)అనియిట్లు దేవదత్తుఁడనువస్తువును శ్యామవర్ణముగల వస్తువును ఒక్కటియే గాన యీశబ్దములు విశేష్యముల (వస్తువాచకముల)గుటవలన ఒక్కటియేయర్థముగలవి. ఇటులనే "దేవదత్తఃయువా (యౌవనముగలవాడు)"అనుశబ్దములయొక్కయు "దేవదత్తఃలోహితాక్షః (ఎఱ్ఱని నేత్రములుగలవాఁడు)" అనుశబ్దములయొక్కయుఅర్థములను యోచించునది.

ఈ పైనఁ గనపఱుపఁబడిన లక్షణవాక్యమున "భిన్నప్రవృత్తి నిమిత్తానాం" (వేఱువేఱు అర్థములను దెలియఁజేయుటకు ద్వారభూతములయిన)అనియున్నందునవిశేషణపదములగుటవలనను, విశేష్యపదములగుటవలనను ఏకార్థములగు "నీలం" "కృష్ణం" ఇత్యాది శబ్దములకుగాని "ఘటః" "కుంభః" ఇత్యాదిశబ్దములకుగాని సామానాధికరణ్యముండ నేరదని తెలుపఁబడియె.

అచ్చటనే "ఏకస్మిన్నర్థే వృత్తిః" (సాధారణమగు అర్థమున పర్యవసించుట) అనియున్నందునవిశేషణములుగనుండుటవలనను విశేష్యములుగనుండుటవలనను భిన్నార్థములగు"నీలం""పీతం" "శుక్లం" ఇత్యాది"శబ్దములకు గాని"గౌః""అశ్వః" ఇత్యాది శబ్దములకుగాని సామానాధికరణ్యముండ నేరదని తెలుపఁ బడియె.

ఈపైన నుదహరింపఁబడిన లక్షణవాక్యము వలన విశేషణములుగ నుండుటవలన భిన్నార్థములుగలవియు విశేష్యములుగ నుండుటవలనఏకార్థములగుపదములకుఅనఁగా"దేవదత్తఃశ్యామో యువాలోహితాక్షః"ఇత్యాదిశబ్దములకు మాత్రముసామానాధికరణ్య ముండునని సిద్ధమగుచున్నది.

ఇందువలన వేఱువేఱు అర్థములుగల శబ్దములకు [వేఱువేఱు విశేషణములను (గుణములను) తెలియఁజేయుశబ్దములకు] అనఁగా; విశేషణపదములకుఒక యర్థమునుగురించిన వృత్తిఅనఁగా అవియన్నియు సాధారణమగు (పొదువగు) విశేష్యములో ముగించుట సామానాధికరణ్యమని

దెలియఁజేయుచున్న వనుటకు బాధక మేమియును లేదు కదా!

యెల్లప్పుడు మున్నది. విశిష్టాద్వైత సిద్ధాంతప్రకారము సామానాధికరణ్య మనిన నిదియే. ఇటుల సామానాధికరణ్య లక్షణ వాక్యముయొక్క యర్థము ప్రమేయమాలయను గ్రంథమున వివరింపఁ బడినదని శ్రుతప్రకాశికాచార్యులవారు వ్రాసియున్నారు.

☞ ఇందుకు విరుద్ధముగ అద్వైతు లిట్లు వాదించుచున్నారు.

సామానాధి కరణ్యముగల వాక్య మెప్పుడును విశేషములు లేని యొక్కటియే యర్థమును దెలియఁజేయునది. ఎట్లన, సామానాధికరణ్యము ఏకార్థముగలదియను విషయమందఱును అంగీకరించినదే కదా. అయితే సామానాధికరణ్యమున నుండు పదములు విశేషణములను (గుణములను) మాత్రమే తెలియఁ జేయునవియా? విశిష్టపదార్థమును (గుణములతోఁజేరియుం డునట్టి పదార్థమును) మాత్రమే తెలియఁజేయునవియా? లేక నవి యేదియయిననొకవస్తువు యొక్క స్వరూపమునుమాత్రమే తెలియఁజేయునవియా? అని విచారింప వలసి యున్నది. అవి విశేషణములను(గుణములను) మాత్రమే తెలియఁజేయునట్టివి యని చెప్పఁదగదు. ఏలయన, విశేషణపదము లనేకార్థములగుటచే ఏకార్థము గలది యగుట యనెడి సామానాధికరణ్యము సిద్ధింప నేరను.మఱి యు నవివిశిష్టపదార్థమును మాత్రము తెలియఁజేయునట్టివియనియును గూడచెప్పఁదగదు. ఏలయన, ఆటులనగుపక్షమున నాపదములావిశిష్టపదార్థమును క్రమముగఁ దెలియఁజేయుచున్నవా? ఒక్కమాఱుగఁ దెలియఁజేయుచున్నవా?అవి క్రమముగ అనఁగా నొకపదము తరువాతనొకపదము వంతున ఆవిశిష్టపదార్థమును బ్రతిపాదించుచున్నవని జెప్పఁదగదు. ఏలయన,అందు మొదటిపదముచే దెలియఁజేయఁబడిన విశిష్టపదార్థమునకు రెండవ పదము తనచే దెలియఁజేయఁబడినవిశిష్ట పదార్థముతో నైక్యమును దెలియఁజేయుచున్నదా? లేక మఱియొక విశేషణముతో (గుణముతో)సంబంధమును దెలియఁజేయుచున్నదా? మొదటిపక్షమున అనఁగా మొదటిపదముచే దెలియఁజేయఁబడిన విశిష్ట పదార్థముతో నైక్యమును దెలియఁజేయుచున్న దను పక్షమున నా విశిష్ట పదార్థముయొక్క విశేష్యాంశములవలె విశేషణాంశములగు జాతి గుణాదులకును ఐక్యము ప్రసక్తించును. లేకమఱియొక విశేషణముతో (గుణముతో) సంబంధమును దెలియఁజేయుచున్న దనియును జెప్పఁదగదు. ఏలయన, మొదట ఒకవిశేషణముతో గూడియున్నట్లు దెలియఁజేయఁబడినట్టి పదార్థమును తరువాత మఱియొక విశేషణముతోగూడియున్నట్లు దెలియఁజేయుటగదా! మఱియొక విశేషణముతో సంబంధమును దెలియఁజేయుటయనునది. అటులనగు పక్షమున ముందొక విశేషణ పదముచే విశేషణముతో (గుణములో) గూడియున్నట్లు జెప్పఁబడిన పదార్థముతో విశేషణముగ నన్వయించునట్టియీ రెండవ విశేషణపదము మొదటి విశేషణమునకును విశేషణమగును అందువలన విశేషణ పదములకు పరస్పరము విశేషణ విశేష్యభావము తప్పక ప్రసక్తించును! అది యుక్తముగాదు. వాక్యమునందలి పదము లొక్కటియే యర్థమును తెలియఁ జేయవలయుననిన నవి క్రమముగనే తెలియఁజేయవలయునుగాని అన్నియు నొక్కమాఱుగ తెలియఁజేయ నేరవు. ఆటులన గుపక్షమున ఇదియుద్దేశ్యమనియు ఇది యుపాదేయమనెడి విభాగమును గలిగియుండుట యనెడి వాక్యలక్షణమునకు భంగమువచ్చును. కావున నట్లు యర్థమును బ్రతిపాదించుట యసంభవము. విశిష్టమగు (విశేషణములతోగూడిన) యర్థమును దెలియఁ జేయునవి యను పక్షమున విశేషణ మొక్కటియు అది విశేషణముగనుండు విశేష్య మొక్కటియును యీవిధముగ ననేకార్థములు తెలియఁ జేయఁబడుచున్న వనవలసివచ్చును. మరియు విశేషణముల నేకములగుటవలన

అద్వైతి:—అర్థము చెప్పునట్టి విధమును దెలియని యజ్ఞునివలె నర్థమును జెప్పుచున్నా రేల? ఒక్కటే యర్థమును దెలియఁజేయుట యనఁగా వాక్యము నందలి పదములన్నియు నొక్కటే యర్థము గలవి యగుట గదా! ఇట్లుండ

---

నను వాక్యము అనేకార్థములను గలిగినదగును. ఒక్కటియే యర్థమును గలిగియుండుటను గదా సామానాధికరణ్యమందురు. కాఁబట్టి అట్టి వాక్యమునందు సామానాధికరణ్య ముండ జాలదు.

ఒకవస్తువునకు తదితరవస్తువులనుండి యొకవైలక్షణ్యమును దెలియఁజేయుటకై గదా విశేషణపదములు వాక్యమునందు బ్రయోగింపఁబడుచున్నవి. విశేషణములు భిన్నములగుటనుబట్టి విశేష్యములును భిన్నములగును. విశేషణములు భేదమును గలుగఁ జేయునవిగను విశేష్యములు భేదమును బొందునవిగను నుండుట వానికి స్వాభావికమే. ఉదాహరణము. "ఖండః ముండః పూర్ణశృంగో గౌః" అనునపుడు ఖండమయిన (కొమ్ములుకోసిన) ఆవు కంటె ముండమయిన (బోడి) అవుగాని పూర్ణశృంగమగు (కొమ్ములుగల) అవుగాని వేఱయినదిగను గదా తెలియవచ్చును. అయితే "దేవదత్తః శ్యామో యువా లోహితాక్షః" అను వాక్యమునందలి "శ్యామో యువా" ఇత్యాది విశేషణములు భిన్నము లయినను శ్యామవర్ణముగల దేవదత్తుఁడే యౌవనముగల దేవదత్తుఁడని తెలిసికొనుచున్నాముగాన విశేష్యమగు దేవదత్తుఁడు భిన్నుఁడుగఁ దెలియ వచ్చుచుండ లేదే యన్ని శంకింపఁబని లేదు. ఏలయన, దేవదత్తుఁడు మనకుఁ బ్రత్యక్షముగ గనపడువాఁడు. కావున శ్యామవర్ణముగల దేవదత్తుఁడును యౌవనముగల దేవదత్తుఁడును ఒక్కఁడే యని తెలిసికొనగలిగినాము. బ్రహ్మము అట్లు ప్రత్యక్షజ్ఞానమునకు గోచరమయినదికాదు. కావున విశేషణములు భిన్నములగుటంజేసి విశేష్యమగు బ్రహ్మము సయితము భిన్నమని ప్రసక్తించును. దీనిని నివారింప నెవ్వఁడు సమర్థుడు! కాఁబట్టి సమానాధికరణవాక్యముస్వరూపమునుమాత్రమే తెలియజేయునదియనియొప్పుకొనఁగునది.

☞ అద్వైతులు చేయునట్టి యీవాదము వరదరాజసూరివిరచితమగు శ్రీభాష్యప్రమేయమాలయను గ్రంథమున నిట్లు ఖండింపఁబడినది.

సామానాధికరణ్యలక్షణవాక్యముసయితము "ఒక్కటియేయర్థమును దెలియఁజేయుట" సామానాధికరణ్యమని జెప్పుచున్నదనియు, సమానాధికరణవాక్యము నందలి పదములు గుణములను మాత్రము తెలియఁజేయునవియగు పక్షమునను, గుణవిష్టపదార్థమును దెలియఁజేయునవియగు పక్షమునను "ఒక్కటియే యర్థమును దెలియఁజేయుట" యనెడి సామానాధికరణ్యము సిద్ధింపదనియు, కావున సమానాధికరణ వాక్యము నందలి పదములన్నియును ఏదైన నొకవస్తువు యొక్క స్వరూపమును మాత్రమే తెలియఁ జేయునవి యనియును అద్వైతులు చెప్పునది యుక్తము కాదు. ఏలయన, అటులనగు పక్షమునవారడిగిన వైకల్పిక ప్రశ్నములును, వారుగనపఱచిన దోషములును వారుచెప్పిన యర్థమునందు సయితము గలవు. ఎట్లన, "సత్యం జ్ఞాన మనంతం" ఇత్యాది శ్రుతివాక్యము బ్రహ్మము తనకంటె వేఱగు నన్ని పదార్థములకు విరుద్ధమయిన స్వరూపము గలదని తెలియఁజేయుచున్నదనియు, అందు సత్యాది పదములు బ్రహ్మస్వరూపమునకు విరుద్ధములగు వానిలో నేదియును బ్రహ్మము కాదని తెలియంజేయుచున్న వనియును గదా వారు చెప్పుచున్నారు. అయితే అప్పుడు సత్యాదిపదములు విరుద్ధములగు వానిని మాత్రమే తెలియఁజేయుచున్నవా? స్వరూపమును మాత్రమే తెలియఁజేయుచున్నవా! విరోధ్యవచ్ఛిన్న (అట్టివిరుద్ధములగు వానితో గూడుకొనిన) స్వరూపమును దెలియఁ జేయుచున్నవా? ఆ విరుద్ధములగు వానిని మాత్రము తెలియఁజే

నవి విశేషణములతో (గుణములతో) గూడియున్న పదార్థమును దెలియఁ
జేయునవి యగుపక్షమున విశేషణములకు (గుణములకు) పరస్పరము భేద
ముండుటచే వానిని దెలియఁజేయు పదములకును అర్థభేదము తప్పక కలిగి

---

యు నవి యని చెప్పఁదగదు. అట్లులయిన, విరుద్ధములగు నవి యనేకములగుటంజేసి "ఒక్క-
టియే యర్థము గలదియగుట" యనెడి సామానాధికరణ్యము సిద్ధింపదు. అవి స్వరూపమును మా
త్రము తెలియఁ జేయునవి యనియును జెప్పఁదగదు. అట్లులయిన నవి యన్నియును పర్యాయ
పదము లనవలసివచ్చును. ఇంతియ గాక నొక్క పదము చేతనే స్వరూపము తెలియఁజేయఁబడుట
శక్యముగాన అందులకై అనేకపదములను బ్రయోగించుట నిరర్థకమగును. విరోధ్యవచ్ఛిన్న.
(అట్టి విరుద్ధములగు వానితో గూడుకొనిన) స్వరూపమును దెలియఁ జేయుచున్న నవియును
జెప్పఁదగదు. అట్లులయిన, అట్టి స్వరూపము ఆ విరోధులను ఉపలక్షణముగ (గుర్తులనుగ) గలిగి
యున్నదా? లేక వానిని గుణములనుగ గలిగి యున్నదా? ఉపలక్షణముగ గలిగియున్నదని చెప్పఁ
దగదు. ఏలయన, ఒకయుపలక్షణముచే స్వరూపము తెలియనచ్చుచుండ ననేక యుపలక్షణము
లను జెప్పుట నిరర్థకమగును. గుణములనుగ గలిగియున్నదనియును జెప్పఁదగదు. ఏలయన, గుణ
ముల నంబడ. విరోధుల నేకములగుటచే "ఏకార్థము గలదియగుట" యనెడి సామానాధికరణ్యము
సిద్ధింపదు.

సమానాధికరణ వాక్యములోని పదములలో మొదటిపదముచే దెలియఁజేయఁబడిన విశి
ష్ట (గుణములతో గూడియున్న) పదార్థమునకు రెండవపదముచే దెలియఁజేయఁబడు విశిష్ట పదా
ర్థముతో నైక్యము దెలియఁజేయఁబడుచున్నదను పక్షమున, ఆవిశిష్ట (గుణములతో గూడియు
న్న) పదార్థముల యొక్క విశేష్యాంశములకు వలె విశేషణాంశములగు జాతి గుణాదులకును ఐ
క్యము ప్రసక్తించు నని వారు చెప్పినదియును సరిగాదు. ఏలయన, సత్యాది పదములు అసత్య
త్వాదులకు విరుద్ధములయిన వానిని దెలియఁ జేయుచున్నవని వారు చెప్పిన యర్థమున అట్టియసత్య
త్వాదులకు ప్రతియోగి (విరోధి)రూపములగు విశేషణములకును ఐక్యము ప్రసక్తించుచుండలేదా?

సమానాధికరణ వాక్యమునందలి పదములు విశిష్టపదార్థమునకు విశేషణాంతరముతో
(వేఱొక గుణముతో) సంబంధమును దెలియఁ జేయుచున్నవను పక్షమున విశేషణపదములకును
పరస్పరము విశేషణవిశేష్యభావము ప్రసక్తించు నని వారుచెప్పినదియును యుక్తము కాదు. ఏ
లయన, అట్టిదోషము ఆపదముల యర్థములను స్మరించు కొను సమయమునగలుగునా? వానిని ప
రామర్శించు సమయమున గలుగునా? వాక్యార్థమును జెప్పునట్టి సమయమున గలుగునా? ఆపద
ముల యర్థములను స్మరించు కొను సమయమున నని చెప్పఁ దగదు. ఏలయన, వేఱు వేఱుగ పద
ముల యర్థములు స్మరింపఁ బడుటచే నొకదానితో మఱియొక దానికి సంబంధమే ప్రసక్తింపదు.
పరామర్శించు సమయమున ననియును జెప్పఁదగదు. ఏలయన, పరస్పరము విరుద్ధములు గాని
గుణములు ఒక్క పదార్థమున నుండదగినవిగ మనము చూచుచున్నాము. అట్టిపదార్థము పరా
మర్శింపఁ బడునప్పుడు ఆగుణములును పరామర్శింపఁ బడదగును. వాక్యార్థము జెప్పునట్టి సమ
యమున ననియును జెప్పఁ దగదు. ఏలయన, అప్పుడు అన్నిపదములును గుణవిశిష్టమగు
నొక్కటియే పదార్థమును దెలియఁ జేయఁదగును. కావున అవి యొక దాని తరువాతనొకటి
వంతుననే అర్థమును దెలియఁజేయ వలయుననుకొని యొకదోషము నారోపించుట యుక్తము కా
దు. మనరెండు కన్నులును అనేకగుణవిశిష్టమగు నొక్క పదార్థమును ఒక్కటియే సమయమునఁ
దెలియఁ జేయుచుండ లేదా! అటులనే అనేకగుణములతో గూడియున్నట్టి యొక్క పదార్థమును
వాక్యమునందలి పదములన్నియునొక్కటియే సమయమునఁ దెలియఁజేయుట శక్యమనియెఱుంగు
నది. అవి ఒకదాని తరువాతనొకటివంతున అర్థములను దెలియఁజేయక అన్నియును ఒక్కమాఱు

యుండును. అందువలన నా పదములన్నియు నొక్కటే యర్థము గలవియగుట సిద్ధింప నేరదు.

భాష్యకారులు:— అటుల నన్ని పదములు ఒక్కయర్థము నే బోధించు నట్టివి యగుపక్షమున నవియన్నియును పర్యాయపదములు అనఁగా సమానార్థముగల పదములు కావలసి వచ్చునే?

---

గనే యర్థములను దెలియఁజేయు పక్షమున, ఇది యుద్దేశ్యమనియు ఇది యుపాదేయమని యెడి విభాగమును గలిగి యుండుట యనెడి వాక్యలక్షణమునకు భంగము వచ్చునని చెప్పినదియును యుక్తము కాదు. ఏలయన, ఉద్దేశ్యోపాదేయ విభాగమనగ నది యర్థము కాదు. జ్ఞాతాజ్ఞాతవిభాగమును అనఁగా నిది తెలిసినది యిది తెలియనిది యనెడి విభాగమును గలిగియుండుటయని దాని కర్థము. పదములన్నియు నొక్క మాఱుగనే విశిష్టపదార్థమును దెలియఁ జేయు పక్షమునను ఇట్టి వాక్య లక్షణమునకు భంగము లేదు. ఎట్లన, ఒక్కటియే వాక్యము ఒక్కటియే వస్తువునకుండు విశేషణములతో(గుణములతో)సంబంధమును ఒక్క-మాఱుగ దెలియఁజేయవలసినప్పుడు ఒక్క విశేషణముతో (గుణముతో) సంబంధము ముందుగనే తెలియఁ బడినదనియు, మఱియొక్క విశేషణముతో(గుణముతో) సంబంధము తెలియఁ బడలేదనియు నివ్విధమగు జ్ఞాతాజ్ఞాత విభాగ పరామర్శము గలుగుచున్నది. గనుక పరామర్శసమయమున నట్టి విభాగము గలుగుట సంభవమే.

విశేషణములు భిన్నములగుటను బట్టి విశేష్యములును భిన్నములగుననియు నీవాదము సయితము యుక్తము కాదు. ఏలయన, విశేషణములు భిన్నములయినను, విశేష్యము భేదింపనిదిగ "దేవదత్తః శ్యామో యువా లోహితాక్షః" ఇత్యాదివాక్యములయందు గన్పట్టుచున్నది. దేవదత్తుఁడు మనకుఁ బ్రత్యక్షముగ గనపడువాఁడు కావున ఇచట విశేషణములు విశేష్యమును భిన్నమయిన దానినిగఁ దెలియఁజేయునవయినను, శ్యామవర్ణముగల దేవదత్తుఁడే యౌవనముగల దేవదత్తుఁడనియు నీవిధముగఁ దెలిసికొనుచున్నామని వారు చెప్పినదియును సరికాదు. మనయెదుట కనపడని పదార్థమును గూడ నటులనే తెలిసికొనుచున్నాము. ఇచ్చట విశేష్యమొక్కటి యగుటవలనను, పదములన్నియును ఏక విభక్తికములగుటవలనను విశేష్యమగు వస్తువు యొక్కటియే యని తెలిసికొనుచున్నాము. "ఖండః ముండః పూర్ణశృంగః గౌః" అనుతావున పదము లేక విభక్తికములయినను విశేషణములు భిన్నములగుటచే విశేష్యము గూడ భిన్నమయినదిగఁ దెలియవచ్చుచున్నదే యని వాదడుగవచ్చును. అచట విశేషణములు విశేష్యము నొక్క దానినిగనే తెలియఁజేయునవియయినను, ఒక్కటియే ఆవు బోడిగను కొమ్ములుగలదిగను నుండుట ప్రత్యక్షవిరుద్ధము కావున నచట నా విశేషణములు విశేష్యమును భిన్నమయిన దానినిగఁ దెలియఁజేయునవి యగుచున్నవి. ఆవు మనయెదుట లేకపోయినను ఒక్కటియే ఆవు బోడిదియును కొమ్ములుగలదియును కానేరదని మనము తెలిసికొనుచున్నామే అదియెటులని వారడిగినట్లైన దేవదత్తుఁడు మనయెదుట లేకపోయినను, శ్యామవర్ణముగల దేవదత్తుఁడే యౌవనముగల దేవదత్తుఁడుగ నుండవచ్చునని మనము తెలిసికొనుచున్నామే అదియెటుల నని మనము వారి నడుగ వచ్చును. గనుక రెండు వాదములును సమానములే. ఇందుల నిర్ణయ మేది యనిన, ఏ యే గుణము లొక్కటియే వస్తువునం దుండదగనివో ఆగుణములను దెలియఁజేయు విశేషణ పదములు, ఆవస్తువు మన యెదుట లేక పోయినను దానిని భిన్నమయిన దానినిగనే తెలియఁ జేయును. "ఖండః ముండః పూర్ణశృంగః గౌః" అను వాక్యము ఉదాహరణము. ఏ యే గుణములు ఒక వస్తువునందుండఁ దగినవో వానిని దెలియఁ జేయు విశేషణపదములు మాత్రము, ఒక్కటియే విశేష్యమును గలిగి యున్నట్టియు సమాన విభక్తికములగు పదములుగల వాక్యమున, విశేష్యమును ఒక్కటిగనే(భిన్నముకాని దానినిగనే) దెలియఁజేయునవియగుచున్నవి. "దేవదత్తః శ్యామో యువా లోహితాక్షః" అను వాక్యము ఉదాహరణము.

అద్వైతి:— అవి ఒక్కటే యర్థమును దెలియఁజేయు నట్టివి యైనను పర్యాయపదములు గాకుండుటను గుఱించి చెప్పెదను. సావధానముతో వినుము.

(పదములన్నియు నొక్కటియే విభక్తి గలవగుటనుబట్టి) వాక్యమున కొక్కటియే యర్థమును దెలియఁజేయుటయే తాత్పర్యము (అభిప్రాయము) అని నిశ్చిత మగుచున్నది. అందువలన ఆవాక్యమునందు ప్రయోగింపఁబడినట్టి[1]పదములన్నియు వాని వాచ్యార్థములకు (అవి సామాన్యముగ దెలియఁజేయునట్టి యర్థములకు) ఏది విరుద్ధమయినదో దానికి స్వాభావికముగ విరుద్ధమయిన దానిని దెలియఁ జేయునవి యగుటచే ఆయొక్క యర్థమునే తెలియఁ జేయునవి యగుచు నవి యన్నియును ఉపయుక్తములయినవిగను, ఒక్కటియే యర్థమును దెలియఁ జేయునవిగను, పర్యాయపదములు (సమానార్థముగల పదములు) కానివిగను నిశ్చయింపఁబడుచున్నవి.

సామానాధికరణ్యమును సమర్థించుట.

లక్షణమువలన (బ్రహ్మముయొక్క స్వాభావికమైన స్వరూపమునునిరూపించు వాక్యమువలన)దెలియవలసిన బ్రహ్మము తనకంటెను వేఱగు నన్ని పదార్థములకును విరుద్ధమగు స్వరూపము గలది. కావున“సత్యం జ్ఞాన మనంతంబ్రహ్మ” అనెడి యీలక్షణ వాక్యమునందలి “సత్యం” అనియు “జ్ఞానం” అనియు “అనంతం” అనియు నీమూఁడు పదములును బ్రహ్మమునకు విరుద్ధములగు పదార్థములస్వరూపమేదియును బ్రహ్మమునకు లేదని తెలియఁ జేయుచున్నవి. ఎట్లన, వికారమును (మార్పును) బొందునదియగుటచే మిథ్యాభూతమగు (అసత్యమగు) పదార్థమునకంటె విలక్షణమయిన బ్రహ్మమును “సత్యం” అను పదము తెలియఁజేయుచున్నది. వేఱొక పదార్థమునకధీన

“సత్యంజ్ఞానమనంతం” ఇత్యాదిశ్రుత్యర్థము

(1) “సత్యం” అనుపదమునకు “వాస్తవమయినది” అనుట వాచ్యార్థము. మిథ్యాభూతమయినది (వాస్తవముకానిది) అనుట ఆవాచ్యార్థమునకు విరుద్ధమయిన యర్థము. మిథ్యాభూతముకానిది (బ్రహ్మము) అనుట దానికి విరుద్ధమయిన యర్థము.

“జ్ఞానం” అనుపదమునకు “చేతనము”అని వాచ్యార్థము. “జడము” అనుట ఆవాచ్యార్థమునకు విరుద్ధమయిన యర్థము. “జడము కానిది”(బ్రహ్మము) అనుట దానికి విరుద్ధమయిన యర్థము.

ఈ విధముగనే “అనంతం” అనుపదముయొక్క యర్థమునుగూడ యోచించునది. ఇటుల నీమూఁడు పదములును బ్రహ్మము అనెడి యొక్కటియే యర్థమును దెలియఁజేయుచున్నవి యని అద్వైతులు చెప్పుదురు.

మయిన ప్రకాశముగల (ఇతర వస్తువుచే బ్రకాశింపఁ జేయఁబడు నట్టి) జడపదార్థమునకంటె విలక్షణ మయిన బ్రహ్మమును "జ్ఞానం" అనుపదము తెలియఁజేయుచున్నది. [1]దేశకాలవస్తు పరిచ్ఛేదముగల పదార్థమునకంటె విలక్షణమయిన బ్రహ్మమును "అనంతం" అనుపదము తెలియఁజేయుచున్నది.

ఇటుల నితరపదార్థములకంటె బ్రహ్మమునకుండు వైలక్షణ్యము అనునది [2]భావరూపమగు (ఉన్నట్టి) ధర్మమా? లేక అభావరూపమగు (లేనట్టి) ధర్మమా? అని శంకింపఁ బనిలేదు. స్వేతర సమస్త పదార్థములకు విరుద్ధమగు బ్రహ్మమే అదియును. ఎట్లన, నల్లనిపదార్థమునకంటె తెల్లని పదార్థమునకుండు వైలక్షణ్య మనునది ఆపదార్థముయొక్క స్వరూపమేగాని మఱియొక ధర్మమగునా? [3]కానేరదు. ఇటుల నీమూఁడు పదములు నొక్కటియే పదార్థమును (బ్రహ్మమును) తన కంటె నితరములగు నన్నిపదార్థములకు విరుద్ధమయిన దానినిగఁ దెలియఁజేయుచు మిక్కిలి యుపయుక్తమగు నర్థము గలవియు, ఒక్కటియే యర్థమును(పదార్థమును) దెలియఁజేయునవియు, పర్యాయ(సమానార్థక) పదములు కానివియు నగుచున్నవి. కావున నీవాక్యముచే బ్రహ్మ

సమానాధికరణ వాక్యమున పదములు స్వరూప మాత్రమును బ్రతిపాదించునవి.

---

(1) పరిచ్ఛేదమనఁగా మితి (మేర) యనుట. దేశపరిచ్ఛేదమనియు, కాలపరిచ్ఛేదమనియు, వస్తుపరిచ్ఛేదమనియును పరిచ్ఛేదము మూఁడు విధములుగలది. ఏదైననొక దేశమున మాత్రముండునది యగుట దేశపరిచ్ఛేదమనఁబడును. ఏదైననొక కాలమున మాత్రముండునది యగుట కాలపరిచ్ఛేదమనఁబడును. ఏదైననొక వస్తువుగ మాత్రముగాని వస్తువునందు మాత్రముగాని యుండునది యగుట వస్తు పరిచ్ఛేదమనఁబడును. బ్రహ్మము ఈత్రివిధ పరిచ్ఛేదము లేనిది యని సామాన్యముగ వేదాంతు లందరు నంగీకరించుచున్నారు.

(2) ప్రాభాకరులను పూర్వమీమాంసకుల పక్షమునను, సిద్ధాంతిమతమునను ధర్మము భావరూపము. వైశేషికాదుల మతప్రకార మది అభావరూపము.

(3) వైలక్షణ్య మనునది యొకధర్మమను పక్షమున నొకవస్తువుయొక్క ధర్మమావస్తువుయొక్క స్వరూపమునకంటె వేఱయినదగుటఁజేసి యద్వైతము(బ్రహ్మమొక్కటియే కలదు తదితరమయిన దేదియును లేదు అనుట) సిద్ధింపదు. ఇంతియగాక నట్టి వైలక్షణ్యము వేఱొకధర్మమని నిరూపించుటయును దుర్లభము. ఏలయన, అటులనగు పక్షమున బ్రహ్మమునకును దానికి విరుద్ధములగువాని కన్నింటికి నుండు వైలక్షణ్యమను ధర్మమునకును బ్రహ్మస్వరూపమునకును ఉండుచున్న వైలక్షణ్యమునయితమొక ధర్మమనియే చెప్పవలయునుగదా. ఈవైలక్షణ్యమునకును బ్రహ్మస్వరూపమునకునుండు వైలక్షణ్యముగూడ నొక ధర్మమనియే చెప్పవలయును. ఇట్లువైలక్షణ్యరూపములగు ధర్మములకు మితము లేకుంటచే అనవస్థాదోషము ప్రాప్తించును.

మొక్కటియే స్వయంప్రకాశమయినదిగను విశేషములేవియు లేనిదిగను తెలియఁజేయఁబడుచున్నది.

ఇట్టి యర్థమే శ్రుత్యంతరములకు ననుగుణమ యినదనినిరూపించుట.

ఇట్లు సత్య జ్ఞానాది పదములు ఒక్కటే యర్థమును దెలియఁ జేయుచున్నవను పక్షమున "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనెడి శ్రుతివాక్యము "సదేవ సోమ్యేద మగ్ర ఆసీదేక మేవా ద్వితీయం (ఛా. ౬-ప్ర. ౨-ఖ. ౧-వా.) [ఓ శ్వేతకేతుఁడా! ఈపరి దృశ్యమానమగు ప్రపంచమంతయును సృష్టికి పూర్వము ఒక్కటియును రెండవది లేనిదియునగు అనఁగా [2]సజాతీయ విజాతీయ భేదములు లేనిదియగు సన్మాత్రముగనే (బ్రహ్మముగనే) యుండెను.] అనియు నీమొదలగు శ్రుతివాక్యములతో నేకార్థమగును. మఱియు "యతోవా ఇమాని భూతాని జాయంతే" (తై. భృగు. ౧- అను) (ఏపరబ్రహ్మమునుండి యీజంతువులు బట్టుచున్నవో) అనియు, "సదేవ సోమ్య ద మగ్ర ఆసీత్" అనియు "ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" (ఐత. ౧-అ. ౧-ఖ. ౧-వా) [సృష్టికి పూర్వము ఈ పరిదృశ్యమానమగు జగమంతయు నొక్కటేయగు నాత్మగనే (బ్రహ్మముగనే) యుండెను] అనియునీమొదలగు శ్రుతివాక్యములచే జగత్కారణముగఁ దెలియఁ జేయఁబడునట్టి బ్రహ్మముయొక్క స్వరూపమును తెలియఁ జేయునదిగదా! ఈశ్రుతివాక్యము. [1]సర్వశాఖాప్రత్యయన్యాయమువలనను జగత్కారణమును బ్రతిపాదించెడి శ్రుతివాక్యములచే బోధింపఁబడిన బ్రహ్మము [2]సజాతీయ విజాతీయ భేదములు లేనిదిగను అద్వితీయమయినది (రెండవది లేనిది) గను గదా! తెలియవచ్చుచున్నది. ఇట్లు శ్రుతులయందు జగత్కారణముగఁ దెలియఁబడునట్టియు, అద్వితీయమునగు బ్రహ్మము యొక్క స్వరూప మిట్టిది

(1) కౌతక, కాణ్వ, మాధ్యందిన, తైత్తిరీయ శాఖలయందు దర్శపూర్ణమాస్యకర్మములు విధింపఁబడినవి. ఈకర్మములను విధించునపుడు ఈ శాఖలలో నొక్కొకశాఖయందొక్కొక విశేషాంశము జెప్పఁబడి శాఖాంతరమున నట్టి విశేషాంశము గానఁబడకున్నది. అకర్మములను రేశాఖప్రకార మనుష్ఠించినను వానిస్వరూపమన్నింటి యందు నొక్క విధముగనే యుండవలయునను నియమమును బట్టి సర్వశాఖలయందును జెప్పఁబడిన సమస్తవిశేషములతోను వాని ననుష్ఠింపవలసినదనియు, కావున నన్ని శాఖలయందును విధింపఁబడిన దర్శపూర్ణమాస్యకర్మములు భేదములేనివి యనియును పూర్వమీమాంసా శాస్త్రమున నిశ్చయింపఁబడియె. ఇందువలన అనేక వేదశాఖలలో నేదియయిన నొక్క విషయమును గురించి జెప్పునపుడు కొన్నింటిలో దానినిగురించిన కొన్ని విశేషాంశములు చెప్పఁబడకపోయిననుఒక్కశాఖలోఁ జెప్పినవిశేషములను మఱియొక్క శాఖలోఁజేర్చుకొనవచ్చునని యేర్పడుచున్నది. దీనినే సర్వశాఖాప్రత్యయ న్యాయమందురు. (పూర్వమీమాంసా శాస్త్రములో ౨-వ అధ్యాయమున ౪-వ పాదమున ౯-౩౨-సూత్రములను జూడుము)

(2) ౧౧-వ పుట యందు యొక్క [illegible] ... సమాసము.

యని ప్రతిపాదింపఁ బోవునట్టి యీశ్రుతివాక్యము అట్టి బ్రహ్మస్వరూపమును ఆవాక్యములతో విరోధము లేకుండునట్లుగదా! ప్రతిపాదింపవలయును. బ్రహ్మము రెండవదేదియును లేనిది యని చెప్పునట్టి శ్రుతివాక్యము గుణమాత్రమయి నను రెండవది గలదని చెప్ప నేరదు. అట్లుఁగాకున్న "నిరఞ్జనం" (బ్రహ్మము అవయవములు లేనిది) అనియు "నిర్గుణం" (బ్రహ్మము గుణములు లేనిది) అని యు నీమొదలగు శ్రుతి వాక్యములు విరోధించును. కావున బ్రహ్మస్వరూప మును గుఱించిన యీలక్షణవాక్యము (బ్రహ్మస్వరూప మిట్టిదియని తెలియఁ జేయునట్టి "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనెడి యీశ్రుతి వాక్యము) బ్రహ్మ ము విశేషము లేవియును లేనిది యనియే ప్రతిపాదించుచున్నది.

భాష్యకారులు:—సత్య జ్ఞానాది పదములు వాని వాచ్యార్థములను వదలుకొని (సామాన్యముగ నవి తెలియఁజేయునట్టియర్థములను దెలియఁజేయక) ఆయర్థములకు విరుద్ధములగు వానికంటె విలక్షణమగు వస్తువుయొక్క స్వరూప మును నిరూపించునవి యగు పక్షమున నది లక్షణార్థ (తాత్పర్యార్థ) మగునే?

అద్వైతి:—ఇది యొక దోషముకాదు. వాచ్యార్థమునకంటె తాత్పర్యార్థ మెక్కువ బలమయినది మఱియు సామానాధికరణ్యమున కెప్పుడును ఐక్య మునే తెలియఁజేయుటయందు తాత్పర్యమను నది యందఱు నంగీకరించినదియే కదా!

భాష్యకారులు:—వాక్యమునందలి యన్ని పదములకును లక్షణార్థము నే చెప్పుకొనుట నెన్నఁడును చూచియుండలేదే?

అద్వైతి—అయిన నేమి? వాక్యముయొక్క తాత్పర్యమున కేదియు విరోధము లేనప్పుడా వాక్యమునందలి యొక్క పదమునకైనను లక్షణార్థమును (తాత్పర్యార్థమును) గైకొనునట్లు గానఁబడదు. అయితే వా క్యమునందలి పదములన్నియును ఇట్టి యర్థమును దెలియఁ జేయుటయే తాత్పర్యమని (అభిప్రాయమని) యొకయర్థము నిశ్చిత మగుచుండగా దానికి, వాచ్యార్థమున వలంబించుట చే, నేదైన విరోధము గలుగునట్లైన అట్టి విరోధము లేకుండఁజేయుటకై యొక్క పదమునకు లక్షణార్థమును జెప్పుకొను నటుల నావాక్యమునందలి రెండుపద ములకుఁగాని మూఁడుపదములకుఁ గాని లేక నావాక్యమునందలి యన్ని పదముల

వాక్యమునందలి యన్ని పదములకును లక్షణార్థమును గైకొనవచ్చుననుట

కుఁగాని లక్షణార్థమును జెప్పుకొనిన దోష మేదియును లేదు. ఇది శాస్త్రము నవలంబించు వారందఱును అంగీకరించినదియే. ఎట్లన,

ఏదియయిన నొక కార్యమును దెలియఁజేయుటయే వాక్యముల యర్థమని వాదించునట్టి కొందఱు పూర్వ మీమాంసకులు (ప్రాభాకరులు) లోకవ్యవహారమునఁ బ్రయోగింపఁబడు వాక్యములయందుండు పదములన్నిటికిని లక్షణార్థమును (తాత్పర్యార్థమును) అవలంబించు చున్నారు. వారి మతప్రకారము విధ్యర్థక క్రియాపదములు మొదలగునవి అపూర్వకార్యమును(పూర్వ మెన్నడును ప్రత్యక్షాదిప్రమాణాంతరములచే దెలియఁబడని జ్యోతిష్టోమాదికర్మములను) దెలియఁజేయునవి యగు నప్పుడు మాత్రము (అట్టి కర్మములను విధించునట్టి వేదవాక్యములయందుండునప్పుడు మాత్రము)ముఖ్యార్థము (ఆ కార్యమును గలుగఁ జేయుటయ నెడియర్థము)గలవియగుచున్నవి. కావున లోకవ్యవహారమునఁ బ్రయోగింపఁబడువాక్యములయందుండువిధ్యర్థక ప్రత్యయములు మొదలగునవి క్రియను(కార్యమును) లక్షణార్థముచే దెలియఁ

వాక్యమునందుండు పదములన్నింటికిని లక్షణార్థమును జెప్పుకొనుట శాస్త్రీయమని నిరూపించుట

(1) స్వర్గాది ఫలములను బొందుటకై జ్యోతిష్టోమాదియాగముల ననుష్ఠింపవలసినదని యీ విధముగ నేదియయిన నొక కర్మమును విధించు వేదవాక్యములలోనుండు "యజేత" (యజ్ఞముచేయవలసినది) ఈ మొదలగువిధ్యర్థక క్రియాపదములుమాత్రముముఖ్యార్థముగలవి (కార్యమునుగలుగఁ జేయుటయనెడి యర్థము గలవి). ఏలయన, వేదము తప్పమఱియే ప్రమాణమును జ్యోతిష్టోమాదికర్మములను ఆచరించుటచే స్వర్గాదిఫలములను బొందవచ్చునని నిరూపింప నేరదు. వేదమిట్లు దెలియఁజేయని యెడను స్వర్గాదిఫలములనుఁ బొందుటకై జ్యోతిష్టోమాదికర్మముల నెవ్వఁడును ఆచరింపడు. అయితే లోకవ్యవహారమునఁ బ్రయోగింపఁబడు వాక్యములయందలి విధ్యర్థక క్రియాపదములకు (ఇది చేయుము దీనిని చేయవలసినది యీ మొదలగు వానికి) అట్టి ముఖ్యార్థము సంపూర్ణముగ లేదు. ఎట్లన, ఒక్కఁడు విధించుటచే (ఆజ్ఞాపించుటచే) మఱియొక్కఁడు చేయు కార్యమున కట్టి విధియే కారణముగాదు, ఇతరకారణములు సయితము గలవు. కావున నట్టి కార్యమును జేయుటకై అతఁడా విధిచేతనే గాక యితరహేతువులచేతను ప్రేరితుఁడగుచున్నాడు. తన గోవును పాలుపితుకుమని యితరునిచే నాజ్ఞాపింపఁబడిన మనుష్యుఁడు యితరుని యాజ్ఞవలననే గాకుండ స్వప్రయోజనమువలనను ఆ కార్యమునఁ బ్రవర్తించుచున్నాడు. కావున లోకవ్యవహారమునఁ బ్రయోగింపఁబడు విధ్యర్థక క్రియాపదములు ముఖ్యార్థముగలవి కావని యిట్లు పూర్వమీమాంసాశాస్త్రమున నిర్ణయింపఁబడెను. ఇట్లు లౌకిక వాక్యములయందలి విధ్యర్థక క్రియాపదములకు లక్షణార్థమె (తాత్పర్యార్థమే)గాని ముఖ్యార్థము లేదనునిర్ణయము క్రమేణ ఆ వాక్యములయందలి యితర పదములను గుఱించియును ప్రవర్తించెను. అందువలన లౌకిక వాక్యములయందు బ్రయోగింపఁబడిన పదములన్నియును లక్షణార్థము మాత్రము గలవియని పూర్వమీమాంసకులు కొందఱు (ప్రాభాకరులను వారు). వాదించుచున్నారు.

జేయుచున్నవి. అందువలన అట్టి విధ్యర్థక వాక్యములలోనుండినవై అట్టిక్రియతో (కార్యముతో) సంబంధించిన విషయములను దెలియఁజేయునట్టి యితర శబ్దములును అట్టి యపూర్వకార్యముతో సంబంధించిన వగుపక్షమున మాత్రమే ముఖ్యార్థము గలవి యగుచున్నవి. అట్లు గాక మఱియొక లౌకిక కార్యముతో సంబంధించినవి యగుపక్షమున నవి లక్షణార్థముమాత్రమే గలవి యగును. కాఁబట్టి వాక్యముయొక్క యభిప్రాయమున కేవియును విరోధము లేకుండుటకై ఆవాక్యమునందుండు పదములన్నింటికిని లక్షణార్థమును (తాత్పర్యార్థమును) జెప్పుకొనిన దోషమేదియును లేదు. ఇట్టి యర్థములను బ్రతిపాదించునట్టి యుపనిషద్వాక్యములే యిందులకుఁ [1]బ్రమాణము.

[1]ప్రత్యక్షాది ప్రమాణములకును శాస్త్రమునకును విరోధము సంభవించునప్పుడు శాస్త్రమే ప్రబలమయినదని చెప్పఁబడియె. అయితే అట్టి విరోధమున్నపక్షమునఁగదా శాస్త్రమునకు ప్రాబల్యము గలదని చెప్పఁదగును! విరోధమే కనఁబడదే! ప్రత్యక్ష ప్రమాణము సయితము అట్టి నిర్విశేష సన్మాత్రమగు [విశేషము లేవియు నులేని సత్తా (ఉనికి) మాత్రమగు] బ్రహ్మమునే తెలియఁజేయునది గదా!

ప్రత్యక్షప్రమాణమునకు శాస్త్రముతో విరోధము లేదనుట.

భాష్యకారులు:—''ఘటము కలదు” అనియు “పటము (వస్త్రము) కలదు” అనియు నిట్లు నానావిధాకారములుగల పదార్థములను దెలుపునట్టి ప్రత్యక్ష ప్రమాణము సన్మాత్రమును (సత్తామాత్రమును) దెలుపునట్టిది యగుట యెట్లు సంభవము? ఇంతియకాక (ఘటజ్ఞానము మొదలగు) అన్ని జ్ఞానములును వేఱు వేఱు విషయములను గుఱించినవి గానివై, ఒక్కటియే విషయమును గుఱించినవి అగు పక్షమున [2]ధారావాహికజ్ఞానమువలె నవి యొక్కటియే విషయమును గుఱించిన వ్యవహారమునకు మాత్రము హేతువు గావలసివచ్చునే?

అద్వైతి:— సత్యము. అయినను దీనిని విమర్శించి కనఁబఱచెదను. “ఘటము కలదు” అనునప్పుడు ఘటముయొక్క సత్తయును (ఉనికియును) దానికుండు భేదమును వ్యవహరింపఁబడుచున్నవి (వ్యవహారమునఁ దెలిసికొనఁబడుచున్నవి). అయితే ఈరెండువ్యవహారములును ప్రత్యక్షజ్ఞానమువలనను మాత్రమే గలుగు

భేదజ్ఞానము భ్రాంతిమూలకమని నిరూపించుట.

(1) వీనిలక్షణములను గుఱించి మహాసిద్ధాంతము నందలి మొదటి రెండు మూడు పత్రముల క్రింది భాగమున నియ్యఁబడు వివరణములను చూడుము.

(2) ఒక్కవస్తువునందేవరుసగాఁబుట్టి యొక్కవిధము గానుండెడి యనేకజ్ఞానముల పరంపర ధారావాహిక జ్ఞానమనఁబడుచున్నది.

ట యసంభవము.[1] ఏలయన, అవి భిన్న కాలములయందుండెడిజ్ఞానములవలన గలుగునవి. ప్రత్యక్షజ్ఞానమో క్షణమాత్రముండునట్టిదిగదా. ఇంతియకాక ప్రత్యక్షజ్ఞానమునకు విషయమగునది ఘటముయొక్క స్వరూపమా? దానికుండు భేదమా? ఏదైననొక పదార్థమునకుండు భేదమును దెలిసికొనవలయుననిన ఆ పదార్థముయొక్క స్వరూపమును గుఱించిన జ్ఞానమును ఆ పదార్థముకాని పదార్థమును (తదితరమగు వేఱొక పదార్థమును) గుఱించిన స్మరణమును (తలంపును) ఆవశ్యకములు. కావున ప్రత్యక్షజ్ఞానమునకు ఘటస్వరూపము మాత్రమే విషయమగునదియని చెప్పఁదగును. అందువలన (దానికుండు) భేదము ప్రత్యక్షజ్ఞానముచే దెలుపఁబడదు. కాఁబట్టి భేదవ్యవహారము (భేదజ్ఞానము) భ్రాంతిమూలమయినదని సిద్ధమగుచున్నది.

---

[1] "ప్రత్యక్తత్త్వప్రదీపిక" యను గ్రంథమున శ్రీచిత్సుఖాచార్యులవారీవాదమును వివరముగ గనఁబఱచి యున్నారు. ఎట్లన,

(1) ప్రత్యక్ష ప్రమాణము ఏదైననొక వస్తువుయొక్క స్వరూపమును, ఇతర వస్తువులనుండి దానికిఁగల భేదమును ఈ రెంటిని దెలుపుచున్నదను పక్షమునఁ నది ముందుగ భేదమును దెలిపి తరువాత స్వరూపమును దెలుపుచున్నదా? ముందుగ స్వరూపమును దెలిపి తరువాత భేదమును దెలుపుచున్నదా? లేక స్వరూపమును భేదమును ఈ రెంటిని ఏక కాలముననే తెలుపుచున్నదా? అని విచారింప వలసి యున్నది.

అది ముందుగ భేదమును దెలిపి తరువాత స్వరూపమును దెలుపుచున్నదని చెప్పఁదగదు. ఏలయన, ఏవయిన రెండు పదార్థములకుండు భేదమును దెలిసికొన వలయుననిన వాని స్వరూపములను ముందుగ దెలసికొని యుండవలయును గదా. కావున స్వరూప జ్ఞానము భేద జ్ఞానము కలుగుటకు కారణభూతమయినది. కార్యభూతమగు భేదజ్ఞానము స్వకారణ భూతమగు స్వరూపజ్ఞానమునకు ముందుగనే కలిగి యుండ నేరదు.

అది స్వరూపమును భేదమును ఈ రెంటిని ఏకకాలమున దెలుపుచున్నదనియును జెప్పఁదగదు. ఏలయన, ఈపైని కనఁబఱచిన ప్రకారము భేదజ్ఞానమును, స్వరూప జ్ఞానమును ఈ రెండును కార్యకారణము లగుటంజేసి యవి ఏకకాలమునఁ గలుగ నేరవు.

అది ముందుగ స్వరూపమును దెలిపి తరువాత భేదమును దెలుపు చున్నదనియును జెప్పఁదగదు. ఏలయన, ప్రత్యక్షజ్ఞానము క్షణమాత్రముండునది కావున అది ముందొక కార్యమును (స్వరూపమును దెలుపుటయనెడి కార్యమును) జేసి తరువాత నొక కార్యమును (భేదమును దెలుపుటయను కార్యమును) జేయుచున్నదనుపక్షమున ఆ రెండు కార్యములకు మధ్యమునఁ నుండు వ్యవధాన మిట్టిదియని తెలిసికొనుట దుర్లభము. కావున భేదమును ప్రత్యక్షజ్ఞానము తెలుపఁజాలదు.

మఱియు భేదము ఒకపదార్థమని నైయాయికులును (న్యాయశాస్త్రజ్ఞులును) నిరూపింప నేరకున్నారు. ఎట్లన, భేదమనఁగా ఏదైన నొకవస్తువుయొక్క స్వరూపము గానేరదు. అదియొకవస్తువు యొక్క స్వరూపమగు పక్షమున ఆ వస్తువుయొక్క స్వరూపమును దెలియుటచే స్వరూపమునుగుఱించిన వ్యవహారము(జ్ఞానము) గలుగునట్లు (ఇతర వస్తువులనుండి దానికిఁగల)భేదమును గుఱించిన వ్యవహారము (జ్ఞానము)సయితము గలుగ వలసివచ్చునే? ఒకవేళ ఆవస్తువుయొక్క స్వరూపము దెలిసినను భేదమును గుఱించిన జ్ఞానము గలుగుటకై అదికానివస్తువును (తదితరమగు వేఱొకవస్తువును) గుఱించిన స్మరణము (తలంపు) ఆవశ్యకము, కావున అట్టి స్మరణము లేకుండుటచే నప్పుడు మాత్రము భేదమును గుఱించిన వ్యవహారము (జ్ఞానము) గలుగ నేరదనియెదవా? అది సరికాదు.ఏలయన, ఏదయిన నొకవస్తువుయొక్క స్వరూపమే(ఆవస్తువునకునుతదితరవస్తువునకునుండు)భేదము అనెడువాని మతమున, భేదమునుగుఱించిన జ్ఞానముగలుగుటకై ఆవస్తువుకానిదానిని (తదితరమగు వేఱొకదానిని)గుఱించిన స్మరణ మావశ్యక మనెడి తలంపు గూడ గలుగుట దుర్లభమే. వాని మతప్రకారము ఏదైన నొకవస్తువుయొక్క స్వరూప మన్నను (దానికిని తదితరవస్తువునకునుండు) భేదమన్నను స్వరూపమే కదా! ఇట్లుండ ఏదైన నొకవస్తువుయొక్క స్వరూపమును దెలిసికొనుటకుఁ గాను ఆవస్తువు కానిదాని యొక్క(తదితరమగు వేఱొక వస్తువు యొక్క)స్వరూపమును గుఱించినస్మరణము (తలంపు) అనావశ్యకమగునట్లు,ఆవస్తువునకుండు భేదమును దెలిసికొనవలయునన్నను వాని మతమున ఆవస్తువు కానిదాని యొక్క స్వరూపమును గుఱించిన స్మరణము అనావశ్యక మగును. ఇంతియకాక స్వరూపమేభేదమనెడు పక్షమున హస్త కర శబ్దములు హస్తమనెడి యొక్కటియే వస్తువును దెలుపునవియై పర్యాయపదము లనిపించుకొను చందమున ఘట భిన్న శబ్దములును (ఘటశబ్దము) ఘటస్వరూపమును (భిన్నశబ్దము) భేదమును దెలియఁజేయునవియైనను పర్యాయపదములు గావలసి వచ్చును.

*భేదమనఁగా ఏదైన నొకవస్తువుయొక్క స్వరూపముకాదు*

మఱియు భేదమనఁగా ఏదైన నొకవస్తువుయొక్క ధర్మము (గుణము) అనియును జెప్పఁదగదు. ఎట్లన, వస్తువుయొక్క స్వరూపమునకంటె దాని ధర్మము (గుణము) భిన్నమయినది. కావున ధర్మమగుభేదము స్వరూపమునకంటె భిన్నమైనదని అవశ్యముగ నంగీకరింపవలయును. అట్లుగాకున్న స్వరూపమే ధర్మమన

*భేదమనఁగా నొకవస్తువుయొక్క ధర్మము (గుణము) కాదు.*

నలసి వచ్చును. స్వరూపమునకంటెను ధర్మమనంబడు భేదము భిన్నమయినది (భేదముకలది) అంటివేని భేదమనఁగా ధర్మమనెడి నీమతప్రకారము "భేదముకలది" అనఁగా ధర్మముకలదిగాన, ధర్మముకలదియగునట్టి యీ భేదమునకంటెను అది కలిగియున్నట్టి భేదమనంబడు ధర్మము భిన్నమయినది (భేదముకలది) అని చెప్పవలసి వచ్చును. అట్లే యీ భేదమునకంటెను ఇది కలిగియున్నట్టి భేదమనంబడు ధర్మము భిన్నమయినది (భేదముకలది) అని చెప్పవలసివచ్చును. ఇట్లు ఈవాదమున లెక్కలేని భేదములు ప్రసక్తించును. కావున ఈ వాదమున [1]"అనవస్థా"దోషము గలదు.

[2]ఇంతియకాక భేదమనఁగా ఏదైన నొక పదార్థముయొక్క ధర్మము (గుణము) అను వాదమున మఱియొక దోషము సయితము గలదు. ఎట్లన, జాతిమొదలగు ధర్మములతోఁ గూడియున్నట్టి పదార్థమును దెలిసికొనుటచేతనే గదా దానియందు జాత్యాది ధర్మములు తెలియఁబడును! మఱియునట్టి జాత్యాది ధర్మములను దెలిసికొనుట చేతనే గదా అట్టి జాత్యాది ధర్మములతోఁ గూడియున్నట్టి పదార్థమును దెలిసికొనఁ గలుగుదుము! ఇట్లు ధర్మములను దెలిసికొనుటకై యట్టి ధర్మములతోఁ గూడియున్నట్టి పదార్థమును గుఱించిన జ్ఞానమావశ్యకమగుట వలనను, ధర్మములతో గూడియున్నట్టి పదార్థమును దెలిసికొనుటకై దానియందు ధర్మములను గుఱించిన జ్ఞానమావశ్యకమగుట

---

(1) అనవస్థ=మితిలేనిది, అనఁగా అంతుపట్టని వాదము. ఏదైననొక దానిని ఉపపాదింపవలసి వచ్చినప్పుడు దానిని తగిన హేతువులచే ఉపపాదించుటను (సమర్థించుటను) తర్కమందురు. అప్పుడొక దానిని ఉపపాదించుటకై వేఱొక దానిని ఉపపాదింపవలసివచ్చుటయు, అందులకై వేఱొక హేతువు కావలసివచ్చుటయును, దానిని ఉపపాదించుటకై మరల వేఱొక దానినిఉపపాదింపవలసివచ్చుటయు, అందులకై వేఱొక హేతువు కావలసివచ్చుటయును ఈవిధముగ నుపపాదింపవలసిన యంశములును ఉపపాదకములగు హేతువులును మితిలేకుండ ప్రసక్తించునట్టి యొకముగియికలేని తర్కమును అనవస్థయందురు. ఇట్టితర్కమును శాస్త్రకారు లంగీకరింపరు. ఇది తర్కమునకొక దోషము. దీనినే అనవస్థాదోషమందురు.

(2) భాష్యమునందు కనఁబఱచిన ప్రకారము ఒక్కవిధముననే కాక ఇంకను రెండువిధములను సయితము అన్యోన్యాశ్రయదోషము ప్రసక్తించును. ఎట్లన; జాతిమొదలగు ధర్మములతోఁ గూడియున్నట్టివస్తువును అదికానివస్తువును (తదితరమగు వేఱొకవస్తువును) తెలిసికొనుట చేతనుగదా ఆరెంటికిఁ గల భేదము తెలియ వచ్చుచున్నది. అయితే వానికిఁగల భేదమును తెలిసికొనుటచేతను గదా ఆరెండువస్తువులును తెలిసికొనఁబడును.

జాత్యాదిధర్మములను వానిని గలిగియుండువస్తువును దెలిసికొనుటచేతఁ గదా వానికిఁగల భేదము తెలియవచ్చును. భేదము తెలియుటచేతను గదా ఇవి దాని ధర్మములనియు ఇది అట్టిధర్మములతోగూడియున్నట్టి పదార్థమనియు ఇట్లు ధర్మములును ధర్మవిశిష్టమగు పదార్థమును తెలియవచ్చును? ఇట్లు అన్యోన్యాశ్రయదోషము [illegible] ప్రకారము యింముగ నఁబఱపఁబడినది.

వలనను ఈవాదమున [1]"అన్యోన్యాశ్రయ"దోషము గలదు. అందువలన భేదమనఁగా ఇట్టిది యని నిరూపించుట యశక్యము. కావున ప్రత్యక్ష జ్ఞానము సన్మాత్రమును అనఁగా సత్తను (ఉనికిని) మాత్రమే తెలియఁజేయుచున్నదనుట యుక్తము.

"ఘటము కలదు" "పటము (వస్త్రము) కలదు" "ఘటము అనుభవింపఁబడుచున్నది (తెలియ వచ్చుచున్నది)" "పటము (వస్త్రము) అనుభవింపఁబడుచున్నది" అనెడివ్యవహారమును బట్టి ఘటపటాది సమస్త పదార్థములును సత్త (ఉనికి) తోను [2]అనుభూతి (జ్ఞానము) తోను ఏర్పఱుపఁబడినవి గానే తెలియవచ్చుచున్నవి. ఇట్లు ఘటపటాదులను గుఱించిన సమస్తానుభవముల యందును సన్మా

అనువర్తమాన మగుట వలనసన్మాత్రమే పరమార్థమని నిరూపించుట.

---

(1) రెంటిలో నేది తెలియవలయునన్నను, ఏదిపుట్టవలయునన్నను, ఏది యుండవలయునన్నను ఒకదాని యపేక్ష మఱియొకటికిఁ గలిగియుండుట "అన్యోన్యాశ్రయము" అనఁబడును. ఇదియును తర్కసంబంధమయిన యొకదోషమే. ఇట్టిదోషముతోఁ గూడియున్నట్టి వాదము ప్రామాణికముగ నంగీకరింపఁబడదు.

(2) జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి యని జీవునికి అవస్థలు మూఁడుగలవు. బాహ్యేంద్రియ వ్యాపారముచే విషయజ్ఞానము గలదశ జాగ్రత్తు. బాహ్యేంద్రియవ్యాపారము లేకయే అంతఃకరణవ్యాపారముచే జాగ్రత్సంస్కారమువలన విషయములను ప్రత్యక్షీకరించుదశ స్వప్నము. బాహ్యేంద్రియాంతఃకరణ వ్యాపారములన్నియు నడుఁగగావిషయజ్ఞానమే లేనిదశ సుషుప్తి.

జాగ్రదవస్థ యందు ఘటపటాది పదార్థములు తెలియవచ్చు చున్నవి. అందువలన ఘటజ్ఞానమనియు పటజ్ఞానమనియు నిట్లు వానిని గుఱించిన జ్ఞానము కలదు. ఘటపటాది పదార్థములు ఒకదానికంటె నొకటి వేఱుగను, అనేకములుగను గన్పట్టుచున్నను జ్ఞానమను నది ఒక్కటిగను, ఒక్కవిధమయినది గను గన్పట్టు చున్నది.

అట్లే స్వప్నావస్థ యందును ఘట పటాది పదార్థములు తెలియ వచ్చుటచే నిట్టి జ్ఞానము అప్పుడును కలదు. జాగ్రదవస్థయందు తెలియ వచ్చునట్టి ఘట పటాది పదార్థములు ఎక్కువ కాలముండు నవి. స్వప్నావస్థ యందలి స్వప్నమెంత వఱకు ఉండునో, అంతవఱకుమాత్రమే ఆపదార్థము లుండును. ఇంతే యీ రెండవస్థలకుఁ గల భేదము.

ఇట్లు ఒక్కటియును, ఒక్కవిధమయి నదియునగు జ్ఞానము జాగ్రత్స్వప్నావస్థలయందే కాక సుషుప్త్యవస్థయందు సయితము కలదు. ఏలయన, నిద్రపోయిలేచిన వాఁడు, "సుఖముగ నిద్రించితిని నేనేమియు నెఱుఁగను" అని స్మరించుచున్నాఁడు. "నేనేమియు నెఱుంగను" అనియిట్లు అజ్ఞానము స్మరింపఁ బడుచున్నది. ఏదైన నొక వస్తువుయొక్క జ్ఞాన ముండిన పిదపఁ గదా దానిని గుఱించిన స్మరణము గలుగును. తన తల్లిని గుఱించిన జ్ఞానమున్న వానికిఁ గదా "ఈమె నాతల్లి" అనెడిస్మరణముగలుగును! కావున నప్పుడుఅజ్ఞానమునుగుఱించిన జ్ఞానము కలదు.

త్రమే (ఉనికియే) [1]అనువర్తమానముగ అనఁగా ఘటము దెలియవచ్చునపుడు

---

అందువలన జాగ్రత్స్వప్నావస్థలయందుండి యున్నట్టి జ్ఞానము సుషుప్త్యవస్థయందు సయితము ఉండునదిగ నిశ్చయింపఁబడుచున్నది.

కావున ఈమూఁడు అవస్థల యందును ఒక్కటియును ఒక్కవిధమయినదియునగు జ్ఞానము కలదు. ఈ జ్ఞానము ఈ యవస్థలు గలుగునట్టి యొక్క రోజునకే కాక రోజుల కొలఁదిని, వారముల కొలఁదిని, మాసముల కొలఁదిని, సంవత్సరముల కొలఁదిని, యుగముల కొలఁదిని, కల్పముల కొలఁదిని, ఉదయాస్తమయములు లేనిదియై యుండునది. ఇది "ఉండునట్టిది" కావున "సత్" అనఁబడుచున్నది. ఇది జ్ఞాన స్వరూపమయి నందున "చిత్"అనఁబడుచున్నది. ప్రతిమనుజుఁడును తానుండవలయుననుకొనునుగాని తాను లేకపోవలయు ననుకొనఁడు గదా! ఇందువలన అందఱికిని దీనియందు ప్రీతి గలదు. కావున నిది "ఆనందము" అనఁబడుచున్నది. ఇట్లు సచ్చిదానందమగు ఈ జ్ఞానమే అనుభవాత్మకమయి నందున "అనుభూతి" యనియును, సమ్యక్ = బాగుగ, వేత్తి = తెలిసికొనునది అను వ్యుత్పత్తిని బట్టి "సంవిత్" అనియును, "అతతి = సంతత భావేన జాగ్రిదాది సర్వాసు అవస్థాసు అనువర్తతే" అనఁగా జాగ్రదాది సర్వావస్థల యందును ఎల్లప్పుడు నుండునది యనెడి వ్యుత్పత్తిని బట్టి "ఆత్మ"యనియును శాస్త్రిమునందు వ్యవహరింపఁబడుచున్నది. ఇట్లు అద్వైతులు చెప్పుచున్నారు.

(1) సామాన్యముగ ననేక వస్తువులయందుండునది యగుట "అనువర్తమానము"అనఁబడును. ఉదాహరణము—హిరణ్యము (బంగారు) హిరణ్మయములగు (బంగారుతోఁ జేయఁబడినవగు) కంటె, కడియము, గొలుసు మొదలగు వానియందన్నింటను గలదు. కావున హిరణ్యము "అనువర్తమానము" అనఁబడుచున్నది.ఇట్లు సామాన్యముగ అనేక వస్తువులయందుండక ప్రతివస్తువు నందును మాఱునది"వ్యావర్తమానము"అనఁబడును. ఉదాహరణము—కంటెయొక్క నామరూపములు కంటెయందు మాత్రముండునవై (ఆకంటెనే చెఱిపి కడియముగఁ జేయించునప్పుడు కంటె యందుండు హిరణ్యమే కడియమునను గన్పట్టుచున్నను) కడియమున మాఱిపోవుచున్నవి. కనుక నామరూపములు వ్యావర్తమానము లనఁబడుచున్నవి.

హిరణ్యమువలె అనువర్తమానమయినది(మాఱకుండ నిలుకడగనుండునట్టిది)నిత్యమనియు,నామరూపములవలె వ్యావర్తమానమయినది (పదేపదే మాఱునది)నశ్వరమనియును శాస్త్రిజ్ఞులు నిశ్చయించుచున్నారు.

శ్లో॥ "అస్తిభాతి ప్రియంరూపం నామచేత్యంశపఞ్చకం। అద్యంత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతో ద్వయం॥". లోకమునందుండు ప్రతిపదార్థమును "ఘటము ఉన్నది" "పటముఉన్నది" అనియిట్లు "ఉన్నది" అని చెప్పఁబడుచున్నది కావున "సత్" అనఁబడుచున్నది. ప్రతిపదార్థము తెలియవచ్చునదిగాన "చిత్" అనఁబడుచున్నది. ప్రితి పదార్థము ఇష్టమయినదిగాన "ఆనందము" అనఁబడుచున్నది. ప్రతిపదార్థమునకును రూపమును నామమును గలవు. ఈ అయిదింటిలో సత్ చిత్ ఆనందములు ప్రతిపదార్థము నందును సమానముగఁ గలవు. కావున అవి అనువర్తమానములగుటచే నిత్యములగుచు బ్రహ్మము యొక్క రూపములనఁబడుచున్నవి. నామరూపములు ప్రతిపదార్థమునను మాఱునవి గనుక అవి వ్యావర్తమానములగుటచే అనిత్యములగుచు జగత్తుయొక్క రూపములనఁబడుచున్నవి. కావున "జగన్మిథ్యా బ్రహ్మ సత్యం" అని అన్నట్లు నామరూపాత్మకమై నశ్వరమగు జగత్తు మిథ్య (అసత్యము). సచ్చిదానందాత్మకమై నిత్యమగు బ్రహ్మమే పరమార్థము అని ఈపైని గనఁబఱచిననిర్ణయమును బట్టి యద్వైతులు చెప్పుచున్నారు.

పటాదులు తెలియరాకున్నను (ఘటమునందు పటాద్యాకారము లేకపోయినను) "ఘటముకలదు" "పటముకలదు" అని యిట్లు ఘటపటాది సమస్తపదార్థముల యందును సన్మాత్రము (ఉనికి) సర్వసాధారణముగనున్నదిగఁ గన్పట్టుచున్నందున, సన్మాత్రమే పరమార్థము(సత్యము). విశేషములు (ఇదిఘటము ఇది పటముఅనియిట్టిభేదములు)[1] వ్యావర్తమానములుగ—(ఘటము తెలియ వచ్చునప్పుడుఘటముయొక్క నామ రూపాదులు మాత్రమే తెలియవచ్చునవై ఘటేతరములగుపటాది పదార్థముల నామరూపాదు లన్నియు సర్వసాధారణముగ తెలియనివిగ)— గన్పట్టు చున్నందున అపరమార్థములు (అసత్యములు). ఎట్లనిన, చీఁకటివేళ భూమి మీఁదఁబడియున్న త్రాటిని గుఱించి "సర్పమా! భూమి పగులా! నీటిధారా! అని యివ్విధమున భ్రాంతి గలిగినప్పుడు దీపమును గొనివచ్చి పరిశీలింపఁగా సర్పభూదళనాదిరూపములగు భ్రాంతులకు అధిష్ఠానమగుటచే అనువర్తమానమగు త్రాడు మాత్రము పరమార్థముగను, వ్యావర్తమానములగుటంజేసి సర్పము భూదళనము మొదలగునవి అపరమార్థములు (అసత్యములు) గను దెలిసి కొనఁబడు చున్నవి గదా.

భాష్యకారులు:— చీఁకటి వేళ త్రాటినిగుఱించి భ్రమింపఁబడిన సర్పభూదళనాదులు దీపమును గొనివచ్చి పరిశీలించిచూచుటచేఁ గలుగు "ఇదిత్రాడు సర్పము కాదు" అనియిట్లు అధిష్ఠానమగు త్రాటినిగుఱించిన యథార్థజ్ఞానముచే బాధింపఁబడినందునఅపరమార్థములుగ(అసత్యములుగ)ఎన్నఁబడుచున్న వే గాని అవి వ్యావర్తమానములైనందున అసత్యములుగ ఎన్నఁ బడుచుండలేదే? అట్లే త్రాడును బాధింపఁబడకుండుటచే పరమార్థముగ (సత్యముగ) ఎన్నఁబడు చున్నదే గాని అనువర్తమానమగుటవలన నది యట్టిదిగ ఎన్నఁబడు చుండలేదే? ప్రకృతమున ఘటపటాదిపదార్థము లట్లు బాధింపఁబడు చుండలేదు కావున అవి అపరమార్థములని (అసత్యములని) యెట్లు జెప్పఁదగును?

అద్వైతి:— చెప్పెదను. ఘటపటాదిపదార్థములయందు గన్పట్టు వ్యావృత్తి(మాఱుట)ఎట్టిది?యని వివేచింపవలసి యున్నది. "ఘటము కలదు" అనఁగా పటాదిపదార్థములు లేవనియా? అట్లగుపక్షమున "ఘటము కలదు" అన్నమాత్రముచే పటాదిపదార్థములు బాధింపఁబడుట సిద్ధించును. కనుక ప్రకృతమున నిట్లుబాధింపఁబడుటయనెడివిషయనివృత్తియే వ్యావృత్తియనివిశదమగుచున్నది. ఇట్టివ్యావృత్తియే వ్యావర్తమానములగు పదార్థములుఅపరమార్థములు(అసత్య

(1). ౬౨-వ పత్రముయొక్క క్రింది భాగమున నియ్యబడిన ౧౧-వ వివరణమును చూడుము.

ములు)అని నిరూపించుచున్నది. రజ్జుసర్పదృష్టాంతమున రజ్జువు(త్రాడు)వలె సన్మాత్రము బాధింపఁబడనిదై అనువర్తించుచున్నది. కావున నట్టి సన్మాత్రమునకంటె వ్యతిరిక్తమయినదంతయును అపరమార్థము (అసత్యము). ఇందులకు అనుగుణముగ [1]ప్రయోగము సయితము (Syl'logistic Statement) గలదు. ఎట్లన;

ప్రతిజ్ఞ:—సన్మాత్రమే పరమార్థము.

హేతువు:—అనువర్తమానమగుట వలన.

ఉదాహరణము:—రజ్జుసర్పదృష్టాంతమున రజ్జువు పరమార్థముగ గన్పట్టుచున్నది గదా!

అటువలెనే,

ప్రతిజ్ఞ:—ఘటాదిపదార్థములు అపరమార్థములు.

హేతువు:—వ్యావర్తమానములగుట వలన.

ఉదాహరణము:—రజ్జువును (త్రాటిని) గుఱించి భ్రమింపఁబడిన సర్పాదులు అపరమార్థములుగఁ (అసత్యములుగఁ) గన్పట్టుచున్నవి గదా?

కనుక నిట్లు అనువర్తమానమగు అనుభూతియే పరమార్థము (సత్యము), ఆ యనుభూతియే సన్మాత్రమును.

భాష్యకారులు:— అనుభూతివలన సన్మాత్రము తెలియఁబడుచున్నది. కావున అది అనుభూతికి విషయ మయిన దగుచు అనుభూతికంటెను వేఱయినదిగఁ దెలియ వచ్చుచున్నది. అందువలన సన్మాత్రమునకును అనుభూతికిని భేదము గలదే?

అద్వైతి:—అది సరికాదు. ప్రత్యక్షప్రమాణమునకు గోచరము గానందునను, ఇట్టిది యని నిరూపింప నలవిగానందునను భేదమనునది ఒక్కటియును

(1) న్యాయశాస్త్రానుగుణమగు వాదమునకు తగిన వాక్యసందర్భము ప్రయోగమనఁబడును. ఇది ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము (ఉపమానము), నిగమనము అనెడిఅయిదు 'అవయవములు గలదని నైయాయికులు చెప్పుచున్నారు. ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, అనునవి మూఁడు మాత్రమే అవయవములని మీమాంసకులు చెప్పుచున్నారు. మఱికొందఱు హేతువు, ఉదాహరణము, ఉపనయమను యీ మూఁడు మాత్రము అవయవములని చెప్పుచున్నారు. ఉదాహరణము, ఉపనయము అనునవి రెండుమాత్రము అవయవములని బౌద్ధులు చెప్పుచున్నారు జిజ్ఞాసా, సంశయము, శక్యప్రాప్తి, ప్రయోజనము, సంశయవ్యుదాసమను నీయయిదింటితోఁ

లేనేలేదని యింతకుపూర్వము ప్రతిపాదింపఁబడియెఁగదా! అందువలన సన్మాత్రము [1]అనుభూతికి విషయభూతమయిన దనుటయును ప్రామాణికము గాదు. కావున సన్మాత్రమే అనుభూతి ; అనఁగా సన్మాత్రమన్నను [1]అనుభూతి యన్నను ఒక్కటియే. ఇట్టి [1]యనుభూతి స్వతస్సిద్ధమయినది (తనంతట తానే ప్రకాశించునది). ఇందులకు కారణము ఇది [1]అనుభూతియగుటయే. ఘట పటాది పదార్థములవలె అనుభూతియును వేఱొకదానినుండి సిద్ధించున దగు పక్షమున (వేఱొకదానిచేఁ బ్రకాశింపఁ జేయఁబడునట్టిది యగుపక్షమున) ఘట పటాదిపదార్థములు అనుభూతికానివి (జ్ఞానముకానివి) యగునట్లు ఇదియును అనుభూతికానిది (జ్ఞానముకానిది) యని ప్రసక్తించును. ఇంతియకాక అనుభూతి తనసత్త (ఉనికి) మాత్రము చేతనే ప్రకాశించునది యైనందున అది తన్ను ప్రకాశింపఁ జేయుటకై వేఱొక దానియపేక్షగలదియని కల్పించుకొనుటయును అశక్యము. ఏలయన:— [1]అనుభూతి తానుండియు ప్రకాశింపని (తెలియరాని) దగుపక్షమునఁగదా తాముండియు ప్రకాశింపని (తెలియరాని) ఘటపటాది పదార్థముల వలె నిదియును తన్ను ప్రకాశింపఁ జేయుటకై వేఱొకదాని నపేక్షించును? ఒకవేళ మీరిట్లుతలంచెదరా?—"అనుభూతి (జ్ఞానము) గలిగినను "ఇది ఘటము" అని యివ్విధమున విషయము (ఘటాదిపదార్థము) మాత్రమే ప్రకాశించు (తెలియవచ్చు) చున్నది. ఏలయన, ఎవ్వఁడును "ఇది ఘటము" అని తెలిసికొనుచు ఆ సమయముననే విషయము (ఘటాదిపదార్థము) కానిదియు, ఇట్టిదిగ తెలియంబడనిదియునగు అనుభూతిని (జ్ఞానమును) సయితము తెలిసికొనుచున్నట్లు గన్పట్టుచుండ లేదే! అందువలన—అనఁగా విషయము (ఘటాదిపదార్థము) మాత్రమే ప్రకాశించుచున్నందున, విషయమునకు ప్రకాశము గలుగుటకై, చక్షురాదీంద్రియసామీప్యమువలె, అనుభూతి యొక్క యునికియే హేతువు. [2]అనంతరము విషయమునందు స్థిరముగనుండక అప్పుడప్పుడు గలిగెడి ప్రకాశము

పదార్థముల యందుండెడి ప్రకాశమును బట్టి యనుభూతి అనుమానముచేఁ దెలుపఁడగినదని శంకించుట.

---

జేర్చి అవయవములు పదియని ప్రాచీనులగు నైయాయికులు చెప్పుచున్నారు.

(1) ౬౧ వ పత్రముయొక్క క్రింది భాగమున నియ్యఁబడిన ౨ వ వివరణమును చూడుము.

(2) ఎల్లప్పుడు నుండక అప్పుడప్పుడు మాత్రముండుట కార్యపదార్థముయొక్క స్వభావము. ఘటపటాదిపదార్థములకుఁగల ప్రకాశము (తెలియవచ్చుట) అనునవి వానికెల్లప్పుడు నుండు నది కాదు. కావున నది కార్యమనఁబడుచున్నది. కార్యపదార్థమెప్పుడు నొకదానిచేఁ గలుగఁ జేయఁబడునదియే కావున దానిని జూచిన తోడనే దానికిఁ గారణము (దానిని గలిగించు) అనుభూతి (జ్ఞానము) ఒకటి ఉండియుండవలయు ననెడి యూహ గలుగుచున్నది.

యొక్క యతిశయమును బట్టి అనుభూతి (జ్ఞానము)[1]అనుమానముచేఁ దెలుపఁ బడును."

ఇట్లైన పక్షమున అజడ మగు (జడపదార్థము కాని) [1]అనుభూతి విషయమువలెనే (మఱియొక దానిచే ప్రకాశింపఁబడునట్టి ఘటాది జడ పదార్థమువలెనే) జడము కావలసి వచ్చును ? అయినను మీరిట్లు తలంచెదరా ?—"అజడమగు అనుభూతి అనునప్పుడు అజడత్వము (జడము కానిది యగుట) అనఁగా నేమి? తనసత్త (ఉనికి) ప్రకాశమును (తెలియఁబడుటను) తప్పియుండక పోవుట యని చెప్పఁదగదు. ఏలయన, సుఖాదులు సయితము అట్లుండుట సంభవము. సుఖాదులుండియును తెలియఁబడక పోవుట యెన్నఁడును లేదు కదా! అజడత్వమనఁగా తనచేతనే తా ననుభవింపఁబడునదియగుటయని యును చెప్పఁదగదు. ఏలయన, ఇంతకుముందు గనఁబఱచిన హేతువులవలననే అనుభూతి స్వయముగానే అనుభవింపఁబడునది (తెలియఁబడునది)యును కాదు. వేఱొక వస్తువును స్పృశించెడు అంగుళ్యగ్రము (వ్రేలికొన) తన్ను గూడ స్పృశింపఁ గలదా?"

అజడత్వము నిరూపింపఁదగనిదనెడియాక్షేపమును అనువదించుట.

ఈపైని గనఁబఱుపఁ బడిన వాదమంతయును [1]అనుభూతియొక్క మహిమ నెఱుఁగనివారు తమకు తోఁచినట్లు కల్పించినదియే కాని వేఱొకటి కాదు. ఎట్లన, రూపము మొదలగునవి పదార్థముల ధర్మములుగఁ దెలియవచ్చునట్లు ప్రకాశముసయితము (తెలియఁ బడుటయును) ఏదైన నొక పదార్థముయొక్క ధర్మముగను, అనుభూతి కంటెను వేఱయినదిగను తెలియవచ్చుచుండ లేదే. మనము ఉభయులము అంగీకరించినట్టి [1] యనుభూతి (జ్ఞానము) వలననే సర్వవ్యవహారములును (సర్వపదార్థములను గుఱించిన జ్ఞానములును) గలుగుచుండఁగా అందులకై ప్రకాశమనఁబడు వేఱొకధర్మమును పదార్థములయందుండుదానినిగఁ గల్పించుకొనుట యుక్తము కాదు. కావున[1]అనుభూతి (జ్ఞానము) అనుమానముచేఁ దెలుపఁ దగినదికాదు. మఱియొక జ్ఞానమువలన సిద్ధించునది (తెలుపఁదగినది)యును కాదు. అయితే అది సర్వమును సిద్ధింపఁ జేయుచు తనకు తానే సిద్ధించుచున్నది.

ప్రకాశముపదార్థముల ధర్మముగ దెలియరానందున అనుభూతి యనుమానముచే దెలుపఁదగనిది. కావునది స్వతస్సిద్ధమయినదని నిరూపించుట.

---

ఇట్టి యూహయే అనుమానము. కావున అనుభూతి అనుమానముచే తెలుపఁదగినది.

([1]) ౬౧వ పత్రముయొక్క క్రిందిభాగమున నియ్యఁబడిన ౩వ వివరణమును చూడుము.

ఇందుల కనుగుణమగు ప్రయోగము "Syllogistic Statement" సయి తము కలదు. ఎట్లన,

ప్రతిజ్ఞ:—[1]అనుభూతి (జ్ఞానము) అన్యాధీనము గాని స్వధర్మవ్యవహార ము (తనధర్మముయొక్క వ్యవహారము) గలది. (తన యొక్క ధర్మములు ప్రకా శించుటకై వేఱొకదానిని అపేక్షింపనిది.)

హేతువు:—తన సంబంధమును బట్టి విషయమునందు (పదార్థము నందు) ధర్మముల వ్యవహారమునకు (ప్రకాశమునకు) హేతువగుటవలన.

ఉదాహరణము:—ఏది తనసంబంధమునుబట్టి పదార్థాంతరమున దాని ధర్మముల వ్యవహారమునకు హేతువగునో, అది, ఆరెంటిలోఁదన విషయమున పరాధీనత లేకయే కనఁబడుచున్నది. అనఁగా—తన సంబంధమైన ప్రకాశము నకై వేఱొకదాని యపేక్ష లేనిదిగానే కన్పట్టుచున్నది.

ఉపనయము (ఉపమానము):—రూపము మొదలగుగుణము పృథివి మొ దలగు దానియందు తనసంబంధమునలన చక్షుర్విషయమగుటను (నేత్రేంద్రియ ముచే తెలియఁబడుటను) గలుగఁజేయుచు తాను స్వయముగ చక్షుర్విషయమ నయిన దగుటలో రూపానులసంబంధము నపేక్షించి యుండునది కాదు గదా!

నిగమనము:—కాఁబట్టి [1]అనుభూతి(జ్ఞానము) తాను తెలియఁబడుటకును తెలియఁబడుచున్నది యనెడి వ్యవహారమునకును స్వయముగానే హేతువు అగుచున్నది.

ఇట్లు స్వయంప్రకాశమగు [1]అనుభూతి నిత్యమయినది. ఏలయన, దానికి [2]ప్రాగభావాదు లేవియును లేవు గదా! [1]అనుభూతి స్వతస్సిద్ధమైన దగుటను

---

(1) ౬౧వ పత్రముయొక్క క్రింది భాగమున నియ్యఁబడిన ౨ వ వివరణమును చూడుము.

(2) అభావమనఁగా లేకుండుట. ఏదైన నొక పదార్థము లేకుండుటను దాని అభావమం దురు. ఇది ప్రాగభావమనియు, ప్రధ్వంసాభావ మనియు, అన్యోన్యాభావ మనియు, అత్యంతా భావ మనియును నాలుగు విధములు గలదు. ఒక వస్తువు గలుగుటకు ముందు ఆవస్తువు లేక పోవుట ప్రాగభావ మనఁబడును. ఉదాహరణము—ఘటమును చేయుటకు పూర్వము ఘటము లేకుండుట దాని ప్రాగభావము అనఁగా ఘటము సృజింపఁబడుటకు ముందు అది లేనిది యగుట—ఈప్రాగ భావము ఇట్టి కాలము నుండి యుండునది యని చెప్పుట యశక్యముగాన అది అనాది (ఆదిలేనిది) యనఁబడుచున్నది. అయితే ఘటము సృజింపఁబడిన తోడనె దాని ప్రాగభావము పోవును; కాన ప్రాగభావమునకు అంతము మాత్రము కలదు.

ఏదైన నొక వస్తువు నశించిన పిదప నది లేకుండుట ప్రధ్వంసాభావ మనఁబడును ఉదాహరణము—ఘటము నశించుటచే నది లేక పోవుట దాని ప్రధ్వంసాభావము అనఁగా ఘటము నశించిన పిదప అది లేనిది యగుట—ఘటము నశించిన తోడనే దాని కిట్టి యభావము

బట్టియే దానికి ప్రాగభావాదులు సయితము లేవు. ఎట్లన, స్వతస్సిద్ధమగు అనుభూతియొక్క ప్రాగభావము తనంతటఁ గాని లేక మఱియొకదాని వలననుగాని తెలియశక్యము కాదు. అదెట్టులనిన, అనుభూతికి ఏదైన అభావము ఉన్నదంటిమేని ఆయభావమును అనుభూతి తానే స్వయముగఁ దెలుపుచున్నదా ? లేక అట్టి యభావము ప్రమాణాంతరములవలనఁ దెలియ వచ్చుచున్నదా? అనుభూతి తన యభావమును తానే స్వయముగఁ దెలియఁ బఱచు చున్నదను పక్షమున, అది తనయభావమును (తనలేమిని) తాను స్వయముగ ఉండునట్టిదై తెలియఁబఱచు చున్నదా? అది తాను స్వయముగ లేనిదై తన యభావమును (తనలేమిని) దెలియఁబఱచు చున్నదా?

అనుభూతి ప్రాగభావాదులు లేనిదగుటచే నిత్య మనుట.

[1]అనుభూతి తాను స్వయముగనున్నదై తనయభావమును దెలియఁబఱచుట అశక్యము. ఏలయన, అనుభూతి ఉండుటయును, లేకపోవుటయును ఏక కాలమున సంభవింపనేరవు. అట్లుండుట లోకవిరుద్ధము.

[1]అనుభూతి తానుస్వయముగలేనిదై తన యభావమును దెలియఁబఱచుటయును అశక్యము. ఏలయన, అనుభూతి తాను స్వయముగ లేనిదై తన యభావమును దెలియఁబఱచునది అనఁగా తన యభావమునకు ప్రమాణముగనుండునది కానేరదు. అట్లుండుటయును లోకవిరుద్ధము.

[1]అనుభూతియొక్క అభావము ప్రమాణాంతరమూలముగఁ దెలియవచ్చుచున్నదను పక్షమును యుక్తమయినది కాదు. ఏలయన, అనుభూతి ప్రమాణాంతర

---

గలుగుచున్నది గాన ఈ యభావమునకు అది కలదు. అదిమొదలు కొని యీ యభావము ఎప్పుడు నుండునది గాన దీనికి అంతము లేదు.

ఏవైన రెండు పదార్థములలో నొకదానియందు మఱియొకటి లేక పోవుట అన్యోన్యాభావ మనఁబడు చున్నది. ఉదాహరణము—"ఘటము పటము (వస్త్రము) కాదు, పటము ఘటము కాదు" అనునపుడు ఘటమునందు పటము లేకుండుటను, పటమునందు ఘటము లేకుండుటను తెలియవచ్చుచున్నది. ఇట్లుండుట వాని యన్యోన్యాభావ మనఁబడును.

ఏదైన నొక వస్తువు ఎన్నఁడును లేకుండుట అత్యంతాభావ మనఁబడుచున్నది. ఉదాహరణము—కుందేటికి కొమ్ము లెన్నఁడును లేవు. కావున నిది అత్యంతావభాను అనఁబడును.

(1) ౬౧ వ పుటయొక్క క్రింది భాగమున నియ్యఁబడిన ౩.వ వివరణమును చూడుము.

ములకు విషయభూతమయినది (గోచరమయినది) కాదు. ఇంతియకాక అనుభూతి యొక్క ప్రాగభావమును నిరూపించు (తెలియఁజేయు) ప్రమాణము "ఇది యను భూతి" అని యిట్లు అనుభూతిని నిర్దేశించి—అనఁగా విషయముగఁ జేసికొని, గదా అను భూతియొక్క ప్రాగభావమును నిరూపింపవలయును? అనుభూతి స్వతస్సిద్ధమయిన దగుటవలన తాను "ఇది యనుభూతి" అనియిట్లు ప్రమాణాంతరములచే నిర్దేశింపఁదగినది కాదు. కావున అనుభూతియొక్క ప్రాగభావమును ప్రమాణాంతరములచే నిరూపించుటయును అశక్యము.

అనుభూతికి ఉత్పత్తియును నానాత్వమును లేదనుట.

ఇట్లు అనుభూతికి ప్రాగభావము లేకుండుటచే దానికి ఉత్పత్తి (పుట్టుక) యుండుటయును అసంభవము. ఉత్పత్తియే లేనందున ఉత్పత్తినిబట్టి వచ్చు[1] భావవికారములును అనుభూతికి ఎట్లుండఁదగును? అనుభూతి పుట్టుక లేనిది యగుటంజేసియే దానియందు నానాత్వము (అనేకములుగ నుండుట) సయితము లేదు. ఏలయన, లోకమునం దెచటను అనేకములుగ నుండు పదార్థ మేదియును పుట్టుక లేనిదిగఁ గన్పట్టుచుండ లేదు. అందువలన అనుభూతికి నానాత్వముగల దంటివేని నానాత్వయుక్తములగు పదార్థములు ఉత్పత్తిగలవియే యనెడి న్యాయముతో విరోధము ప్రసక్తించును. భేదము, ఉత్పత్తి మొదలగునవి సయితము అనుభూతి యే కావున రూప రస గంధాదులు పృథివ్యాదిపదార్థముల ధర్మములయి నట్లు అవి అనుభూతియొక్క ధర్మములు కానేరవు. అనుభూతి స్వయముగ అనుభవ (జ్ఞాన) స్వరూపమైన దగుటవలన అనుభవ విషయమగునది (అనుభవింపఁ దగినది = తెలియఁ దగినది) ఏదియును అనుభూతి యొక్క ధర్మము కాఁదగదు. ఇట్టి యనుభూతి [2]సజాతీయ స్వగత భేదము లేవియును లేనిదికావున దీనికంటె వేఱుగ జ్ఞాత (ఎఱుఁగునది) యనునది యొక్కటియు లేదు. అందువలన స్వయంప్రకాశరూపమగునట్టి యీయనుభూతియే ఆత్మ. ఏలయన, ఇది జడముకానిది. ఆత్మకాని పదార్థములయందుండు (జడపదార్థములకుండు) జడత్వము ఆత్మయగునట్టి యీయనుభూతియందు లేనిదై అనాత్మత్వము (ఆత్మకానిదియగుట=జడత్వము) సయితము అనుభూతికి లేదని తెలియఁజేయుచున్నది.

---

(1) భావవికారములు = వస్తువులు పొందునట్టి మార్పులు. పుట్టుక, ఉనికి, విపరిణామము (ఒకవిధమైనమార్పు), వృద్ధి, క్షయము, నాశము అనియిట్టి క్రమముతోఁగూడిన భావవికారములు ఆఱని యాస్కాచార్యులవారు నిరుక్తమనఁబడు వేదనిఘంటుభాష్యమున వ్రాసియున్నారు.

(2) ౧౧ వ పత్రము యొక్క క్రింది భాగమున వ్రాయఁబడిన ౨ వ వివరణము చూడుము.

భాష్యకారులు:—"నేను తెలిసికొనుచున్నాను" అనియిట్లు జ్ఞాతృత్వము (ఎఱుఁగునది అగుట) ఆత్మధర్మముగ అనుభవమున గన్పట్టుచున్నదే?

అద్వైతి:—అది యుక్తముకాదు. శుక్తికను (ముత్యపుచిప్పను) రజతమనుకొనుట [1]భ్రాంతిసిద్ధమగు చందమున అనుభూతిని జ్ఞాతనుగ (ఎఱుఁగు దానినిగ) అనుకొనుటయును భ్రాంతిసిద్ధమే. ఏల యన, ఆత్మకు కర్తృత్వము (తెలిసికొనుటయనెడి కార్యమునకు కర్తయగుట) అసంభవము. "నేను మనుష్యుఁడను" అనియిట్లు బాహ్యపదార్థమగు శరీరమునందు ఆత్మాభిమానమువలె జ్ఞాతృత్వమును ఆత్మయందారోపితము. ఎట్లన, తెలిసికొనుట యనెడి కార్యమునకు కర్తయగుటగదా జ్ఞాతృత్వమనునది! అది వికారమును (మార్పును) పొందునదియు, జడమయినదియును కావున మార్పును పొందునట్టిదియగు [2]అహంకారమునం దుండఁదగినది. ఇట్లుండఁగా నది వికారమును

భ్రాంతివశమున జ్ఞాతృత్వ కర్తృత్వాదులాత్మయం దారోపింపఁబడినవి యనుట.

[1] భ్రాంతిసిద్ధము = భ్రాంతివలనఁ దెలియవచ్చునది. జ్ఞానము యథార్థము, అయథార్థము అని రెండువిధములు. ఆయాగుణములు గల దానియం దాయాగుణములు గలవనెడి జ్ఞానము అనఁగా రజతమందు రజతజ్ఞానము యథార్థము. ఆయాగుణములు లేని దానియం దాయాగుణములు గలవనెడి జ్ఞానము అనఁగా శుక్తికయందు రజత జ్ఞానము అయథార్థము. ఇదియే భ్రాంతిజ్ఞానమనఁబడుచున్నది.

[2]"అహం" (నేను)అనెడి యభిమానమున కాశ్రయమయిన అన్తఃకరణమే అహంకారము. ఎట్లన, కాలువ మూలముగా వెడలి కయ్యయందుఁజొచ్చిన చెఱువునీరు మహాకాశ ప్రతిబింబముతోఁగూడినకయ్యరూపముననే పరిణమించునట్లు దేహములోని యంతఃకరణము ఇంద్రియముల ద్వారా వెడలి ఘటము మొదలయిన విషయములందు చోటునుబొంది అంతటను జ్ఞానస్వరూపమై యున్నయాత్మయొక్క ప్రతిబింబముతోఁగూడిన ఆఘటాది విషయరూపములుగాఁ బరిణమించును. ఈ పరిణామమే వృత్తియనఁబడును. సంశయమనియు, నిశ్చయమనియు, గర్వమనియు, స్మరణమనియును అంతఃకరణమున కిట్టివృత్తులు నాలుగుగలవు. ఈవిధమగు వృత్తిభేదమునుబట్టి అంతఃకరణము మనస్సు అనియు, బుద్ధి యనియు, అహంకారమనియు, చిత్తమనియును నాలుగు విధములుగలది. ఇట్లు అహంకారమనఁబడు వృత్తితోఁగూడియున్నట్టి అంతఃకరణము యొక్క ధర్మములను భ్రాంతివశమున ఆత్మయందారోపించుటచే "నేను తెలిసికొనుచున్నాను" "నేను చేయుచున్నాను" అనియిట్లు జ్ఞాతృత్వ కర్తృత్వాదులాత్మ ధర్మములుగ భ్రమింపఁబడుచున్నవియేకాని వాస్తవమున కవి ఆత్మయొక్క స్వాభావికములగు ధర్మములు కావు. ఎట్లన, అగ్నిలోఁ గాల్పఁబడిన అయఃపిండముయొక్క (ఇనుపగుండుయొక్క) సంపర్కమువలన వస్త్రము మొదలయినది తగులఁబడునప్పుడు "అయఃపిండము కాల్చుచున్నది" అనియిట్లు వ్యవహరించుచున్నాము గదా. వాస్తవమునకు దగ్ధృత్వము (కాల్చునదియగుట) అయఃపిండముది గాకున్నను అగ్నిసంపర్కమున నదిఅయఃపిండమున నారోపింపఁబడునట్లు జ్ఞాతృత్వకర్తృత్వాదులును ఆత్మయందారోపింపఁబడినవి యని యిట్లు అద్వైతులు చెప్పుచున్నారు.

పొందనట్టియు, సాక్షిభూతమయినట్టియు, చిన్మాత్రమగు నాత్మయం దెట్లుండఁ దగును? అన్యాధీన ప్రకాశములు (వేఱొక దానిచేత ప్రకాశింపఁజేయఁదగినవి) అయినందున రూపరసాదు లాత్మ ధర్మములు కానట్లు కర్తృత్వాదులును ఆత్మ ధర్మములుకావు. "అహం" (నేను) అనుదానిచే ఆత్మ తెలుపఁబడునది—అనఁగా "అహం" (నేను)అనునదియాత్మకాదు.ఏలయన,[1]సుషుప్తి మూర్ఛాద్యవస్థలయందు"అహం"(నేను)అనెడియనుభవము(జ్ఞానము) లేకున్నను ఆత్మానుభవముకలదుగదా!కర్తృత్వమును,"అహం"(నేను)అనుదానిచే తెలియఁజేయబడుటయునుఆత్మ యొక్క ధర్మములనెడి పక్షమున, జడత్వము పరాక్త్వము (బాహ్యపదార్థ మగుట) అనాత్మత్వము (ఆత్మకానిదియగుట = జడమగుట) యీ మొదలగునవి దేహముయొక్కవలె ఆత్మయొక్కయును ధర్మములని అనివార్యముగ ప్రసక్తించును."అహం"(నేను)అనుదానిచే తెలియఁబడునట్టి కర్తగాను ప్రసిద్ధమైనట్టి శరీరమునకంటె నట్టి శరీరసంబంధములగు కర్మములయొక్క ఫలభూతములగు స్వర్గాదుల ననుభవించునట్టి యాత్మను వేఱుగ ప్రామాణికులెఱుంగుచుండుట ప్రసిద్ధమే కదా! అటులే "అహం"(నేను)అనెడి జ్ఞాత(తెలిసికొనువాని) కంటెను సాక్షిభూతమగు ప్రత్యగాత్మ విలక్షణమైన దని (వేఱయినదని) యెఱుంగుము.

అహంకారము జడమైనను మార్పునొందనిదియును అనుభవ (జ్ఞాన) స్వరూపమైనదియు నగు ఆత్మను తనయందున్నట్లు ప్రకాశింపఁజేయుచున్నది.లోకమునందును అభివ్యంజకములగు (దేనినయిన ప్రకాశింపఁజేయునట్టి ) పదార్థములు తాము ప్రకాశింపఁజేయు పదార్థములను తమయందుండ వానినిగానే ప్రకాశింపఁజేయుట వానికి స్వభావము. దర్పణము, జలము, మృత్తిక మొదలగునవి ముఖము,చంద్రబింబము, గోస్వరూపము మొదలగువానిని తమయందున్నట్లు ప్రకాశింపఁజేయునవిగఁ గన్పట్టుచుండ లేదా? కావున అట్టి యహంకార మూలముగ "నేను తెలిసికొనుచున్నాను" అనియిట్లు తెలియవచ్చుచున్నది. అందువలన నది భ్రాంతిమాత్రము.

అహంకారము ఆత్మను ప్రకాశింపఁ జేయునది యనుట.

భాష్యకారులు:—స్వయం ప్రకాశమయినట్టి యనుభూతిచే (ఆత్మచే) జడరూపమగుఅహంకారము ప్రకాశింపఁజేయఁబడఁ దగినది కదా? ఇట్లుండ నట్టి యహంకారముచే అనుభూతి ప్రకాశింపఁజేయఁ బడుట ఎట్లు సంభవము?

(1) ౬౧వ పత్రముయొక్క క్రిందిభాగమున నియ్యఁబడిన ౨వ వివరణమునుచూడుము

అద్వైతి:—ఇట్లు మీరడుగఁబనిలేదే? సూర్యకిరణములచే ప్రకాశింపఁదగినట్టి కరతలము (అఱచేయి) అట్టి సూర్యకిరణములను ప్రకాశింపఁజేయుచున్నట్లు మనము చూచుచుండలేదా? గవాక్షరంధ్రములద్వారా ప్రసరించునట్టి సూర్యకిరణములు తమచే ప్రకాశింపఁ జేయఁదగిన కరతలముచే ప్రకాశింపఁబడునట్లు మనము చూచుచున్నామే? కావున "నేను తెలిసికొనుచున్నాను" అనియిట్లు జ్ఞాతగఁ (దెలిసికొనునదిగఁ) దెలియవచ్చు "అహం" అనునది చిన్మాత్రమగు (కేవల జ్ఞానమాత్ర స్వరూపమగు) ఆత్మయొక్క పారమార్థికమగు (స్వాభావికమగు) ధర్మము కాదు. కనుకనే "అహం" అనునది [1]సుషుప్త్యవస్థయందును [2]మోక్షావస్థయందును అనువర్తింపదు. ఏలయన, సుషుప్తిమోక్షావస్థలయందు "అహం" అనెడి యహంకారము పోవుటచే నప్పుడు స్వాభావికమగు జ్ఞానమాత్రస్వరూపముతో ఆత్మ ప్రకాశించుచున్నది. కాఁబట్టియే నిద్రపోయి లేచిన మనుజుఁడు ఒకప్పుడు "నన్నుఁగూడ నేనెఱుంగను" అని చెప్పుచున్నాఁడు.

అహంకారము ఆత్మను ప్రకాశింపజేయఁ దగిన దనుటకుఁ ఉదాహరణము గనఁబఱచుట.

ఇట్లు నిరస్త (పోఁగొట్టఁబడిన) జ్ఞాతృ (తెలిసికొనునది) జ్ఞేయాది (తెలియఁబడునది మొదలగు) సమస్తములగు భేదవికల్పములు గలదియు, నిర్విశేషమయినట్టిదియు (స్వగత నిత్యత్వాది భేదములు లేనట్టిదియు) చిన్మాత్రైకరసమై (జ్ఞానమాత్ర స్వరూపమై) నట్టిదియు కూటస్థమైనదై (వికారమును పొందనిదై) నిత్యమగు సంవిత్తు అనఁగా అనుభూతియే "జ్ఞాత" అనియు "జ్ఞేయము" అనియు "జ్ఞానము" అనియు నిట్లు నానావిధములుగలదిగ భ్రమింపఁబడుచున్నది. ఇట్లు భ్రాంతివలనఁగలిగి నట్టియవిద్యనుబోఁగొట్టుటకై [3]నిత్య బుద్ధ ముక్త స్వభావమగు బ్రహ్మమేయాత్మ (జీవుడు) అనెడి జ్ఞానము—అనఁగా బ్రహ్మాత్మైక్య జ్ఞానము—గలుగుటకుఁ గాను వేదాంత విచారము ఆరంభింపఁ దగినది.

మహాపూర్వపక్షము యొక్క సారాంశము నుముగియికయును.

---

(౧) ౭౧వ పత్రము యొక్క క్రింది భాగమున నియ్యఁబడిన ౨వ వివరణమును చూడుము.

(౨) అవిద్యచే జీవుఁడు తన్ను బ్రహ్మము కంటె వేఱుగా భ్రమించుట యనెడి భేదజ్ఞానమును గలిగియుండుటయే సంసారము. అట్టి భేదజ్ఞానరూపమగు సంసారము "తత్త్వమసి" ఇత్యాది వాక్యజన్యజ్ఞానముచే వాసనతోఁగూడ నివర్తింపఁగా "స్వేనరూపేణ అభినిష్పద్యతే" అన్నట్టు అఖండాద్వితీయ సచ్చిదానందస్వరూపమగు స్వస్వరూపముతో నుండుట అనఁగా "బ్రహ్మవేద బ్రహ్మైవభవతి" అన్నట్లు అట్టి బ్రహ్మమే యగుట మోక్షమనఁబడును. ఇట్టి దశయందు "తాను" అనియు "ఇతరుఁడు" అని యి నిట్టి భేదజ్ఞానము బొత్తుగలేదు; కావునసప్పుడు అహంకారము అనువర్తింపదు అని అద్వైతులు చెప్పుచున్నారు.

(3) ౭౩వ పత్రిమునందలి ౧౨. ౧౩. పంక్తులలో వీని యర్థము వివరింపఁబడినది.

## మహాసిద్ధాంతము

☞ [ఈమహాసిద్ధాంతప్రకరణమున ఆచార్యులవారు పూర్వపక్షమునందలి యంశములను ఒక్కొక్కటిని వరుసగా స్వీకరించి విమర్శించియున్నారు. సిద్ధాంతమున వ్రాయఁబడిన విమర్శ యేయంశమునకు సంబంధించినదో సూచించుటకుఁగాను ఆయాఘట్టములకెదురుగ పూర్వపక్షభాగమునకు చెందిన పుటసంఖ్యయు పంక్తిసంఖ్యయునిచ్చియున్నాను. చదువరులు సమన్వయముచేసికొని పూర్వాపరంబు లెఱుంగుట కిదితోడగునుగాక].

అద్వైతులవాదము కుయుక్తులచే కల్పింపఁబడినదనుట.

భాష్యకారులు:—ఈపైనిగనఁబఱపఁబడినవాదము, ఉపనిషత్తులయందు ప్రతిపాదింపఁబడు పరమపురుషునిచే పేటింపఁబడుటకు హేతుభూతములగుగుణవిశేషములులేనివారును, అనాదిగవచ్చుచున్నట్టి పాపవాసనచే సంపూర్ణముగా మనస్సు చెడినవారును [1]పదములయొక్కయు [2]వాక్యములయొక్కయును స్వరూపములను గుఱించినట్టియు వానియర్థములను గుఱించినట్టియును యథార్థస్థితిని గుర్తెఱుంగనివారును, ప్రత్యక్షముమున్నగుసర్వప్రమాణములయొక్క స్వభావసామగ్రులనెఱిఁగి యుండుటయనెడి మంచిన్యాయమార్గములేనివారును అగువారిచే ఇట్లా? అట్లా? అనెడి వికల్పములకునిలువలేని యనేకవిధములగు కుయుక్తులచేఁ గల్పింపఁబడినది. కావున నిది న్యాయముననుసరించిన ప్రత్యక్షాది ప్రమాణముల యథార్థస్థితి నెఱింగినవారిచే నాదరింపఁ దగినది కాదు. అది యెట్లన్నను;

(౨౮.పు.౧౮. పం.) నిర్విశేష (విశేషములేవియును లేని) వస్తువును ప్రతిపాదించువారు అట్టివస్తువును ప్రతిపాదించునట్టి [3]ప్రమాణమిదియని చెప్ప

---

(1) "సుప్" మొదలగుప్రత్యయములతోఁగాని "తిఙ్" మొదలగుప్రత్యయములతోఁ గాని గూడియున్నప్రకృతిని పదమందురు.

(2) పదపదార్థములయొక్క పరస్పరసంబంధము చెడకయే ఏకార్థత్వము గలిగి క్రియతోడఁగాని తదితరముతోడఁగాని ముగిసెడి పదసముదాయము వాక్యమనఁబడును.

(3) పదార్థ సమూహమెల్ల ప్రమాణము. ప్రమేయము అని ద్వివిధము, ప్రమేయములనఁగా తెలియఁదగినవి- తెలివికి విషయములయినవి యనుట. వానిని యథార్థస్వరూపమునఁ దెలియుటకు సాధనములైనవియే ప్రమాణములు. ఎట్లన- సర్వవ్యవహారహేతువైన జ్ఞానము బుద్ధి యనఁబడును. అదిస్మృతి, అనుభవము అని ద్వివిధము. సంస్కారమాత్రజన్యమైన జ్ఞానము స్మృతి. తదితరమైనజ్ఞానము అనుభవము. ఈ యనుభవము యథార్థము అయథార్థము అని రెండువిధములు. ఆయాగుణ

సేరకున్నారు. ఏలయన, అన్ని ప్రమాణములును ఏవైన విశేషములతోఁగూడి యున్న వస్తువును మాత్రమే నిరూపించునవి. ఒకవేళ నతఁడు ఆనిర్విశేషవస్తువు తన యనుభవమువలన సిద్ధించుచున్నదనుచు తన సిద్ధాంతమునఁజెప్పుకొనుపక్షమున నట్లు తనయాత్మకు తెలియవచ్చుటయు నొక్క విశేషమే కదా!

నిర్విశేషవస్తువు ఏ ప్రమాణము చేతను నిరూపింపఁదగినది కాదనుట.

కావున అతఁడు చెప్పునదియుక్తమైనది కాదు మఱియు "దీనిని (ఇట్టి వస్తువును) నేను చూచి (తెలిసికొని) యుంటిని" అనియిట్లు సమస్తానుభవములును (సర్వజ్ఞానములును) ఏదైన నొకవిశేషముతోఁగూడియున్నట్టి వస్తువును గుఱించినవిగానే కన్పట్టుచున్నవి. ఒకవేళ అతఁడు విశేషములతోఁ గూడియున్నదిగానే యనుభవింపఁబడునట్టి యనుభవమును (జ్ఞానమును) ఏదైననొక కుయుక్తిచేత నిర్విశేషమని (విశేషము లేవియును లేనిదని) నిరూపించుపక్షమున సత్తావ్యతిరిక్తములుగ దానియందే యుండునవియగు ఏవైన స్వభావ విశేషములనుబట్టియేకదా అట్లు నిరూపింపవలయును? అట్లైన నతఁడు అట్లు నిరూపించుటకు సాధనములగు ఆవిశేషములనుబట్టి ఆవస్తువును సవిశేషము (విశేషములతోఁగూడినది) గానే సిద్ధించును. ఎల్లయెడలను కొన్ని విశేషములతోఁగూడియున్నట్టి వస్తువును జేరినవే యగు మఱికొన్ని విశేషములు నిరసింపఁబడును. కావున ఎచ్చటను నిర్విశేషమగు (విశేషము లేవియును లేని) వస్తువు సిద్ధింపనే సిద్ధింపదు. తెలిసికొనువానికి విషయములను (ఘటాది పదార్థములను) తెలియఁజేయుట యనెడి స్వభావవిశేషము గలదియగుటచేతనే కదా బుద్ధి (తెలివి) ఇతరవస్తువులను ప్రకాశింపజేయునదిగాను తనంతట తాను ప్రకాశించునదిగాను సిద్ధించుచున్నది (౬౬-పు. ౨౭-పం.) స్వప్నావస్థయందును, మత్తెక్కినప్పుడును, మూర్ఛనొందునప్పుడును జ్ఞానము సవిశేషము గానే (విశేషములతోఁగూడినదిగానే) తెలియవచ్చుచున్నది యనివానివానిగుఱించిన సందర్భము గలుగునప్పుడు బాగుగ ఉపపాదింపఁబోవుచున్నారము. ఇంతయేల? వారంగీకరించిన నిత్యత్వమున్నగు విశేషములే అనేకములు కలవే? అవియును వస్తుమాత్రమేయని నిరూపించుట వారితరము కాదు. ఒకవేళ అవియును వస్తుమాత్రమేయని అంగీకరించుపక్షమునను అట్టివస్తువు ఉండునట్టివిధములను గుఱించి పరస్పరవిరుద్ధములగు అనేకాభిప్రాయములు గన్పట్టుచున్నవి. ఒక్కొక్కఁడును తనమతమునకను

---

ములుగలదానియందాయాగుణములు గలవనెడి యనుభవము అనఁగా రజతమందు రజతమనెడి జ్ఞానము యథార్థము. ఇదియే ప్రమ యనఁబడును. అట్టి ప్రమకు గరణములయినవి (సాధనములయినవి) ప్రమాణములనఁబడును. అట్టి ప్రమాణములు పెక్కుగలవుగాని వానిలో ప్రత్యక్షము, అనుమానము, శబ్దము, ఉపమానము అనునవి మాత్రమే ముఖ్యములు.

గుణములగు విధములచేత నే తనమతమును ప్రతిపాదించుకొనుచున్నాఁడు. కావున ప్రమాణ సిద్ధములగు విశేషములతోఁ గూడియున్నదియే వస్తువని చెప్పవలసి యుండును.

శబ్ద (వేద) ప్రమాణము నిర్విశేష వస్తువును నిరూపింప నేరదనుట.

[1]శబ్దప్రమాణము(వేదము) తలుచుగ సవిశేష (విశేషములతోఁ గూడి యున్నట్టి) వస్తువును తెలియఁజేయుటయందు మాత్రమే సామర్థ్యము కలదిగాఁ గన్పట్టుచున్నది. ఏలయన, శబ్దప్రమాణము పదములతోను వాక్యములతోను గూడియుండునది. ప్రకృతియును (ధాతువు) న్బప్రత్యయములునుఒక్కటిగఁ జేరుటచేతం గదా పదమగును. ప్రకృతికియొక్కయు ప్రత్యయము యొక్కయును అర్థములకు భేదముండుటను బట్టి పదములును భేదములతోఁగూడిన యర్థము నే తప్పక ప్రతిపాదించును. పదములకు భేదమున్నట్లయిన అర్థములకును భేదము తప్పక యుండును. పదముల యొక్క సముదాయమే కదా వాక్యమనునది! అనేక పదముల యర్థములకు పరస్పర సంబంధమును దెలియఁజేయునది యగుటచే వాక్యము సయితము నిర్విశేష (విశేషము లెంతమాత్రము లేని)వస్తువును తెలియఁజేయునట్టి సామర్థ్యము గలది కాదు. కావున శబ్దము (వేదము)నిర్విశేష (విశేషము లేనియును లేని) వస్తువును తెలియఁజేయుటను గుఱించిన ప్రమాణము కాఁదగదు.

ప్రత్యక్షప్రమాణము నిర్విశేషవస్తువును నిరూపింప నేరదనుట.

"నిర్వికల్పక ప్రత్యక్షము" అనియు "సవికల్పక ప్రత్యక్షము"అనియునిట్లు రెండు తెఱుంగులు గల [2]ప్రత్యక్షప్రమాణము సయితము నిర్విశేషవస్తువును తెలియఁజేయ నేరదు. ఏలయన, ఆ రెంటిలో సవికల్పక ప్రత్యక్షము జాతి మొదలగు అనేక పదార్థములతోఁగూడియున్నట్టి దానిని తెలియఁజేయునది యగుటవలన అది సవిశేష(విశేషముల

(1) శాబ్దమునకుఁ గరణమైనది శబ్దము. ఎట్లన, యథార్థమును జెప్పువాఁడాప్తుఁడు. పదసమూహము వాక్యము. ఆప్తవాక్యము శబ్దమనఁబడును. శాబ్దమనఁగా వాక్యార్థజ్ఞానము. ఇట్టి శాబ్దజ్ఞానమునకుఁ గరణమైనది శబ్దము. కనుక నదియే శబ్దప్రమాణ మనఁబడును.

(2) ఇంద్రియములకును విషయములకును గలుగు సంబంధముచే పుట్టునట్టి తెలివి(జ్ఞానము) ప్రత్యక్షము. ఇట్టి ప్రత్యక్షజ్ఞానమునకుఁ గరణమైనది (అనఁగా కలిగించునది) ప్రత్యక్షప్రమాణము. అట్టి కరణము ఇంద్రియమే కనుక నదియే ప్రత్యక్షప్రమాణము. చక్షుస్సు, త్వక్కు, శ్రవణము, రసనము, ఘ్రాణము, మనస్సు అనునింద్రియము లాఱింటినిబట్టి, చాక్షుషము, త్వాచము, శ్రావణము రాసనము, ఘ్రాణము, మానసము అని ప్రత్యక్ష మాఱువిధములైయున్నది. మనస్సు వ్యవహార సౌకర్యముకొఱకు ఊహాకల్పితమైన నామమాత్రమే కాని నిజముగానుండు నొక వస్తువు గాదని యితరదేశీయులు కొందఱి యభిప్రాయము. అది నిజముగానుండు నొక యింద్రియమని యిచటి తత్త్వశాస్త్రకారుల మతము.

తోఁ గూడియున్నట్టి) పదార్థమునే తెలియఁజేయునది. నిర్వికల్పకప్రత్యక్షము సయితము అట్టిదియే. ఎట్లన, నిర్వికల్పక ప్రత్యక్షముచే తెలుపఁబడిన పదార్థమే కదా సవికల్పకప్రత్యక్షమమూలముగ అనేక విశేషములతోఁగూడి యున్నదిగ గుర్తింపఁ బడుచున్నది! నిర్వికల్పకము(విశేషములు లేనిది)అనఁగా ఏదైన నొక విశేషము లేనిది యని యర్థము గాని బొత్తుగ విశేషము లేవియును లేనిది యని యర్థము కాదు. అట్లు బొత్తుగ విశేషము లేవియును లేనట్టి పదార్థము తెలియఁ బడునదిగ నెన్నడును గన్పట్టుచుండలేదు. మఱియు అట్టిపదార్థము తెలియవచ్చుటయును అసంభవము. "ఈ పదార్థము ఇట్టిది ఈ పదార్థము ఇట్టిది"అని యిట్లు ఏదైన నొక విశేషముతోఁ గూడియున్నవిగానే కదా మనకు సమస్త పదార్థములును తెలియవచ్చుచున్నవి. ఎట్లన, (ముఖము) మూఁడుకోణములు గలది అనియు సాస్న (మెడక్రింద వ్రేలాడు చర్మము) గలది అనియు నివ్విధమున ఆకార విశేషములు తెలియఁబడకయే వస్తువు మాత్రము (గోవుమాత్రము) తెలియఁ బడదు.

కావున ఒక్క జాతిలోనే చేరిన పదార్థములలో మొట్టమొదట నొక్కపదార్థమును దెలిసికొనుట "నిర్వికల్పకప్రత్యక్షము"అనఁబడును. అనంతరము ఆజాతిలోనే చేరినట్టి రెండు మూఁడుపదార్థములను దెలిసికొనుట "సవికల్పక ప్రత్యక్షము" అనఁబడును. అదెట్టులనిన, మొట్టమొదట నొక్కగోవునుమాత్రమే తెలిసికొనినవానికి ప్రతిగోవును ఇట్టియాకారముగలది గానే యుండు ననెడి జ్ఞానము కలుగదు. రెండవ గోవును మూఁడవగోవును తెలిసికొనినప్పుడు(చూచినప్పుడు) మాత్రమే అట్టి జ్ఞానము గలుగును. గోవు మొదలగు వానిలో నొక్కదానిని గుఱించిన మొట్టమొదటి జ్ఞానమునఁ దెలియఁబడిన వస్తుసంస్థానరూపమైన (వస్త్వాకారరూపమైన) గోత్వము మొదలగునది (ఆయాజాతిలోనే చేరిన యన్నింటియందును) అనువృత్తిని గలిగి యుండుననుట (ఆయాజాతిలోనే చేరిన) రెండవది మూఁడవది మొదలగు వస్తువులను తెలిసికొనుటచేతనే(చూచుటచేతనే) నిశ్చయింపఁదగినది. కావున రెండవదిమూఁడవది మొదలగు వస్తువులనుగుఱించిన జ్ఞానము సవికల్పకమనఁబడుచున్నది. సాస్న (మెడక్రింద వ్రేలాడు చర్మము) మొదలగు వస్తువులసంస్థానమగు (సన్నివేశమగు) గోత్వము (గోజాతి) మొదలగునది(ఆయాజాతిలోఁజేరిన యన్ని పదార్థముల యందును)అనువర్తించు

నిర్వికల్పక సవికల్పక ప్రత్యక్షములస్వరూపములను నిరూపించుట.

నదియని మొదట నొక్కవస్తువును (ఆయాజాతిలోఁ జేరిన గోవు మొదలగు నొక్క పదార్థమునుమాత్రమే) తెలిసికొనినంత మాత్రముచే తెలియంబడక పోవుట వలన మొదట తెలియఁబడిన అయొక్కవస్తువును గుఱించిన జ్ఞానము నిర్వికల్పకమనఁ బడుచున్నదే కాని సంస్థాన రూపములగు (వస్తువుయొక్క ఆకారభూతములగు)జాతిమొదలగునవి అప్పుడు తెలియఁబడక పోవుటచే ఆజ్ఞానము నిర్వికల్పకమని చెప్పఁబడుచుండ లేదు. ఏలయన, సంస్థానరూపములగు(వస్తువుయొక్క ఆకారములగు) జాతిమొదలగునవి సయితము ఇంద్రియవిషయములైనవియే కదా! మఱియు సంస్థానము (వస్త్వాకారము) తెలియఁబడక సంస్థాని (ఆకారముగల వస్తువు) మాత్రమే యెట్లు తెలియఁ బడును? అది యసంభవము. కావున మొట్టమొదట ఒక్కవస్తువును తెలిసి కొనునప్పుడును ఆవస్తువుయొక్క సంస్థానమే (ఆకారమే) "ఇది యిట్టిది" అనియిట్లు తెలియఁబడుచున్నది. కావున రెండవది మూఁడవది మొదలగు వస్తువులను తెలిసికొనునప్పుడు సంస్థానియు (ఆకారవిశిష్టమగువస్తువును) అట్టి యాకారమును తెలియవచ్చునట్లు గోత్వము మొదలగు సంస్థానము (ఆకారము)సయితము (ఆయాజాతిలోఁ జేరిన వాని యన్నింటియందును అనువర్తమానముగ) ఎల్లప్పుడును తెలియవచ్చుచున్నందున దానిని గుఱించిన జ్ఞానము సవిశేషమే(విశేషములతోఁగూడి యున్నట్టిదియే). అందువలన ప్రత్యక్ష ప్రమాణము నిర్విశేష వస్తువును తెలియఁజేయ నేరదు.

ఈపైని గనఁబఱచిన హేతువులవలననే [1]"భేదాభేదవాదము"సయితము (అనఁగా ప్రతిపదార్థమును భిన్నమయినదియు, భిన్నముకానిదియును అనెడి

(1) లోకమునందుండు ప్రతిపదార్థమును వ్యక్తిని (ఉరువును) బట్టి భిన్నమయినదియు, జాతిని(రకమును) బట్టి భిన్నము కానిదియును. ఉదాహరణము—ఒక అశ్వముయొక్క వ్యక్తికంటె (ఉరువుకంటె) మఱియొక అశ్వముయొక్క వ్యక్తి (ఉరువు)భిన్నమయినది గాన ఒక అశ్వమునకు మఱియొక అశ్వమునుండి భేదముగలదు. అయితే ఒకఅశ్వమును మఱియొక అశ్వమును రెండును అశ్వజాతియనెడి ఒక్క జాతిలోనే చేరినవికావున ఒక అశ్వమునకు వేఱొక అశ్వమునుండి భేదములేదు. ఇట్లు వ్యక్తిని బట్టిభేదమును జాతినిబట్టి అభేదమును ఈవాదముచే నిరూపింపఁబడుటచే నిది భేదాభేదవాదమని శాస్త్రమునందు వ్యవహరింపఁబడుచున్నది. ఈవాదము గలది భాస్కర మతము. ఈమతముయొక్క స్వరూపమిట్లు— ఇందు బ్రహ్మము నిర్గుణమైనది కాను, సగుణమైనది, బ్రహ్మతత్త్వమే కాక సత్యంబైన అచిత్తత్త్వంబు నొకటిగలదు. ఇది శంకరమతమునంబోలె మిథ్యాభూతమైనది కాదు. ఈ యచిత్తత్త్వంబు బ్రహ్మంబువలననే బుద్ధీంద్రియదేహాది రూపంబున నానావిధములుగాఁ బుట్టుచున్నది. కనుక అచిత్తునకును బ్రహ్మమునకును జాతినిబట్టి అభేదమును, వ్యక్తినిబట్టి భేదమును, స్వాభావికములు. ఈ యభేదమునుబట్టి సర్వము బ్రహ్మాత్మకము

మతము సయితము) ఖండింపఁ బడినదగు చున్నది. ఎట్లన, "ఇది యిట్టిది" అని యిట్లు తెలియవచ్చునప్పుడు "ఇది" అనువ్యక్తికిని "ఇట్టిది" అను జాతికిని ఈరెంటికిని భేదము లేదని యెట్లు దెలిసికొన శక్యము? ఏలయన, "ఇట్టిది" అనునది సాస్న (మెడ క్రింద వ్రేలాడు చర్మము) మొదలగు నాకార విశేషము కదా! "ఇది" అనునది అట్టి యాకారవిశేషముతోఁ గూడియున్నట్టి పదార్థము కదా! కనుక నీరెంటికిని భేదము లేదనుట ప్రత్యక్షవిరుద్ధము. అదియెట్లన, ఏదైన నొకవస్తువు మొట్ట మొదట తెలియవచ్చునప్పుడు తనకంటెను వేఱగు అన్ని పదార్థములనుండియు విలక్షణమయినది గానే కదా తెలియవచ్చుచున్నది! గోవు మొదలగు వస్తువు గోత్వము (గోవు యొక్క జాతి) మొదలగు సంస్థాన విశేషముతో గూడియున్నట్టిది గానే తెలియవచ్చుటచే వైలక్షణ్యము గలదు. విశేషణ విశేష్య భావము తెలియవచ్చునట్టి చోటులనెల్లను ఆవిశేషణ విశేష్యములు తెలియవచ్చుటలో మిక్కిలి భిన్నములయినవి గానే స్పష్టముగ తెలియ వచ్చుచున్నవి. అందులో (దండీపురుషః=దండముగల పురుషుఁడు, కుండలీపురుషః=కుండలములుగల పురుషుఁడు అనునప్పుడు) దండము,కుండలము మొదలగునవి వానిని గలిగియుండు పురుషుని కంటెను వేఱగుసంస్థానము (ఆకారము) గలవై

భేదాభేదవాదము సయితము నిరూపింపఁ దగినది కాదనుట

---

అను శ్రుతియును భేదమునుబట్టి బ్రహ్మము నిర్మలము అనుశ్రుతియును ఉపపన్నములగును. బుద్ధీంద్రియాది రూపమైన యుపాధులతోఁ గూడిన బ్రహ్మాంశములే జీవులు. కనుక జీవ బ్రహ్మములకు భేదము ఔపాధికమైనదిగాన భేదశ్రుతులు తత్పరములు. అభేదము స్వాభావికమైనది గాన అభేదశ్రుతులు ముఖ్యములు. బ్రహ్మము నిరవయవముగానుండఁగా దానికంశములుగా విభాగమెట్లు కలుగునన్న చో నిరయవమైనయాకాశమునకు ఘటాద్యుపాధి సంపర్కమున ఘటాకాశాది భేదంబులు గలిగినట్లు బ్రహ్మమునకు బుద్ధ్యాద్యుపాధివశమున జీవభేదములు గలిగినవి. బ్రహ్మ మాయుపాధిసంబంధముచే జీవభావమనుభవించునట్లు భ్రమించుటే సంసారము. ఉపాధియు తత్సంయోగమును కర్మకృతము. కర్మము ఉపాధిసంబద్ధ జీవకృతము. ఇట్లుకర్మోపాధులు రెంటికిని బీజాంకురన్యాయమున సంబంధ మనాదియైయుండును. ఇచట ఉపాధి రజ్జుసర్పమువలె మిథ్యాభూతము కాదు గాన అది కేవలజ్ఞానమాత్రముచే నివర్తింపదు; కర్మమావశ్యకము. ఆయుపాధిచేనైన యాత్మభేదము మిథ్యాభూతముగాన జ్ఞానమునుఆవశ్యకము. కనుక జ్ఞానకర్మసముచ్చయముచే— అనఁగా వర్ణాశ్రమధర్మసమేతంబై "తత్త్వమస్యా"దివాక్యజన్య జ్ఞానపూర్వకమై యొప్పు నుపాసనముచే, అది నశించును. ఉపాసనమనఁగా వేదనధ్యానాదిశబ్ద వాచ్యమైన అవిచ్ఛిన్నస్మృతి సంతానము. ఘటాదులు నశింపఁగా తదుపహితమైన యాకాశము మహాకాశముతోఁ జేరునట్లు, ఉపాసనాత్మక జ్ఞానముచే ఉపాధి నశింపఁగా తదుపహితాంశమైన జీవుఁడు అనుపహితాంశమైన బ్రహ్మముతో నేకీభవించుటయే మోక్షము. ఇది బ్రహ్మమునకైనసత్యోపాధిమూలమున జగత్తును నిరూపించుటచే ఉపాధివాది యగును.

తనయందు (విశేష్యమగు పురుషునియందు) ఉండునవిగను, ఒక్కొక్క కాలమునందును ప్రదేశము నందును ఏదైన మతియొక వస్తువు నందుండునవై దానికి విశేషణములుగను, గన్పట్టుచున్నవి. అయితే(గా॥= గోజాతిలోఁ జేరినజంతువు అనునప్పుడు) గోత్వము (గోజాతి) మొదలగువి ఒకపదార్థమునకు సంస్థానముగుటచే (ఆకారభూతములగుటచే) ఆపదార్థముతో నొక్కటియైనవగుచు ఆపదార్థమునకు విశేషణములుగ నుండునవి. ఇట్లు రెండువిధములుగలదియగు విశేషణవిశేష్యభావము సమానమే. ఇందువిశేషణవిశేష్యములకు భేదము తెలియవచ్చుటయును సమానమే. ఈరెంటికిఁగల విశేషముఇంతమాత్రమే—దండకుండలాదులు (విశేష్యమునుండి) వేఱుగ నుండునవిగఁ దెలియఁదగినవి. గోత్వము మొదలగునవి యన్ననో అట్టివికావు. జాతివ్యక్తులు అభిన్నములుగానే తెలియవచ్చుచున్నందున భేదాభేదవాదమున ప్రత్యక్ష విరుద్ధమేదియును లేదని వారుచెప్పునది అవి తెలియవచ్చురీతిని బాగుగ నెఱుంగ చెప్పినదియే. ఏలయన, "ఇది యిట్టిది" అని యిట్లు జాతివ్యక్తులు భిన్నములుగానే తెలియ వచ్చుచున్నవని యందఱు నంగీకరించు చున్నారు గదా. సూత్రకారులు "నైకస్మిన్నసంభవాత్" (బ్ర. సూ. ౨-అ. ౨-పా. ౩౧-సూ) అను సూత్రముచే పరస్పర విరుద్ధములగు రెండువిధములు ఒక్కపదార్థము నందుండుట అసంభవమని తెలియఁ జేయుచు ఈ విషయమునే స్పష్టముగాఁ బ్రతిపాదించి యున్నారు.

ఇట్లు ప్రత్యక్షప్రమాణము సవిశేష (విశేషములతోఁ గూడియున్నట్టి) వస్తువునే తెలియఁజేయునట్టిది యగుటంజేసి యట్టిప్రత్యక్షాదుల వలనఁ దెలియ

అను మానప్రమాణము నిర్విశేషవస్తువును నిరూపింప నేరదనుట

వచ్చు సంబంధవిశేషమునుబట్టి ప్రవర్తించు [1]అనుమాన ప్రమాణము సవిశేష(విశేషములతోఁ గూడియున్నట్టి) వస్తువునే తెలియఁజేయునది.

---

(1) ప్రత్యక్షసిద్ధములైన విషయములంబట్టి అప్రత్యక్షములును అసన్నికృష్టములును నగు విషయములం దెలుపు ప్రమాణములలో అనుమాన మొకటి. అనుమితిని గలిగించునది అనుమానము. కొండమీఁద పొగను జూచి నప్పుడు, అందు నిప్పున్న దనెడి తెలివి గలుగును. ప్రత్యక్షసిద్ధమైన పొగనుబట్టి అప్రత్యక్షమగు నిప్పుండుట నూహించెడి యీ తెలివియే అనుమితి. ఇది పరామర్శముచేఁ గలుగను. అగ్నివ్యాప్యమైనట్టిపొగ కొండమీఁద నున్నదని తెలియుట పరామర్శము. దీనివలన అందు నిప్పున్నదనెడి అనుమితి గలుగును. ఎట్లన, వ్యాప్యము, వ్యాపకము, వ్యాప్తి అని మూఁడు. ఉదాహరణమునకు, అగ్ని వ్యాప్యము, పొగ వ్యాపకము అనఁదగును. పొగయుండుచోనెల్ల నిప్పుండు నని వ్యాప్యమునకు వ్యాపకముతోడి నియతసంబంధము వ్యాప్తి. పొగమొదలైనవి యుండుచోనెల్ల నిప్పుమొదలైనవి నియతముగా నుండుటను ఇలుమాఱు చూ

[1]ప్రమాణముల సంఖ్యను గుఱించి భిన్నాభిప్రాయములుండుఁగాక. అయినను సామాన్యముగ నందఱు నంగీకరించిన ప్రమాణములు ఇట్టిపదార్థమునే తెలియఁజేయునవి. కావున ఏప్రమాణమువలనను నిర్విశేష(విశేషము లేవియును లేనట్టి) వస్తువు సిద్ధింపనేరదు.

"ఈ పదార్థమునకు ఇట్లుండుట స్వభావము" అనియిట్లు ఆయాస్వభావవిశేషములనుబట్టియే ఆయావస్తువు నిర్విశేషమని చెప్పువాఁడు "నాతల్లి గొడ్డురాలు" అనువానివలె తానాడినమాట తనతోనే విరోధించుననియు నెఱుఁగఁడు.

ప్రత్యక్షప్రమాణము సయితము సన్మాత్రమునే తెలుపునది యగుటంజేసి యది భేదమును దెలుపదనియు, (గి౨-పు.౧౦-పం) భేదము ఇట్లా అట్లా? అనెడి వికల్పములకు నిలువనిదగుటవలన నిరూపింప నశక్యమయి నదియనియును (గి౨- పు-౨౩-పం) అద్వైతులు చెప్పునది సరికాదు. ఏలయన, ప్రత్యక్షప్రమాణము ఏదైన నొక వస్తువును దెలుపునపుడు ఆ వస్తువును దాని జాతి (రకము)

ప్రత్యక్షము భేదమును దెలుపునది. కావునది సన్మాత్రమునే తెలుపునదియనెడి వాదము తగదనుట.

---

చుటచే ఈనియతసంబంధరూపమైన వ్యాప్తి గ్రహింపఁబడును. కనుక వ్యాప్తిజ్ఞానము ప్రత్యక్షసిద్ధము. ఇది యిట్లుండ పొగనుజూచినవాఁడెల్ల నిప్పున్నదని యెఱుఁగఁడు. కనుక కొండమీఁదపొగయున్నదని తెలియుట మాత్రముచే అందు నిప్పున్నదనెడి అనుమితి గలుగదు. పొగయున్నచోనెల్ల నిప్పుండునను వ్యాప్తిని దెలిసియున్నవాఁడే ఒకప్పుడు కొండమీఁదఁ బొగను జూడఁగా అందు నిప్పుకూడ నున్నదని యూహించును. కనుక కొండ మీఁద నిప్పున్నదనెడి యనుమితి, అందు పట్టిపొగయున్నదని తెలియుట మాత్రముచేఁ గలుగక, ఆపొగ అగ్ని వ్యాప్యమైనదనియు అట్టిపొగ అందున్నదనియు తెలియుట చేతనే కలుగుచున్నది. ఇట్లు తెలియుటయే పరామర్శము. ఇది లింగమును (అనఁగా పొగను) గుఱించినదగుటచే లింగపరామర్శ మనియుఁ జెప్పబడును. వ్యాపకముండునట్లు భావించినచోటు (అనఁగా కొండ) పక్షము. కొండమీఁదపొగయుండుట పక్షధర్మత. కొండమీఁదపొగయుండునట్లు తెలియుట పక్షధర్మతాజ్ఞానము. ఇట్టిపక్షధర్మతను దెలియుటచే అనుమితి గలుగదు. వ్యాప్తితోఁగూడినపక్షధర్మతను దెలియుటయే అనఁగా వ్యాప్తివిశిష్టపక్షధర్మతాజ్ఞానమే అనుమితిని గలిగించునది గాన పరామర్శమగును. వ్యాప్తి విశిష్టపక్షధర్మతాజ్ఞానమే అనుమితికిఁ గరణమని తార్కికమతము. వ్యాప్తిజ్ఞానమును పక్షధర్మతాజ్ఞానమును గూడి అనుమితికిఁ గరణములని మీమాంసకమతము. ఇట్టి యనుమితికిఁగరణమైనపరామర్శమే అనుమాన ప్రమాణము.

(1) చార్వాకులు ప్రత్యక్షమాత్రమును, బౌద్ధులును వైశేషికులును దానితో అనుమానమునుగూర్చి రెంటిని, సాంఖ్యులు వానితో శబ్దమునుగూర్చి మూటిని, నైయాయికులు వానితో ఉపమానమునుగూర్చి నాలుగింటిని, మీమాంసకులలో ప్రాభాకరులర్థాపత్తినిగూర్చి రైదింటిని. తక్కిన మీమాంసకులును అద్వైతులును వానితో అనుపలబ్ధినిగూర్చి యాఱింటిని, అందు విశిష్టాద్వైతులును ద్వైతులును ప్రత్యక్షానుమాన శబ్దములను మూటిని ప్రమాణములుగాఁ బరిగ్రహించెదరు.

తోను వ్యక్తి (ఉరువు) తోను గూడి యున్నట్టి దానిని గానే కదా తెలుపు చున్నది! ఆజాతివ్యక్తులే ఒకవస్తువునకును వేఱొక వస్తువునకునుఁగల భేదమును తెలుపుచున్నవి. కావున వారివాదము నిలువనేరదు.

ఏది తన సంబంధమునుబట్టి పదార్థాంతరమున దాని ధర్మముల వ్యవహార మునకు హేతువగునో అది తనవిషయమున పరాధీనత (ఒకదాని సహాయము) లేకయే ప్రకాశించుచున్నది అనఁగా—తన్ను ప్రకాశింపఁ జేయుటకై వేఱొకదాని యపేక్ష లేనిదిగాను గన్పట్టుచు న్నది—యనెడిన్యాయమునుబట్టి అనుభూతినిని రూపా దులనును తమ ప్రకాశమునకై వేఱొకదాని నపేక్షింపని వానినిగా వారంగీక రించియున్నారు గదా (౬౭-పు. ౮-పం). వారంగీకరించినట్టి యీ న్యాయము అనుభూతికిని రూపాదులకును సంభవ మగునట్లు భేదమునకును సంభవమే. [1]కావుననే భేదమును నిరూపించుటలో వారు గనఁబఱచిన "అనవస్థాదోష ము"ను (౬౦ - పు. ౮ - పం) "అన్యోన్యాశ్రయదోషము"ను (౬౧ - పు. ౧-పం) సంప్రాప్తింపవు.

అనవస్థా దోషమును అన్యోన్యాశ్రయ దోషము ను తొలఁగించుట.

[2]ప్రత్యక్షజ్ఞానము క్షణమాత్రమే యుండునట్టిదియైనను (౫౮-పు. ౩-పం) అదియున్న క్షణమాత్రములోనే ఏదైన నొకవస్తువునకుఁగల భేదమును దాని

(1) ఏదైన నొకవస్తువునకుఁగల భేదమును ఆవస్తువునకంటెను వేఱయినదానినిగ అద్వైతు లంగీకరించి భేదమును నిరూపించుటలో "అనవస్థాదోషమును" "అన్యోన్యాశ్రయ దోషమును" ఆరోపించియుండిరి. అయితే యిప్పుడు ఆచార్యులవారు ఏదైన నొక వస్తువునకుఁగల భేదమనఁగా ఆవస్తువుయొక్క జాతియేగాని ఆవస్తువునకంటెను వేఱయినది కాదని నిరూపింపఁబోవుచున్నారు. కావున ఏదైననొకవస్తువునకుఁగల భేదము ఆవస్తువునకంటెను వేఱగుదానినిగ నంగీకరించునప్పుడు సంభవించునట్టి "అనవస్థాదోషము"ను "అన్యోన్యాశ్రయదోషము"ను భేదమును ఆవస్తువున కంటెను వేఱుకానిదానినిగ నిరూపించునప్పుడు సంభవింపనేరవని యెఱుంగునది.

(2) ఏదైన నొకపదార్థమునకుఁగల భేదమును తెలిసికొనవలయునన్న ఆపదార్థముయొక్క స్వరూపమును తెలిసికొనుటయు దానికంటెను వేఱగు పదార్థమును స్మరించుకొనుటయును ఆవ శ్యకములనియు, ప్రత్యక్షజ్ఞానము క్షణమాత్రము ఉండునట్టిదియగుటచే నది ఆపదార్థముయొక్క స్వరూపమును దానికిఁగల భేదమును ఒక్కక్షణములోనే తెలుపుట యశక్యమనియు, కావున నప్పుడు భేదము తెలియఁబడనిదై ఆటుపిమ్మట భ్రాంతిమూలముగ తెలియవచ్చుచున్న దనియును అద్వైతులు వాదించియుండిరి. అయితే ఆచార్యులవారు యిప్పుడు ఏదైన నొకవస్తువునకుఁగల భేద మనఁగా దానిజాతియే (రకమే) యని ప్రతిపాదింపఁబోవుచున్నారు. ఏదైన నొకపదార్థము తెలియవచ్చునప్పుడే దానిజాతియును (రకమును) తెలియవచ్చుచున్నది. కావున క్షణాంతరమున ప్రత్యక్షజ్ఞానముచేఁ దెలుపఁదగినది మఱియేదియును లేదని యెఱుంగునది.

యాకారమునునగు గోత్వము (గోవుజాతి) మొదలగువానిని తెలుపఁగలదు. ఇంతేకాక అది క్షణాంతరమునఁ దెలుపఁదగినది మఱియేమున్నది?

ప్రత్యక్షజ్ఞానము సన్మాత్రమును (ఉనికిని మాత్రమే) తెలుపునది యనెడు పక్షమున (౫౭-పు. ౧౩-పం.) ప్రత్యక్షమూలముగ "ఘటము (ఘటజాతిలోఁ జేరిన వస్తువు) కలదు పటము (పట జాతిలోఁజేరిన వస్తువు) కలదు" అని యిట్లు (జాతిమొదలగు) విశేషములతోఁ గూడి యున్నట్టివిగానే పదార్థములు తెలియవచ్చుట యనునది విరోధించునే? సన్మాత్రమునకంటె (ఉనికికంటె) వేఱయినదియు, వస్తువుయొక్క ఆకారరూపమయినట్టిదియునగు జాతి (రకము) మొదలగునదియే స్వరూపముగాఁగల భేదమును ప్రత్యక్షజ్ఞానము తెలుపని పక్షమున [1]అశ్వమునకై వెతకుచు పోయినవాఁడు మహిషమును చూచి యేల మరలి రాకున్నాఁడు?

ప్రత్యక్షజ్ఞానము సత్తను మాత్రమే తెలుపునది కాదనుట.

అన్నివిధములగు జ్ఞానములును సన్మాత్రమునే (ఉనికినే) తెలుపునవి యగు పక్షమున (౫౭-పు. ౧౨-పం) ఆయాజ్ఞానములకు విషయములగు పదార్థము తెలియునప్పుడు స్మరింపఁబడునట్టి శబ్దములన్నియును (వాని నామములన్నియును) [2]ఒక్కొక్క పదార్థము తెలియవచ్చునప్పుడెల్లను ఏల స్మరింపఁబడుచుండలేదు? ఇంతేకాక అట్లయినపక్షమున అశ్వమునుగుఱించిన జ్ఞానమును ఏనుఁగును గుఱించిన జ్ఞానమును ఒక్కటే విషయముగలవి.

అన్ని విధములైన జ్ఞానములును సత్తనుమాత్రమే తెలుపునవి యగు పక్షమున దోషమునుగనఁబఱచుట.

(1) ప్రత్యక్షజ్ఞానమునకు విషయమగునది అనఁగా చక్షురాదీంద్రియములచేఁ దెలుపఁదగినది సన్మాత్రము (ఉనికియే) అగుపక్షమున అశ్వమునకై వెతకుచు పోవువాఁడు మహిషమును చూడ లెటుస్థించినట్లయిన అప్పుడు వానికంటికి గనుపడునది సత్తయే (ఉనికియే) గదా? అట్లయిన పక్షమున అశ్వమునకుఁగల సత్తయే (ఉనికియే) మహిషమునకు సయితము గలదు గాన అట్టివాఁడు మహిషమును చూచుటచే అనఁగా మహిషముయొక్క సత్తను కనుపెట్టుటచే అశ్వముయొక్క సత్తను కనుపెట్టినవాఁడగుచున్నాడు గదా! కావున వాఁడు అంతమాత్రముచేతనే తనకార్యము ముగించినదియని భావించుకొని యింటికి మరలి పోవలసి యుండెను. అయితే వాఁడట్లుచేయక "ఇది మహిషముగాని (మహిషజాతిలోఁ జేరినజంతువుగాని) అశ్వముకాదు (అశ్వజాతిలోఁజేరిన జంతువుకాదు)" అనుకొని అశ్వమును వెతకుటకై యింకను ప్రయత్నించుచున్నాఁడు. ఇందువలన ఆయాపదార్థముయొక్క సత్తయే కాక జాతివ్యక్తులు సయితము ప్రత్యక్షజ్ఞానముచేఁ దెలుపఁదగినవి యని సిద్ధమగుచున్నది.

(2) లోకమున సాధారణముగ పదార్థములు తెలియవచ్చునప్పుడు వాని నామములు మన జ్ఞప్తికి వచ్చుట సహజము. ఎట్లన, గోవును చూచినతోడనే "ఇది గోవు" అని యిట్లు దాని

యగుటచే—అనఁగా ఒక్క విషయమును గుఱించినవియే యగుటచే—ఆ రెంటి లోను తుదిని కలిగిన జ్ఞానము పూర్వము గ్రహింపఁబడిన దానినే గ్రహించునది యగుటవలనను, అందు విశేషమేదియును లేకపోవుటవలనను, [1]స్మృతికిని ఇట్టి జ్ఞానమునకును భేదమేదియును లేకపోవునే? ఒకవేళ ఒక్కొక్క (పదార్థమును గుఱించిన) జ్ఞానమునకును విశేషము (భేదము) కలదంటిరేని ప్రత్యక్షజ్ఞానము

---

యొక్క నామధేయమగు "గోవు" అనునది మన జ్ఞప్తికి వచ్చుచుండలేదా? ఇట్లు నామములు మన జ్ఞప్తికి వచ్చుటలో హేతువు ఆయాపదార్థములకును వాని నామములకునుఁ గల వాచ్యవాచక సంబంధమే—అనఁగా పదార్థములు నామములచేఁ దెలుపఁబడునవి యనియు, నామములు పదార్థములను తెలుపునవి యనియు నిట్టిసంబంధమే. "ఇది ఘటము" అనియు "ఇది పటము" అనియు నిట్టిజ్ఞానము గలుగునప్పుడెల్ల మనకు తెలియవచ్చునది, అద్వైతులు చెప్పు ప్రకారము, సత్తయే (ఉనికియే) యగుపక్షమున, ఈపైన గనఁబఱచిన ప్రకారము సత్తయే ఆఘటపటాది నామములతో సంబంధముగలదై వానిని మనలను తలంపంజేయుటలో హేతువు కావలసి వచ్చును. అట్లు లోకమునందుండు పదార్థములలో నేది మనకు తెలియవచ్చినను వాస్తవమునకు మనము తెలుసుకొనునది సత్తయే యగుపక్షమున నాసత్తయే లోకమునందలి యేవస్తువుయొక్క నామధేయమునైనను మనలను తలంపంజేయునదియని చెప్పవలసి వచ్చును. అట్లయినచో "ఇది ఘటము" "ఇది పటము" అని యిట్లు ప్రతియొకపదార్థము తెలియవచ్చునప్పుడెల్లను వాస్తవమునకు మనము తెలుసుకొనునది సత్తయేగాన యీపైన గనఁబఱచినప్రకారము అది లోకమునందలి యన్ని పదార్థములయొక్క నామములను స్మరింపజేయునది యగును. అయితే అనుభవములో నట్లు గానఁబడదు. ఏలయన, ఏపదార్థమును మనము తెలిసికొనెదమో ఆపదార్థముయొక్క నామము మాత్రమే మన జ్ఞప్తికి వచ్చుచున్నదిగాని లోకమునందలి యన్ని పదార్థముల నామములును మన జ్ఞప్తికి వచ్చుచుండలేదు. కావున "ఇది ఘటము" "ఇది పటము" అని యిట్లు మనకు ఘటపటాదులు తెలియవచ్చునట్టితావులనెల్లను మనము వాస్తవముగ దెలిసికొనునది "సత్త" యనునది మాత్రమే యని చెప్పఁదగదు.

(1) జ్ఞానము అనుభవమనియు, స్మృతియనియుఁను రెండు విధములు. ఏదైన నొకపదార్థమును గుఱించి మనకు మొట్టమొదట గలుగునట్టి జ్ఞానము అనుభవమనఁబడుచున్నది. మనకు పూర్వమొకప్పుడు తెలిసియున్న పదార్థమే వేఱొకప్పుడు మనకు తెలియవచ్చుపక్షమున అట్టి జ్ఞానమును స్మృతి యందురు. ఇట్లుండగా అద్వైతులు వాదించుప్రకారము అన్నిజ్ఞానములకును విషయ మొక్కటియే యగు పక్షమున మనకొకప్పుడు అశ్వమును గుఱించి గలిగిన జ్ఞానమునకును వేఱొకప్పుడు ఏనుఁగును గుఱించి గలిగిన జ్ఞానమునకును విషయ మొక్కటియేయని చెప్పవలసివచ్చును. ఇట్లు ఈరెంటు జ్ఞానములకును విషయ మొక్కటియే యగుటంజేసి మొదటితూరి గలిగిన జ్ఞానముచేఁ దెలుపఁబడిన విషయమే రెండవతూరి గలిగిన జ్ఞానముచేతను తెలుపఁబడునట్టిది యగును. కావున రెండవతూరి గలిగినట్టి యేనుఁగును గుఱించిన జ్ఞానము వాస్తవమునకు అనుభవమే యయినను అన్నిజ్ఞానములకును విషయ మొక్కటియే యనుపక్షమున నది స్మృతి యని చెప్పవలసివచ్చును. అందువలన అనుభవమునకును స్మృతికిని భేదము లేకుండ పోవును.

విశిష్ట (విశేషములతోఁ గూడియున్నట్టి) పదార్థమునే తెలుపునది యని యంగీకరించినట్లగునే? [1]అన్నివిధములయిన జ్ఞానములకును విషయము ఒక్కటియే యగుపక్షమున ఒక్కవిధమయిన జ్ఞానముచేతనే అన్ని వస్తువులును (ఆయాజ్ఞానములచేఁ దెలుపఁ దగిన యన్ని పదార్థములును) తెలుపఁబడుటచే లోకమున "ఈతఁడు గ్రుడ్డివాఁడు, ఈతఁడు చెవిటివాఁడు" అని యిట్టి వ్యవహారము లేకుండ వలసి వచ్చునే?

---

☞ (1) ఈగ్రంథ సందర్భముయొక్క యభిప్రాయమును శ్రీకాంచీపురము విద్వాన్ శ్రీశైలానంతపూరుష శ్రీనివాసాచార్యస్వాములవారు "తత్త్వ రత్నావళి" యను గ్రంథమున నిట్లు తెలియఁజేసియున్నారు:—

లోకమునందు గ్రుడ్డివాఁడు అనఁగా నెవ్వఁడు? చెవిటివాఁడు అనఁగా నెవ్వఁడు? చక్షురింద్రియ గ్రాహ్యములగు (కంటికిఁ దెలియఁదగినట్టివియగు) రూపము మొదలగువానిని చూచి తెలిసికొననేరనివాఁడుగదా! గ్రుడ్డివాఁడు. శ్రోత్రేంద్రియ గ్రాహ్యమగు (చెవికి వినఁబడఁదగినట్టిదియగు) శబ్దమును విని తెలిసికొననేరని వాఁడుగదా చెవిటివాఁడు. అయితే ప్రత్యక్షమునకు విషయమగునది అనఁగా చక్షురాదీంద్రియములచేఁ దెలుపఁదగినది సత్త (ఉనికి) మాత్రమే యగు పక్షమున రూపము, శబ్దము మొదలగునవి చక్షురాదీంద్రియములచేఁ దెలుపఁదగినవి కావని చెప్పవలసివచ్చును. అట్లయినపక్షమున రూపము చక్షురింద్రియముచేఁ దెలుపఁదగినదికాదు గాన దానిని చక్షురింద్రియముచేఁ దెలిసికొననేరకపోవుట సహజమేకదా? ఇట్లుండ అట్టివానిని గ్రుడ్డివాఁడు అని యెట్లు వ్యవహరింపఁదగును? అటులనే శబ్దము శ్రోత్రేంద్రియముచేఁ దెలుపఁదగినదికాదు గాన దానిని శ్రోత్రేంద్రియముచేఁ దెలిసికొననేరకపోవుట సహజమేకదా! ఇట్లుండ అట్టివానిని చెవిటివాఁడని యేల వ్యవహరింపఁదగును? ఇట్లు చక్షురాదీంద్రియములచేఁ దెలుపఁదగినది సత్త (ఉనికి) మాత్రమేగాని వేఱొకటి కాదనుపక్షమున ఈపైన గనఁబఱచినప్రకారము రూపమును చక్షురింద్రియముచేఁ దెలిసికొననేరనివాఁడు గ్రుడ్డివాఁడనియు, శబ్దమును శ్రోత్రేంద్రియముచేఁ దెలిసికొన నేరనివాఁడు చెవిటివాఁడనియు నివ్విధమగు లోక వ్యవహారమునకు భంగము వచ్చును. కావున ప్రత్యక్షజ్ఞానముచేఁ దెలుపఁదగినది సన్మాత్రమే యనెడివాదము యుక్తమయినదికాదు.

☞ ఈ సందర్భమున భాష్యమునందలి వాక్యముల యర్థమును పరిశీలింపఁగా శ్రీభాష్యకారులవారి యభిప్రాయము ఇట్లు విశదమగుచున్నది:—

చక్షువు, త్వక్కు, శ్రవణము, రసనము, ఘ్రాణము, మనస్సు అను నింద్రియము లాఱింటిని బట్టి చాక్షుషము అనియు, త్వాచము అనియు, శ్రావణము అనియు, రాసనము అనియు, ఘ్రాణము అనియు మానసము అనియు నివ్విధమున వానినుండు గలుగు జ్ఞానములును ఆఱువిధములు. వీనిలో చాక్షుషజ్ఞానముచేఁ దెలుపఁదగినది రూపమనియు, శ్రావణజ్ఞానముచేఁ దెలుపఁదగినది శబ్దమనియు నివ్విధముగ నాయాయింద్రియజ్ఞానములచేఁ దెలుపఁదగిన విషయములును నియమితములయి యున్నవి. అయితే వీనిలో నొకయింద్రియజ్ఞానముచే దెలుపఁదగినది అనఁగా చాక్షుషజ్ఞానముచే దెలుపఁదగిన రూపము వేఱొక యింద్రియజ్ఞానముచే అనఁగా శ్రావణజ్ఞానము మొదలగువానిచే దెలుపఁ

నేత్రేంద్రియము సన్మాత్రమును (ఉనికిని) తెలుపునట్టిది కాదు. ఏలయన, అది రూపమును, రూపవంతమగు పదార్థమును, అట్టి రూపముతోఁ గూడ పదార్థమునందుండు (వైశాల్యము మొదలగు) వానిని తెలుపునట్టిది గదా! త్వగింద్రియమును అట్టిది కాదు. ఏలయన, అది స్పర్శవంతములగు పదార్థములను తెలుపునట్టిది గదా! శ్రోత్రేంద్రియము మొదలగునవియును సన్మాత్రమును (ఉనికిని) తెలుపునట్టివి కావు. ఏలయన, అవి శబ్దము, రసము, గంధము మొదలుగాఁగల విశేషములను తెలుపునట్టివి గదా! కావున వీనిలో సన్మాత్రమును (ఉనికిని) తెలుపునట్టిది యేదియును గానఁబడదు.

ఏ యింద్రియముచేతను సన్మాత్రము తెలిసికొనఁదగినది కాదనుట.

విశేషము లేవియునులేని కేవలసత్తామాత్రమగు బ్రహ్మము ప్రత్యక్షజ్ఞానముచేతనే తెలుపఁదగినది యగుపక్షమున అట్టిబ్రహ్మమును తెలుపుటకై ప్రవర్తించినట్టి వేదశాస్త్రము వేఱొకదానిచేతఁ దెలుపఁబడినదానినే తెలుపునది యగుటంజేసి [1]అనువాదమాత్రమగును. ఇంతేకాక సత్తా (ఉనికి) మాత్రమగు బ్రహ్మము ప్రమేయము (వేఱొకదానిచేఁ దెలుపఁదగినది)యనియును ప్రసక్తించును. అందు మూలముగ "ఏది వేఱొక జ్ఞానముచేతఁ దెలుపఁదగినదో అది జడమును నశించునట్టిదియును" అని యిట్లు మీచేతనే కనఁబఱుపఁబడిన న్యాయమునుబట్టి జడత్వ (అచేతనమగుట) నాశిత్వాది

ప్రత్యక్షజ్ఞానముచేత నే నిర్విశేష సన్మాత్రమగు బ్రహ్మము తెలుపఁదగినద గుపక్షమున దోషాంతరములను గనఁబఱచుట.

దగినదికాదు. ఇదియే సృష్టియందుండు చాతుర్యము. ఇట్లు ఒక్కొక యింద్రియజ్ఞానముచే మాత్రము తెలుపఁదగినట్టి విషయము వేఱొక యింద్రియజ్ఞానముచేఁ దెలుపఁదగినదికాదు. కావున యేయింద్రియముచేఁ దెలుపఁదగిన విషయమును దానిచేతనే తెలిసికొనవలసియుండెను. ఆయింద్రియమున నేదైననొక లోపముండుటనుబట్టి దానిచేఁ దెలుపఁదగినదానిని తెలిసికొననేరనియెడల అట్టివానిని గ్రుడ్డివాఁడనియు చెవిటివాఁడనియు నివ్విధమున మనము వ్యవహరించుచున్నాము. అయితే అద్వైతులు చెప్పునట్లు ఈపైన గనఁబఱచిన అన్ని విధములయిన జ్ఞానములచేతను తెలుపఁ దగినది సన్మాత్రము ఒక్కటియే యగుపక్షమున అనఁగా ఆయాజ్ఞానము లన్నియును భిన్నభిన్న విషయములు కలవిగానివై సన్మాత్ర మనంబడు ఒక్కటియే విషయముగలవి యగుపక్షమున వానిలో నేదైననొక్కవిధమయిన జ్ఞానముచేతనే అట్టి సన్మాత్రము తెలుపఁబడునుగదా! అందువలన అజ్ఞానములలో నేదైన నొక్కటి లోపించినను దానికార్యము వేఱొక్కజ్ఞానముచే జరుపఁబడుట శక్యము. కావున అట్టిలోపమును ఒకలోపముగా నెన్నకూడదు. ఇట్లుండగా నట్టిలోపమునుబట్టి గ్రుడ్డివాఁడనియు చెవిటివాఁడనియు నివ్విధమగు వ్యవహార మెట్లు పొసగును?

(1) ౧౭-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

(నశించునది యగుట మొదలగు) దోషములు బ్రహ్మమునకు సయితము గల వని ప్రసక్తించునే ?

కావున వస్తువుయొక్క సంస్థాన (ఆకారవిశేష) రూపములగు జాతి మొదలగునవియే భేదమనియు, అట్టి భేదముతోఁ గూడియున్నట్టి పదార్థమే ప్రత్యక్ష ప్రమాణముచేతఁ దెలుపఁదగినది యనియును సిద్ధమగుచున్నది. ఏలయన, "ఈగోవు సాస్న మొదలగునవి గలది ఈగోవు సాస్న మొదలగునవి గలది" అని యిట్లు అనేక పదార్థముల యందు ఒక్కవిధమగు జ్ఞానముచేఁ దెలుపఁదగినది ఆయాపదార్థముయొక్క సంస్థాన (ఆకారవిశేష) మునకంటెను వేఱొకటి గానఁబడదు గదా ! అంత మాత్రముచేతనే గోత్వము మొదలగు జాతి తెలియవచ్చుచుండుట చేతను, సంస్థానమునకంటెను జాతి వేఱయినదనెడి మతమున సయితము సంస్థానమనునది యొకటి కలదని యంగీకరించి యుండుట వలనను సంస్థానమే (ఆకారవిశేషమే) జాతి యని తెలియునది. సంస్థానమనునది ఆయాపదార్థముయొక్క అసాధారణమగు రూపము—అనఁగా వేఱు పదార్థములయందుండక దానియందు మాత్రమే యుండునట్టి రూపము. కావున ఏవస్తువు ఎట్లుండఁదగునో అట్లుండుట దాని సంస్థానమని యూహించుకొనునది.

సంస్థానమే (ఆకారవిశేషమే) జాతియని నిరూపించుట

"ఈపదార్థము ఈజాతిలోఁ జేరినది ఈపదార్థము ఈజాతిలోఁ జేరినది" అని, యిట్లు ఆయాపదార్థము యొక్క జాతిని (రకమును) తెలిసికొనినంత మాత్రముచేతనే ఆయాపదార్థము వేఱొకపదార్థమునకంటెను భిన్నమయినదని తెలియవచ్చుచుండుట వలనను, ఆయాపదార్థము తెలియ వచ్చునప్పుడు దానియొక్క జాతికంటెను వేఱొకటి తెలియ రానందునను, జాతికంటెను భేదము వేఱనెడివానిమతముననుజాతియనునదొకటి కలదని యంగీకరించి యుండుటవలనను గోత్వము (గోవుధర్మము) మొదలగు జాతియే భేదమని తెలియునది.

జాతియే భేదమనుట.

అద్వైతి:—జాతి మొదలగునదియే భేదమగుపక్షమున జాతిని గుఱించిన వ్యవహారము గలుగునట్లు—అనఁగా జాతి వ్యవహారముచేఁ దెలియవచ్చునట్లు—భేదము సయితము వ్యవహారముచేఁ దెలియవలసివచ్చునే ?

భాష్యకారులు:—అవును. భేదము వ్యవహరింపఁబడుచునే యున్నది. ఏలయన, గోత్వము (గోవుజాతి) మొదలగు వానిని వ్యవహరించు (వ్యవ

జాతినిబట్టియే భేదము తెలియవచ్చుచున్నందున జాతియే భేదమని సమర్థించుట.

హారమునుఁ దెలిసికొను) చున్నాము గదా! గోత్వము (గోవుయొక్క-జాతి) మొదలగునదియే గోవు మొదలగువానికిని తదితరములగువానికి నన్నింటికినిఁ గలభేదము. ఎట్లన, "ఇది గోజాతిలోఁ జేరిన జంతువు ఇది మహిషజాతిలోఁ జేరిన జంతువు" అని యివ్విధమున గోత్వము (గోవుయొక్క-జాతి) మొదలగువానిని తెలిసికొనుట చేతనే కదా గోవుమొదలగు నవియును తదితరములగు అన్నిజంతువులును ఒక్క-టే జాతిలోఁ జేరినవి అనెడి జ్ఞానముగాని అట్టి వ్యవహారముగాని గలుగకున్నది. మఱియు నేదైన నొకపదార్థమునకుఁ గల భేదము తెలియుటచేతనే కదా ఆపదార్థము తదితర పదార్థములతో నొక్క-టియే యనెడి అభేదజ్ఞానము నివర్తించుచున్నది. అయితే "ఇది దీనికంటె భిన్నమయినది" అని యిట్లు వ్యవహరింప వలసినప్పుడు మాత్రమే ప్రతియోగి (అది కానిదాని = వేఱొకదాని) యపేక్షకలదు. కావున "ఇది దీనికంటె భిన్నమయినది" అని యిట్టివ్యవహారము ప్రతియోగినిబట్టి యుండునది యని చెప్పఁబడియె. (గీ-పు. ౭-పం.)

"ఇది ఘటము" అనియు "ఇది పటము" అనియును ఇవ్విధములగు భేదములు వ్యావర్తమానము లగుటవలన అపరమార్థములు (అసత్యములు) అని

వ్యావర్తమానము లగుట వలన ఘటపటాది భేదములు అసత్యములను వాదమును ఖండించుట.

అద్వైతుల వాదము గదా! (౬౩-పు. ౪-పం) ఆవాదము "బాధింపఁబడునదియిట్టిది, బాధించునదియిట్టిది, వ్యావృత్తి యిట్టిది, అనువృత్తియిట్టిది" అని యిట్లు బాధ్యబాధక భావమును గుఱించియు, వ్యావృత్త్యనువృత్తులను గుఱించియును బాగుగ పరిశీలింపక పోవుటచే భ్రాంతివశమున గల్పింపఁబడినదియే. ఏలన, రెండు జ్ఞానములకు పరస్పరము విరోధము సంభవించు నప్పుడుగదా ఆరెంటిలో ఒకటి బాధింపఁబడునది యనియు, వేఱొకటి బాధించునది యనియును చెప్పవచ్చును. అట్లయిననే బాధింపఁబడుదానికి మాత్రము వ్యావృత్తి(మాఱుట) గలదనియును చెప్పఁదగును. ప్రకృతముననో ఘట పటాదులకు దేశ కాలభేద ముండుటనుబట్టి విరోధమే లేదే. ఎట్లన, ఏప్రదేశమున ఏకాలమున ఏపదార్థము ఉన్నదిగఁ దెలియవచ్చునో ఆప్రదేశముననే ఆకాలముననే ఆపదార్థమే లేనిదిగఁ దెలియవచ్చు పక్షమునఁగదా! ఆకావున విరోధముండుటను బట్టి—అనఁగా ఉన్నదిగఁ దెలియ వచ్చుటయును, లేనిదిగఁ దెలియవచ్చుటయును విరుద్ధము

లగుటనుబట్టి)—ఆరెంటిలో బలమయిన జ్ఞానము బాధకమనియు (బాధించునది యనియు)మిగిలినది బాధింపఁబడునది (నివృత్తి గలది) యనియును చెప్పవచ్చును. ఏదైన నొకప్రదేశమున ఒకకాలమున నొకపదార్థముండునదిగఁ దెలియవచ్చునదై ఆపదార్థమే, వేఱొక ప్రదేశమున వేఱొక కాలమున లేనిదిగఁ దెలియవచ్చునెడల అట్టితావున విరోధమే లేదుగాన అచ్చట "ఇది బాధకము ఇది బాధ్యము" అనెడి ప్రసక్తియే గలుగనేరదు. ఇంతేకాక ఒకతావునలేని పదార్థమును వేఱొకతావున సయితము లేనిదానినిగాను ఎట్లు చెప్పఁదగును? అనఁగా తాముండు దేశ కాలములకంటె వేఱగు దేశకాలముల యందు లేకుండునట్టి ఘటపటాది పదార్థములను అవియున్నట్టి దేశ కాలములయందు సయితము అవి లేవని ఎట్లు చెప్పఁదగును? రజ్జు సర్ప దృష్టాంతమునందన్ననో, (త్రాటిని సర్పముగ భ్రమించునట్టి తావునన్ననో) ఒక్కటియే ప్రదేశమున ఒక్కటియే కాలమున సర్పము (భ్రాంతిమూలముగ) ఉండునదిగఁ దెలియవచ్చుటయును, (వాస్తవమునకు) లేనిదిగఁ దెలియవచ్చుటయును గలవు గాన అట్టితావున ఆరెండు జ్ఞానములకును (సర్పము కలదు అనుజ్ఞానమునకును సర్పము లేదు అను జ్ఞానమునకును) విరోధమును, (ఆరెంటిలో నొకటి వేఱొకదానిని) బాధించునది యగుటయును, అట్లు బాధింపఁబడునది వ్యావృత్తి గలది (మాఱునది) యగుటయును ఇవియన్నియును సంభవములు. అయితే "ఏది యొక ప్రదేశమున ఒక కాలమున ఉండునట్టిదిగఁ దెలియవచ్చునదై వేఱొక ప్రదేశమున వేఱొక కాలమున వ్యావర్తమానముగా (సామాన్యముగ నంతట లేనిదిగఁ) దెలియవచ్చుచున్నదో ఆపదార్థము అపరమార్థము (అసత్యము) అని యిట్టి నియమము లోకమునం దెచటను గానఁబడదు. కావున అట్లు వ్యావర్తమానమగుట మాత్రమే ఆపదార్థము అసత్యమగుటలో హేతువు కానేరదు.

*అనువర్తమానమగుట వలన సన్మాత్రమే పరమార్థమను వాదమును ఖండించుట.*

అనువర్తమాన మగుట వలన (సామాన్యముగ నన్ని పదార్థములయందును ఉండునట్టిదిగఁ దెలియవచ్చునది యగుటవలన) సన్మాత్రము (ఉనికి మాత్రము) పరమార్థము (౬౧-పు. ౫-పం) అని అద్వైతులు చేయునట్టి వాదము సయితము యుక్తమయినది కాదు. ఏలన, సన్మాత్రము సిద్ధమే (ఉండునట్టిదిగ తెలియఁబడునదియే) కావున నది యిప్పుడట్టిదిగ నిరూపింప నర్హమయినది కాదు. కావున సన్మాత్రమే (ఉనికి మాత్రమే) పరమార్థవస్తువు కాఁదగదు.

అనుభూతియే సన్మాత్రము అనఁగా అనుభూతి యన్నను సన్మాత్ర మన్నను ఒక్కటియే యని (౬౮. పు. ౧౮, ౧౯, పం) అద్వైతులు చేయు నట్టి యీ వాదము యుక్తమయినది కాదు. ఏలయన, సత్తయనంబడు విశేషము విషయము (తెలియఁబడునది). అనుభూతియన్ననో విషయి (తెలిసికొనునది). ఇట్లు సత్తయనఁబడు విశేషమునకును అనుభూతికిని విషయవిషయి భావము (సద్విశేషము విషయము అనుభూతి విషయి యనెడి విభాగము) ఉండుటంజేసి ఈ రెంటికిని భేదము ప్రత్యక్షసిద్ధము (ప్రత్యక్షముగాఁ దెలియవచ్చునది). అట్టి భేదము వేఱొకదానిచే బాధింపఁబడునదియును కాదు. కావున అనుభూతియే సన్మాత్రమను వాదము నిరసింపఁబడిన దగుచున్నది.

అనుభూతియే సన్మాత్రమను వాదమును ఖండించుట.

అనుభూతి (జ్ఞానము) స్వయం ప్రకాశము అనఁగా తనంతటతానే ప్రకాశించు నట్టిదిగాని వేఱొకజ్ఞానముచేఁ బ్రకాశింపఁబడునది కాదు (౬౭-పు. ౮-పం.) అని యిట్లు అద్వైతులు చెప్పుచున్నారు. అయితే అనుభూతి (జ్ఞానము) ఘటపటాది విషయములను ప్రకాశింపఁ జేయునట్టి కాలమున జ్ఞాతయగు (తెలిసికొనువాఁడగు) ఆత్మకు మాత్రము అది యట్టిదిగానే యుండునుగాని యందఱికిని నెల్లప్పుడును అట్టిదిగానే అనఁగా తనంతట తానే ప్రకాశించునదిగానే యుండు నన్న నియమము లేదు. ఏలయన, ఒక్కఁడొక దానిని గ్రహించుటను, ఒక్కఁడొక దానిని త్యజించుటను బట్టి యొకని జ్ఞానమిట్టిదియని వేఱొక్కఁడు ఊహించు చున్నట్లు అనఁగా ఒక్కని జ్ఞానము వేఱొక్కని యనుమానమునకు విషయ మగుచున్నట్లు లోకమునఁ జూచుచున్నాము. మఱియు "నేను ఇంతకు పూర్వము తెలిసికొని యుంటిని" అనెడు వ్యవహారమునుబట్టి యింతకు పూర్వము ఎప్పుడో గలిగిన జ్ఞానము సయితము ప్రకృతజ్ఞానమునకు విషయమయినదిగ (ఇప్పటి జ్ఞానముచేఁ దెలుపఁదగినదిగ) గన్పట్టుచున్నది. కావున "ఏది యనుభూతియో (జ్ఞానమో) అది స్వతస్సిద్ధమయినది అనఁగా తనంతట తానే ప్రకాశించునది యని చెప్ప నేరము.

స్వయం ప్రకాశత్వ లక్షణమున కొన్ని లోపములను గనఁబఱచుట.

అనుభూతి (జ్ఞానము) వేఱొక జ్ఞానముచేఁ దెలుపఁదగినదగు పక్షమున అది అనుభూతి కానిది(జ్ఞానము కానిది=జడమయినది)అగునని (౬౭-పు. ౭-పం) అద్వై

వేఱొకజ్ఞానముచేఁదె లుపఁదగినదగు పక్షమున అనుభూతి జడమగు నను వాదమున దోషములను గనఁబఱచుట.

తులు చేయువాదము యుక్తమైనది కాదు. ఏలయన, మనకు యింతకు పూర్వము గలిగిన యనుభవములును (జ్ఞానములును), ఇతరుల యనుభవములును వేఱొక జ్ఞానముచేఁ దెలుపఁదగినవిగాను మనము చూచియున్నాము. వారు వాదించుప్రకారము అవియన్నియును అనుభూతి కానివి (జడములయినవి) అని ప్రసక్తించునే? [1]ఒకని జ్ఞానము వేఱొకనిచే యూహింపఁదగినది యని యంగీకరింపని పక్షమున శబ్దములకును తదర్థములకునుఁ గల సంబంధమును గుఱించిన జ్ఞానము లేకపోవునే? అందువలన ఈ సమస్త మయిన [1]శబ్దవ్యవహారమునకును భంగము వచ్చునే? మఱియు ఆచార్యుఁడు

---

(1) లోకమున మన యభిప్రాయములను ఇతరులకు తెలుపుటకును ఇతరుల యభిప్రాయములను మనము తెలిసికొనుటకును శబ్దములను ప్రయోగించుచున్నాము. ఇట్లు శబ్దప్రయోగ మూలముగ నొకరి యభిప్రాయములను వేఱొకరికిఁ దెలుపుటను శబ్దవ్యవహారమందురు. అయితే యీ శబ్దము ఈ యర్థమును తెలుపునది యనియు, ఈయర్థము ఈ శబ్దముచేఁ దెలుపఁదగినది యనియు నిట్లు శబ్దార్థములకు వాచ్య వాచక సంబంధము కలదను జ్ఞానమే అట్టి శబ్దవ్యవహారము గలుగుటలో ముఖ్యకారణము. శబ్దార్థములకుఁగల వాచ్య వాచక సంబంధమును గుఱించిన జ్ఞానము లేకున్న పక్షమున శబ్దవ్యవహారము గలుగనేరదు. అట్టి జ్ఞానము వృద్ధవ్యవహారము వలన గలుగుచున్నదని చెప్పఁదగును. పూర్వీకు లాయా యర్థములను తెలుపుటకై ఆయా శబ్దములను ప్రయోగించి యున్నందున గదా ఈశబ్దమున కిది యర్థము ఈశబ్దమున కిది యర్థమని మనము తెలిసికొనుచున్నాము. దీనినే వృద్ధవ్యవహారమని శాస్త్రజ్ఞులు చెప్పుదురు. ఇట్లు వృద్ధవ్యవహారము శబ్దార్థములకుఁ గల వాచ్యవాచక సంబంధమును తెలుపునది యని మనకు దేనిమూలముగఁ దెలియుననిన, నది అనుమానము మూలముగఁ దెలియవచ్చుచున్న దనఁదగును. ఎట్లన, మనము ఒకనిని పిలిచి «గోవును తోలుకొనిరా» అని యంటిమేని వాఁడు గోవును తోలుకొని వచ్చుటకై ప్రయత్నించును. అవ్విధమగు వాని ప్రయత్నమును «గోవును తోలుకొనిరా'' అను మనవాక్యమును విన్నవాఁడు వేఱొకఁడు చూచి మనము ప్రయోగించిన శబ్దములకు «గోజాతిలోఁ జేరినట్టి యొక జంతువును తీసికొనివచ్చుట'' యర్థమని యూహించుచున్నాఁడు. ఇట్లు గోవును తోలుకొనిరాఁబోయినవాఁడు మనము ప్రయోగించిన శబ్దముల యర్థమును తెలిసికొనినాఁడని వేఱొకఁ డెఱుంగుటకు సాధనము వాని ప్రయత్నములను బట్టి వేఱొకనికిఁ గలిగిన యనుమానమే (ఊహయే) తప్ప. వేఱొకటి కాదు గదా! అయితే అద్వైతులు చెప్పుప్రకారము ఒకని జ్ఞానము వేఱొకని యనుమానమునకు విషయముకానిది (వేఱొకనిచే నూహింపఁ దగినది కానిది) యగు పక్షమున ఈ పైన గనఁబఱచిన ప్రకారము అనుమానము మూలముగ వృద్ధవ్యవహారము శబ్దార్థములకుఁ గల వాచ్య వాచక సంబంధమును తెలుపునట్టిదియను జ్ఞానము గలుగుటయు, అట్టి వృద్ధవ్యవహారము మూలముగ వాచ్య వాచక సంబంధము నెఱుంగుటయును, అసంభవములగును. అందువలన వాచ్య వాచక సంబంధ జ్ఞానమూలమునఁ గలుగునట్టి యీ సమస్తమగు శబ్దవ్యవహారమునకును భంగము వచ్చును. కావున లోకమునం దెచటను శబ్దవ్యవహారమే లేకపోవును.

జ్ఞానవంతుఁడని ఊహించుకొని గదా శిష్యుఁడు వానిని ఆశ్రయించుచున్నాఁడు. జ్ఞానము అను మానముచేఁ (ఊహచే) దెలుపఁదగినది కాని పక్షమున శిష్యుఁ డాచార్యుని ఆశ్రయించుటయును అసంభవ మగునే?

మఱియు అనుభూతి (జ్ఞానము) వేఱొకజ్ఞానముచేఁ దెలుపఁ దగినదగు పక్షమున అనుభూతి కానిది(జ్ఞానము కానిది=జడము) అగునని వాదము (౬౬-పు. 3-పం) యుక్తము కాదు; ఏలయన, అనుభూతి (జ్ఞానము) అనునది ఎట్టిది? "తానుండు సమయమున—ఘటపటాది విషయములను ప్రకాశింపఁజేయు సమయమున—తన కాధారభూతమగు నాత్మను గుఱించి తన సత్త (ఉనికి) చేతనే ప్రకాశించు నట్టిదా? లేక తన సత్త (ఉనికి) చేతనే విషయములను సాధించు (ప్రకాశింపఁ జేయు) నట్టిదా? ఈపైన గనఁబఱిచిన అనుభూతి లక్షణములు అనుభవ సిద్ధము లగుటచే, అనుభూతి వేఱొక జ్ఞానముచేఁ దెలుపఁదగినదగు పక్షమునను, వానికి భంగము లేదు. కావున నిట్టి పక్షమున అనుభూతియొక్క స్వరూపమున కేదియును లోపము లేదు. ఘటపటాది పదార్థము లన్ననో ఈపైన గనఁబఱిచిన యనుభూతి లక్షణములు లేనివి. కావున అవి అనుభూతి కానివి(జ్ఞానము కానివి = జడములు) అనఁబడుచున్నవే గాని వేఱొక జ్ఞానముచేఁ దెలుపఁదగినవి యగుటను బట్టి యట్టివిగా నెన్నఁబడుచుండ లేదు.

స్వయం ప్రకాశత్వ లక్షణమును సరిచేసి కనఁబఱచుట.

వేఱొకజ్ఞానముచేఁ దెలుపఁదగనిదిగా నుండుటయే యనుభూతి యగుటలో హేతువంటివేని, అందువలన—అటుల వేఱొక జ్ఞానముచేఁ దెలుపఁ దగని దగుటవలన—అట్టి పదార్థము—అటుల వేఱొక జ్ఞానముచేఁ దెలుపఁదగని పదార్థము—అనుభూతి కానిది [1](తుచ్ఛము) అని ప్రసక్తించునే? ఏలన, జ్ఞానముచేఁ దెలుపఁదగినివి యగుటనుబట్టి గదా! ఆకాశపుష్పము మొదలగునవి యనుభూతి కానివిగ (తుచ్ఛముగ) నెన్నఁ బడుచున్నవి.

జ్ఞానముచేఁ దెలుపఁ దగనిదగుటయే అనుభూతిస్వరూపమను వాదమున దోషమును గనఁబఱచుట.

అద్వైతి:—ఆకాశపుష్పము మొదలగునవి యెన్నఁడును లేనివియగుటనుబట్టి తుచ్ఛముగా నెన్నఁబడుచున్నవే గాని అవి జ్ఞానముచేఁ దెలుపఁదగనివి యగుటనుబట్టి యట్టివిగా నెన్నఁబడుచుండ లేదే?

(1) ౯౬ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

భాష్యకారులు:—ఘటపటాది పదార్థములును అవిద్యను బోగొట్టునవి గాకుండుటనుబట్టి అనుభూతి కానివి (జ్ఞానముకానివి=జడములు) గా నెన్నఁబడు చున్నవేగాని అవి జ్ఞానముచేఁ దెలుపఁదగినవి యగుటనుబట్టి యట్టివిగా నెన్నఁ బడుచుండలేదని యొప్పుకొనుము.

అద్వైతి :—అటుల అనుభూతియును జ్ఞానముచేఁ దెలుపఁదగినది యని యొప్పుకొను పక్షమున, జ్ఞానముచేఁ దెలుపఁ దగినవియగు ఘటపటాది పదార్థములు అవిద్యను పోగొట్టునవి కానట్లు, వానివలెనే జ్ఞానముచేఁ దెలుపఁదగినది యగు అనుభూతియును అవిద్యను పోగొట్టునది కాదని ప్రసక్తించునే?

భాష్యకారులు :—మీరు చెప్పిన ప్రకారము అనుభూతి జ్ఞానముచేఁ దెలుపఁదగినది కాదని యొప్పుకొనినను, జ్ఞానముచేఁ దెలుపఁ దగనివియగు ఆకాశ పుష్పాదులు అవిద్యను పోగొట్టునవి కానట్లు వానివలెనే జ్ఞానముచేఁ దెలుపఁ దగనిదియగు అనుభూతియును అవిద్యను పోగొట్టునది కాదని ప్రసక్తింపక తప్పదే? కావున ఏది వేఱొక జ్ఞానముచేఁ దెలుపఁదగినదో అది యనుభూతికానిది (జ్ఞానముకానిది = జడమయినది) యంటివేని యెవరయిన వింటు నవ్వుదురే !

అనుభూతి స్వతస్సిద్ధ మయినందున దానికి [1]ప్రాగభావము మొదలగునవి లేవనియు, ప్రాగభావము మొదలగునవి లేకుండుటనుబట్టి దానికి యుత్పత్తి సయితము లేదనియును (౬౫-పు. ౮-పం.) గదా! అద్వైతులు చెప్పుచున్నారు. [2]వారు చెప్పునది పుట్టు గ్రుడ్డివాఁడు గ్రుడ్డివానికి కట్టనందిచ్చి (దారి చూపించి) నట్లున్నది. మఱియు అనుభూతియొక్క ప్రాగభావమును తెలిసికొనునది మఱియేదియును లేకుండుటనుబట్టి గదా! వారు దానికి (అనుభూతికి) ప్రాగభావమే లేదని వాదించుచున్నారు. అటులనెట్లు చెప్ప శక్యము? దానిని యనుభూతియే తెలిసికొనఁగలదే?

అనుభూతికి ప్రాగభావము మొదలగునవి లేకుండుటనుబట్టి యుత్పత్తిసయితము లేదనువాదమును ఖండించుట.

---

(1) ౬౭-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణమును చూడుము.

(2) అనుభూతికి ప్రాగభావము మొదలగునవి లేవని యింతవఱకును సిద్ధింపలేదు. ఇట్లుండఁగా దానికి ప్రాగభావాదులు లేకుండుటనుబట్టి యుత్పత్తిసయితము లేదని యెట్లు సాధింపశక్యము? అది యెటువలెననిన, పుట్టు గ్రుడ్డివాఁడు తాను పుట్టినది మొదలు కఱ్ఱ యెట్టిదో యెఱుఁగడు. అట్టివాఁడు వేఱొక గ్రుడ్డివానికి కఱ్ఱనందిచ్చుట యెట్లు సంభవము? అనఁగా పుట్టు గ్రుడ్డివాఁడు

అద్వైతి:—అనుభూతి తాను స్వయముగ నుండియున్నదై తానుండియున్నప్పుడే తన యభావమును (తనలేమిని) యెటులఁ దెలుపఁగలదు? అది విరుద్ధము గదా!

భాష్యకారులు:—అనుభూతి తానున్నట్టి కాలమున నుండి యున్నట్టి వానిని మాత్రమే తెలిసికొనునట్టిది యనెడు నియమము లేదు. అట్లుగాకున్న—అనఁగా అనుభూతి తానున్నట్టి కాలముననుండి యున్నట్టి వానినిమాత్రమే తెలిసికొను నట్టిది యని యంగీకరించు పక్షమున—అనుభూతి యింతకు పూర్వము గతించిన వానిని, ఇకమీఁద రాబోవు వానిని తెలిసికొన నేరనిదని ప్రసక్తించునే?

ఒకవేళ అనుభూతియొక్క ప్రాగభావము మొదలగునవి తెలుపఁబడ వలయునన్న అవి అనుభూతి యుండునట్టి కాలమున నుండియున్నట్టివియే కావలయు ననెడి యొక నియమము కలదని తలంచెదవా? అట్టి నియమమును గనఁబఱచెడి నీవు అటుల నెచటనైనను చూచియుండవలయునే? అట్లైన పక్షమున అనుభూతియొక్క ప్రాగభావము మొదలగు వానిని నీవు స్వయముగ చూచియున్నావుగాన అవి యున్నట్టివిగానే సిద్ధమగుచున్నవే? ఇట్లుండఁగా అనుభూతికి ప్రాగభావము మొదలగునవి లేనేలేవని యెట్లు చెప్పఁదగును?

వాస్తవమునకు దానియొక్క ప్రాగభావము (ముందొకప్పుడది లేకుండుట యనునది) అదియున్నట్టి కాలమున నుండునని బుద్ధిమంతుఁ డెవ్వఁడు చెప్పును? అయితే తానుండు సమయమున నుండియున్నట్టి పదార్థములను మాత్రమే తెలుపునది యగుట యింద్రియ జన్యమగు ప్రత్యక్ష జ్ఞానమునకు మాత్రమే స్వాభావికము గాని అన్ని జ్ఞానములును, అన్ని ప్రమాణములును అట్టివి కావు. ఏలన, [1]స్మరణము, [2]అనుమా

విషయములను తెలుపుటలో ప్రత్యక్షజ్ఞానమునకంటె నితరజ్ఞానములకును ప్రమాణములకునుఁగల తారతమ్యమును గనఁబఱచుట.

వేఱొక గ్రుడ్డివానికి కన్నందిచ్చుట యెట్లసంభవమో, అట్లే అనుభూతికి ప్రాగభావాదులు లేకుండుటను బట్టి దానికి యుత్పత్తి సయితము లేదని నిరూపించుటయును అసంభవమని యెఱుంగునది.

(1) ఇంతకుపూర్వ మెప్పుడో మనమొక పదార్థమును అనుభవించి యున్న పక్షమున, వేఱొకప్పుడు దానిని గురించిన యనుభవము మన జ్ఞప్తికి రాఁగలదు. ఇదియే స్మరణమనఁబడుచున్నది. ఇట్టి స్మరణము గలుగునప్పుడు ఆపదార్థము మన యెదుట యుండి యుండవలసిన యావశ్యకత లేదు. కావున స్మరణము ఇంతకుముందు గతించిన వానిని తెలిసికొనునది. అట్లే రాబోవుసంగతులను సయితము మనము స్మరింతుము గాన స్మరణము వానిని సయితము తెలిసికొనునదని యెఱుంగునది.

(2) భూమి చెమ్మగ నుండుటనుబట్టి యింతకుముందు వర్షము కురిసియుండి యుండవచ్చునని మనము ఊహించుచున్నాము. మఱియు ఆకాశమునందు మేఘములను చూచి వర్షము రాబోవు

నము, [1]శాస్త్రము, [2]యోగిప్రత్యక్షము మొదలగునవి తాముండు కాలమునకంటె వేఱొక కాలముననుండి యున్నట్టి వానినైనను తెలిసికొనునవిగాను మనము చూచుచున్నాముగదా! ఈ హేతువులను బట్టియే ప్రమాణమెన్నడును ప్రమేయమును విడిచియుండ దనునట్టి యొక సంబంధము ప్రమాణప్రమేయములకు గలదని సిద్ధమగుచున్నది. ఆసంబంధము ప్రమాణము తానున్నకాలముననే యుండియున్నట్టి ప్రమేయమును (దానిచేఁ దెలుపఁదగిన పదార్థమును) విడిచియుండక పోవుటకాదు, అయితే ఏదేశమున ఏకాలమున ఏపదార్థము ఉన్నట్టిదిగిఁ దెలియవచ్చునో ఆదేశమున ఆకాలమున ఆపదార్థము అట్టిదియగుట యసత్యము కాదని తెలుపుటయే. [3]అనుభవించిన పదార్థము నష్టమైపోయినను దానిని గుఱించిన స్మరణము కలదుగాన స్మరణము బాహ్యపదార్థములను తెలిసికొనునది కాదని బౌద్ధులలో కొందఱు చేయు వాదము సయితము ఇందుమూలముగ నిరసింపఁబడినదని యెఱుంగునది.

అద్వైతి:—సంవిత్తుయొక్క (అనుభూతి యనఁబడు జ్ఞానముయొక్క) [4]ప్రాగభావము ప్రత్యక్షజ్ఞానముచేఁ దెలుపఁదగినది కాదు. ఏలన, అది ప్రత్యక్షజ్ఞానము యుండియున్నట్టి కాలమున నుండునది కాదుగదా! సంవిత్తు ప్రమాణాంతరముల చేతను తెలుపఁదగినది కాదు. ఏలయన, ఏదైననొక లింగమును

---

నని యూహించుచున్నాము. ఇట్టి యూహయే అనుమాన మనఁబడుచున్నది. ఇందువలన అనుమానము గతించిన వానిని రాఁబోవు వానిని దెలుపునదియని సిద్ధమగుచున్నది.

(1) శాస్త్రజ్ఞానము ఇంతకు పూర్వము జరిగినవానిని ఇకమీఁద జరుగపోవు వానిని తెలుపునట్టిది. రామాయణాదులును భవిష్యత్పురాణాదులును అట్టి విషయములను తెలుపుచున్నవి.

(2) యోగి ప్రత్యక్షమనఁగా యోగాభ్యాస సంపన్నులగు మహర్షులయొక్క దివ్యజ్ఞానము. దానిమూలముగ వారు భూత భవిష్య ద్వర్తమాన కాలములతో సంబంధించిన వానినన్నింటిని తెలిసికొనుచున్నారు. కనుకనే వారట్టివిషయములను తెలుపునట్టి గ్రంథములను వ్రాసియున్నారు.

(3) బౌద్ధులలో కొందఱు ప్రమాణ మున్నట్టి కాలముననే ప్రమేయము సయితము ఉండియుండవలయు ననియు, అట్లయిన పక్షముననే ప్రమాణ ప్రమేయములకు విషయ విషయి భావముండుననియును అంగీకరించి, అనుభవించిన పదార్థము నష్టమయినను దానిని గుఱించిన స్మరణముండునుగాన స్మరణము బాహ్యపదార్థములను తెలిసికొనునట్టిది కాదని వాదించియున్నారు. ఇప్పుడు ఆచార్యులవారు విషయ విషయి భావముండుటకై ప్రమాణ ప్రమేయములు ఏకకాలముననుండి యుండవలయునన్న నియమము లేదని నిరూపించియున్నారుగాన నిందుమూలముగ ఈపైన గనఁబఱచిన బౌద్ధుల వాదము సయితము నిరసింపఁబడినదగుచున్నదని యెఱుంగునది.

(4) ౬౭ పత్రముయొక్క క్రింది భాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణమును చూడుము.

(సూచకమగు గుఱుతును) ఆధారముగఁ జేసికొని కదా! [1]అనుమానము మొదలగు ప్రమాణములు ఏదైన నొకదానిని తెలుపఁగలవు. అయితే సంవిత్తుయొక్క ప్రాగభావమున కట్టి లింగము ఉన్నట్లు గానఁబడదు. శాస్త్రప్రమాణమైనను అట్టి ప్రాగభావమును తెలిపియున్న ట్లెచటను గన్పట్టుచుండలేదు. ఈ పైన గనఁబఱచిన ప్రకారము అనుభూతికి ప్రాగభావము కలదని (అనుభూతి ముందొకప్పుడు లేనిదియని) చెప్పుట యశక్యము.

భాష్యకారులు:—అనుభూతి స్వతస్సిద్ధమయినందున దానికి ప్రాగభావము మొదలగునవి లేవని (౬౨-పు. ౧౯-పం) యింతకు పూర్వము వాదించియుంటివి. ఇప్పుడు ఆ వాదమును వదలి అనుభూతియొక్క ప్రాగభావము మొదలగు వానిని నిరూపించు [2]ప్రమాణమేదియును లేకుండుటనుబట్టి దానికి ప్రాగభావాదులే లేవని వాదించెదవా? అట్లైన పక్షమున అనుభూతియొక్క ప్రాగభావమును నిరూపించునట్టిది యగు [3]"యోగ్యానుపలబ్ధి" యనఁబడు ప్రమాణ మొకటి కలదు. కావున అనుభూతికి ప్రాగభావము కలదని సాధింపఁబడియె. ఇక నింతటితో నూఱకుండుము.

ప్రత్యక్షజ్ఞానము తన విషయములను (తనచేఁ దెలుపఁదగినవానిని) తానున్నప్పుడు ఉండునట్టి వానినిగా (తానున్నప్పటి వాసినత్తను మాత్రమే) తెలుపునట్టిదిగ గానఁబడుచున్నది గాని ఎల్ల కాలమును అనఁగా అంతకు పూర్వము గాని అటుపిమ్మటగాని వానికుండుకున్న సత్తను తెలుపునట్టిదిగ గానఁబడుచుండలేదు. కనుకనే ఘటపటాదుల కంతకు పూర్వ ముండియున్న సత్తగాని అంతకు మీఁద నుండబోవు సత్తగాని అప్పుడు ప్రత్యక్ష జ్ఞానముచేఁ దెలుపఁబడదు. అటుల నవి తెలుపఁబడక పోవుటకు హేతువు వానిని తెలుపు

ప్రత్యక్షజ్ఞానము విషయములను తెలుపునట్టికాలమున మాత్రమే యుండునట్టిదియని నిరూపించుట.

---

(1) ౨౯-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును ౮౧-వ పత్రమునందలి ౧-వ వివరణమును చూడుము.

(2) ౭3-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన 3-వ వివరణమునుచూడుము.

(3) యోగ్యానుపలబ్ధి—యోగ్యము అనఁగా కనఁబడఁదగినది. దానియొక్క అనుపలబ్ధి అనఁగా కనఁబడకపోవుట. ఇదియే అభావమును తెలిసికొనుటకు సాధనము. ఎట్లన, ఎచ్చటనైన ఏదైన నొకవస్తువు ఉండునేని అది కనఁబడవలసినది. అయితే అట్లు కనఁబడుటలేదు గాన ఆవస్తువు లేదు అనఁగా ఆవస్తువుయొక్క అభావము (లేమి) కలదనుట. అట్లే అనుభూతియొక్క ప్రాగభావమును గుఱించియును యోచించుకొనునది.

నట్టి జ్ఞానము ఘటపటాది పదార్థము లుండియున్నట్టి కాలముయొక్క పూర్వో త్తర కాలములయం దుండక (అవి తెలియవచ్చుచుండెడి) ఏదొక కాలమున మాత్రమే యుండునట్టిది యగుటయే. ఘటపటాది పదార్థములను మాత్రమే తెలుపునట్టిది యగు జ్ఞానము స్వయముగ సర్వకాలములయందు నుండునట్టిదిగఁ దెలియవచ్చు పక్షమున, దానిచేఁ దెలుపఁ దగినవి యగు ఘటపటాది పదార్థములు నయితము సర్వకాలములయం దుండునవిగఁ దెలియఁబడవలసివచ్చునే? ఇంతేకాక అట్లైన పక్షమున ఘటపటాది పదార్థములును నిత్యములని ప్రసక్తించును? మఱియు నట్లు స్వతస్సిద్ధమగు జ్ఞానము నిత్యమగు పక్షమున నది నిత్యమయినదిగానే తెలియరావలయును. అయితే అది యట్టిదిగఁ దెలియవచ్చుచుండలేదు.

అట్లే అనుమానజ్ఞానము మొదలగునవియును ఇక్కాలమున మాత్రముండునట్టివి యనెడి కాలపరిమితిలేనివై సర్వకాలములయందు నుండునవిగఁ దెలియవచ్చుపక్షమున నవి వాని విషయములను (వానిచేఁ దెలుపఁదగిన పదార్థములను) సర్వకాలమును ప్రకాశింపఁ జేయుచునే యుఁడవలయును. కావున వాని విషయములును (వానిచే దెలుపఁదగిన పదార్థములును) సర్వకాల ముండునట్టివి యగుటంజేసి నిత్యము లనఁదగినవి యగును. ఏలయన, జ్ఞానము లెట్టివో అట్టివిగానే కదా! వానిచేఁ దెలుపఁదగిన విషయములును ఉండఁదగును. ఏవిధమైన జ్ఞానమును నిర్విషయముగ—దేనిని తెలుపనిదిగ—ఎన్నడును గానఁబడదు. అట్టి జ్ఞానము మనకు తెలియుట యెట్లు? ఏలన, ఘటపటాది పదార్థములను తెలుపునదిగానే తెలియవచ్చుటచేతఁ గదా! జ్ఞానము స్వయంప్రకాశముగ—అనఁగా తన్ను ప్రకాశింపఁ జేయుటకై వేఱొక దానిని యపేక్షింపక తనంతటతానే ప్రకాశించునదిగ—నిరూపింపఁబడియెను. అటుల జ్ఞానము విషయములను ప్రకాశింపఁ జేయునట్టి స్వభావము కలది కానిపక్షమున అందులను బట్టి వచ్చిన స్వయంప్రకాశత్వము నయితము జ్ఞానమునకు అనఁగా అనుభూతికి లేదని సిద్ధించును. ఈ పైన గనఁబఱచిన ప్రకారము అనుభూతి స్వయంప్రకాశమును (తనంతటనే తాను తెలియవచ్చునదియును) కాదు. మీరు (అద్వైతులు) అది వేఱొక జ్ఞానముచేఁ దెలుపఁదగినది యనియును అంగీకరింపరు. ఏతావతా అనుభూతి (కుందేటి కొమ్ములవలె) [1]తుచ్ఛమని కదా! చెప్పవలసివచ్చును?

(1) తనంతట తానుగాని వేఱొక జ్ఞానముచేఁగాని తెలియరానట్టియు ఎన్నడునులేని దానిని తుచ్ఛమని శాస్త్రకారులు వ్యవహరింతురు.

అద్వైతి:—నిర్విషయమును(ఏవిషయమును తెలిసికొననిదియును)కేవలమగు సంవిత్తు (జ్ఞానము,) సుషుప్తియందును, మత్తెక్కినప్పుడును, మూర్ఛవచ్చినప్పుడును ఈ మొదలగు అవస్థలయందు ప్రకాశించుచున్నదే?

భాష్యకారులు :—అటులఁ జెప్పఁదగదు. ఏలన, [1] "అనుపలబ్ధి" ప్రమాణమువలన ఆవాదము నిలువనేరదు. ఎట్లన, ఆయవస్థల యందును అనుభూతి యనుభవింపఁబడిన పక్షమున ఆయా యవస్థలు వదిలిపోయి తెలివి వచ్చినప్పుడు దానిని గుఱించిన స్మరణము గలుగవలయునే? అయితే అప్పుడు దానిని గుఱించిన స్మరణము లేనేలేదు.

అద్వైతి :—ఏయే పదార్థము అనుభవింపఁబడునో ఆయాపదార్థము తప్పక స్మరింపఁబడ వలయుననెడి నియమ మెచ్చటను గానఁబడదు. కావున నేదైన నొక పదార్థము స్మరింపఁబడనంత మాత్రముచే నది యనుభవింపఁబడి యుండనే లేదని యెట్లు చెప్పఁదగును?

భాష్యకారులు :—ఎట్టి సంస్కారమునైనను పోఁగొట్టునట్టి శరీరవియోగాది రూపమగు ఏదైన నొక బలమయిన హేతు వున్నట్టి తావులనే తప్ప తక్కిన తావుల ఏ పదార్థము స్మరింపఁబడదో అది యనుభవింపఁబడనేలేదని చెప్పవచ్చును. ప్రకృతమున ఆయా యవస్థలయందలి యనుభవమును గుఱించిన స్మరణము లేకపోవుటనుబట్టి మాత్రమే అప్పుడు అనుభవము (జ్ఞానము) లేదని చెప్పియుండలేదు. అయితే నిద్రపోయి లేచినవాఁడు "ఇంతవఱకు నేనేమియు నెఱుంగను" అని యిట్లు చెప్పుచుండుటను బట్టియును అప్పుడు అనుభవము (జ్ఞానము) లేదని సిద్ధమగుచున్నది.

అద్వైతి—ఆయవస్థలయందు అనుభవముండి యున్నటికిని అందును గుఱించిన స్మరణము లేకుండుటకు హేతువు అప్పుడట్టి జ్ఞానముచేఁ దెలుపఁదగిన విషయమేదియును లేకుండుట యని గాని అథవా అప్పు డహంకారము లేకుండుటయని గాని చెప్పకూడదా?

భాష్యకారులు :—అటులఁ జెప్పఁదగదు. ఏలన, ఏదైన నొకవస్తువు అనుభవింపఁబడినదై స్మరింపఁబడని యెడల, వేఱొకవస్తువు అనుభవింపఁబడక పోవుటగాని వేఱొకవస్తువు లేకపోవుటగాని అందులకై హేతువు గానేరదు.

(1) ౯౫-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన 3-వ వివరణమును చూడుము.

మఱియు సుషుప్త్యాద్యవస్థల యందును "అహం" (నేను) అనునది యనువర్తిం చునని యికమీఁద చెప్పఁబడును.

అద్వైతి :—సుషుప్తి మొదలుగాఁగల యవస్థలయందు సయితము సవిశేషమగు (విశేషములతోఁ గూడియున్నట్టి) యనుభవము (జ్ఞానము) కలదని యింతకు పూర్వము (౭౪-పు. ౨౦-పం.) చెప్పియుంటిరే?

భాష్యకారులు :—సత్యము. చెప్పియున్నాము. అయితే అది ఆత్మానుభవము. ఆ యాత్మానుభవము సవిశేషమే (విశేషములతోఁ గూడియున్నట్టిదియే) యని యికమీఁద స్థాపింపఁబడును. ప్రకృతమున నిర్విషయమును (ఏవిషయమును తెలుపనిదియును) నిరాశ్రయమును (దేనిని ఆశ్రయించి యుండనిదియును)నగు కేవల జ్ఞానము కలదనెడియంశముమాత్రమే నిషేధింపఁబడుచున్నది.

అద్వైతి :—కేవలమేయగు జ్ఞానము ఆత్మానుభవము.

భాష్యకారులు :—అట్టి జ్ఞానము వేఱొకదానిని ఆశ్రయించి యుండునట్టిదియని యికమీఁద నుపపాదింపఁబడును.

కావున అనుభూతి స్వయముగ తానున్నట్టిది యగుచు తన యభావమును (తనలేమిని) సాధింపదుగాన దాని [1]ప్రాగభావము సిద్ధింపనేరదని (దానికి ప్రాగభావము లేదని) (౭౮-వ పు. ౨-వ పం.) చెప్పుట యశక్యము. మఱియు అనుభూతి వేఱొక జ్ఞానముచేతఁ దెలుపఁదగినదియని ఉపపాదించి యుండుటచే (౯౦, ౯౧-పు.) దాని ప్రాగభావము వేఱొక జ్ఞానముచే నిరూపింపఁ దగదను వాదము సయితము నిరసింపఁబడినదగుచున్నది. కాఁబట్టి అనుభూతికి ప్రాగభావము మొదలగునవి సిద్ధింపనందున దానికి యుత్పత్తి సయితము లేదనెడి వాదము (౭౮-పు. ౮-పం.) నిరాధారమైనదని తెలియుఁగునది.

అనుభూతికి ఉత్పత్తి (పుట్టుక) లేనందున ఇతర [2]వికారము లేవియును దానికి లేవని (౭౯-పు. ౯-పం.) యద్వైతులు చేయు వాదము యుక్తియుక్తమైనదికాదు. ఏలన, వారు చెప్పునట్లు ఉత్పత్తి లేనంత మాత్రముచేతనే యితర వికారము లేవియును లేకుండుననుపక్షమున, ప్రాగభావమునకును [3]ఉత్పత్తి లేదు

(1) ౭౭-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణమును చూడుము.

(2) ౭౯-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

(3) ౭౭-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణములోని ౫-వ పంక్తి మొదలుకొని ౮-వ పంక్తి వఱకును చూడుము.

గాన దానికిని యితర వికారము లేవియును లేవని చెప్పవలసివచ్చునే? అయితే ప్రాగభావమునకు ఉత్పత్తి లేకపోయినను నాశమనంబడు వికారము కలదు.

అద్వైతి:—భావ (ఉన్నట్టి) పదార్థములు మాత్రమే ఉత్పత్తి లేనట్టివియగు పక్షమున వికారాంతరములను పొందవు.

భాష్యకారులు:—సరే, అట్లు వాదించితి వేని తర్కించుటయందు నీకుంగల తెలివి తేటలు బాగుఁవెల్లడిల్లును! భావపదార్థముగ మీ రంగీకరించినట్టి యవిద్య యుత్పత్తి లేనిదే కదా! దానికి వికారములు గలవనియు అది జ్ఞానము గలిగిన తోడనే నశించునట్టిది యనియును మీ రంగీకరించుచున్నారే! అదియెట్లు? భావ పదార్థములు ఉత్పత్తిలేనివయినంతమాత్రముచేతనే వికారాంతరము లేవియును లేనివగునని నీవు చెప్పినప్రకారము, భావపదార్థముగ మీ రంగీకరించినట్టియవిద్యయును ఉత్పత్తి లేనిదియేగాన, దానికిని వికారాంతరము లేవియును లేకుండవలసివచ్చునే?

అద్వైతి:—వికారము లన్నియును మిథ్యాభూతములే (అసత్యములే) కదా!

భాష్యకారులు:—నీ మతమున పరమార్థమగు (సత్యమగు) వికారమొకటి కలదా? అట్లైనపక్షముననే "భావపదార్థములు" అనెడు విశేషణము [1]సార్థకమగును. అయితే మీరు అట్టివికారమనున దొకటి కలదని యంగీకరింపరే!

అనుభూతి పుట్టుక లేనిదైనందున తనయందు విభాగమును సహింపనోపదని (౬౯-పు. ౧౨-పం.) అద్వైతులు వాదించుచున్నారు. ఆవాదము సయితము యుక్తియుక్తమైనదికాదు. ఏలన; పుట్టుక లేనిదియగు ఆత్మకు దేహేంద్రియాదుల నుండి విభాగము కలదు గదా? మఱియు ఆదిలేనిదిగ (పుట్టుక లేనిదిగ) వారిచే నంగీకరింపఁబడినట్టి యవిద్యకు ఆత్మనుండి విభాగముకలదని యవశ్యముగ నంగీకరింపవలసి యున్నదే?

---

(1) వికార మనునది యొకటి సత్యముగ నున్నయెడలనుగదా! అది యనుభూతికి సయితముకలదని ప్రసక్తించునేమో యని తలంచి యట్టి ప్రసక్తిని తొలఁగించుటకై "భావపదార్థములు" అనెడి విశేషణమును చేర్చుకొనుట సహజము. వికారము లన్నియును మిథ్యాభూతములై వాస్తవములో సత్యమగు వికారమే లేనిపక్షమున నది యనుభూతికి కలదని ప్రసక్తింపనే ప్రసక్తింపదు. ఇట్లుండఁగా నట్టి ప్రసక్తిని తొలఁగించుటకై "భావపదార్థములు" అనెడి విశేషణమును చేర్చుకొనినందువలన ప్రయోజనమేమి? కావున పరమార్థముగ వికార మనునది యొకటి కలదని యంగీకరించు పక్షముననే భావపదార్థములనెడి విశేషణము సార్థక మగునని యెఱుంగునది.

అద్వైతి:—ఆ విభాగము మిథ్యారూపమే (అసత్యమే)?

భాష్యకారులు:—పుట్టుకతో నియతముగ సంబంధించినదై పరమార్థమగు (సత్యమగు) విభాగమును నీవెచ్చటనైన చూచియున్నావా! అవిద్యకును ఆత్మకును సత్యముగ విభాగమే (భేదమే) లేనిపక్షమున వాస్తవమునకు అవిద్యయే యాత్మయని చెప్పవలసివచ్చునే? "ఇది ఘటము" "ఇది పటము" అని యిట్లు ఘటపటాది దృశ్యపదార్థములకు భేదమున్నట్లు ప్రమాణసిద్ధమగుటచే వానిని గుఱించిన జ్ఞానమునకును భేదముగలదని సిద్ధించును. అది యెటువలెననిన, ఛేద్యములకు (ఛేదింపఁబడునవియగు వృక్షములు మొదలగువానికి) భేదమున్నట్లు సిద్ధించుటచే ఛేదనమునందును భేదము కలదని సిద్ధించునుగదా!

వేఱొకజ్ఞానముచేఁ దెలుపఁదగిన దేదియును జ్ఞానస్వరూపమగు అనుభూతియొక్క ధర్మము కాదగదనియు, వేఱొకజ్ఞానముచేఁ దెలుపఁదగినది యగుటయే, అట్టిదేదియును అనుభూతియొక్క ధర్మము కాకపోవుటలో, హేతువనియునుగదా (౬౮-పు. ౧౮-పం.) అద్వైతులు వాదించుచున్నారు. అయితే వారిపైనఁ గనఁబఱచిన రెండు అంశములును, వారిచే అనుభూతియొక్క ధర్మములుగ నంగీకరింపఁబడినట్టియు ప్రమాణసిద్ధములగు నిత్యత్వము, స్వయంప్రకాశత్వము మొదలగువానికిని సమానములే కదా!

అద్వైతి:—నిత్యత్వము స్వయంప్రకాశత్వము మొదలగునవియును అనుభూతియే (జ్ఞానమే).

భాష్యకారులు:—నిత్యత్వము మొదలగునవియును జ్ఞానమాత్రములేయని చెప్పఁదగదు. వాని స్వరూపములకును జ్ఞానముయొక్క స్వరూపమునకును భేదముకలదు. ఎట్లన, తన సత్త (ఉనికి) చేతనే తనయాశ్రయమును(ఆత్మను)గుఱించి ఏదైన నొకపదార్థమును ప్రకాశింపఁజేయుటనుగదా! జ్ఞానమందురు. స్వయంప్రకాశత్వమన్ననో తన సత్త (ఉనికి) చేతనే తన యాశ్రయమును గుఱించి ప్రకాశించునట్టిది యగుట. ప్రకాశమనఁగా సామాన్యముగ చిత్పదార్థములును అచిత్పదార్థములును ఇవి యన్నియును వ్యవహారమునకుం దెలియఁదగినవియగుట. ఎల్లకాలముండునట్టిది యగుటనుగదా నిత్యత్వమందురు. ఒక్కటికంటెను ఎక్కువ గానిది యగుట గదా ఏకత్వ మనఁబడును.

అద్వైతి:—అవి జడత్వాదుల యభావరూపములే కదా?

భాష్యకారులు :—ఒకవేళ అవియు [1]జడత్వాద్యభావ రూపములని యంగీకరించినను, అవి యట్టివిగనే సంవిత్తుయొక్క ధర్మములు కానలయును. సంవిత్తు జడత్వాది ప్రత్యనీకత్వమును (జడత్వాదులకు విరుద్ధమయిన దగుటను) తనకంటె వేఱుగ భావరూపమగు (ఉన్నట్టి) ధర్మముగను గాని అభావరూపమగు (లేనట్టి) ధర్మముగనుగాని కలిగియుండునది యని యంగీకరింపని పక్షమున ఆయా జడత్వాదులు సంవిత్తునకు లేవని చెప్పుటలో [2](సంవిత్తు జడము మొదలగునది కానిదియనుటలో) అర్థమేమున్నది? అందుల కర్థమే లేదు.

---

(1) జడత్వాద్యభావరూపము=జడము మొదలగునది కానిది. స్వయంప్రకాశత్వమన్నను, నిత్యత్వమన్నను, ఏకత్వమన్నను జడము మొదలగునది కానిది యనియే గాన, అది యనుభూతియే యని యద్వైతుల యభిప్రాయము ఎట్లన, ఘటపటాది పదార్థములు స్వయంప్రకాశములు కావు. అట్లు స్వయంప్రకాశములు కానివియగు ఘటపటాదు లన్నియును జడములుగఁ గన్పట్టుచున్నవి. కావున స్వయంప్రకాశము కానిది యనఁగా జడమనుట, స్వయంప్రకాశ మయినది యనఁగా జడము కానిది యనుట. అది యనుభూతియే కదా. జడపదార్థము లన్నియును అనిత్యములుగ గన్పట్టుచున్నందున అనిత్యము అనఁగా జడమనుట. కావున నిత్యము అనఁగా జడముకానిది యనుట. అది యనుభూతియే కదా. జడపదార్థము లన్నియును అనేకములుగ గన్పట్టుచున్నందున అనేకమనఁగా జడమనుట కావున ఏకమనఁగా జడముకానిది. అది యనుభూతియే కదా! ఇట్లు స్వయంప్రకాశత్వమన్నను, నిత్యత్వమన్నను, ఏకత్వమన్నను జడములు మొదలగునవి కానివి యనియే యర్థము. కావున అట్టిది యనుభూతియే యగుటనుబట్టి అవి (స్వయంప్రకాశత్వాదులు) అనుభూతియేగాని అనుభూతికంటెను వేఱుగ దానిధర్మములు కావని యద్వైతులవాదము.

విశిష్టాద్వైతులు ఆటుల నంగీకరింపరు. స్వయంప్రకాశత్వము మొదలగునవి యొకదాని యొక్క ధర్మములుగాని అవియే ధర్మి (ధర్మములుకలది) కాదని వారి వాదము. ఇటుల నింత విషయమై వీరి యుభయులకును భిన్నాభిప్రాయములు గలుగుటకు హేతువు ఈ క్రింద నుదహరింపఁబడుచున్నది. అభావశబ్దముయొక్క యర్థమును వీరుభయులు వేఱు వేఱు విధముగ గ్రహించియున్నారు. ఎట్లన, అభావమనఁగా లేకుండుట యనిగాని కాకుండుట యనిగాని యర్థము. "భూతలే ఘటాభావః" (భూమిమీఁదఘటములేదు) అనునప్పుడు భూతలమున ఘటము లేకుండుట యనఁగా దాని యధిష్ఠానమే (భూతలము కలదనియే) యర్థముగాని యట్టియభావమునకు భూతలముకంటెను వేఱొకటి కలదని యర్థముకాదని యద్వైతుల అభిప్రాయము.

భూతలమున ఘటము లేకుండుట యనునది భూతలముయొక్క యొకధర్మముగాని అదియే భూతలము కాదని విశిష్టాద్వైతుల యభిప్రాయము. ఇట్లు అద్వైతులు అభావమనఁగా వేఱొక పదార్థముకాదు అది దేనియభావమో దాని యధిష్ఠానమే యని యంగీకరించుటవలనను, విశిష్టాద్వైతులు అభావమనఁగా నది దేనియభావమో దాని యధిష్ఠానముకాదు అది దానియొక్క ధర్మమే యని యంగీకరించుటవలనను యీపైన నుదహరించిన ప్రకారము వారి యుభయులకును భిన్నాభిప్రాయములు గలుగుట సంభవించెను.

(2) ఏదైన నొకపదార్థము వేఱొకటి కాకపోవుట యనునది యాపదార్థమే యగుపక్షమున నట్టిదియగుట యాపదార్థముయొక్క స్వరూపమే గాన, [illegible]

మఱియు సంవిత్తు సిద్ధించునట్టిదా ? (తెలియవచ్చునట్టిదా?) కాదా ? సిద్ధించునట్టిది యగుపక్షమున నది ధర్మములతో గూడియున్నట్టిదియగును. అట్టిది కానిపక్షమున ఆకాశపుష్పాదులనలె నది తుచ్ఛమని ప్రసక్తించునే ?

అద్వైతి :—అట్టి సిద్ధియే (తెలియవచ్చుటయే) సంవిత్తు.

భాష్యకారులు:—అది ఎవనికి దేనిని గుఱించి గలుగునట్టిదియో చెప్ప వలయును? అది యెవనికైన నేదైన పదార్థమును గుఱించి కలుగునట్టిది కానిపక్షమున నది సిద్ధియే కానేరదు. సిద్ధియనునది పుత్రత్వమువలె (పుత్రుడగుటవలె) నొకపురుషునికి ఒకపదార్థమును గుఱించి గలుగునట్టిది కదా !

అద్వైతి:—అట్లైననది యాత్మకే (తనకే తన్ను గుఱించి) గలుగునట్టిది.

భాష్యకారులు:—ఇట్టి యాత్మ (తాను) అనునది యెవరు ?

అద్వైతి:—సంవిత్తే (ఎఱుకయే) ఆత్మయని పూర్వమే చెప్పియుంటినే ?

భాష్యకారులు:—చెప్పితివి. వాస్తవమే. అయితే నీవు చెప్పినది యసంగతము. ఏలయన, ఎవ్వనికైన నొక్కనికేదైన నొకపదార్థమును గుఱించి గలుగునట్టి జ్ఞానమగుటంజేసి వానితో (ఆపురుషునితోను ఆపదార్థముతోనును) సంబంధించినట్టిదియగు ఆసంవిత్తే (ఎఱుకయే) ఆత్మ(ఎఱుకగలది)యెట్లు కాగలదు? (ఆత్మయొక్క ధర్మమగు సంవిత్తు తానే స్వయముగ ఆయాత్మయే యెట్లు కాగలదు?)

వాస్తవమున కన్ననో అనుభూతి యనగా తానున్నంత మాత్రముచేతనే తన యాధారమును గుఱించి యేదైన నొక పదార్థమును వ్యవహార యోగ్యముగ — వ్యవహారమున దెలియ వచ్చునట్టిదానినిగ—చేయునట్టిది. అది జ్ఞానమనియు, అవగతియనియు, సంవిత్తు అనియును నామాంతరములుగలది. అది సకర్మకము (తనచే దెలుపబడు విషయము గలది). మఱియు అది జ్ఞాతయగు (తెలిసికొనునదియగు) ఆత్మయొక్క యొకధర్మవిశేషము.

కేవలజ్ఞానము ఆత్మకాదనియు, జ్ఞాతయేయాత్మయనియును సహేతుకముగ నిరూపించుట.

“నేను ఘటమును తెలిసికొనుచున్నాను” “నేను ఈ పదార్థమును తెలిసికొనుచున్నాను” “నేనువస్త్రమును తెలిసికొనుచున్నాను” అను యివ్విధముగ నది

---

యట్టిదిగానే తెలియవచ్చును. ఇట్లుండ, ఆపదార్థము వేటొకటి కాదని చెప్పటలో అనగా ఆపదార్థమునందు వేఱొక పదార్థమగుటను నిషేధించుటలో సర్థమేమున్నది ? అదియెట్లన, అనుభూతి జడముకానిది యనునప్పుడు జడముకానిది యగుట యనుభూతియొక్క స్వరూపమేగాన అనుభూతి యన్నతోడనే దానిస్వరూపము తెలియవచ్చును. ఇట్లుండ “అనుభూతి జడముకానిది” అను వాక్యముచే దెలుపదగినది మఱి యేమున్నది? కావున నట్టివాక్యము నిరర్థకమేకదా?

యందలియొక్కయును(వారివారి)ఆత్మలచేఁ దెలియఁబడునదిగ ప్రసిద్ధము. అదియట్టి స్వభావముగలది యగుటను బట్టియే కదా నీవు దానిని స్వయంప్రకాశముగాను నిరూపించియున్నావు. సకర్మకమును (తనచేఁ దెలుపఁబడు విషయముతో గూడి యుండునట్టిదియును),కర్తయొక్క(తెలిసికొనునదియగు నాత్మయొక్క)ధర్మవిశేష మునునగు ఈసంవిత్తు కర్మయగుట (వేఱొకదానిచేఁదెలుపఁబడు విషయమగుట) దుర్లభమగు చందమున నదికర్త (తెలిసికొనునదియగు ఆత్మ) యగుటయును దుర్ల భమని యెఱుంగునది. అది యెట్లన, కర్త (తెలిసికొనునదియగు ఆత్మ) స్థిరమగు టయు, అట్టి కర్తయొక్క (ఆత్మయొక్క) ధర్మవిశేషమగు సంవిత్తు (జ్ఞానము) సుఖదుఃఖాదులవలె ఉత్పత్తి, స్థితి, నాశములు గలదియగుటయును ప్రత్యక్ష ముగ దెలియవచ్చుచున్నవి. ఎట్లన, "ఆపదార్థమును నేను ముందొకప్పు డనుభవించియుంటిని" అని యిట్లు (ముందొకప్పు డనుభవించిన పదార్థమును గుఱించి స్మరణము గలుగుటనుబట్టి) కర్త (తెలిసికొనువాఁడగు ఆత్మ) స్థిరుఁడని ప్రత్యక్షముగఁ దెలియవచ్చు చున్నది. అయితే "నేను తెలిసికొనుచున్నాను" "నేను తెలిసికొంటిని" "నేను తెలిసికొనినవాఁడనే అయినను నాకాజ్ఞానము ఇప్పుడు పోయినది" అని యివ్విధమగు వ్యవహారమునుబట్టి జ్ఞానమునకు ఉత్ప త్తియు, స్థితియు, నాశమును గలవనునదియును ప్రత్యక్షసిద్ధమయిన విషయమే. ఇట్లుండ ఈరెండును (ఆత్మయును జ్ఞానమును) ఒక్కటియేయని యెట్లు చెప్పఁ దగును? ఇట్లు క్షణభంగురమగు సంవిత్తే ఆత్మయని యంగీకరించు పక్షమున, ముందొకనాఁడు చూచినవస్తువును గుఱించి వేఱొకదినమున "నేను దానిని చూచియుంటిని" అనెడి స్మరణము గలుగుట యసంభవమగునే? ఏలయన, ఒకఁ డనుభవించినదానిని వేఱొకఁడు స్మరించుట యసంభవము గదా ?

ఇంతియకాక అనుభూతియే యాత్మయని యంగీకరించి అది నిత్యమని యొప్పుకొనినను, స్మరణము గలుగకుండుట యనునది యట్లే యుండును. స్మర ణము ఆత్మను ఇంతకుముందును ఇకమీఁదను ఉండునట్టి దానినిగాను, తెలిసికొను నట్టిదానినిగానును నిరూపించుచున్నదే గాని అది జ్ఞానమాత్రమని నిరూపించు చుండలేదు. ఏలయన (ఏదైన నొకపదార్థమును స్మరించుకొనునప్పుడు) "నేనే దీనిని యింతకు పూర్వము అనుభవించియుంటిని" అని కదా ప్రతివాఁడును చెప్పును. నీవూ అనుభూతి "అనుభవితా" (తెలిసికొనునట్టిది)యని యొప్పుకొనవు. అనుభూతి అనుభూతి (అనుభవ) మాత్రమని గదా నీసిద్ధాంతము. సంవిత్తు అనఁగా దేనిని యాశ్రయించియుండనిదియు, విషయమేదియు లేనిదియును అను

పక్షమున నది యొంతమాత్రము తెలియఁబడదు గాన నట్టిది యొక్కటి యుండు టయే యసంభవమని యింతకు పూర్వము చెప్పఁబడియె.

అద్వైతి:—సంవిత్తు (జ్ఞానము) అనునది యొకటి కలదని మీరును అంగీ కరించుచున్నారు నేనును ఒప్పుకొనుచున్నాను. కావున ఇట్లు మనము ఉభయు లము అంగీకరించినట్టి సంవిత్తే ఆత్మయని చెప్పకూడదా ?

భాష్యకారులు :—“ఘటమును తెలిసికొనుచున్నాను” “పటమును తెలిసికొనుచున్నాను” అని యిట్లు ఆత్మ జ్ఞాతగఁ (తెలిసికొనునదిగఁ) దెలియ వచ్చుచున్నదేగాని కేవలము జ్ఞానమాత్రముగ తెలియవచ్చుచుండలేదు. కావున అటులఁ జెప్పఁదగదు.

అద్వైతి :—అనుభూతి (జ్ఞానము) మాత్రమే పరమార్థము (సత్యము) అని నిశ్చయించియుంటినే ?

భాష్యకారులు :—అందులకై నీవు గనఁబఱచిన కుయుక్తులన్నియును నిరాకరింపఁబడియెను గదా.

అద్వైతి:—“నేను తెలిసికొనుచున్నాను” అను ప్రత్యయములో (మనస్సు నందు తోఁచునట్టి ఎఱుకలో) బాహ్యపదార్థము కానిదియు (ఆంతరమయినదియు) కేవలప్రకాశ స్వరూపమునునగు జ్ఞానమనఁబడునది యేదికలదో అదియే యాత్మ. అట్టి జ్ఞానముచేఁ బ్రకాశింపఁబడినదగుటచే బాహ్యపదార్థ స్వరూపము గలదియు, “నేను తెలిసికొనుచున్నాను” అని యిట్లు తెలియవచ్చునట్టిదియునగు [1] “అహం” (నేను) అనునది యన్ననో అట్టి జ్ఞానమాత్రమునకంటె వేఱగు (విరుద్ధస్వభా వమగు) బాహ్యపదార్థమే ?

భాష్యకారులు :—అటులఁ జెప్పఁదగదు. ఏలన, “నేను తెలిసికొను చున్నాను” అనెడి యనుభవము జ్ఞానము నొకధర్మముగాను “నేను” అను దానిని ధర్మిగాను (అట్టి జ్ఞానమనఁబడు ధర్మము గలదానినిగాను) తెలుపుచుండుట ప్రత్యక్షసిద్ధము. నీవు చెప్పునదియన్ననో ఇట్లు ప్రత్యక్షసిద్ధమగునట్టి యనుభవ ముతో విరోధించును. ఇంతియకాక :—

శ్లో॥ అహ మర్థో నచే దాత్మా ప్రత్యక్త్వం నాత్మనో భవేత్ ।
అహం బుద్ధ్యా పరాగర్థాత్ ప్రత్యగర్థో హి భిద్యతే॥

(1) ౭౦-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణమును చూడుము.

తా॥ "అహమ్" (నేను) అని యిట్లు ప్రకాశించునది యాత్మ కాని పక్షమున ఆత్మకు ప్రత్యక్త్వము (తనకుతాను ప్రకాశించునదియగుట) సిద్ధింపక పోవును. ఏలన, "అహం" (నేను) అని యిట్లు తనకుతానే ప్రకాశించుటచేఁగదా ప్రత్యగర్థము (తనకుతాను ప్రకాశించునట్టిది) పరాగర్థమునకంటెను ("ఇది" "అది" అని యిట్లు మఱియొక్కదానికి ప్రకాశించునట్టి దానికంటెను) వేఱయినదిగ నెన్నఁబడుచున్నది.

శ్లో॥ నిరస్తాఖిల దుఃఖోఽహమ్ అనన్తానన్దభాక్ స్వరాట్ ।
భవేయమితి మోక్షార్థీ శ్రవణాదౌ ప్రవర్తతే॥

తా॥ మోక్షమును గోరువాఁడు "నేను ఈ సాంసారిక దుఃఖముల నన్నింటిని పోఁగొట్టుకొని అపరిమితమగునట్టి యానందమును పొంది స్వయం ప్రకాశుఁడను కావలయును" అనెడి యభిలాషచేఁ గదా శ్రవణ మననాదుల యందు ప్రవర్తించుచున్నాఁడు.

శ్లో॥ అహమర్థవినాశశ్చే న్మోక్ష ఇత్యధ్యవస్యతి ।
అపసర్పేదసౌ మోక్షకథా ప్రస్తావగన్ధతః॥

తా॥ అట్టి పురుషుఁడు "నేను" అనెడి వస్తువు నశించుటయే మోక్షమని యెఱుంగునట్లైన లేశమాత్రమైనను మోక్షమన్నమాటనే యెత్తకుండునే?

శ్లో॥ మయి నష్టేఽపి మత్తోఽన్యా కాచి జ్ఞప్తి రవస్థితా ।
ఇతి తత్ప్రాప్తయే యత్నః కస్యాపి న భవిష్యతి॥

తా॥ నేను నశించిపోయినను నాకంటెను వేఱగు జ్ఞప్తి (తెలివి) అనెడు వస్తువొకటి యుండు ననుకొని అందులకై యెవ్వఁడు ప్రయత్నించును? ఎవ్వఁడును ప్రయత్నింపఁడే!

శ్లో॥ స్వసంబంధితయా హ్యస్యా స్సత్తా విజ్ఞప్తితాదిచ ।
స్వసంబంధ వియోగేతు జ్ఞప్తిరేవ న సిధ్యతి॥

తా॥ "నేను తెలిసికొనుచున్నాను" అని యిట్లు "నేను" అనుదానితో సంబంధించియుండుటచేఁగదా జ్ఞప్తి (తెలివి) యనెడు వస్తువొకటి కలదనియు, అది పదార్థములను తెలుపునది యనియును ఈమొదలగునవి యన్నియును సిద్ధించుచున్నవి. "నేను" అనునది నశించిపోవుటయే మోక్షమగు పక్షమున అప్పుడు "నేను" అనుదానితో జ్ఞప్తికిఁగల సంబంధముగూడ పోవునుగాన అట్టి సంబంధమునుబట్టి యున్నదిగఁ దెలియవచ్చునట్టి జ్ఞప్తి యనునదియును లేనిదియగునే?

శ్లో॥ ఛేత్తుశ్ఛేద్యస్యచాభావే ఛేదనాదే రసిద్ధివత్ ।
అతో౽హమర్థో జ్ఞాతైవ ప్రత్యగాత్మేతి నిశ్చితమ్॥

తా॥ అదెటువలెననిన, ఛేదించువాఁడును లేకపోయి ఛేదింపఁబడునట్టి పదార్థమును లేకపోయిన పక్షమున ఛేదనము ఎట్లుండఁదగును? (అట్లే తెలిసికొనునదియును తెలియఁబడునదియును లేనట్లైన జ్ఞానము (తెలిసికొనుట) సయితము లేకపోవునే?) కావున "నేను" అని యిట్లు తెలియవచ్చునట్టి జ్ఞాతయే (తెలిసికొనువాఁడే) యాత్మయని నిశ్చయింపఁబడుచున్నది.

శ్లో॥ విజ్ఞాతార మరేకేన జానాత్యేవేతిచ శ్రుతిః ।
ఏతద్యోవేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతిచ స్మృతిః॥

తా॥ "విజ్ఞాతార మరేకేన విజానీయాత్" (బృ. ౪-అ. ౪-బ్రా. ౧౪-వా) అను శ్రుతివాక్యము "ఓయి! విజ్ఞాతయగు (తెలిసికొనునదియగు) ఆత్మను దేనిచేఁ దెలిసికొన శక్యము?" అని యిట్లు చెప్పుచు జ్ఞాతయే (తెలిసికొనునదియే) ఆత్మయని తెలుపుచున్నది. "ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః" (భ. గీ. ౧౩-అ. ౧-శ్లో) అనెడు శ్రీభగవద్గీతావాక్యము, ఈ శరీరమును అవయవములుగానును మొత్తముగానును దీనిని నేనెఱుంగుదునని ఎవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వానిని ఈ శరీరమునకన్న వేఱైన క్షేత్రజ్ఞునిఁగా ఆత్మయాథాత్మ్యము నెఱింగినవారు చెప్పుచున్నారనుచు జ్ఞాతయే యాత్మయని తెలుపుచున్నది.

"నాత్మా౽శ్రుతే ర్నిత్యత్వాచ్చ తాభ్యః" (బ్ర. సూ. ౨-అ. ౩-పా. ౧౮-సూ) అను సూత్రము మొదలుకొని "జ్ఞో౽తఏవ" (బ్ర. సూ. ౨-అ. ౩-పా. ౧౯-వ సూ.) అను సూత్రము వఱకు బ్రహ్మసూత్రకారులు సయితము జ్ఞాతయే (తెలిసికొనునదియే) యాత్మయని ప్రతిపాదింపఁబోవుచున్నారు. కావున కేవలము జ్ఞప్తి (తెలివి) మాత్రము ఆత్మకాదని సిద్ధమగుచున్నది.

"అహం" (నేను) అనునది "నేను" అనెడి ప్రత్యయముచేఁ ("నేను" అని యిట్లు మనస్సున తోఁచునట్టి యెఱుకచేఁ) దెలుపఁబడునట్టిది. "నీవు" లేక "ఇది" యనునది యన్ననో "నీవు" లేక "ఇది" యనెడి ప్రత్యయముచేఁ దెలుపఁబడునది. ఇట్లుండ "నేను తెలిసికొనుచున్నాను" అనియిట్లు జ్ఞాతగఁ దెలియవచ్చునట్టి "నేను" అనునది "నీవు" లేక "ఇది" అని యిట్టి జ్ఞానముచేఁ దెలుపఁదగినదియని అనఁగా బాహ్యపదార్థమని (౧౦౪ పు. ౨౦ పం) నీవుచెప్పునది "నాతల్లిగొడ్డురాలు" అనునట్లుస్వవచనవిరుద్ధము. ఇట్లు జ్ఞాతగఁ దెలియవచ్చునట్టి "అహం" (నేను)

అనెడు వస్తువు తాను ప్రకాశించుటలో వేఱొకదాని సహాయము నపేక్షించునట్టిది యనియును చెప్పఁదగదు. ఏలన, అది స్వయంప్రకాశమయినది. చైతన్యస్వరూప మగుటనుగదా స్వయంప్రకాశమందురు! ఏదిస్వయంప్రకాశస్వరూపమో అది దీప మువలెనే తాను ప్రకాశించుటలో వేఱొకదానిసహాయము నపేక్షించునట్టిది కాఁదగదు. దీపము మొదలగునవి స్వకీయమగు ప్రభయొక్క యతిశయముచేతనే ప్రకాశించునవియగుచు ఎన్నఁడును ప్రకాశింపనట్టివిగాని తాముప్రకాశించుటలో వేఱొకదాని సహాయము నపేక్షించునట్టివిగాని కావు. అయితే దీపము స్వయం ప్రకాశ స్వరూపమగుటచే తనకు తానే ప్రకాశించునట్టిదియు తన కాంతిచే ఇతరపదార్థములను సయితము ప్రకాశింపఁజేయునట్టిదియు నగును. ఎట్లన:—

తేజస్సు (అగ్ని మొదలగునది) ఒక్కటియే [1]ద్రవ్యమైనను అది ప్రకాశము గాను ప్రకాశము గలదిగానును గన్పట్టుచున్నది. ప్రకాశమనునది ప్రకాశవంత మగు తేజస్సుమొదలగు ద్రవ్యముయొక్క [2]గుణమైనను అది స్వయముగ నట్టి ద్రవ్యమే గాని తెలుపువర్ణము మొదలగు వానివంటి కేవల గుణముకాదు. ఏలన, [3]అది తనయాశ్రయమునకంటె వేఱుతావులను సయితము ఉండునట్టిది. తానుస్వయముగ [4]రూపమనఁబడు వేఱొకగుణము కలది. కావున నది తెలుపు వర్ణము మొదలగు కేవలగుణములకంటెను విలక్షణమయినది. ఈపైన గనఁ బఱుపఁబడిన హేతువులనుఁబట్టియు, తాను స్వయముగ ప్రకాశముకలది యగు టనుబట్టియును అది తేజస్సు అనఁబడు ద్రవ్యమేగాని మఱొకటికాదు. తనస్వరూ పమునును ఇతర పదార్థములనును ప్రకాశింపఁ జేయునట్టిది యగుటంజేసి యది ప్రకాశము కలదియని సిద్ధమగుచున్నది. అయితే అది యెల్లప్పుడును తేజ

(1) పృథివి, అప్పు, తేజము, వాయువు, ఆకాశము, కాలము, దిక్కు, ఆత్మ, మనస్సు అను నవి ద్రవ్యములని వైశేషికులు చెప్పుచున్నారు.

(2) శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము మొదలగునవి గుణము లనఁబడును.

(3) ద్రవ్యము గుణములను కలిగియుండునుగాని గుణము వేఱొకగుణమును కలిగియుండదు. కావున ఏది వేఱొకగుణమును గలిగియుండునట్టిదిగఁ గానఁబడునో అది ద్రవ్యమే యని చెప్పఁదగును గాని గుణమని చెప్పఁదగదు. ఈ న్యాయమునుబట్టి ప్రకాశము రూపమనఁబడు గుణమును గలిగి యుండునట్టిదియగుటఁజేసి ద్రవ్యమేగాని గుణము కాఁదగదు.

(4) గుణ మెప్పుడును తనకాధారభూతమగు ద్రవ్యమునే యాశ్రయించియుండునట్టిదై యది యుండు తావునే యుండునుగాని వేఱొకతావున నుండదు. ఇది గుణముయొక్క స్వభావము. ప్రకాశమనునది తన కాశ్రయమగు తేజస్సు మొదలగు పదార్థమున్నట్టి తావులనేకాకుండ ఇతరత్ర కూడ గానఁబడుచున్నందున నది గుణమని చెప్పఁదగదు.

స్సును ఆశ్రయించియుండుట వలనను తేజస్సునకు శేషభూత మగుటవలనను లోకమున నది గుణముగ వ్యవహరింపఁబడుచున్నదిగాని మఱేమికాదు.

అయితే తేజస్సు (అగ్ని) మొదలగు ప్రకాశవంతమగు పదార్థము యొక్క యవయవములు శిథిలములై చెల్లాచెదరుగ నిటునటు వ్యాపించుచు ప్రకాశమని పిలువఁబడుచున్నవి యనియెదవేమో? అట్లు చెప్పఁదగదు. ఏల యన, అట్లు చెప్పితివేని మణి, సూర్యుఁడు మొదలగు ప్రకాశవంతములగు పదార్థములు తుట్టతుదకు సంపూర్ణముగ నశించునట్టివియే యని ప్రసక్తించునే? ఇంతియకాక దీపము సయితము అట్టిదియే యగు (శిథిలములై చెల్లాచెదరుగ నిటునటు పోవునట్టి యవయవములు గలదియగు) పక్షమున నది సంపూర్ణముగ (అన్ని యవయవములతోను గూడియున్నట్టిదిగ) మన కెన్నఁడును తెలియరాకుండునే? మఱియు నట్లైనపక్షమున చెల్లాచెదరుగ విడిపోవునట్టి యవయవములు గలవియగు దీపజ్వాలలు నాలుగంగుళముల పిండాకారము గలవగునట్లు నియతముగ నొకటిగఁ జేరినవై పైకిలేచి తరువాత ఏకకాలమున అన్నివైపులను—అడ్డముగను పైగను క్రిందుగను—ఏకాకారము గలవై సంచరించుచుండుటకు కారణమేమున్నది? అట్లుండుట యశక్యము. అయితే దీపజ్వాలలు వాని ప్రకాశములతోఁగూడ ప్రతిక్షణము పుట్టుచు నశించుచున్నవని చెప్పఁదగును. ఏలన, అవి తాము ప్రకాశించుట కావశ్యములగు హేతువులు సంపూర్ణముగ ఉన్నట్లైన—తైలము, వత్తి మొదలగునవి యొకదానితో నొకటి చేరియున్నట్లైన—ప్రకాశించుచుండుటవలనను, అవి క్రమక్రమముగ క్షీణించి నశింపఁగా జ్వాలలును ప్రకాశమును నశించుటవలనను అట్లు ఊహింపఁబడు చున్నవి. అట్లైనచో దీపాదుల ప్రభ తన యాధారముయొక్క (దీపాదుల) సమీపమున ఎక్కువ వేడిమిని ఎక్కువ ప్రకాశమును గలదియనగుటకు హేతు వేమనిన, అగ్ని మొదలగువాని సమీపమున ఎక్కువ వేడిమియు ఎక్కువ ప్రకాశమును ఉన్నట్లు మనకు ప్రత్యక్షసిద్ధమేగదా! అట్లే యిచటను నెలుంగునది.

అట్లే ఆత్మయును జ్ఞానస్వరూపుఁడేయై జ్ఞానము గుణముగాఁ గలవాఁడు. జ్ఞానస్వరూపుఁడనఁగా స్వయంప్రకాశుఁడనుట. కనుకనే శ్రుతులును అట్లే చెప్పుచున్నవి. ఎట్లన:—

వాజసనేయులు "సయథాసైన్ధవ ఘనోఽనన్తరోఽబాహ్యః కృత్స్నో రస ఘనఏవ ఏవం వా అరేఽయమాత్మాఽనన్తరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞాన ఘనఏవ" (బృ. ౬-అ. ౫-బ్రా. ౧౩-వా) అనువాక్యముచే "ఓమైత్రేయీ!

ఎట్లు ఉప్పుగడ్డ వెలుపలిభాగంబును లోపలిభాగంబునంతయును ఉప్పదనపుగడ్డయే యగునో అట్లేయీయాత్మయును వెలుపలిభాగంబును లోపలిభాగంబును, అంతయును స్వరూపమునుబట్టియు గుణమునుబట్టియును, జ్ఞానముయొక్క గడ్డయే యగుచున్నది" అనియు, వేఱొకతావున "విజ్ఞానఘనఏవ" (బృ. ౪-అ. ౪-బ్రా. ౧౨-వా) అను వాక్యముచే "ఆత్మ జ్ఞానమే స్వరూపముగాఁగలవాడు" అనియును, వేఱొకతావున [1]"అత్రాయం పురుష స్స్వయం జ్యోతిర్భవతి" (బృ. ౬-అ. ౩-బ్రా. ౯-వా) అనువాక్యముచే "స్వప్నావస్థయందును ఈ జీవుఁడు స్వయంప్రకాశుఁడు" అనియు మఱియొకతావున [2]"న విజ్ఞాతు ర్విజ్ఞాతే ర్విపరిలోపో విద్యతే" (బృ. ౬-అ. ౩-బ్రా. ౩౦-వా) అను వాక్యముచే "విజ్ఞాత యగు (తెలిసికొనునట్టి) ఆత్మతో సంబంధించిన జ్ఞానమునకు లోపమెన్నఁడును లేదు" అనియును పఠించుచున్నారు.

ఛందోగులు [3]"అథయో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా" (ఛా. ౮-ప్ర. ౧౨-ఖ. ౪-వా) అనువాక్యముచే "దీనినివాసన చూచుచున్నానని యెవ్వఁడు తెలిసికొనుచున్నాడో వాఁడే యాత్మ" అని పఠించుచున్నారు.

వాజసనేయులు [4]"కతమ ఆత్మా యోయం విజ్ఞాన మయఃప్రాణేషు హృద్యన్త ర్జ్యోతిః పురుషః" (బృ. ౬-అ. ౩-బ్రా. ౭-వా) అనువాక్యముచే "జీవుడనఁగా నెవ్వఁడని జనకుఁడడిగిన ప్రశ్నమునకు హృత్కమలమధ్యమున నుండువాఁడును, ప్రాణమని పిలువఁబడు నట్టిదియు యింద్రియమునగు ముఖ్యప్రాణముయొక్క మధ్యమున నుండువాఁడును విజ్ఞానమనఁబడు గుణముగలవాఁడును జ్యోతిస్సనంబడు ప్రకాశమే స్వరూపముగాఁగలవాఁడును జీవుఁడు" అని యిట్లు ఉత్తరమును పఠించుచున్నారు.

---

(1) "సయథా సైన్ధవఘనః" ఇత్యాది శ్రుతివాక్యములందు జెప్పఁబడిన జ్ఞానమనఁగా స్వయంప్రకాశమని తెలుపుటకై యీశ్రుతి యుదహరింపఁబడియె.

(2) జ్ఞానము కలది యాత్మయనియు, జ్ఞానము ఆత్మయొక్క ధర్మమనియు నిట్లు జ్ఞానాత్మలకుఁగల ధర్మధర్మిభావమును దెలుపుటకై యీవాక్యము ఉదహరింపఁబడియె.

(3) తెలిసికొనునదియగు ఆత్మతో సంబంధించినట్టిదియగు జ్ఞానము నిత్యమయినదియని చెప్పఁబడియె. ఇట్లుండ కేవలజ్ఞానము సయితము నిత్యమనెడు శంకను తొలఁగించుటకుగాను ఆత్మ జ్ఞాత (తెలిసికొనునది) యేగాని కేవలజ్ఞానముకాదని నిరూపించుటకై యీవాక్యము ఉదహరింపఁబడియె.

(4) ఆత్మ జ్ఞానమును గుణముగాఁ గలిగియుండునట్టిదియనియు, స్వయంప్రకాశమనియును ఒక్కవాక్యముననే తెలుపఁబడుచున్నదని గనఁబఱచుటకై యీవాక్యముదహరింపఁబడియె.

ప్రశ్నోపనిషత్తునందు [1]"ఏష హి ద్రష్టా, (స్ప్రష్టా), శ్రోతా, రసయితా ఘ్రాతా మన్తా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః" (ప్రశ్న. ౪-ప్రశ్న. ౯-వా.) అనువాక్యమున "ఈతఁడే చూచువాఁడును, స్పృశించువాఁడును, వినువాఁడును, రుచిచూచువాఁడును, మననముచేయువాఁడును, తెలిసికొనువాఁడును, చేయువాఁడును, విజ్ఞాన స్వరూపుఁడును నగు ఆత్మ" అని పఠింపఁబడియె.

వాజసనేయులు [2]"విజ్ఞాతార మరే కేన విజానీయాత్" (బృ ౪-అ. ౪-బ్రా-౧౪. వా.) అను వాక్యముచే "జ్ఞాతయగు ఆత్మను దేనిచేఁ దెలిసికొన శక్యము?" అని పఠించుచున్నారు.

మఱియొక తావున [3]"జానాత్యేవాయం పురుషః" మోక్షావస్థయందును ఈ జీవుఁడు జ్ఞాతయే (తెలిసికొనువాఁడే) యని పఠింపఁబడియె.

ఛందోగులు [4]"న పశ్యో మృత్యుం పశ్యతి న రోగం నోత దుఃఖతాం" (ఛా. ౭-ప్ర. ౨౬-ఖ. ౨-వా) అనువాక్యముచే "పరమాత్మను సాక్షాత్కరించినవాఁడు అవిద్యనుపొందఁడు, రోగమును అనుభవింపఁడు, దుఃఖమును సయితము అనుభవింపఁడు" అనియు, వేఱొకతావున [4]"స ఉత్తమః పురుషః" అనువాక్యముచే "ఈముక్తునిచే పొందఁదగినవాఁడు ఉత్తమపురుషుఁడు" అనియు, [3]"నోపజనం స్మరన్నిదం శరీరమ్" (ఛా. ౮-ప్ర. ౧౨-ఖ. 3-వా) అను వాక్యముచే "పరమాత్మను బొందిన జీవుఁడు తనశరీరమును స్మరింపకుండును" అనియును పఠించుచున్నారు.

---

(1) జ్ఞానము ఆత్మయొక్క గుణమును స్వరూపమునునని గనఁబఱచుటకై యీవాక్య ముదాహరింపఁబడియె.

(2) జ్ఞాతవ్యమగు ఆత్మయొక్క స్వరూపము జ్ఞాతయగుటయే (తెలిసికొనునది యగుటయే) యని గనఁబఱచుటకై యీవాక్యముదహరింపఁబడియె. కావున నిందుచే జ్ఞాతయగుట ఆత్మకు స్వాభావికమని సిద్ధమగుచున్నది.

(3) సంసారదశయందు మాత్రమేకాక మోక్షావస్థయందు సయితము ఆత్మకు జ్ఞాతృత్వము కలదని తెలుపుటకై యీవాక్య ముదహరింపఁబడియె.

(4) ఇట్లు పూర్వశ్రుతియందు "జానాత్యేవ" అనుతావున ఏవకారస్వారస్యమునుబట్టి మోక్షావస్థయందును ఆత్మకు జ్ఞాతృత్వముకలదని స్థాపింపఁబడియె. అయితే మోక్షావస్థయందు జ్ఞానము లేదని కొన్నిశ్రుతులు చెప్పుచున్నవనెడి శంకను తొలఁగించుటకై అప్పుడు యేయే విషయములను గుఱించిన జ్ఞానములేదో యేయే విషయములను గుఱించిన జ్ఞానముకలదో ఆవిభాగమును గనఁబఱచుటకై యీవాక్య ముదహరింపఁబడియె.

ప్రశ్నోపనిషత్తునందు [1]"ఏవమేవాస్య పరిద్రష్టు రిమాః షోడశకలాః పురుషాయతనాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛన్తి" (ప్రశ్న. ౬. ప్రశ్న. ౫-వా) అనువాక్యమున "ఇట్లే తెలిసికొనువాఁడగు ఆత్మయొక్క పదియాఱు కళలును భగవదధీనము లయినవిగాన, ఈతండు భగవంతుని పొందిన పిదప అవి నశించుచున్నవి" అని పఠింపఁబడియె.

తైత్తిరీయులు "తస్మాద్వా ఏతస్మా న్మనోమయా దన్యోఽన్తరఆత్మా విజ్ఞానమయః" (తై. ఆనం. ౫-అను. ౨-వా) అను వాక్యముచే "మనోమయకోశమున కంటె వేఱై దాని లోపలనుండు వాఁడు జ్ఞానము విస్తారముగాఁగల జీవుఁడు" అని పఠించుచున్నారు.

బ్రహ్మసూత్రకారులు సయితము "జ్ఞోఽతఏవ" (బ్ర. సూ. ౨-అ. 3-పా. ౧౮-సూ) అనుసూత్రముచే ఆత్మజ్ఞాతయే (తెలిసికొనువాఁడే) యని ప్రతిపాదింపఁబోవుచున్నారు.

కావున స్వయంప్రకాశుఁడగునట్టి యీయాత్మజ్ఞాతయే(తెలిసికొనువాఁడే) గాని కేవలజ్ఞానముమాత్రము కాదు. సామాన్యముగ ప్రకాశమనునది దీపము మొదలగువాని ప్రకాశమువలె నొక్కదానిది—అనఁగా నొక్కదానితో సంబంధించినట్టిది. కావున నట్లు కేవలప్రకాశమగు సంవిత్తే స్వయముగ నాత్మ కాఁదగదు. "సంవిత్తు" అనియు "అనుభూతి" యనియు "జ్ఞానము" అనియును ఈ మొదలగు శబ్దములు సంబంధిశబ్దములు (Relative Terms) అని కదా శబ్దార్థముల స్వరూపములను బాగుగ నెఱింగిన పెద్దలు చెప్పుచున్నారు. మఱియు లోకవ్యవహారమునఁగాని వేదములలోనుగాని యెచ్చటను [2]"జానాతి" (తెలిసికొనుచున్నాఁడు) ఈ మొదలగు క్రియాపదములు అకర్మకములుగఁగాని అకర్తృకములుగఁగాని ప్రయోగింపఁబడియున్నట్లు యెన్నఁడును చూచియుండలేదు.

అజడమగుటనుబట్టి (జడముకానిదగుటనుబట్టి) గదా! సంవిత్తే (జ్ఞానమే) యాత్మయని యద్వైతులు వాదించుచున్నారు. వారి మతప్రకారము అజడమ

---

(1) ఇట్లు పరమపురుషుని పొందినట్టి యీజీవునికి జ్ఞాతృత్వముండఁగనే శరీరలయమును శ్రుతి తెలుపుచున్నది. కావున జ్ఞాతృత్వము ముక్తావస్థయందును అనువర్తమానమని తెలుపుటకై యీ శ్రుతి యుదహరింపఁబడియె.

(2) తెలిసికొనువానిని, తెలిసికొనఁబడు పదార్థమును దెలుపునట్టి శబ్దములులేనిదై "జానాతి" (తెలిసికొనుచున్నాఁడు) అను క్రియాపదమును గలిగియుండు వాక్యమెచటను గానఁబడదనుట.

నఁగా నెట్టిది? అజడమనఁగా తన సత్తచేతను మాత్రమే (తనయునికి మాత్రము చేతనే) ప్రకాశించునట్టిదా? అట్లైన పక్షమున దీపము మొదలగునవియును తనయునికి మాత్రముచేతనే ప్రకాశించునట్టివిగాన వారు గనఁబఱచిన లక్షణము దీపాదులకు సయితము వర్తించునే? ఇంతియకాక సంవిత్తునకంటె వేఱుగ ప్రకాశ మనఁబడునట్టి యొకధర్మము కలదని వారంగీకరింపరు (౬౬పు. ౨౧. పం) కావున వారుధర్మమును (ప్రకాశమును) నిరూపింపక ధర్మిని(ప్రకాశించు సంవిత్తును)ఎట్లు నిరూపింపఁగలరు? అందులకై వారు సంవిత్తునకు ప్రకాశమనఁబడునట్టి యొకధర్మము వేఱుగ గలదని యంగీకరించుపక్షమున సంవిత్తు (జ్ఞానము) నిర్విశేషము (ధర్మములేనియును లేనిది) యనెడు వారి మతమునకు విరుద్ధముగఁ జెప్పినట్లగును. అజడమనఁగా తానున్నప్పు డెన్నఁడును ప్రకాశింపక యుండనిది—అనఁగా తాను న్నప్పుడు నిత్యముగ ప్రకాశించుచుండునట్టిది—యని వారొకవేళ చెప్పుదు రేమో? అయితే సుఖదుఃఖాదులు సయితము తామున్నప్పుడు తామున్నట్టివిగఁ దెలియవచ్చునవియే గాన వారు చెప్పిన లక్షణము సుఖదుఃఖాదులకు సయితము వర్తించునే? కనుక ఈవాదము సయితము నిరసింపఁబడినదగుచున్నది.

అద్వైతి:—సుఖాదులు ఎల్లప్పుడును విడువకుండ ప్రకాశించునట్టివియే యైనను, అవి యట్టివిగ వేఱొకనికిఁ దెలియవచ్చునవి యగుటంజేసి, అట్లు వేఱొకనికిఁ దెలియవచ్చునట్టివియగు ఘటపటాది పదార్థములవలె జడములు. కావున సుఖాదులు ఆత్మేతరములు (అజడమగు ఆత్మకంటె వేఱయినవి—అనఁగా జడములు).

భాష్యకారులు:—అయితే జ్ఞానమనునది తనకే తెలియవచ్చునట్టిదా? కాక యది వేఱొకదానికిఁ దెలియవచ్చునట్టిదా? "నేను సుఖముగలవాఁడను" అని యిట్లు సుఖమనునది జ్ఞాతయగు "అహం" (నేను) అనెడు వేఱొకదానికిఁ దెలియవచ్చుచందమున "నేను తెలిసికొనుచున్నాను" అని యిట్లు జ్ఞానము సయితము అట్టి "అహం" అనుదానికే తెలియవచ్చునట్టిదిగఁ గన్పట్టుచున్నదే? ఇందువలన తనకే తాను తనసత్తచేతనే (తనయునికిమాత్రముననే) ప్రకాశించుట యనఁబడు అజడత్వము సంవిత్తునకు (జ్ఞానమునకు) సిద్ధింపనేరదు. కాఁబట్టి తనకే తాను తన సత్తచేతనే ప్రకాశించునట్టిదియై అజడమగు "అహం" అను నట్టిదే ఆత్మ. అట్టి యాత్మతో సంబంధించినట్టిది యగుటంబట్టియే జ్ఞానమనున దొకటి యున్నదిగఁ దెలియవచ్చుచున్నది. అట్టి సంబంధమునుబట్టియే ఒక

యాత్మ నాశ్రయించియుండు సుఖాదు లాయాత్మకుఁ దెలియవచ్చునట్టి విధమున వేఱొకయాత్మకు ఎట్లు తెలియరావో అట్లే ఒక ఆత్మ నాశ్రయించి యుండునట్టి జ్ఞానము ఆయాత్మకే విశదముగఁ దెలియవచ్చునట్టిదై వేఱొక యాత్మకు అట్లు విశదముగఁ దెలియరానిదిగఁ గన్పట్టుచున్నది. కావున జ్ఞానము మాత్రమే యాత్మ కాఁదగదు. అయితే అట్టి జ్ఞానముగలదియగు "అహం" అనునదియే యాత్మయని యెఱుంగునది.

"వాస్తవమునకు అనుభూతి వేఱొకదానిచేఁ దెలుపఁదగనిదియు, వేఱొకదానిని ఆశ్రయించి యుండనిదియునగుచు, ముత్యపుఁచిప్ప రజతముగ భ్రమింపఁబడు చందమున, భ్రాంతివశమున జ్ఞాతగాఁ (తెలిసికొనునదిగఁ) దెలియవచ్చుచున్నది. ఏదైననొక యాధారము లేకుండ భ్రాంతి గలుగనేరదు గదా!" (౨౦-పు. ౩-పం.) అని యిట్లు అద్వైతులు చేయు వాదము యుక్తమయినదికాదు.

అనుభూతిని జ్ఞాతగ నెఱుంగుట భ్రాంతియనెడి వాదమును ఖండించుట.

ఏలన, అట్లైన పక్షమున అనుభవితయగు (జ్ఞాతయగు = తెలిసికొనునదియగు) "అహం" (నేను) అనునది అనుభవముతో (జ్ఞానముతో) నొక్కటిగానే అనఁగా "నేనే అనుభవము" అని యిట్లు తెలియవచ్చుచుండవలయునే? ఎటువలెననిన, మన యెదుట నుండెడి కాంతిగల ద్రవ్యముగా రజతము మొదలగునది తెలియవచ్చునప్పుడు "ఇది రజతము" అనియిట్లు ఆపదార్థముతో నొక్కటిగానేగదా! తెలియవచ్చుచున్నది. ప్రకృతమున నో (దండీ దేవదత్తః = దేవదత్తుఁడు దండముగలవాఁడు అనునప్పుడు) దండమనెడు వస్తువు తన్ను కలిగియుండు దేవదత్తుని కంటెను వేఱుపదార్థముగాఁ దెలియవచ్చుచున్నదై తనకంటె వేఱగు దేవదత్తునితన్ను గలిగియుండువానినిగ విశేషింపఁ జేయుచుండు చందమున అనుభూతియును (జ్ఞానమును) "అహం" (నేను) అనెడు దానికంటెను వేఱుపదార్థముగాఁ దెలియవచ్చుచు తనకంటెను వేఱగు "అహం" అనుదానిని విశేషింపఁ జేయుచున్నది. కావుననే "నేను అనుభవించుచున్నాను (అనుభవము గలవాఁడను)" అనెడు వ్యవహారము లోకమునఁ గలదు. కాబట్టి "దండీ దేవదత్తః=దేవదత్తుఁడు దండముగలవాఁడు" అనెడు వ్యవహారము దేవదత్తుని దండవిశిష్టునిగఁ దెలియఁజేయునట్లు "నేను అనుభవించుచున్నాను (అనుభవము గలవాఁడను)" అనెడు వ్యవహారము "నేను" అనుదానిని అనుభవ (జ్ఞాన) విశిష్టమైనదానినిగఁ దెలియఁజేయుచుండఁగా, అట్టి వ్యవహారము విశేషణభూతమగు అనుభవమునుమాత్రమే తెలుపుచున్నదని యెట్లు ప్రతిజ్ఞచేయఁదగును? (౬౧-పు. ౮-పం).

"నేను స్థూలమయినవాఁడను" అని యివ్విధమున దేహాత్మాభిమానము గలవానికే అనఁగా శరీరధర్మమగు స్థూలత్వమును ఆత్మయందుండు దానినిగాఁ దలంచుటచే దేహమునే యాత్మగాఁ దలంచినవానికే "నేను జ్ఞాతను (తెలిసికొనువాఁడను)" అనియిట్లు జ్ఞాతృత్వము ఆత్మ యందుండునదిగఁ దెలియవచ్చుచున్నది. కావున "నేను స్థూలమయినవాఁడను" అని యిట్లు తెలియవచ్చు దేహాత్మాభిమానము మిథ్య (అసత్యము) అయినట్లే జ్ఞాతృత్వము సయితము మిథ్యయే. అని యిట్లు అద్వైతులు చేయువాదము యుక్తమయినదికాదు. అట్లైనపక్షమున, వారు ఆత్మగా నంగీకరించినట్టి యనుభూతియును మిథ్యయేయని ప్రసక్తించునే? ఏలన, అదియును అట్టివానియందే యుండునట్టిదిగాను కదా దెలియవచ్చుచున్నది.

జ్ఞాతృత్వము మిథ్య యను వాదమును ఖండించుట.

అద్వైతి:—తక్కినవానిని అన్నింటిని బాధించునట్టి తత్త్వజ్ఞానముచే అనుభూతి బాధింపఁబడుచుండలేదు కదా! ఇట్లుండ అది మిథ్య యని యెట్లనఁదగును? అట్లు చెప్పఁదగదే?

భాష్యకారులు:—అట్లా! జ్ఞాతృత్వము సయితము అట్టిదియే కదా! కావున అదియును మిథ్యకాదని యెఱుంగుము.

[1]"ఆత్మ వికారములేవియును లేనిదిగదా! ఇట్లుండ అది తెలిసికొనుట యను కార్యము నొనర్చునదియగుట యనెడి జ్ఞాతృత్వమును గలిగియుండుట యెట్లు సంభవము? కావున వికారములు గలదియు, జడమయినట్టిదియు, వికారాస్పదమగునట్టి ప్రకృతినుండి గలుగునదియు నగు అహంకారమునందు మాత్రమే అట్టి జ్ఞాతృత్వముండఁదగినది. అందువలన జ్ఞాతృత్వము ఆత్మయందుండఁదగినదికాదనియు, అది అంతఃకరణ రూపమగు అహంకారమునందే యుండఁదగినది యనియు నెఱుంగునది.

జ్ఞాతృత్వమును గుఱించి యద్వైతుల వాదమును అనువదించుట.

(1) జ్ఞాతయనఁగా జ్ఞాతృత్వము గలది. జ్ఞాతృత్వమనఁగా జ్ఞానము (తెలియుట) యనఁబడునట్టి యొక కార్యమున కాశ్రయమగుట. జ్ఞానమనఁబడునట్టి యీ కార్యము ఒక కర్మమేగదా. కర్మము తాను జరుగుచున్నట్టి కాలమునను మాత్రమె యుండునదియై తదితర కాలములయందుండునది కాకపోవుటఁ జేసి యది సర్వకాలముల నుండునట్టిది కాదు. కావున నది యనిత్యమైనది. ఇంతియకాక కర్మము ఒక్కటియేవిధముగ నుండునట్టిది కాక ఒక్కవిధముగాను వేఱొకవిధముగాను మఱియొకవిధముగాను ఇట్లు అనేక విధములుగా నుండఁదగినది. ఎట్లన, గ్రామాంతరమునకుఁ బోవుట యొక కర్మముగదా. అది యనేకవిధములుగాను మాఱునది యగునట్లు ప్రత్యక్షసిద్ధము. ఏలన, గ్రామాంతరమునకుఁ బోవల యునన్న అశ్వముమీఁద పోవచ్చును, శకటముమీఁద పోవచ్చును, నడిచి పోవచ్చును, పోకుండకూడ

ఇంతియకాక కర్తృత్వము (ఒక కార్యము నొనర్చునది యగుటయు) మొదలగు నది రూపము మొదలగునదివలె దృశ్య (కంటికి అగపడు) పదార్థములయొక్క ధర్మము. అయితే అట్టి కర్తృత్వమును, "అహం" (నేను) అనుదానిచే దెలు పఁబడుటయును ఆత్మయొక్కధర్మములుగా నంగీకరించు పక్షమున ఆత్మయనునది దేహమువలె ఆత్మకానిదియు, వేఱొకదానికి ప్రకాశించునదియు, జడమయినది యునని ప్రసక్తించును" అని యిట్లు అద్వైతులు వాదించుచున్నారు.

జ్ఞాతృత్వమును గుఱించి యద్వైతులు చేయు వాదము అసంగతమని నిరూపించుట.

అయితే వారు చేయువాదము యుక్తమయినదికాదు. ఏలన, అచేతనమగు టయు, ప్రకృతియొక్క వికారమగుటయు, దృశ్యపదార్థమగుటయు, వేఱొకదానికిఁ దెలియవచ్చునది యగుటయు, వేఱొకదానికిగా నుండునది యగుటయును ఈ మొదలగునవి దేహమునకువలె అంతః కరణరూపమగు అహంకారమునకు సంభవములే. జ్ఞాతృత్వ మన్ననో చేతనపదార్థమునందు మాత్రమే యుండునట్టిది. ఎట్లన, దేహము మొదలగునవి దృశ్యములును (కంటికి అగపడునవియును) పరాక్కులును(వేఱొకదానికి తాము తెలియవచ్చునవియును)అయినట్టివి. ఆత్మయన్ననో అట్టిదికాక ద్రష్టయును (తెలిసికొనునదియును) ప్రత్యక్కును(తనకుతాను తెలియ

---

నుండవచ్చును. కావున కర్మము ఈపైన గనఁబఱచిన ప్రకారము అనిత్యమును వికారాస్పదమునని యెఱుఁగునది. ఏదైన నొకపదార్థము ఇట్టి కర్మమున కాశ్రయము కావలయునన్న నదియును దీని వలె ననిత్యమయినదిగాను వికారాస్పద మయినదిగాను నుండవలయును. ఆపదార్థము దీనివంటిది కానియెడల నీరెంటికి నాశ్రయాశ్రయిభావము పొసగదు.

ఆత్మయన్ననో అట్టిదికాదు. అది నిత్యమయినది. అది పరినిష్ఠితవస్తు వగుటంజేసి ఎట్టి వికార ములకును అవకాశమీయనిది. ఇట్లుండ అది యనిత్యమును వికారాస్పదమును నగు జ్ఞాతృత్వమున కాశ్రయ మెట్లు కాఁదగును?

అహంకారము అంతఃకరణముయొక్క వృత్తివిశేషము. అంతఃకరణము స్వయముగ వికారా స్పదమును అనిత్యమును గాన దానియొక్క వృత్తివిశేషమగునట్టి యహంకారమును నట్టిదియే. ఇంతి యకాక అహంకారము ప్రకృతినుండి గలుగునది. ప్రకృతి వికారాస్పదమని యందరు నంగీకరించిన విషయమేకదా. దానినుండి కలుగునట్టిదియగు అహంకారమును వికారాస్పదమయినది. మఱియు నది వేఱొకదానినుండి (ప్రకృతినుండి) కలుగునట్టిది యగుటఁజేసి యనిత్యమయినది.

ఇట్లు స్వయముగ ననిత్యమును వికారాస్పదమునునగు అహంకారము మాత్రమే యనిత్యమును వికారాస్పదమును నగు జ్ఞాతృత్వమున కాశ్రయము కాఁదగునేగాని నిత్యమును పరిష్ఠితవస్తువగుటఁ జేసి వికారరహితమును నగు ఆత్మ యిట్టి జ్ఞాతృత్వమున కాశ్రయమెట్లుకాఁదగును? ఇట్లు అద్వై తులు వాదించుచున్నారు.

వచ్చునదియును) అయినది. కావుననే దేహము మొదలగుపదార్థములకంటెను ఆత్మ విలక్షణమయినదిగా నెన్నఁబడుచున్నది. అట్లే అంతఃకరణరూపమగు అహంకారము దేహాదిపదార్థములవంటిదియగుటంజేసి యీపైని గనఁబఱచిన హేతువుల వలన నాత్మకంటె వేఱగు స్వభావముగాగలది నెన్నఁబడుచున్నది. కావున చేతనపదార్థమున కుండఁదగిన జ్ఞాతృత్వము (తెలిసికొనునదియగుట) జడమగు అహంకారమునం దెట్లుండఁదగును? విరుద్ధముగదా! అందువలన జ్ఞాతృత్వము అహంకారమునుయొక్క ధర్మము కాఁదగదు. అది యెటువలెననిన, కనుగొనఁదగినదియగు అహంకారము తాను స్వయముగ కనుఁగొనునదియని యంగీకరింపఁదగదు గదా! అట్లే తెలియఁదగినదియగు అహంకారము తాను స్వయముగ తెలిసికొనునది యని యంగీకరింపఁదగదు.

[2]అద్వైతులు చెప్పునట్లు జ్ఞాతృత్వము వికారము (మార్పు) నొందునట్టిది కాదు. ఏలన, జ్ఞాతృత్వమనఁగా జ్ఞానము (తెలివి) అనెడి గుణమున కాశ్రయమగుట—

జ్ఞాతృత్వముయొక్క స్వరూపమును నిరూపించుట.

దానిని కలిగియుండుట. నిత్యుఁడగు (జన్మమరణాదులు లేని) ఆత్మయొక్క స్వాభావికమగు గుణమగుటంజేసి జ్ఞానము నయితము నిత్యమయినది. ఆత్మ నిత్యుఁడని "నాత్మా శ్రుతేః" (బ్ర-సూ. ౨-అ. ౩-పా. ౧౮-సూ.) ఈ మొదలగు సూత్రములచే సూత్రకారులే చెప్పఁబోవుచున్నారు. మఱియు "జ్ఞోఽత ఏవ" (బ్ర-సూ. ౨-అ. ౩-పా. ౧౯-సూ.) అను సూత్రమున ఆత్మను "జ్ఞః" (తెలివిగలవాఁడు) అని యిట్లు నిర్దేశించుటచే సూత్రకారులే జ్ఞానమనఁబడు గుణమున కాశ్రయ మగుటయును ఆత్మకు స్వాభావికమే యని చెప్పఁబోవు చున్నారు. అయితే ఇట్లు ఆత్మ జ్ఞానమును స్వరూపముగాఁ గలదియే యయినను మణులు మొదలగునవి ప్రకాశము మొదలగువాని కాశ్రయమగునట్లు ఆత్మయును జ్ఞానమున కాశ్రయమగుట విరుద్ధముకాదని చెప్పఁబడియె.

---

(2) జ్ఞాతృత్వమనఁగా అద్వైతులు చెప్పునట్లు జ్ఞానమనఁబడు కార్యమునకు ఆశ్రయమగుట కాదు. అయితే జ్ఞాతృత్వమనఁగా జ్ఞానమనఁబడు గుణమున కాశ్రయమగుట. జ్ఞానము గుణము. అట్టి గుణమును గలవాఁడు అనఁగా గుణి యాత్మ. ఆత్మ నిత్యుఁడని యందఱును అంగీకరించినదియే కదా! కావున అట్టి నిత్యపదార్థమగు ఆత్మయొక్క గుణమై దానితో నెల్లప్పుడును సంబంధించినట్టిదియగు జ్ఞానము నయితము నిత్యమయినదే. కనుక అద్వైతులు చెప్పుప్రకారము జ్ఞానము కార్యముకాదు కావున నది యొకకర్మమని గాని కర్మమగుటవలన నది యనిత్యమనిగాని యెన్నఁదగదు. ఇట్లు నిత్యమగు జ్ఞానమున కాశ్రయమగుటయే జ్ఞాతృత్వముగాన ఆత్మ జ్ఞాతృత్వము కలది అనఁగా జ్ఞాతయని చెప్పినపక్షమున నేమియు బాధకములేదు. ఇట్లు విశిష్టాద్వైతులు చెప్పుచున్నారు.

ఇట్టిజ్ఞానము స్వయముగ నపరిమితమైనదియేమైనను అదియొకప్పుడు సంకోచమును (ముకుళీభావమును) వికాసమును (ప్రకాశమును) పొందఁదగినదని యిఁక మీఁద ఉపపాదించెదము. కావున ఈ యాత్మ క్షేత్రజ్ఞుఁడుగా నుండుదశయందు అనఁగా ఈశరీరముతోఁ గూడియున్నప్పుడు కర్మవశ్యత్వమనెడి యవిద్యవలన అతని జ్ఞానము సంకోచమునుబొందిన స్వరూపముగలదై ఆయాకర్మానుగుణమగు తారతమ్యముతోఁ గూడియుండునది. అట్టి జ్ఞానము ఇంద్రియములమూలముగానే ప్రసరించుటయనెడి యొకవ్యవస్థ గలది. ఇట్లు ఇంద్రియముల మూలముగ జ్ఞానమునకుఁ గల ప్రసరణమును బట్టియే జ్ఞానము గలదనియు జ్ఞానము లేదనియును ఇవ్విధమగు వ్యవహారము ప్రవర్తించుచున్నది. జ్ఞానమును ప్రసరింపఁజేయు విషయమై ఆత్మకు కర్తృత్వము కలదుగాని అది దానికి స్వాభావికమైనది కాదు. అయితే అది దానికి కర్మవశమునఁ గలిగినది. కావున ఆత్మ వికారమునొందని స్వరూపము గలదియే. ఈపైని గనఁబఱచిన ప్రకారము వికారము నొందునట్టి (స్వధర్మభూతమగు జ్ఞానమును ప్రసరింపఁజేయునది యనెడి) జ్ఞాతృత్వము జ్ఞానస్వరూపమగు ఆత్మయందుండునట్టిదియే గాని జడమగు నహంకారమునం దుండునట్టిది యగుట యెంతమాత్రము సంభవము కాదు.

అద్వైతి:—జడమగు అహంకారము చిత్తునకు (జ్ఞానమునకు) మిక్కిలి సమీపమున నుండుటచే నది ప్రతిఫలించుటవలన జ్ఞాతృత్వము అహంకారము నందుండుట సంభవమే.

భాష్యకారులు:—"అది ప్రతిఫలించుటవలన" ననఁగా అహంకారము చిత్తునందు (జ్ఞానమునందు) ప్రతిఫలించుటవలననని తలంచెదవా? లేక చిత్తు (జ్ఞానము) అహంకారమునందు ప్రతిఫలించుటవలననని తలఁచెదవా?

చిత్తనఁబడు సంవిత్తునందు అహంకారము ప్రతిఫలించుటవలననని చెప్పఁదగదు. ఏలన, సంవిత్తునకు స్వయముగ జ్ఞాతృత్వము కలదని అనఁగా సంవిత్తు స్వయముగ జ్ఞాత (తెలివిగలది) యని నీవంగీకరింపవుగదా!

అథవా అహంకారమునందు సంవిత్తు ప్రతిఫలించుటవలనననియును చెప్పఁదగదు. ఏలన, ఇంతకుపూర్వము గనఁబఱచినప్రకారము జడపదార్థమగు అహంకారమునకు స్వయముగ జ్ఞాతృత్వము లేదు కదా!

ఇంతియకాక అహంకారమును సంవిత్తును దృష్టిగోచరములు (కంటికి అగపడునవి) కావు. దృష్టిగోచరములుగాని పదార్థములు ప్రతిఫలించునట్లెన్నఁడును చూచియుండలేదే?

అద్వైతి:—[1]అగ్ని సంబంధము వలన ఇనుముగుండు వేడిమి గలదిగాఁ దెలియవచ్చునట్లు చిత్తు (సంవిత్తు) యొక్క సంబంధమువలన అహంకారమును జ్ఞాతగాఁ (తెలివిగలదిగాఁ) దెలియవచ్చుచున్నది.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలన, వాస్తవమునకు సంవిత్తు స్వయముగ జ్ఞాత (తెలివిగలది) యని నీవంగీకరింపవు. అట్లు స్వయముగ జ్ఞాతృత్వము లేని సంవిత్తుయొక్క సంబంధమువలన అహంకారము జ్ఞాతృత్వము గలది యగుటగాని అట్టిదిగాఁ దెలియవచ్చుటగాని సంభవింపదు. ఇంతియకాక అహంకారము అచేతనమగుటనుబట్టి యది స్వయముగ జ్ఞాతృత్వము గలదికాదు. కావున దాని సంబంధమువలన సంవిత్తు జ్ఞాతృత్వముగలది యగుటగాని అట్టిదిగాఁ దెలియవచ్చుటగాని యసంభవము.

"అనుభూతికిని అహంకారమునకును వాస్తవములో జ్ఞాతృత్వము లేకున్నను, అహంకారము అనుభూతిని ప్రకాశింపఁజేయునట్టిదిగాన, అది దర్పణము మొదలగునని ముఖము మొదలగువానినివలె అనుభూతిని తనయందున్నట్టిదానినిగాను ప్రకాశింపఁజేయుచున్నది" అని యివ్విధమున అద్వైతులు వాదించుచున్నారు (౭౧-పు. ౨౧-పం). అయితే వారివాదము యుక్తమయినదికాదు. ఏలయన, స్వయంప్రకాశమగునట్టి యాత్మ యచేతనమగు అహంకారముచేఁ బ్రకాశింపఁదగినదియగుట యసంభవము. ఈ విషయమును గుఱించి శ్రీయామునాచార్యుల వారిట్లు ప్రసాదించి యున్నారు:—

శ్లో॥ శాన్తాఙ్గార ఇవాదిత్య మహఙ్కారో జడాత్మకః ।
స్వయం జ్యోతిష మాత్మానం వ్యనక్తీతి నయుక్తిమత్ ॥

ఆత్మసిద్ధి. ౨౮-వ పుట. (సరస్వతీ భాండాగార ప్రతి)

తా॥ చల్లారిపోయిన నిప్పు సూర్యుని ప్రకాశింపఁ జేయునన్నట్లు జడస్వరూపమగు అహఙ్కారము స్వయంప్రకాశమగు ఆత్మను ప్రకాశింపఁజేయుచున్నదనెడి వాదము యుక్తియుక్తమయినదికాదు.

లోకమునందుండు సమస్త పదార్థములును తాము ప్రకాశించుటలో స్వయంప్రకాశమగు అనుభవమును (జ్ఞానమును) అపేక్షించునట్టివి కదా! కావున అచేతనమగు అహంకారము సయితము తాను ప్రకాశించుటలో అట్టి యనుభవమునే యపేక్షించునట్టిది. ఇట్లుండ ఆద్యంతములులేని ప్రకాశమే

(1) ౭౦-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణము చూడుము.

స్వరూపముగాఁ గలదియు, సమస్త పదార్థములను ప్రకాశింపఁ జేయునట్టిదియునగు అనుభవమును (జ్ఞానమును) యచేతనమగు అహంకారము ప్రకాశింపఁజేయు నట్టిది యంటివేని ఆత్మస్వరూపమును బాగుగానెఱింగిన వారు వింటే. పరిహ సింపరా ?

ఇంతియ కాక అహంకారమును అనుభూతియును పరస్పరము విరుద్ధస్వభా వము లగుటనుబట్టియు, అనుభూతి వేఱొకదానిచేఁ (అహంకారముచే) బ్రకాశిం పఁజేయఁదగినదగు పక్షమున నది అనుభూతికానిది (జడమయినది) యనెడి ప్రస క్తినిబట్టియును వానిలో నొక్కటి (అహంకారము) యొకదానిని (అనుభూతిని) ప్రకాశింపఁజేయుటయు, ఒకటి (అనుభూతి) ఒకదానిచే (అహంకారముచే) బ్రకా శింపఁ జేయఁబడుటయును అసంభవములు. ఈవిషయమును గుఱించి శ్రీయా మునాచార్యుల వారిట్లు ప్రసాదించి యున్నారు :—

శ్లో॥ వ్యఞ్జ్యవ్యఞ్జకత్వ మన్యోన్యం నచస్యాత్ప్రతికూల్యతః ।
వ్యఞ్జ్యత్వేఽననుభూతిత్వ మాత్మనిస్యాద్యథా ఘటః॥

ఆత్మసిద్ధి. ౫౮-వ పుట. (సరస్వతీ భాండాగార ప్రతి)

తా॥ అహంకారానుభవములకు పరస్పరము వ్యఞ్జ్యవ్యఞ్జకభావము (అహంకారము అనుభూతిని ప్రకాశింపఁజేయునది యగుటయు, అనుభూతి యహంకారముచేఁ బ్రకాశింపఁబడునట్టిది యగుటయును) సంభవింపదు. అట్లు ఆత్మ వేఱొకదానిచేఁ (అహంకారముచేఁ) బ్రకాశింపఁబడునట్టిదియగుపక్షమున, వేఱొకదానిచేఁ బ్రకాశింపబడునట్టి ఘటపటాది పదార్థములవలె, అది అనుభూతి కానిది (జడమయినది) యని ప్రసక్తించును.

సూర్యకిరణములు తమచేఁ బ్రకాశింపఁజేయఁదగినది యగు కరతలముచే (అఱచేయిచే) ప్రకాశింపఁబడు చందమున అనుభూతియును తనచేఁ బ్రకా శింపఁజేయఁదగినదియగు అహంకారముచేఁ బ్రకాశింపఁబడుట విరుద్ధముకాదని యద్వైతులు వాదించుచున్నారు (౭౨-పు. ౧-పం). ఈవాదము సయితము యుక్తమయినదికాదు. ఏలన, వారు గనఁబఱచిన యుదాహరణమున వాస్తవ మునకు కరతలముచే సూర్యకిరణములు ప్రకాశింపఁబడుచుండలేదు. అయితే ప్రస రించునట్టి కిరణములు కరతలముచే నడ్డగింపఁబడినవై యవి యనేకము లగుటచే తమంతట తామే స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నవి. అట్లు అవి స్పష్టముగాఁ దెలియవచ్చుటలో నవి యనేకములగుట మాత్రమే హేతువుగాన కరతలము అందులకై హేతువుకాఁదగదు.

ఇంతియకాక జ్ఞానస్వరూపమగునట్టి యాత్మకు అహంకారము గలుగఁ జేయు ప్రకటీభావము (ప్రసిద్ధిపఱచుట) ఎట్టిది? అది యుత్పత్తిరూపము అనఁగా అహంకారము ఆత్మను పుట్టించుచున్నదనియెద వేమో? అటులఁ జెప్పఁదగదు. ఏలన, ఆత్మస్వతస్సిద్ధమయినదగుటంజేసి యది వేఱొకదానిచేఁ బుట్టింపఁదగినదని యంగీకరింపఁదగదు? ఒకవేళ అది ప్రకాశరూపమనియెద వేమో? అటులను చెప్పఁదగదు. ఏలన, ఆత్మ వేఱొకజ్ఞానముచేఁ ప్రకాశింపఁజేయఁదగినదికాదు గదా! కనుకనే ఆత్మను తెలుపుటలో అహంకారము సాధనము కాఁదగదు.

అయితే లోకముననొక్కటి యొకదానిని తెలుపుటలో సాధనముగాఁదగిన విధములు రెండు కలవు. ఆరెండు విధములలో, ఏదైన నొక పదార్థముయొక్క వ్యక్తి(ఉరువు)ఆపదార్థముయొక్క జాతిని తెలుపుటలో సాధనమగు చందమునను, ముఖము మొదలగు వానిని తెలుపుటలో దర్పణము మొదలగునవి సాధనములగు చందమునను,అహంకారము తెలియఁదగిన పదార్థమునకును చక్షురాదీంద్రియము లకును సంబంధమును గలుగఁజేయుటలో సాధనమగుచున్నదా? అథవా తెలిసికొను వాని మనస్సునందలి కల్మషమును శమదమాదుల మూలముగఁ బోఁగొట్టుటచే శాస్త్రము పరతత్త్వమును తెలుపుటలో సాధనమగు చందమున అహంకారము నయిత్తము అవ్విధముననే ఆత్మను తెలుపుటలో సాధనమగుచున్నదా? ఈపైన గనఁబఱచిన రెండువిధములచేతను అహంకార మాత్మను తెలుపుటలో సాధనము కాఁదగదు. అట్లే శ్రీయామునాచార్యులవారు ప్రసాదించియున్నారు.

శ్లో॥ కరణానామభూమిత్వా న్నతత్సంబంధ హేతుతా।

ఆత్మసిద్ధి ౨౯-వ పుట. (సరస్వతీ భాండాగార ప్రతి).

తా॥ ఆత్మ చక్షురాదీంద్రియములకు గోచరమయినది కాకపోవుటం జేసి ఆత్మకును ఇంద్రియములకును సంబంధమును గలుగఁ జేయుటలో యహం కారము హేతువు కాఁదగదు.

ఇంతియకాక అనుభూతి వేఱొకదానిచేఁ దెలుపఁదగినదియని యంగీకరిం చినను "అహం" (నేను) అనునది దానిని తెలుపనేరదు. ఏలన, అది యనుభూతిని యెట్లు తెలుపఁగలదు? రూపాదులు కంటికి తెలియవచ్చుటలో ప్రతిబంధకములగు చీకటి మొదలగువానిని పోఁగొట్టుటచే నట్టి రూపాదులను తెలుపుటలో దీపము మొదలగునవి హేతువులగు చందమున, తెల్లియఁదగిన పదార్థమునకు తెలియ వచ్చుటలోఁగల ప్రతిబంధకములను బోఁగొట్టుట చేతనా? అట్లు చెప్పఁదగదు?

ఏలన, ప్రకృతమున అట్లు నిరసింపఁదగిన దేదియును ఉండుటయే సంభవింపదే? ఎట్లన, సంవిత్తనంబడు నట్టి యాత్మయం దుండునట్టిదియు అట్టి యాత్మను గుఱించిన జ్ఞానము గలుగుటకు ప్రతిబంధక మయినదియు అహంకారముచేఁ దొలఁగింపఁ దగినదియును ఏమున్నది? ఏమియును లేదే?

అద్వైతి:—అజ్ఞాన మొకటి కలదే?

భాష్యకారులు:—అజ్ఞానము అహంకారముచేఁ బోఁగొట్టఁదగినదిగా నంగీకరింపఁబడలేదే? జ్ఞానమే కదా అజ్ఞానమును నివర్తించుచున్నది?

అజ్ఞానము సంవిత్తును ఆశ్రయించియుండుట సంభవింపదు. అనఁగా అజ్ఞానము సంవిత్తునం దుండుటగాని సంవిత్తును విషయముగా గలిగియుండుటగాని యసంభవము. ఏలన, [1]జ్ఞానమున కేది యాశ్రయమయినదో మఱియు నేది విషయమయినదో అదియే కదా అజ్ఞానమున కాశ్రయమయినదియును విషయమయినదియును! స్వయముగ జ్ఞాత (జ్ఞానమునకాశ్రయము) కానిదియు, జ్ఞానమునకు విషయము కానిదియు, సాక్షిభూతమును, కేవలజ్ఞానమాత్రమునగు సంవిత్తు అజ్ఞానమున కాశ్రయము కాఁదగదు. అదెటువలెననిన, [2]జ్ఞానమున కెంతమాత్రము ఆశ్రయము

---

(1) ఏపదార్థమున జ్ఞానము కలదో ఆపదార్థముననే యజ్ఞానము నయితే మున్న పక్షమున కదా అట్టి జ్ఞానము ఆయజ్ఞానమును తొలఁగింపఁజాలును? అట్లు కాక జ్ఞాన మొకపదార్థమునను అజ్ఞానము వేఱొకపదార్థమునను ఉన్న పక్షమున అనఁగా జ్ఞానాజ్ఞానములు భిన్నాశ్రయములగుపక్షమున అట్లు ఒకపదార్థమునందునుండునట్టి జ్ఞానము వేఱొకపదార్థమునం దుండు అజ్ఞానము నెట్లు తొలఁగింపఁజాలును? దుర్లభము. కావున జ్ఞానాజ్ఞానములు రెండును సమానాశ్రములు కావలయునని సిద్ధమగుచున్నది.

మఱియు ఒకపదార్థమును గుఱించిన జ్ఞానము ఆపదార్థమును గుఱించిన యజ్ఞానమునే తొలఁగింపఁజాలునుగాని వేఱొకపదార్థమును గుఱించిన యజ్ఞానమును అట్టి జ్ఞానము తొలఁగింపఁజాలదు. ఎట్లనిన, ఘటమును గుఱించిన జ్ఞానము ఘటమును గుఱించిన యజ్ఞానమునే తొలఁగింపఁజాలునుగాని అట్టి జ్ఞానము పటమును గుఱించిన యజ్ఞానమును తొలఁగింపఁజాలునా; అది యశక్యము కదా.

కావున జ్ఞానాజ్ఞానములు సమానాశ్రయములు సమానవిషయములునని అనఁగా నేది జ్ఞానమునకాశ్రయమో అదే యజ్ఞానమునకును ఆశ్రయమనియు ఏది జ్ఞానమునకు విషయమైనదో అదియే యజ్ఞానమునకును విషయమైనదియనియును ఈ పైనిగనఁబఱచిన హేతువులవలన నిశ్చయింపఁబడుచున్నది.

(2) అజ్ఞానము రెండువిధములు—జ్ఞానప్రాగభావరూపమనియును అవిద్యారూపమనియును. జ్ఞానము గలుగుటకు పూర్వము జ్ఞానము లేకుండుటను జ్ఞానప్రాగభావరూపమగు అజ్ఞానమందురు. ఇట్టి యజ్ఞానము ఘటాదిపదార్థములయం దుండఁదగదు. ఏలన, ఘటపటాదుల కెఁకమీఁద జ్ఞానము గలుగుట కేదైన ప్రసక్తియున్న పక్షమునఁగదా యట్టిజ్ఞానము గలుగుటకు పూర్వము అట్టిజ్ఞానము

కాఁదగిన ప్రసక్తియే లేనివగుటంజేసి ఘటపటాది పదార్థములు అజ్ఞానమున కాశ్రయములు కాఁదగవుగదా. అట్లే కేవలజ్ఞాన మాత్రమగు సంవిత్తు వేఱొకజ్ఞానమున కాశ్రయము కానిదగుటంజేసి యది యజ్ఞానమునకు సయిత మాశ్రయము కాఁదగదు.

ఒకవేళ సంవిత్తు అజ్ఞానమున కాశ్రయమని—సంవిత్తునందు అజ్ఞానము కలదని—యంగీకరించినను, ఆత్మగాను మీచే నంగీకరింపఁబడినట్టి యాసంవిత్తు మీమతప్రకారము వేఱొకజ్ఞానమునకు విషయమయినది (వేఱొక జ్ఞానముచేఁ దెలుపఁదగినది) కాకపోవుటచే దానియందుండు అజ్ఞానమును జ్ఞానము నివర్తింపఁదగదు. ఏలన, జ్ఞానము తనకు విషయభూతమగు పదార్థముతో సంబంధించినట్టి యజ్ఞానమునే కదా తొలఁగింపఁగలదు? అదెటువలెననిన, భ్రాంతివశమున రజ్జువును సర్పముగాఁ గొనినవానికి "ఇది సర్పముకాదు ఇది రజ్జువు" అని యిట్లు రజ్జువునుగుఱించి గలుగు జ్ఞానము ఇంతకుముందు ఆరజ్జువును గుఱించి గలిగిన యజ్ఞానమునే కదా నివర్తింపఁజాలును? కావున సంవిత్తు నాశ్రయించియుండునట్టి యజ్ఞానము మఱిదేనిచేత నెన్నఁడును నివర్తింపఁబడకయే యుండవలసివచ్చును. [1]ఇంతియకాక ఈ యజ్ఞానము సదసదనిర్వాచనీయమగు (అనఁగా సత్తు (ఉండునట్టిది) యని గాని అసత్తు (లేనట్టిది) యని గాని చెప్పనశక్యమగునట్టి) యవిద్యయంటివేని దానియొక్క స్వరూపమే ఇట్టిదియని నిరూ

ప్రకృతమున లేకుండుటయనెడి జ్ఞానప్రాగభావరూపమగు అజ్ఞానము ఇప్పుడు గలదని చెప్పవచ్చును. అయితే ఘటాదుల కెన్నఁడును జ్ఞానము లేనేలేదుగదా. ఇట్లుండ వానియందు జ్ఞానప్రాగభావము ఎట్లుండఁదగును?

అవిద్యయనఁగా జ్ఞానమును కప్పివేయునట్టిది కదా. అది జ్ఞానమున్నట్టి పదార్థమునఁ గదా. తానున్నదై యట్టిజ్ఞానమును కప్పివేయునది యగును? కావున నది జ్ఞానమున కాశ్రయములగు వానియందే యుండఁదగినదికాని. ఎన్నఁడును జ్ఞానము లేనివియగు ఘటపటాది పదార్థములయందుండఁదగదు.

ఈపైని గనఁబఱచిన ప్రకారము ఘటపటాది పదార్థములు జ్ఞానమున కెంతమాత్ర మాశ్రయములు గానివగుటంజేసి యవి యీపైనిఁజెప్పిన యుభయవిధమగు అజ్ఞానమునకును ఆశ్రయములు గాని వగుచున్నవి.

(1) అవిద్యయొక్క స్వరూప మిట్టిదియని తెలిసిన తరువాతనుగదా అది జ్ఞానము గలుగుటకు ప్రతిబంధకమనిగాని అదిపోవుట జ్ఞానము గలుగుట కుపకారకమనిగాని చెప్పఁదగును. దాని స్వరూపమే యిట్టిదియని తెలియ నశక్యమగుపక్షమున నది జ్ఞానోత్పత్తికి ప్రతిబంధకమనియు అది పోవుట అందుల కుపకారకమనియు నిట్టి విచారణ గలుగుట కెంతమాత్రము ప్రసక్తియేలేదని యభిప్రాయము.

పించుటయు నశక్యమని యిఁకమీఁదఁ జెప్పఁబడును. [1]ఒకవేళ అది జ్ఞానప్రాగ భావ రూపమగు అజ్ఞానమంటివేని అది జ్ఞానోత్పత్తికి నెంతమాత్రము విరుద్ధ మయినది కాదు. కావున అది నివర్తించుట జ్ఞానముగలుగుట కెంతమాత్ర ముపకారకము కాఁదగదు. అందువలన ఎవ్విధముననైనను అహంకారము అనుభూతిని స్పష్టపఱచుటకు సాధనము కాఁదగదని యెఱుంగునది.

అభివ్యంజకములగు (ప్రకాశింపఁజేయు) పదార్థములు తమచేఁ బ్రకా శింపఁజేయఁబడు పదార్థములను తమయందుండు వానినిగానే ప్రకాశింపఁజేయుట స్వభావమని యద్వైతులు చేయువాదము (౭౧-పు. ౧౮-పం.) యుక్తమయినది కాదు. ఏలన, దీపము మొదలగునవియును (పదార్థములను) ప్రకాశింపఁజేయు నవియే కదా! అవి తాము ప్రకాశింపఁజేయు పదార్థములను తమయందున్న ట్టివానినిగాఁ బ్రకాశింపఁజేయుచుండలేదే ? మఱియు జ్ఞానమును, జ్ఞానసాధన ములును, అట్టిసాధనముల కుపకరించునవియును తాము ఏయేపదార్థములను ప్రకాశింపఁజేయుచున్నవో ఆయాపదార్థములను యథావస్థితముగాను (అవి యెట్లుండఁదగునో అట్లే) ప్రకాశింపఁజేయుట వానికి స్వాభావికము. ఈవిషయము [2]స్వతః ప్రామాణ్యన్యాయముచే సిద్ధమగుచున్నది.

---

(1) మున్నొకప్పుడు మన కొకపదార్థమును గుఱించి యేమియును తెలియకయుండి తరువాత కొంతకాలమున కాపదార్థమునుగుఱించి మనకు తెలియుపక్షమున "మున్ను ఆపదార్థమునుగుఱించి మనకేమియును తెలియకపోవుట" యనెడి యజ్ఞానము "ఇప్పు డాపదార్థమునుగుఱించి మనకు తెలిసి యుండుట యనెడి" జ్ఞానముయొక్క ప్రాగభావ మనంబడుచున్నది. అనఁగా ముందొకప్పు డొక దానిని గుఱించి తెలియకపోవుట యనెడి యజ్ఞానము ఇప్పుడు దానినిగుఱించి తెలిసియుండుట యనెడి జ్ఞానముయొక్క ప్రాగభావమని యెఱుంగునది. ఇట్టి యజ్ఞానమునే జ్ఞానముయొక్క ప్రాగ భావరూపమైన యజ్ఞానమునుగా శాస్త్రకారులు వ్యవహరించుచున్నారు. అయితే ముందొకప్పు డొకదానినిగుఱించి తెలియకపోవుటయును తరువాత మఱియొకప్పుడు దానినిగుఱించి తెలియుట యును సహజమే కావున ముందొకప్పు డొకదానిని గుఱించిన యజ్ఞానము తరువాత దానిని గుఱిం చిన జ్ఞానము గలుగుట కెంతమాత్రము ప్రతిబంధకముగాఁ గానఁబడదు. జ్ఞానోత్పత్తికి ప్రతిబంధకమైన దానిని తొలఁగించుటచేతఁగదా యేదైన నొకటి యట్టిజ్ఞానమును గలుగఁజేయునట్టి సాధనముగా జెప్పఁ బడుచున్నది. ఈపైని గనఁబఱచిన జ్ఞానప్రాగభావరూపమగునట్టి యజ్ఞానమన్నదో జ్ఞానము గలు గుట కెంతమాత్రము ప్రతికూలమయినదికాదు. కావున దానిని తొలఁగించినంతమాత్రముచే అహంకా రము జ్ఞానోత్పత్తికి సాధనమని చెప్పఁదగదు.

(2) ఒకదానిచేఁ దెలుపఁబడునది ప్రమాణసిద్ధమగు విషయమై రెండువిధములు గలవు. స్వతః ప్రామాణ్యమనియు పరతఃప్రామాణ్యమనియును. తనచేఁ దెలుపఁబడినది సత్యమని యిట్లు ప్రమాణ సిద్ధమగువిషయమై వేఱొకప్రమాణము నపేక్షించునది పరతఃప్రామాణ్య మనఁబడును. ఉదా హరణము. స్మృతిపురాణాదులు తమయందు ప్రతిపాదింపఁబడిన విషయములు సత్యములని యిట్లు

అద్వైతులు చెప్పునట్లు దర్పణము మొదలగునవి ముఖము మొదలగు వానిని ప్రకాశింపఁ జేయునట్టివియే కావు. [1]అయితే అవి చక్షుస్సుయొక్క తేజస్సు ప్రతిఫలించుట యనెడి యొకదోషమును గలుగఁజేయుచున్నవి. అట్టి దోషమునుబట్టియే వానిమూలముగఁ దెలియఁబడు పదార్థములు ఉన్నవియు న్నట్టుగాఁ దెలియఁబడక అందులకు విరుద్ధముగఁ దెలియవచ్చుచున్నవి. వాస్తవమునకు (ముఖాదులను) ప్రకాశింపఁజేయునట్టిది తేజస్సు మొదలగునదియే యని యెఱుంగునది. ప్రకృతమున అహంకారము స్వయంప్రకాశమగు సంవిత్తునందు అట్టి దోషమును గలుగఁజేయుట యసంభవము.

వ్యక్తికి (ఉరువునకు) జాతి ఆకారమగుటనుబట్టి వ్యక్తి జాతియందుం డునట్టిదిగాఁ దెలియవచ్చుచున్నదే కాని యద్వైతులు చెప్పునట్లు వ్యక్తి

---

ప్రమాణసిద్ధములు కావలయునన్న అందులకై యవి శ్రుతివాక్యముల నపేక్షించుచున్నవి. అనఁగా వానిచేఁ దెలుపఁబడిన విషయములు శ్రుతులలోనుగూడ నట్లే దెలుపఁబడియున్న పక్షమున నవి తెలుపునది సత్యమేయని మనము తెలిసికొనుచున్నాము. కావున స్మృతీతిహాసములు పరతఃప్రామాణ్యములు.

తనచేఁ దెలుపఁబడినది సత్యమని యిట్లు ప్రమాణసిద్ధమగు విషయమై వేఱొకప్రమాణము నపేక్షింపనిది స్వతఃప్రామాణ్య మనఁబడుచున్నది. ఉదాహరణము—వేద శాస్త్రము వేదములు తమచేఁ బ్రతిపాదింపఁబడినది సత్యమగు విషయమై వేఱొకప్రమాణము నపేక్షింపవు. అందులకు వేదవాక్యములే ప్రమాణములు. కావున నవి స్వతఃప్రమాణములని చెప్పఁబడుచున్నవి.

అట్లే జ్ఞానము యథార్థమును తెలియఁజేయునది యగుటగూడ అజ్ఞానమునందే తెలియఁదగును. కావున జ్ఞానము అట్లు యథార్థమును తెలుపునదియగుట స్వతఃప్రామాణ్యా న్యాయసిద్ధమని చెప్పఁబడియె.

(1) నేత్రేంద్రియమునకు తేజస్సనంబడునట్టి యొక ప్రకాశము గలదు. ఇదియే దృష్టులనియు దృష్టికిరణములనియును పిలువఁబడుచున్నది. ఈదృష్టులే పదార్థములను తెలుపునవి. మనముఖము మొదలగునది దర్పణము మొదలగు స్వచ్ఛపదార్థములమూలముగాఁ దెలియవచ్చునప్పుడును మనముఖమును తెలుపునది మనచక్షుస్సుయొక్క తేజస్సేగాని దర్పణాదులుకావు. ఎట్లన, మనచక్షుస్సుయొక్క తేజస్సు సూర్యకిరణములవలె ప్రసరించుటయే స్వభావముగాఁ గలది. మన కభిముఖముగా దర్పణము నుంచుకొంటిమేని మన చాక్షుష తేజస్సు దర్పణముపై పునఃప్రసరించి దర్పణముచే నడ్డగింపఁబడి యతి మనముఖముతట్టు మరలింపఁబడినదై మనముఖమున కెదురుగాఁ బ్రసరించుచు అప్పుడు ముఖమును తెలుపుచున్నది. అప్పుడు మనముఖమును మనము చూచుచున్నాము. ఇట్లు తమపైపు ప్రసరించు చాక్షుసతేజస్సును మనముఖముపై పునకు మరలునట్లు అడ్డగించుటయే దర్పణాదులు చేయుకార్యము. ఇదియే ప్రతిఫలన మనఁబడుచున్నది. వాస్తవమునకు మనముఖము దర్పణములో లేకున్నను ఇట్టి ప్రతిఫలనమువలన అచ్చట యున్నట్టిదిగాను తెలియవచ్చుచున్నది. అనఁగా ముఖాదులు ఉన్నవి యున్నట్టివిగాఁ దెలియరాకున్నవి. ఇట్లు అవి యథావస్థితముగా దెలియరాకుండుట కట్టిప్రతిఫలనమే కారణముగాన నది యొకదోషముగా నెన్నఁబడియె.

జాతిచేఁ బ్రకాశింపఁ జేయఁబడునది యగుటనుబట్టి యట్టిదిగాఁ దెలియవచ్చుచుండలేదు.

కావున అద్వైతులు చెప్పునట్లు (౭౧-పు. ౧౭-పం) సంవిత్తును అంతఃకరణ భూతమగు అహంకారమునం దుండునట్టిదానినిగాఁ స్వయముగాఁగాని దోష మూలముగాఁగాని తెలుపునట్టి సాధనమేదియును గానఁబడదు. అందువలన అహంకారము జ్ఞాతయగుటగాని యట్టిదిగాఁ దెలియవచ్చుటగాని యసంభవము.

కాఁబట్టి స్వయముగానే జ్ఞాతగఁ దెలియవచ్చునట్టి "అహమ్" (నేను) అనఁబడునదియే ప్రత్యగాత్మ. అది జ్ఞప్తి (జ్ఞాన) మాత్రమే కాదు. "అహమ్" అనఁబడునది లేకపోయినచో కేవలజ్ఞప్తికి ప్రత్యక్త్వము (తనకుతాను ప్రకాశించునదియగుట) సిద్ధింపదని యింతకు పూర్వము చెప్పఁబడియె.

సుషుప్త్యవస్థయందు తమోగుణము యొక్క తిరస్కారము వలనను అప్పుడు యేపదార్థమును గుఱించిన జ్ఞానములేనందునను ఆయవస్థయందు "అహమ్" అనంబడునది స్పష్టముగాఁబ్రకాశింపకపోవుఁగాక. అయినను నిద్రనుండి మేల్కొనినతోడనే "అహం" అని యిట్టి యాకారముతోనే ఆత్మ స్ఫురించుచున్నందున సుషుప్తియందును "అహం" అనెడుభావన లేకపోలేదు. మీరు (ఆత్మగ) అంగీకరించినట్టి యనుభూతియును అట్లే తెలియవచ్చుచున్నదని చెప్పక తప్పదు. ఏలన, "అహం" అని చెప్పఁబడనిదియు తక్కినపదార్థములకు విరుద్ధమయినట్టి యాకారముకలదియునగు జ్ఞప్తిరూపమగు నేను అజ్ఞానసాక్షిగానుంటిని అని యిట్లు నిద్రనుండి మేల్కొంచినవాఁడెవ్వఁడును సుషుప్తికాలమునందున్నట్టి యనుభూతిని (జ్ఞానమును) పరామర్శింపఁడు. అయితే "నేను సుఖముగ నిద్రించితిని" అనిగదా నిద్రనుండి మేల్కొంచిన ప్రతిమనుజుఁడును పరామర్శించుచున్నాఁడు ? ఇట్టి పరామర్శనుబట్టియే సుషుప్త్యవస్థయందు "అహమ్" అనంబడునట్టి యాత్మ సుఖవంతుఁడనియు జ్ఞానవంతుఁడనియును తెలియవచ్చుచున్నది.

నిద్రనుండి మేల్కొంచినవాఁడు 'ఇప్పుడు (జాగ్రదవస్థయందు) ఎట్టిసుఖము గలవాఁడనో సుషుప్తియందును అట్టిసుఖముగలవాఁడనై నిద్రించితిని' అని యిట్లు పరామర్శించుకొనుచున్నాఁడని చెప్పఁదగదు. [1]ఏలయన, ఈపరామర్శము ఇట్టి స్వరూపము గలది కాఁదగదు.

(1) లోకమున సాధారణముగ నొక్కఁడు "నేను మెల్లగా నడచితిని" "నేను మధురముగా గానము చేసితిని" అనునప్పుడు వాఁడు ఇప్పుడు ఎంతమెల్లగా నడచుచున్నాఁడో అంత మెల్లగా అప్పుడు నడచెననికాని వాఁడిప్పు డెంతమధురముగా గానము చేయుచున్నాఁడో అంతమధు

ఇంతియకాక "అహమ్" అనఁబడునట్టి యాత్మ స్థిరుఁడు (అన్నియవస్థలయందుండువాఁడు) కానందున అప్పటి "అహం" అనఁబడునది సుఖముగలదియనెడి స్మరణ మసంభవమనియును చెప్పఁదగదు. ఏలయన, నిద్రించుటకుఁ బూర్వము తా ననుభవించినదానిని నిద్రనుండి మేల్కొనినవాఁడు "నేను ఈకార్యము నొనర్చితిని" "నేను దీనిని అనుభవించితిని" "నేను ఈమాటను చెప్పితిని" అని యిట్లు పరామర్శించుచున్నాఁడుగదా!

అద్వైతి:—"ఇంతవఱకు నే నేమియు నెఱుఁగను" అని సయితము నిద్రనుండి మేల్కొనినవాఁడు పరామర్శించుకొనుచున్నాఁడే?

భాష్యకారులు:—వాస్తవమే.

అద్వైతి:—"ఏమియు నెఱుఁగను" అనుటచే నప్పుడు సర్వము లేదని గదా యర్థము!

భాష్యకారులు:—"నే నెఱుఁగను" అనుటచే తెలిసికొనునదియగు "అహమ్" (నేను) అనఁబడునది యప్పుడును అనువర్తించుచున్నది. అయితే అప్పుడు తెలియఁదగిన విషయమేదియును లేదని యందులకర్థము, ఇంతే. ఒకవేళ "నేనేమియు నెఱుఁగను" అనెడి పరామర్శమునకు "సుషుప్తియందు సర్వము లేదనుటయే" యర్థమంటివేని అప్పుడు సర్వము లేదు గాన మీ రంగీకరించిన యనుభూతియును అప్పుడు లేదని ప్రసక్తించునే?

వాస్తవమున కన్ననో "నేనేమియు నెఱుంగను" అని యిట్టి పరామర్శములోని "నేను" అనునది "నేను" అనంబడునట్టి యాత్మను జ్ఞాతనుగాఁ బరామర్శించుచున్నది. "ఏమియు నెఱుంగను" అనుదానిచే నప్పుడు (ఏవిషయమును గుఱించిన) జ్ఞానము లేదని తెలుపఁబడుచున్నది. ఇట్లుండగా నీవో అప్పుడు లేనిదిగాఁ దెలియవచ్చునట్టి జ్ఞానమే కలదనియు "నేను" అని యిట్లు అప్పుడు ఉన్నట్టిదిగాను తెలియవచ్చునట్టి జ్ఞాత (తెలివిగలది) లేదనియును "నేనేమియు నెఱుంగను" అని యిట్టి పరామర్శమును బట్టియే సాధింపఁబూనియున్నావు. కావున నీకు బదులు చెప్ప నేరని బుద్ధిహీనులవద్ద అట్టి యర్థమును సాధింపుము.

అద్వైతి:—నిద్రపోయి మేల్కాంచినవాఁడు ఒకప్పుడు "నన్నుఁగూడ నేనెఱుంగను" అని యిట్లు పరామర్శించుకొనుచుండుటనుబట్టి(౭౨-పు. ౧౩-పం) అప్పుడు "నేను" అనంబడునది అనుసంధింపఁబడనట్లు తెలియవచ్చుచున్నదే?

---

రముగా నప్పుడు గానము చేసెననికాని యెవ్వఁడైనను తెలిసికొనుచున్నాఁడా? లేదు. అందు స్వారస్యమేమియును లేదు.

భాష్యకారులు :—మీ యనుభవమునకును మీరు చెప్పునట్టి దానికిని విరోధము గలదని కూడ మీ రెఱుంగరే?

అద్వైతి :—నిద్రపోయి మేల్కొంచినవాఁడు "నన్నుఁగూడ నేనెఱుంగను" అని యిట్లు తన యనుభవమును చెప్పుచున్నాఁడుగదా! అప్పుడు "నన్ను" అనుదానిచే నేది నిషేధింపఁ బడుచున్నది?

భాష్యకారులు :—నీవడిగినది బాగుగ నున్నది. చెప్పెదను.

అట్టి పరామర్శవాక్యము సుషుప్త్యవస్థయందు జ్ఞాతయగు "నేను" అనఁబడుదానియొక్క యనువృత్తిని నిషేధించుచుండలేదు. అయితే మేల్కొంచిన ప్పుడు స్మరింపఁబడునట్టి "నేను" అనఁబడుదానియొక్క వర్ణాశ్రమాది విశిష్టత్వము మాత్రమే ఆవాక్యముచే నిషేధింపఁబడుచున్నది. కావున "నేను నన్నుఁగూడ నెఱుంగను" అని యిట్టి పరామర్శములోని "ఎఱుంగను" అనుదానిచే నిషేధింపఁబడునది అట్టి "నేను" అనఁబడుదానియొక్క వర్ణాశ్రమాదివిశిష్టత్వమే యని వివేచింపఁదగినది. ఎట్లన, ఆవాక్యమందలి "నన్ను" అనఁగా "జాగరితా వస్థతో సంబంధించినట్టి బ్రాహ్మణాదివర్ణము బ్రహ్మచర్యాద్యాశ్రమము ఈ మొదలగువానితోఁ గూడియున్నట్టి నన్ను" అని యర్థము. అందు "నేను" అనఁగా "సుషుప్త్యవస్థయందు ప్రసిద్ధమై విశదముగాని తనయనుభవముమాత్రమే గల నేనని" యర్థము. జాగ్రత్తునందు 'నన్ను నేనెఱుంగను' అనుటకు, సుషుప్తి యందు 'నేనిట్టివాఁడను' అని యెఱుఁగకుండుటయే ముఖ్యముగనకు యభిప్రాయము.

ఇంతియకాక సుషుప్త్యవస్థయం దాత్మ యజ్ఞానమును గుఱించి సాక్షిగా నుండునని మీవారు (అద్వైతులు) చెప్పుచున్నారు. అయితే సాక్షియనఁగా సాక్షాత్తుగాఁ దెలిసికొనినవాఁడే కదా! కావున తెలిసికొని యుండనివాఁడు సాక్షి కానేరఁడు. తెలిసికొనినవాఁడే లోకమునందును (న్యాయస్థలములయందును) శాస్త్రమునందును సాక్షియని వ్యవహరింపఁబడుచున్నాఁడే కాని కేవలజ్ఞానము (తెలివి) సాక్షియని వ్యవహరింపఁ బడుచుండలేదే? కనుకనే శ్రీపాణిన్యాచా ర్యులును "సాక్షాద్ద్రష్టరిసంజ్ఞాయాం" (అష్టా. ౫-అ. ౨-పా. ౯౧-సూ.) అను సూత్రముచే "సాక్షాత్తుగ చూచిన (తెలిసికొనిన) వానికి పేరగునప్పుడు మాత్రమే సాక్షీ యనెడిశబ్దము నిష్పన్నమగును" అని చెప్పియున్నారు. అట్టి యీసాక్షి "తెలిసికొనుచున్నాను" అని ఇవ్విధమునఁదెలియవచ్చునట్టి "అహం" అనఁబడునదియే కదా కాఁదగును. ఇట్లుండ సుషుప్త్యవస్థయందు "అహం"

అనఁబడునది యేల తెలియరాకుండును? తనకు తాను ప్రకాశించునట్టిది "అహం" (నేను) అని యివ్విధముననే కదా ప్రకాశించును! కావున సుషుప్త్యాద్యవస్థలయందు ఆత్మ ప్రకాశించునది యగుచు "నేను" అని యివ్విధముననే ప్రకాశించుచున్నదని సిద్ధమగుచున్నది.

మోక్షావస్థయందు "నేను" అనఁబడునది అనువర్తింపదని యిట్లు అద్వైతులు చేయువాదము (౭౨-పు. ౧౦-పం.) సరసమయినది కాదు. ఏలయన అట్లైన పక్షమున ఆత్మనాశమే మోక్షమని ప్రతిజ్ఞచేసినట్లగును. "నేను" అనఁబడునది ధర్మమాత్రమేమైనను కాదు. అట్లైనచో మోక్షావస్థయందాత్మకుంగల యవిద్యాపోయినను ఆత్మస్వరూపమున కేదియు బాధలేనట్లు, "నేను" అనెడి ధర్మముఃపోయినను అప్పుడు ఆత్మస్వరూపమున కేదియు బాధలేదని చెప్పుట కవకాశ ముండును. అయితే ఆత్మయొక్క స్వరూపమే "నేను" అనంబడునది. జ్ఞానము దాని ధర్మము. "నేను తెలిసికొనుచున్నాను. నాకు జ్ఞానముగలిగినది" అని యిట్లు జ్ఞానము "నేను" అనంబడుదానియొక్క ధర్మముగానే కదా తెలియవచ్చుచున్నది.

పరమార్థమునఁగాని భ్రాంతివశమునఁగాని [1]ఆధ్యాత్మికాది దుఃఖములచేఁ బీడితుఁడ ననుకొని "నేను దుఃఖవంతుఁడను" అని యిట్లు తలఁచినవాఁడై 'ఈదుఃఖ సమూహమునెల్లను మరలఁ గలుగకుండునట్లుగాను వానినన్నింటిని పోఁగొట్టుకొని వానిచే నేనెన్నఁడును బాధపడకుండ స్వస్థుఁడ నెట్లు కాఁగలను' అని యిట్లు మోక్షమునం దభిరుచి గలిగిన మానవుఁడే కదా అట్టి మోక్షమును సాధించుకొనుటకై ప్రయత్నించుచున్నాఁడు? అట్టి సాధనానుష్ఠానముచే తుట్టతుదకు "తానే లేకుండపోవును" అని యిట్లైయుంగుపక్షమున, వాఁడు మోక్షము నెన్నఁడును తలంపనే తలంపఁడే! అందువలన మోక్షమున కధికారియే లేకపోవునుగావున మోక్షమును తెలుపునట్టి శాస్త్రము సర్వము అప్రమాణము కావలసివచ్చును.

అద్వైతి:—"నేను" అనుదానిచే [2]ఉపలక్షింపఁబడు జ్ఞానముమాత్రము మోక్షావస్థయందు మిగిలియుండును.

---

(1) ౮-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన 3-వ వివరణమును చూడుము.

(2) స్వాభావికమగు ధర్మముచేగాక తాత్కాలికమగు గుర్తుమొదలగుదానిచే నేదైన నొక్కపదార్థము తెలుపఁబడుపక్షమున అట్లు తెలుపునది యుపలక్షణమనియు అట్లు తెలుపఁబడునది యుపలక్షితమనియును శాస్త్రకారులు వ్యవహరించుచున్నారు. ఉదాహరణము. "కాకివాలిన యిల్లు దేవదత్తునిది" అని యిట్లు దేవదత్తుని గృహము తెలుపఁబడునప్పుడు కాకి వాలియుండుట యనునది యుపలక్షణము. దేవదత్తుని గృహము ఉపలక్షితము.

భాష్యకారులు :—అంతమాత్రమున నేమి ప్రయోజనము? "నేను నశించినను మోక్షావస్థయందేదో యొకటి జ్ఞానమాత్రముగా నుండును" అనుకొని అందులకై దూరదర్శియగువా డెవ్వఁడును ప్రయత్నింపఁడే?

కావున జ్ఞాతగాఁ దెలియవచ్చు "నేను" అనఁబడునదియే ప్రత్యగాత్మ. అది మోక్షావస్థయందు సయితము "నేను" అని యివ్విధముననే ప్రకాశించునట్టిది. ఏలన, అది తనకు తాను ప్రకాశించునట్టిది. తనకుతాను ప్రకాశించునట్టి ప్రతివస్తువును "నేను" అని యివ్విధముననే కదా ప్రకాశించును! అట్లు అది తనకుతాను ప్రకాశించునట్టిది యగుటంజేసియే కదా దానిని ఈ [1]సంసారముననుండు ఆత్మనుగాను మనముభయుల మంగీకరించుచున్నాము. అయితే ఏది "నేను" అని యివ్విధమునఁ బ్రకాశింపదో, అది తనకుతాను ప్రకాశించునట్టిది కాదు. ఎటువలె ననిన, ఘటపటాది పదార్థము "నేను" అని యివ్విధమున ప్రకాశించునట్టిది కాదు. కావున నది తనకుతాను ప్రకాశించునది కాదు. [2]మోక్షావస్థయం దీయాత్మ తనకుతాను ప్రకాశించునట్టిదిగాన నది "అహం" అని యిట్లే ప్రకాశించునట్టిదియని యెఱుంగునది.

మఱియు "నేను" అని యిట్లుప్రకాశించుటనుబట్టియే అట్టిది అజ్ఞమనియు (అజ్ఞానముకలదనియు), సంసారియనియును ప్రసక్తించుననియెద వేమో? [3]అట్లంటివేని యది మోక్షమునకు విరుద్ధము. మఱియు "నేను" అని యిట్లు తెలియ

---

'"నేను" అనఁబడుట యాత్మకు స్వాభావికమైనది కాదనియు, అది ఆగంతుకముగా నంతఃకరణసంబంధమువలనఁ గలిగినదనియును గదా అద్వైతులు చెప్పుచున్నారు. కావున "నేను" అనఁబడుదానిచే "ఉపలక్షింపఁబడిన" అని చెప్పఁబడియె.

(1) జీవుఁడు కర్మానుభవమునకై శరీరసంబంధమునుపొంది అందుమూలముగా స్వస్వరూపము ప్రకటితము గాకుండ అనఁగా జ్ఞానసంకోచము గలిగియుండునట్టిదశ సంసారావస్థయనఁబడుచున్నది.

(2) పరబ్రహ్మోపాసనమువలన సంచితాగామికర్మములును, అనుభవమువలన ప్రారబ్ధకర్మమును ఖొత్తుగా నశింపఁగా అందువలన శరీరసంబంధముపోగా ఆత్మయొక్క స్వస్వరూపము స్పష్టపడుట మోక్షావస్థ యనఁబడుచున్నది. "స్వేనరూపేణాభి నిష్పద్యతే" ఈమొదలగు శ్రుతులును అట్లే చెప్పుచున్నవి.

(3) మోక్షావస్థయందు ఈయాత్మకు కర్మసంబంధ మేమాత్రమును లేకుండుటంజేసి యప్పుడీతఁడు సంసారియని చెప్పఁదగదు.

ఈయాత్మ కప్పుడు స్వస్వరూపము బాగుగా విశదమగుచున్నది గాన ఈతని కట్టి యవస్థయందు ఎవ్విధమైన యజ్ఞానమును కలదని చెప్పఁదగదు. అట్లు చెప్పినట్లైన మోక్షావస్థకు విరుద్ధముగాఁ జెప్పినట్లగును.

వచ్చుట అజ్ఞమగుటకు హేతువు సయితముకాదు. అజ్ఞము (అజ్ఞానముకలది) అనునప్పుడు అజ్ఞానమనఁగా [1]స్వరూపాజ్ఞానమా? [2]అన్యథాజ్ఞానమా? [3]విపరీతజ్ఞానమా? "అహం" అనఁబడునట్టిదియే యాత్మయొక్క స్వరూపము కావున నట్టి స్వరూపజ్ఞానరూపమగు "అహం" అనెడి జ్ఞానము అజ్ఞత్వమును గలుగఁ జేయునదికాఁదగదు. ఇట్లుండఁగా నది సంసారిత్వము నెట్లు కలుగఁజేయును? మీఁది మిక్కిలి అదియట్టిస్థితికి విరుద్ధమగుటంజేసి దానిని నశింపఁజేయుచున్నది.

ఇంతియకాక సర్వము బ్రహ్మాత్మకము (సర్వము బ్రహ్మమే యంతరాత్మగాఁగలది) యనెడి [4]యపరోక్షజ్ఞానమువలన [5]నవిద్యనంతయును నిశ్శేషముగాఁ బోఁగొట్టుకొనినట్టి వామదేవుఁడు మొదలగువారికి సయితము "అహం" అనియివ్విధమునసే ఆత్మానుభవము గలుగుచున్నట్లు తెలియవచ్చుచున్నది. ఎట్లన;

వాజసనేయులు "తద్ధైతత్పశ్యన్నృషి ర్వామదేవః ప్రతిపేదే అహం మనురభవం సూర్యశ్చ" (బృ. 3-అ. ౪-బ్రా. ౧౦-వా) అను వాక్యమున "ఇట్లు సర్వము బ్రహ్మాత్మకమని యెఱింగినవాఁడగు వామదేవుఁడను మహర్షి "నేను మనువనైతిని నేను సూర్యుఁడనైతిని" యని యిట్లు తెలిసికొనినవాఁడాయెను" అని పఠించుచున్నారు.

వేఱొకతావున "అహమేవచ వర్తామి భవిష్యామి" ఇత్యాదివాక్యమున "నేనే ఉన్నాను నేనే ఉండఁగలను" అని యిట్లు పఠింపఁబడియె.

సమస్తములగు ఇతరాజ్ఞానములకు విరుద్ధమైనదియు "సత్" అనెడి శబ్దముచేతను "సత్" అనెడు జ్ఞానముచేతనును తెలుపఁదగినదియునగు పరబ్రహ్మమునకును తన్నుగుఱించిన వ్యవహారము "నేను" అని యివ్విధమయినదిగానే కనుపట్టుచున్నది. ఎట్లన;

---

(1) తనయొక్క స్వరూపమునుగుఱించి యెఱుంగకుండుట స్వరూపాజ్ఞాన మనఁబడును.

(2) ఒకపదార్థముయొక్కధర్మమును వేఱొకవిధముగ నెఱుంగుట అన్యథాజ్ఞానమనఁబడును ఉదాహరణము.—ఆత్మ కర్తగాను అనఁగా కర్తృత్వముగలదిగాను తెలియవచ్చుచుండగా నట్టికర్తృత్వము భ్రాంతిమూలమని కుయుక్తులచే నెఱుంగుట అన్యథాజ్ఞానములోఁ జేరినది.

(3) ఏపదార్థము ఎట్లుండఁదగునో అట్లే దానిని తెలిసికొనక అందులకు విరుద్ధముగాఁ దానిని తెలిసికొనుట విపరీతజ్ఞాన మనఁబడును.

(4) అపరోక్షజ్ఞానము=భగవత్సాక్షాత్కారరూపమగు ధ్యానము.

(5) అవిద్య=కర్మవశ్యత్వము.

ఛందోగులు "హన్తా హామిమా_స్తి(స్రోదేవతాః" (ఛా. ౬-ప్ర. ౩-ఖ. ౨-వా) ఇత్యాదివాక్యముచే "ఈపరదేవత నేను పృథివ్య_ప్తేజస్సు లనంబడు మూఁడు దేవతలను జీవసమష్టిరూపమగు నాత్మచే ప్రవేశించి" అని యివ్విధ మున పఠించుచున్నారు.

తైత్తిరీయులు "బహుస్యాం ప్రజాయేయ" (తై. ఆనం. ౬-అను. ౨-వా) అను వాక్యముచే "పరబ్రహ్మము ప్రజలను సృజించుటకై నేను అనేక ముగా నగుదునని తలంచెను" అని యిట్లు పఠించుచున్నారు.

ఐతరేయోపనిషత్తునందు "సఈక్షతలోకాన్ను సృజాఇతి" (ఐ. ౧-అను. ౧-ఖ. ౧-వా) అను వాక్యముచే "పరబ్రహ్మము నేను లోకములను సృజించెద నని ధ్యానించెను" అని పఠింపఁబడియె.

అట్లే శ్రీ భగవద్గీతలయందును,

శ్లో॥ యస్మాత్క్షరమతీతోఽహ మక్షరాదపిచోత్తమః ।
అతోఽస్మి లోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః ॥
భ-గీ. ౧౫-అ. ౧౮-శ్లో.

తా॥ ఓ అర్జునా! నేను చేతనాచేతనముల నతిక్రమించినవాఁడను. కావున నేను స్మృతులలోను శ్రుతులలోనును పురుషోత్తముఁడని ప్రసిద్ధినొందినాఁడను.

శ్లో॥ అహమాత్మా గుడాకేశ (భ-గీ. ౧౦-అ. ౨౦-శ్లో)॥

తా॥ ఓ అర్జునా! నేను సమస్తభూతములలో నుండునట్టి యంతరాత్మను.

శ్లో॥ నత్వేవాహమ్ జాతు నాసమ్. (భ-గీ. ౨-అ. ౧౨-శ్లో.)

తా॥ ఓ అర్జునా! నేనెన్నఁడును లేనివాఁడను కాను.

శ్లో॥ అహమ్ కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ_స్తథా॥ (భ-గీ.౭-అ.౬-శ్లో.)

తా॥ ఓ అర్జునా! నేను యీసమస్తమైన జగత్తును పుట్టించువాఁడును నశింపఁజేయువాఁడును.

శ్లో॥ అహమ్ సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే॥ (భ-గీ.౧౦-అ.౮-శ్లో.)

తా॥ ఓ అర్జునా నేను సర్వమును కలుగఁజేయువాఁడను. సర్వమును నావలననే కలుగుచున్నది.

శ్లో॥ తేషా మహమ్ సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్॥
భ-గీ. ౧౨-అ. ౭-శ్లో.

తా॥ ఓ అర్జునా! సర్వకర్మములను నాయందు అర్పించి నన్ను ఉపాసించు వారలను మృత్యువైన సంసారమనెడు సముద్రమునుండి నేను తరింపఁజే యుచున్నాఁడను.

శ్లో॥ అహం బీజప్రదః పితా॥ (భ-గీ. ౧౪-అ. ౪-శ్లో.)

తా॥ ఓ అర్జునా! వారివారి కర్మానుసారముగా చేతనులను ఆయా శరీర ములందు నేను చేర్చుచున్నాఁడను.

శ్లో॥ వేదాహమ్ సమతీతాని॥ (భ-గీ. ౭-అ. ౨౬-శ్లో.)

తా॥ ఓ అర్జునా! నేను గతించిన భూతముల నెఱుంగుదును.

అద్వైతి:—[1]"అహం" (నేను) అని యిట్లే ఆత్మయొక్క స్వరూప మగునట్లైన భగవంతుఁడు [1]అహంకారమును క్షేత్రమనఁబడు శరీరముయొక్క యంశములలో నొక్కటిగాను ఉపదేశించుటకు హేతువేమి? ఎట్లన;

శ్లో॥ మహా భూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవచ।
భ-గీ. ౧౩-అ. ౫-శ్లో॥

తా॥ ఓ అర్జునా! పంచతన్మాత్రల (సూక్ష్మభూతముల)నఁబడు మహాభూతములును, ఈభూతములకు కారణమై "నేను" అనెడి జ్ఞానమే స్వరూపముగాఁ గల యహంకారమును, అట్టి యహంకారమునకు కారణమై అధ్యవసాయరూప మగు బుద్ధియును, మాయ యనఁబడు అవ్యక్తమును ఈ యెనిమిదియును క్షేత్ర మనఁబడు శరీరముయొక్క యంశములు.

భాష్యకారులు:—చెప్పెదను. ఆత్మయొక్క స్వరూపము నుపదేశించు నట్టి తావులనెల్లను "నేను" అని యిట్లే యుపదేశించి యుండుటవలనను, అట్లే యెల్లరును ఆత్మస్వరూపమును తెలిసికొనియున్నందునను "నేను" అని యిట్టిదియే ప్రత్యగాత్మయొక్క స్వరూపమని యెఱుంగునది.

---

(1) "అహం" (నేను) అని యిట్టిజ్ఞానము స్వరూపముగాఁ గలది యహంకారము. కావున "అహం" అనఁబడునది ఆత్మ కాఁదగదని యద్వైతులు చెప్పుచున్నారు. ఈవిషయమును గుఱించి యద్వైతులు చేయునట్టి వాదము ౩౦-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణమున విశదముగాఁ గనఁబఱుపఁబడినది.

[1]ప్రకృతి పరిణామవిశేషమగు అహంకారము మాత్రమే శరీరాంశముగాను భగవంతునిచే నుపదేశింపఁబడుచున్నది. అది యాత్మేతరమగు శరీరమునందు "నేను" అనెడి యభిమానమును గలుగఁజేయునట్టిది. అందువలననే యది యహంకారమని పిలువఁబడుచున్నది. ఎట్లన, [2]అభూత తద్భావార్థమున వచ్చిన (అదికాని దానియందు అది యనెడు అర్థమున అనఁగా "అహం" అనెడు వస్తువు కాని శరీరమునందు "అహం" అనెడి యభిమానరూపమగు నర్థమును తెలుపుటకై వచ్చిన) "చ్వి" ప్రత్యయమునుజేర్చుటచే అహంకారమనెడు శబ్దము వ్యుత్పన్నమయినదని యోచించుకొనునది. ఈయహంకారమే పూజ్యులయెడల నవమానమును గలుగఁజేయునది. దీనికే [3]గర్వమనియును నామాంతరముగలదు. ఇదే శాస్త్రమునందు అనేకపర్యాయములు హేయముగాఁ బ్రతిపాదింపఁబడుచున్నది.

కావున ఎట్టిబాధకమును లేనట్టి "అహం" అనంబడునది సాక్షాత్తుగ ఆత్మను తెలుపునదియే యనియు, శరీరవిషయమై "అహం" అనెడి జ్ఞానమున్ననో అవిద్యయనియును ఎఱుంగునది. కనుకనే శ్రీపరాశరులిట్లు ప్రసాదించియున్నారు.

శ్లో॥ శ్రూయతాంచాప్య విద్యాయా స్స్వరూపం కులనందన ।
అనాత్మ న్యాత్మ బుద్ధిర్యా (విష్ణు. ౬-అం. ౭-అ. ౧౦-శ్లో॥

తా॥ ఓకులశ్రేష్ఠుఁడా! అవిద్యయొక్క స్వరూపమును చెప్పెదను వినుము. ఆత్మకాని పదార్థమునం దాత్మయనెడిబుద్ధి (జ్ఞానము) అవిద్య యనఁబడుచున్నది.

జ్ఞప్తి (తెలివి) మాత్రమే యాత్మయగు పక్షమున ఆత్మకాని దానిని (శరీరమును) గుఱించి యాత్మయనెడి యభిమానము గలుగునప్పుడు ఈశరీర

(1) ప్రకృతి యనఁబడునది యొక్కటి కలదు. దానినుండి మహత్తనంబడు బుద్ధియు, అహంకారమును పంచతన్మాత్రలును ఈయేడును పుట్టుచున్నవి అనఁగా ప్రకృతినుండి మహత్తనంబడు బుద్ధి పుట్టుచున్నది. బుద్ధినుండి అహంకారము పుట్టుచున్నది. అహంకారమునుండి పంచతన్మాత్రలు పుట్టుచున్నవి. ఇట్లు సాంఖ్యులు శ్లో॥ "మూలప్రకృతిరవికృతిః మహదాద్యాః ప్రకృతివికృతయస్సప్త॥" (సాంఖ్యకారికా 3-వ శ్లో) ఇత్యాదిశ్లోకమున చెప్పియున్నారు. కనుక అహంకారము ప్రకృతి యొక్క పరిణామముగా నెన్నఁబడియె.

(2) ఈ సందర్భమున "కృభ్వస్తియోగే సంపద్యకర్తరి చ్విః" (అష్టా ౫-అ. ౪-పా. ౫౦-సూ) సూత్రమును "అభూతతద్భావ ఇతి వక్తవ్యం" అను వార్తికమును చూచుకొనునది.

(3) "గర్వోభిమానోఽహంకారః" (ప్ర-కాం. ౨౦౪-శ్లో.) అని నామలింగానుశాసనము.

మునందు జ్ఞానమనెడి యభిమానము గలుగవలయునేకాని జ్ఞాతయనెడి యభిమానము గలుగఁగూడదు కదా! ఈ హేతువునుబట్టియు జ్ఞాతయగు "అహం" అనఁబడునదియే యాత్మయని తెలియవచ్చుచున్నది. అట్లే శ్రీయామునాచార్యుల వారు ప్రసాదించియున్నారు.

శ్లో॥ అతఃప్రత్యక్ష సిద్ధత్వా దుక్తన్యాయాగ మాన్వయాత్ ।
అవిద్యాయోగత శ్చాత్మా జ్ఞాతాఽహమితి భాసతే॥

ఆత్మసిద్ధి. 33-వ పుట. (సరస్వతీ భాండాగార ప్రతి.)

తా॥ "నేను" అనఁబడునది ధర్మిగాను అనఁగా జ్ఞానమనఁబడునట్టి గుణము గలదిగాను, జ్ఞానమన్ననో అట్టి "నేను" అనఁబడు దానియొక్క గుణముగాను ప్రత్యక్షముగాఁ దెలియవచ్చుచుండుట వలనను, ధర్మియగునట్టి "నేను" అనెడు వస్తువు స్థిరమైనదిగాను కేవల జ్ఞానము అస్థిరమయినదిగానును యుక్తులవలనఁ దెలియవచ్చుటవలనను, ఈపైని గనఁబఱచిన యుపనిషద్వాక్యముల వలనను, ఆత్మకాని పదార్థమున ఆత్మయనెడి భ్రాంతి కలుగునప్పుడు "నేను స్థూలమయిన వాఁడను" అనియిట్లు ఆత్మకానిదియగు శరీరముయొక్క ధర్మములగుస్థూలత్వాదులు "నేను" అనఁబడు దానియందే ఆరోపింపఁ బడినవియేయై జ్ఞానమునందారోపింపఁబడకుండుట వలననును జ్ఞాతయగు "నేను" అనఁబడువస్తువే యాత్మయని యెఱుంగునది.

'మఱియు కేవలజ్ఞానము ఆత్మకాదను విషయమై శ్రీయామునాచార్యుల వారిట్లు ప్రసాదించియున్నారు:—

శ్లో॥ దేహేంద్రియ మనఃప్రాణ ధీభ్యోఽన్యోఽనన్యసాధనః ।
నిత్యో వ్యాపీ ప్రతిక్షేత్ర మాత్మా భిన్న స్స్వతస్సుఖీ ॥

ఆత్మసిద్ధి. ౫-వ పుట. (సరస్వతీ భాండాగార ప్రతి.)

తా॥. శరీరము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి (జ్ఞానము) వీనికంటెను వేఱయినదియు, స్థిరమయినదియు, స్వయంప్రకాశ మయినదియు, మిక్కిలి సూక్ష్మమయినదగుటంజేసి సమస్తములైన యచేతన పదార్థములలోను వ్యాపించియుండునట్టిదియు, స్వయముగ సుఖముగలదియును ఆత్మయని యెఱుంగునది.

ఈపై శ్లోకమునందు "అనన్యసాధనః=వేఱొకసాధనము నపేక్షింపనిది" అనఁగా స్వయంప్రకాశమనియర్థము. "వ్యాపీ" అనఁగా అతిసూక్ష్మమయినదగుటచే సమస్తములగు 'అచేతనపదార్థములలోను వ్యాపించియుండునది యని యర్థము.

కనుక ఈపైని గనఁబఱచిన హేతువులనుబట్టి జ్ఞాతయగు "అహం" అనఁబడునదియే ఆత్మయని సిద్ధమగుచున్నది.

"సకల భేదావలంబియగు ప్రత్యక్షప్రమాణము దోషవిశిష్టమయిన దగుటంజేసి సావకాశమైనందున—అనఁగా వేఱొకవిధముగ సమాధాన పఱచు కొనుటకవకాశమిచ్చునట్టిదియగుటవలన—నది శాస్త్రముచే బాధింపఁబడునది" (౮౩-పు. ౨౩-ప.) అని యిట్లు అద్వైతులు చేయువాదము యుక్తమయినది కాదు. ఏలన, అట్లైనపక్షమున, ప్రత్యక్షప్రమాణమును అట్లు వేఱొకవిధముగ సమాధాన పఱచుకొనుట కవకాశమిచ్చునట్టి దానినిగాఁ జేయునట్టి దోష మెద్దియోవారు గనఁబఱపవలయును?

అద్వైతి:—అనాదికాలముగా వచ్చుచున్నట్టి భేదజ్ఞాన వాసనయే అట్టి దోషము.

భాష్యకారులు:—భేదజ్ఞానవాసన [1]తిమిరరోగము మొదలగునదివలె పదార్థములు యథావస్థితముగా (అవియెట్లుండఁదగునో అట్లు) తెలియరాకుండ

---

(1) వాతపిత్తాదిప్రకోపముచే నేత్రములో ముత్యమువలె తెల్లని కుదపవంటి యొకదోషము గలుగుచున్నది. ఇది నేత్రదోషమని పిలువఁబడుచున్నది. ఈదోషము నేత్రేంద్రియముయొక్క పటలములను (పొరలను) వ్యాపించుచున్నది. ఒక్కొక్కపొరయందిట్టిదోషమున్నప్పు డిది యొక్కొక్క నామాంతరముచే వైద్యశాస్త్రమున వ్యవహరింపఁబడుచున్నది. అట్టియీనేత్రదోషము నేత్రముయొక్క నాల్గవపటలమును వ్యాపించిన తిమిరరోగమని వ్యవహరింపఁబడుచున్నది. ఈవిషయమును గుఱించి మాధవనిదానమను వైద్యగ్రంథమున నిట్లు చెప్పఁబడియె.

శ్లో॥ తిమిరాఖ్యస్స వై దోషశ్చతుర్థం పటలం గతః॥ రుణద్ధి సర్వతో దృష్టిం లిఙ్గనాశమతః పరమ్।
అస్మిన్నపి తమోభూతే నాతిరూఢే మహాగదే॥ చన్ద్రాదిత్యౌ సనక్షత్రావన్తరిక్షే చ విద్యుతః।
నిర్మలాని చ తేజాంసి భ్రాజిష్ణూన్యథ పశ్యతి॥

తా॥ దృష్టియందు నాల్గవపటలమున దోషం బాశ్రయించియుండునెడ చీకటి గ్రమ్మిన విధంబుగ కన్నులు గానరాకుండును. అయ్యది తిమిరంబను వ్యాధియని యెఱుంగునది. ఈ వ్యాధియందు దృష్టియెచ్చోటను ప్రసరించక రూపములఁ దెలిసికొనుశక్తి నానాట నశించును. ఈవ్యాధి మిక్కిలి వృద్ధినొందక యున్నపుడు చీకటి గ్రమ్మిన విధంబుగ లోకము కనఁబడును. సూర్యచంద్రులును నక్షత్రంబులును మెఱుపులును ఆకసమునందు గానంబడును. మరియు నిర్మలంబులైన తేజస్సులును కాంతియుక్తంబులగు మణులు మున్నగు వస్తుసంఘంబులును గానంబడును.

శ్లో॥ స ఏవ లిఙ్గనాశస్తు నీలికా కాచసంజ్ఞితః।

తా॥ దృష్టియొక్క తృతీయపటలమునందు జనించిన కాచంబను పేరంబరగు నేత్రదోషము చతుర్థపటలము నాశ్రయించినపుడు లిఙ్గనాశమనియు, నీలికయనియు జెప్పందగును. తన్త్రాన్తర

అందులకు విపరీతముగాఁ దెలియవచ్చుటకు హేతువగునట్లు ఇంతకుపూర్వ మెచ్చటనైన వేఱొక తావున కనుఁగొనియుంటివా?

అద్వైతి:—ప్రకృతమగు శాస్త్రవిరోధమును బట్టియే భేదజ్ఞానవాసన యట్టిదిగాను తెలియఁబడుచున్నది.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. అట్లు చెప్పితివేని [1]అన్యోన్యాశ్రయదోషము ప్రసక్తించును. ఎట్లన, శాస్త్రము భేదములేవియును లేనట్టివస్తువును బోధించుచుండుటనుబట్టిగదా భేదజ్ఞానవాసనను దోషముగా నిరూపించి

---

మున నిమి యీరీతిగ వచించెను "కాచ ఇత్యేష విజ్ఞేయో యాప్యస్త్రిపటలోత్థితః। చతుర్థపటలం ప్రాప్తే లిఙ్గనాశస్స ఉచ్యతే। ప్రత్యాఖ్యేయశ్చ కఫజో వ్యాధిస్సాధ్యస్తు తద్విదా॥" మూడవపటలమున జనించిన దృష్టిదోషము కాచంబని జెప్పందగును; ఇవ్వ్యాధి యాప్యము. అట్టి కాచ మను వ్యాధి నాల్గవపటలము నాశ్రయించినయెడ లిఙ్గనాశంబని చెప్పందగును. ఇది యసాధ్యము. ఈవ్యాధి కఫముచే జనించినయెడ సాధ్యంబై యుండునని భావము. ఈ వచనముచేత మూడవపటలము నాశ్రయించినది కాచమనియు, అట్టికాచము నాల్గవపటలము నాశ్రయించినయెడ లింగనాశమనియుఁ దెలియుచున్నది. ఇచ్చట లింగనాశమనగా "లింగ్యతే (జ్ఞాయతే) అనేనలిఙ్గం" అను వ్యుత్పత్తిచేత రూపాదులను దెలియుటకు సాధనమైనది లింగమనందగు (అనగా గ్రహణశక్తి రూపమైన ఇంద్రియము) అట్టి ఇంద్రియనాశము కల్గిన వ్యాధి లింగనాశమని యెరుంగునది.

ఈదోషము దృష్టియం దూర్ధ్వాదిదేశముల నాశ్రయించియుండుటచేఁ గలుగు వికారభేదములును అచటనే చెప్పఁబడినవి. ఎట్లన,

శ్లో॥ అధస్థితే సమీపస్థం దూరస్థం చో పరస్థితే॥ పార్శ్వస్థితే తథా దోషే పార్శ్వస్థం నైవపశ్యతి।
సమన్తతస్థితే దోషే సంకులానీవ పశ్యతి॥ దృష్టిమధ్యస్థితే దోషే మహద్ధ్రస్వం చ పశ్యతి।
ద్విధా స్థితే ద్విధా పశ్యేత్ బహుధాచాఽనవస్థితే॥ దోషే దృష్ట్యాశ్రితే తిర్యక్ సఏకం మన్యతే ద్విధా।

తా॥ దృష్టియం దధోభాగమున దోషంబున్నయెడ సమీపముననుఁడు వస్తువులను, ఊర్ధ్వభాగమున దోషమున్నయెడ దూరముననుండు వస్తువులను, పార్శ్వములయందు దోషం బున్నయెడ ఇరుప్రక్కలనుండు వస్తువులను, కనుంగొన జాలకుండును. దృష్టియందంతట దోషము వ్యాపించి యున్నపుడు వస్తుసంఘము లొండొంట గలిసిన విధంబుగ గానంబడును. దృష్టిమధ్యమున దోషం బున్నయెడ గొప్పవైన వస్తువులు మిగుల హ్రస్వములుగ గానంబడును. ఊర్ధ్వాధోభాగముల రెంటియందును దోషము వ్యాపించి యున్నపుడు ఒకవస్తువు రెండురూపములుగ గానంబడును. పలుదెరంగుల దోషము వ్యాపించియున్నపుడు వస్తుసంఘములు చంచలంబులైనట్లు కానంబడును. దృష్టియందు దోషము అడ్డముగ వ్యాపించి యున్నపుడు ఒకవస్తువు రెండుగ గానంబడును. (శ్రీమాన్. వైద్యరత్న పండిత. డి. గోపాలాచార్యులవారిట్లు వివరించియున్నారు.)

మాధవనిదానము—౪౧౬ - ౪౧౭ పుటలు.

(ఆయుర్వేదాశ్రమగ్రంథమాలాప్రతి.)

(1) ౭౧-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

యున్నావు. మఱియు భేదవాసన యొక్క దోషమగుటనుబట్టి కదా శాస్త్రము భేదములేవియునులేని వస్తువును పరమార్థముగా బోధించుచున్నదని ప్రతిపాదించుచున్నావు. [1]కావున ఈవాదము అన్యోన్యాశ్రయదోష దుష్టమయినది.

అద్వైతి :—భేదవాసన నవలంబించిన దగుటంజేసి ప్రత్యక్షప్రమాణము [2]విపరీతార్థమును తెలుపునట్టిది.

భాష్యకారులు :—శాస్త్రము సయితము అట్టిదియేగాన (౪౪-పు. ౪-పం.) నదియును [2]విపరీతార్థమును తెలుపునట్టిదియే యగునే?

అద్వైతి :—శాస్త్రము సయితము భేదవాసనయనెడి దోషము నవలంబించినదియైనను అది ప్రత్యక్షప్రమాణముచేఁ దెలియవచ్చు సమస్తభేదము

---

(1) ప్రత్యక్షప్రమాణము ఘటపటాది భేదములను తెలుపునది. శాస్త్రమన్ననో భేదము లేవియును లేని వస్తువును తెలుపునది. కావున ప్రత్యక్షప్రమాణము శాస్త్రముతో విరోధించుచున్నది. ఈరెంటిలో నేది పరమార్థమును తెలుపునదియని యడుగఁగా భేదవాసనారూపమగు దోషము నవలంబించి ప్రవర్తించునది యగుటంజేసి ప్రత్యక్షప్రమాణము దోషమూలమనియు, అందువలన ప్రత్యక్షప్రమాణముచేఁ దెలియవచ్చునది యసత్యమనియు, శాస్త్రముచేఁ దెలియవచ్చునది సత్యమనియును అద్వైతులు వాదించుచున్నారు. ఈ సందర్భమున వీరు ప్రతిపాదింపవలసిన యంశములు రెండు కలవు:—

(1) శాస్త్రముచేఁ దెలియవచ్చునది సత్యము.

(2) భేదవాసన యొక్క దోషము.

"శాస్త్రముచేఁ దెలియవచ్చునది సత్యము" అని ప్రతిపాదించిరేని అప్పుడు శాస్త్రప్రతిపాదితమైనది మాత్రమే సత్యమనియు, అందువలన తదితరప్రమాణములవలనఁ దెలియవచ్చునది సర్వమును అసత్యమనియు, అందులకు వానికాధారమగు భేదవాసనయే దోషమనియును తెలిసికొనశక్యము. అందులకై వారు ముందుగ "శాస్త్రముచేఁ దెలియవచ్చునది సత్యము" అని ప్రతిపాదింపవలయునే? అందులకు వారేమి చేయవలయును?. "భేదవాసన యొక్కదోషము" అని ప్రతిపాదింపవలయును. అట్లు వారు ప్రతిపాదించిరేని భేదవాసన యొక్క దోషముగాన దాని నవలంబించి ప్రవర్తించునట్టి ప్రత్యక్షప్రమాణము దోషవిశిష్టమైనదనియు, అందువలనఁ దానిచేఁ దెలుపఁబడునది యసత్యమనియును, శాస్త్రమన్ననో అట్టిదోష మేదియును లేనిదిగాన దానిచేఁ బ్రతిపాదింపఁబడునదియే సత్యమనియును తెలిసికొన శక్యము. "భేదవాసన యొక్కదోషము" అని ప్రతిపాదించుటకై ముందుగ వారేమి చేయవలయును? శాస్త్రప్రతిపాదితమైనది మాత్రమే సత్యమని ప్రతిపాదింపవలయును.

ఇవ్విధమున ఈపైని గనఁబఱచిన రెండుఅంశములలో నొక్కదానిని ఉపపాదింపవలయునన్న ముందుగ రెండవదాని, రెండవదానిని ఉపపాదింపవలయునన్న ముందుగ మొదటిదానినిని, ఉపపాదించి యుండుట యావశ్యకమగుటఁజేసి యీవాదము అన్యోన్యాశ్రయదోష దుష్టమని చెప్పఁబడియె.

(2) తాను తెలుపునట్టి వస్తువును కలరూపునఁ దెలుపక అందులకు విరుద్ధముగాఁ దెలుపునదియైనచో నది విపరీతార్థమును తెలుపునది యనఁబడుచున్నది.

లను నిరసించునట్టి జ్ఞానమును గలుగఁజేయునది. అందువలన నది ప్రత్యక్షమున కంటెను [1]పరమైనది (తరువాతిది). కావున శాస్త్రప్రమాణము ప్రత్యక్షప్రమాణమును బాధించునది.

భాష్యకారులు :—శాస్త్రము భేదవాసనారూపమగు దోషము నవలంబించునట్టిదియని తెలిసిన తరువాత దానిపరత్వము నిష్ప్రయోజనము. ఎటువలె ననిన, త్రాటిని సర్పముగాఁగొని భయపడినవానితో వేఱొక్కఁడు "అది సర్పముకాదు భయపడకుము" అని చెప్పినను వాఁడు భ్రాంతిచే నట్లు చెప్పెనని తలంచిన వీని భయ మెట్లుపోవును? పోదు గదా!

శ్రవణసమయముననే శాస్త్రము దోషావలంబియని తెలియఁబడునది యనఁదగును. ఏలన, శ్రవణానంతర మాచరింపఁబడు మననాదులు (౧౩-పు.౮-పం) అట్టి శ్రవణము వలనఁ దెలియవచ్చునదియు, సమస్తభేదములను బోఁగొట్టునదియునగు బ్రహ్మాత్మైక్య జ్ఞానమును గుఱించిన [2]యభ్యాసరూపములే గదా.

[3]శాస్త్రస్వరూప మిట్టిదియనియు, అది యెవ్విధమైన దోషములకు నవకాశమీయనిదనియు, [4]ప్రత్యక్షప్రమాణమన్ననో దోషంబుల కవకాశ మిచ్చునదియనియును నీవు దేనిచేఁ దెలిసికొనుచున్నావు? స్వతస్సిద్ధమయినదియు, విశేషములేవియును లేనిదియునగు అనుభూతి యీవిషయమును తెలుపుచున్నదని యెదవా? అట్లు చెప్పఁదగదు. ఏలన, అది యేవిషయముతోను సంబంధము కలదికాదు. కావున దానికి శాస్త్రమునుగుఱించి పక్షపాతముండనేరదు. ఇంద్రియజన్యమగు ప్రత్యక్షజ్ఞానమును అట్టి విషయమును తెలుపునది కాఁదగదు. ఏలన, అది దోషమూల మగుటంజేసి విపరీతార్థమును తెలుపునట్టిది కదా.

---

(1) దూరముగా నుండునట్టి యొక తెల్లనిపదార్థమును చూచినతోడనే అది రజతమనెడి జ్ఞానము మనకు కలుగవచ్చును. అయితే అప్పుడు మనము దానిసమీపమునకుఁబోయి దానిని ఖనిజశాస్త్ర ప్రకారము పరీక్షించి చూచితిమేని యది వెండి కాదనెడి జ్ఞానము మనకుఁ గలుగుపక్షమున నింతకు పూర్వము "అది వెండి" అని యిట్లు మనకు కలిగిన జ్ఞానమును "అది వెండికాదు" అనెడి మన యిప్పటిజ్ఞానము బాధించుచున్నది. ఇందువలన మనకు పూర్వమున్న జ్ఞానమును మన యిప్పటి జ్ఞానము బాధింపవచ్చునని సిద్ధమగుచున్నది. కావున పూర్వమున్న వానికంటెను తరువాత వచ్చినవి ఎక్కువ బలమైనవని యేర్పడుచున్నది. దీనినే యాధారముగాఁ జేసికొని శాస్త్రకారులు పూర్వశాస్త్రమును పరశాస్త్రము బాధించుననియు నివ్విధమున అనేకన్యాయములను ఏర్పఱచియున్నారు.

(2) ఒకమాఱు చేసినదానిని పలుమాఱుచేయుట అభ్యాసమనఁబడును.

(3) ౭౫-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

(4) ౭౫-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౨-వ వివరణమును చూడుము.

ఇంతియకాక [1]ఇతర ప్రమాణము లన్నియును ప్రత్యక్షమూలకములే—అనఁగా ప్రత్యక్షప్రమాణము నాధారముగాఁ జేసికొని ప్రవర్తించినవియే—యయినందున నవియును అట్టి విషయమును తెలుపఁజాలవు. కావున మీరు చెప్పిన దానిని నిరూపించునట్టి [2]ప్రమాణమేదియును గానఁబడదు. అందువలన మీరు చెప్పునది సిద్ధింపఁజాలదని యెఱుంగునది.

అద్వైతి:—వ్యావహారికముగాను ప్రమాణ ప్రమేయ వ్యవహారము మాకును కలదే?

భాష్యకారులు:—వ్యావహారిక మనఁగా నేమి?

అద్వైతి:—చూచాయగ నొక్కటి యొకవిధముగాఁ దెలియవచ్చుచు యుక్తులచేఁ బరీక్షింపఁబడినదైయట్టిదిగాఁ దెలియరానిది వ్యావహారికమనఁబడును.

భాష్యకారులు:—దానివలనఁ బ్రయోజనమేమి? అట్టిది యొక ప్రమాణముగా నంగీకరింపఁబడినను యుక్తులకు నిలువలేని దగుటం జేసి యది ప్రమాణముగా నుపయోగపడదే?

అద్వైతి:—[3]శాస్త్రమును ప్రత్యక్షమును ఈ రెండును అవిద్యామూలములేయైనను—అనఁగా అవిద్యనే యాధారముగాఁ జేసికొని ప్రవర్తించునవియే

(1) ౮౦-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

(2) 23-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన 3-వ వివరణమును చూడుము.

(3) ఒకదానిమూలముగా వేఱొకదానిఁ దెలిసికొనునప్పుడు అట్లు తెలిసికొనువాఁడు ప్రమాతయనియు, అట్లు తెలిసికొనుటకు సాధనమగునది ప్రమాణమనియు అట్లు తెలియఁబడునది ప్రమేయమనియును వ్యవహరింపఁబడును. ఇట్లు ఒకఁ డొకదానిచే నొక్కదానిని తెలిసికొనుటను ప్రమాణ ప్రమేయవ్యవహార మందురు. అట్లు తెలిసికొనుటకు సాధనము ప్రత్యక్షాది ప్రమాణమగు నప్పు డది ప్రత్యక్షాదిప్రమాణ ప్రమేయవ్యవహారమనియు, అట్టిది శాస్త్రమేయయినట్లైన అది శాస్త్రీయమగు ప్రమాణప్రమేయ వ్యవహారమనియును వ్యవహరింపఁబడును. ఈ పైని గనఁబఱిచిన ప్రకారము రెండు విధములగు ప్రమాణప్రమేయ వ్యవహారములును అవిద్యామూలకములే యని యద్వైతులు చెప్పుచున్నారు. ఈవిషయమునుగుఱించి శ్రీశంకరాచార్యులవారు అధ్యాసభాష్యమున నిపుణతరముగాఁ బ్రతిపాదించియున్నారు. ఎట్లన,

"రజత భిన్నమగు శుక్తికయందు రజతబుద్ధివలె జగద్భిన్నమగు బ్రహ్మమునందు జగద్బుద్ధి అధ్యాస మనఁబడుచున్నది. మఱియు ఆత్మధర్మములగు సత్తాభావప్రియములను అనాత్మ (ఆత్మేతరమగు జగత్తు) యందును అనాత్మధర్మములగు నామరూపములను ఆత్మయందును ఆరోపించుటయును అధ్యాసమే. ఎట్లనఁగా:—

భార్యాపుత్రాదులకుం గలుగు సుఖదుఃఖములను (బాహ్యధర్మములను) ఆత్మయం దారోపించుకొని "నేను పురుషుఁడను, నేను పుట్టినాను, నేను కృశించినాఁడను, నేను బాలుఁడను, నేను

మైనను ప్రత్యక్షముచేఁ దెలుపఁబడునది శాస్త్రముచే బాధింపఁబడునట్టిదిగాను గన్పట్టుచున్నది. అయితే సత్తును(ఉన్నట్టిదియు)అద్వితీయమును (రెండవది లేని దియు) నగు బ్రహ్మమన్నదో శాస్త్రముచేఁ దెలుపఁబడిన తరువాత నది దేని చేతను బాధింపఁబడుచున్నట్లు గానంబడదు. కావున నిర్విశేషచిన్మాత్రమగు బ్రహ్మమే పరమార్థమని (సత్యమని) చెప్పఁదగును.

---

వృద్ధుఁడను " అని యిట్లు చెప్పుచున్నాఁడు. కర్మేంద్రియాది ధర్మముల నాత్మయం దారోపించుకొని " నేను మూఁగవాఁడను, నేను కుంటివాఁడను " అని యిట్లు చెప్పుచున్నాఁడు.

జ్ఞానేంద్రియములయొక్క ధర్మముల నాత్మయం దారోపించుకొని " నేను వినుచున్నాఁడను, నేను వాసనచూచుచున్నాఁడను, నేను చెవిటివాఁడను, గ్రుడ్డివాఁడను " అని యివ్విధమున చెప్పుచున్నాఁడు.

బుద్ధి మొదలగు వాని ధర్మముల నాత్మయం దారోపించుకొని " నేను కర్తను, నేను బుద్ధిమంతుఁడను, నేను జ్ఞానవంతుఁడను " అని యిట్లు చెప్పుచున్నాఁడు.

ఇవి యన్నియును ఆత్మయం దనాత్మాధ్యాసమునకు ఉదాహరణములని యెఱుంగునది.'

ఇట్లే " నాకు భార్యకలదు ప్రకాశించుచున్నది ప్రియమైనది అనియు, నాకు ప్రాణము కలదు ప్రకాశించుచున్నది ప్రియమైనది అనియు, నాకు శరీరముకలదు ప్రకాశించుచున్నది ప్రియమైనది అనియు, నాకు మంచిమనస్సు కలదు ప్రకాశించుచున్నది ప్రియమైనది అనియు, ఈ మొదలగునవి అనాత్మయం దాత్మాధ్యాసమున కుదాహరణములని యెఱుంగునది.

ఇట్టి యధ్యాసమునే పండితులు అవిద్యయని తలఁచుచున్నారు. ఇట్లు అధ్యాసమనఁబడు అవిద్య మూలముగానే సమస్తములగు లౌకికప్రమాణములును వైదికప్రమాణములును ప్రవర్తించుచున్నవి. విధినిషేధములను తెలుపునట్టివియు మోక్షమును ప్రతిపాదించునట్టివియునగు సమస్తశాస్త్రములును అట్టి యవిద్యనుబట్టియే ప్రవర్తించుచున్నవి.

ప్రత్యక్షాదిప్రమాణములును శాస్త్రములును అవిద్యావంతుని గుఱించినవియేయని యెట్లు చెప్పఁదగును ? చెప్పెదను. దేహేంద్రియాదులను గుఱించి "నేను" "నాది" అని యిట్టి యభిమానము లేనివాఁడు ప్రమాత (తెలిసికొనువాఁడు) గానేరఁడు. అట్టిప్రమాతయే లేనట్లయిన ప్రమాణము లెట్లు ప్రవర్తించును ? ఇంద్రియముల నపేక్షింపక ప్రత్యక్షాది ప్రమాణ వ్యవహారము సంభవింపదు. ఇంద్రియముల కొక యాధారము లేకున్న పక్షమున తన్మూలకమగు వ్యవహారము సంభవింపదు. తన దేహమును గుఱించి "నేను" అనెడి యభిమానము లేకుండ ఎవ్వఁడును ప్రవర్తింపఁడు. ఇది యంతయును లేనిపక్షమున దేనితోను సంబంధించియుండని కేవలమగు ఆత్మ ప్రమాత కాఁదగదు. ప్రమాతలేనట్లయిన ప్రమాణములు ప్రవర్తింపవు. కావున " నేను " " నాది " అని యిట్టి యవిద్యగలవానిని గుఱించియే ప్రత్యక్షాది ప్రమాణములును శాస్త్రములును ప్రవర్తించుచున్నవి. ఇందుల కొక యనుమానము సయితము కలదు. ఎట్లనఁగా :—

పశువులు మొదలగు జంతువులు ధ్వని మొదలగునది చెవికి వినవచ్చునప్పు డట్టి ధ్వని ప్రతికూలమైనట్లయిన నవి యచ్చటినుండి పరువెత్తిపోవును. అది యనుకూలమైనట్లయిన నవి యచటనే యుండును. ఎట్లన, చేతిలోఁ కఱ్ఱనుంచుకొనిన పురుషుఁడు అభిముఖముగాఁ వచ్చినట్లయిన

భాష్యకారులు :—అట్లు చెప్పఁదగదు. ఏలన, శాస్త్రము వేఱొక దానిచే బాధింపఁబడునట్టిది కాకపోయినను దోషమూలమైనదిగాన నది పరమార్థమును తెలుపునట్టిదియని నిశ్చయింపఁదగదు గదా! ఇందులకై యొక యుదాహరణమును గనఁబఱచెదను—[1]కాచతిమిరాది నేత్రదోషము లొక్కటియును లేనివా రెవ్వరును పోవుటకలవిగాని కొండగుహలయందు అట్టి నేత్రదోషముగల జనులు నివసించుచున్నారనుకొందము. వారికందఱికిని నట్టి నేత్రదోషముగలదు గాన వారిలో నెవ్వఁడును దానిని కనిపెట్టియుండఁడు. కావున వారిలో నెవ్వనికిని తనకట్టి తిమిరమనఁబడు నేత్రదోషము కలదని తెలియనే తెలియదు. అట్లు వారందఱును తిమిరరోగము గలవారగుటంజేసి సామాన్యముగ వారికందఱికిని ఒక చంద్రుఁడు రెండుచంద్రులుగాఁ గనఁబడుట సహజము. అయితే అప్పుడు "చంద్రుఁడొక్కఁడే" యని తెలుపునదై అందుమూలముగ "చంద్రులిద్దఱు"

---

"ఈతఁడు నన్నుచంపు" ననుకొని యవి పరువెత్తిపోవును. పచ్చని గడ్డిని చేతిలోనుంచుకొని యభిముఖముగా వచ్చువాని కభిముఖముగాఁ బోవుచున్నవి. అట్లే వ్యుత్పన్నులగు పురుషులును గ్రుడ్లు మిటమిట చేయుచు చేతిలో కత్తినుంచుకొని వచ్చువానిఁజూచి పరువెత్తిపోదురు. పశువుల కుండు ప్రమాణ ప్రమేయ వ్యవహార మెట్టిదియో అట్టిదియే కదా మనుష్యుల కుండునట్టిదియును! ఏలన, పశువులకు ఆత్మానాత్మవివేకము లేకుండుటను—శరీరమే యాత్మ, శరీరమున కాపత్తు గలిగినట్లయిన నది యాత్మకుఁ గలిగినట్టిదియే యనెడి దేహాత్మాభిమానరూపమగు నవిద్యను—పురస్కరించుకొని ప్రవర్తించుచున్నదిగ మనకవగతమైన విషయమే కదా. అయితే వ్యుత్పన్నులగు మనుష్యులకుఁ గల ప్రమాణ ప్రమేయ వ్యవహారము సయితము అట్టిదియేగాన నదియును అట్టి యవిద్యను పురస్కరించుకొని ప్రవర్తించినదియేయని విశదమగుచున్నది. కావున ప్రత్యక్షాది ప్రమాణము లవిద్యామూలములని సిద్ధమగుచున్నది.

శాస్త్రీయమగు ప్రమాణ ప్రమేయ వ్యవహారమును గుఱించి కొంచెము విచారింతము. స్వర్గభోగాది పరలోక సుఖమును పొందుటకై ప్రయత్నించువానికి శరీరమునకంటెను వేఱుగ నాత్మయొక్కటిగలదనెడి జ్ఞానమున్నపక్షమున నేతప్ప వాండందులను గుఱించి ప్రవర్తింపనేరఁడు. అయితే అప్పుడు వానికి క్షుత్పిపాసలు లేనట్టిదియు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాది వర్ణభేదములు లేనిదియు, ఎన్నఁడును సంసారసంబంధము లేనిదియు, వేదాంతశాస్త్రమువలనఁ దెలియవచ్చునట్టి యాత్మస్వరూపమును గుఱించిన జ్ఞానమున్ననో అనావశ్యకము. వాని కట్టి జ్ఞానముచేఁ బ్రయోజనమేదియునులేదు. మఱియు నట్టి జ్ఞానము అట్టి శాస్త్రాధికారమునకు విరుద్ధము. కావున ఆత్మను గుఱించిన తత్త్వజ్ఞానము గలుగుటకుపూర్వము ప్రవర్తించునట్టి శాస్త్రప్రమాణము సయితము అనఁగా శాస్త్రీయమగు ప్రమాణ ప్రమేయ వ్యవహారము సయితము అవిద్యావంతుని గుఱించి ప్రవర్తించునదియే. ఏలన, "బ్రాహ్మణోయజేత" (బ్రాహ్మణుఁడు యజ్ఞము చేయవలసినది) అని యిట్లు విధించు శాస్త్రవాక్యములు "నేను బ్రాహ్మణుఁడను" అని యిట్లు వాస్తవమున కాత్మయందులేని బ్రాహ్మణత్వమును ఆత్మయం దారోపించియే గదా ప్రవర్తించుచున్నవి.

(1) ౧౩౫-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమునుచూడుము.

అనెడి వారి ద్విచంద్రత్వ జ్ఞానమును బాధించునదగు వేఱొక జ్ఞానమేదియును లేనంతమాత్రముచే నట్టి ద్విచంద్రత్వజ్ఞానము మిథ్య కానిదికాదు (అనఁగా మిథ్యయేయైనది) కాఁబట్టి ఆ ద్విచంద్రత్వజ్ఞానము మూలముగాఁ దెలియవచ్చు ద్విచంద్రత్వమును (చంద్రులు రెండుగా నుండుటయును) మిథ్యయే యగును. దోషమున కెప్పుడును అయథార్థమగు జ్ఞానమును గలుగఁజేయుటయే కదా స్వభావము—[1]అట్లే (శాస్త్రవిదితమగు) బ్రహ్మజ్ఞానము సయితము తన్ను బాధించునట్టి వేఱొక జ్ఞానమేదియును లేనిదియే యయినను అవిద్యా దోష మూలమయినదగుటంజేసి యది స్వయముగ మిథ్యయగుటయే కాక దానిమూలముగాఁ దెలియవచ్చునట్టి బ్రహ్మము సయితము మిథ్యయే యగును.

ఈవిషయమునుగుఱించి [2]న్యాయప్రయోగములు (Syllogistic Statements) సయితము గలవు. ఎట్లన;

ప్రతిజ్ఞ:—ప్రకృతమున వివాదములో నున్నట్టి బ్రహ్మము మిథ్య (అసత్యము).

హేతువు:—[3]అవిద్యావంతునికిఁ గలిగిన జ్ఞానముచేఁ దెలుపఁదగినది యగుటవలన.

ఉదాహరణము:—[4]ప్రపంచమువలెను.

---

ప్రతిజ్ఞ:—బ్రహ్మము మిథ్య.
హేతువు:—జ్ఞానముచేఁ దెలుపఁదగినది యగుటవలన.
ఉదాహరణము:—ప్రపంచమువలెను.

---

ప్రతిజ్ఞ:—బ్రహ్మము మిథ్య.

---

(1) శాస్త్రజన్య బ్రహ్మజ్ఞానమును ద్విచంద్రత్వ జ్ఞానముగను, దానికి బాధకమగు జ్ఞానాంతరమును చంద్రైకత్వజ్ఞానముగను, అవిద్యాదోషమును తిమిరదోషముగను పోల్చుకొనవలయును. ద్విచంద్రత్వజ్ఞానమును తన్మూలకమగు ద్విచంద్రత్వమును మిథ్యయగునట్లే శాస్త్రజన్య బ్రహ్మజ్ఞానమును తత్సిద్ధమగు బ్రహ్మమును మిథ్యయగుచున్నవని ఔపమ్యము తెలియునది.

(2) ౭౪-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

(3) ౧౩౯-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన 3-వ వివరణమును చూడుము.

(4) జ్ఞానముచేఁ దెలుపఁదగిన ప్రతివస్తువును మిథ్య. ఉదాహరణము ఘటపటాది విశిష్టమగు ప్రపంచమంతయును జ్ఞానముచేఁ దెలుపఁదగినదయినందున మిథ్యయని యెఱుంగునది. ఇట్లు అద్వైతులు ఇంతకుపూర్వము మహాపూర్వపక్షమునం దనేకతావుల వాదించియున్నారు.

హేతువు :—అసత్యమగు హేతువువలనఁ గలిగిన జ్ఞానముచేఁ దెలుపఁ దగినది యగుటవలన.

ఉదాహరణము :—ప్రపంచమువలెనే.

అద్వైతి :—అట్లుచెప్పఁదగదు. స్వప్నమునందు గానంబడు ఏనుఁగు మొదలగువానిని గుఱించిన జ్ఞానము అసత్యమే యయినను అదిరాఁబోవు శుభాశుభములను తెలుపుటకు హేతువగు చందమున శాస్త్రమును అవిద్యామూలమగుటంజేసి యసత్యమే యయినను పరమార్థభూతమగు బ్రహ్మమును తెలుపునట్టి హేతువుకాఁదగును. అందు విరోధమేదియును లేదు.

భాష్యకారులు :—అట్లు చెప్పఁదగదు. స్వప్నమునంగానఁబడిన పదార్థములనుగుఱించిన జ్ఞానమన్ననో అసత్యముకాదు. అప్పుడు గానఁబడు పదార్థములు మాత్రమేకదా యసత్యములు. ఎట్లన, మేల్కాంచినప్పుడు ఆపదార్థములు బాధింపఁబడునవిగాఁ గన్పట్టుచున్నవియే కాని వానిని గుఱించిన జ్ఞానమన్ననో బాధింపఁబడుచున్నట్టిదిగాఁ గానఁబడుచుండలేదు. ఏలన, స్వప్నమునందనుభవింపఁబడిన జ్ఞానము సయితము అసత్యమని యెవ్వరును తలంపరుగదా! అయితే దానిని గుఱించిన జ్ఞానముకలదనియు, అప్పుడు తెలియఁబడిన పదార్థములుమాత్రమే లేవనియు నివ్విధమునఁగదా ఒక్కొక్కఁడును తెలిసికొనును.

గారడివాఁడు మంత్రౌషధాదులవలన మనమనస్సునఁ గలుగఁజేయు మాయామయమగు జ్ఞానముసయితము సత్యమైనదియే. కనుకనే అది యొకప్పుడానందమును మఱియొకప్పుడు భయంబును గలుగఁజేయుచున్నది. మఱియు నట్టి యవస్థయందలి యాజ్ఞానము వేఱొకదానిచే బాధింపఁబడుచున్నట్లు గానఁబడుచుండలేదు. విషయమున నుండునట్టిదిగాని ఇంద్రియమున నుండునట్టిదిగాని యగు దోషమువలన రజ్జువుమొదలగునవి సర్పము మొదలగునవిగాఁ దెలియవచ్చుట యనెడి జ్ఞానముసయితము సత్యమే. కనుకనే అట్టి జ్ఞానము భయాదులను గలుగఁజేయుచున్నది.

తన్ను సర్పము కఱవకపోయినను దాని సమీపముననుండుటచేఁ గలుగునట్టి "సర్పము కఱచెను" అనెడి జ్ఞానమును సత్యమే. విషసంపర్కము గలిగెననెడి యనుమానము సయితము సత్యమే. ఏలయన, అట్టియనుమానము మరణమును గలుగఁజేయవచ్చును గదా!

జలము మొదలగువానిలో ముఖము మొదలగునవి తెలియవచ్చుట యును, నొకవస్తువే. కనుకనే వస్తుభూతమగు ముఖమునందలి విశేషములను నిశ్చయించుటలో నది హేతువగుచున్నది. ఈపైని గనఁబఱచిన జ్ఞానములన్నియును ఉత్పత్తి గలవియగుటనుబట్టియు, ఒకకార్యము నొనర్చుటలో నుపయోగపడుటనుబట్టియును అవి సత్యములుగా నిశ్చయింపఁబడుచున్నవి.

అద్వైతి:—వాస్తవమునకు స్వప్నమున ఏనుఁగు మొదలగునవి లేవు. కాన వానిని గుఱించిన జ్ఞానము సత్యమని యెట్లు చెప్పఁదగును?

భాష్యకారులు:—అట్లు కాదు. జ్ఞానము గలుగవలయునన్న అందుల కేదైన నొక యాధార ముండవలయును. ఇంతియే. అప్పు డేదైన నొక పదార్థము ఉన్నట్టిదిగాఁ బ్రకాశమాన మగుటమాత్రమే అట్టిజ్ఞానము గలుగుట కాధారమగుట కావశ్యకము. ప్రకృతము నట్లేదైన నొకపదార్థ మున్నట్టిదిగాఁ బ్రకాశమానమగుట యన్ననో దోషవశమునఁ గలదు. అయితే ఏదైన నొక వస్తువు బాధింపఁబడినట్లైనఁగదా అది యసత్యమని నిశ్చయింపఁదగును. ప్రకృతమున ఈ జ్ఞానము బాధింపఁబడునట్టిది కాదు. కావున నిది సత్యమనియే చెప్పఁదగును.

అద్వైతి:—అసత్యములగు గీతలనుండి సత్యమగు అక్షరజ్ఞానము (అక్షరమనెడిజ్ఞానము) గలుగుచందమున అసత్యమగు శాస్త్రమునుండి సత్యమగు బ్రహ్మజ్ఞానము (బ్రహ్మమును గుఱించిన జ్ఞానము) గలుగవచ్చునే?

భాష్యకారులు:—గీతలనుండి అక్షరజ్ఞానము గలుగుచున్నప్పటికిని అసత్యవస్తువునుండి సత్యవస్తువును గుఱించిన జ్ఞానము గలుగవచ్చునని చెప్పఁదగదు. ఏలన, వాస్తవమునకు గీతలు సత్యముగాఁ గలవుగదా!

అద్వైతి:—[1]అట్టి గీత అక్షరముయొక్క యాకారము గలదిగాను గ్రహింపఁబడినదైకదా అక్షరమనెడి జ్ఞానమును గలుగఁజేయునది యగుచున్నది. అయితే అది అక్షరాకారముగలది యగుట యసత్యము.

---

(1) ఇవ్విధమగు గీత యివ్విధమైన వర్ణమును తెలుపును, ఇవ్విధమగు గీత యివ్విధమైన వర్ణమును తెలుపును. అని యిట్లు ఆయా గీతలను ఆయా వర్ణములనుగా భావించుకొనుటచే గీతలు వర్ణములను తెలుపునవి యగుచున్నవి. వాస్తవమునకు గీతలు గీతలేకాని వర్ణములు కాఁదగవు. అనఁగా మనమనస్సులో గీతలయందు వర్ణధర్మముల నారోపించుటచే నవి వర్ణమును గుఱించిన జ్ఞానమును గలుగఁజేయునవి యగుచున్నవి. ఇంతియే.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలన, గీత వర్ణాకారమును గలిగి యుండుట స్వయముగా నసత్యమయినచో నది యొక యుపాయము (ఒకదానిఁ గలుగఁజేయునది) కాఁదగదు. వాస్తవమునకు లేనిదై ఇట్టిదియని చెప్పనశక్యమయినది యొక యుపాయమగునట్లు ఎన్నఁడును చూచియుండలేదు. అట్టిది యొక యుపాయమగుటయును సంభవము కాదు.

అద్వైతి:—గీతయందు వర్ణమనెడి జ్ఞానమే(తలంపే)గదా అట్టి యుపాయము!

భాష్యకారులు:—అట్లంటివేని వర్ణమనెడి జ్ఞానము స్వయముగ అసత్యమైనది కావున అసత్యమగు దానినుండి సత్యమగుదానిని గుఱించిన జ్ఞానము గలుగుననెడి మీ ప్రతిజ్ఞకు భంగము వచ్చునే? ఇంతేకాక అట్లైనపక్షమున ఉపాయోపేయములు రెండును ఒక్కటియేయని ప్రసక్తించును. ఏలన, ప్రకృతమున ఉపాయోపేయములు రెండును వర్ణమనెడి జ్ఞానమే కదా!

మఱియు గీత వాస్తవమునకు తనయందు లేనట్టి వర్ణాకారముచే నేదైననొక వర్ణమును గుఱించిన జ్ఞానమును గలుగఁజేయువిషయమై యుపాయమగు పక్షమున, ఒక్కటియే గీతయందు సమస్తవర్ణములయొక్కయును ఆకారములు లేకుండుటసులభమే కావున నొక్కగీతను చూచుటచే (అందు వాస్తవముగా లేనట్టి) సమస్తవర్ణములను గుఱించిన జ్ఞానము గలుగవలసివచ్చునే?

అద్వైతి:—ఏదైన నొక్క యాకారవిశేషమునఁ (ఒకవ్యక్తియందు) దేవదత్తుఁడు మొదలగు (ఒక్కవిధమైన) శబ్దసంకేతము గలుగుచున్నట్లు చక్షురింద్రియముచేఁ దెలియఁదగినట్టిది యగు ఒక్కవిధమైన గీతయందు శ్రోత్రేంద్రియముచేఁ దెలియఁదగినది యగు ఒక్కవిధమైన వర్ణమును గుఱించిన సంకేతము గలుగవచ్చును. అట్టి సంకేతమునుబట్టి ఒక్కవిధమైన గీత ఒక్కవిధమైన వర్ణమును గుఱించిన జ్ఞానమును మాత్రమే గలుగఁజేయునది కాఁదగును.

భాష్యకారులు:—అట్లైనపక్షమున సత్యమైన దానివలననే సత్యమైన దానిని గుఱించిన జ్ఞానము గలుగుచున్నదన్నమాట వచ్చునే? ఏలన, ప్రకృతమున గీతయును సంకేతమును ఈరెండును సత్యములే కదా! చిత్తరువున వ్రాయఁబడిన గవయమృగమును చూచి లోకమున వాస్తవముగానుండు గవయమృగమును దెలిసికొనునట్లు (మీరు గనఁబఱచినది) సాదృశ్యమును (పోలికను) బట్టి సంభవించునది. సాదృశ్యమన్ననో సత్యమైనట్టిదియే కదా!

అద్వైతి:—ఒక్కటియే యాకారముగలదియగు శబ్దము [1]స్వరభేదమును బట్టి యర్థభేదమును గుఱించిన జ్ఞానమును గలుగఁజేయు నదియగు చందమున అసత్యమగు దానినుండి సత్యమైనది తెలియఁదగును.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలన, శబ్దము ఒక్కటియే యైనను అది నానావిధములగు స్వరములచే ప్రకాశింపఁబడినదై ఆయా స్వరములచే ప్రకాశింపఁబడునట్టి తనస్వరూపముతో నర్థభేదములకుఁగల సంబంధమును గ్రహించుటచే నది యర్థభేదమును గుఱించిన జ్ఞానమును గలుగఁజేయు నది యగుచున్నది. మఱియు శబ్దము ఒక్కటియే యాకారము గలదనిచెప్పుట

(1) శబ్దము ఒక్కవిధమైనదియే యైనను స్వరభేదమునుబట్టి యర్థభేదము గలుగుచున్నట్లు వేదవాక్యములలో ననేకచోట్ల గన్పట్టుచున్నది. ఈవిషయమును గుఱించి శ్రీ పతంజలిమహర్షి వ్యాకరణ మహాభాష్యమున నిట్లు వ్రాసియున్నారు.

శ్రు॥ దుష్టశ్శబ్దస్స్వరతో వర్ణతోవా మిథ్యా ప్రయుక్తో న తదర్థమాహ ।
సవాగ్వజ్రో యజమానం హినస్తి యథేన్ద్రశత్రుస్స్వరతోఽపరాధాత్ ॥

తా॥ శబ్దము స్వరవ్యత్యాసముచేఁ గాని వర్ణవ్యత్యాసముచేఁ గాని తప్పుగా యజ్ఞాదికర్మములందు ప్రయోగింపఁబడినదైన (ఉచ్చరింపఁబడినదైన) నది వక్తచే నుద్దేశింపఁబడిన యర్థమును తెలుపనిదై వాగ్రూపమగు వజ్రాయుధమగుచు యజమానుని హింసించును. "ఇన్ద్రశత్రు" శబ్దము తప్పుస్వరముతో నుచ్చరింపఁబడినదై యజమానుని హింసించినట్లు మనము చూచియున్నాము గదా!

ఈసందర్భమున నొక యితిహాసము గలదు. ఎట్లన, పూర్వకాలమునందు వృత్రాసురుఁడను రాక్షసుఁడు ఇంద్రుని చంపఁదలచి అందులకై అభిచారకర్మము నాచరించెను. ఆసందర్భమున "ఇంద్రశత్రుర్వర్ధస్వ" అనెడి మంత్రము పఠింపఁబడియె. అప్పుడు "ఇన్ద్రశత్రుః" అను శబ్దమును ఆద్యోదాత్తస్వరముతో నుచ్చరింపఁబడినట్లయిన "ఇంద్రుని శమింపఁజేయువాఁడను కావలయును" అనెడి తత్పురుషసమాసార్థము నాశబ్ద మిచ్చియుండును. అయితే ఆమంత్రము నుచ్చరించిన ఋత్విజుఁడు ఆశబ్దమును ఆద్యోదాత్తస్వరముతో నుచ్చరించుటకు బదులుగా అంతోదాత్తస్వరముతో నుచ్చరించెను. అందువలన నాశబ్దము ఈపైని గనఁబఱచిన ప్రకారము తత్పురుషసమాసార్థము నిచ్చుటకు బదులుగా "ఇంద్రుఁడే శమింపఁజేయువాఁడుగాఁ గలవాఁడను కావలయును" అనెడి బహువ్రీహి సమాసార్థము నిచ్చెను. అందువలన వృత్రాసురుఁడు ఇంద్రునిచే హింసింపఁబడెను.

ఈమహర్షి స్వరభేదమునుగుఱించి మహాభాష్యమున వేఱొకతావున నిట్లు వ్రాసియున్నారు.

"ఉదాత్తానుదాత్త స్వరితంబు లనఁబడు స్వరంబులకు పరస్పరము భేదము గలదు. అది యెట్లు తెలియుచున్నదనఁగా, ఉదాత్తస్వరముతో నుచ్చరింపవలసిన శబ్దమును అనుదాత్తస్వరముతో నుచ్చరించు శిష్యునితో "నీవు బాగుగా నుచ్చరించలేదు" అనుచు ఖండికోపాధ్యాయుఁడు వానికొక చెంపదెబ్బ నిచ్చుచున్నాఁడు."

కావున ఇట్లు స్వరంబులకుఁ గలభేదము అర్థభేదమును గలుగఁజేయునదియే యని తెలియుచున్నది.

యుక్తముకాదు. ఏలన, గకారాదులను తెలుపునట్టిదియే గదా శ్రోత్రేంద్రియముచేఁ దెలియఁదగినది యగుటచే శబ్దమని వ్యవహరింపఁబడుచున్నది.

కావున అసత్యమగు శాస్త్రమువలన సత్యమగు బ్రహ్మమును గుఱించిన జ్ఞానముగలుగునని యుపపాదించుట దుర్లభము.

అద్వైతి :—ఆకాశపుష్పమువలె శాస్త్రముక్కఎన్నఁడును లేనిదికాదు. ఏలన, [1]అద్వైతజ్ఞానము గలుగుటకు పూర్వము శాస్త్రముఉన్నట్టిదిగాను తెలియవచ్చుచున్నది. అయితే అట్టి తత్త్వజ్ఞానము కలిగిన తరువాతను గదా శాస్త్రము లేనిదియగును. అప్పుడే (అట్టి జ్ఞానము గలిగిన తరువాతనే) కదా శాస్త్రము నిర్విశేషచిన్మాత్రమగు బ్రహ్మమును తెలుపుటకై యుపాయము కాఁదగదు. ఎప్పుడది యట్టియుపాయము కాఁదగునో అప్పుడది యున్నట్టిదే, ఏలన, అప్పుడది కలదనెడి జ్ఞానము కలదు గదా!

భాష్యకారులు :—అట్లు చెప్పఁదగదు. ఏలన, వాస్తవమునకు శాస్త్రమనున దొకటి లేనప్పుడైన, అది కలదనెడి జ్ఞానము మిథ్యయగునే?

అద్వైతి :—అంతమాత్రముచే నేమి?

భాష్యకారులు :—అట్లైనపక్షమున మిథ్యాభూతమగు శాస్త్రమువలనఁ గలుగు జ్ఞానముచేఁ దెలుపఁబడు బ్రహ్మము సయితము మిథ్యయే యని ప్రసక్తించును. ఉదాహరణము—దూరముగానుండు మంచును పొగగాఁ గొనుటచే గలుగునట్టి యగ్నిజ్ఞానము మిథ్యయగుటచే నట్టిజ్ఞానమువలనఁ దెలుపఁబడునట్టి యగ్నియును మిథ్యయే యగును కదా!

అద్వైతి :—శాస్త్రమును బాధించునట్టిది వేఱొకటి లేదే?

భాష్యకారులు :—లేకేమి? [2]"శూన్యమే తత్త్వము" అనెడి వాక్యము శాస్త్రమును బాధించునదిగాఁ గన్పట్టుచున్నది గదా!

---

(1) శ్రీ శారీరక మీమాంసా సూత్రభాష్యమునందలి సమన్వయాధికరణమున శ్రీశంకరాచార్యులవా రిట్లు వ్రాసియున్నారు.

శ్లో॥ దేహాత్మ ప్రత్యయో యద్వత్ప్రమాణ త్వేన కల్పితః ।
లౌకికం తద్వదేవేదం ప్రమాణం త్వాత్మ నిశ్చయాత్॥

తా॥ దేహమే యాత్మయనెడి యవిద్య యెంతవఱకు ప్రమాణముగాఁ గల్పింపఁబడునో అంతవఱకే—అట్టి యవిద్యపోయి యాత్మయొక్క వాస్తవమైన స్వరూపము నిశ్చయింపఁబడు వఱకే—లౌకికప్రమాణములును వైదికప్రమాణములును ఉన్నట్టివిగాఁ దోచును.

(2) బౌద్ధులలో నొక్క తెగవారగు మాధ్యమికులు "శూన్యమే తత్త్వము" అని చెప్పుచున్నారు.

అద్వైతి :—అది భ్రాంతిమూలము.

భాష్యకారులు :—శాస్త్రము సయితము భ్రాంతిమూలమే యని నీవే చెప్పియున్నావే? కావున వేఱొకదాని బాధలేనిది యేవాక్యమే. కాఁబట్టి కుత్సిత వితండ వాదరూపమగు పరిహాస మింతటితో చాలును.

"సదేవ సోమ్యేద మగ్రఆసీత్" (ఛా. ౬-ప్ర. ౨-ఖ. ౧-వా) ఈ మొద లగు ఉపనిషద్వాక్యములు నిర్విశేష చిన్మాత్రైకరసమగు వస్తువును మాత్రమే ప్రతిపాదించుచున్నవని (౪౫-పు. ౧-పం.) అద్వైతులు వాదించుచున్నారు. అయితే వారి వాదము యుక్తమైనది కాదు. ఏలన,

"ఒక్కటి తెలియుటచే సర్వమును తెలియఁబడును" అని ప్రతిజ్ఞచేసి అట్టిప్రతి జ్ఞను సమర్థించుటకై, "సత్" అనఁబడు పరబ్రహ్మము జగత్తునకు [1]ఉపాదానకారణ మగుటయు, [2]నిమిత్తకారణమగుటయు, సర్వజ్ఞుఁడగుటయు, సర్వశక్తియుక్తుఁడగు టయు, సత్యసంకల్పుఁ డగుటయు, సర్వాన్తరుఁ డగుటయు, సర్వాధారమగు టయు, సర్వనియామకుఁ డగుటయు నీ మొదలుగాగల యనేక కల్యాణగుణం బులు గలవాఁడనియు, ఈజగత్తునందంతటను వ్యాపించి యుండువాఁడనియును ప్రతిపాదించి తరువాత "ఇట్టి పరబ్రహ్మమే నీయొక్క యన్తరాత్మ" అని యిట్లు శ్వేతకేతుని కుపదేశించుటకై గదా "సదేవసోమ్య" ఇత్యాదిగ్రంథ మారంభిం పఁబడినది. ఈవిషయమును గుఱించి "వేదార్థసంగ్రహము" అను గ్రంథమున విశదీకరింపఁబడియె. ప్రకృతగ్రంథమున సయితము "ఆరంభణాధికరణమున" ఎక్కువ నైపుణ్యముతో నీవిషయము ఉపపాదింపఁబడును.

"అథ పరా యయా తదక్షరం" (ము. ౧-ము. ౧-ఖ. ౫-వా.) అనే శ్రుతివాక్యమున సయితము ప్రాకృతములగు హేయగుణములు పరబ్రహ్మమునకు

---

(1) ఏపదార్థముతో తప్పక చేరియుండినదయిరే యేకార్యము గలుగుచున్నదో ఆపదా ర్థము ఆకార్యము గలుగుటకు ఉపాదానకారణ మనఁబడుచున్నది. ఉదాహరణము:—మృత్తికతోఁ జేరినదై యే ఘట మనఁబడు కార్యము గలుగుచున్నది గాన ఘటమనఁబడు కార్యము గలుగుటకు మృత్తిక యుపాదాన కారణ మనఁబడుచున్నది.

(2) అట్లు ఉపాదాన కారణమువలె కార్యముతో నియతసంబంధము గలదికానిదై కార్య మును గలుగఁజేయు కర్తగ నుండునది నిమిత్తకారణ మనఁబడును. ఉదాహరణము. ఘటమనఁబడు కార్యమును గలుగఁజేయు కులాలుఁడు ఘటరూపమగు కార్యమునకు నిమిత్తకారణము.

వైశేషికాదులలో కొందఱు జగత్తనఁబడు కార్యము గలుగుటకు పరమాణువులు ఉపాదాన కారణమనియు ఈశ్వరుఁడు నిమిత్తకారణ మనియును చెప్పుచున్నారు. సామాన్యముగ వేదాంతు లందఱు జగత్తున కుపాదాన కారణమును నిమిత్తకారణమును సర్వేశ్వరుఁడే యని చెప్పుచున్నారు.

లేవనియు, నిత్యత్వము, విభుత్వము, సూక్ష్మత్వము, సర్వగతత్వము, అవ్యయత్వము, భూతయోనిత్వము మొదలుగాఁగల కల్యాణగుణము లతనికిఁ గలవనియును ప్రతిపాదింపఁబడియె.

"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తై. ఆన. ౧ - వా.) అనుతావున సామానాధికరణ్యము కలదు. [1]అనేక గుణములతోఁ గూడియున్నట్టి యొక్క పదార్థమును తెలుపుటయే సామానాధికరణ్యమని "సామానాధికరణ్య" శబ్దము యొక్క వ్యుత్పత్తినిబట్టి తెలియవచ్చుచున్నది. కావున ఈ వాక్యము నిర్విశేష వస్తువును తెలుపఁజాలదు. ఏలన, [2]ప్రవృత్తి నిమిత్తభేదముచే ఒకపదార్థమును తెలుపుటనుగదా సామానాధికరణ్యమందురు. ఈవాక్యమునందుండు సత్యజ్ఞానాది పదములు వాని ముఖ్యార్థములగు గుణములను తెలుపుపక్షమునఁ గాని లేక [3]అట్టి గుణములతో విరోధించు ఆకారమునకంటెను విలక్షణయిన యాకారమును తెలుపుపక్షమునఁగాని (౫౭-పు. ౫-పం.) నిమిత్తభేదము అవశ్యముగా నుండవలయును. ఈరెండు పక్షములలో మొదటిపక్షమున పదములు ముఖ్యార్థముగల వగుచున్నవి. రెండవపక్షమున నవి లక్షణార్థముగల వగుచున్నవి. ఇంతియే యీరెండుపక్షములకుఁగల భేదము.

అద్వైతి :—అజ్ఞానాదులకు విరుద్ధమయిన దగుటయును వస్తుస్వరూపమే గదా?

భాష్యకారులు :—అట్లు చెప్పఁదగదు. అట్లైనపక్షమున సత్యజ్ఞానాది పదములలో నేదైననొక్క పదముచేతనే (బ్రహ్మముయొక్క) స్వరూపము తెలుపఁబడుచుండగా తక్కిన పదములను ప్రయోగించుట నిరర్థకమగును. అట్లైన పక్షమున సామానాధికరణ్యమే సిద్ధింపదు. ఏలన, పదములన్నియును ఒక్కటియే యర్థమును తెలుపునట్టి వగుపక్షమున వానికి నిమిత్తభేదము ఆశ్రయింపఁబడదు.

అద్వైతి :—పదార్థ మొక్కటియే గావచ్చును. అయినను గుణములకు పరస్పరము భేదముండుటనుబట్టి యట్టిగుణములను గలిగియుండుటలోను భేదముండును. అందువలన పదములు ఒక్కటియే పదార్థమును తెలుపుచుండుట యనునది సిద్ధింపనేరదు. అట్టిస్థితి సామానాధికరణ్యమునకు విరుద్ధమయినదిగదా.

భాష్యకారులు :—ఒక్కటియే పదార్థము అనేకగుణములతోఁ గూడి యుండుటను ప్రతిపాదించుటయే సామానాధికరణ్యమునకు స్వభావము. కనుకనే

(1) ౪౬-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

(2) శబ్దములకుఁ గల యర్థభేదము ప్రవృత్తి నిమిత్తభేద మనఁబడుచున్నది.

(3) ౫౭-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

వ్యాకరణశాస్త్రజ్ఞులు "భిన్నప్రవృత్తినిమిత్తానాం శబ్దానామేకస్మిన్నర్థేవృత్తిస్సామానాధికరణ్యమ్" అని యివ్విధమున సామానాధికరణ్యముయొక్క లక్షణమును చెప్పుచున్నారు.

అద్వైతి:—"ఏకమేవా ద్వితీయం" అను శ్రుతివాక్యమునందుండు "అద్వితీయం" అనుపదము గుణమాత్రమైనను బ్రహ్మమునకంటెను వేఱొకటి గలదనిచెప్పుట కవకాశమీయదు. జగత్కారణమును ప్రతిపాదించు శ్రుతివాక్యములు అట్టి జగత్కారణమగు బ్రహ్మమును అద్వితీయము (రెండవది లేనిదానిని) గానే ప్రతిపాదించుచున్నట్లు [1]"సర్వశాఖా ప్రత్యయన్యాయ"మువలనఁ దెలియవచ్చుచున్నది. ఏలన, జగత్కారణముగాఁ శ్రుతులయం దుపలక్షింపఁబడిన బ్రహ్మముయొక్క స్వరూపము ఇట్టిదియని తెలుపుటకై గదా "సత్యంజ్ఞానమనన్తమ్" ఇత్యాది శ్రుతివాక్యము ప్రవర్తించినది. ఇట్లు ఈవాక్యముచే లక్షణము చెప్పఁబడిన బ్రహ్మము నిర్గుణమే (గుణము లేవియును లేనిదియే). అట్లు కాని పక్షమున ఈ శ్రుతివాక్యము "నిర్గుణం" "నిరఞ్జనం" అను శ్రుతివాక్యములతో విరోధించును. (౯౮. ౫౯-పు.)

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలన, "అద్వితీయం" అను పదము "జగత్తున కుపాదానకారణమగు బ్రహ్మము అద్వితీయం (రెండవది లేనిది) అనఁగా జగత్తును గలుగఁజేయునట్టి వేఱొకవస్తువులేనిదని తెలుపుచు (అట్టిదేదియును లేకుండనే ఈజగత్తును సృష్టించుటకుఁదగిన) విచిత్రశక్తి బ్రహ్మమునకుఁ గలదని ప్రతిపాదించుచున్నది. అట్టి విచిత్రశక్తినే "తదైక్షత బహుస్యాం ప్రజాయాయ" (ఛా. ౬-ప్ర. ౨-ఖ. 3-వా.) (జగత్తును సృష్టించుటకై నేననేకముగా నగుదునని బ్రహ్మము ధ్యానించెను) అనియు "తత్తేజోఽసృజత" (ఛా. ౬-ప్ర. ౨-ఖ. 3-వా.) (బ్రహ్మము తేజస్సును సృష్టించెను) అనియు నీమొదలగు శ్రుతివాక్యములు సయితము ప్రతిపాదించుచున్నవి.

అద్వైతి:—సామాన్యముగా "అద్వితీయం" (రెండవదిలేనిది) అన్నట్లైన "కారణాంతర మేదియును లేనిది" అని యెట్లు తెలిసికొన శక్యము?

భాష్యకారులు:—చెప్పెదను. "సదేవ సోమ్యేద మగ్ర ఆసీదేకమేవాద్వితీయం" (ఛా. ౬-ప్ర. ౨-ఖ. ౧-వా) అను శ్రుతివాక్యము "సృష్టికై తలపెట్టిన బ్రహ్మము (జగత్తునకు) ఉపాదానకారణము" అని తెలుపుచున్నది. అయితేలోక

(1) ౯౮-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

మున సాధారణముగా నేదైన నొకకార్యము కలుగవలయునన్న ఉపాదాన కారణమేకాక నిమిత్తకారణము సయితము ఉండవలయును. కావున బ్రహ్మమునకంటె వేఱొకటి నిమిత్తకారణముగా నుండవలయుననెడి తలంపుగలుగుట సహజము. అట్టితలంపును తొలఁగించుటకై "అద్వితీయం" అనెడి పదము "బ్రహ్మము నిమిత్తాంతరమేదియు లేనిది" అని తెలుపుచున్నది.

అట్లుకాక "అద్వితీయం" అనెడి పదము బ్రహ్మముతప్ప మఱియేదియును లేదని తెలుపునదై బ్రహ్మేతరమగు సమస్తమును నిషేధించుచున్నదంటివేని మీ రంగీకరించి సాధింపనిశ్చయించిన నిత్యత్వాదులును అట్లే నిషేధింపఁబడిన వగును. సర్వశాఖాప్రత్యయన్యాయమన్ననో మీకు ప్రతికూలమైనది. ఏలన, వేదశాఖలలో నన్నింటిలోను కారణవస్తువుతో సంబంధించినవిగాను పఠింపఁబడిన సర్వజ్ఞత్వము మొదలుగాఁగల గుణములు ప్రకృతవాక్యమున ననుసంధింపవలసినవని గదా సర్వశాఖాప్రత్యయన్యాయము తెలుపును! కావున జగత్కారణమును ప్రతిపాదించునట్టి వాక్యముయొక్క స్వరూపమునుబట్టియు "సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ" అనెడి శ్రుతివాక్యము బ్రహ్మము విశేషములతోఁ (గుణములతోఁ) గూడియున్నట్టిది యనియే ప్రతిపాదించుచున్నట్లు విశదమగుచున్నది.

అయితే "సత్యం జ్ఞాన మనన్తమ్‌బ్రహ్మ" అను శ్రుతివాక్యము బ్రహ్మముగుణములు గలదియని తెలుపుపక్షమున నది "నిర్గుణం" "నిరంజనం" "నిష్కళం నిష్క్రియంశాన్తం" అను శ్రుతివాక్యములతో విరోధించునని చెప్పఁదగదు. ఏలన, ఆశ్రుతివాక్యములు బ్రహ్మము గుణములు లేనిదియనఁగా ప్రకృతితో సంబంధించిన హేయగుణములు లేనిదియని గదా చెప్పుచున్నవి.

జ్ఞానముమాత్రమే బ్రహ్మముయొక్క స్వరూపమని ప్రతిపాదించు శ్రుతివాక్యములు సయితము బ్రహ్మము జ్ఞానమును స్వరూపముగాఁ గలదియని గదా చెప్పుచున్నవి. అంతమాత్రముచే జ్ఞానము మాత్రమే తత్త్వమని తలంపఁగూడదు. ఏలన, ఏది జ్ఞానముకలదియో అదే కదా జ్ఞానము స్వరూపముగాఁ గలది కాఁదగును. మణులు, సూర్యుఁడు, దీపము మొదలగునవి ప్రకాశమే స్వరూపముగాఁ గలవియేయై ప్రకాశమున కాశ్రయములు అనఁగా ప్రకాశముగలవి యగుచందమున ఏది జ్ఞానమే స్వరూపముగాఁగలదో అదే జ్ఞానమున కాశ్రయము కాఁదగునని యింతకు పూర్వము చెప్పఁబడియె. (౧౧౬-పు. ౨౧-పం.) సమస్తశ్రుతులును జ్ఞాతృత్వమును గుఱించియే కదా చెప్పుచున్నవి. ఎట్లన,

ముండకోపనిషత్తునందు "యస్సర్వజ్ఞస్సర్వవిత్" (౧-ము. ౧-ఖ. ౯-వా) "ఏ పరబ్రహ్మము సమస్తపదార్థములయొక్క స్వరూపములను వాని విధముల నున్ను తెలిసికొనినదో" అని యిట్లు పఠింపఁబడియె.

ఛందోగులు "తదైక్షత" (ఛా. ౬-ప్ర. 3-ఖ. ౨-వా) "ఆదేవత ధ్యానించెను" అని పఠించుచున్నారు.

కఠోపనిషత్తునందు "నిత్యో నిత్యానాం చేతనశ్చేతనానామేకో బహూనాం విదధాతి కామాన్" (కఠ. ౨-అ. ౫-వ. ౧3-వా) "నిత్యుఁడును చేతనుఁడును అనఁగా జ్ఞానము కలవాఁడును ఒక్కఁడునునగు నెవ్వఁడు అనేకులగు చేతనుల కోరికలను నెఱవేర్చుచున్నాఁడో" అని యిట్లు పఠింపఁబడియె.

శ్వేతాశ్వతరోపనిషత్తునందు "జ్ఞాజ్ఞౌ ద్వావజావీశానీశౌ" (శ్వే. ౧-అ. ౯-వా) "ఒక్కఁడు సర్వజ్ఞుఁడును మఱియొక్కఁడు అజ్ఞుఁడునైనవారును, ఒక్కఁడు ఈశ్వరుఁడును మఱియొక్కఁడు ఈశ్వరుఁడుగానివాఁడును అగు ఈయిద్దరు పుట్టుకలేనివారు" అనియు, "తమీశ్వరాణాం పరమం మహేశ్వరం। తం దైవతానాం పరమంచదైవతం పతిం పతీనాం పరమం పరస్తాత్ । విదామదేవం భువనేశమీడ్యం" (శ్వే. ౬-అ. ౭-వా). "ఈశ్వరులకు అనఁగా నధికారులకు గొప్ప ఈశ్వరుఁ డయినవాఁడును, దేవతలకు గొప్పదేవత యయినవాఁడును, అధిపతులకు గొప్పయధిపతి యయినవాఁడును, సమస్తలోకములకు నధిపతియయినవాఁడును, స్తుతింపదగినవాఁడునగు భగవంతుని ధ్యానముచేతుము గాక" అనియు. "న తస్య కార్యం కరణంచ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే। పరాస్య శక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" (శ్వే. ౬-అ. ౮-వా) "అతఁడు శరీరరహితుఁడు, ఇంద్రియరహితుఁడు, అతనితో సమానుఁడైనవాఁడును, అతనికంటె నధికుఁడును కానఁబడఁడు. అతనికి గొప్పదియును అనేకవిధమగు శక్తిగలదు. స్వభావసిద్ధములగు జ్ఞానంబును, బలంబును, క్రియయును కలవు" అనియును పఠింపఁబడియె.

ఛందోగులు "ఏష ఆత్మా ఽపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాస స్సత్యకామ స్సత్య సంకల్పః" (ఛా. ౮-ప్ర. ౧-ఖ. ౫-వా.) "ఈపరబ్రహ్మము పాపములేనివాఁడును, ముసలితనములేనివాఁడును, మరణములేనివాఁడును, దుఃఖములేనివాఁడును, ఆకలిలేనివాఁడును, దప్పికలేనివాఁడును, సత్యకాముఁడును, సత్యసంకల్పుఁడును" అని పఠించుచున్నారు.

ఈ మొదలగు శ్రుతివాక్యములు జ్ఞాతృత్వము మున్నగు కల్యాణ గుణములు జ్ఞానస్వరూపుఁడగు పరబ్రహ్మమునకు స్వాభావికము లయినవనియు, అతనికి హేయగుణము లేవియును లేవనియును చెప్పుచున్నవి. ఈపైని గనఁబఱచిన "ఏష ఆత్మా ఉపహతపాప్మా" అను శ్రుతివాక్యమే "అపహత పాప్మా" అను శబ్దము మొదలుకొని "అపిపాసః" అను శబ్దము వఱకును హేయగుణములను నిషేధించుచు అనఁగా హేయగుణములు పరబ్రహ్మమున కెంతమాత్రము లేవని చెప్పుచు, "సత్యకామః" "సత్యసంకల్పః" అను శబ్దము లచే కల్యాణగుణములను విధించుచు, నిందుమూలముగా శ్రుతులయందలి సగుణ నిర్గుణ వాక్యములయొక్క యుద్దేశమును విశదపఱచుచున్నది. అందువలన సగుణనిర్గుణ వాక్యములకు పరస్పరము విరోధమే లేదు. కావున వానిలో నొక్కటి యసత్యములగు గుణములను చెప్పునదియని శంకింపఁదగదు.

తైత్తిరీయులు "భీషాస్మాద్వాతః పవతే" (తై. ఆనం. ౮-అను. ౧-వా) (ఈ పరబ్రహ్మముయొక్క భయమువలన వాయువు వీచుచున్నది) అను వాక్యముచే పరబ్రహ్మముయొక్క గుణములను పఠింపనారంభించి, "తే యే శతం" అని యిట్లు జీవునియొక్క యానందాతిశయమును చెప్పి, "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసాసహ ఆనందం బ్రహ్మణో విద్వాన్" (ఇంద్రియములును మనస్సును పరబ్రహ్మముయొక్క యానందము ఇంతయని తెలిసికొననేరనివై మరలుచున్నవి. అట్టి బ్రహ్మానందమును తెలిసికొనినవాఁడు దేనినుండియు భయపడడు" అని యిట్లు పరబ్రహ్మమునకు లెక్కలేని కల్యాణగుణములు కలవని ఎక్కువ ఆదరముతో పఠించుచున్నారు.

"సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" (తై. ఆన. ౨ అను. ౨ వా) అనఁగా "ముక్తపురుషుఁడు సర్వజ్ఞుఁడగు బ్రహ్మముతోఁగూడ సమస్తములగు కామములను (గుణములను) అనుభవించుచున్నాఁడు" అని యిట్లు బ్రహ్మోపాసనముయొక్క ఫలమును తెలుపునట్టి యాశ్రుతివాక్యము సర్వజ్ఞుఁడగు పరబ్రహ్మమునకు అనేకములగు గుణములు కలవని తెలుపుచున్నది.

ముక్తపురుషుఁడు బ్రహ్మమును, అతనితో సమస్తములయిన కామములనును అనుభవించుచున్నాఁడు. ఈశ్రుతియందు కామములనఁగా "కామ్యన్త ఇతి కామాః" అనెడు శబ్దవ్యుత్పత్తినిఁబట్టి కల్యాణగుణంబులని యెఱుంగునది. ముక్త

పురుషుఁడు బ్రహ్మమును, అతనితోఁగూడ అతని కల్యాణగుణముల నన్నింటిని యనుభవించు చున్నాఁడని ఫలితార్థము. ఎటువలెననిన, [1]దహరవిద్యలోని "తస్మిన్యదన్తస్తదన్వేష్టవ్యం" (ఛా. ౮ ప్ర. ౧ ఖ. ౧ వా.) ఇత్యాది వాక్యమునఁ గుణములే ప్రధానముగాఁ జెప్పఁబడినట్లు ఇచటను గుణములకే ప్రాధాన్యమునుపై శ్రుతియందలి [2] "సహ" అనుశబ్దము సూచింపుచున్నది. ఏలన, "యథా క్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి " (ఛా. 3–ప్ర. ౧౪-ఖ. ౧–వా) అను శ్రుతివాక్యము "పురుషుఁ డీలోకమున నెట్టిభావనతో నుపాసించునో, ఈలోకమును వెడలినపు డట్టివాఁడే యగుచున్నాఁడు" అనుచు ఉపాసనమున కనుగుణముగానే ఫలముండునని తెలుపుచున్నది గదా!

అద్వైతి:—"యస్యా మతమ్ తస్య మతం" అనియు, "అవిజ్ఞాతం విజానతామ్" (కేన ౨ ఖ. 3. వా) అనియు నీ శ్రుతివాక్యములు బ్రహ్మము జ్ఞానమునకు విషయమగునది కానిదని కదా! తెలుపుచున్నవి? (౭౯ పు. ౨౬ పం.)

భాష్యకారులు:—అద్వైతపక్షమున "బ్రహ్మవిదాప్నోతిపరం" (తై. ఆన ౧ అను. ౧ వా) "బ్రహ్మమును తెలిసికొనినవాఁడు (ఉపాసించువాఁడు) ఉత్కృష్ట

(1) దహరవిద్య యనఁబడునది బ్రహ్మవిద్యలలో అనఁగా బ్రహ్మోపాసనములలో నొక్కటి. ఈ యుపాసనమున గుణములకే ప్రాధాన్యము చెప్పఁబడియె. అనఁగా నిచట గుణములనే ప్రధానముగాఁగొని పరబ్రహ్మమును గుఱించిన యుపాసనము విధింపఁబడినది. ఉపాసనమనునది మోక్షమనఁబడునట్టి యొక ఫలమును పొందుటకై యేర్పఱుపఁబడినదియు, ధ్యానరూపమును నగు సాధనము. ఇట్లు సాధనభూతమగు ఉపాసనము ననుష్ఠించుటచే నీపురుషుఁడు పొందునట్టి ఫలమును "సోఽశ్నుతే సర్వాన్ కామాన్" అను శ్రుతి తెలుపుచున్నది. అయితే సాధనానుష్ఠాన సమయమున నీపురుషుఁడు ఎవ్విధమయిన భావనతో నుండునో, అవ్విధమైన ఫలమునే పొందునని యిట్లు "యథా క్రతురస్మిన్ లోకే" ఇత్యాది శ్రుతివాక్యమునఁ దెలుపఁబడిన నియమమునుబట్టి, గుణములనే ప్రధానముగాఁగొని యుపాసనము ననుష్ఠించిన పురుషుఁడు గుణములనే కదా ప్రధానముగాఁ బొందవలయును. కావున "సోఽశ్నుతే సర్వాన్ కామాన్" అనెడి ఫలశ్రుతి యందు గుణములే ప్రధానముగాఁ జెప్పఁబడినవి యని యెఱుంగునది.

(2) సంస్కృతభాషయందు "సహ" అనునది తృతీయావిభక్త్యంతశబ్దముతోఁ జేర్పఁబడినదై యట్టి శబ్దముయొక్క యర్థమును ఆవాక్యమున అప్రధానమైనదానినిగాఁ దెలుపుచు, అందుమూలముగా తదితరశబ్దములయొక్క యర్థములను ప్రధానములయిన వానినిగా సూచింపుచున్నది.

ఉదాహరణము:—"పుత్రేణ సహ పితా ఆగతః=కొడుకును తోడుకొని తండ్రి వచ్చెను" అనునప్పుడు తండ్రి ప్రధానుఁడు, కొడుకు అప్రధానుఁడు. మఱియు ఈ జీవుఁడు పొందునట్టి మోక్షావస్థను వివరించునట్టి "స్వేన రూపేణాభినిష్పద్యతే" అను శ్రుతియును బ్రహ్మముయొక్క సత్యసంకల్పత్వాద్యష్టగుణములను పొందుటయ నెడి స్వస్వరూపావిర్భావమునుగదా మోక్షమునుగాఁ దెలుపుచున్నది.

పదవిని పొందుచున్నాఁడు" అనియు, "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ము. 3 ము. ౨ ఖ. ౯-వా) "బ్రహ్మమును తెలిసికొనువాఁడు (ఉపాసించువాఁడు) బ్రహ్మ ఎవ్విధమైనవాఁడో అవ్విధమైనవాఁడు అగుచున్నాఁడు" అనియు నిట్లు (బ్రహ్మ) జ్ఞానమువలన మోక్షము గలుగునని యుపదేశింప కూడదే?

మఱియు "అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్। అస్తి బ్రహ్మేతి చేద్వేద సన్తమేనం తతో విదుః" (తై. ఆ. ౬ అను. ౧ వా) "ఎవ్వఁడు బ్రహ్మము లేనిదని యెఱుఁగునో, వాఁడును లేనివాఁడే యగుచున్నాఁడు. ఎవ్వఁడు బ్రహ్మము కలదని యెఱుఁగునో, వాఁడును ఉన్నట్టివాఁడేయని యెఱుఁగు చున్నారు" అనెడి శ్రుతివాక్యము బ్రహ్మజ్ఞానము లేనందున [1]ఆత్మనాశమును, అట్టి జ్ఞానము ఉన్నందున ఆత్మసత్తను (ఉనికిని) తెలుపుచున్నది.

కనుకనే సమస్త శ్రుతులును బ్రహ్మజ్ఞానమునే మోక్షసాధనమునుగాను విధించుచున్నవి. మోక్షసాధనముగా శ్రుతులయందు విధింపఁబడినట్టి జ్ఞానము ఉపాసనారూప మయినదనియు, ఉపాస్య వస్తువగు బ్రహ్మము గుణవిశిష్టమయిన దనియును ఇంతకు పూర్వము నిరూపింపఁబడియె.

"యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" (తై. ఆ. ౯ అను ౧ వా) "మనస్సుతోఁగూడ వాక్కులు పొందలేక యెవ్వనినుండి మఱలు చున్నవో" అనెడి శ్రుతివాక్యమువలన "అనంత మైనదియును, లెక్కలేని గుణ ములు కలదియునగు బ్రహ్మము ఇంతమాత్రమని వాఙ్మనస్సులచే పరిచ్ఛేదింపఁ దగినది కాదని" తెలియ వచ్చుచున్నది. కావున బ్రహ్మము ఇంతమాత్రమని యెఱుంగువారలచే బ్రహ్మము తెలియఁబడ లేదనియు, తలపఁబడ లేదనియును "యస్యామతం" ఈ మొదలగు శ్రుతివాక్యము తెలుపుచున్నది. బ్రహ్మము [2]పరి చ్ఛిన్నమైనది కాదు గదా! ఈ పైని గనఁబఱచిన ప్రకారము ఈ శ్రుతివాక్య

(1) వేదాంతశాస్త్రమున జీవాత్మ పరమాత్మలకు శరీర శరీరి భావ సంబంధము నిరూపింపఁ బడియె. అయితే శరీరియొక్కఁడు ఉన్నపక్షమునఁగదా అట్టి శరీరికి శరీరముగా నతనితో సంబం ధించిన పదార్థము నయితము ఉండఁదగును. కావున శరీరియగు పరమాత్మ యొక్కఁడు ఉన్నపక్ష మున, అట్టి పరమాత్మకు శరీరముగా నతనితో సంబంధించియుండునట్టి జీవాత్మయు నొక్కటి యుండఁదగును. అయితే శరీరియే (పరమాత్మయే) లేని పక్షమున శరీరము (జీవాత్మయు) ను లేనిది యే యగును అనఁగా తన కంతరాత్మయగు పరమాత్మ యొకటి కలదనెడి జ్ఞానములేనట్టి యాత్మ యుండియును లేనిదిగానే యెన్నఁబడును. ఇట్టి యెన్నికనే "ఆత్మనాశమును" అనెడి శబ్ద ముచే ఆచార్యులవారు తెలిపియున్నారు.

(2) ౫౩ వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧ వ వివరణమును చూఁడుము.

ముల యర్థమును గ్రహింపని పక్షమున "యస్యామతం తస్యమతం" (యెవ్వనిచే బ్రహ్మము తలపఁబడలేదో, వానిచే నది తలంపఁ బడినది) అనియు, "విజ్ఞాతమవిజానతాం" (ఎవ్వరు బ్రహ్మమును తెలిసికొనియుండరో, వారిచే నది తెలియఁబడినది) అనియు నిట్లు "తలంపఁబడినది" "తెలియఁబడినది" అని చెప్పుట అచటనే విరోధించునే.

"న దృష్టేర్ద్రష్టారం (పశ్యేః) న మతేర్మన్తారం (మన్వీథాః)" (బృ. ౫ అ. ౪ బ్రా. ౨ వా.) అను శ్రుతివాక్యము "జ్ఞానమునకంటె వేఱుగ జ్ఞాతయనునదొకటియులేదనియు, మననమునకంటె వేఱుగ మన్త (మననము చేయునది) లేదనియును తెలుపుచున్నదని యద్వైతులు (౩౦ పు. ౧౦ పం.) వాదించుచున్నారు. అయితే యీ శ్రుతివాక్యముయొక్క యర్థము అదికాదు. ఏలన, "[1]చైతన్యము (జ్ఞానము) ఆత్మకు ఆగంతుకముగా వచ్చిన గుణము. కావున అట్టిజ్ఞానము ఆత్మయొక్క స్వరూపముకాదు" అని యిట్లు కొందఱు కుతర్కములచే ప్రతిపాదించుప్రకారము ఉండునట్టి దానినిగా ఆత్మస్వరూపమును తలంచి అట్లు యెఱుంగకుము, మఱియు అట్లు తలంపకుము. అయితే ఈ యాత్మ ద్రష్టయును (జ్ఞానము గలవాఁడును) మన్తయును (మననముగలవాఁడును) అయినను, అతనిని జ్ఞానస్వరూపునిగానును, మనన స్వరూపునిగానును తెలిసికొనుము!" అని యీ పైవాక్యము తెలుపుచున్నది. కావున ఈ శ్రుత్యర్థమును గుఱించి యద్వైతులు చేయువాదము పరిహరింపఁ బడుచున్నది.

ఈ శ్రుతియొక్క యర్థము వేఱొకవిధముగాను సయితము ఉండఁదగును. ఎట్లన, దర్శన కర్తయును (చూచువాఁడును) మననకర్తయును (చింతించువాఁడును) నగు జీవాత్మను నిషేధించి, సర్వభూతముల కంతరాత్మయగు పరమాత్మనే యుపాసింపుమా!" అనియును ఈ శ్రుతియొక్క వాక్యార్థము కాఁదగును. అట్లు కానియెడల "విజ్ఞాతార మరే కేన విజానీయాత్" (బృ ౪. అ ౪

(1) "ఏది దేని స్వరూపమో, అది దానియందు నిత్యముగానుండవలయును. మఱియు నేది దేని గుణమో, అది దాని స్వరూపముకాఁదగదు. ప్రకృతమునను ఆత్మ జడపదార్థము, దేహేంద్రియాది సంబంధమువలన నాగంతుకముగ చైతన్యమనఁబడునట్టి గుణమును పొందుచున్నది. కావున చైతన్యము ఆత్మయందు నిత్యముగా నుండునట్టిదికాదు. అందువలన నది యాత్మయొక్క స్వరూపముకాఁదగదు. మఱియు నది యాత్మయొక్క గుణముగా నెన్నఁబడుచున్నది. అందువలనను అది యాత్మయొక్క స్వరూపముకాఁదగదు" ఇట్లు వైశేషికులు వాదించుచున్నారు.

(బ్రా. ౧౪ వా) "తెలిసికొనువానిని దేనిచేఁ దెలిసికొనఁదగును" అని యిట్లు ఆత్మను జ్ఞాతనుగాఁ దెలుపునట్టి శ్రుతివాక్యముతో విరోధము సంభవించును.

"ఆనన్దో బ్రహ్మ" (తై. భృ. ౬ అను ౧ వా) "ఆనందము బ్రహ్మము" అనెడి శ్రుతివాక్యమువలన "ఆనందము మాత్రమే బ్రహ్మముయొక్క స్వరూపముగాఁ దెలియవచ్చుచున్నది" అని (30 పు ౧౫ పం) యద్వైతులు వాదించుచున్నారు. అయితే యీ శ్రుతివాక్యము "జ్ఞానమున కాశ్రయమగు బ్రహ్మము జ్ఞానస్వరూపము" అని తెలుపుచున్నది. కావున వారివాదము పరిహరింపఁబడుచున్నది ఎట్లన, జ్ఞానమే అనుకూలమైనచో, ఆనందమని పిలువఁబడుచున్నది. కనుకనే "విజ్ఞానమానన్దం బ్రహ్మ" (బృ ౫ అ. ౯ బ్రా. ౨౮ వా) అను శ్రుతి వాక్యము "జ్ఞానంబును ఆనన్దంబును బ్రహ్మము" అని చెప్పుచున్నది. ఇచట "జ్ఞానంబును ఆనన్దంబును బ్రహ్మము" అనఁగా "ఆనన్దరూపమేయగు జ్ఞానము బ్రహ్మము" అని యర్థము. కావుననే కదా మీ (అద్వైతుల) మతమున బ్రహ్మమునకు [1]ఏకరసత్వము సిద్ధించును.

ఇట్లు జ్ఞానస్వరూపమేయగు బ్రహ్మము జ్ఞాతగాను నయితము అనేక శ్రుతులవలనఁ దెలియవచ్చుచున్నదని ఇంతకు పూర్వము చెప్పఁబడియె. అట్లే "సఏకో బ్రహ్మణ ఆనన్దః" (తై. ఆన ౮ అను. ౪ వా) "అది బ్రహ్మముయొక్క యొక ఆనందము" అనియు, "ఆనన్దం బ్రహ్మణో విద్వాన్" (తై. ఆ. ౯-అను. ౧ వా) "బ్రహ్మముయొక్క ఆనందమును తెలిసికొనినవాఁడు" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు ఆనందమును వ్యతిరేకముగానును నిర్దేశించుటవలన—ఆనందమును బ్రహ్మముయొక్క స్వరూపముగానే కాకుఁడ అతని గుణమునుగానును చెప్పుచున్నందున—[2]ఆనందము మాత్రమే బ్రహ్మము కాదనియు, అయితే

(1) "విజ్ఞానమానన్దం బ్రహ్మ" అనుతావున పేర్కొనఁబడిన విజ్ఞానమును ఆనందమున్ను వేఱువేఱు పదార్థములని యంగీకరించుపక్షమున, బ్రహ్మము విజ్ఞానమనఁబడునట్టి యొక రసమును, ఆనన్దమనఁబడునట్టి వేఱొక రసమునును గలిగినదియని ప్రసక్తించుటచే బ్రహ్మము అనేకరసమని ప్రాప్తించును. అట్లైనచో "బ్రహ్మము ఏకరసము" అనెడి యద్వైతుల సిద్ధాంతమునకు భంగము కలుగును. కావున వారు విజ్ఞానమన్నను ఆనందమన్నను ఒక్కటియే యని అనఁగా "ఆనందరూపమేయగు జ్ఞానము బ్రహ్మము" అని యివ్విధమగు అర్థమును అంగీకరింపక తప్పదు.

(2) శ్రీ శంకరాచార్యులవారు శారీరక మీమాంసా సూత్రభాష్యమునందలి యానందమయాధికరణమున "ఆనందము మాత్రమే బ్రహ్మము" అని ప్రతిపాదించియున్నారు. వారి వాదము ఇచట సంగ్రహముగ ఖండింపఁబడినది. ఆనందమయాధికరణమున విపులముగా ఖండింపఁబడును.

ఆనంది (ఆనందముకలది) బ్రహ్మమనియును తెలియవచ్చుచున్నది. [1]జ్ఞాతయన్నను ఆనందియన్నను ఒక్కటియే కదా.

"యత్ర హిద్వైతమివ భవతి" (బృ. ౪ అ. ౪ బ్రా. ౧౪ వా) అనియు, "నేహ నానాస్తి కిఞ్చన మృత్యోస్సమృత్యుమాప్నోతి య ఇహ నానేవపశ్యతి" (బృ. ౪ అ. ౪ బ్రా. ౧౪ వా) అనియు, "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్" అనియు నీ మొదలగు శ్రుతులయం దనేకవిధములుగా భేదము నిషేధింపఁ బడుచున్నట్లు గన్పట్టుచున్నదని (౩౦ పు. ౨౦ పం.) యద్వైతులు వాదించుచున్నారు. అయితే యీ సమస్తప్రపంచమును బ్రహ్మముచే సృష్టింపఁబడిన దగుటను బట్టియు, బ్రహ్మముచే నంతటను వ్యాపింపఁబడినది యగుటను బట్టియును బ్రహ్మాత్మకము. ఈ హేతువునుబట్టి యది బ్రహ్మముతో నొక్కటి యయినది. కాఁబట్టి యట్టిదికానిదియగు నానాత్వ (భేద) మేదియును లేదని యీ పై శ్రుతివాక్యములు తెలుపుచున్నవి. ఇంతియేకాక "బహుస్యాం ప్రజాయాయ" (సృష్టించుటకై నేను అనేకముగా నగుదును) అనియిట్లు శ్రుతి ప్రసిద్ధమును, "అనేకముగాఁ గావలయును" అనెడి సంకల్ప పూర్వకమును నగు బ్రహ్మముయొక్క నానాత్వ (భేద) మన్ననూ, ఈ పైశ్రుతులయందు నిషేధింపఁబడుచుండలేదు. కావున అద్వైతులు చేయువాదము పరిహరింపఁబడుచున్నది.

అద్వైతి:—"మృత్యోస్స మృత్యు మాప్నోతి" ఇత్యాది శ్రుతులయందు నానాత్వము నిషేధింపఁబడుటను బట్టి యీ పైశ్రుతియందు చెప్పఁబడిన నానాత్వము అసత్యమైనది కాఁదగును.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలన, ప్రత్యక్షాది సమస్తప్రమాణములవలనఁ దెలిసికొనుటకు అశక్యమయినట్టియు, ఊహింప నలవికానిదియునగు నానాత్వము శ్రుతులయందు ప్రతిపాదింపఁబడినదై మరల నదియే బాధింపఁబడుచున్నదంటివేని యట్టివాదము పరిహాసాస్పదమగును కదా?

"యదా హ్యేవైష ఏతస్మిన్నన్తరం కురుతే అథ తస్య భయం భవతి" (తై. ఆ. ౭ అను. ౨ వా) అను శ్రుతివాక్యము "బ్రహ్మమునందు భేదమును

---

(1) జ్ఞానమన్నను ఆనందమన్నను ఒక్కటియే యని యీపైని ప్రతిపాదింపఁబడియే. కావున జ్ఞాత (జ్ఞానముకలవాఁడు) అన్నను ఆనంది (ఆనందముకలవాఁడు) అన్నను ఒక్కటియే యని యొఱుంగునది.

తెలిసికొనువానికి (సంసార) భయము కలుగును" అని యిట్లు తెలుపుచున్నదని యద్వైతులు (౩౧ పు ౧౦ పం) వాదించుచున్నారు. అయితే వారి వాదము యుక్తమైనది కాదు. ఏలననిన, "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానీతి శాన్త ఉపాసీత" (ఛా. ౩ ప్ర. ౧౪ ఖ. ౧ వా.) "బ్రహ్మమువలనఁ గలిగి, బ్రహ్మముచే రక్షితమై, బ్రహ్మమున లీనమగుటనుబట్టి యీ సమస్త ప్రపంచమును బ్రహ్మమే యని భావించి శాన్తచిత్తుఁడై యుపాసింపవలయును" అనెడి శ్రుతివాక్యము నానాత్వానుసంధానమును శాంతిహేతువునుగాను కదా యుపదేశించుచున్నది. ఎట్లన, సమస్తప్రపంచమును బ్రహ్మమువలనఁ గలిగి, బ్రహ్మమువలన నునికిపట్టుకలదై, బ్రహ్మమునందు లయమును పొందుచున్నందున నది యంతయును బ్రహ్మాత్మకమని యనుసంధించుకొనుటచే శాంతి గలుగునని యీ శ్రుతి విధించుచున్నది. కావున దేవతిర్యఙ్మనుష్యస్థావరాది భేదభిన్నముగాఁ గానఁబడునట్టి యీ జగమంతయు బ్రహ్మాత్మకమనెడి యనుసంధానము శాన్తిహేతువగుటచే నది భయరాహిత్యమును గలుగఁజేయునది గదా! కావున నట్టి యనుసంధానము భయమును గలుగఁజేయు ప్రసక్తియైనను లేదే?

అద్వైతి:—అట్లైనపక్షమున, "అథ తస్య భయం భవతి" (అనంతరము వానికి భయము గలుగుచున్నది) అని యిట్లు శ్రుతి యేల చెప్పుచున్నది?

భాష్యకారులు:—చెప్పెదను. "యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విన్దతే అథ సోఽభయం గతో భవతి" (తై. ఆ. ౭ అను. ౨ వా) "ఎప్పుడీయాత్మ (అచిత్పదార్థమువలెను) కంటికి గానఁబడనిదియు, (బద్ధాత్మలవలె) కర్మమువలనఁ గలిగిన శరీరము లేనిదియు, (బద్ధావస్థయందు ముక్తులవలె) దేవాది నామములచే బిలువఁబడనిదియు, (నిత్యులవలెను ముక్తులవలెను) తనకు వేఱొక యాధారము లేనిదియునగునట్టి యీ పరబ్రహ్మమునందు అభయప్రాప్తికై ప్రతిష్ఠ (ధ్యానము) గలవాఁడగుచున్నాఁడో, అప్పుడు అభయమును పొందుచున్నాఁడు" అని యిట్లు అభయప్రాప్తికి హేతుభూతముగాఁ శ్రుతియందు పేర్కొనఁబడినదియు, పరబ్రహ్మము విషయమైనదియునగు ప్రతిష్ఠ యేదికలదో దానికి ఏదైన విచ్ఛేదము (లోపము) గలుగు పక్షమున నాత్మకు భయముకలుగునని "అథ తస్య భయం భవతి" అను శ్రుతి వాక్యము తెలుపుచున్నది. కనుకనే మహర్షులును ఇట్లు పఠించియున్నారు:—

శ్లో॥ యన్ముహూర్తం క్షణం వాపి వాసుదేవో న చిన్త్యతే।
సా హాని స్తన్మహచ్ఛిద్రం సా భ్రాన్తి స్సా చ విక్రియా॥

తా॥ సర్వేశ్వరుఁడు స్మరింపఁబడని ముహూర్తమాత్రము గాని క్షణమాత్రము గాని యేది కలదో, అదియే యొక హాని, అదియే గొప్ప ఆపత్తు అదియే భ్రాంతి, అదియే యొక చిత్తవైకల్యము.

పరబ్రహ్మమును గుఱించిన ప్రతిష్ఠకు (దృఢమైన ధ్యానమునకు) అంతరము అనఁగా అవకాశమనునది యట్టి ప్రతిష్ఠకు విచ్ఛేదము గలుగుటయే.

"నస్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్ర హి" (బ్ర. సూ. 3 అ. ౨ పా. ౧౧ సూ) అను సూత్రముచే "బ్రహ్మము ఎవ్విధమయిన విశేషమును లేనిదిగాను తెలుపఁబడుచున్నది" అని (3౧ పు. ౧౫ పం.) యద్వైతులు చెప్పుచున్నారు అట్లు చెప్పఁదగదు. ఏలన, ఆసూత్రమున బ్రహ్మము విశేషములతోఁ గూడియున్నట్టిదియే యని కదా సూత్రకారులు ప్రతిపాదింపఁబోవుచున్నారు.

(3౧ పు. ౨౨ పం.) "మాయామాత్రంతు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్" (బ్ర. సూ. 3 అ. ౨ పా. 3 సూ.) అను సూత్రమున సయితము స్వప్నమునఁ గానఁబడు పదార్థములు జాగ్రదవస్థయందలి పదార్థముల కంటెను విలక్షణములయిన వగుటంజేసి మాయామాత్రములు (ఆశ్చర్యమును గలుగఁజేయునవి) అని చెప్పఁబడుచున్నవి. కావున సూత్రకారులు ఆ సూత్రముచే జాగ్రదవస్థయందలి పదార్థములవలె స్వప్నమునఁ గానఁబడు పదార్థములు సయితము పరమార్థభూతములనియే కదా చెప్పఁబోవుచున్నారు.

స్మృతుల వలనను, పురాణముల వలనను నిర్విశేషజ్ఞానము మాత్రమే పరమార్థముగాను, తక్కినదంతయును అపరమార్థముగానును తెలియవచ్చుచున్నదని (౩౭ పు. ౨౫ పం.) యద్వైతులు వాదించుచున్నారు. అట్లు చెప్పఁదగదు. ఏలననిన, శ్రీ భగవద్గీతలయందు,

శ్లో॥ యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరం।
భ. గీ. ౧౦ అ. 3 శ్లో॥

తా॥ ఓ యర్జునా! ఎవ్వఁడు నన్ను పుట్టుకలేనివానినిగాను, (ముక్తులకువలె) ఆదిలేనివానినిగాను, లోకముల కన్నింటికిని గొప్ప యీశ్వరునిగానును తెలిసికొనునో,

శ్లో॥ మత్స్థాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః।

భ. గీ. ౯ అ. ౪ శ్లో॥

తా॥ ఓ యర్జునా! అన్నిభూతములును (అన్తర్యామియగు) నాయం దున్నవి, నేను వానియందు లేను అనఁగా నాయునికి వాని యధీనమైనది కాదు.

శ్లో॥ న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరం।
భూతభృ న్నచ భూతస్థో మమాత్మా భూతభావనః॥

భ. గీ. ౯ అ. ౫ శ్లో॥

తా॥ ఓ యర్జునా! (కుండనీటిని ధరించునట్లు) నేను వానిని ధరించి యుండ లేదు. మఱియెట్లన్నను, నా సంకల్పముచేత ధరించియున్నాను. నా యొక్క యీశ్వర సంబంధమైన (ఈశ్వరుఁడగు నాయందుమాత్రమే యుండునట్టి) యోగ మును చూఁడుము. ఆయోగమెట్టిదన్నను, నేను భూతములను పోషించు వాఁడను. నేను భూతములయం దున్నవాఁడనుకాను. వానివలన నా కేమియు నుపకారము లేదు. నాయొక్క సంకల్పమే భూతములను గలుగఁజేయునది అనఁగా వానిని ధరించునదియును నియమించునదియును.

శ్లో॥ అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయ స్తథా।

భ. గీ. ౭ అ. ౬ శ్లో॥

తా॥ ఓ యర్జునా! నేను సమస్తమయిన జగత్తునకును ఉత్పత్తిస్థానమైన వాఁడనును, ప్రళయస్థానమైనవాఁడనును.

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్కించిద స్తి ధనంజయ।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణాఇవ॥

భ. గీ. ౭ అ. ౭ శ్లో॥

తా॥ ఓ యర్జునా! నాకంటెను గొప్పది మఱియేదియును లేదు. ఈ సమస్త ప్రపంచమును దారమునందు మణులవలె నాయందు గ్రుచ్చంబడియున్నది.

శ్లో॥ విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్।

భ. గీ. ౧౦ అ. ౪౨ శ్లో॥

తా॥ ఓ యర్జునా! నేను ఈ సమస్త జగత్తును నాయొక్క యతిస్వల్ప మైన భాగముచేతను పట్టియున్నాఁడను.

శ్లో॥ ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః।
యో లోకత్రయ మావిశ్య బిభ ర్త్యవ్యయ ఈశ్వరః ॥
భ. గీ ౧౫ అ. ౧౭ శ్లో॥

తా॥ ఓ యర్జునా! ఎవ్వఁడు మూఁడులోకములను—ప్రకృతి, ప్రకృతి సంపర్కముగల జీవుఁడు, ముక్తుఁడు అను మూఁడు పదార్థములలోను—ఆత్మగాఁ బ్రవేశించి వానిని పోషించుచున్నాఁడో, ఎవ్వఁడు నశింపనివాఁడును, ఈశ్వరుఁడునో, అట్టి బద్ధముక్తాత్మేతరుఁడగు మహాపురుషుఁడు పరమాత్మయని పిలువఁబడుచున్నాఁడు.

శ్లో॥ యస్మాత్క్షర మతీతోహ మక్షరా దపిచోత్తమః।
అతోస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥
భ. గీ. ౧౫ అ. ౧౮ శ్లో॥

తా॥ ఓ యర్జునా! నేను బద్ధజీవుల నతిక్రమించి యున్నందునను, ముక్తులకంటెను గొప్పవాఁడ నయినందునను లోకమునందును వేదమునందును పురుషోత్తముఁడని ప్రసిద్ధి నొందినాఁడను.

శ్రీ విష్ణుపురాణమున,

శ్లో॥ స సర్వభూతప్రకృతిం వికారాన్ గుణాదిదోషాంశ్చ మునే వ్యతీతః।
అతీతసర్వావరణోఽఖిలాత్మా తేనాస్తృతం యద్భువనాంతరాళే॥
విష్ణు. ౬. అం. ౫ అ. ౮౩. శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! సర్వేశ్వరుఁడు సమస్తభూతములకును కారణమైనప్రకృతిని, మహత్త్వము మున్నగు వికారములను, సత్త్వరజస్తమో గుణములు మొదలగు దోషములనును అతిక్రమించినవాఁడు. ఆవరణములనన్నింటిని దాఁటినవాఁడు. అన్నింటికి నాత్మ యయిన వాఁడు. లోకముల మధ్యనుండునట్టి యంతరాళము నయితము వానిచే వ్యాపింపఁబడియున్నది.

శ్లో॥ సమస్తకల్యాణగుణాత్మకోఽసౌ స్వశక్తిలేశా ద్ధృతభూతసర్గః।
ఇచ్ఛాగృహీతాభిమతోరుదేహః సంసాధితాశేషజగద్ధితోఽసౌ॥
విష్ణు. ౬ అం. ౫ అ. ౮౪ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! సర్వేశ్వరుఁడు కల్యాణ గుణంబులన్నియును స్వభావముగాఁ గలవాఁడు. తన శక్తియొక్క లేశమాత్రముచే భూతసృష్టినిధరించి

యున్నవాఁడు. తన యిచ్ఛచే గ్రహింపఁబడినదియు, ఇష్టమైనదియునగు గొప్ప శరీరము గలవాఁడు. ఈతఁడు సమస్తలోకములయొక్కయును హితమును సాధించువాఁడు.

శ్లో॥ తేజోబలైశ్వర్య మహావబోధ సువీర్య శక్త్యాదిగుణైకరాశిః।
పరఃపరాణాం సకలా న యత్ర క్లేశాదయ స్సన్తి పరావరేశే॥
విష్ణు. ౬ అం. ౫ అ. ౮౫ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! శర్వేశ్వరుఁడు తేజస్సు, బలము, ఐశ్వర్యము, మంచివీర్యము, శక్తి మొదలగు గుణముల యొక్క రాశియయినవాఁడు. అతఁడు గొప్పవారికి గొప్పవాఁడు. గొప్పవానికిని క్రొద్దివానికిని యాత్మయయినవాఁడు. ఈశ్వరుఁడగునట్టి యతనియందు క్లేశము మొదలగునవి యేవియును లేవు.

శ్లో॥ స ఈశ్వరో వ్యష్టి సమష్టిరూపో ఽవ్యక్తస్వరూపః ప్రకటస్వరూపః।
సర్వేశ్వర స్సర్వదృ క్సర్వవేత్తా సమస్తశక్తిః పరమేశ్వరాఖ్యః॥
విష్ణు. ౬ అం. ౫ అ. ౮౬ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! అట్టి సర్వేశ్వరుఁడు వ్యష్టి—సృజింపఁబడిన యవస్థలోనుండెడి జీవులు—శరీరముగాఁ గలవాఁడును, సమష్టి—సృష్టింపఁబడని యవస్థలోనుండెడి జీవులు—శరీరముగాఁ గలవాఁడును, తెలియఁబడని స్వరూపము గలవాఁడును, వ్యూహాది రూపములచేత స్ఫుటమైన స్వరూపముగలవాఁడును, అన్నింటిని నియమించువాఁడును, అన్నింటిని చూచువాఁడును, అన్నింటిని యెఱుఁగువాఁడును, అన్నిశక్తులు గలవాఁడును, పరమేశ్వరుఁడనెడి పేరుగలవాఁడును.

శ్లో॥ సంజ్ఞాయతే యేన తదస్తదోషం శుద్ధం పరం నిర్మలమేకరూపం।
సందృశ్యతే వా ప్యధిగమ్యతే వా తత్ జ్ఞాన మజ్ఞాన మతోన్యదుక్తం॥
విష్ణు. ౬ అం. ౫ అ. ౮౭ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! ఆ సర్వేశ్వరుఁడు ఉపాసనారూపమగునట్టి యే జ్ఞానముచేఁ జూడఁబడునో, దోషములు లేనిదియు, పరిశుద్ధమైనదియు, మిక్కిలి నిర్మలమైనదియు, ఒక్క విధమైనదియునగు నదియే "జ్ఞాన" మనఁబడుచున్నది. దీనికంటె నితరమైనది "అజ్ఞాన" మనఁబడును.

శ్లో॥ శుద్ధే మహావిభూత్యాఖ్యే పరే బ్రహ్మణి శబ్ద్యతే।
మైత్రేయ! భగవచ్ఛబ్ద స్సర్వకారణకారణే॥
విష్ణు. ౬ అం. ౫ అ. ౭౨ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! ఎల్లప్పుఁడును పరిశుద్ధుఁడైనవాఁడును, మహావిభూతియను పేరుగలవాఁడును, అన్ని కారణములకును కారణమైనవాఁడునగు పరబ్రహ్మమును "భగవాన్" అనెడి శబ్దము తెలుపుచున్నది.

శ్లో॥ సంభర్తేతి తథా "భర్తా" భకారోఽర్థద్వయాన్వితః।
నేతా గమయితా స్రష్టా "గ" కారార్థ స్తథా మునే॥
విష్ణు. ౬ అం. ౫ అ. ౭౩ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! "ఉపకరణములను కూర్చువాఁడును" "స్వామియును" అని యిట్లు రెండర్థములను భగవచ్ఛబ్దమునందలి "భ" అనెడి యక్షరము తెలుపుచున్నది. "రక్షించువాఁడును, సంహరించువాఁడును, సృజించువాఁడును" అని యిట్లు "గ" అనెడి యక్షరము తెలుపుచున్నది.

శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశస శ్శ్రియః।
జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం "భగ" ఇతీరణా॥
విష్ణు. ౬ అం. ౫ అ. ౭౪ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! సంపూర్ణమైన యైశ్వర్యంబును, వీర్యంబును, కీర్తియును, సంపత్తును, జ్ఞానంబును, వైరాగ్యంబును, ఈయాఱును "భగము" అని పిలువఁబడుచున్నవి.

శ్లో॥ వసన్తి తత్ర భూతాని భూతాత్మ న్యఖిలాత్మని।
స చ భూతేష్వశేషేషు "వ" కారార్థ స్తతోఽవ్యయః॥
విష్ణు. ౬ అం. ౫ అ. ౭౫ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! భూతములకు ఆత్మయయినవాఁడును, అన్నియును శరీరముగాఁ గలవాఁడునగు ఆతనియందు భూతములు నివసించియున్నవి, అతఁడుగూడ అన్ని భూతములయందును ఉన్నాఁడు, కాఁబట్టి నిర్వికారుఁడైన ఈశ్వరుఁడు "వ" కారార్థము.

శ్లో॥ జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్యతేజాంస్యశేషతః।
భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయైర్గుణాదిభిః॥
విష్ణు. ౬ అం. ౫ అ. ౭౯ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! దుష్టగుణములు మొదలగునవితప్ప సంపూర్ణ మగు జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజస్సు అనునవి "భగవచ్ఛబ్దము"చేఁ దెలుపఁబడుచున్నవి.

శ్లో॥ ఏవమేష మహాశబ్దో మైత్రేయ! భగవానితి।
పరమబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగః॥

విష్ణు. ౬ అం. ౫ అ. ౭౬ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! ఇట్లు "భగవంతుఁడు" అనెడి యీ గొప్పశబ్దము పరబ్రహ్మంబైన వాసుదేవునకే చెల్లునది. మిగిలినవారియందు వర్తించునది కాదు.

శ్లో॥ తత్రపూజ్యపదార్థోక్తి పరిభాషాసమన్వితః।
శబ్దోఽయం నోపచారేణ హ్యన్యత్రహ్యుపచారతః॥

విష్ణు. ౬ అం. ౫ అ. ౭౭ శ్లో॥

తా॥ ఓ మైత్రేయుఁడా! పూజ్యములగు పదార్థములను తెలుపుటతోనును, రూఢితోనును గూడినట్టి యీ "భగవచ్ఛబ్దము" సర్వేశ్వరునియందు అముఖ్యముగాఁ బ్రవర్తించుటలేదు. ఇతరమయిన దానియందు అముఖ్యముగాఁ బ్రవర్తించును.

శ్లో॥ సమస్తాశ్శక్తయశ్చైతా నృప! యత్ర ప్రవర్తితాః।
తద్విశ్వరూపవైరూప్యం రూపమన్యద్ధరేర్మహత్॥

విష్ణు. ౬ అం. ౫ అ. ౭౦ శ్లో॥

తా॥ ఓ రాజా! ఈ శక్తులన్నియు దేనియందు నిలువఁబడినవో, అది జగద్రూపమునకంటె విలక్షణమైనదియు, గొప్పదియునగు విష్ణువుయొక్క మఱియొక రూపము (దివ్యమంగళవిగ్రహము.)

శ్లో॥ సమస్తశక్తిరూపాణి తత్కరోతి జనేశ్వర।
దేవతిర్యఙ్మనుష్యాఖ్యా చేష్టావన్తి విశేషతః॥

విష్ణు. ౬ అం. ౫ అ. ౭౧ శ్లో॥

తా॥ ఓరాజా! సర్వశక్తియుక్తమగునట్టి యారూపము, దేవతలు, తిర్యగ్జంతువులు, మనుష్యులు అను వానిపేరులను, వ్యాపారవంతములగు రూపములనును తన లీలచేతనే చేయుచున్నది. అనఁగా భగవంతుఁడు ఆ దివ్యమంగళవిగ్రహమునే దేవాద్యవతార రూపములుగాఁ జేయుచున్నాఁడని యెఱుంగునది.

శ్లో॥ జగతాముపకారాయ న సా కర్మ నిమిత్తజా।
చేష్టా తస్యా ప్రమేయస్య వ్యాపిన్య వ్యాహతాత్మికా॥
విష్ణు. ౬ అం. ౫ అ. ౭౨ శ్లో॥

తా॥ తెలియఁబడనివాఁడగు ఆ భగవంతునితో సంబంధించినదియు, అన్నంటిలోను వ్యాపించి యుండునదియు, అడ్డులేనిదియునగు వ్యాపారము జగత్తులయొక్క యుపకారమునకై నదిగాని యది కర్మమువలనఁ గలిగినది కాదు.

శ్లో॥ ఏవం ప్రకార మమలం నిత్యం వ్యాపక మక్షయం।
సమస్తహేయ రహితం విష్ణ్వాఖ్యం పరమం పదం॥
విష్ణు ౧ అం. ౨౨ అ. ౫౩ శ్లో॥

తా॥ ఇవ్విధమైనదియు (ముక్తాత్మవంటిదియు), నిత్యముగా నిర్దోషమైనదియు, సర్వత్ర వ్యాపించియుండునదియు, శరీరహితమైనదియు, హేయము లేమాత్రములేనిదియును, విష్ణువనఁబడు పరనుపదము.

శ్లో॥ పరః పరాణాం పరమః పరమాత్మాఽఽత్మసంస్థితః।
రూప వర్ణాది నిర్దేశ విశేషణ వివర్జితః॥
విష్ణు. ౧ అం. ౨ అ. ౧౦ శ్లో॥

తా॥ పరమాత్మ గొప్పవానికంటెను గొప్పవాఁడు. తనయందున్నవాఁడు అనఁగా తనయునికికై వేఱొకదాని యపేక్షలేనివాఁడు. దేవాది స్వరూపములు, తెలుపు మొదలగు వర్ణములు ఈ మొదలగువాని పేరులును, విశేషణములును లేనివాఁడు.

శ్లో॥ అపక్షయవినాశాభ్యాం పరిణామర్ధిజన్మభిః।
వర్జిత శ్శక్యతే వక్తుం యస్సదా స్తీతి కేవలమ్॥
విష్ణు ౧ అం. ౨ అ. ౧౧ శ్లో॥

తా॥ భగవంతుఁడు క్షయించుటయు, నశించుటయు, వికారము నొందుటయు, వృద్ధిపొందుటయును లేనివాఁడు. ఎల్లప్పుడు నుండువాఁడని మాత్రము చెప్పఁదగినవాఁడు.

శ్లో॥ సర్వత్రాఽసౌ సమస్తం చ వసత్యత్రేతి వై యతః।
తత స్స వాసుదేవేతి విద్వద్భిః పరిపఠ్యతే॥
విష్ణు. ౧ అం. ౨ అ. ౧౨ శ్లో॥

తా॥ ఏ హేతువు వలన ఈ సర్వేశ్వరుఁడు అంతట నుండువాఁడునో, ఈతనియందు సమస్తంబునున్నదో, ఆ హేతువువలన ఈతఁడు వాసుదేవుఁడని పండితులచే పిలువఁబడుచున్నాఁడు.

శ్లో॥ తద్బ్రహ్మ పరమం నిత్య మజ మక్షర మవ్యయం।
ఏకస్వరూపం చ సదా హేయాభావాచ్చ నిర్మలం॥
విష్ణు. ౧ అం. ౨ అ. ౧౩ శ్లో॥

తా॥ ఆ పరబ్రహ్మము నిత్యమైనదియును, పుట్టుక లేనిదియును, నాశము లేనిదియును, వికారములేనిదియును, ఒక్కవిధమైన స్వరూపముగలదియును, ఎన్నఁడును హేయములు లేనిదగుటంజేసి నిర్మలమైనదియును.

శ్లో॥ తదేవ సర్వమేవై తద్వ్యక్తావ్యక్తస్వరూపవత్।
తథా పురుషరూపేణ కాలరూపేణ చ స్థితం॥
విష్ణు. ౧ అం. ౨ అ. ౧౪ శ్లో॥

తా॥ వ్యక్తమును (స్పష్టమును) అవ్యక్తమును (అస్పష్టమును) నగునట్టి యిదియంతయును ఆ బ్రహ్మమే. అది పురుషరూపముగాను కాలరూపము గానును ఉన్నది.

శ్లో॥ ప్రకృతిర్యా మయా ఖ్యాతా వ్యక్తావ్యక్తస్వరూపిణీ।
పురుష శ్చాప్యుభా వేతౌ లీయేతే. పరమాత్మని॥
విష్ణు. ౬ అం. ౪ అ. ౩౯ శ్లో॥

తా॥ వ్యక్తంబనియు, అవ్యక్తంబనియు నిట్లు నాచే చెప్పఁబడిన ప్రకృతియు పురుషుఁడును ఈ రెండును పరమాత్మయందు లయమును పొందుచున్నవి.

శ్లో॥ పరమాత్మా చ సర్వేషా మాధారః పరమేశ్వరః।
విష్ణునామా స వేదేషు వేదాన్తేషు చ గీయతే॥
విష్ణు. ౬ అం. ౪ అ. ౪౦ శ్లో॥

తా॥ అన్నింటికి నాధారమైనవాఁడును, పరమేశ్వరుఁడును, విష్ణువను పేరుగలవాఁడునునగు పరమాత్మ వేదములయందును వేదాంతములయందును చెప్పఁబడుచున్నాఁడు.

శ్లో॥ ద్వే రూపే బ్రహ్మణ స్తస్య మూర్తం చామూర్తమేవ చ।
క్షరాక్షరస్వరూపే తే సర్వభూతేషు చ స్థితే॥

అక్షరం తత్పరం బ్రహ్మ క్షరం సర్వమిదంజగత్ ।

విష్ణు. ౧ అం. ౨౨ అ. ౫౫ - ౫౬ శ్లో॥

తా॥ పరబ్రహ్మమునకు మూర్తమనియు, అమూర్తమనియును రెండు రూపములు గలవు. అవి క్షరంబును అక్షరంబును స్వరూపముగాఁ గలవియును అన్ని భూతములయందు నుండునవియును. ఆ పరబ్రహ్మము అక్షరమనఁబడును. ఈ జగమంతయును క్షరమనఁబడును.

శ్లో॥ ఏకదేశస్థితస్యాగ్నే ర్జ్యోత్స్నా విస్తారిణీ యథా।
పరస్య బ్రహ్మణ శ్శక్తి స్తథేద మఖిలం జగత్ ॥

విష్ణు. ౧ అం. ౨౨ అ. ౫౭ శ్లో॥

తా॥ ఒక్కచోటనున్నట్టి యగ్నికి అంతటను వ్యాపించియుండెడి తేజస్సు యెట్లో, అట్లే పరబ్రహ్మమునకు ఈ జగమంతయును శక్తియైనది.

శ్లో॥ విష్ణుశక్తిః పరా ప్రోక్తా క్షేత్రజ్ఞాఖ్యా తథాఽపరా।
అవిద్యా కర్మసంజ్ఞాఽన్యా తృతీయా శక్తిరిష్యతే ॥

విష్ణు. ౬ అం. ౭ అ. ౬౧ శ్లో॥

తా॥ విష్ణువుయొక్క పరశక్తినిగుఱించి చెప్పఁబడియె. అతనికి క్షేత్రజ్ఞ మనఁబడు వేఱొకశక్తియును, కర్మమనంబడునట్టి యవిద్యారూపమగు మూడవ శక్తియును కలవు.

శ్లో॥ యయా క్షేత్రజ్ఞశక్తిస్సా వేష్టితా నృప సర్వగా।
సంసారతాపానఖిలానవా ప్నోత్యతిసన్తతాన్ ॥

విష్ణు. ౬ అం. ౭ అ. ౬౨ శ్లో॥

తా॥ క్షేత్రజ్ఞ మనఁబడుశక్తి యవిద్యయనంబడు శక్తిచే వ్యాపింపఁబడినదై మిక్కిలి విరివియైన సంసారదుఃఖములను పొందుచున్నది.

శ్లో॥ తయా తిరోహితత్వాచ్చ శక్తిః క్షేత్రజ్ఞసంజ్ఞితా।
సర్వభూతేషు భూపాల తారతమ్యేన వర్తతే॥

విష్ణు. ౬ అం. ౭ అ. ౬౩ శ్లో॥

తా॥ ఓరాజా! అట్లు అవిద్యచే నావరింపఁబడిన దగుటంజేసి క్షేత్రజ్ఞ మనఁబడు శక్తి సమస్త ప్రాణులయందును తారతమ్యముతోఁ గూడినది యగుచున్నది.

శ్లో॥ ప్రధానంచ పుమాంశ్చైవ సర్వభూతాత్మభూతయా।
విష్ణుశక్త్యా మహాబుద్ధే వృతౌ సంశ్రయధర్మిణౌ।
తయోస్సైవ పృథగ్భావకారణం సంశ్రయస్య చ॥

విష్ణు. ౨ అం. ౭ అ. ౨౯-౩౦ శ్లో॥

తా॥ ఓ గొప్పబుద్ధిగలవాఁడా! ఒకదానినొకటి యాశ్రయించియుండు నట్టి ప్రధానమును పురుషుఁడును అనునవి సర్వభూతాంతరాత్మయగు విష్ణుశక్తిచే వ్యాపింపఁబడియున్నవి. అట్టి విష్ణుశక్తియే ఆ రెంటియొక్క పరస్పర వియోగమునకును సంయోగమునకును కారణభూతమైనది.

శ్లో॥ యథా సక్తం జలే వాతో బిభర్తి కణికాశతం।
శక్తి స్సాపి తథా విష్ణోః ప్రధానపురుషాత్మనః॥

విష్ణు. ౨ అం. ౭ అ. ౩౧ శ్లో॥

తా॥ వాయువు జలమునందలి తుంపరల ననేకములను అసంకీర్ణముగా భరించు చందమున, విష్ణువుయొక్క శక్తియును ప్రకృతిని, బద్ధులను, ముక్తులను భరింపుచున్నది.

శ్లో॥ తదేత దక్షయం నిత్యం జగన్మునివరాఖిలం।
ఆవిర్భావ తిరోభావ జన్మనాశ వికల్పవత్॥

విష్ణు, ౧ అం. ౨౨ అ. ౬౦ శ్లో॥

తా॥ ఓ మునిశ్రేష్ఠుఁడా! ఈ జగమంతయును క్షయములేనిది, నిత్యమైనది, ఆవిర్భావ తిరోభావరూపములగు జన్మనాశముల వికల్పములు గలది.

ఈపైని యుదహరింపఁబడిన స్మృతి పురాణవాక్యములు, పరబ్రహ్మము స్వాభావికముగ దోషములేవియు నెంతమాత్రము లేనిదనియు, సమస్తములగు కల్యాణగుణములే స్వభావముగాఁ గలదనియు, జగత్తును గలుగఁజేయుట, సంరక్షించుట, సంహరించుట, లోపల ప్రవేశించి దానిని నియమించుటయను వానిని క్రీడార్థముగా నొనర్చునది యనియును ప్రతిపాదించి, సర్వావస్థలలోను ఈ సమస్తములగు చిదచిత్పదార్థములు సత్యములేయై పరబ్రహ్మమునకు శరీరమగుటంజేసి, పరబ్రహ్మము శరీరయుక్తమయినదియని యిట్లు శరీర; రూప, తను, అంశ, శక్తి విభూతి మొదలగు శబ్దములచేతను, ఆయాశబ్దములతో సామానాధికరణ్యముచేతనును గనఁబఱచి, పరబ్రహ్మముయొక్క విభూతియగు చిత్పదార్థము

స్వస్వరూపముతో నుండునట్టి స్థితిని, అచిత్పదార్థ సంబంధమువలన క్షేత్రజ్ఞుఁడుగా నుండు స్థితినిని, ఈరెంటిని చెప్పి, క్షేత్రజ్ఞావస్థయందు పుణ్యపాప రూపకర్మ మనఁబడునట్టి యవిద్యచే నావరింపఁబడుటవలన చిత్పదార్థము తాను స్వాభావికముగ జ్ఞానస్వరూపమయినదనెడి తలంపులేనిదై యచిత్పదార్థస్వరూపమైనదనెడి తలంపుగలదగుచున్నదని ప్రతిపాదించుచున్నవి. కావున ఈపైని గనఁబఱచిన వాక్యములనుబట్టి పరబ్రహ్మము సవిశేష (గుణవిశిష్ట) మనియు, అట్టి పరబ్రహ్మము యొక్క విభూతియగు జగత్తు సయితము పరమార్థమనియును తెలియవచ్చుచున్నది.

"ప్రత్యస్తమితభేదం" అను శ్లోకమున, "ప్రకృతిపరిణామరూపమగు దేవ మనుష్యాది శరీరముతోఁ గూడియున్నట్టి యాత్మయొక్క స్వరూపము, (వాస్తవమునకు) అట్టి శరీరములయందుండు భేదములు లేనిదిగాన, అట్టి భేదములను తెలుపునవియగు దేవ మనుష్యాది శబ్దములచేఁ దెలుపఁదగినది కాదనియు, జ్ఞానమును, సత్తయును స్వరూపముగాఁ గలదనియు, ఆత్మవేద్యమనియు, యోగాభ్యాసముయొక్క యారంభదశలో నుండువారిచేఁ దెలియఁదగినది కాదనియును తెలుపఁబడియె. కావున నింతమాత్రముచే ప్రపంచమనఁబడునది లేనేలేదని చెప్పఁబడలేదు.

అద్వైతి:—ఇవ్విధముగాఁ నెట్లు తెలియఁదగును?

భాష్యకారులు:—చెప్పెదను. ఈప్రకరణమున సాంసారిక దుఃఖములను తొలఁగించుటకై ముఖ్యౌషధమునుగాను [1] యోగమును పేర్కొని, ప్రత్యాహార

(1) "యోగశ్చిత్తవృత్తి నిరోధః" అను సూత్రముచే "యోగమనఁగా చిత్తవృత్తి నిరోధమని శ్రీ పతంజలి మహర్షి యోగదర్శనమునఁ జెప్పియున్నాఁడు. అన్తర్గకరణాదులుగాఁ జెప్పఁబడునదే చిత్తము. దీని వృత్తులు ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి, యని యైదు. ప్రత్యక్షానుమాన శాబ్దములే ప్రమాణములు. ముత్తెపుఁజిప్పను వెండి యనుకొనునట్లు ఒకదానిని మఱియొకటిగా భ్రమించుట విపర్యయ మనఁబడును. నిజముగా లేనివై శబ్దమాత్ర కల్పితములైన విషయముల జ్ఞానము అనఁగా వట్టి యూహ వికల్పము. ఇంద్రియ వ్యాపారముల యుపరతిని నిద్రయందురు. పూర్వ మనుభవించిన దానిని తలంపునకుఁ దెచ్చునది స్మృతి. ప్రమాణసిద్ధములైన ప్రత్యక్షాది జ్ఞానములచేతను, విపర్యయ జనితములయిన భ్రమములచేతను, వికల్ప సంభవములైన యూహలచేతను, నిద్రా గతములయిన నానావిధ స్వప్నములచేతను, స్మృతి సమానీతములైన పూర్వానుభూత బహు విషయములచేతను చిత్త మెడతెగక చంచలించుచు నిమ్మళ పాటు లేకుండును. కాన దానికి నిలుకడ కుదుర్చుట కావృత్తుల నిలుపవలయును.

ము పర్యంతము యోగావయవములను చెప్పి, ధారణాసిద్ధికిగాను శుభాశ్రయమగు వస్తువును చెప్పుటకై పరబ్రహ్మమగు విష్ణువుయొక్క శక్తియనఁబడునట్టి రూపద్వయమును "మూర్తము" అనియు "అమూర్తము" అనియు నిట్లు విభజన

ఇట్లాచరింపవలసిన యోగమునకు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులని యెనిమిది యంగములు గలవు. వానిలో మొదటి యైదును బాహ్యాంగములు. తక్కిన యంతరంగములు మూఁడును సంయమము అని యేకనామమునఁ జెప్పఁబడును. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము, అనునవి నియమములు. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ప్రణిధానము అనునవి నియమములు. చిత్తముయొక్క నిలుకడకును సంతుష్టికిని పద్మాసనము, భద్రాసనము, వీరాసనము మొదలైన యాసనము లావశ్యకములు. ఈ యాసనమును దేనినిగాని గైకొనఁ జాలినప్పుడు శీతోష్ణాది ద్వంద్వములుగాని క్షుత్పిపాసాదులుగాని బాధింపవు. తగిన యాసనమును గైకొని ప్రాణాయామము ననుష్టింపవలయును. వెలుపలి వాయువును లోనికిఁ బీల్చుట శ్వాసము, లోపలి వాయువును వెలుపల విడుచుట ప్రశ్వాసము, ఈ రెంటియొక్క సంచరణము లేమియే ప్రాణాయామము. ఈ శ్వాస ప్రశ్వాసములే రేచక పూరకము లనఁబడును. కుంభయందు జలమువలె లోపల ప్రాణవాయువును నిశ్చలముగా నుండునట్లు స్తంభించుట కుంభక మనఁబడును. శ్వాసగతులచే లోపలి చిత్తమును జలించుచుండును గాన దానిని నిలుపుటచే చిత్తమును వృక్షమువలె నిశ్చలమగును. శ్వాసమే జీవితము, శ్వాసనిర్గమమే మరణము, గనుక జీవితమునకై శ్వాస బంధరూపమైన ప్రాణాయామము ఉపయుక్తము. ఇట్లు ప్రాణాయామముచే వాయువును వశము చేసికొని చిత్తమునకు నిలుకడ కుదిర్చినపిదప ప్రత్యాహారము ననుష్ఠింపవలయును. ఇంద్రియములు విషయములతో సంబంధింపమిచే అవికృత స్వరూపమైన చిత్తము ననుకరించుట ప్రత్యాహారము. యమాదులచే సంస్కృతమైన చిత్తమెట్లు విషయ సంబంధము లేకుండునో యట్లే యింద్రియములు నుండుట ప్రత్యాహారమని భావము. చిత్తమును నిరోధించినపుడు దాని వశవర్తులైన యింద్రియములును నిరుద్ధములగుట సహజము. తాఁబేలు తన యవయవములు లోనికి ముడుచుకొనునట్లు ఈ ప్రత్యాహారమున యింద్రియములు విషయములయందు వ్యాపృతములు కానీక లోపలి కాకర్షించి చిత్తమునందు నెలకొలుపఁబడును. ఈ యంగము లయిదింటి నధిగమించినపిదప సంయమము ననుష్ఠింపవలయును అందు మొదటిదైన ధారణయందు చిత్తము సమాధికి యోగ్యమగుటకై నాభిచక్రము, హృదయపుండరీకము, నాసికాగ్రము మొదలయిన బాహ్యదేశములయందు ఇంద్రియముల ద్వారా స్థిరముగా నెలకొలుపఁబడును. కనుక ధారణయనఁగా దేశబంధమనఁబడును. బాహ్య విషయములనుండి ఆంతరమై ధ్యేయమైన యాత్మయందు నెలకొలుపుట ధ్యానము. ఇతరప్రత్యయములు లేక ఆత్మవిషయమైన యేకాగ్రప్రత్యయమే ధ్యానము. ఇందు చిత్తమాత్మయందు నెలకొనియుండును. పిదప సమాధి గలుగును. సమాధియనఁగా భావన—అనఁగా తక్కిన విషయములను బరిహరించి భావింపవలసిన విషయమును మాత్రము మఱిమఱి చిత్తమునఁ జొనుపుట. భావ్యములైన విషయములు, యోగశాస్త్రప్రకారము, ఈశ్వరుఁడు, పురుషుఁడు, ప్రకృతియు, తద్వికారములు నగును. ఈ సమాధి సంప్రజ్ఞాతము అసంప్రజ్ఞాతము అని ద్వివిధము,

పూర్వకముగాఁ బ్రతిపాదించి, మూఁడవశక్తియగు కర్మమనఁబడునట్టి యవిద్యచే నావరింపఁబడినట్టియు, అచిత్పదార్థముతోఁ గూడియున్నట్టిదియు క్షేత్రజ్ఞమనఁబడు మూర్తవిభాగము [1]భావనాత్రయముతోఁ గూడియున్నందున అశుభమని

---

చిత్తమేకాగ్రమై—అనఁగా భావ్యమైన పురుషునియందే నెలకొన్నదై, బాహ్యవిషయములైన ప్రమాణాదివృత్తుల నిరోధించుట సంప్రజ్ఞాతము. ఇందు స్థూలములైన పృథివ్యాదులను గుఱించియు, సూక్ష్మములైన తన్మాత్రాన్తఃకరణములను గుఱించియు రజస్తమోలేశముగల సత్త్వమును గుఱించియు, రజస్తమోలేశానభిభూతమైన సత్త్వమాత్రమును గుఱించియుఁ గలుగు భావనలవలన నిది సవితర్క, సవిచార, సానంద, సాస్మితములని నాలుగు విధములై యున్నది. బుద్ధిరూపమైన సత్త్వమును బురుషుఁడు నొకటియే యను భ్రమమునశించి, యిందు "సత్త్వపురుషాన్యథా ఖ్యాతి" అనఁగా రెండును వేఱువేఱను జ్ఞానము కలుగును. మఱియు నిందు చిత్తమున ప్రమాణాదివృత్తిజన్యములైన వికారములెల్లను నశించినను చిత్తము నశింపక పురుషునియందు నెలకొనియుండును. కనుక నిది సబీజ సమాధి యనఁబడును. సకలవృత్తులు నిరుద్ధములుకాఁగా సంస్కార మాత్రశేషముగలది అసంప్రజ్ఞాతము. ఇట్లు వివేక ఖ్యాతి అనఁగా భేదజ్ఞానము పరిపక్వముకాఁగా సమస్తక్లేశ బీజములు నశించి చిత్తమును నశించును. అనఁగా కార్యకారణాత్మకములయిన ప్రకృతి వికారములెల్ల ప్రధానమందు లయించును. ఎట్లన, చిత్తముయొక్క వ్యుత్థాన నిరోధములందుఁ గలుగు సంస్కారములెల్ల చిత్తమునందు లయించును. చిత్తము అస్మితయందు లయించును. అస్మిత బుద్ధియందు లయించును. బుద్ధిప్రధానమందు లయించును. అప్పుడు సత్త్వాదిగుణములు పురుషుని పురుషార్థమునకై వర్తించుట మాని తీసిపోవఁగా మరల బుద్ధితోడి సంబంధములేనిదై కేవల స్వరూప ప్రతిష్ఠమై యుండు ఆత్మస్థితియే కైవల్యము. ఇది "పురుషార్థశూన్యానాం గుణానాం ప్రతిప్రసవః కైవల్యం స్వరూప ప్రతిష్ఠావా చితిశక్తిః" అని సిద్ధి ద్వయరూపముగాఁ జెప్పఁబడినది. ఇందు చిత్తము నయితము నశించినందున యిది నిర్బీజమనఁబడును.

ఇట్లు అష్టాంగయుక్తమైన యోగానుష్ఠానముచే క్లేశాదులు నశించి యభ్యాస వైరాగ్యములచే మధుమతి, మధుప్రతీక, విశోక, సంస్కారశేషత అని సమాధులు లభించును. సంస్కారశేషత యే యసంప్రజ్ఞాతము. వీనివలన భూత భవిష్య ద్విషయ జ్ఞానము, మనోవేగము, ప్రకృతి వికారములెల్ల వశము చేసికొనుట అణిమాదిసిద్ధులు మొదలైనవి సిద్ధించును. అయిన నివి సబీజ సమాధియొక్క ఫలములే గాన శ్లాఘ్యములుకావు. నిర్బీజ సమాధివలననే యుపాదేయమైన కైవల్యము సిద్ధించును.

(1) కర్మభావనయు, బ్రహ్మభావనయు, ఉభయ భావనయును భావనాత్రయ మనఁబడుచున్నవి. కర్మములను అనుష్ఠింపవలయునని యుద్దేశము కర్మభావన యనఁబడును. అది కలవారు దేవతలు మనుష్యులు మొదలగువారు. పరబ్రహ్మోపాసనమును అనుష్ఠింపవలయునని యుద్దేశము బ్రహ్మభావన యనఁబడును. అది కలవారు సనందనాదులు. కర్మమును బ్రహ్మోపాసనమును ఈ రెంటిని యనుష్ఠింపవలయునని యుద్దేశము ఉభయభావన యనఁబడును. ఇది కలవారు చతుర్ముఖబ్రహ్మము మొదలగువారు.

చెప్పి, రెండవదియగు అమూర్తవిభాగము కర్మమనఁబడునట్టి యవిద్యలేనిది యును, అచిత్పదార్థముతో సంబంధించియుండనిదియునై కేవల జ్ఞానస్వరూపమే యయినను, అదియోగాభ్యాసమునందు మంచి ప్రావీణ్యము గలవారిచే మాత్రమే ధ్యానింపఁదగిన దగుటంజేసి క్రొత్తగా యోగాభ్యాసము నారంభించిన వారి మన స్సునకు విషయముకానందునను, స్వతశ్శుద్ధి లేనిదయినందునను శుభాశ్రయము కాఁ దగదని నిశ్చయించి, తరువాత పరశక్తిరూపమగునట్టి యీ యమూర్తవిభా గముతోను, అపరశక్తిరూపమై క్షేత్రజ్ఞమనఁబడు మూర్తవిభాగముతోను, పర శక్తిరూపమగునట్టి ఆత్మకు క్షేత్రజ్ఞత్వమును (శరీరసంబంధమును) గలుగఁజేయు నదియును మూఁడవశక్తియునునగు కర్మమనఁబడునట్టి యవిద్యతోనును, అనఁగా ఈమూఁడు శక్తులతోనును గూడియుండునదియు, భగవంతునికిమాత్రమే యుండు నదిగా, "ఆదిత్యవర్ణం" ఇత్యాది శ్రుతులయందు ప్రసిద్ధమయినట్టి మూర్త రూపము శుభాశ్రయమని చెప్పఁబడియె. ఈ సందర్భమున పరిశుద్ధాత్మయొక్క స్వరూపము శుభాశ్రయము కాఁదని "ప్రత్యస్తమితభేదం" అను శ్లోకము దెలుపుచున్నది. ఎట్లన,

శ్లో॥ న తద్యోగయుజా శక్యం నృప! చిన్తయితుమ్ యతః।

విష్ణు. ౬ అం. ౭ అ. ౫౫ శ్లో॥

తా॥ ఓరాజా! అది (అమూర్తవిభాగము) యోగాభ్యాసము నూతనము గా నారంభించినవానిచే చింతింపఁదగినది కాదు, ఏలన,

శ్లో॥ ద్వితీయం విష్ణుసఞ్జ్ఞస్య యోగిధ్యేయం పరం పదం।

విష్ణు. ౬ అం. ౭ అ. ౬౯ శ్లో॥

తా॥ విష్ణువనఁబడు పరబ్రహ్మముయొక్క రెండవశక్తియగు అమూర్త విభాగము యోగాభ్యాసమున నైపుణ్యముగలవారిచే ధ్యానింపఁదగినది.

కావున,

శ్లో॥ సమస్తాశ్శక్తయశ్చైతా నృప యత్ర ప్రతిష్ఠితాః।
తద్విశ్వరూపవైరూప్యం రూపమన్యద్ధరేర్మహత్ ॥

విష్ణు. ౬ అం. ౭ అ. ౭౦ శ్లో॥

తా॥ ఓరాజా! ఈ శక్తులన్నియును దేనియందు నిలిచియున్నవో, అది

విశ్వరూపమున కంటెను విలక్షణమైనదియగు విష్ణువుయొక్క మఱియొక్క గొప్పరూపము. ”

ఇవ్విధమునఁ గదా చెప్పఁబడియె.

అట్లే చతుర్ముఖ, సనక, సనందనాదులును ఈ బ్రహ్మాండము లోపల నుండువారగుటచే నవిద్యచే నావరింపఁబడినవారు, కావున వారును “ శుభాశ్రయము ” కాఁదగరనియు, కాలాంతరమున (యోగాభ్యాసమూలముగా) జ్ఞానమును గలుగఁజేసికొని వారుగాని, స్వస్వరూపమును బాగుగ నెఱింగిన వారుగానియగు బద్ధాత్మలును స్వతశ్శుద్ధిలేనివా రగుటంజేసి శుభాశ్రయములు కాఁదగరనియును శ్రీ శౌనక మహర్షి చెప్పియున్నాఁడు. ఎట్లన,

శ్లో॥ ఆబ్రహ్మస్తంబపర్యన్తా జగదన్తర్వ్యవస్థితాః।
ప్రాణినః కర్మజనిత సంసారవశవర్తినః॥

విష్ణుధర్మ. ౧౦౪ అ. ౨౩ శ్లో॥

తా॥ చతుర్ముఖబ్రహ్మము మొదలుకొని గడ్డికాడవఱకును జగత్తులో నుండెడి సమస్తప్రాణులును కర్మమువలనఁ గలిగిన సంసారవశమున నుండునవి.

శ్లో॥ యతస్తతో న తే ధ్యానే ధ్యానినాముపకారకాః।
అవిద్యాన్తర్గతాస్సర్వే తే హి సంసారగోచరాః॥

విష్ణుధర్మ ౧౦౪ అ. ౨౪ శ్లో॥

తా॥ మఱియు నవియన్నియును అవిద్యతోఁ జేరినవయినందున సంసారగోచరనులు. కావున నవి యోగుల ధ్యానమున నుపయోగపడవు.

శ్లో॥ పశ్చాదుద్భూతబోధాశ్చ ధ్యానే నైవోపకారకాః।
నైసర్గికో న వై బోధ స్తేషా మప్యన్యతో యతః॥

విష్ణుధర్మ. ౧౦౪ అ. ౨౫ శ్లో॥

తా॥ కొంతకాలముపైని కలిగిన జ్ఞానము కలవారును ధ్యానమున నుపయోగపడరు. ఏలన, వారి తెలివి స్వభావసిద్ధమైనది కాదు. అదిమఱియొకనివలన వచ్చినది కదా!

శ్లో॥ తస్మాత్తదమలం బ్రహ్మ నిసర్గాదేవ బోధవత్ ॥

విష్ణుధర్మ. ౧౦౪ అ. ౨౬ శ్లో॥

తా॥ కావున ఆ నిర్మలమయిన బ్రహ్మమే స్వభావసిద్ధమగు జ్ఞానము కలది.

పరబ్రహ్మమనఁబడు విష్ణువుయొక్క అసాధారణమయిన రూపము శుభాశ్రయమని ఈ పైని గనఁబఱచిన గ్రంథసందర్భమున తెలుపఁబడియె. కావున "భేదమును నిషేధించియున్నట్లు" ఇందెచటను గానఁబడదు.

(౩౨ పు. ౧౦ పం) "జ్ఞానస్వరూపం" (విష్ణు ౬-అం. ౭-అ. ౫౫-శ్లో.) అనుశ్లోకము జ్ఞానముతప్ప తక్కిన పదార్థములన్నియును మిథ్యయని ప్రతిపాదించుచుండలేదు. అయితే "జ్ఞానస్వరూపమగు ఆత్మ దేవమనుష్యాద్యాకారముగాఁ దెలియవచ్చుట భ్రాంతి" అని యింతమాత్రమే ఆశ్లోకమునఁ జెప్పఁబడియె. ముత్యపుచిప్ప వెండిగాఁదోఁచుట మిథ్యయన్నంత మాత్రముచే లోకమునం దెచటను వెండి లేనేలేదని చెప్పినట్లగునా? కాదే?

అద్వైతిః—జగద్బ్రహ్మములకు సామానాధికరణ్యమును చెప్పియున్నందున, జగత్తన్నను బ్రహ్మమన్నను ఒక్కటియే వస్తువుగాఁ దెలియవచ్చుచున్నది. అందువలన జ్ఞానస్వరూపమగు బ్రహ్మమును ఘటపటాదిపదార్థస్వరూపమునుగాఁ గొనుట భ్రాంతియన్నచో, ఘటపటాది పదార్థజాతమంతయును మిథ్యయని చెప్పినట్లు కాదా?

భాష్యకారులుః—అట్లు చెప్పఁదగదు. ఏలన, విష్ణువనఁబడు పరబ్రహ్మము దోషములేవియు నెంతమాత్రము లేనివాఁడనియు, సమస్త కల్యాణగుణాత్మకుండనియు, మహావిభూతి గలవాడనియును వేదాంత శాస్త్రమువలనఁ దెలియవచ్చుచున్నది గదా! ఇట్లుండఁగా నది యంతయును మిథ్యయని యెఱుంగుట యసంభవము. సామానాధికరణ్యముచే ఐక్యము చెప్పఁబడినను, అట్లు చెప్పుటచే బాధగాని, విరోధముగాని యేదియును లేదని యిఁకమీఁద ఉపపాదింపఁబడును. కావున ఈ శ్లోకము ఘటపటాది పదార్థజాతము నెంతమాత్రము బాధించునది కాదు. అదియెట్లన; "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభి సంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి" (తై-బృ. ౧-అను.) (దేనివలనఁ బృథివ్యాది సమస్తభూతములును పుట్టుచున్నవో, దేనివలన నట్లుపుట్టిన వన్నియును సురక్షితముగా నున్నవో, దేనియం దవియన్నియును లయించుచున్నవో దానిని (బ్రహ్మమునుగా నెఱుంగుము) అను శ్రుతివాక్యమువలనఁ జగజ్జన్మాదులకు కారణభూతమైనది బ్రహ్మమని నిశ్చితమగుచున్నది. ఇట్లుండ,

శ్లో॥ ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ ।
బిభేత్యల్ప శ్రుతా ద్వేదో మామయం ప్రతరిష్యతి॥

భా. ఆ. ౧ - ౨౬౩

తా॥ ఇతిహాస పురాణంబులఁగొని వేదార్థములను విశదీకరించుకొనునది. ఏలన, "నన్ను ఈతఁడు వంచించునని అనఁగా అపార్థము చేయును" అని వేదము అల్పజ్ఞానము గలవానినుండి భయపడుచున్నది.

ఇతిహాసపురాణంబులఁగొని వేదార్థమును ఉపబృంహణము చేసికొనవలయునని అనఁగా విశదీకరించుకొనవలయునని ఈపైని గనఁబఱచిన శాస్త్రివాక్యమునుబట్టి తెలియవచ్చుచున్నది. సమస్తములగు వేదార్థముల నెఱిఁగి తమ యొక్క యోగమహిమచే వేదములయొక్క తత్త్వార్థములను సాక్షాత్కరించినట్టి మహాత్ములయొక్క వాక్యములచే తానెఱింగిన వేదవాక్యములయొక్క యర్థములను స్పష్టపఱచుకొనుట "ఉపబృంహణ" మనఁబడును ఏలననిన, వేదశాస్త్రిముయొక్క యేదో యొక భాగమును చదివినంతమాత్రముచే నన్నిభాగముల కనుగుణమైన యర్థమును గ్రహించుట యసంభవము. కావున నట్టి యుపబృంహణముయొక్క సహాయము లేకుండ అట్టి యర్థమును నిశ్చయించుట యశక్యము. అందువలన నుపబృంహణము తప్పక చేయవలసినదియేయని సిద్ధమగుచున్నది.

అందు మైత్రేయుఁడను మహర్షి, తాను చదువుకొనిన వేదముల యర్థములను విశదీకరించుకొన నిచ్ఛగలవాఁడై, పులస్త్య వసిష్ఠుల వరప్రదానము వలన పరదేవతా స్వరూపమును యథార్థముగా నెఱింగిన శ్రీపరాశరమహర్షి యొద్దకుఁబోయి, వినయముతో నిట్లు పలికెను,

శ్లో॥ సోహ మిచ్ఛామి ధర్మజ్ఞ! శ్రోతుం త్వత్తో యథా జగత్ ।
బభూవ భూయశ్చ యథా మహాభాగ భవిష్యతి॥

విష్ణు. ౧ అం. ౧ అ. ౪ శ్లో॥

తా॥ ఓ ధర్మజ్ఞుఁడా! ఈజగత్తు ఇంతకుపూర్వ మెట్లుండెను? ఇఁక మీఁద అది యెట్లుండఁగలదు? ఈవిషయమును తమవలనఁ దెలియఁ గోఱుచున్నాఁడను.

శ్లో॥ యన్మయంచ జగద్బ్రహ్మన్ యతశ్చైత చ్చరాచరం।
లీన మాసీద్యథా యత్ర లయమేష్యతి యత్ర చ॥
విష్ణు. ౧ అం. ౧ అ. ౫ శ్లో॥

ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! ఈ స్థావర జంగమ విశిష్టమగు జగత్తు దేనిచే నంతట వ్యాపింపఁబడినది? దేనివలన నది కలుగుచున్నది? దేనియం దది లీన మగుచున్నది? అట్లు అది దేనియందు యెవ్విధముగా లీనమగుచున్నది?

ఈ మొదలగు శ్లోకములయందు బ్రహ్మస్వరూపమును గుఱించియు, అట్టి బ్రహ్మముయొక్క విభూతిని గుఱించియు, దానిభేదములను గుఱించియు, అది యుండువిధమును గుఱించియు, బ్రహ్మముయొక్క ఆరాధనమును గుఱించియు, ఆ యారాధనముయొక్క స్వరూపమును గుఱించియు, దాని ఫలమును గుఱించి యును ప్రశ్నింపఁబడియె.

బ్రహ్మస్వరూప విశేషమును గుఱించి ప్రశ్నించు సందర్భమున, ఈపైని గనఁబఱచిన శ్లోకమున (యతశ్చైత చ్చరాచరం=దేనివలన ఈ స్థావరజంగమ రూపగు జగత్తు కలుగుచున్నది?) అనుటచే ఈ జగత్తుయొక్క నిమిత్తోపాదాన కారణములను గుఱించి ప్రశ్నింపఁబడియె. కావున "యన్మయం" అను దానిచే "అట్లు సృష్టిస్థితిలయంబులను బొందునట్టి జగత్తు దేనిని యాత్మగాఁగలిగియు న్నది?" అని ప్రశ్నింపఁబడియె.

శ్రీపరాశరులు ఈపై ప్రశ్నమునకు ఉత్తరమును "జగచ్చసః=ఆ పరబ్ర హ్మము జగత్తు" అని యిట్లు పలికియున్నారు. పరబ్రహ్మము అంతరాత్మగా జగత్తునందు వ్యాపించియుండుటనుబట్టి యిట్లు జగత్తునకును బ్రహ్మమునకును సామానాధికరణ్యము (ఐక్యము) చెప్పఁబడియెను గాని వ్యాపింపఁబడు జగత్తున్ను వ్యాపించు బ్రహ్మమును ఒక్కటియే వస్తువగుటనుబట్టి యిట్లు చెప్పియుండలేదు. ఏలన, "యన్మయం?= దేనిచే వ్యాపింపఁబడినది?)" అను ప్రశ్నమునకు గదా "జగచ్చసః" అని యిట్లు సామానాధికరణ్యముచే నుత్తరము ఈయఁ బడియెను. యన్మయం (యత్+మయం) అనుచో "మయట్" ప్రత్యయము ("మయ" అనునది) వికారార్థమున ("కలిగిన" అనెడి యర్థమును తెలుపుటకై) వచ్చినదికాదు. అట్లైన పక్షమున "ఈజగత్తు దేనివలనఁ గలిగినది?" అని యిట్లు మరల ప్రశ్నించుట నిరర్థకమగును? మఱియు నది "ప్రాణమయః" ఈ మొదలగు

శబ్దములయందు వలె స్వార్థికమును (వేఱొక యర్థము లేనిదియును) కాదు. అట్లైన పక్షమున "జగచ్ఛనః" అనెడి యుత్తర మసంగత మగును. అట్లగునెడల "విష్ణువే" అని కదా ఉత్తరము నిచ్చియుండవలయును.

కావున "యన్మయం" అను శబ్దమునందుండు "మయట్" ప్రత్యయము ప్రాచుర్యార్థమున ("అది తఱచుగాఁగలది" యనెడి యర్థమున) వచ్చిన దని సిద్ధమగుచున్నది. "తత్ప్రకృత వచనే మయట్" (అష్టా. ౫-అ. ౪-పా. ౨౧-సూ.) అను సూత్రముచే శ్రీ పాణిన్యాచార్యులవారు ప్రాచుర్యార్థమునను "మయట్" ప్రత్యయమును విధించియున్నారు. ఈ సమస్తమైన జగత్తును సర్వేశ్వరునికి శరీరభూతమగుటంజేసి యది సర్వేశ్వరప్రచురమైనదియే—అంతటను సర్వేశ్వరుఁడు గలదియే—కావున జగద్బ్రహ్మములకుఁగల శరీరాత్మభావమును బట్టియే "యన్మయమ్" అను ప్రశ్నమునకు "జగచ్ఛనః" అని యిట్లు సామానాధికరణ్యముచే నుత్తరము నిచ్చినట్లు నిశ్చయింపఁబడుచున్నది. అట్లుకాక, "శాస్త్రము విశేషము లేవియునులేని వస్తువును ప్రతిపాదించునది" అని యంగీకరించు పక్షమున, ఈపైని గనఁబఱిచిన ప్రశ్నములును, ఉత్తరములును, ఇవి యన్నియును పొసగవు. అట్లైనపక్షమున, "ప్రపంచమనెడి భ్రమమున కాధారమేది"? అని యిట్లు ప్రశ్నించి, యాప్రశ్నమునకు "నిర్విశేషచిన్మాత్రమే యట్టి భ్రమమున కాధారము" అని యిట్లు ఉత్తరమిచ్చి యుండవలయును గదా. "జగచ్ఛనః" అను తావున జగద్బ్రహ్మములను సామానాధికరణ్యముచే నిర్దేశించుటకు (జగత్తు బ్రహ్మము అని చెప్పుటకు) "జగత్తన్నను బ్రహ్మమన్నను ఒక్కటియే వస్తువు" అని తెలుపుటయే తాత్పర్యమగుపక్షమున, బ్రహ్మము సత్యసంకల్పత్వము మొదలగు గుణములకు ముఖ్యస్థానమగుటయు, హేయపదార్థముల కన్నింటికిని విరుద్ధమయినదగుటయును బాధించును. మఱియు బ్రహ్మము అశుభంబుల కన్నింటికిని యునికిపట్టును నగును. కావున ముఖ్యముగా నిచట సామానాధికరణ్యము జగద్బ్రహ్మంబులకుఁ గల శరీరాత్మభావమునుబట్టి వచ్చినదియే యని నిశ్చయింపఁబడుచున్నది.

కావున "విష్ణోః స్సకాశాదుద్భూతం జగత్తత్రైవ చ స్థితం। స్థితి సంయమ కర్తాఽసౌ జగతోఽస్య జగచ్ఛనః" అను శ్లోకమున సంగ్రహముగాఁ జెప్పఁబడిన

యర్థమునే "పరస్పరాణామ్" అని ఈ మొదలగు శ్లోకములచే విస్తృతముగాఁ జెప్పఁదలచి, పరబ్రహ్మభూతుఁడును భగవంతుఁడును నగు విష్ణువును స్వస్వరూప ముతోనున్న వానిని "అవికారాయ" అనెడి శ్లోకముచే ముందుగాఁ బ్రణమించి, అట్టి పరబ్రహ్మమునే "బ్రహ్మ విష్ణు మహేశ్వరు" లనఁబడు "మూర్తిత్రయము" గానును, "ప్రకృతి, కాలము, క్షేత్రజ్ఞుల (జీవుల) వ్యష్టియును, సమష్టియును" నీ రూపముననున్న వానిని గానును నమస్కరించుచున్నాఁడు. అట్టి సందర్భమున "జ్ఞానస్వరూపం" అనెడి శ్లోకము క్షేత్రజ్ఞమనఁబడు వ్యష్టిస్వరూపముగా నుండు నట్టి పరమాత్మయొక్క స్వభావమును తెలుపుచున్నది. కావున ఆ శ్లోకము నిర్విశేషవస్తువును తెలుపుచుండలేదు.

నిర్విశేష చిన్మాత్ర స్వరూపమగు బ్రహ్మము అధిష్ఠానముగాఁ (ఆధార ముగాఁ) గల భ్రమమును ప్రతిపాదించుటయే శాస్త్రముయొక్క యుద్దేశమని యెదవా? అట్లంటి వేని.

"శ్లో॥ నిర్గుణస్యాప్రమేయస్య శుద్ధస్యాప్యమలాత్మనః।
కథం సర్గాదికర్తృత్వం బ్రహ్మణో ఽభ్యుపగమ్యతే॥
విష్ణు. ౧-అం. 3-అ. ౧-శ్లో॥

తా॥ సత్త్వరజస్తమో గుణంబులు లేనివాఁడును, ప్రమాణములచేఁ దెలియఁబడనివాఁడును, పరిశుద్ధమైనవాఁడును, నిర్మలమైన స్వరూపముగలవాఁ డును నగు పరబ్రహ్మమునకు సృష్ట్యాది కర్తృత్వ మెట్లు అంగీకరింపఁబడుచు న్నది?" అనెడి ప్రశ్నంబును,

"శ్లో॥ శక్తయ స్సర్వభావానా మచిన్త్యజ్ఞానగోచరాః।
యతోఽతో బ్రహ్మణ స్తాస్తు సర్గాద్యా భావశక్తయః॥
భవన్తి తపతాంశ్రేష్ఠ పావకస్య యథోష్ణతా॥
విష్ణు. ౧ అం. 3 అ. ౨ శ్లో॥

తా॥ "ఓ మునిశ్రేష్ఠుఁడా! అన్ని వస్తువుల శక్తులును తలంపశక్యము గాని జ్ఞానమునకు గోచరములయినవి. కావున బ్రహ్మముయొక్క ఆ సృష్ట్యాదు లును అగ్నికి వేడిమివలెనే వస్తుశక్తులగుచున్నవి" అనెడి యుత్తరమును పొసగ కుండును.

అద్వైతులు వాదించుప్రకారము భ్రాంతిని ప్రతిపాదించుటయే శాస్త్రోద్దేశమగు పక్షమున, "నిర్గుణమగు బ్రహ్మమునకు సృష్ట్యాది కర్తృత్వమెట్లు? అనెడి ప్రశ్నమునకు "వాస్తవమునకు బ్రహ్మము సృష్టినెనర్చి యుండలేదు. మఱి యేమన్నను, సృష్టి యనఁబడునది భ్రాంతివశమున (బ్రహ్మమునఁ) గల్పింపఁబడినది" అని యివ్విధమగు ఉత్తరమును ఇచ్చియుండవలయును. అట్లు ఇచ్చియుండ లేదే? దీని ఫలితార్థ మేమన్నను,

"లోకమున సామాన్యముగ సృష్టి యనునది సత్త్వరజస్తమోగుణ యుక్తులును, అపరిపూర్ణులును, కర్మవశ్యులునగు వారిచే నెనర్పఁబడునదిగాను గన్పట్టుచున్నది. సర్వేశ్వరుఁడన్ననో, సత్త్వరజస్తమో గుణములు లేనివాఁడును, పరిపూర్ణుఁడును, కర్మవశ్యుఁడుకానివాఁడును, కర్మ సంబంధమున కర్షుఁడు కానివాఁడును గదా! ఇట్లుండ, అట్టివాఁడు సృష్టి మొదలగువాని నెనర్చువాఁడని యెట్లు అంగీకరింపఁదగును?" అని యివ్విధమున ప్రశ్నింపఁగా, "బ్రహ్మము మనకంటికిఁ గానఁబడు సమస్త పదార్థములకంఁటెను విలక్షణమైనదియై (భిన్నస్వభావముకలదై) ఈ పైని గనఁబఱిచిన విధముగా నుండునదియే యైనను అది సమస్త శక్తులతోఁ గూడియుండినదిగాఁ దగును. అందు విరోధ మేదియును లేదు. అది యెటువలెననిన, అగ్ని మొదలగు పదార్థములు జలాది పదార్థములకంఁటెను విలక్షణములైనను, ఔష్ణ్యాది శక్తులను గలిగియుండలేదా? అట్లె యిచటను యెఱుంగునది" అని యివ్విధమున ఉత్తర మొసంగఁబడియె.

(౩౨ పు. ౧౬ పం) "పరమార్థస్త్వమేవైకః" ఇత్యాది శ్లోకము సయితము "ఈ సమస్త ప్రపంచము అసత్యము" అని తెలుపుచుండ లేదు. అయితే సర్వమును బ్రహ్మాత్మకము (బ్రహ్మముచే నంతరాత్మగా వ్యాపింపఁ బడినది) అగుటంజేసి యట్టి బ్రహ్మముచే వ్యాప్తముకానిది మఱి యేదియును లేదని తెలుపుచున్నది. ఈ విషయమునే "తవైష మహిమా యేన వ్యాప్తమేతచ్చరాచరం" అను శ్లోకము ఉపపాదించుచున్నది.—ఈ స్థావరజంగ మాత్మమగు జగమంతయును నీచే వ్యాపింపఁబడినందున, ఇది యంతయును నీశరీరమే. నీ శరీరము కానిది యేదియును లేదు. నీవు సర్వాత్మకుండవగుటచే నీవే పరమార్థము. కావుననే "సర్వమును వ్యాపించియుండుటయే నీయొక్క మహిమ" అని యిట్లు చెప్పఁ

బడియె. అట్లుకాక అద్వైతులు చెప్పుప్రకారము ఈ సర్వమును భ్రాంతియగు పక్ష మున "తవైషమహిమా"=ఇది యంతయు నీయొక్క మహిమ" అని చెప్పు టకు బదులుగా "తవైషా భ్రాంతిః=ఇదియంతయును నీయొక్క భ్రాంతి" అని గదా చెప్పి యుండవలయును? అట్లైనపక్షమున "జగతః పతే త్వం=జగత్తునకు ప్రభువు నీవు" ఈ మొదలగు పదములు లక్షణార్థముగలవి యగునే? మఱియు అట్లైనపక్షమున, వరాహరూపముగానవతరించి యీ. జగమునంతయును లీలా మాత్రముచే పైకి యెత్తిన భగవంతుని గుఱించిన స్తోత్రమగునట్టి యీ ప్రకర ణము సయితము విరోధించును.

"ఈ సమస్తజగత్తును జ్ఞానస్వరూపుఁడవగు నీచే వ్యాపింపఁబడినది. ఇది యంతయును నీయొక్క శరీరము. ఇట్లు ఇది యంతయును నీచే నంతర రాత్మగా వ్యాపింపఁబడియున్నది. ఇట్టి ధ్యానములేనివారు దీనిని కేవలము దేవమ నుష్యాదిరూపముగాను భ్రాంతివశమునఁ దెలిసికొనుచున్నారు" అని యిట్లు "యదేతద్దృశ్యతే" అను శ్లోకము తెలుపుచున్నది. (౩౨-పు. ౨౦-పం)

"వాస్తవమునకు నీచే నంతరాత్మగాను వ్యాపింపఁబడినదై నీకు శరీర భూత మగునట్టి యీ జగమును కేవలము దేవమనుష్యాది రూపముగాను తలంచుట మాత్రమే భ్రమము కాదు. అయితే జ్ఞాన స్వరూపులగు ఆత్మలను దేవ మనుష్యాది పదార్థ స్వరూపులనుగాను తలంచుటయును భ్రమమే యని "జ్ఞానస్వరూపమఖిలం" అనెడి శ్లోకము తెలుపుచున్నది (33 పు. ౧ పం)

"ఎవ్వరు బుద్ధిమంతులును, జ్ఞానస్వరూపమగునట్టి యాత్మను తెలిసికొనిన వారును, ఈ సమస్తమును భగవదాత్మకమని యెఱుంగుటకు సాధన భూతమగు యోగమునకు తగినదియు, పరిశుద్ధమును నగు మనస్సుగలవారునో, అట్టివారు దేవ మనుష్యాది రూపమును, ప్రకృతి పరిణామరూపమును నగునట్టి యిదియంత యును దీనికంటెను విలక్షణమును, జ్ఞాన స్వరూపమును నగునది (పరబ్ర హ్మము) యంతరాత్మగా గలదియనియు, నీయొక్క శరీరమనియును ఎఱుంగుచు న్నారు" అని యిట్లు "యే తు జ్ఞానవిదః" అను శ్లోకము తెలుపుచున్నది. (33 పు. ౭ పం)

ఇవ్విధమున ఈపైని గనఁబఱచిన ప్రకారము ఈ శ్లోకముల యర్థమును గ్రహింపనియెడల, శ్లోకములకు పౌనరుక్త్య దోషమును, పదములకు లక్షణార్థ

మును, అర్థమున పరస్పర విరోధమును, ప్రకరణ విరోధమును, శాస్త్ర తాత్పర్య విరోధమును సంభవించును.

సమస్తములయిన యాత్మలును జ్ఞాన స్వరూపము లగుటంజేసి సమానములు. ఇట్లుండ, దేవ మనుష్యాది రూపమును, ప్రకృతి పరిణామ రూపమును నగునట్టి యీ శరీరముయొక్క సంబంధమువలన ఆత్మలును దేవాద్యాకారములచే భిన్నములని—దేవ మనుష్యాది రూపములగు వేఱువేఱు ఆకారములు గలవని—యెఱుఁగుట యజ్ఞానము. ఈ విషయమును "తస్యాత్మ పరదేహేషు" ఇత్యాది శ్లోకము తెలుపుచున్నది (౩౩ పు. ౧౩ పం). దేవ మనుష్యాది శరీరములు భిన్న భిన్నాకారములు గలవగుటచే వానిలో నుండునట్టి యాత్మలును భిన్న భిన్నాకారములు గలవని యెఱుంగకుమని ఈ శ్లోకమునఁ జెప్పఁబడియె. ఇంతమాత్రముచే ఆత్మలు అనేకములు గావని చెప్పఁబడలేదు. కావున దేవ మనుష్యాది వివిధ విచిత్ర శరీరముల యందుండు ఆత్మలన్నియును సమానాకారములని యెఱుంగునది. ఈ యభిప్రాయమునుబట్టియే "శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః" (భ. గీ. ౫ అ. ౧౮ శ్లో.) "ఆత్మస్వరూపము నెఱింగినవారు కుక్కయందును కుక్కను వండువానియందును నుండునట్టియాత్మను సమముగా అనఁగా సమానాకారముగలదానినిగాఁ జూచువారు" అనియు, "నిర్దోషం హి సమం బ్రహ్మ" (గీ. ౫ అ. ౧౯ శ్లో.) "ఆత్మస్వరూపము దోషములు లేనిదియును సమమయినదియును" అనియు నివ్విధమున శ్రీ భగవద్గీతలయందు భగవంతుఁడు చెప్పియున్నాఁడు. "తస్యాత్మ పరదేహేషు" అను శ్లోకమునందే "దేహమునకంటెను వేఱగు వస్తువునందు (ఆత్మయందు) "తాను, తనకంటె నితరుఁడు" అనెడి విభాగము చెప్పఁబడినదికదా? (౩౩ పు. ౧౩ పం)

"యద్యన్యోఽస్తి పరఃకోఽపి" అను శ్లోకమున సయితము "సర్వ శరీరములలోనుండునట్టి యాత్మ యొక్కటియే" అని తెలుపఁబడలేదు. ఏలన, "నాకంటె పరుఁడును నాకంటె నన్యుండును" అనునప్పుడు "పర" శబ్దమును "అన్య" శబ్దమును ఏకార్థములుగాఁ బ్రయోగింపఁబడి యున్నట్లు ఎచ్చటను గానఁబడవు. అయితే ఇచట "మత్తః పరః" అనఁగా "నాకంటె వేఱగు ఆత్మ" అని యర్థము. "మత్తః అన్యః" అనఁగా "నాయొక్క జ్ఞాన స్వరూపమున

కంటెను వేఱొక స్వరూపముగలది" అని యర్థము. దీని ఫలితార్థమేమన్నను, నాకంటెను వేఱయినది యగు మఱియొక యాత్మ నాయొక్క జ్ఞానాకారమున కంటెను వేఱగు ఆకారముగలదిగానుండు పక్షమునఁగదా, "నేను యివ్విధమైన యాకారము గలవాఁడను, వీడు వేఱొకవిధమైన యాకారము గలవాఁడు" అని యిట్లు వ్యవహరింపఁదగును? అట్లు లేదే? సమస్తములయిన యాత్మలును జ్ఞానమే యాకారముగాఁ గలవగుటచే సమానాకారములు గదా? (33 పు. ౧౮ పం,)

"వేణురంధ్రవిభేదేన" అను శ్లోకమునను "ఆత్మలకు ఆకారవైషమ్యము వానివాని స్వరూపమునఁగల భేదమునుబట్టి గలిగినది కాదనియు, అయితే అది దేవాదిశరీరములలోఁ బ్రవేశించుటనుబట్టి గలిగినదియనియును" తెలుపఁబడియె. కావున "అన్ని శరీరములలోను ఆత్మయొక్కటియే" అని యాశ్లోకమునఁ దెలుపఁబడలేదు. "అనేక రంధ్రములయందుండు వాయ్వంశములకు స్వరూపైక్యము" దృష్టాంతమువలనను తెలుపఁబడలేదు. అయితే "ఒక రంధ్రముననుండు వాయ్వంశము ఎట్టి యాకారము కలదియో, రంధ్రాంతరముననుండు వాయ్వంశమును అట్టి యాకారము కలదియే" అని యిట్లు ఆకారసామ్యమే తెలుపఁబడియె. అన్నిరంధ్రములనుండు వాయ్వంశములును వాయువే యగుటంజేసి ఒక్కటియే యాకారముగలవియై, భిన్నభిన్న రంధ్రములనుండి బయలువెడలుటనుబట్టి షడ్జాది నామాంతరములు గలవియగుచున్నవి. అట్లే ఆత్మలును దేవమనుష్యాది నామాంతరములు గలవగుచున్నవని యెఱుంగునది. అది యెటువలెననిన, పృథివ్యాది ద్రవ్యముల యంశములైన పదార్థములకు ఆయాద్రవ్యమగుటనే ఐక్యముగాని స్వరూపమున నైక్యములేదు గదా! అట్లే వాయుసంబంధులగు నంశములకుఁగూడ స్వరూపభేదము తప్పనిదే. (33 పు. ౨౨ పం)

"సోఽహం న చ త్వం" అను శ్లోకమునను "ఆత్మలన్నియును జ్ఞానమే యాకారముగాఁ గలవి" అని యిట్లు ఇంతకుపూర్వము పేర్కొనఁబడిన జ్ఞానాకారత్వమును "సః" అనెడి శబ్దముచే బరామర్శించి, దాని సామానాధికరణ్యమున "అహం" "త్వం" మొదలగువాని యర్థములకు జ్ఞానమే స్వరూపమని యుపసంహరించుటచే—"అట్టి జ్ఞానాకారముగలవాఁడవే నీవును" "అట్టి జ్ఞానాకార

ముగలవాఁడనే నేనును" అని యిట్లు చెప్పుటచే—దేవమనుష్యాది శరీరభేదము నుబట్టి యాత్మలకును భేదము కలదనెడి యజ్ఞానమును వదలుమా! అనఁగా శరీరముల యాకారమున భేదము గానంబడుటచే శరీరులగు ఆత్మలయొక్క యాకారముననను భేదముండునని తలంపకుమా" అని యిట్లు తెలుపబడియె. అట్లు కాకున్న, దేహమునకంటెను వేఱగు ఆత్మయొక్క స్వరూపమును ఉపదేశించు సందర్భమున "నేను నీవు, ఇదియంతయు ఆత్మస్వరూపము" అని యిట్లు వేఱువేఱుగా నిర్దేశించుట పొసగక పోవును.

అద్వైతి:—"నేను" "నీవు" మొదలగు శబ్దములకు [1] ఉపలక్ష్యమగు, ఇది యంతయు నాత్మ స్వరూపమను దానితో, సామానాధికరణ్యముండుట వలన (భేదోపదేశము) ఉపలక్షణ మనఁగూడదా?

భాష్యకారులు:—కూడదు. ఏలన, అతఁడు ఉపదేశానుసారముగాఁ జేసెనని "తత్యాజ భేదం పరమార్థదృష్టిః" అను దానిచేఁ జెప్పఁబడినది. (౩౮ పు. ౨ పం.)

అద్వైతి:—ఇవ్విధమున నెట్లు నిశ్చయింపఁదగును?

భాష్యకారులు:—దేహాత్మ వివేకమును తెలుపుటకై గదా యుపదేశము ప్రవర్తించెను. అట్టి యుపదేశము మొట్టమొదట "పిణ్డః పృథగ్యతః పుంసశ్శిరపాణ్యాదిలక్షణః" (విష్ణు. ౨ అం. ౧౩ అ. ౮౯ శ్లో.) "ఏ హేతువువలన శిరస్సు చేతులు మొదలగునవి గుఱుతుగాఁగల శరీరము పురుషునికంటెను వేఱయినదో" అని యివ్విధమునఁగదా ఆరంభింపఁబడియెను.

"విభేదజనకే జ్ఞానే" అను శ్లోకము సయితము "సమస్త శరీరములయందుండు ఆత్మయొక్కటియే" అని తెలుపుచుండలేదు. మఱియు నది "జీవాత్మ పరమాత్మలు ఒక్కటియే పదార్థము" అనియును తెలుపుచుండలేదు. ఏలన, "అన్ని శరీరములయందుండు ఆత్మయొక్కటియే" అనెడి యంశము ఈపైని గనఁబఱిచిన ప్రకారము నిషేధింపఁబడినది. శరీరమన్నను ఆత్మయన్నను ఒక్కటియే పదార్థము యెట్లుకాఁదగదో అట్లే జీవాత్మయన్నను పరమాత్మయన్నను ఒక్కటియే వస్తువు కాఁదగదు. అటులనే శ్రుతులును తెలుపుచున్నవి. ఎట్లన,

---

(1) ౧౭౨-వ పత్రముయొక్క క్రిందిభాగమున నీయఁబడిన ౨-వ వివరణమును చూఁడుము.

శ్రు॥ ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి ॥

ముండ. 3 ము. ౧ ఖ. ౧ వా.

తా॥ సమానములయిన గుణములు కలవియును, కూడఁ దిరుగునవియు నగు రెండుపక్షులు (జీవాత్మ పరమాత్మలు) ఒక్కవృక్షమును (శరీరమును) ఆశ్రయించి యున్నవి. వానిలో నొక్కటి (జీవాత్మ) మధురమైన పండును (కర్మ ఫలమును) అనుభవించుచున్నది. మఱియొక్కటి (పరమాత్మ) అనుభవింపక ప్రకాశించుచున్నది.

శ్రు॥ ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే।
ఛాయాతపౌ బ్రహ్మవిదో వదన్తి పఞ్చాగ్నయో యే చ త్రిణాచికేతాః॥

కఠ. 3 వ. ౧ వా.

తా॥ [1]పంచాగ్నులును, త్రిణాచికేతులును ఎవ్వరో, అట్టిబ్రహ్మజ్ఞులు నీడ వెలుగువంటి వారైన జీవాత్మపరమాత్మలను మంచికర్మము యొక్కలోకమున [2]పుణ్యకర్మము ననుభవించువారలను గానును, హృదయ రంధ్రమును ప్రవేశించియున్నవారలను గానును, దానిలోఁ బ్రశస్తమైన పరమాకాశమున నున్నవారలను గానును చెప్పుచున్నారు.

శ్రు॥ అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా॥ (య. ఆ. 3 ప్ర. ౧౧ అను.)

తా॥ లోపల ప్రవేశించినవాఁడై జనులను శాసించువాఁడును, అన్నింటికి నాత్మయయినవాఁడును.

ఈ శాస్త్రమునను అనఁగా శ్రీ విష్ణుపురాణమునను, “స సర్వభూత ప్రకృతిం వికారాన్ గుణాది దోషాంశ్చ మునే వ్యతీతః। అతీత సర్వావరణోఽఖిలాత్మా తేనాస్తృతం యద్భువనాంతరాళే” అనియు, “సమస్త కల్యాణగుణాత్మ

(1) పంచాగ్నులును త్రిణాచికేతులును కర్మవిశేషనిష్ఠులు. దక్షిణ, గార్హపత్య, ఆహవనీయ సభ్య, ఆవసథ్యము లనఁబడు అయిదు అగ్నులుకల ఆహితాగ్నులు పంచాగ్ను లనఁబడుదురు. మొదటి మూఁడు అగ్నులుమాత్రము గల ఆహితాగ్నులు త్రిణాచికేతు లనఁబడుదురు.

(2) పరమాత్మ పుణ్యము ననుభవింపక పోయినను జీవులచే ననుభవింపఁ జేయుటచే ఇట్లు చెప్పఁబడియె.

 

శోసా" అనియు, "పరః పరాణాం సకలా న యత్ర క్లేశాదయస్సన్తి పరావరేశే" అనియు, "అవిద్యా కర్మసంజ్ఞాన్యా తృతీయా శక్తిరిష్యతే" అనియు, "యయా క్షేత్రజ్ఞశక్తి స్సా వేష్టితా నృప సర్వగా" అనియు, ఇట్లు జీవాత్మ పరమాత్మలకు బహుతెఱఁగుల భేదమున్నట్లు చెప్పఁబడియె.

సూత్రకారులును "ఉభయేఽపి హి భేదేనైనమధీయతే" (బ్ర. సూ. ౧ అ. ౨ పా. ౨౩ సూ.) అనియు, "భేదవ్యపదేశాచ్చాన్యః" (బ్ర. సూ. ౧ అ. ౧ పా. ౨౨ సూ.) అనియు, "అధికంతు భేదనిర్దేశాత్" (బ్ర. సూ. ౨ అ. ౧ పా. ౨౨ సూ) అనియు నీ మొదలగు సూత్రములయందు జీవాత్మ పరమాత్మలకు భేదము కలదని చెప్పఁబోవుచున్నారు.

"య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి" (బృ. ౨ అ. ౭ బ్రా. ౨౨ వా) "ఏ పరమాత్మ జీవాత్మయందున్నవాఁడో, జీవాత్మలోపల నున్నవాఁడో, ఎవనిని జీవాత్మ యెఱుఁగఁడో, ఎవ్వనికి జీవాత్మ శరీర భూతమయినవాఁడో, ఎవ్వఁడు జీవాత్మ లోపలనుండి జీవాత్మను నియమించుచున్నాఁడో" అనియు, "ప్రాజ్ఞే నాత్మనా సంపరిష్వక్తః" (బృ. ౬ అ. ౩ బ్రా. ౨౧ వా) "సర్వజ్ఞుఁడైన పరమాత్మచే వ్యాపింపఁబడినవాఁడు" అనియు "ప్రాజ్ఞేనాత్మనా సమన్వారూఢః" (బృ. ౬ అ. ౩ బ్రా. ౩౨ వా) "సర్వజ్ఞుఁడగు పరమాత్మచే వ్యాపింపఁబడిన వాఁడు" అనియు నివ్విధమున శ్రుతులును జీవాత్మ పరమాత్మలు పరస్పరము విరుద్ధమైన స్వరూపము గలవని నిశ్చయించుచున్నవి.

అద్వైతి:—సాధనానుష్ఠానమువలన నవిద్య బొత్తుగ పోగా, జీవుఁడు బ్రహ్మముతో నెక్కటియగుట సంభవింపదా?

భాష్యకారులు:—సంభవింపదు. ఏలన, అవిద్యకు అవకాశమిచ్చునట్టి వస్తువు (జీవుఁడు), అవిద్య కెన్నఁడును అవకాశమీయని వస్తువుగా (బ్రహ్మముగాఁ) కాఁదగదు. కనుకనే,

శ్లో॥ పరమాత్మాత్మనో ర్యోగరి పరమార్థ ఇతీష్యతే।
మిథ్యైతదన్యద్ద్రవ్యంహి నైతి తద్ద్రవ్యతాం యతః॥
విష్ణు. ౨ అం. ౧౪ అ. ౨౭ శ్లో॥

తా॥ పరమాత్మకును ఆత్మకును ఐక్యము యథార్థమని కొందఱు అంగీక

రించుచున్నారు. అది యసత్యము. ఏలన, అది కానివస్తువు అదియగుట అనఁగా ఒకవస్తువు వేఱొక వస్తువగుట యెట్లు సంభవము ?

ముక్తపురుషుఁడు మోక్షదశయందు పరమాత్మయొక్క ధర్మములను (గుణములను) మాత్రమే పొందుచున్నాఁడని శ్రీ భగవద్గీతలయందును చెప్పఁబడియే. ఎట్లన,

శ్లో॥ ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తిచ॥

భ. గీ. ౧౪ అ. ౨ శ్లో॥

ఓ యర్జునా ! ఈ జ్ఞానము నవలంబించి నా సాధర్మ్యమును (సమానములయిన ధర్మములు కలుగుటను) పొందినవారు సృష్టిలోఁ జన్మింపరు. ప్రళయమున నశింపరు.

శ్రీ విష్ణుపురాణమునను,

"శ్లో॥ ఆత్మభావం నయత్యేనం తద్బ్రహ్మధ్యాయినం మునే !
వికార్య మాత్మన శ్శక్త్యా లోహ మా కర్షకో యథా ॥

విష్ణు. ౬ అం. ౭ అ. ౩౦ శ్లో॥

తా॥ ఓ మునీ! బ్రహ్మము అజ్ఞానాదివికారములుగల యుపాసకుని, అయస్కాంతము మొదలగు ఆకర్షక వస్తువు లోహమునువలె, తన శక్తిచే తన స్వభావమును పొందించును." అని చెప్పఁబడియె.

ఈ పైశ్లోకమున "ఆత్మభావం" అనఁగా "తన స్వభావమును" అని యర్థము("తన స్వరూపమును" అని యర్థముకాదు) ఏలన, ఆకర్షింపఁబడునట్టి పదార్థము ఆకర్షించునట్టి పదార్థము యొక్క స్వరూపమును పొందుచున్నట్లు గానఁబడదుగదా !

ముక్తపురుషుని స్వరూపమును గుఱించి యిట్టివిధముననే సూత్రకారులును "జగద్వ్యాపారవర్జం ప్రకరణాద సన్నిహితత్వాచ్చ," (బ్ర. సూ. ౪ అ. ౪ పా. ౧౭ సూ.) అనియు, "భోగమాత్ర సామ్యలింగాచ్చ" (బ్ర. సూ. ౪ అ. ౪ పా. ౨౧ సూ.) అనియు, "ముక్తోపసృప్య వ్యపదేశాచ్చ" (బ్ర. సూ. ౧ అ. ౩ పా. ౨ సూ.) అనియు నీ సూత్రములచేఁ బ్రతిపాదింపఁబోవు

చున్నారు. "జగద్వ్యాపారవర్జం సమానో జ్యోతిషా" (జగద్వ్యాపారమునఁ దప్ప పరబ్రహ్మముతో సమానముగానే యుండును) అనెడి బోధాయన వృత్తియును అట్లే తెలుపుచున్నది. ద్రమిడభాష్యకారులు సయితము "దేవతా సాయుజ్యా దశరీరస్యాపి సర్వార్థ సిద్ధిః" అనఁగా "ముక్తుఁడు మోక్షావస్థయందు శరీర రహితుఁడయినను, సర్వేశ్వరుని సామీప్యమున నుండుటవలన నతనికి సర్వేశ్వరునికివలె నన్ని ప్రయోజనములును సిద్ధించును" అని యివ్విధమున ప్రసాదించియున్నారు.

శ్రుతులును, "య ఇహాత్మాన మనువిద్య వ్రజన్త్యే తాంశ్చ సత్యాన్ కామాన్ తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి" (ఛా. ౮ ప్ర. ౧ ఖ. ౬ వా.) (ఎవ్వరు ఈ లోకమున పరమాత్మ నుపాసించి ఈ సత్యములైన కల్యాణ గుణములను పొందుచున్నారో, వారల కన్నిలోకములయందును యథేష్టసంచారము కలుగును" అనియు, "బ్రహ్మవిదాప్నోతి పరం" (తై. ఆ. ౧ అను ౧ వా.) "బ్రహ్మము నుపాసించువాఁడు పరమపదమును పొందుచున్నాఁడు." అనియు, "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహబ్రహ్మణా విపశ్చితా" (తై. ఆ. ౧ అను. ౧ వా.) (ముక్తపురుషుఁడు పరబ్రహ్మముతోఁగూడ అన్ని కల్యాణ గుణములను పొందుచున్నాఁడు.) అనియు, "ఏతమా నందమయ మాత్మాన ముపసంక్రమ్య, ఇమాన్ లోకాన్ కామాన్నీ కామరూప్యను సఞ్చరన్" (తై. భృ. ౧౦ అను. ౫ వా.) (ఈ యానందమయుఁడగు ఆత్మనుపొంది కల్యాణగుణములే భోగ్యములుగాఁ గలవాఁడును, కోరినస్వరూపము గలవాఁడునగుచు సంచరించుచున్నవాఁడై) అనియు, "స తత్ర పర్యేతి" (ఛా. ౮ ప్ర. ౧౨ ఖ. 3 వా.) (ముక్త పురుషుఁడు పరమాత్మయందు సంచరించుచున్నాఁడు) అనియు, "రసో వై సః రసం హ్యే వాయం లబ్ధ్వా ఆనందీ భవతి" (తై. ఆ. ౭ అను ౧ వా) (పరమాత్మ ఆనందము గదా. ఈతఁడు (ముక్తపురుషుఁడు) ఆనందమునుపొంది, ఆనందముగలవాఁడగుచున్నాడు.) అనియు, "యథా నద్యస్స్యన్దమానాః సముద్రే ఽస్తం గచ్ఛంతి, నామరూపే విహాయ తథా విద్వాన్నామరూపా ద్విముక్తః, పరాత్పరం పురుష ముపైతి దివ్యం" (ము. 3 ము. ౨ ఖ. ౮ వా.) (ప్రవహింపుచున్న నదులు వాని పేరును రూపమును విడిచి సముద్రములో నెట్లు లయమును పొందుచున్నవో, అట్లే ఉపాసకుఁడును నామరూపములు లేనివాఁడై గొప్పవానికంటె గొప్పవాఁ

డును, అప్రాకృతుఁడుననగు పురుషుని పొందుచున్నాఁడు.) అనియు, "తథా విద్వాన్ పుణ్యాపాపే విధూయ, నిరఞ్జనః పరమం సామ్యముపైతి" (ము. 3 ము. ౧ ఖ. 3 వా) "అప్పుడు ఉపాసకుఁడు పుణ్యపాపములను విడిచి ప్రకృతి సంబంధము లేనివాఁడై (పరబ్రహ్మముతో) మిక్కిలి సామ్యమును పొందుచున్నాఁడు." అనియును తెలుపుచున్నవి.

మఱియు [1]పరవిద్యలయం దన్నింటియందును ఉపాసింపవలసిన బ్రహ్మము గుణవిశిష్టమైనదియే. అన్ని విద్యలయొక్కయును ఫలమును సమానమైనదియే. కావున విధింపఁబడిన విద్యలలో దేనినైన ననుష్ఠింపవచ్చును. ఇట్లు సూత్రకారులే "ఆనందాదయః ప్రధానస్య" (బ్ర. సూ. 3 అ. 3 పా. ౧౧ సూ) అనియు, "వికల్పో విశిష్ట ఫలత్వాత్" (బ్ర. సూ. 3 అ. 3 పా. ౫౭ సూ) అనియు నీ మొదలగు సూత్రములయందు చెప్పియున్నారు. వాక్యకారులును "యుక్తం తద్గుణకోపాసనాత్" (గుణములతోఁ గూడినదియే ప్రాప్యము. గుణములు కలవానినే యుపాసించుటవలన) అని యిట్లు గుణములతోఁ గూడినదియే యుపాస్య వస్తువనియు, విద్యలకు వికల్పముగలదనియును తెలియఁజేసి యున్నారు. "యద్యపి సచ్చిత్తః" ఇత్యాది గ్రంథముచే దీనిని భాష్యకారులు (ద్రమిడాచార్యులు) వ్యాఖ్యానము చేసియున్నారు.

"బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ము. 3 ము. ౨ ఖ. ౯ వా) అను శ్రుతి వాక్యము, "నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతిదివ్యం" (ము. 3 ము. ౨ ఖ. ౮ వా) (ముక్తుఁడు నామముచేతను రూపముచేతను విడువఁబడిన వాఁడై గొప్పవానికంటెను గొప్పవాఁడును దివ్యుఁడునగు పురుషుని పొందుచున్నాఁడు) అనియు, "నిరఞ్జనః పరమం సామ్యముపైతి" (ము. 3 ము. ౧ ఖ. 3 వా) (సంసారసంపర్కము లేనివాఁడై మిక్కిలి సామ్యమును పొందుచున్నాఁడు) అనియు, "పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" (ఛా. ౮ ప్ర. ౧౨ ఖ ౨ వా) (పరజ్యోతిస్సును పొంది తనరూపముతోఁనుండువాఁడగు చున్నాఁడు" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములతో నేకార్థముగలది యయినందున నా వాక్యమున "ప్రకృతివలనఁ గలిగిన నామరూపములనుండి విముక్తుఁడై నామ రూపములనుబట్టి వచ్చిన భేదము బొత్తుగ పోయినట్టి యుపాసకుఁడు బ్రహ్మము

(1) పరవిద్యలనఁగా పరబ్రహ్మమును గుఱించిన యుపాసనములు. విద్య = ఉపాసనము.

వలె) జ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడగుటచే, బ్రహ్మము యెవ్విధమైనవాఁడో అవ్విధమైనవాఁడగును" అని చెప్పఁబడియె. (రెండుపదార్థములు) ఒక్కవిధమైన వగు పక్షమున "అదియే" యనెడి వ్యవహారము' "అదియే యీ గోవు" అన్నట్లు ముఖ్యముగానే కలిగియుండును. శ్రీ విష్ణుపురాణమును,

"శ్లో॥ విజ్ఞానం ప్రాపకం ప్రాప్యే పరే బ్రహ్మణి పార్థివ!
ప్రాపణీయ స్తథై వాత్మా ప్రక్షీణా శేష భావనః॥

విష్ణు. ౬ అం. ౭ అ. ౯౩ శ్లో॥

తా॥ ఓ రాజా! ప్రాప్యుఁడైన పరబ్రహ్మము విషయమున ప్రాపకము అనఁగా పరబ్రహ్మమును పొందించునది ఈ విజ్ఞానమే. ఆ పరబ్రహ్మమువలె భావన లన్నియును పోయిన యీ యాత్మయును ప్రాప్యుఁడే." అని చెప్పఁబడెను.

ఈ శ్లోకమున, "పరబ్రహ్మమును ధ్యానించుటచే ఆత్మ సయితము పరబ్రహ్మమువలెనే భావనలన్నియును లేనివాఁడై—కర్మభావనయనియు, బ్రహ్మభావన యనియు, ఉభయభావన యనియు నివ్విధములగు మూఁడుభావనలు లేనివాఁడగు ప్రాప్యుఁడు (పొందఁబడువాఁడు) అగును" అని చెప్పి అటుపిమ్మట,

"శ్లో॥ క్షేత్రజ్ఞః కరణీ జ్ఞానం కరణం తస్య వై ద్విజ!
నిష్పాద్య ముక్తికార్యం హి కృతకృత్యం నివర్తయేత్

విష్ణు. ౬ అం. ౭ అ. ౯౪ శ్లో॥

తా॥ క్షేత్రజ్ఞుఁడు సాధనముగలవాఁడు. అతని సాధనము జ్ఞానము. అది మోక్షమనఁబడు కార్యమును కలుగఁజేసి, కృతకృత్యమై, అనఁగా చేయవలసిన కార్యమును చేసినదై, మఱలును.

అని యిట్లు పరబ్రహ్మధ్యానరూపమగు సాధనము భావనలేవియును లేనట్టి యాత్మస్వరూపమును గలుగఁజేసి కృతకృత్యమై నివర్తించు ననుటవలన నట్టిసాధనము సిద్ధించువఱకును దానినిఅనుష్ఠింప వలసినది" అని చెప్పి, అనంతరము,

"శ్లో॥ తద్భావభావమాపన్న స్తదాఽసౌ పరమాత్మనా।
భవత్యభేదీ భేదశ్చ తస్యాజ్ఞాన కృతోభవేత్॥

విష్ణు. ౬ అం. ౭ అ. ౯౫ శ్లో॥

తా॥ అప్పుడు పరబ్రహ్మముయొక్క గుణములను పొందినవాఁడై పరబ్రహ్మముతో భేదము లేనివాఁడగును. వీనిభేదము అజ్ఞానమువలనఁ గలిగినది."

అని యిట్లు ముక్తపురుషుని స్వరూపమును చెప్పుచున్నది. ఈపైశ్లోకమున, "తద్భావ భావమాపన్నః" అను తావున, తద్భావమనఁగా (తత్)=బ్రహ్మము యొక్క (భావం=భావమును) అనఁగా స్వభావమునని యర్థము. స్వరూపైక్యమునని యర్థముకాదు. అట్లైనపక్షమున "తద్భావభావం" అనుతావున రెండవభావశబ్ద మున కన్వయము లేకపోవును. మఱియు పూర్వము చెప్పిన యర్థముతో విరోధిం చును. ఏలన, బ్రహ్మమునకు భావనలెవ్వియును లేవనుట యేదికలదో, అది కలు గుట తద్భావ భావాపత్తి యనఁబడును. (జీవునికి) ఎప్పు డట్లు కలుగునో, అప్పుడే ఈతఁడు పరమాత్మతోను అభేది అనఁగా భేదము లేనివాఁడగుచున్నాఁడు. ఈ జీవుఁడు జ్ఞానమే స్వరూపముగాఁ గలవాఁడు. కావున ఈతఁడు పరమాత్మతో సమానమైన స్వభావముగలవాఁడు. అతనినుండి యీ జీవునికిఁ గల భేదమనఁ బడునది దేవాదిరూపమైనది. అది యీతనికి కర్మమనఁబడు అజ్ఞానమువలనఁ గలిగినదికాని స్వరూపసిద్ధమైనది కాదు. అట్టి భేదమును గలుగఁజేయునదియగు అజ్ఞానమనఁబడునట్టి యీ కర్మము పరబ్రహ్మమును ధ్యానించుటచే నశించును. అప్పు డట్టి భేదమును గలుగఁజేయునట్టి కారణము లేకపోవుటచే కార్యభూతమగు (దేవమనుష్యాది రూపమగు) భేదము సయితము లేనిది యగును. కావున ఈజీవుఁ డు అట్టియవస్థయందు పరమాత్మతో భేదము లేనివాఁడు—పరమాత్మ యెవ్విధమైన వాఁడో అవ్విధమైనవాఁడు—అగుచున్నాఁడు. కనుకనే శ్రీ విష్ణుపురాణమునను,

శ్లో॥ ఏకస్స్వరూపభేదస్తు బాహ్యకర్మవృతిప్రజః।
దేవాదిభేదే ఽపధ్వస్తే నాస్త్యే వావరణో హి సః॥

విష్ణు. ౨ అం. ౧౪ అ. 33 శ్లో॥

తా॥ వెలుపలికర్మము ఆవరించియుండుటచేఁ గలుగు స్వరూపభేద మొక్కటి కలదు. అది దేవమనుష్యాదిభేదములు పోయినతోడనే లేకపోవును. అట్టివాఁడు ఆవరణము లేనివాఁడు.

ఇట్లు ఈ పైని గనఁబఱచిన యంశమునే "విభేద జనకే జ్ఞానే నాశమా త్యన్తికం గతే। ఆత్మనో బ్రహ్మణో భేద మస న్తం కః కరిష్యతి" (విష్ణు. ౬ అం. ౭ అ. ౯౬ శ్లో.) అను శ్లోకము వివరించుచున్నది. ఈ శ్లోకమున "విభేదము అనఁగా వివిధ భేదము—దేవతిర్యఙ్మనుష్య స్థావరాత్మకమగు భేదమనుట. కనుకనే శ్రీ శౌనక మహర్షియు, "చతుర్విధోపి భేదోయం మిథ్యాజ్ఞాన నిబంధనః" (దేవతిర్యఙ్మ

నుష్య స్థావరరూపముగాఁ నాలుగు విధములుగల భేదము అజ్ఞానమువలనఁ గలిగినది) అనిచెప్పియున్నాఁడు. కావున "జ్ఞానస్వరూపుఁడగు ఆత్మయందు దేవమనుష్యాది రూపమగు నానావిధ భేదమునకు హేతుభూతమగు కర్మమనఁ బడునట్టి యజ్ఞానము పరబ్రహ్మమును ధ్యానించుటవలన బొత్తుగా నశింపఁగా, కారణము లేనందున స్వయముగ లేనట్టిదియగు నట్టియాభేదమును ఏది కలుగఁ జేయును?" అని "విభేదజనకేజ్ఞానే" అనెడి శ్లోకముయొక్క యర్థము (౩౮ పు. ౧౨ పం.) "అవిద్యాకర్మ సంజ్ఞాన్యా" (విష్ణు. ౬ అం. ౭ అ. ౬౧ శ్లో.) అని యిట్లు ఈ గ్రంథముననే "అవిద్యయనఁబడు కర్మము కలదు" అని చెప్పఁబడెను.

"క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి" (భ. గీ. ౧౩. అ. ౨ శ్లో.) ఈ మొదలగు శ్లోకమున "సర్వేశ్వరుఁడు అంతర్యామిగా సన్నింటికి నాత్మయగుటనుబట్టి (జీవాత్మ పరమాత్మల) కైక్యము' చెప్పఁబడెను. అట్లు కాకున్న, "క్షరస్సర్వాణి భూతాని కూటస్థో ఽక్షర ఉచ్యతే" (భ. గీ. ౧౫ అ. ౧౬ శ్లో.) "సమస్త భూతములు క్షరమని చెప్పఁబడుచున్నవి, కూటస్థుఁడు అక్షరమని చెప్పఁబడు చున్నాఁడు" అనియు, "ఉత్తమః పురుషస్త్వన్యః" (భ. గీ. ౧౫ అ. ౧౭ శ్లో.) (మఱియొక్క యుత్తమపురుషుఁడు పరమాత్మయని చెప్పఁబడుచున్నాఁడు) అనియు, నీ మొదలగు వానితో విరోధము సంభవించును. మఱియు "అన్తర్యామి రూపముగా సర్వేశ్వరుఁ డన్నింటికి నాత్మ" అని శ్రీ భగవద్గీతలయందు భగవంతుఁడు స్వయముగాఁ జెప్పియున్నాఁడు. ఎట్లన,

శ్లో॥ ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి॥

భ. గీ. ౧౮ అ. ౬౧ శ్లో॥

తా॥ ఓ యర్జునా! సర్వేశ్వరుఁడు సమస్త భూతములయొక్కయును హృదయమున నుండువాఁడు.

శ్లో॥ సర్వస్యచాహం హృదిసన్నివిష్టః (భ. గీ. ౧౫ అ. ౧౫ శ్లో॥)

తా॥ ఓ యర్జునా! నేను అందఱియొక్కయు హృదయమున నుండు వాఁడను.

ఈ యంశమునే "అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః" (భ. గీ. ౧౦ అ. ౨౦ శ్లో.) "ఓ యర్జునా! నేను సమస్తభూతములయందుండు

ఆత్మను" అనెడి శ్లోకము సయితము తెలుపుచున్నది. ఈ పై శ్లోకముల యందుండు "భూతశబ్దము" ఆత్మతోఁ గూడిన దేహమును తెలుపునది. ఇట్లు సర్వేశ్వరుఁడు అన్నిఁటికి నాత్మయయినందునను, అన్నియును సర్వేశ్వరునికి శరీర భూతములయినవి. కావుననే "న తదస్తి వినా యత్స్యాత్" (భ. గీ. ౧౦ అ ౩౯ శ్లో) (ఆ సర్వేరుఁడు లేనిది యేదియునులేదు) అని యిట్లు ప్రత్యేకముగానుండుట (అంతరాత్మయగు సర్వేశ్వరుఁడును శరీరభూతనులగు సమస్త పదార్థములును వేఱుగానుండుట) నిషేధింపఁబడియె. ఈ ప్రకరణము భగవంతుని విభూతులను గుఱించిన ప్రశంసను ముగించునదిగాన, అట్లే యంగీకరింపఁదగును. కనుకనే,

"శ్లో॥ యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా।
తత్త దేవావగచ్ఛత్వం మమ తేజోంశసంభవమ్॥
భ. గీ. ౧౦ అ. ౪౧ శ్లో॥

తా॥ ఓ యర్జునా! ఏ యే వస్తువు విభూతికలదైనను, శోభకలదైనను, బలము కలదైననగునో, దానినెల్ల నా తేజస్సుయొక్క యంశమునఁ బుట్టినదాని నిగాఁ దెలిసికొనుము.

శ్లో॥ విష్టభ్యాహమిదం కృత్స్న మేకాం శేన స్థితో జగత్ ॥
భ. గీ. ౧౦ అ. ౪౨ శ్లో॥

తా॥ ఓ యర్జునా! నేను ఈ జగత్తునంతయు నొక్కయంశమున పట్టి యున్నాఁడను." అని యిట్లు చెప్పఁబడియె.

కావున శాస్త్రిములయందెచటను నిర్విశేష వస్తువును ప్రతిపాదించి యుండలేదు. ఈ పదార్థజాతమంతయును భ్రాంతివశనఁ గల్పింపఁబడినదనియును ప్రతిపాదించి యుండలేదు. మఱియు చిదచిదీశ్వరుల స్వరూపములు వేఱుగానుం డుటయును, నిషేధింపఁబడి యుండలేదు. అనఁగా చిత్తును, అచిత్తును, ఈశ్వరుఁ డును వేఱువేఱు పదార్థములు కావనియును చెప్పియుండలేదు.

అద్వైతి:—పరిపాలకుఁడనియు, పరిపాలింపఁబడునది యనియు నిట్లు నానావిధములును, అనంతములును నగు భేదములతోఁ గూడియున్నట్టి యీ జగ మంతయును నిర్విశేషము స్వయంప్రకాశమును నగు బ్రహ్మమునందు దోషవశ మునఁ గల్పింపఁబడినది. అట్టి దోషము స్వరూపమునుఁ గప్పివేయునదియు, అనేక

విధములును విచిత్రములును నగు విక్షేపములఁ (అధ్యాసములఁ) జేయునదియు, సదసదనిర్వచనీయమును అనఁగా సత్తనకంటెను, అసత్తనకంటెను విలక్షణమైనదియు, అనాదియునునగు అవిద్యయే. "అనృతేన హి ప్రత్యూఢాః" (ఛా. ౮ ప్ర. 3 ఖ. ౨ వా) (అసత్యముచేతను అపహరింపఁబడిరి) ఈ మొదలగు శ్రుతి ప్రమాణములను బట్టియు, "తత్త్వమసి" (నీవు ఆ బ్రహ్మము) అనునది మొదలు గాఁగల శ్రుతులలోని సామానాధికరణ్యముచేఁ దెలియఁబడుచున్న జీవైక్యము (జీవులందఱు నొక్క బ్రహ్మమేయగుట) కుదరకపోవుటను బట్టియును అవిద్య యొక్కటి కలదని యంగీకరింపకతప్పదు. అట్టి యవిద్య సత్తును (వాస్తవముగ ఉన్నట్టిదియును) కాదు. ఏలన, అట్లైనపక్షమున, నది భ్రాంతిమాత్రమగుటయు, బాధింపఁబడుటయును సంభవింపకపోవును. అది యసత్తును (కుందేటి కొమ్ముల వంటి లేని పదార్థమును) కాదు. ఏలన, అట్లైనపక్షమున, ఖ్యాతియును (అది తెలియఁబడుటయును) బాధంబును (అది లేకపోవుటయును) సందర్భింపక పోవును. కావున సత్తుగాని అసత్తుగాని కానిది యవిద్యయని తత్త్వజ్ఞులు చెప్పుచున్నారు.

భాష్యకారులు:—ఇట్లు నీవుచేయు వాదము యుక్తమైనదికాదు. ఏలననిన, ఆ యవిద్య దేని నాశ్రయించియుండి భ్రాంతిని కలుగఁజేయుచున్నది? "జీవుని ఆశ్రయించి" అనియెదవా? అట్లు చెప్పఁదగదు ఏలన, జీవుఁడనఁబడునది (మీమతమున) యవిద్యచే కల్పింపఁబడినది కదా? "పరబ్రహ్మము నాశ్రయించి" అనియెదవా? అటులను చెప్పఁదగదు. ఏలననిన, పరబ్రహ్మము స్వయంప్రకాశమును జ్ఞానస్వరూపమును గదా! కావున నది యవిద్యకు విరుద్ధమైనది. మఱియు అవిద్య జ్ఞానముచే బాధింపఁబడు నట్టిదిగాను కదా యంగీకరింపఁబడినది. అట్లైన,

శ్లో॥ జ్ఞానరూపం పరం బ్రహ్మ తన్నివర్త్యం మృషాత్మకం।
అజ్ఞానంచే త్తిరస్కుర్యాత్కః ప్రభు స్తన్నివర్తకః॥
(శ్రీమన్నాథమునుల శ్రీసూక్తి)

తా॥ జ్ఞాననివర్త్యమును అసత్యమునునగు అజ్ఞానము జ్ఞానస్వరూపమగు పరబ్రహ్మమును తిరస్కరించునేని, యిఁక నా యజ్ఞానమును నివర్తింపఁగలది మఱియేమున్నది?

శ్లో॥ జ్ఞానం బ్రహ్మేతిచేత్ జ్ఞాన మజ్ఞానస్య నివర్తకం।
బ్రహ్మ వత్తత్ప్రకాశత్వాత్త దపి హ్యా నివర్తకం॥
(శ్రీమన్నాథమునుల శ్రీసూక్తి)

తా॥ "బ్రహ్మము జ్ఞానస్వరూపమైనది" అనెడి జ్ఞానము అజ్ఞానమును నివర్తింపఁజేయునంటి వేని బ్రహ్మమువలె నదిగూడ (బ్రహ్మమును గూర్చిన జ్ఞానమును) జ్ఞానమేకదా! కావున నదియును ఆ యజ్ఞానమును నివర్తింపదు.

శ్లో॥ జ్ఞానం బ్రహ్మేతి విజ్ఞానమస్తి చేత్స్యాత్ప్రమేయతా।
బ్రహ్మణోఽననుభూతిత్వం త్వదుక్త్యైవ ప్రసజ్యతే॥
(శ్రీమన్నాథమునుల శ్రీసూక్తి)

తా॥ "బ్రహ్మము జ్ఞానస్వరూపమైనది" యనెడి జ్ఞానము కలదేని బ్రహ్మము ప్రమేయము అనఁగా తెలియఁబడునది కావలయును. అట్లైన, మీరు చెప్పిన దానివలననే బ్రహ్మము అనుభూతికానిది యని ప్రసక్తించును.

అద్వైతి:—"బ్రహ్మము జ్ఞానస్వరూపము" అనెడి జ్ఞానము మాత్రమే ఆ యవిద్యను బాధించునదికాని బ్రహ్మస్వరూపమగు జ్ఞానము అట్టిదికాదు.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలన, ఈ రెండు జ్ఞానములును బ్రహ్మస్వరూపమును ప్రకాశింపఁజేయు విషయమై సమానము లయినవి. ఇట్లుండ, వానిలో నొక్కటి యవిద్యతో విరోధించునదగుటకును, వేఱొక్కటి యట్టిది కాక పోవుటకును విశేషమేదియును గానఁబడదు. ఇందలి ఫలితార్థమేమన్నను, "బ్రహ్మము జ్ఞానస్వరూపమైనది" యనెడి జ్ఞానముచేత బ్రహ్మము ఏస్వభావము గలదిగాఁ దెలియఁబడునో, ఆ స్వభావము, బ్రహ్మము స్వయంప్రకాశముగాన, స్వయముగానే ప్రకాశించును. కాఁబట్టి యవిద్యకు విరోధియగు విషయమై బ్రహ్మస్వరూపమునఁ గాని యట్టిస్వరూపమును గూర్చిన జ్ఞానమునఁగాని విశేషమేదియునులేదు. ఇంతేకాక స్వయముగ జ్ఞానస్వరూపమగు బ్రహ్మము, మీమతప్రకారము, వేఱొక జ్ఞానముచేఁ దెలుపఁదగినది కాదు. కావున మీమతమున అట్టి బ్రహ్మమును గూర్చిన జ్ఞానమే లేదు. కాఁబట్టి జ్ఞానము అజ్ఞానమునకు విరోధియగునేని, స్వయముగానే (జ్ఞానస్వరూపమగు బ్రహ్మమే) దానితో విరోధించును. అందువలన బ్రహ్మము అవిద్యకు (అజ్ఞానమునకు) ఆశ్రయమగుట యసంభవము.

ముత్తెపుచిప్ప మొదలగు పదార్థములన్ననో, తమయొక్క యథార్థస్వరూపమును ప్రకాశింపఁజేయుటకు స్వయముగా సమర్థములయినవి కావు. కావున నవి తమనుగుఱించిన యజ్ఞానముతో విరోధించునవి కావు. అందువలన నవి యట్టి యజ్ఞానమును పోఁగొట్టుటకై వేఱొక జ్ఞానమును అపేక్షించుచున్నవి. బ్రహ్మము తనజ్ఞానముచేతనే తన యథార్థస్వరూపమును ప్రకాశింపఁజేయునది. కావున నది తన్నుగుఱించిన యజ్ఞానముతో విరోధించునది. అందువలననే యది యట్టి యజ్ఞానమును నివర్తించుటకై వేఱొక జ్ఞానమును అపేక్షింపదు.

అద్వైతి:—"బ్రహ్మముతప్ప తక్కినదంతయును మిథ్య" అనెడి జ్ఞానము అజ్ఞానముతో విరోధించునది.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలన, "బ్రహ్మము తప్ప తక్కినదంతయును మిథ్య" అనెడి యీజ్ఞానము బ్రహ్మస్వరూపమును గుఱించిన యజ్ఞానముతో విరోధించునదా? లేక అది "ప్రపంచము సత్యము" అనెడి యజ్ఞానముతో విరోధించునదా? అట్టి జ్ఞానము బ్రహ్మ స్వరూపమును గుఱించిన యజ్ఞానముతో విరోధించునదని చెప్పఁదగదు. ఏలన, దాని విషయము దీని విషయము కాదు. [1]జ్ఞానంబును అజ్ఞానంబును ఏక విషయములయినఁగదా! విరోధము గలుగును. "ప్రపంచము మిథ్య" అనెడి జ్ఞానము "ప్రపంచము సత్యము" అనెడి యజ్ఞానముతో విరోధించును. అందువలన నట్టి జ్ఞానముచే "ప్రపంచము సత్యము" అనెడి యజ్ఞానము మాత్రమే బాధింపఁబడును. కావున బ్రహ్మస్వరూపమును గుఱించిన యజ్ఞానము ఉండనే యుండును.

అద్వైతి:—బ్రహ్మస్వరూపమును గుఱించిన యజ్ఞానమనఁగా "బ్రహ్మము సద్వితీయము (రెండవదానితోఁ గూడియుండునది)" అనెడి జ్ఞానము. అది "బ్రహ్మము తప్ప తక్కినదంతయు మిథ్య" అనెడి జ్ఞానముచే నివర్తింపఁబడునది. స్వరూపమో తన యనుభవముచేతనే ప్రకాశిత మగును.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలన, అద్వితీయమగుట బ్రహ్మము యొక్క స్వరూపముగదా. అట్టి స్వరూపము దాని జ్ఞానముచేతనే ప్రకాశిత

(1) ౧౨౧-వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧-వ వివరణమును చూడుము.

మగుచున్నది. కావున అట్టి జ్ఞానముతో విరోధించునదియు, సద్వితీయత్వరూప మునునగు అజ్ఞానమును, అట్టి యజ్ఞానము బాధింపఁబడునది యగుటయును లేక పోవలసివచ్చునే? ఒకవేళ అద్వితీయముగానుండుట బ్రహ్మముయొక్క ధర్మమని యెదవా? అట్లు చెప్పఁదగదు. ఏలన, జ్ఞానస్వరూపమగు బ్రహ్మమునకు జ్ఞానవే ద్యమయినదేదియును ధర్మము కాఁదగదని నీవే యింతకు పూర్వము ప్రతిపాదించి యుంటివే? (౬౯ పు. ౨౦ పం) కావున జ్ఞానస్వరూపమగు బ్రహ్మము అజ్ఞాన మున కాశ్రయమగుట విరుద్ధము. అందువలన బ్రహ్మము అజ్ఞానమున కాశ్రయ ము కాఁదగదు.

మఱియు ప్రకాశైక స్వరూపమగు బ్రహ్మము అవిద్యచే మూయఁబడు చున్నదని యద్వైతులు వాదించియున్నారు. అట్లైనపక్షమున, "బ్రహ్మస్వరూప మునకు నాశము గలదని" వాదించినట్లగును. ఏలన, ప్రకాశమును మూయుట యనఁగా ప్రకాశోత్పత్తికి ప్రతిబంధకమును గలుగఁజేయుటా? లేక ఉన్నట్టి ప్రకాశమునకు నాశమా? అది ప్రకాశముయొక్క యుత్పత్తిని ప్రతిబంధించుట యనిచెప్పఁదగదు. ఏలన, ఆ ప్రకాశము ఉత్పత్తిలేనిదిగాను కదా యంగీకరింపఁ బడినది. కావున, ప్రకాశమును మూయుట యనఁగా ప్రకాశముయొక్క నాశమే యని యొప్పుకొనవలయును

మఱియు "దేనికిన్ని విషయముకానిదియు, దేనినిన్ని ఆశ్రయించి యుం డనిదియు, స్వయంప్రకాశమును నగు అనుభూతి తన్ను ఆశ్రయించియున్నట్టి దోషవశమున తన్ను లెక్కలేని పదార్థముల నాశ్రయించి యుండునట్టి దానిని గాను, లెక్కలేనివానిచేఁ దెలియఁబడునట్టి దానినిగానును తెలిసికొనుచు న్నది" అని యిట్లు అద్వైతులు వాదించియున్నారు. అయితే యీ సంద ర్భమున తన్ను ఆశ్రయించియున్నట్టి దోషమనఁబడునది పరమార్థమైనదా? (వాస్తవముగా నున్నట్టిదా?) అపరమార్థమైనదా? (వాస్తవముగా లేనట్టిదా?) అది పరమార్థమైనదియని చెప్పఁదగదు. ఏలననిన, పరమార్థముగాను అట్టిది యొకటి కలదని యంగీకరించి యుండలేదు కదా! అది యపరమార్థమైనది యని యును చెప్పఁదగదు. ఏలననిన, అట్లైనపక్షమున, అది "ద్రష్ట(=తెలిసికొనునది" గాను కాని, "దృశ్య" తెలియఁబడునది గాను కాని "దృశి=జ్ఞానము" గాను

కాని యుండి యుండవలయునని యంగీకరింపవలసి వచ్చును. అది జ్ఞానస్వరూప ముగా నుండునదని చెప్పఁదగదు. ఏలననిన, జ్ఞానస్వరూపమునకంటెను అనఁగా బ్రహ్మస్వరూపమగు జ్ఞానమునకంటెను వేఱొకజ్ఞానము ఉన్నట్లు మీ రంగీకరించి యుండలేదు గదా? అట్లు వేఱొక జ్ఞానము కలదనియంగీకరించియుండకపోయి నను, మీరంగీకరించిన జ్ఞానమేది కలదో, అదియే దోషమనియెదవా? అట్లు చెప్పఁదగదు. ఏలన, జగత్తనఁబడు భ్రాంతికి యాధారభూతమగు బ్రహ్మముయొక్క స్వరూపమగు జ్ఞానమే యట్టి దోషమగు పక్షమున, దోషము అపరమార్థము కావున, నట్టి జ్ఞానమును అపరమార్థమని యంగీకరింపవలసివచ్చును. అట్లంగీక రించిన పక్షమున, [1]మాధ్యమికులనంబడు బౌద్ధులుచేయు వాదము ప్రసక్తిం చును. ఈ హేతువునుబట్టియే జ్ఞానము అపరమార్థమని మీమతమున నంగీకరించి యుండలేదు. ఇంతేకాక “తెలిసికొనునది” “తెలియఁబడునది” వానితో సం బంధించిన “తెలివి” యిదియంతయును భ్రాంతివశమున కల్పింపఁబడినదని గదా మీమతస్థులు చెప్పుచున్నారు. ఇట్టి కల్పన గలుగుటకు నయితము మూలకార ణముగా నొక దోషముండి యుండవలయునే? ఇట్లు దోషముల కొకవ్యవస్థ లేక పోవును. అందువలన ఈ వాదము [2]అనవస్థాదోషము గలదియగునే? ఈ దోష మును పరిహరించుటకై సత్యజ్ఞానస్వరూపమగు బ్రహ్మమే యట్టి దోషమనియె దవా? అట్లంటివేని ఆ బ్రహ్మరూపమగు దోషమునుండియే “జగత్తు” అనెడి జ్ఞాన

(1) బౌద్ధులలో మాధ్యమికులు, యోగాచారులు, సౌత్రాంతికులు, వైభాషికులు అను నాలుగు తెగలవారు కలరు. వారిలో మాధ్యమికులు సర్వ శూన్యవాదులు. మొదటి యిద్దరు జ్ఞాన జ్ఞేయములను, మూఁడవవారు జ్ఞానమాత్రమును, క్షణికముగానైనను కలదందురు వీరేదియు కల దనియైనను చెప్పక యన్నియును శూన్యమందురు. సత్తు, అసత్తు, సదసత్తు, సదసద్విలక్షణము, అని నాలుగు పక్షములు కలవు. ప్రతీతిచే నుత్పన్నమైనది సత్తు. నష్టమై యుత్పన్నము కాఁబోవునది అసత్తు. రెండునైనది సదసత్తు. రెండునుగానిది సదసద్విలక్షణము. తత్త్వమేది? సత్తా? పూర్వమే సత్తయిన దానికి ఉత్పత్తివలని ప్రయోజనము లేదుగాన నది తత్త్వము గానేరదు. అసత్తా? అది పుట్టియు నసత్తేయగుటచే నుత్పత్తి ప్రయోజనములేదుగాన నదియు తత్త్వముకాదు. సదసత్తా? సత్తును. అస త్తును పరస్పర విరుద్ధము లగుటచే రెంటికిని తాదాత్మ్యము కలుగదు అనఁగా ఒకటి మఱియొకటి కానేరదు. కనుక నదియును తత్త్వము కాఁదు. సదసద్విలక్షణమా? ఇది వ్యవహారమాత్ర సత్య మగుటచే భ్రాంతికల్పితమే యగును గాన నిదియును తత్త్వముకాదు. కనుక నీ నాలుగు పక్షముల లోను యసత్తుచ్ఛమనఁబడు శూన్యమే తత్త్వమని మాధ్యమికుల వాదము.

(2) ౭౦ వ పత్రముయొక్క క్రిందిభాగమున నీయఁబడిన ౧ వ వివరణమును చూఁడుము.

ముగలుగుచున్నదనుకొనుము. ఇట్లుండ జగత్తునంటిదియగు (జగత్తువలె అపరమార్థభూతమగు) వేఱొక దోషమును కల్పించినందువలన ప్రయోజనమేమి ? మఱియు అట్లు బ్రహ్మమే దోషమంటివేని, బ్రహ్మము నిత్యమైనదిగాన దోషమును నిత్యమైనదియే యగును. అట్లైనచో, బ్రహ్మమునకీ దోషమునుండి యెన్నఁడును విడుదల లేకపోవును. కావున, బ్రహ్మమునకంటెను వేఱుగాఁ దోషమనఁబడునది యొక్కటి కలదని యెంతవఱకు మీరంగీకరింపరో, అంతవఱకు భ్రాంతియనఁబడునది యొక్కటి కలదని యుపపాదింప నేరరు.

అవిద్య సదసదనిర్వచనీయమంటిరే ? ఆతావున "అనిర్వచనీయ" మనఁగా మీయభిప్రాయమేమి ?

అద్వైతి :—సత్తుకంటెను అసత్తుకంటెను విలక్షణమైనదియగుట.

భాష్యకారులు :—అవ్విధమగు వస్తువును తెలుపునట్టి ప్రమాణ మేదియును లేదు. కావున, నది యనిర్వచ నీయమైనదియే (ఇట్టిది యని చెప్ప నశక్యమైనదియే) యగును. ఇందు ఫలితార్థమేమన్నను, లోకమునందుండు సమస్త పదార్థములును అవి తెలియవచ్చు విధమునుబట్టి "ఈ పదార్థము ఇట్టిది ఈ పదార్థము ఇట్టిది" అనెడి యొక వ్యవస్థ గలవి యగుచున్నవి.

[1]లోకమున సమస్తమయిన తెలివియు సదాకారముగాను గాని అసదాకారముగాను గాని కలదు. సదసదాకారమగు తెలివికై సదసద్విలక్షణమగునది

---

(1) లోకమున పదార్థములు తెలియవచ్చురీతిని బట్టి "ఈ పదార్థము ఇట్టిది ఈ పదార్థము ఇట్టిది" అనెడి యొక వ్యవస్థ గలుగుచున్నది. ఉదాహరణము—ఏదైన నొక పదార్థము తెల్లనిదిగాఁ దెలియవచ్చునట్లైన నది తెల్లనిదని తెలిసికొనుచున్నాము. ఏదైన నొక్కటి నల్లనిదిగాఁ దెలియవచ్చునట్లైన, అది నల్లనిదని తెలిసికొనుచున్నాము. లోకమున సామాన్యముగా పదార్థము లన్నియును రెండువిధములుగాఁ దెలియవచ్చుచున్నవి. ఎట్లన, కొన్నిపదార్థములు అనఁగా ఘటపటాదులు సద్రూపములుగాఁ (ఉన్నట్టివిగాఁ) దెలియవచ్చుచున్నవి. మఱికొన్ని పదార్థములు అనఁగా కుందేటికొమ్ము మొదలగునవి అసద్రూపములుగాఁ (లేనట్టివిగాఁ) దెలియవచ్చుచున్నవి. కావున జ్ఞానమున్ను సదాకారముగాను అసదాకారముగాను నిట్లు ద్వివిధముగా నున్నది. ఆ రెండువిధములగు జ్ఞానములలో సదాకారమగు జ్ఞానమునకు సద్రూపమైనది మాత్రమే విషయము కాఁదగును. అసదాకారమగు జ్ఞానమునకు అసద్రూపమైనదిమాత్రమే విషయము కాఁదగును, ఇట్లుండ, ఈ సదసదాకారమైన జ్ఞానమునకు సదసద్విలక్షణమైనది విషయమంటివేని, ఈపైని గనఁబఱచిన నియమమునకు భంగము గలుగును. అందువలన అట్టి నియమమే లేకుండపోవును. అందుమూలముగా నన్నివిధములగు పదార్థములును అన్నివిధములయిన జ్ఞానములకును విషయము కావలసివచ్చును. ఇది స్వభావ విరుద్ధము.

విషయమని యంగీకరించుపక్షమున సర్వమును సర్వవిధమైన తెలివికిని విషయము కావలసివచ్చునే?

అద్వైతి:—వస్తు స్వరూపమును గప్పివేయునదియు, [1]ఆన్తరములనియు, బాహ్యములనియు నిర్విధముగ నానావిధములగు నట్టి యధ్యాసములను (మిథ్యారోపములను) గలుగఁజేయునదియు, సత్పదార్థముగాని అసత్పదార్థముగాని కానిదియు, అవిద్యయనియు అజ్ఞానమనియు నీ మొదలగు శబ్దములచే వ్యవహరింపఁబడునదియు, వస్తువుయొక్క యథార్థస్వరూపమును గుఱించిన జ్ఞానముచే నివర్తింపఁబడునదియు, [2]జ్ఞానప్రాగభావము కాకుండ వేఱుగ భావరూపమేయగు నొక్కవస్తువు ప్రత్యక్షానుమాన ప్రమాణములచే దెలియవచ్చుచున్నది. [3]అధ్యాసము (మిథ్యారోపము) అట్టి యవిద్యచే మూయఁబడినదియగు బ్రహ్మమే ఉపాదానముగాఁ (కారణముగాఁ) గలది. అది వికారరహితమును, స్వయంప్రకాశమును, జ్ఞానమాత్రశరీరమును, ఆ యవిద్యచే అచ్ఛాదింపఁబడిన స్వరూపము గలదియును, ప్రత్యక్కును (అంతరమును) నగు ఆత్మయందు గలిగెడి "నేను" "ఇది తెలివి" "ఇది తెలియఁబడునది" అనెడి విభాగంబు స్వరూపముగాఁ గలది. [4]అట్టి దోషముననే గలుగునదియగు నవస్థాభేదముచే (బ్రహ్మమున) నధ్యస్తమైనట్టి యీ ప్రపంచమునందు జ్ఞాన బాధ్యమును, సర్పరజతాది పదార్థ స్వరూపమును, వానినిగుఱించిన జ్ఞానమే స్వరూపముగాఁగల యధ్యాసము నయితము గలుగుచున్నది. మిథ్యాభూతమగునట్టి యీ సమస్త ప్రపంచమునకును మిథ్యాభూతమగునట్టి యీ యవిద్యయే కారణము కాఁదగును. ఏలన, అసత్యమగు వస్తువునకు అసత్యమైనదియే కారణముకాఁదగు ననెడి హేతుబలమునుబట్టి యిట్లు తెలియఁబడుచున్నది.

---

(1) అహంకారమును అజ్ఞానమును ఆంతరాధ్యాసములు. తెలియఁబడునది యంతయును బాహ్యాధ్యాసము.

(2) ౧౨౧ వ పత్రముయొక్క క్రిందిభాగమున నీయఁబడిన ౨ వ వివరణమును చూడుము.

(3) ౧౩౯ వ పత్రముయొక్క క్రిందిభాగమున నీయఁబడిన 3 వ వివరణమును చూడుము.

(4) భ్రాంతివశమున రజ్జువు సర్పముగాను, ముత్యపుచిప్ప రజతముగానును తెలియవచ్చు రీతిని; దోషవశమున బ్రహ్మమునం దారోపింపఁబడినట్టి యీ జగమునందు ఘటపటాది పదార్థములును వానిని గుఱించిన జ్ఞానములును తెలియవచ్చుచున్నవి.

భాష్యకారులు :—కారణభూతమగునట్టి యీ యజ్ఞానమును దెలియఁ బఱచు ప్రత్యక్షమేది ?

అద్వైతి :— “ నేను అజ్ఞుఁడను, నన్నును ఇతరునిఁ గూడ ఎఱుఁగను ” అనెడి యపరోక్షమగు (ప్రత్యక్షమగు) తెలివియే అట్టి యజ్ఞానమును దెలియఁబఱచునది. ఇది జ్ఞాన ప్రాగభావమును తెలుపునది కాదు. ఏలన, అది (జ్ఞానప్రాగభావము) [1]అనుపలబ్ధి ప్రమాణముచేఁ దెలుపఁదగినది. ఇది (నేను అజ్ఞుఁడను అనునది) యన్ననో, “ నేను సుఖవంతుఁడను ” అనునదివలెనే ప్రత్యక్షసిద్ధము. ఒకవేళ ప్రత్యక్షము అభావమును తెలుపునది యని యంగీకరించినను, ఈ యనుభవము ఆత్మయందు జ్ఞానము లేకపోవుటను తెలుపునదికాదు. ఏలననిన, అట్టి యనుభవము కలుగునపుడు జ్ఞానము కలదు. అప్పుడు జ్ఞానమే లేనట్లైన, జ్ఞానములేదని తెలియుట యసంభవమగును. ఈ విషయమే ఈ క్రింద వివరింపఁ బడుచున్నది :—

“ నేను అజ్ఞుఁడను ” అని యిట్లెఱుఁగువానికి “ నేను ” అనఁబడు ఆత్మ జ్ఞానాభావ విశిష్టమయినదిగాను, జ్ఞానము అట్టి జ్ఞానాభావమునకు ప్రతియోగిగానును తెలియవచ్చుచున్నవా ? లేక అవి యట్లు తెలియ వచ్చుచుండలేదా ? అవి యట్లు తెలియవచ్చుచున్న వంటివేని, అప్పుడు వానినట్లు తెలుపునదియగు జ్ఞానముకలదుగాన, అట్టి సమయముననే జ్ఞానాభావము సయితముండుట విరుద్ధము. అవి యట్లు తెలియవచ్చుచుండ లేదంటివేని, జ్ఞానాభావము తెలియవచ్చుట యనునది యట్టి [2]జ్ఞానాభావవిశిష్టమగు వస్తువును (ఆత్మను) గుఱించిన జ్ఞానమును బట్టియు, అట్టి జ్ఞానాభావము యొక్క [3]ప్రతియోగిని గుఱించిన జ్ఞానమును బట్టియును కలుగునది. కావున, ఈ రెండును తెలియరానిపక్షమున, జ్ఞానాభావము తెలియవచ్చుట యెంతమాత్రము సంభవింపదు. జ్ఞానాభావము అనుమాన ప్రమాణముచేఁ దెలుపఁబడునది యనెడి పక్షమునను, అభావమనఁబడు ప్రమా

---

(1) ౨౫౪ వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయంబడిన 3 వ వివరణమును చూఁడుము.

(2) ఏది దేని కాశ్రయమో ఆ యాశ్రయము తెలియక ఆ పదార్థము తెలియరాదు. దృష్టాంతము—ఎవ్వఁడు ఏ యాశ్రయమున నుండువాఁడో వాని యాశ్రయము తెలియక వాఁడు తెలియరాఁడు. అట్లే జ్ఞానాభావమున కాశ్రయమగు ఆత్మ తెలియరాక దానియందుండు జ్ఞానాభావము తెలియరాదు.

(3) ఏదైన నొక్క పదార్థముయొక్క లేమి యా పదార్థముయొక్క యభావ మనఁబడును. ఆ పదార్థము దాని యభావమునకు ప్రతియోగి యనఁబడును. దృష్టాంతము—ఘటముయొక్క లేమి ఘటాభావము. ఘటము ఘటాభావముయొక్క ప్రతియోగి. ఘటాభావమును తెలిసికొన వలయునన్న ముందుగ ఘటమనఁగా నెట్టిదో యెఱింగియుండవలయును. ఘటమనఁగా నెట్టిదో తెలియనివాఁడు ఘటాభావము నెఱుంగఁజాలఁడు. అట్లే జ్ఞానాభావము నెఱుంగవలయునన్న దాని ప్రతియోగిని అనఁగా జ్ఞానమనఁగా నెట్టిదో యెఱింగియుండవలయును. అట్లు కాకున్న, జ్ఞానాభావము తెలియరాదని యభిప్రాయము.

ణముచేఁ దెలుపఁబడునది యనెడి పక్షముననను, ఈపైని గనఁబఱచిన యసంభవము సమానమే.

కాఁబట్టి యజ్ఞానము భావరూపమైనదని యంగీకరించుపక్షమున, ఈపైని గనఁబఱచిన ప్రకారము అజ్ఞానవిశిష్టమగు "నేను" అనఁబడు ఆత్మను గుఱించి నజ్ఞానమును, అట్టి యజ్ఞానముయొక్క ప్రతియోగిని గుఱించిన జ్ఞానమును ఉన్నప్పటికిని విరోధములేదు. అందువలన "నేను అజ్ఞుఁడను" అనెడి యనుభవము భావరూపమగు అజ్ఞానమును గుఱించినదియే యని యంగీకరింపవలయును.

భాష్యకారులు:—అజ్ఞానము భావరూపమే యయినను, అది వస్తుయాథాత్మ్యమును తెలుపునదియగు [1]సాక్షిచైతన్యముతో విరోధించునే?

---

(1) "బ్రహ్మ మొక కేవలచైతన్యమహాసముద్రమువంటిది అంతట నిండి యేకమై మహాకాశముంఁగా ఘటాకాశము, మఠాకాశము అను భేదములు స్వరూపసిద్ధములుకాక ఘటమఠము లనెడి యుపాధులచే నెట్లుగలుగునో, అఖండశుద్ధచైతన్యమును అట్లే యజ్ఞానోపాధిచే పెక్కులై తోఁచును గాని స్వరూపముచేఁగాదు. ఇట్లు చైతన్యరూపమైన బ్రహ్మము - శుద్ధచైతన్యము, మాయావచ్ఛిన్న చైతన్యము, అంతఃకరణావచ్ఛిన్న చైతన్యము, వృత్త్యవచ్ఛిన్న చైతన్యము, విషయావచ్ఛిన్న చైతన్యము అని యైదువిధములగును. అజ్ఞానము-శుద్ధసత్త్వప్రధానము, మలినసత్త్వప్రధానము, తమఃప్రధానము, అని త్రివిధము. శుద్ధసత్త్వప్రధానమునకు మాయ యనిపేరు. దీనిని ఉపాధిగాఁ గల చైతన్య మీశ్వరుఁడనఁబడును. ఆ మాయ 'అజామేకామ్' అన్నట్లు యేకమగుటచే తదుపహితుఁడైన యీశ్వరుఁడు నొక్కఁడే. ఇతఁడె మాయావచ్ఛిన్నచైతన్య మనఁబడును. మలినసత్త్వ ప్రధానమైనది యవిద్య యనఁబడును. దీని నుపాధిగాఁగల చైతన్యము జీవుఁ డనఁబడును. ఈ జీవోపాధియె యవిద్య యనఁబడును. ఈయవిద్యలు 'ఇంద్రోమాయాభిః పురురూప ఈయతే' అన్నట్లు వేఱువేఱు పెక్కు లగుటచే తదుపహితులైన జీవులును పెక్కులగుదురు. ఈశ్వరుఁ డుపాధిని వశము చేసికొనును. జీవుఁడు తన యుపాధికి లోనైయుండును. జీవులయం దొక్కొక్కరికిఁదోఁచు జ్ఞానసుఖాదులు తక్కినవారికిఁ దోఁపకుండుటకు వారి యవిద్యలు వేఱువేఱగుటయే కారణము. ఇందులకు సాంఖ్యమున విషయోపరాగమును, న్యాయమున మనస్సుయొక్క అణుత్వమును గారణములనఁబడినవి. జీవుఁడె అంతఃకరణావచ్ఛిన్న చైతన్య మనఁబడును. ఆకాశగతసూర్యతేజంబులు తటాకాదులయందు ప్రతిబింబించునట్లు తేజోమయ బ్రహ్మచైతన్యము అవిద్యాపరిణామములైన యంతఃకరణంబులం బ్రతిబింబించును. బింబప్రతిబింబంబులు స్వరూపమున వేఱుగానియట్లు బ్రహ్మమును జీవులును స్వరూపభిన్నులు గారు."

ఈ యంశముననే శ్రీ విద్యారణ్య స్వాములవారిట్లు వేఱొక విధమున దృష్టాంతముచేఁ బ్రతిపాదించి యున్నారు.

"చిత్రపటమునకుంబోలె బ్రహ్మమునకును నాలుగవస్థలు గలవు. మొదట శుద్ధమైన వస్త్రమునందు అన్నరసము చరిమి గట్టనవైచి యావల మసిరాచి పిదపఁ జిత్రములు వ్రాయఁబడును. ఇట్లే శుద్ధచైతన్యము మొదట మాయయనెడి యన్నరసము సంబంధముచే నంతర్యామిత్వమును బొంది, సూక్ష్మసృష్టి యనెడి మసిచే సూత్రాత్మత్వమునుబొంది, స్థూలసృష్టియనెడి చిత్రముల సంబంధముచేత విరాడ్రూపమును బొందుచున్నది. ఇతనికి జగత్కర్తృత్వాదులు మాయాకల్పితములు."

ఈపైని గనఁబఱచిన ప్రకారము ఎవ్విధమైన యుపాధితోను సంబంధము లేనిదియు, గుణములు లేనిదియు కేవలమును నగు చైతన్యము సాక్షి చైతన్య మనఁబడును. "సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ" అనెడి శాస్త్రమును అట్లే చెప్పుచున్నది. ఇట్లు అద్వైతులు చెప్పుదురు.

అద్వైతి :—సాక్షిచైతన్యము వస్తుయాథాత్మ్యమును తెలుపునది కాదు. మఱియేమన్నను, అది యజ్ఞానమును గాన్పించునది. అట్లుకాకున్న, [1]మిథ్యాభూతములగు పదార్థములు తెలియవచ్చుట యసంభవమగును. అజ్ఞానమును తెలుపునట్టి యీ జ్ఞానము (సాక్షిచైతన్యము) అజ్ఞానమునే నివర్తింపదు గదా. కావున (ఈ రెంటికిని) విరోధము లేదు.

భాష్యకారులు :—అజ్ఞానము భావరూపమైనదియే కానిమ్ము. అయినను సాక్షిచైతన్యముచేఁ దెలుపఁబడునప్పుడు, అది, తదితరవైలక్షణ్యపూర్వకముగాఁ దానిని దెలుపునట్టి విషయముతోఁ గూడినట్టిది గానే కదా తేలుపఁబడవలయును! దాని నట్లు తెలుపు విషయమన్ననో, (మీ మతప్రకారము), ప్రమాణ గోచరమైనది కాదు. కావున అజ్ఞానము "నేను అజ్ఞుఁడను" అని యిట్లు "నేను" అనఁబడు ఆత్మచేఁ దెలుపఁబడునది ఇట్లుండ అది సాక్షిచైతన్యముచే నెట్లు తెలుపఁబడఁగలదు ?

అద్వైతి :—ఇది యొక దోషము కాదు. పదార్థ సమూహ మెల్లను జ్ఞానమునకు విషయమైనదిగాను గాని, జ్ఞానమునకు విషయము కానిది గాను గాని, సాక్షిచైతన్యముచేఁ దెలుపఁబడదగును. జడములగుటచే జ్ఞానవిషయములుగాఁ దెలియవచ్చునట్టి వాని విషయమై మాత్రమే ప్రమాణసహాయ మపేక్షితము. అజడమగు ప్రత్యగ్వస్తువన్ననో (ఆత్మయన్ననో) స్వయంప్రకాశము గాన, అది తన్ను ప్రకాశింపఁజేయుటకై ప్రమాణముయొక్క సహాయము నపేక్షింపదు. కావున అన్ని తావులను అట్టి యాత్మ తనంతట తానే తెలియవచ్చునదై యజ్ఞానమును తెలుపునదియగుట సంభవమే. అందువలన యుక్తుల సహాయముతోఁ గూడియున్నట్టి ప్రత్యక్షప్రమాణమువలన అజ్ఞానము భావరూపమైనదిగానే తెలియవచ్చుచున్నది. ఇట్టి భావరూపమగు అజ్ఞానము అనుమాన ప్రమాణమువలన నయితము సిద్ధించును. ఎట్లన, అనుమాన ప్రయోగము :—

ప్రతిజ్ఞ :—వివాదవిషయమగు ప్రమాణజ్ఞానము, తన ప్రాగభావము కానిదియు తన విషయమును ఆవరించునదియు తనచేత నివర్తింపఁబడునదియు తన ప్రదేశమునసుండునదియునునగు మఱియొక్క వస్తువును, తనకు పూర్వమున్న దానినిగాఁ గలిగి యున్నది.

హేతువు :—ప్రకాశింపని వస్తువును ప్రకాశింపఁ జేయునదియగుటవలన.

ఉదాహరణము :—చీఁకటిలో మొదట గలిగిన దీపపు వెలుఁగువలెనే.

---

(1) సాక్షి చైతన్యము యెల్లప్పుడును పదార్థముల యదార్థ స్వరూపమును తెలుపునట్టిది యగు పక్షమున, ఎల్లకాలమును పదార్థములు యదార్థస్వరూపముతోనే తెలియ రావలయును గాని, మిథ్యాభూతమగు స్వరూపముతో నెన్నఁడును తెలియరాకుండ వలసి వచ్చును. లోకమున నట్లు లేదే! యని అభిప్రాయము.

భాష్యకారులు :—చీఁకటి యనఁగా వెలుఁగులేకుండుట గాని, రూపము గానరాకుండుట గాని, కాఁదగును. అయితే అది యొక ద్రవ్యము (వస్తువు) కాదే? కావున అది భావరూపమగు అజ్ఞానమును నిరూపించుటకు ఉదాహరణముగా నెట్లుపయోగించును ?

అద్వైతి :—చెప్పెదను. దట్టముగానుండుట, పలుచగానుండుట మొదలగు అవస్థలను గలిగియుండుట వలనను, రూపము కలదిగాఁ దెలియఁబడుచుండుట వలనను చీఁకటియును యొక్క ద్రవ్యమే. కావున దోషము లేదు.

భాష్యకారులు :—ఇందులకు ఉత్తరము ఇట్లు చెప్పఁబడు చున్నది—"నేను అజ్ఞుఁడను, నన్నును ఇతరునిఁగూడ ఎఱుఁగను" అనెడి యనుభవము గలుగునప్పుడు, ఉపపత్తి గలదియును కేవలమగు ప్రత్యక్షముచే భావరూపమగు అజ్ఞానము తెలుపఁబడదు. అజ్ఞానము జ్ఞానప్రాగభావరూపమగు పక్షమున గాన్పింపఁబడినట్టి విరోధము అది భావరూపమగు పక్షమునను సమానమే. అది యెట్లన, అజ్ఞానమునకు విషయముగాను ఆశ్రయముగానునై యజ్ఞానమును తదితరవైలక్షణ్యముతోఁ దెలువునది యగుచు "నేను" అనఁబడునది యిప్పుడు ప్రకాశించుచున్నదా ? లేదా ? అది ప్రకాశించు చున్నదంటివేని, దాని స్వరూపమును గుఱించిన జ్ఞానముచే నివర్తింపఁబడు నదియగు అజ్ఞానము అది ప్రకాశించుచుండగా, ఎట్లుండగలదు ? అది ప్రకాశించుచుండ లేదంటివేని, అజ్ఞానమును తదితరవైలక్షణ్యముతోఁ దెలువునదియు, అజ్ఞానమున కాశ్రయమైనదియునగు నది (ఆత్మ) తెలియఁబడకనే అజ్ఞాన మెట్లు తెలియఁ బడగలదు ?

అద్వైతి :—విశదముగా (ఆత్మ) స్వరూపము తెలియఁబడుటగదా అజ్ఞానమునకు విరోధియైనది. ప్రకృతముననో, అజ్ఞాన ముండుటంజేసి ఆత్మస్వరూపము విశదముగాఁ దెలియఁబడుచుండ లేదు. కాఁబట్టి (అజ్ఞానముయొక్క) ఆశ్రయమును విషయమును నగునది (ఆత్మ) తెలియఁబడినను, అజ్ఞానము తెలియఁబడుటకు యెవ్విధమైన విరోధమును లేదు.

భాష్యకారులు :—అట్లైన, [1]అజ్ఞానము జ్ఞానప్రాగభావరూప మైనదన్నను, భాధక మేదియును లేదే? ఏలననిన, విశదమైన స్వరూపమును గూర్చిన జ్ఞానముగదా జ్ఞానప్రాగభావముతో విరోధించునది. అజ్ఞానముయొక్క ఆశ్రయమును గుఱించినదియు దానిప్రతియోగిని గుఱించినదియునగు జ్ఞానము ఆత్మస్వరూపమును అస్పష్టముగాఁ దెలువునది. కావున నీయొక్క పట్టుదలే తప్ప మన యిద్దఱి పక్షములకును విశేష మేదియును లేదు.

(1) ఆశ్రయ ప్రతియోగులను గుఱించిన విశదమైన జ్ఞానముగదా జ్ఞాన ప్రాగభావమునకు విరుద్ధమైనది. వానినిగుఱించి యట్టి విశదమైన జ్ఞానములేనందున, అజ్ఞానము ప్రాగభావరూపమన్నను బాధకము లేదని భావము.

అజ్ఞానము ప్రాగభావరూపమైనను, లేక భావరూపమైనను, అది "అజ్ఞానము = జ్ఞానములేమి" అనియే కదా [1]శబ్దార్థమును బట్టి తెలియవచ్చును. కావున ప్రాగభావమువలెనే భావరూపాజ్ఞానము సయితము తాను తెలియవచ్చుటకై వేఱొక దాని సహాయము నపేక్షించునది. అది యెట్లనిన, అజ్ఞానమనఁగా జ్ఞానములేకుండుటా? జ్ఞానము కానిదా? జ్ఞానవిరోధియా? అజ్ఞానమనంబడునది యీ మూఁడింటిలో నేదియైనను, అది తెలియవలయునన్న, జ్ఞానస్వరూపము తెలిసి యుండుట యావశ్యకము.

సామాన్యముగా చీఁకటియొక్క స్వరూపమును తెలిసికొనునప్పుడు వెలుఁగు తెలియవలసిన యపేక్ష లేకపోయినను, వెలుఁగునకు విరోధియగునది యగు నాకారముతో (చీఁకటిఁ) దెలిసి కొనునప్పుడు, వెలుఁగు తెలియవలసిన యపేక్ష కలిగియే యున్నది.

మీ రంగీకరించిన యజ్ఞానమో, ఎన్నఁడును స్వరూపముచే అనఁగా ఇట్టిదియని సిద్ధింపదు. మఱి యెట్లన్నను, అజ్ఞానమనియే సిద్ధించుచున్నది. అయితే జ్ఞానాభావమునకు వలెనే దాని (జ్ఞానముయొక్క) యపేక్షకలిగి యుండుట సమానము. జ్ఞాన ప్రాగభావమో మీచేతఁగూడ అంగీకరింపఁ బడుచున్నది. తెలియఁ బడుచును ఉన్నది, కావున మన యిద్దఱిచే నంగీకరింపఁబడిన జ్ఞానప్రాగభావమే "నేను అజ్ఞుఁడను నన్ను నితరునిఁగూడ ఎఱుంగను" అని యిట్లు తెలియ వచ్చుచున్నదని యంగీకరింప వలసినది.

నిత్యమును, సంసారసంబంధములేనిదియును, స్వయం ప్రకాశమును, జ్ఞానైకస్వరూపమును నగు బ్రహ్మము అజ్ఞానము ననుభవించుట యసంభవము. బ్రహ్మము తన యనుభవమే స్వరూపముగాఁ గలది కదా!

అద్వైతి:—బ్రహ్మము తన యనుభవమే స్వరూపముగాఁగలదియైనను, తిరోహిత (మాయఁబడిన) స్వరూపముకలదై యజ్ఞానమును అనుభవించుచున్నది.

భాష్యకారులు:—తిరోహితమైన స్వరూపముగలది యనఁగానేమి?

అద్వైతి:— ప్రకాశింపని స్వరూపము గలదియగుట.

భాష్యకారులు:—తన యనుభవమే స్వరూపముగాఁగలది ప్రకాశింపని స్వరూపము గలదియగుట యెట్లు సంభవము?

అద్వైతి:— తన యనుభవమే స్వరూపముగాఁ గలదియైనను, వేఱొక దానిమూలముగాఁ బ్రకాశింపని స్వరూపముగలది కావచ్చును.

---

(1) అజ్ఞానమనఁగా రెండర్థములు గలవు. జ్ఞానము లేకపోవుట యజ్ఞానమని కొందఱి యభిప్రాయము. ఇదియే అభావరూపమైన యజ్ఞానమని శాస్త్రకారులు వ్యవహరింతురు. అజ్ఞాన మనఁగా జ్ఞానేతరమైనట్టి యొక పదార్థమని కొందఱు తలంచుచున్నారు. ఇదియే భావరూపమైన యజ్ఞానమని శాస్త్రమున వ్యవహరింపఁబడును.

భాష్యకారులు :—అట్లా! ప్రకాశ మనఁబడు దానిని యొక ధర్మముగా మీ రంగీకరించి యుండ లేదు. (౯౬ పు. ౨౫ పం.) అయితే మీ మతమున ప్రకాశమే స్వరూపము. కావున ఈపైనిచెప్పిన ప్రకారము వేఱొక దానిమూలముగా స్వరూపనాశమే గలుగవలసివచ్చునని యింతకు పూర్వమే చెప్పఁబడియె.

ఇంతియెకాక, ఈ వాదమున అన్యోన్యాశ్రయదోషము సయితము కలదు: ఎట్లన,—బ్రహ్మస్వరూపముయొక్క తిరోధానమునకు హేతుభూతమగు నట్టి యజ్ఞానము తాను స్వయముగ బ్రహ్మముచే ననుభవింపఁబడిన తరువాతను గదా, బ్రహ్మమును తిరస్కరింపవలయును? అది బ్రహ్మమును తిరస్కరించిన పైని గదా బ్రహ్మముయొక్క అనుభవమునకు విషయము కావలయును?

అద్వైతి :—అజ్ఞానము బ్రహ్మముచే ననుభవింపఁబడినదై యే బ్రహ్మమును తిరస్కరించుచున్నది.

భాష్యకారులు :—తన స్వరూపము తిరోహితము కాక యే బ్రహ్మము అజ్ఞానమును అనుభవించు పక్షమున, తిరోధానము నొకదానిని కల్పించుట నిష్ప్రయోజన మగును. అజ్ఞాన స్వరూపమును గుఱించిన కల్పనయును నిష్ప్రయోజన మగును. ఏలననిన, బ్రహ్మమునకు అజ్ఞానానుభవ మెట్లు సంభవమో అట్లే, యీ యజ్ఞానమువలనఁ గలిగినదిగా నంగీకరింపఁబడిన ప్రపంచమును గుఱించిన యనుభవమును సంభవమే.

ఇంతియెకాక, బ్రహ్మమునకు అజ్ఞానానుభవము స్వయముగానే గలుగునదా? లేక అది వేఱొకదానివలనఁ గలుగునదా? స్వయముగానే గలుగునది యంటివేని, యది యతనికి స్వభావసిద్ధమేగాన, బ్రహ్మమున కట్టి యజ్ఞానానుభవమునుండి యెన్నఁడును విడుదల లేదని ప్రాప్తించును. మఱియు జ్ఞానస్వరూపమగు బ్రహ్మము అజ్ఞానానుభవమే స్వరూపముగాఁగలదగుటంజేసి, (ముత్యపు చిప్ప రజతముగాఁ దోఁచునప్పుడు) మిథ్యాభూతమగు రజతమును బోఁగొట్టు జ్ఞానముచే నట్టి రజతమునుగుఱించిన యనుభవము సయితము నివర్తింపఁబడు చందమున, (అజ్ఞానమును) నివర్తింపఁజేయునట్టి జ్ఞానముచే నట్టి యజ్ఞానానుభవరూపమగు బ్రహ్మస్వరూపము సయితము నివర్తింపఁబడుచున్నదా? వేఱొక్క దానివలనఁ బ్రహ్మము అజ్ఞానమును అనుభవింపుచున్న దంటివేని, ఆ వేఱొక్కటి యేది?

అద్వైతి :—వేఱొక్క యజ్ఞానము.

భాష్యకారులు :—అట్లైన, అజ్ఞానములకు మితి లేకపోవుటచే ఈవాదమున అనవస్థాదోషము ప్రసక్తించును.

అద్వైతి :—ఈ యజ్ఞానము బ్రహ్మమును తిరస్కరించినదై యే బ్రహ్మముచే ననుభవింపఁబడుచున్నది.

భాష్యకారులు :— అట్లైనపక్షమున, అజ్ఞానము [1]కాచాదినేత్ర దోషమువలెనే తనయునికిమాత్రముచేత బ్రహ్మమును తిరస్కరించునది. కావున నది జ్ఞానముచే నివర్తింపఁబడునది కాకపోవును.

అద్వైతి :— ఈ యజ్ఞానము స్వయముగా ననాది. ఇది బ్రహ్మముచే ననుభవింపఁబడుటయును, బ్రహ్మస్వరూపమును గప్పివేయుటయును, ఈరెండును ఏకకాలముననే గలుగునవి. కావున మీరు గానఁబఱచిన యనవస్థాదోషము మొదలగునవి యెంతమాత్రము సంభవింపవు.

భాష్యకారులు :— అట్లు చెప్పఁదగదు. ఏలననిన, బ్రహ్మము తన యనుభవమే స్వరూపముగాఁ గలది. కావున నది యజ్ఞానముచే మూయఁబడనిదై యజ్ఞానము ననుభవించునది యగుట యసంభవము. వేఱొకదాని మూలముగా బ్రహ్మస్వరూపము గప్పివేయఁబడినదగుచున్నదంటివేని, అజ్ఞానము అనాది కాదన్నమాటవచ్చును. ఇంతియెకాక, ఈపైని గనఁబఱచినప్రకారము అనవస్థాదోషము నయితము ప్రాప్తించును.

అద్వైతి :— బ్రహ్మము తన స్వరూపము మూయఁబడకనే యజ్ఞానము ననుభవించుచున్నది.

భాష్యకారులు :— [2]అట్లంటివేని బ్రహ్మము తన యనుభవమే స్వరూపముగాఁ గలది కాదన్నమాట వచ్చును.

మఱియు అజ్ఞానముచే మూయఁబడి నప్పుడు బ్రహ్మము బొత్తుగ ప్రకాశించుచుండలేదా! లేక అప్పుడు దానియందు కొంచము భాగము మాత్రమే ప్రకాశించుచున్నదా? అప్పుడది బొత్తుగ ప్రకాశించుచుండలేదంటివేని, ప్రకాశైకస్వరూపమగు బ్రహ్మము బొత్తుగ ప్రకాశింపకుండుట యనఁబడునది ప్రకాశరూపమగు దానిస్వరూపమునకు నాశమేయని పలుమాఱు చెప్పియున్నాము. కాక, అప్పుడది కొంచము భాగము మాత్రమే ప్రకాశించుచున్నదనెదవా? అట్లంటివేని, బ్రహ్మమునం దట్లు ప్రకాశింపని భాగమెద్ది? ఎవ్విధములైన భాగములుగాని, భేదములుగాని లేనిదై ప్రకాశమాత్రమగు వస్తువు ఈపైని గనఁబఱచిన ద్వివిధాకారము గలదియగుట యసంభవము. కావున నది యేకకాలమున ప్రకాశింపనిదియు, ప్రకాశించునదియు నగుట యెంతమాత్రము పొసగదు.

అద్వైతి :— సచ్చిదానందైక రసమగు బ్రహ్మము అవిద్యచే మూయఁబడిన స్వరూపముగలదై స్పష్టముగాఁ బ్రకాశింపని దగుచున్నది.

---

(1) ౧౩౫ వ పత్రముయొక్క క్రిందిభాగమున వ్రాయఁబడిన ౧ వ వివరణమును చూడుము.

(2) జ్ఞానము తిరోహితమైననే తప్ప యజ్ఞానము అనుభవమునకు రాదు. అట్లు అజ్ఞానము తిరోహితము కాకయే, అజ్ఞానము అనుభవింపఁబడు పక్షమున, బ్రహ్మము తన యనుభవమే (తన్ను గుఱించిన జ్ఞానమే) స్వరూపముగాఁ గలదగుటకు లోపము వచ్చునని భావము.

భాష్యకారులు :—అట్లంటివేని, ప్రకాశమాత్ర స్వరూపమగు వస్తువు స్పష్టముగాఁ బ్రకాశించుట యనఁగానేమి ? అది యస్పష్టముగాఁ బ్రకాశించుట యనఁగానేమి ? దీని ఫలితార్థమేమన్నను, లోకమున నేపదార్థము భాగములు గలదియు, భేదములు కలదియు, ప్రకాశముచేఁ దెలుపఁబడునదియునో, ఆ పదార్థము అన్ని వైపులను ప్రకాశించునట్లైన, నట్టి ప్రకాశమును "స్పష్టముగాఁ బ్రకాశించుట" యందురు. ఆ పదార్థము ప్రకాశించు నప్పుడు దానియందు కొన్ని విశేషములు ప్రకాశింపనియెడల, దానిని "అస్పష్టముగాఁబ్రకాశించుట" అందురు. ఇట్లుండ, ఏ భాగము ప్రకాశించు చుండలేదో, ఆ భాగమున ప్రకాశనే లేదుగాన, అందునుగుఱించి "అస్పష్టముగాఁ బ్రకాశించుట" అనఁబడునది లేనేలేదు. ఏభాగము ప్రకాశించుచున్నదో, అందు దానిని గుఱించిన ప్రకాశము స్పష్టమైనదే. కావున ఏతావునను ప్రకాశము విషయమై అస్పష్టప్రకాశమనఁబడునది సంభవింపనే సంభవింపదు. జ్ఞానముకు విషయభూతమగు పదార్థము విషయమై, దాని స్వరూపము తెలియవచ్చునప్పుడు దానియందుండు కొన్ని విశేషములు తెలియరాకుండుటయే "అస్పష్టమైన ప్రకాశ" మనఁబడును, కావున జ్ఞానముకు విషయముకానిదియు, విశేషము లేవియును లేనిదియు, ప్రకాశమాత్రమును నగు బ్రహ్మమువిషయమై యన్ననో, దాని స్వరూపము ప్రకాశించునప్పుడు అజ్ఞానమూలముగాఁ దానియందు కొన్ని విశేషములు ప్రకాశింపకుండుట యనఁబడు "అస్పష్టప్రకాశము" సంభవింపనే సంభవింపదు.

మఱియు అవిద్యామూలముగాఁ గలుగునట్టి యీ యస్పష్టప్రకాశ మనఁబడునది తత్త్వజ్ఞానము గలుగుటచే నివర్తించుచున్నదా ? నివర్తించుచుండ లేదా ? అది నివర్తించుచుండలేదంటివేని, మోక్షమే లేదని చెప్పినట్లగును. నివర్తించుచున్నదంటివేని, అప్పుడా పదార్థము ఎట్టి స్వరూపముగలదియో విచారింపఁ దగును.

అద్వైతి :— అప్పుడు దాని స్వరూపము స్పష్టముగాఁ బ్రకాశించును.

భాష్యకారులు :— అట్లు స్పష్టముగాఁ బ్రకాశించునది యగు స్వరూపము దానికింతకు పూర్వము కలదా ? లేదా ? కలదంటివేని, యవిద్యామూలముగాఁగలుగునట్టి యస్పష్టప్రకాశమును, దాని నివృత్తియును లేనివియగును. లేదంటివేని, [1]మోక్షము సృజింపఁబడునది యగుటచే నది యనిత్యమని ప్రాప్తించును.

---

(1) ఏది సృజింపఁబడునట్టిదో, అది నశించునది. దృష్టాంతము—ఘటపటాది పదార్థములు సృజింపఁబడునవి. కావున నవి నాశయుక్తములు. అట్లే మోక్షము నయితము ఘటపటాది పదార్థములవలెనే సృజింపఁబడునది యగుపక్షమున వానివలెనే అదియును నాశయుక్తమైనది యని ప్రసక్తించునని భావము.

ఈ యజ్ఞానముయొక్క యాశ్రయమును అద్వైతులు నిరూపింపకుం డుటచే నది యుండుటయే యసంభవమని యింతకుపూర్వమే నిరూపించియున్నా ము. మఱియు అసత్యమగు దోషము మూలముగా భ్రమము గలుగునని వాదించువాఁడును అధిష్ఠానము లేకుండ భ్రమము గలుగుట యసంభవమని ఉపపాదించుట యశక్యము. ఏలననిన, భ్రమమునకు హేతువగు దోషమును, ఆ దోషమున కాశ్రయమగుటయును అసత్యము లగునట్లు, అధిష్ఠానమున్ను అసత్య మయినను భ్రమము గలుగవచ్చును గదా! [1]అందువలన సర్వము శూన్య మనెడి వాదము ప్రసక్తించును.

అజ్ఞానము భావరూపమనెడి యంశము అనుమాన ప్రమాణమువలన సయితము సిద్ధించునని యద్వైతులు చేయు వాదము యుక్తమైనది కాదు. ఏలననిన, అనుమాన ప్రమాణము సంభవింపదు.

అద్వైతి:—అనుమాన ప్రమాణమును గాన్పించియుంటినే

భాష్యకారులు:—కాన్పించినారు. వాస్తవమే. అయితే అది మంచిది కా దు. మీరు గానఁబఱచిన హేతువు అజ్ఞానముంగూర్చి గూడ మీరంగీకరింపని మఱియొక యజ్ఞానమును సాధించుటచే మీకు విరుద్ధమైనది. మఱియొక యజ్ఞా నమును సాధింపని యెడల అందువలన ఆ హేతువు వ్యభిచారియగును (వ్యభి చారియనఁగా సాధింపవలసి నది లేని చోటంగూడ నుండెడి హేతువు). సాధిం చునెడను ఆ యజ్ఞానము బ్రహ్మమునం [2]దజ్ఞానసాక్షిత్వమును నివారించుచున్నది. అందువలన అజ్ఞానమును గల్పించుట నిరర్థకమగును. మీరు గానఁబఱచిన దృష్టాంతము సయితము [3]సాధన వికలదోషము గలది. ఎట్లన, ప్రకాశింపనిదా నిని ప్రకాశింపఁజేయునది దీపపుకాంతి కాదు. అన్నితావులను జ్ఞానమే కదా ప్ర కాశింపఁజేయునది. దీపమున్నను, జ్ఞానము లేనట్లైన, ఏ పదార్థమును తెలియరాదు కదా! ఇంద్రియములును జ్ఞానమును గలుగఁ జేయునవియే కాని పదార్థములను ప్రకాశింపఁజేయునవి కావు. చక్షురింద్రియము జ్ఞానమును గలుగఁజేయగా, దీపపు కాంతి విరోధియగు చీకటిని పోఁగొట్టును, అందు మూలముగా నది పదార్థములు ప్రకాశించు విషయమై ఉపకరించునది యగుచున్నది. ఇంతియే. ఇట్లు దీపపు

(1) అధిష్ఠానము బ్రహ్మము లేకున్నను జగద్రూప మగు భ్రాంతి గలుగఁదగును. కావున సర్వము శూన్య మనెడి బౌద్ధులవాదము ప్రసక్తించును.

(2) అద్వైతులు గానఁబఱచిన హేతువు అజ్ఞానముం గూర్చి గూడ వేఱొక యజ్ఞానమును నిరూపించుచున్నది. అందువలన రెండు అజ్ఞానములు యేర్పడినవి. వానిలో నొక్కటి బ్రహ్మము చే దెలియఁబడునది. ఇది యీరెండవ అజ్ఞానముచే మాయఁబడుటచే బ్రహ్మము దీనిని దెలిసికొ నఁజాలఁడు. కావున బ్రహ్మము అజ్ఞానసాక్షియగుట సిద్ధింపదని భావము.

(3) సాధనము దృష్టాంతమునననన్వయం పని యెడల నది సాధనవికల దోషమనఁబడును.

కాంతి చక్షురింద్రియమును ఉపకరించునదియనెడి హేతువునుబట్టి యది పదార్థములను ప్రకాశింపఁజేయునది యనెడి వ్యవహారము లోకమునఁగలదు.

అద్వైతి:—జ్ఞానమువలెనే దీపపుకాంతియును పదార్థములను ప్రకాశింపఁ జేయునది యని యంగీకరించి దీపపుకాంతిని దృష్టాంతముగా గనఁబఱచి యుండలేదు. అయితే, జ్ఞానమువలెనే దీపపుకాంతియును తనవిషయములను గప్పివేయు దానిని తొలఁగించుచు నందు మూలముగా వానిని ప్రకాశింపఁజేయునది యనుమాత్రమే చెప్పియున్నాము.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, పదార్థములు ప్రకాశించు విషయమై ప్రతికూలమైన దానిని పోఁగొట్టినంతమాత్రముచే నేదియును ఆ పదార్థములను ప్రకాశింపఁజేయునది కాఁదగదు. అయితే "ఈపదార్థము ఇట్టిది" అనియిట్లు తెలుపునది మాత్రమే యట్టిది—పదార్థములకు వ్యవహారయోగ్యతను గలుగఁజేయునది. అట్టిదియో జ్ఞానమే. ఉపకారకములగు నవియును ప్రకాశింపని వానిని ప్రకాశింపఁజేయునవియని యంగీకరించుపక్షమున, ఇంద్రియములు ఎక్కువ ఉపకారకము లయిన వయినందున నవి ప్రకాశింపని వానిని ప్రకాశింపఁజేయునవియని యంగీకరింపవలసివచ్చును, అట్లు అంగీకరించు పక్షమున, వానిచే నివర్తింపఁబడెడి వేఱొక్కవస్తువు వానికి పూర్వములేదు గాన హేతువు వ్యభిచారియగును. కాఁబట్టి యీవాద మింతటితోఁజాలును.

మీ వాదముతో విరోధించు న్యాయప్రయోగములును గలవు. ఎట్లన,

ప్రతిజ్ఞ:—వివాదవిషయమగు అజ్ఞానము జ్ఞానమాత్రస్వరూపమగు బ్రహ్మమున నుండునది కాదు,

హేతువు:—అది యజ్ఞాన మగుటవలన,

ఉదాహరణము:—ముత్యపుచిప్ప మొదలగు వానినిగుఱించిన యజ్ఞానమువలెనే అది జ్ఞాత (తెలివిగలవాని) యందుండునది గదా!

—∘∘⊹∘∘—

ప్రతిజ్ఞ:—వివాద విషయమగు అజ్ఞానము జ్ఞానమాత్రమగు బ్రహ్మమును గప్పివేయునది కాదు,

హేతువు:—అది యజ్ఞాన మగుటవలన,

ఉదాహరణము:—ముత్యపుచిప్ప మొదలగువానిని గుఱించిన యజ్ఞానమువలెనే అది విషయమును గప్పివేయునది కదా!

—∘∘⊹∘∘—

ప్రతిజ్ఞ :—వివాదవిషయమగు అజ్ఞానము జ్ఞానముచే నివర్తింపఁ దగినది కాదు.

హేతువు :—అది జ్ఞానముయొక్క విషయమును గప్పివేయునది కానందున. ఏలన, ఏది జ్ఞానముచే నివర్తింపఁ బడునట్టి యజ్ఞానమో, అది జ్ఞానముయొక్క విషయమును గప్పివేయునది.

ఉదాహరణము :—ముత్యపుచిప్ప మొదలగువానిని గుఱించిన యజ్ఞానము వలెనే.

—oo:o:oo—

ప్రతిజ్ఞ :—బ్రహ్మము అజ్ఞానాస్పదము కాదు.

హేతువు :—అది జ్ఞాత (తెలివిగలది) కానందున.

ఉదాహరణము :—ఘటపటాది పదార్థములవలెనే.

—oo:o:oo—

ప్రతిజ్ఞ: —బ్రహ్మము అజ్ఞానముచే మూయఁ బడునది కాదు.

హేతువు :—అది జ్ఞానమునకు విషయమగునది కానందున. ఏది యజ్ఞానముచే మూయఁబడునదో, అది జ్ఞానమునకు విషయమయినది.

ఉదాహరణము :— ముత్యపుచిప్ప మొదలగునవి యెట్లో, అట్లే.

—oo:o:oo—

ప్రతిజ్ఞ :—బ్రహ్మము జ్ఞానముచే నివర్తింపఁబడునట్టి యజ్ఞానము కలది కాదు.

హేతువు :—అది జ్ఞానమునకు విషయము కానందున. ఏది జ్ఞానముచే నివర్తింపఁ బడునట్టి యజ్ఞానము కలదియో, అది జ్ఞానమునకు విషయమయినది.

ఉదాహరణము :—ముత్యపుచిప్ప మొదలగునది యెట్లో, అట్లే.

—oo:o:oo—

ప్రతిజ్ఞ :—వివాదవిషయమగు ప్రమాణజ్ఞానము తన ప్రాగభావమున కంటెను వేఱగు అజ్ఞానము తనకు పూర్వము కలది కాదు.

హేతువు :—అది ప్రమాణజ్ఞానమగుటవలన,

ఉదాహరణము :—మీాకభిమతమైన యజ్ఞానమును సాధించునట్టి ప్రమాణజ్ఞానము వలెనే.

—oo:o:oo—

ప్రతిజ్ఞ :—జ్ఞానము వస్తువును నశింపఁజేయునది కాదు.

హేతువు:—అది ఏదైన నొకశక్తి విశేషముయొక్క సహాయములేని జ్ఞానమాత్రమైనది, ఏలననిన, ఏది వస్తువును నశింపఁజేయునదియో, అది జ్ఞానమైనను, జ్ఞానముకాకున్నను, శక్తివిశేషముయొక్క సహాయము కలది గానే గన్పట్టుచున్నది కదా!

ఉదాహరణము:—ఈశ్వరజ్ఞానంబును, యోగులు మొదలగువారి జ్ఞానంబును, ఇనుపగుదియ మొదలగునవియును నెట్లో, అట్లే.

—०:—

ప్రతిజ్ఞ:—భావరూపమగు అజ్ఞానము జ్ఞానముచే నశింపఁదగినది కాదు.

హేతువు:—అది భావరూపము (వస్తువు) అయినందున.

ఉదాహరణము:—ఘటపటాదిపదార్థములవలెనే.

అద్వైతి:—భ్రాంతివశమున 'త్రాఁడు సర్పముగాఁ దోఁచినతావున, "ఇది త్రాఁడుకాని సర్పము కాదు" అనెడి బాధకజ్ఞానము "ఇది సర్పము" అనెడి పూర్వపు జ్ఞానమువలనఁ గలిగిన భయము మొదలగువానిని నశింపునదిగాను గన్పట్టుచున్నదే?

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, ఆతావుల భయాదులను నశింపఁజేయునది జ్ఞానముకాదు. భయాదులు క్షణమాత్రముండునవి యగుటంజేసి యవి తమంతటతామే నశించుచున్నవి. వానిని గలుగఁజేసిన కారణము పోవుటచేనవి యటుపిమ్మట కలుగవు. జ్ఞానవలెనే అవియును వానిఁ గలుగఁ జేయునట్టి కారణము సమీపమున నున్నప్పుడే ఉన్నట్టివిగాఁ గన్పట్టుచున్నవి. తక్కినకాలములయం దవి గన్పట్టుచుండలేదు. అందువలన నవి క్షణికములుగాఁ దెలియవచ్చు చున్నవి. భయాదులు క్షణికములు కావంటివేని, వానికి హేతుభూతమగు జ్ఞానపరంపరలోని యన్ని జ్ఞానములును ఒక్కవిధముగానే భయాదులను గలుగఁ జేయునవి యగుటంజేసి యనేకభయములు గలుగవలసివచ్చును.

జ్ఞానముయొక్క లక్షణమున "తనప్రాగభావమున కంటెను వేఱగు వస్తువు తనకు పూర్వము గలది" అని యిట్లు నీవు చేర్చిన విశేషణము ఆలక్షణమున నుపయోగములేనిదై శబ్దప్రయోగమున నీకుఁగల కౌశల్యమును ప్రకటింపఁజేయువిషయమై మాత్రమే యుపయుక్తమగుచున్నది. కాఁబట్టి అనుమాన ప్రమాణమువలనను భావరూపమగు అజ్ఞానము సిద్ధింపదు. శ్రుతిప్రమాణమును బట్టియు దాని యర్థాపత్తులను (అనుపపత్తులను) బట్టియును అది సిద్ధింపదని యికమీఁదనే గాన్పింపఁబడును. మిథ్యాభూతమైనది మిథ్యాభూతమయిన దాని నుండియే గలుగఁదగును" అని యద్వైతులు చేయువాదమున్ను "న విలక్షణత్వాదస్య తథాత్వఞ్చ శబ్దాత్" (బ్ర. సూ. ౨ అ. ౧ పా. ४ సూ) అనెడి

సూత్రమున గానఁబఱచిన న్యాయప్రకారము పరిహరింపఁబడుచున్నది. కాఁబట్టి యనిర్వచనీయమగు అజ్ఞానముఁ గూర్చిన ప్రతీతి (జ్ఞానము) ఒక్కటియును లేదు. ప్రతీతినిబట్టియు, భ్రాంతినిబట్టియు, బాధమునుబట్టియుఁ గూడ నట్లంగీకరింపఁ దగదు. ఏలననిన, తెలియఁదగినదేదో, అదియే కదా! ప్రతీతికిని, భ్రాంతికిని, బాధకును విషయముకాఁదగును? ఈ ప్రతీతులచేఁగాని ఇతరప్రతీతులచేఁగాని తెలియరానిది వీనికి (ప్రతీతి భ్రాంతి బాధంబులకు) విషయ భూతమని కల్పింపఁదగదు.

అద్వైతి :—ముత్యపుచిప్ప మొదలగునది రజతము మొదలగునదిగాఁ దోఁచుట గద్దు. అప్పుడే అది రజతముకాదనెడి జ్ఞానమున్ను గలుగుట కద్దు. అయితే ఒక్కటి వేఱొక్కటిగాఁ దెలియవచ్చుట యసంభవము. కావున సత్యమనిగాని అసత్యమనిగాని చెప్పుట కశక్యమైనట్టియు, ఇంతకు పూర్వమెన్నఁడును చూచియుండని రజతము దోషవశమునఁ దెలియవచ్చుచున్నదని కల్పించుకొనవలయును.

భాష్యకారులు :—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, అట్లు కల్పించుకొనినను, ఒక్కటి వేఱొక్కటిగాఁ దెలియవచ్చుట యనునది తప్పక సంభవించును. అట్లు ఒక్కటి వేఱొక్కటిగాఁ దెలియవచ్చుటను అంగీకరించుట వలననే గదా ఖ్యాతియును, (తోఁచుటయును) ప్రవర్తించుటయును, బాధంబును, భ్రమమును గలుగుచున్నవి. బొత్తుగ తెలియరానిదియు, కారణములేనిదియను నగు వస్తువును కల్పించుట యసంభవము కదా! ఇట్లు కల్పింపఁ బడునదియు, అనియర్వచనీయమును నగు రజతము అనిర్వచనీయముగాఁ దోఁచుచుండలేదు. అయితే అది సత్యమైన రజముగానే కదా. తోఁచుచున్నది. అది యనిర్వచనీయముగాఁ దోఁచుపక్షమున, భ్రాంతిగాని, బాధగాని గలుగుట యసంభవమగును, కావున ఒక్కటి వేఱొక్కటిగాఁ దోపనిపక్షమున, ప్రతీతియు, ప్రవృత్తియు, బాధయు, భ్రమమును అనుపపన్నములగును. మఱియు నట్లు ఒక్కటి వేఱొక్కటిగాఁ దోఁచుట యన్ననో, పరిహరింపఁదగినది కాదు. ముత్యపుచిప్ప మొదలగునదియే రజతము మొదలగు దానియాకారముతోఁ దోఁచుచున్నదని మీరును అంగీకరింపవలయును.

మిగిలిన [1]ఖ్యాతులను వాదించువారలకుఁగూడ చాలాదూరము పోయినపైనైనను, ఒక్కటి వేఱొక్కటిగాఁ దోఁచుటను ఆశ్రయింపక తప్పదు. ఏల

(1) ఒక్క వస్తువు వేఱొక్క వస్తువుగాఁ దోఁచుతావుల అనఁగా ముత్యపుచిప్ప రజతముగాఁ దోఁచుతావునను, ఎండమావులయం దుదకమున్నట్టు తోఁచు తావునను, ఒకదిక్కు వేఱొక దిక్కుగాఁ దోఁచుతావున నీ మొదలగుచోట్ల దర్శనకారులు వేఱువేఱు అభిప్రాయములను గలిగియున్నారు. వారి యభిప్రాయములు ఖ్యాతులని శాస్త్రమున వ్యవహరింపఁబడు చున్నవి. అవి భిన్నభిన్నములయినందున వాని నంగీకరించువారును అసత్ఖ్యాతివాదులనియు, ఆత్మఖ్యాతి వాదులనియు, అఖ్యాతి వాదులనియు, యథార్థఖ్యాతి వాదులనియు నిట్లు పలువిధములుగాఁ బిలువఁబడుదురు.

ననిన, [1]అసత్ఖ్యాతిపక్షమున సత్తుగానును, [2]ఆత్మఖ్యాతిపక్షమున పదార్థముగానును, [3]అఖ్యాతిపక్షమున ఒక్కదాని విశేషణము వేఱొక్కదాని విశేషణగానును, రెండు జ్ఞానము లొక్కజ్ఞానముగానును, విషయముగానిదని యెడి పక్షమున విషయమున్నట్లును, తోఁచుట తప్పను.

ఇంతియెకాక అనిర్వచనీయమై అపూర్వమైన రజతము ఈ తావున పుట్టినదని చెప్పువాఁడు దానిపుట్టుకకు కారణమేదియో చెప్పవలయును? రజతముగాఁ దోఁచుటయే అందులకు కారణమని చెప్పఁదగదు. ఏలననిన, అట్లుతోఁచుటకు ఆ

(1) అసత్ఖ్యాతి :—శుక్తియందుఁ దోఁచఁబడిన రజతము వేదాంతులు చెప్పునట్లు అనిర్వచనీయము కాదు. అయితే అది యొక తత్త్వము కాదని అనఁగా లేనిదని మాత్రము చెప్పఁదగును. అట్లు సత్తు కాని దానిని తెలుపుటకు సమర్థమైన జ్ఞానము మూలముగా రజతము తెలియవచ్చు చున్నది. కావుననే "ఇది రజతము కాదు" అనెడి బాధక జ్ఞానముగూడ ఆతావున రజతము లేదని మాత్రమే తెలుపుచున్నది. ఇట్లు అసత్ఖ్యాతి వాదులు తలంచుచున్నారు. వీరు బౌద్ధులలో నొక్క తెగ వారగు మాధ్యమికులు.

(2) ఆత్మఖ్యాతి :—శుక్తిక రజతముగాఁ దోచుతావున భ్రాంతివశమున శుక్తియందు రజత మారోపింపఁబడలేదు. అయితే యింద్రియసంబంధము లేక యే రజతము గానఁబడుటంజేసి యది జ్ఞానాకారమైనదియని మాత్రము చెప్పఁదగును. అట్లు ఆన్తరమగు (జ్ఞానాకారమగు) రజతమును బాహ్యపదార్థమును (ఇంద్రియ గ్రాహ్యమగు దానిని) గాను తెలిసికొనుట భ్రమము. "ఇది రజతముకాదు" అనెడి బాధకజ్ఞానము నయితము రజతము లేనేలేదని తెలుపుచుండలేదు. అయితే రజతము "ఇది" యని నిర్దేశింపఁదగినట్లు బాహ్యపదార్థమగుటను నిషేధించు చున్నది. ధర్మిని నిషేధించుట కంటెను అనఁగా రజతము బొత్తుగా లేదని చెప్పుటకంటెను ధర్మమును నిషేధించుట అనఁగా అది బాహ్యపదార్థముగా నుండుటను నిషేధించుట సులభము గదా. ఇట్లు ఆత్మఖ్యాతి వాదులు తలఁచుచున్నారు. వీరు బౌద్ధులలో నొక తెగవారగు సౌత్రాన్తికులు. వీరిని విజ్ఞానవాదులనియును శాస్త్రమునం దచ్చటచ్చట పేర్కొనుట కద్దు,

(3) అఖ్యాతి ;—స్మరణముకంటెను వేఱయినదిగాఁ దెలియరానిదియు, "ఇద రజతము" అని యిట్లు అవివేక పూర్వకమగు అనుభవమును గలుగఁజేయునదియును నగు జ్ఞానమే, శుక్తికరజతముగాఁ దోఁచుతావున, భ్రమముగా వ్యవహరింపఁబడుచున్నది. అట్టి భ్రమమునకు విషయభూతమగు రజతము, వేదాంతులు చెప్పునట్లు, అనిర్వచనీయము కాదు. అది మనయెదుట గానఁబడుచుండుట సత్యమే కదా! అట్లే "ఇది రజతముకాదు" అనెడి బాధకజ్ఞానము నయితము అట్టి వ్యవహారమును మాత్రమే బాధించుచున్నదేగాని అట్లు భ్రమింపఁబడినది అనఁగా రజతము భూతభవిష్యద్వర్తమాన కాలములయందు లేనిదని తెలుపుచుండ లేదు. ఇట్లుండ, అది యనిర్వచనీయ మెట్లు కాఁదగును? అని యిట్లు అఖ్యాతివాదులు తలఁచుచున్నారు. వీరు పూర్వ మీమాంసకులలో నొక్క తెగవారగు ప్రాభాకరులు.

యథార్థఖ్యాతి :—ఏతావున నేపదార్థము తెలియవచ్చుచున్నదో, ఆ తావున ఆ పదార్థము గాని దాని యంశముగాని కలదు. శుక్తిక రజతముగాఁ దోచుతావున రజతము కొంతవఱకైనను కలదు. అది బొత్తుగా లేకపోలేదు. ఎండమావులయం దుదకము గలదు. అని యిట్లు యథార్థఖ్యాతి వాదులు తలంచుచున్నారు. ఈ వాదమును శ్రీరామానుజులవా రవలంబించినట్లు "యదార్థం సర్వ విజ్ఞాన మితివేద విదాం మతం" అనెడి యీక్రింది గ్రంథ సందర్భమునుబట్టి తెలియుచున్నది.

రజతమే విషయముగాన, ఆ రజతము పుట్టుటకు పూర్వము తాను కలిగియుండుట సంభవింపదు. విషయములేకయే పుట్టి అది యీ రజతమును పుట్టించి దానినే విషయీకరించుననుట చాలా పెద్ద లుపపాదింపవలసినది. ఇంద్రియాదులయం దుండుదోషము నయితము అందులకుఁ గారణమనియును చెప్పఁదగదు. ఏలననిన, ఇంద్రియాదినిష్టమగు దోషము పురుషునియందుండుటనుబట్టి యది విషయనిష్ట మగు కార్యమును గలుగజేయుట యసంభవము. కాక, ఆ యింద్రియములే యం దులకుఁ గారణమనియును చెప్పఁదగదు. ఏలననిన, అవి జ్ఞానమును గలుగఁజే యుటకుఁ గారణములైనవి. దోషములతోఁ గూడియున్నట్టి యింద్రియములును అందులకుఁ గారణమనియును చెప్పఁదగదు. ఏలననిన, అవి తమవలనఁ గలుగు జ్ఞానమునందే యొకవిధమైన మార్పును గలుగఁజేయుటకుఁ గారణములయినవి. అనాదియగు అజ్ఞానము అందులకుఁ గారణమనియును చెప్పఁదగదు. ఏలననిన, ఈ విషయమును ఇంతకుపూర్వమే నిరసించియున్నాము ?

ఇంతియెకాక, అపూర్వమై అనిర్వచనీయమై పుట్టిన ఈవస్తువు రజతము మొదలగు శబ్దములచేతను "ఇది రజతము" అనెడి జ్ఞానముచేతనున్ను తెలుపఁ బడునది యగుట ఎట్లు ? అది ఘటాదిశబ్దములచేతను "ఇది ఘటము" అనెడి జ్ఞానముచేతనున్ను ఏల తెలుపఁబడదు ?

అద్వైతి:—అది రజతము మొదలగువాని వంటిదయినందువలన.

భాష్యకారులు :—అట్లయినను, అది వానివంటిదిగానే తోఁచవలయునే, అది వానివంటిది యనియే చెప్పవలయునే ?

అద్వైతి :—రజతము మొదలగువాని జాతి దానియందుండుటవలన నది యట్లు తోఁచుటయును అది యట్లు వ్యవహరింపఁబడుటయును సంభవములు.

భాష్యకారులు :—అట్టి జాతి యనఁబడునది సత్యమైనదా ? అసత్యమైనదా? అది సత్యమైనదియని చెప్పఁదగదు. ఏలననిన, సత్యమైనజాతి యసత్యములగు పదార్థములను ఆశ్రయించియుండుట సంభవింపదు గదా ! అది యసత్యమైనది యనియును చెప్పఁదగదు. అట్లయినను సత్యమగు రజతముతోఁ దానికి సంబంధ ముండుట యసంభవము. మఱియు అసత్యమగు జాతి సత్యములగు శబ్దజ్ఞానములు తెలుపుటయును అసంభవము. ఇట్లు నిలువఁబడని కుతర్కమును నిరసించి యింతటితోఁజాలును.

ఈక్రింద గనఁబఱచిన విధముగానైనను చెప్పఁదగును.

శ్లో॥ యథార్థమ్ సర్వవిజ్ఞానమితి వేదవిదాం మతం ।
శ్రుతి స్మృతిభ్య స్సర్వస్య సర్వాత్మత్వ ప్రతీతితః ॥

తా॥ అన్నిపదార్థములును అన్ని స్వరూపములుగానును తెలియ వచ్చుచున్నవని శ్రుతిస్మృతులు తెలుపుచున్నవి. కావున అన్నిధములైన జ్ఞానములును సత్యములేయని వేదశాస్త్రము నెఱింగినవారు తలంచు చున్నారు.

శ్లో॥ "బహుస్యామ్" ఇతి సంకల్పపూర్వసృష్ట్యాద్యుపక్రమే।
"తాసాంత్రి వృతమేకై కామ్" ఇతి శ్రుత్యైవ దర్శితం॥

తా॥ "బహుస్యాం" (ఛా. ౬-౨-3) అను శ్రుతి జగత్సృష్టికిఁగాను బ్రహ్మము నానావిధములుగా నగుటకై సంకల్పించుట మొదలగువానిని తెలుపు సందర్భమున, "తాసాం త్రివృతం త్రి వృత మేకై కాం కరవాణి" అనఁగా "తేజస్సు, ఉదకము, పృథివి అనువానిలో నొక్కొక్కదానిని మూఁడేసింటినిగాఁ జేయుదును" అనెడి శ్రుతివాక్యము [1]త్రివృత్కరణమును విధించుచున్నది.

శ్లో॥ త్రివృత్కరణ మేవంహి ప్రత్యక్షేణో పలభ్యతే।
యదగ్నే రోహితం రూపం తేజస స్త దపామపి।
శుక్లం కృష్ణం పృథివ్యా శ్చేత్యగ్నావేవ త్రిరూపతా।
శ్రుత్యైవ దర్శితా తస్మా త్సర్వే సర్వత్ర సంగతాః॥

తా॥ ఇట్టి త్రివృత్కరణము ప్రత్యక్షముగాను గూడ గన్పట్టు చున్నది. ఎట్లన, అగ్నియొక్క ఎఱ్ఱని రంగు ఏది కలదో, అది తేజస్సుయొక్క రూపము. తెల్లని రంగు నీటియొక్క రూపము. నల్లని రంగు పృథివియొక్క రూపము. ఇట్లు అగ్నియందే మూఁడు రూపములు గలవని శ్రుతియే తెలుపుచున్నది. కావున అవియన్నియును అన్నింటిలోఁ జేరియున్నవి.

శ్లో॥ పురాణే చైవ మేవ్రోక్తం వైష్ణవే సృష్ట్యుపక్రమే॥

---

(1) త్రివృత్కరణము:—ఇది, తేజస్సు జలము పృథివి యనఁబడు మూఁడు భూతములలో నొక్కొక్క భూతమునందు తక్కిన రెండుభూతములను గూడుట. అది యెట్లనిన, ఒక్కొక్క భూతమును రెండుగా భాగించి అందులో నొక్కొక్కభాగమును మాత్రము రెండుగా భాగించి యా రెంటిలో నొక్కొక్కటిని భాగింపని తక్కిన యొక్కొక్క సగముతోఁ గూర్పగా స్థూలభూతము గలుగును. అప్పుడు ఒక్కొక్కభూతములోఁ దన భాగము సగము తక్కిన భూతభాగము లన్నియుఁ గూడి సగముననగును. కాని సరిగానుండ నక్కఱలేదు. స్వభాగ మధికముగాను తక్కిన భూతభాగములు కొంతకొంతయు నుండుననుటయే చాలును. ఇట్లు గలుగునే స్థూలభూతములందుగాని యేయే భూతముల యంశము లెక్కుడుగానుండునో యవి యాయాభూతసంజ్ఞల వ్యవహరింపఁబడును. మనకు గోచరించు పృథివీ జలతేజస్సులును త్రివృత్కృతములే యగుంగాని యత్రివృత్కృతములు కావు. వేదములయందు త్రివృత్కరణము చెప్పఁబడినది. ఇట్లే పంచీకరణ మనఁబడునదియును నొక్కటికలదు. అది పృథివ్యప్తేజోవాయ్వాకాశము లనఁబడు పంచభూతములను గుఱించినది. పంచీకరణము పురాణసిద్ధము.

తా॥ శ్రీ విష్ణుపురాణమునను సృష్టిని వర్ణించు సందర్భమున నిట్లు చెప్పఁబడెను.

శ్లో॥ నానా వీర్యాః పృథగ్భూతా _స్తత_స్తే సంహతిం వినా।
నాశక్నువన్ ప్రజాః స్రష్టు మసమాగమ్య కృత్స్నశః॥
విష్ణు. ౧ అం. ౨ అ. ౫౨ శ్లో.

తా॥ అనేకవిధములగు శక్తులు గలవియు, వేఱువేఱుగా నుండునవియును నగు పృథివ్యాదుల తన్మాత్రలు సంపూర్ణముగాఁజేరక, కూడిక లేక, ప్రజలను సృజించుటకు సమర్థములైనవి కాకపోయెను.

శ్లో॥ సమేత్యా న్యోన్యసంయోగం పరస్పర సమాశ్రయాః।
మహదాద్యా విశేషాన్తా హ్యణ్డ మిత్యాదినా తతః॥
విష్ణు. ౧ అం. ౨ అ. ౫౩ శ్లో.

తా॥ అటుపిమ్మట మహత్తత్త్వము మొదలుకొని విశేషములఅకు నుండు తత్త్వములు ఒక్కటి వేఱొక్కటి నాశ్రయము గాఁగలవియు, పరస్పరము సంయోగమును పొందినవియునునై అణ్డమును గలుగఁజేయుచున్నవి.

శ్లో॥ సూత్రకారోపి భూతానాం త్రిరూపత్వం తథాఽవదత్।
"త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్" ఇతి తేనాభిధాభిదా॥

తా॥ సూత్రకారులు సయితము పృథివ్యాది భూతములు మూఁడాకారములు గలవియని "త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్" అనెడి సూత్రముచేఁ జెప్పియున్నారు.

శ్లో॥ సోమాభావే చ పూతీకగ్రహణం శ్రుతిచోదితం।
సోమావయవ సద్భావాదితి న్యాయవిదో విదుః॥

తా॥ యజ్ఞము నాచరించునపుడు సోమలత లేనియెడల పూతీక తీగయొక్క ముక్కలను స్వీకరించునదియని శ్రుతి విధించుచున్నది. అట్లు విధించుటకుఁ గారణము పూతీకమున సోమలతయొక్క యవయవములుండుటయే యని మీమాంసకులు చెప్పుచున్నారు.

శ్లో॥ వ్రీహ్యభావేచ నీవారగ్రహణం వ్రీహిభావతః।
తదేవ సదృశం తస్య యద్వద్ధ్రీవైర్యైక దేశభాక్॥

తా॥ వడ్లు లేనియెడల నీవారధాన్యములను గ్రహించుటయును నీవారధాన్యములలో వడ్లయొక్క యవయవము లుండుటవలననే పొసగుచున్నది. కావున ఏ వస్తువు ఏవస్తువుయొక్క అవయవములు కలదో, ఆ వస్తువు ఆ వస్తువుతో సదృశమైనది.

శ్లో॥ శుక్త్యాదా రజతాదేశ్చ భావ శ్శ్రుత్యైవ చోదితః।
రూప్యశుక్త్యాది నిర్దేశభేదో భూయ స్త్వపేక్షకః॥

తా॥ ముత్యపుచిప్ప మొదలగు దానియందు వెండి మొదలగునది యున్నట్లు శ్రుతియే తెలుపుచున్నది "ఇది. వెండి, అది ముత్యపుచిప్ప" అని యిట్లు వానిని వేఱువేఱుగా వ్యవహరించుట ఆయా యవయవములను విస్తరముగా గలిగి యుండుటను బట్టి వచ్చినది. ఏలనసిన,

శ్లో॥ రూప్యాదిసదృశశ్చాయం శుక్త్యాది రుపలభ్యతే।
అత స్తస్యాఽత్రసద్భావఽపి ప్రతీతేరపి నిశ్చితః॥

తా॥ ముత్యపుచిప్ప వెండి మొదలగుదానితో సదృశమైనదిగానే గన్పట్టుచున్నది కాఁబట్టి ముత్యపుచిప్ప మొదలగు దానియందు వెండి మొదలగునది కలదని మన కట్లు గానఁబడుటచేతను నిశ్చితమగుచున్నది.

శ్లో॥ కదాచి చ్చక్షురాదేస్తు దోషాచ్ఛుక్త్యంశవర్జితః।
రజతాంశో గృహీతోఽతో రజతార్థీ ప్రవర్తతే॥

తా॥ దృష్టియందుండు దోషమువలన, ఒకప్పుడు ముత్యపు చిప్పయొక్క యంశము గ్రహింపఁబడక వెండియొక్క యంశము మాత్రము గ్రహింపఁబడును. అందువలన వెండి కావలయునని కోరువాఁడు అందులకై ప్రవర్తించును.

శ్లో॥ దోషహానౌ తు శుక్త్యంశే గృహీతే తన్నివర్తతే।
అతో యథార్థం రూప్యాది విజ్ఞానం శుక్తికాదిషు॥

తా॥ అట్టి దోషము పోయినతోడనే ముత్యపుచిప్ప యంశము గ్రహింపఁబడఁగా, వెండి యనెడి జ్ఞానము నివర్తించును కాఁబట్టి ముత్యపుచిప్ప మొదలగుదానిని గుఱించి వెండి మొదలగునది యనెడి జ్ఞానము యథార్థమైనది.

శ్లో॥ బాధ్య బాధక భావోఽపి భూయ స్త్వే నోపపద్యతే।
శుక్తిభూయ స్త్వవైకల్య సాకల్య గ్రహరూపతః॥

తా॥ ఒక జ్ఞానము బాధింపఁబడునది యగుటయు, వేఱొక జ్ఞానము బాధించునది యగుటయును ఈ రెండును గూడ భూయస్త్వము (ఒక్కటి యెక్కువగానుండుట) చేతనే కుదురుచున్నవి. ముత్యపుచిప్ప వెండిగాఁదోఁచినతావున ముత్యపుచిప్ప యంశము కొంచముగాఁగలదని గ్రహించుట భ్రమము. అంతయును ముత్యపుచిప్ప భాగమేయని గ్రహించుట బాధము.

శ్లో॥ నాఽతో మిథ్యార్థ సత్యార్థ విషయత్వ నిబన్ధనః।
ఏవం సర్వస్య సర్వత్ర వ్యవహారవ్యవస్థితిః॥

తా॥ కాఁబట్టి యసత్యమైన దానిని తెలుపునట్టి జ్ఞానము బాధింపఁ బడునదియనియు సత్యమైనదానిని తెలుపునట్టి జ్ఞానము బాధించునది యనియును నిట్టి నియమము లేదు. అన్ని వస్తువులును అన్నివస్తువుల స్వరూపములు గలవై నను వ్యవహారము ఏర్పడును.

స్వప్న గతులగు వారిచే మాత్రమే యనుభవింపఁబడునదియు, స్వప్న మెంత వఱకుండునో అంతవఱకుమాత్రమే యుండునదియును నగునట్టి పదార్థములను, ఆయా ప్రాణుల పుణ్యపాపాను గుణముగా, భగవంతుఁడే సృజించుచున్నాఁడు.

కనుకనే "న తత్ర రథా న రథయోగా న పన్థానో భవన్తి అథ రథాన్ రథయోగాన్పథ స్సృజతే । న తత్రా నన్దా ముదః ప్రముదో భవన్తి అథా నన్దాన్ముదః ప్రముద స్సృజతే । న తత్ర వేశాన్తాః పుష్కరిణ్య స్స్రవన్త్యో భవన్తి అథ వేశాన్తాన్ పుష్కరిణ్య స్స్రవన్త్య స్సృజతే । స హి కర్తా" (బృ. ౬-అ ౩ బ్రా. ౧౦ వా.) (స్వప్నమున రథములును, రథములకుఁ గట్టినగుఱ్ఱము లును, ఆ రథములు సంచరించు మార్గములును లేవు. అయితే రథములను, రథములకుఁ గట్టిన గుఱ్ఱములను, రథములు సంచరించు మార్గములను సృజించుచున్నాఁడు. స్వప్నమున ఆనందములును, సంతోషములును, అతిశయముతోఁ గూడుకొనిన సంతోషములును లేవు. అయితే ఆనందములను, సంతోష ములను, అతిశయముతోఁ గూడుకొనిన సంతోషములను సృజించుచున్నాఁడు. స్వప్నమున చిన్నచిన్న నీటిగుంటలును, పుష్కరిణులును లేవు. అయితే చిన్న చిన్న నీటిగుంటలను, పుష్కరిణులను సృజించుచున్నాఁడు. వాఁడు గదా కర్త) అని యిట్లు వాజసనేయులు పఠించుచున్నారు. కలలోఁ గానఁబడునట్టి యా రథాదు లితరులకందఱికి ననుభవ యోగ్యములు కాక పోయినను, కలఁగను వానికి మాత్రమే యనుభవ యోగ్యములయినవి. ఆ పదార్థములను సర్వే శ్వరుఁడు సృజించుచున్నాడు. కనుక, "అతఁడు గదా కర్త" అనగా సత్యసం కల్పుఁడును, ఆశ్చర్యభూతమగు శక్తిగలవాఁడునునగు వానికే యట్టి కర్తృత్వము సంభవమనుట. మఱియు "య ఏషు సుప్తేషు జాగర్తి కామంకామం పురుషో నిర్మిమాణః । తదేవ శుక్రం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే తస్మిన్లోకాః శ్రితా స్సర్వే తదునాత్యేతి కశ్చన" (కఠ ౨. అ. ౫. వ. ౮. వా) ఏ పురుషుఁడు వీ రలు నిద్రించునపుడు మేలుకొనియుండి ప్రీత్యాస్పదమైన ప్రతివస్తువును నిర్మించు చున్నాఁడో, అతఁడే ప్రకాశస్వరూపుఁడు, అతఁడే బ్రహ్మము మఱియు నతఁడే యమృతమనియును జెప్పఁబడుచున్నాఁడు. అతనినే యీలోకములన్నియు నాశ్ర యించి యున్నవి. ఎవ్వఁడును అతని నతిక్రమింపనేరఁడు.) అని చెప్పియుండుట చేతను సర్వేశ్వరుఁడే కర్తయని తెలియుచున్నది.

బ్రహ్మసూత్ర కారులును "సన్ధ్యే సృష్టిరాహ హి" (బ్ర. సూ. 3 అ. ౨ పా. ౧ సూ.) అనియు, "నిర్మాతారంచైకే పుత్రాదయశ్చ" (బ్ర. సూ. 3 అ. ౨ పా. ౨ సూ.) అనియు నీరెండు సూత్రములచే స్వప్నమునందు గానఁబడు పదార్థములను సృజించువాఁడు జీవుఁడా ? యని శంకించి "మాయామాత్రంతు కార్త్స్న్యేనానభివ్యక్త స్వరూపత్వాత్" (బ్ర. సూ. 3 అ. ౨ పా. 3 సూ.) అను నీ మొదలగు సూత్రములచే నిట్లు ప్రతిపాదించియున్నారు.— జీవునికి స్వాభావికములగు సత్యసంకల్పత్వము మొదలగు గుణములన్నియు సంసారదశయందు ప్రకాశింపక పోవుటచే నతఁడు స్వప్నమునందు గానఁబడు పదార్థములను తన సంకల్పమాత్రముచే సృజింపఁజాలఁడు. కనుక సర్వేశ్వరుఁడే స్వప్నగతులగు జీవులచే మాత్రము అనుభవింపఁ దగినదియు, అత్యాశ్చర్యకరమును నగు సృష్టి నొనర్చుచున్నాఁడు.

మఱియు "తస్మిన్లోకాః శ్రితాస్సర్వే తదునాత్యేతి కశ్చన" అనఁగా "లోకములన్నియు వానినే యాశ్రయించియున్నవి. అతని నెవ్వఁడును అతిక్రమింప నేరఁడు" అని శ్రుతియందు జెప్పియుండుటచే స్వప్నమునఁ గానఁబడు పదార్థములను సృజించువాఁడు పరమాత్మయేయని తెలుపఁబడియె. కావున జీవుఁడు కర్తయనెడి శంక పరిహరింపఁబడెను. మఱియు పడకమీఁదఁ బడియుండు శరీరమువంటిదియగు మఱియొక్క శరీరము స్వప్నమున సృజింపఁ బడుచున్నది. కావున ఇంటిగదిలోఁ బరుండిన మనుష్యుఁడు తన శరీరముతోనే దేశాంతర గమనము, రాజ్యాభిషేకము, శిరశ్ఛేదనము ఈ మొదలగువానిని తనపుణ్యాపాపానుగుణముగా స్వప్నమునం దనుభవించుచుండుట సంభవమగుచున్నది.

శ్వేత శంఖాది పదార్థములు పీతవర్ణములుగాఁ గానఁబడుటకు కారణమేమనఁగా, నేత్రమునందలి పిత్తపదార్థముతో సంయుక్తములైన నేత్ర రశ్ములు, మనము శంఖాదులయందు దృష్టిని ప్రసరించునపుడు, శంఖాదులతో సంయుక్తములగుచున్నవి. అప్పుడు శంఖాది పదార్థగతమగు శ్వేతవర్ణము నేత్రరశ్ములయందలి పీతవర్ణముచే నభిభూతమగుటంజేసి మనకుఁగానఁబడదు. కనుకనట్టి సమయమున నది బంగారపు పూతపూసిన శంఖమువలె పీతవర్ణముగలశంఖముగా మనకుఁదెలియ వచ్చుచున్నది. నేత్రమునందుండు పిత్తపదార్థముగాని దాని పీతవర్ణముగాని యతిసూక్ష్మము లగుటంజేసి చుట్టుప్రక్కల నున్నవారి కవి గానఁబడవు. అయితే యవి యతిసూక్ష్మములయినను, తన నేత్రమునందే యుండునవి యగుటచే నతిసమీపము లయినందున, పిత్తరోగము గలవానికి మాత్రము అవి గానఁబడును. [1]సమీపమునందుండునట్టి పీతవర్ణమును నిరంతరము చూచుటచేఁ గలుగు సంస్కా-

---

(1) సమీపమునందుండు శంఖము పీత వర్ణము గలదిగాఁ గానఁబడు గాక. అయితే దూరము నందుండు శంఖము నయితేమట్లు గానఁబడుటకు హేతువేమనఁగా, అతి దూరము ఎగిరిపోయిన పక్షి

రవశమున దూరముగానుండు పదార్థములయందలి పీతవర్ణమును గూడ చూచుటకు ఈ నయనరశ్మలు సమర్థము లగుచున్నవి.

[1]ఇట్లే జపాకుసుమముయొక్క సమీపముననుండు స్ఫటికము సయితము జపాకుసుమముయొక్క యెఱుపువర్ణముచే నభిభూతిమై యెఱుపువర్ణముగలదిగాఁ గానఁబడును. జపాకుసుమముయొక్క కాంతి సమీపమునసుండు స్ఫటికేతర పదార్థములనుగూడ వ్యాపించినదైనను, స్ఫటికము నిర్మలమైనందున దానిమీఁదఁ బడిన కాంతిమాత్రము మనకు స్పష్టముగాఁ దెలియుచున్నది.

ఎండమావులయం దుదకమున్నట్లు గానఁబడుటకు హేతువేమనిన, [2]తేజస్సున్ను, పృథివియు నుదకస్థానము లగుటచే ఉదకము వానియందుండునది. ఇంద్రియ దోషముచే పృథివీ తేజస్సులు మనకుఁ గానఁబడక అదృష్టవశమున ఉదకము మాత్రమే గానఁబడుచున్నది. కనుక ఎండమావులయం దుదకము కలదనెడి జ్ఞానము సత్యమైనదియే గాని మిథ్యకాదు.

కొఱవిచక్రమునఁగూడ కొఱవి యతిశీఘ్రముగాఁదిరుగుటచే నది యన్ని ప్రదేశములతో సంబంధించుట వలన మధ్యనుండు నట్టి యవకాశము మనకుఁ గానఁబడక అవకాశ మేమియు లేనట్లు కానఁబడుట సంభవము. (నట్టి) చక్రము తెలియవచ్చునప్పుడును అవకాశ మగపడక ఆయాప్రదేశముతో సంబంధించిన ఆయావస్తువు తెలియవచ్చుటయే గలుగును. ఇందు కొన్నితావుల నవకాశ మగపడక పోవుటకు కారణ మవకాశ మెద్దియును లేకపోవుటయే. వాటికొన్ని తావుల వేగాతిశయమువలన నవకాశమున్నట్టు తెలియదు. ఇంతియే విశేషము.

[3]దర్పణాదులయందు తన ముఖము మొదలగునది తెలియవచ్చుటయును సత్యమే. ఏలననిన, నేత్ర రశ్మలు దర్పణాదులయందు ప్రసరింపగా నవి యాదర్పణాదులచే నడ్డగింపఁబడును. అప్పుడవి దర్పణాది ప్రదేశమును గ్రహించుచు ముఖాదులనుగూడ గ్రహించుచున్నవి. ఇచటఁగూడ నవకాశమున్నను, అతి శైఘ్ర్యవశమున నది గానఁబడక ముఖాదులుమాత్రమే గానఁబడుచున్నవి.

---

గానఁబడని దైనను అది మన సమీపమున నెసురుచున్నట్టి కాలమున మనచే జూపబడుటచే నట్టి సంస్కారము మన నయనరశ్మలకు కద్దు. అందువలన నది దూరముగా నున్నను మనకు గానఁబడును గదా.-అట్లే యిచటను యెఱుంగునది.

(1) జగత్తనెడి జ్ఞానము భ్రాంతిమాత్రమని నిరూపించుటకై యీ యుదాహరణముల నద్వైతులు వారి మతగ్రంథములయం దచ్చటచ్చటఁ గాన్పించి యున్నారు.

(2) " అగ్నేరాపః " అను శ్రుతివాక్యమును బట్టి అగ్నియం దుదకము కలదు.

(3) ౧౨౮ వ పత్రముననుండు ౧ వ వివరణమును చూడుము.

దిగ్భ్రమము గలుగు తావునను ఈ దిక్కునందు దిగంతరము గలదు. అదృష్టవశమున నీదిక్కు మనకుఁ దెలియక దానియందుండు దిగంతరమే తెలియుచున్నది. కనుక దిగంతరజ్ఞానము సయితము సత్యమయినదే.

చంద్రుఁ డొక్కఁడే యయినను, రెండుగాఁ దెలియనచ్చుటకు హేతు వేమనిన :—వ్రేలి కొనచే కంటియొక్క రెప్పనొత్తి నందువలనఁ గాని, [1]తిమిరాది నేత్రరోగమువలనఁ గాని నేత్రరశ్మలు ద్వివిధగతులుగా విభజింపఁబడుటచే దర్శన సామగ్రి రెండు శాఖలుగా విభజింపఁబడుచున్నది. ఇట్లు పరస్పర నిరపేక్షములగు నీరెండు దర్శనసామగ్రీశాఖలును ఒక్కఁడగు చంద్రుని రెండు చంద్రులనుగాఁ దెలియఁజేయుటకు హేతుభూతము లగుచున్నవి.

ఎట్లనః—ఆ రెండు దర్శనసామగ్రీశాఖలలో నొక్కటి చంద్రుఁడు వాస్తవముగా నేప్రదేశమున నున్నాఁడో, ఆ ప్రదేశముననుండునట్టి వానినిగానే యతనిఁ దెలియఁ జేయుచున్నది. రెండవశాఖ కొంచము వక్రగతిగలదై వాస్తవముగాఁ జంద్రుఁడుండుప్రదేశమునకు సమీపముననుండు ప్రదేశమును గానఁబఱచుచు చంద్రుని స్వదేశవియుక్తునిగాఁ (నేఱుప్రదేశముననుండు వానినిగాఁ) దెలియఁజేయుచున్నది. ఇట్లు రెండు తెగలగు దర్శనసామగ్రులును ఏకకాలమున నానిని రెండు ప్రదేశములయందుండు వానినిగాఁ దెలియఁజేయుటచే వానిని గుఱించిన జ్ఞానమునందును భేదము గలదు. ఇట్లు జ్ఞానమునందు భేద ముండుటనుబట్టి యా జ్ఞానముచేఁ దెలుపఁబడు పదార్థమునందుఁగూడ భేదము సంప్రాప్తమగును. ఇందువలన చంద్రుఁడొక్కఁడను జ్ఞానము లేకపోవుటచే చంద్రు లిద్దఱను జ్ఞానము అనగా ద్విచంద్రత్వజ్ఞానము గలుగుచున్నది.

అయితే యీ చంద్రుఁడు ప్రదేశాంతరగతుఁడుగాఁ దెలియఁబడుటకు హేతు వేమనిన :—ప్రదేశాంతరమును, స్వదేశవియుక్తుఁడగు చంద్రుఁడును నిరంతరము గానంబడుటచేనట్లు తెలియుట సంభవము. ఈ పైని నిరూపించిన ప్రకారము దర్శనసామగ్రి రెండు తెగలుగా నగుట సత్యము. అందు మూలముగా రెండు ప్రదేశములయందు రెండు చంద్రులు తెలియనచ్చుటయును సత్యము. ఇట్లు చంద్రజ్ఞానమున ద్వైవిధ్య ముండుటంబట్టి చంద్రుఁడు రెండుగాఁ దెలియుటయును సత్యము. ఇట్లు రెండు ప్రదేశములతో సంబంధించినవిగాఁ దెలియబడు నీరెండు చంద్రులకు నాధార మాయొక్క చంద్రుఁడే యనెడి విషయమును దెలిసికొను సామర్థ్యము పూర్వ సంస్కారమున కున్నట్లు, కేవలచక్షుస్సుల కుండనేరదు. కనుక అప్పుడు చంద్రుఁడు రెండుగానే గానఁబడును. అయితే రెండు నేత్రములయందలి రశ్మలును చేరి యొక్కటియే దర్శనసామగ్రిగా నగుచున్న వయినను, తిమి

(1) ౧౩౫ వ పత్రమునందు ౧ వ వివరణమును చూడుము.

రాది నేత్రరోగమువలన చాక్షుష తేజస్సు విభక్తమై ద్వివిధ సామగ్రులుగా నగు చుండుట, చంద్రుడు రెండుగాఁ దెలియుటను బట్టి, కల్పింపఁదగినది. ఇట్టి నేత్రరోగము నివర్తించిన వో, చంద్రుఁడొక్కఁడుగాఁ దన తావునఁ గనుపించును. కాఁబట్టి నేత్రదోషముచే దర్శనసామగ్రియందు ద్వైవిధ్యమున్న, దర్శనసామగ్రియందలి ద్వైవిధ్యమును బట్టి జ్ఞానమునందు ద్వైవిధ్యమున్న, జ్ఞానమునందు ద్వైవిధ్యము నుబట్టి జ్ఞేయ పదార్థముయొక్క వ్యక్తిమందు ద్వైవిధ్యమున్న గలుగుచున్నవని సిద్ధమగుచున్నది. కావున నిందెద్దియు నాక్షేపము లేదు.

ఈ పై హేతువులను బట్టి విజ్ఞానమంతయు యథార్థమని నిరూపింపఁబడి యె. అయినను, ఖ్యాత్యంతరములను గుఱించి కొన్ని దూషణములు గలవు. అయి తే ఆ మాయావాదులు వానిని గానఁబఱచియున్నారుగాన, అందు విషయమై యిచ ట ప్రయత్నింప నక్కఱలేదు. అయిన నీ విషయము నిట్లు పలు తెఱంగుల నుప పాదింపనేల ? ప్రత్యక్షాను మానాగమములను ప్రమాణముల నొప్పుకొనువారును, వానిలో నాగమ ప్రమాణముచేఁ దెలుపఁబడినదియు, దోషము లేమాత్రము లేని దియు, లెక్కలేని కల్యాణగుణములు గలదియు, సర్వజ్ఞమైనదియు, సత్య సంకల్పము గల పరబ్రహ్మమును నొప్పుకొనువారగువారిచేఁ బ్రకటింపచుట కేవ యసంభ వము ? అదెట్లనిన, భగవంతుఁడు జీవుల పుణ్యాపా పానుగుణముగా వారల కను భవయోగ్యమైన జగత్తును సృజించునప్పు డతఁడు పదార్థములను సుఖదుఃఖాను భవము నిచ్చు వానినిగాను సృజించెను. అప్పుడతఁడు, వానిలోఁ గొన్నింటిని నందఱిచే పొదువుగా ననుభవింపఁదగిన వానినిగానును—మఱి కొన్నింటిని కొందఱిచేమాత్రము అనుభవింపఁ దగిన వానినిగాను కొంతకాలము మాత్రమే యుండి ఆ కాలమునందు మాత్రము అనుభవయోగ్యములుగానును—సృజిం చెను. ఈ కారణము వలననే కొన్ని పదార్థములు అందఱిచే పొదువుగా నను భవింపఁబడునవి గాను, మఱికొన్ని పదార్థము లట్లుగాక కొందఱిచే మాత్రమే యనుభవింపఁబడునవిగానునుండుట సంభవము. అందువలననే బాధ్యబాధక భావము సంభవమగుచున్నది. కనుక స్వప్నము యుక్తమే.

"సత్" అనియు "అసత్" అనియును జెప్పుటకు శక్యముగాని యజ్ఞాన మనఁబడునది శ్రుతిసిద్ధమని యద్వైతులుచేయు వాదమును యుక్తముకాదు "అనృతే నహి ప్రత్యూఢాః" అను ఛాందోగ్యవాక్యము "అనృత" శబ్దముచే సదసదనిర్వచనీయమగు నజ్ఞానమును జెప్పుచున్నదే యని యందురేమో ? అట్లు చెప్పుట సరికాదు. ఈతావున, "అనృత" మనఁగా "ఋతము" కానిదనుట. "ఋతంపిబన్తౌ సుకృతస్య లోకే" అను శ్రుతియందు "ఋత" శబ్దము కర్మ వాచిగాఁ బ్రయోగింపఁబడుట వలన "ఋతం" అనఁగాఁ గర్మమని యర్థము. ఫలా

పేక్షలేక పరమపురుషారాధన రూపముగా ననుష్ఠింపఁబడు కర్మము పరమపురుష ప్రాప్తికి సాధనమగుచున్నది. ఇట్టి కర్మము "ఋత" మనిచెప్పఁబడుచున్నది. ఫలాపేక్షతో ననుష్ఠింపఁబడుటచే బ్రహ్మప్రాప్తికి విరోధియగు కర్మము "అనృత" మని చెప్పబడుచున్నది. కనుకనే "ఏతం బ్రహ్మలోకం న విన్దన్తి అనృతేనహి ప్రత్యూఢాః" (ఛా. ౮ ప్ర. ౩ ఖ. ౨ వా.) అనఁగా ఫలాపేక్షతో కర్మము ననుష్ఠించువారలు బ్రహ్మలోకమును బొందరని శ్రుతియే వక్కాణించుచున్నది.

"నాసదాసీ న్నోసదాసీత్తమ ఆసీత్" (న-అసత్-ఆసీత్-నో-సత్-ఆసీత్-తమః-ఆసీత్) అను వాక్యమునందును "సత్" శబ్దమును "అసత్" శబ్దమును వ్యష్టిభూతములగు చిదచిత్పదార్థములను తెపునవి. ఏలననిన, సృష్టిసమయమున "సత్" అనియు "త్యత్" అనియును బిలువఁబడు వ్యష్టిభూతములగు చేతనాచేతనపదార్థములు ప్రళయసమయమున అచిత్సమష్టిభూతమును తమస్సనంబడు పదార్థమునందు లీనమగుచున్నవని యీపైవాక్యము తెలుపుచున్నది. కావున నిచట అనిర్వచనీయమయినదేదియును జెప్పఁబడియుండలేదు. అయితే యొక కాలమున సదసత్పదార్థములు సత్తుగా లేవని మాత్రమే యీ వాక్యము చెప్పుచున్నది యిచట "తమ" శ్శబ్దము అచిత్పదార్థముల సమష్టిని దెలియజేయునది యని శ్రుత్యంతరమువలన నవగత మగుచున్నది. ఎట్లన "అవ్యక్త మక్షరే లీయతే అక్షరం తమసి లీయతే" అను శ్రుతివాక్యము "అవ్యక్త మక్షరమందును అక్షరము తమస్సునందును (=అచిత్సమష్టిరూపమగు వస్తువునందును) లీనమగుచున్నదని కదా చెప్పుచున్నది.

అద్వైతి:—వాస్తవమే, అయితే ఈతావున తమశ్శబ్దము అచిత్సమష్టిరూపమగు ప్రకృతియొక్క సూక్ష్మావస్థను తెలుపునది. ప్రకృతియొక్క యీ సూక్ష్మావస్థనే కదా "మాయాంతు ప్రకృతిం విద్యాత్" ఇత్యాది శ్రుతులు మాయ యను పేరున పిలుచుచున్నవి. అనిర్వచనీయమైనదియే గదా! మాయయనఁబడుచున్నది?

భాష్యకారులు:—అట్లు చెప్పుట యుక్తము కాదు, మాయాశబ్దము అనిర్వచనీయమైన దానిని తెలుపునదిగా నెచటను గానఁబడదు.

అద్వైతి:—అది యేల? మాయయనఁగా మిథ్యయన్నట్లు గదా! అనిర్వచనీయమైనదానిని గదా మిథ్య యందుము, కాఁబట్టి మాయయనఁగా అనిర్వచనీయమని యర్థము.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, మాయాశబ్దము అన్నితావులను మిథ్యావాచకమననేరము. అసురులయొక్కయును, రాక్షసులయొక్క

యను అస్త్రములు మొదలగునవి సత్యములే యైనను మాయాశబ్దముచే నిర్దే శింపఁబడుచున్నవి. ఎట్లన,

శ్లో॥ తేన మాయా సహస్రం తచ్ఛంబరస్యాశుగామినా।
బాలస్య రక్షతా దేహ మైకైకశ్యేన సూదితమ్॥
విష్ణు. ౧ అం. ౧౯ అ. ౨౦ శ్లో॥

తా॥ శీఘ్రముగా నడచుచు బాలుని రక్షించుచున్న ఆవ్యక్తిచేత శంబరాసురుని యొక్క మాయలు అనఁగా అస్త్రములు వేయియును ఒక్కటి యొక్కటిగా ఛేదింపఁబడినవి.

కాఁబట్టి మాయయనఁగా విచిత్రవస్తువులను సృజించునది యని యర్థము. విచిత్ర వస్తువులను సృజించునది యగుటంజేసియే ప్రకృతియును మాయయనఁబడు చున్నది.

"అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః" (శ్వే. ४ అ. ౧౦ వా.) అను శ్రుతివాక్యము "ఇందువలన మాయగలవాఁడగు సర్వేశ్వరుఁడు ఈ జగత్తును సృజించుచున్నాఁడు. ఆ జగత్తునందు మఱియొక్కఁడు మాయచే నిరోధింపఁబడిన వాఁడు" అని చెప్పుచు మాయయనంబడు ప్రకృతిని విచిత్రవస్తువులను సృజించుదానినిగాఁ బ్రదర్శించుచున్నది. సర్వేశ్వరుఁడు ప్రకృతిని శేషభూతముగాఁ గలిగియుండుటచే "మాయీ=మాయగలవాఁడు" అని యీపై శ్రుతియందు నిర్దేశింపఁబడుచున్నాఁడేకాని, యజ్ఞానముగలవాఁడగుటచే యట్లు నిర్దేశింపఁబడుచుండ లేదు. సర్వేశ్వరునికంటె వేఱగు జీవుఁడు మాత్రమే గదా మాయచే నిరోధింపఁబడిన వాఁడుగా "తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః" అనియు, "అనాదిమాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే" అనియు నీమొదలగు శ్రుతివాక్యములచేఁ దెలుపఁబడుచున్నాఁడు.

"ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే" అను శ్రుతివాక్యముగూడ, మాయాశబ్దముచే విచిత్రశక్తులను తెలుపుచున్నది. కనుకనే "భూరి త్వష్టా విరాజతే" అను తరువాతి వాక్యము "అట్టిమాయలతోఁ గూడుకొనినవాఁడై యింద్రుఁడెక్కువగాఁ బ్రకాశించుచున్నాఁడు" అని చెప్పుచున్నది. అద్వైతులు వాదించుప్రకారము ఈతావున, మాయాశబ్దము మిథ్యాజ్ఞానమును తెలుపునది యగు పక్షమున, "భూరి త్వష్టా విరాజతే" అను వాక్యమునకు "ఇంద్రుఁడు మిథ్యాజ్ఞానముచే తిరస్కరింపఁబడినవాఁడై ఎక్కువగాఁ బ్రకాశించుచున్నాఁడు" అని యర్థము గావలసియుండును. మిథ్యాజ్ఞానముచేఁ దిరస్కరింపఁబడినవాఁడు ఎక్కువగాఁ బ్రకాశించుట యెచటనైనను గద్దా?

మఱియు "మమ మాయా దురత్యయా" అను శ్రీభగవద్గీతాశ్లోకమున "మాయ" యనఁబడు నది 'గుణమయమయినదిగాఁ దెలుపఁ బడుటంజేసి యీ తావున మాయాశబ్దముచే సత్త్వరజస్తమో గుణాత్మకమగు ప్రకృతియే వివక్షితమని యెఱుంగునది. కాఁబట్టి శ్రుతులయం దెచటను సదసద నిర్వచనీయ మగునట్టి యజ్ఞానము ప్రతిపాదింపఁబడి యుండలేదు.

అద్వైతి:—అజ్ఞాన మనఁబడునదొక్కటి యుండబట్టి గదా అట్టి యజ్ఞానమును బోఁగొట్టుటకై "తత్త్వమసి" అను మహావాక్యము జీవాత్మ పరమాత్మల కైక్యమును అనఁగా జీవాత్మయన్నను పరమాత్మయన్నను ఒక్కటియే పదార్థమని బోధించుచున్నది. అట్టి యజ్ఞాన మనంబడునదొక్కటియు లేనిచో, ఇట్టి యైక్యోపదేశ మనుపపన్నమగును అనఁగా నిరర్థకమగును. కావున భావరూప మగునజ్ఞాన మనఁబడునది యొక్కటి కలదని యొప్పుకొనక తప్పదు.

భాష్యకారులు:—"తత్త్వమసి" మొదలగు శ్రుతులయం దుపదేశింపఁ బడిన బ్రహ్మాత్మైక్యము వేఱొకవిధముగా కుదురకుండుటచే బ్రహ్మమున కజ్ఞానము కలదని కల్పించుకొనవలయును" అని యద్వైతులు చేయువాదము యుక్తమైనది కాదు. ఏలననిన, "తత్త్వమసి" అనువాక్యము జీవాత్మ పరమాత్మల కైక్యము నుపదేశింపగా, సర్వజ్ఞుడును, సత్యసంకల్పుఁడును, జగత్తుయొక్క సృష్టి స్థితి లయంబులకు కారణభూతుఁడును "తత్త్వమసి" అను వాక్యమందలి "తత్" అను శబ్దముచేఁ దెలుపఁబడువాఁడును, ప్రకరణావగతుఁడును నగు బ్రహ్మమునందు అట్టి బ్రహ్మస్వరూపమునకు విరుద్ధమగు నజ్ఞానమును కల్పించుకొనుట నావశ్యకమగునట్లు చేయునట్టి యనుపపత్తి యేదియును గానంబడదు. జీవశరీరకుఁడగు పరమాత్మను దెలియఁజేయుటంజేసి "త్వం" శబ్దము నయితము ఐక్యమును బాగుగా నుపదేశింపఁదగును. ఏలననిన, "అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా. ౬ ప్ర. 3 ఖ. ౨ వా) అను శ్రుతివాక్యము "పరమాత్మ జీవునితోఁగూడ నన్నిపదార్థములలో నాత్మగాఁ బ్రవేశించి వానికి నామరూపములను గలుగఁజేసెను" అనుచు, సమస్తవస్తువులును పరమాత్మ పర్యంతములేయై నామరూపములను బొందునవి యగుచున్నవని తెలుపుచున్నది. కాఁబట్టి బ్రహ్మమున కజ్ఞానము కలదని కల్పింప నక్కఱలేదు.

భాష్యకారులు:—ఇతిహాస పురాణములయం దెచటను పరబ్రహ్మమున కజ్ఞానము కలదని చెప్పియున్నట్లు గానఁబడదు.

అద్వైతి:—అట్లు చెప్పఁదగదు. విష్ణుపురాణమున, [1]"జ్యోతీంషి విష్ణుః" అను శ్లోకమున, బ్రహ్మమొక్కటియే తత్త్వమని ప్రతిజ్ఞచేసి, "జ్ఞానస్వరూపోభగవాన్ యతోఽసౌ" (3౭ పు. ౬ పం.) అను శ్లోకమున, శైలాబ్ధిధరాదిభేదభిన్నమగు జగత్తు జ్ఞానైకస్వరూపమగు బ్రహ్మమునకుఁగల యజ్ఞానము మూలముగాఁ గల్పింపఁబడినదని చెప్పి, తరువాత "యదా తు శుద్ధం నిజరూపి" (3౭ పు. ౧౮ పం) అను శ్లోకమున జ్ఞానస్వరూపమగు బ్రహ్మము స్వస్వరూపములో నుండు సమయమున నీ వస్తుభేదమెద్దియును గానంబడకుండుటంజేసి యిది యంతయు నజ్ఞానమునుండి కలిగినదనెడి యంశమును స్థిరపఱచి, [2]"వస్త్వస్తి కిమ్" అనియు, "మహీఘటత్వం" అనియు నీరెండు శ్లోకములచేతను "జగత్తు గానఁబడెడి రీతిని బట్టియును వస్తుభేదము లసత్యములు" అని తెలియఁజేసి, తరువాత "తస్మాన్న విజ్ఞానమృతేఽస్తి కిఞ్చిత్" (3౭ పు. ౨3 పం) అను శ్లోకమున బ్రహ్మవ్యతిరిక్తమయిన దంతయు నసత్యమని యిట్లింతకు పూర్వము ప్రతిజ్ఞచేసిన యంశమును ముగించి, తరువాత "విజ్ఞానమేకం" (3౭ పు. ౨౮ పం.) అనుటచే "జ్ఞానస్వరూపమగు బ్రహ్మమునందు భేదజ్ఞానమునకు కారణమైన యజ్ఞానమునకు మూలమయినది తన కర్మమే యనిస్పష్టపఱచి, తరువాత "జ్ఞానంవిశుద్ధం" (3౮ పు. ౫ పం.) అను శ్లోకమున, జ్ఞానస్వరూపుఁడగు బ్రహ్మముయొక్క స్వరూపమును పరిశీలించి, "సద్భావ ఏవం భవతో మయోక్తః" (3౮ పు. ౧3 పం.) అను శ్లోకమున, "జ్ఞానస్వరూపమగు బ్రహ్మమే సత్యముగాని తదితర

(1) శ్లో॥ జ్యోతీంషి విష్ణు ర్భువనాని విష్ణు ర్వనాని విష్ణు ర్గిరయో దిశశ్చ।
నద్యస్సముద్రాశ్చ స ఏవ సర్వం యదస్తి యన్నాస్తిచ విప్రవర్య॥
విష్ణు. ౨ అం. ౧౧ అ. 3౮ శ్లో॥

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! సూర్యచంద్రాది జ్యోతిస్సులు విష్ణువు. లోకములు విష్ణువు. అడవులు విష్ణువు, పర్వతములును దిక్కులును విష్ణువు. నదులును సముద్రములును ఇప్పుడున్నదియు, ఇప్పుడు లేనిదియును అంతయును విష్ణువే.

(2) శ్లో॥ వస్త్వస్తికిం కుత్రచిదాది మధ్యపర్యన్తహీనం సతతైకరూపం।
యచ్చాన్యథాత్వం ద్విజ యాతి భూయో న తత్తథా తత్ర కుతో హి తత్త్వమ్॥
శ్లో॥ మహీఘటత్వం ఘటతః కపాలికా కపాలికాచూర్ణరజస్తతోఽణుః।
జనైస్స్వకర్మస్తిమితాత్మనిశ్చయై రాలక్ష్యతే బ్రూహి కిమత్ర వస్తు॥
విష్ణు. ౨ అం. ౧౨ అ. ౪౨-౪3 శ్లో॥

తా॥ ఆదిమధ్యావసానములు లేనిదియు, ఎల్లకాలము నొక్కవిధముగా నుండెడి వస్తు వెచ్చటనైనఁ గలదా? ఓ బ్రాహ్మణుఁడా! ఏది మఱియొక్కవిధముగా మాఱునదో, అది యుండియును నా ప్రకారముగానుండదు. అందు తత్త్వమెక్కడిది? మృత్తిక ఘటమగును. ఘటము పెంకులగును, పెంకులు చిన్నపెంకులగును. చిన్నపెంకులు చూర్ణమగును. చూర్ణము పరాగమగును. అది యణువగును. తామొనర్చిన కర్మమూలముగా దృఢమైన యాత్మనిశ్చయము గలవారు ప్రకృతమున దేనిని వస్తువునుగాఁ దెలిసికొనుచున్నారు?

మయినదెద్దియును సత్యముకాదు. దానికంటెను వేఱయినది యసత్యమే. అయితే ఆ బ్రహ్మముయొక్క లోకాదులు సత్యములగుట వ్యవహారసిద్ధము. ఇవ్విధమగు తత్త్వము నుపదేశింపఁబడితివి" అని యుపదేశించినట్లు గానఁబడుచున్నది.

భాష్యకారులు:— అట్లు చెప్పుట యుక్తము కాదు. ఈగ్రంథ సందర్భమున బ్రహ్మాండముయొక్క స్వరూపము విపులముగాఁ జెప్పఁబడి, ఇంతకు పూర్వము జెప్పఁబడని వేఱొక్కరూపమును సంక్షేపముగాఁ దెలుపుటకై యిట్లారంభింపఁబడుచున్నది.—చేతనాచేతన పదార్థ మిశ్రమమగు జగత్తునందు చేతనాంశము వాఙ్మనస్సుల కగోచరమైనది. తనకు మాత్రము తెలియఁదగిన స్వరూపభేదము గలది. అది జ్ఞానమే స్వరూపముగాఁగల దగుటంజేసి ప్రకృతిసంబంధములగు భేదము లేవియును లేనిది. అది నశించునదియును గాదు. కావున "అస్తి" (కలదు) అను శబ్దముచేఁ జెప్పఁదగినది. అచేతనాంశమన్ననో, చేతనాంశములయొక్క కర్మానుగుణముగా మార్పును పొందునది. కావున నది నశించునది. కాఁబట్టి యది "నాస్తి" (లేదు) అనుశబ్దముచే చెప్పఁదగినది. ఈ రెండు అంశములును పరబ్రహ్మంబగు వాసుదేవునియొక్క శరీరములుగాన, తదాత్మకములు అనఁగా వాసుదేవునే యాత్మగాఁ గలిగియుండునవి—కావున నీ గ్రంథ సందర్భమున ఈపైని గానఁబఱచిన స్వరూపము సంక్షేపముగాఁ జెప్పఁబడియె.

అదియెట్లనిన, "యదమ్బు వైష్ణవగ్ం కాయస్తతో విప్ర వసున్ధరా పద్మాకారా సముద్భూతా పర్వతాబ్ధ్యాది సంయుతా" (విష్ణు. ౨ అం. ౧౨ అ. ౩౭ శ్లో) (ఓ బ్రాహ్మణుఁడా! ఏ యుదకము విష్ణుసంబంధమైన శరీరమో, ఆయుదకము వలన పద్మాకారమును పర్వత సముద్రాదులతోఁ గూడి యున్నట్టిదియును నగు నీ జగత్తు గలిగినది.) అనుతావున, ఉదకము విష్ణువుయొక్క శరీరమగుటంజేసి యట్టి యుదక పరిణామమగు బ్రహ్మాండమున్ను విష్ణువుయొక్క శరీరమనియు, దానికి విష్ణువు ఆత్మయనియు నిట్లు చెప్పఁబడియె. ఇందువలన సమస్త శ్రుతులయందును జెప్పఁబడిన తాదాత్మ్యోపదేశమును విశదపఱచునదియు "జ్యోతీంషి విష్ణుః." ఇత్యాదితావులఁ జెప్పఁబడఁబోవునదియును నగు సామానాధి కరణ్యమునకు శరీరాత్మభావమే హేతువని తెలుపఁబడియె. ఈ గ్రంథమున, "తాని సర్వాణి తద్వపుః" అనియు, "తత్సర్వం వై హరేస్తనుః" అనియు, "సఏవ సర్వభూతాత్మా విశ్వరూపో యతోఽవ్యయః" అనియు నీమొదలగు తావుల నీయంశమును గుఱించి యింతకుపూర్వము పలుమాఱు చెప్పఁబడియె.

ఇట్లు శరీరాత్మ భావమునుబట్టి యుండునది యగు తాదాత్మ్యము "జ్యోతీంషివిష్ణుః" అను తావున సామానాధికరణ్యముచేఁ దెలుపఁబడుచున్నది. ఈ తావున అస్త్యాత్మకముగాను నాస్త్యాత్మకముగాను నుండు జగత్తు విష్ణువుయొక్క శరీరమగుటంజేసి యది విష్ణ్వాత్మకమని చెప్పఁబడినది.

ఈ సందర్భమున "జ్ఞానస్వరూపో భగవాన్యతోఽసౌ" (౩౭ పు. ౭ పం.) ఇత్యాదిశ్లోకము "ఇది అస్త్యాత్మకము, ఇది నాస్త్యాత్మకము. నాస్త్యాత్మక మగుటకు హేతువు ఇది" అను అంశమును తెలుపుచున్నది. సమస్తజీవులకు నాత్మయగు భగవంతునియొక్క స్వాభావికమగు స్వరూపము జ్ఞానమేగాని యది దేవమనుష్యాది వస్తురూపముకాదు. అది యిట్టి స్వరూపము గలదైనందున దానినుండియే అచిద్రూపములగు దేవమనుష్య పర్వతసముద్రాదులును (తద్వి జ్ఞాన విజృంభితాః) అనఁగా దేవమనుష్యాది రూపముగా తానసేకముగా వలయునని యిట్లు ఆ జ్ఞానైకాకారుఁడగు పరమాత్మయొక్క తలంపువలనఁగ లుగునవి.—దేవమనుష్యాద్యాకారాను సంధానరూపమగు కర్మమువలనఁ గలు గునవియని యర్థము. అచేతన పదార్థమన్ననో జీవునికర్మాను గుణముగాఁ బరి ణామమును (మార్పును) పొందునది గాన, నది "నాస్తి" యనఁబడునది. కావున తక్కినదంతయును "అస్తి" యనఁబడునది యని విశదమగుచున్నది.

పైని గానఁబఱచిన ఈ యంశమునే "యదా తు శుద్ధం నిజరూపి" (౩౭ పు. ౧౮ పం.) అను శ్లోకము వివరించుచున్నది. ఎట్లన, జ్ఞానైకాకార మగు ఆత్మవస్తువు తనయందు దేవాద్యాకారముగా వివిధ భావమును గుఱిం చిన యనుసంధాన మూలకములగు సర్వకర్మములను నశించుటచే నిర్దోష మును, పరిశుద్ధమును, తనకు స్వాభావికమగు రూపము గలదియును నగును. అప్పుడు తన్ను దేవాద్యాకారరూపముగాఁ గల్పించుకొనుటకు హేతుభూతము లును, కర్మఫలభూతములును, అట్టి కర్మఫలముల ననుభవించుటకై యేర్పడిన వియును నగు వస్తుభేదములు వస్తువులయందు గలుగవు. అనఁగా దేవాదిపదా ర్థము లాత్మగాఁ భావింపఁబడినప్పుడు భోగ్యభూతములగు దేవమనుష్య, పర్వత, సముద్రాది భేదము లేవి కలవో, అవి యన్నియును, అట్టిభావనకు హేతువు లగు కర్మములును నశింపఁగా, గలిగి యుండవని యర్థము. కావున అచేతన పదార్థము స్థిరముగానుండక అప్పు డప్పుడు గలుగునట్టి యవస్థా భేదములను పొందునది యగుటంజేసి యది "నాస్తి" (లేనిది) యని చెప్పఁదగినది. తక్కి నదో, ఎప్పుడును స్వభావసిద్ధమగు జ్ఞానైకాకారముగలది యగుటచే "అస్తి" (ఉండునది) యనఁబడునది యని భావము.

ఇట్లు ప్రతిక్షణమును తనయందు మార్పును పొందునది యగుటంజేసి యచేతన పదార్థము "నాస్తి" యనఁబడునదియే యనెడి విషయమును "వ స్త్వస్తికిమ్" అనెడి శ్లోకము తెలుపుచున్నది.

అయితే "అస్తి" యనఁబడునదియన్ననో, ఆదిమధ్యాంతరహితమును, ఎల్లప్పుడు నొక్క రూపముగానుండునట్టిదియును. ఏలననిన, అది యెన్నఁడును

"నాస్తి" అనెడి యంశముగలదికాదు కదా! అయితే అచిత్పదార్థ మేదియును ఎన్నఁడును అట్టిదిగాను గానఁబడి యుండలేదని "యచ్చాన్యథాత్వం" అను శ్లోకము తెలుపుచున్నది. ప్రతిక్షణమును వేఱువేఱు విధముగా మాఱునట్టి పదార్థము పైపై యాకార విశేషములను పొందుటచే నది ఇంతకు ముందున్నట్టి యాకారములను విడనాడునది. కావున నది యుత్తరోత్తరాకారములు గలదియగునప్పుడు పూర్వపూర్వాకారములు గలదిగాను గుర్తింపఁబడదు. అందువలన నది యెల్ల కాలమును "నాస్తి" యనఁదగినదియే. అది యవ్విధమైనదిగానే కదా తెలియవచ్చుచున్నది. ఈ విషయమునే "మహీఘటత్వం" అను శ్లోకము తెలుపుచున్నది.

తామింతకు పూర్వమొనర్చిన కర్మములనుబట్టి దేవమనుష్యాద్యాకారము గలుగుచున్నదనెడి భావనతో స్థిమితమైన యాత్మ నిశ్చయము గలవారు తమకు భోగ్యభూతమగు నచిత్పదార్థమును ప్రతిక్షణము మాఱునట్టి దానినిగాను తెలిసికొనుచున్నారు. కావున అచిత్పదార్థమైనది యేదైనను "అస్తి" యనఁదగినదిగాను, ఆదిమధ్యాంతరహితముగాను, ఎల్లప్పుడు నొకవిధమైనదిగా నుండునట్టిదిగానును గన్పట్టుచున్నదా? లేదని యభిప్రాయము. ఎందువలన నది యిట్టిదియో, అందువలన జ్ఞానస్వరూపమగు నాత్మ వస్తువుకంటెను వేఱయినదగు అచిత్పదార్థ మేదియును ఎన్నఁడును ఎచటను కేవలము "అస్తి" శబ్దవాచ్యముగాను గన్పట్టుచుండలేదని "తస్మాన్న విజ్ఞానమృతేఽస్తి కిఞ్చిత్" (౩౭ పు. ౨౩ వా.) అను శ్లోకము తెలుపుచున్నది.

"ఆత్మయన్ననో, అన్ని తావులను జ్ఞానైకాకారమగుటచే దేవాది భేదమునకు విరుద్ధమైన స్వరూపముగలదైనను, తనకుఁ దేవాది శరీరములలోఁ బ్రవేశమును గలుగఁజేయునదియు, స్వకృతమునునగు, వివిధకర్మము మూలముగాఁ గలుగు దేవాది భేదముకంటెను వేఱయిన స్వరూపముగలదనెడి జ్ఞానము గలవారిచే నది యాయా యాకారములనుబట్టి యనేకవిధములుగాఁ దలఁపఁబడుచున్నది. కావున అట్టి భేదజ్ఞానము ఆత్మ స్వరూపమును బట్టి గలుగునదికాదు." అని "విజ్ఞానమేకం" (౩౭ పు ౨౪ పం.) అను శ్లోకము తెలుపుచున్నది.

ఆత్మస్వరూపము కర్మరహితము. అందువలన నది మలరూపమగు ప్రకృతి స్పర్శము లేనిది. కావున నది యందుమూలముగాఁగలుగు శోక మోహ లోభాది సమస్త హేయగుణములతో సంబంధము లేనిది. వృద్ధి క్షయములను పొందునట్టిది కాక పోవుటచే నది యొక్కటియైనది. అందు వలననే అది యెల్లకాలము నొక్కవిధమైన రూపముగలది. తదాత్మకముకాని దేదియును లేనందున, అది వాసుదేవునికి శరీరమగుటంజేసి తదాత్మకము (వాసుదేవుఁడాత్మగాఁగలది). ఈ విషయమును "జ్ఞానం విశుద్ధం" (౩౮ పు. ౪ పం.) అను శ్లోకము తెలుపుచున్నది

"చిత్పదార్థాంశము ఎల్లకాలము నొక్కవిధమైన దైనందున ఎప్పుడును "అస్తి" యని చెప్పఁదగినదియే. అచిత్పదార్థాంశమన్ననో, ప్రతిక్షణమును మార్పును పొందునది యయినందున నది యెల్లకాలమును నాశము యొక్కయంశము గలదై "నాస్తి" యనఁదగినది. ఇట్లు చిదచిదాత్మకమగు జగత్తు వాసుదేవుని శరీరమగుట వలన వాసుదేవాత్మకము. ఇందువలన జగత్తుయొక్క యాథాత్మ్యము బాగుగాఁ దెలుపఁ బడియెను" అని "సద్భావ ఏవం" అను శ్లోకము చెప్పుచున్నది.

[1]"యదస్తి యద్నాస్తి" అను దానిచే నారంభింపఁబడిన యంశము "సత్యమసత్యం" (౩౦ పు. ౧౩ పం.) అనునది ముగించుచున్నది.

జ్ఞానైకాకారమగుటచే సమమయినదియు, శబ్దములచేఁదెలుపఁదగని స్వరూపభేదములుగలదియే యైనను, అచేతన పదార్థ విశిష్టమయినదియు, అణ్డాన్తర్గతమైనదియు, దేవమనుష్యాదిరూపముచే స్పష్టముగా వ్యవహరింపఁదగిన భేదముగలదియు నేదికలదో, దానిని గుఱించిన హేతువు కర్మమే యని "ఏతత్తు యత్" (౩౦ పు. ౧౩ పం.) ఇత్యాదివాక్యము తెలుపుచున్నది. ఈ విషయమునే [2]"యజ్ఞః పశుః" అను శ్లోకము వివరించుచున్నది.

ఇట్లు జగత్స్వరూపముయొక్క యాథాత్మ్యమునెఱుంగుటకు ప్రయోజనము మోక్షోపాయమునుగూర్చి ప్రయత్నమును జేయుటయేయని [3]"యచ్చైతత్" అను శ్లోకము తెలుపుచున్నది.

---

(1) ౨౨౭ వ పత్రమున ౧ వ వివరణమును చూడుము.

(2) శ్లో॥ యజ్ఞః పశుర్వహ్నిరశేషఋత్విక్సోమస్సురాః స్వర్గమయశ్చ కామః।
ఇత్యాదికర్మాశ్రితమార్గదృష్టం భూరాదిభోగాశ్చ ఫలాని తేషాం॥

విష్ణు. ౨ అం. ౧౨ అ. ౪౫ శ్లో॥

తా॥ యజ్ఞము, పశువు, సమస్తమైన అగ్ని, ఋత్విక్కులు, సోమము, దేవతలు, స్వర్గము, ఈస్వరూపమగు కామము మొదలగునది కర్మము నాశ్రయించిన మార్గమునఁ గనఁబడునది. భూలోకానుభవము మొదలగు భోగములు వాని ఫలములు.

(3) శ్లో॥ యచ్చైతద్భువనగతం మయా తవోక్తం సర్వత్ర వ్రజతి హి తత్ర కర్మవశ్యః।
జ్ఞాత్వైతద్ధ్రువమచలం సదైకరూపం తత్కుర్యాద్విశతి హి యేన వాసుదేవం॥

విష్ణు. ౨ అం. ౧౨ అ. ౪౭ శ్లో॥

తా॥ నాచేతను ఈ లోకములోనిది యేది చెప్పఁబడినదో దానియందంతటను కర్మవశ్యుఁడైన జీవుఁడు సంచరించుచున్నాఁడు. దీనిని బాగుగాఁ దెలిసికొని నిత్యుఁడును పరిపూర్ణుఁడును ఎల్లప్పుడు నొక్క స్వరూపము గలవాఁడును నగు వాసుదేవుని దేనిచేఁ జూచునో, దాని నాచరించునది.

ఈ పై గ్రంథ సందర్భమున, పరబ్రహ్మము నిర్విశేషమని తెలుపునది గాని, అట్టి పరబ్రహ్మము నాశ్రయించి యుండునదియును, సదసద నిర్వచనీయ మునునగు నజ్ఞానమును తెలుపునది గాని, జగత్తు అట్టి యజ్ఞానమూలముగాఁ గల్పింపఁబడినదియనెడి యంశమును తెలుపునదిగాని యగు పదమొక్కటియు గానఁబడదు. "ఈ సమస్త ప్రపంచమును "అస్తి=కలదు" అనియు "నాస్తి= లేదు" అనియు నీశబ్దములచేఁ జెప్పఁదగినది, చిదచిదాత్మకము, పరముఁ డును పరేశుఁడును పరబ్రహ్మమును నగు విష్ణువుయొక్క శరీరముగుటంచేసి తదాత్మకము (విష్ణువు ఆత్మ గాఁగలది). జ్ఞానైకాకారమగునట్టి యాత్మకు దే వాది వివిధాకారానుభవము గలుగు విషయమునను, అచిత్పదార్థము మా ర్పును పొందు విషయమునను, హేతుభూతమైనది, వస్తుయాథాత్మ్యజ్ఞాన విరో ధియగు జీవులకర్మమే". ఈయంశమే గదా యీగ్రంథసందర్భమున ప్రతిపాదింపఁ బడెను. మఱియు "అస్తి" "నాస్తి" శబ్దములకుఁగాని, "సత్య" "అసత్య" శబ్దము లకుఁ గాని యనిర్వచనీయమైన దానిని తెలియఁజేయు సామర్థ్యము లేదు. ఏలననిన, "నాస్తి" "అసత్య" శబ్దములు "అస్తి" "సత్య" శబ్దములకు విరుద్ధ ములు. కావున నవి యసత్తును తెలుపునవియేగాని యనిర్వచనీయమును తెలుపునవి కావు.

ఈ ప్రకరణమున అచేతన పదార్థమును గుఱించి ప్రయోగింపఁబడిన "నాస్తి" "అసత్య" శబ్దములు తుచ్ఛత్వమును (కుందేటి కొమ్ములవలె నెన్నఁ డును లేకుండుటను) గాని మిథ్యాత్వమును గాని తెలుపునవి కావు. అయితే యవి వినాశిత్వమును తెలుపునవి. "వస్త్వసికిమ్" అనియు "మహీఘటత్వం" అనియు నీ మొదలగు తావులనున్న అట్టి వినాశిత్వమే గదా ఉపపాదింపఁబడియె. ఇంతి యెకాని, యాతావుల నిష్ప్రమాణకత్వము గాని జ్ఞానబాధ్యత్వముగాని యుప పాదింపఁబడలేదు. ఒక్క విధమైనట్టి యాకారముతో నొక్కకాలమునఁ దెలియఁ బడినది, కాలాంతరమున మార్పునుపొందిన దగుటంజేసి, వేఱొక్క విధమైనదిగాఁ దెలియఁబడుటచే నది "నాస్తి" శబ్దముచే దెలుపఁబడునది యని యుపపాదింపఁ బడెను. తుచ్ఛత్వమనఁగా ప్రమాణ సంబంధమున కర్హము గానిది యగుటగదా! ఏ ప్రదేశమున, ఏకాలమున, ఏ పదార్థము ఉన్నట్టిదిగాఁ దెలియవచ్చునో, ఆ దేశ ముననే, ఆ కాలముననే, ఆ పదార్థమే లేనట్టిదిగాఁ దెలియఁబడుట బాధయనఁ బడును. ఇంతియెకాని, ఒక్కకాలమున నొక్కవిధమైనదిగాఁ దెలియబడినది కా లాంతరమున మార్పును పొందుటచే నట్టిదిగాఁ దెలియఁబడక పోవుట బాధ యని చెప్పఁదగదు. ఆ తావున కాలభేదమునుబట్టి విరోధమే లేదు. కావున "నాస్తి" "అసత్య" శబ్దములు మిథ్యాత్వమును తెలుపునవి కావు.

అది యెట్లనిన, జ్ఞానస్వరూపమగు ఆత్మవస్తువు ఆదిమధ్యాన్తరహితమును, ఎప్పుడు నేకరూపముగా నుండునదియునుగాన, నది యెల్లకాలమును "అస్తి" యని చెప్పఁ దగినది. అచేతనపదార్థమన్ననో, జీవునికి భోగ్యమైనది. జీవుని కర్మానుగుణముగా మార్పును పొందునది. అది నాశమును పొందునది. కావున నది ఎల్లప్పుడును (నాస్తి=లేదు) అనెడి యంశమును గలిగియుండునది. కావున నది "నాస్తి" యనియు "అసత్యం" అనియును చెప్పఁదగినది. అట్లే శ్రీ విష్ణుపురాణమునను చెప్పఁబడియె.

శ్లో॥ యత్తు కాలాన్తరేణాపి నాన్యసంజ్ఞా ముపైతి వై ।
పరిణామాది సంభూతాం తద్వస్తు నృప తచ్చకిం ॥
విష్ణు. ౨ అం. ౧౩ అ. ౧౦౦ శ్లో ॥

తా॥ ఓ రాజా! ఏది కాలాంతరమునఁగూడ పరిణామము మొదలగు వానిచేఁ గలిగిన మఱియొక్క పేరును పొందదో, అది వస్తువు. అదియేది?

శ్లో॥ అవినాశీ పరమార్థశ్చ ప్రాజ్ఞైరభ్యుపగమ్యతే ।
తత్తు నాస్తి న సందేహో నాశిద్రవ్యోపపాదితం ॥ (వి. ౨. ౧౪. ౨౪.)

తా॥ నశింపనిది పరమార్థమని ప్రాజ్ఞులంగీకరించుచున్నారు. నశించెడి ద్రవ్యముచేఁ గలుగఁ జేయఁబడిన దేదియు నది లేకున్నది. సందేహములేదు.

దేశకాలకర్మ విశేషములను బట్టి యున్నట్టిదిగాను లేనట్టిదిగాను నగు పదార్థము కేవలము "అస్తి" యనఁబడు జ్ఞానముచేఁ దెలుపఁబడునదియగుట అపరమార్థమని యీ శ్లోకమునఁ దెలుపఁబడియె. ఆత్మయన్ననో కేవలము "అస్తి" యనెడి జ్ఞానముచేఁ దెలుపఁబడునదిగాన, నది పరమార్థము. ఈ సందర్భమున శ్రోతయగు మైత్రేయుఁడు "విష్ణ్వాధారం యథా చైతత్ త్రైలోక్యం సమవస్థితం। పరమార్థశ్చ మే ప్రోక్తో యథాజ్ఞానం ప్రధానతః (విష్ణు. ౨ అం. ౧౩ అ. ౨ శ్లో.) (ఈ మూఁడు లోకములును విష్ణువు ఆధారముగాఁ గలవై ఎట్లున్నవో, జ్ఞానము ప్రధానముగా నెట్లు పరమార్థమో, ఆ విషయము నాకు చెప్పఁబడియె) అని యిట్లు అనువదించుట వలనను, "జ్యోతీంషివిష్ణుః" ఈ మొదలగు తావుల సామానాధికరణ్యమునకు మూలము ఆత్మ శరీరభావమే యనియు, చిదచిత్పదార్థములు "అస్తి" "నాస్తి" పదవాచ్యము లగుటకు హేతువు, జ్ఞానము కర్మనిమిత్తముగాక స్వాభావిక స్వరూపమగుటచే ప్రధానమగుటయు, అచిత్పదార్థమన్ననో, కర్మనిమిత్తముగాఁ బరిణమించునది యగుటంజేసి యప్రధానమగుటయునని తెలియవచ్చుచున్నది.

బ్రహ్మము నిర్విశేషమను జ్ఞానము వలన నవిద్య నివర్తించుచున్నదని శ్రుతులు తెలుపుచున్నవనెడి వాదము యుక్తమైనదికాదు. ఏలననిన, "వేదాహ

మేతం పురుషం మహాన్తం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్ । తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ (పురు ౨౦) (సూర్యుని వర్ణముగలవాఁడును, ప్రకృతికిపై వాఁడును నగు నీ గొప్పపురుషుని నేను ఉపాసించుచున్నాను. అతని నీ లోకమున నిట్లు ఉపాసించువాఁడు ముక్తుఁడగుచున్నాఁడు అతనిఁ బొందుటకు మఱియొక్క మార్గము లేదు) అనియు, "సర్వే నిమేషా జజ్ఞిరే విద్యుతః పురుషాదధి***నతస్యేశే కశ్చన తస్యనామ మహద్యశః***య ఏనం విదురమృతాస్తే భవన్తి (తై. ఆ. ౬ ప్ర. నా. ౧ అను. ౮. ౯. ౧౦.) (మెఱుపువంటి వర్ణముగల పురుషునివలన నన్నికాలములును పుట్టినవి, అతనిని నేలువాఁడొక్కఁడును లేఁడు. గొప్ప కీర్తి యతనిదే కదా! ఈతని నెవ్వరు ఉపాసించుదురో, వారు ముక్తులగుదురు) అనియు నీ మొదలగు అనేక శ్రుతివాక్యములు విరోధించును. బ్రహ్మము సవిశేష మగుటను బట్టియే సమస్త వాక్యములును బ్రహ్మము సవిశేషమనెడి జ్ఞానమువలన మోక్షము గలుగునని తెలుపుచున్నవి. బ్రహ్మస్వరూప ప్రతిపాదకములగు వాక్యములు బ్రహ్మము సవిశేషమనియే ప్రతిపాదించుచున్నవని పూర్వము చెప్పఁబడియె.

"తత్త్వమసి" (తత్-త్వం-అసి) మొదలగు శ్రుతివాక్యముల యందుండు సామానాధికరణ్యము నిర్విశేష వస్తువులకైక్యమును తెలుపుచుండలేదు. ఏలననిన, అందుండు "తత్" అనియు "త్వం" అనియు నీ పదములు సవిశేషమగు బ్రహ్మమును తెలుపుచున్నవి. ఎట్లన, "తత్" అను పదము సర్వజ్ఞమును, సత్యసంకల్పమును, జగత్కారణమును నగు బ్రహ్మమును పూర్వవాక్యమునుండి పరామర్శించుచున్నది. "తదైక్షత బహుస్యాం ప్రజాయాయ." అను పూర్వవాక్యమునఁ దెలుపఁబడిన బ్రహ్మము అట్టిదియే గదా! అట్టి "తత్" అను పదముతో సామానాధి కరణ్యముగల "త్వం" అను పదము అచిత్తుతోఁ గూడి యున్నట్టి జీవుని శరీరముగాఁ గల బ్రహ్మమును ప్రతిపాదించునది. సామానాధికరణ్యము ప్రకారద్వయవిశిష్టమగు (రెండువిధములుగా నుఁడునట్టి) ఒక్క పదార్థమును తెలుపునది గదా! అట్టి ప్రకారద్వయము పరిత్యజింపఁబడెనేని, ప్రవృత్తినిమిత్త భేదము సంభవింపక పోవుటచే సామానాధికరణ్యమే పరిత్యజింపఁ బడినదగును. అందువలన నీ రెండు పదములకు లక్షణార్థము సయితము సంభవింపదు "ఆ దేవదత్తుఁడే యీతఁడు" అను తావున సయితము లక్షణార్థము లేదు. ఏలననిన, ఆ తావున భూత వర్తమాన కాలములతో సంబంధించినది యొక్కటిగానే తెలియ వచ్చు చున్నందున విరోధమేలేదే? కాలభేదమును బట్టి దేశభేదరూపమగు విరోధము పరిహృత మగుచున్నది. అట్లర్థమగునేని, "బహుస్యాం ప్రజాయేయేతి" అను ప్రకరణముతో విరోధము గలుగును. ఒక్కటి తెలియుటచే సర్వము తెలియవచ్చుచున్నదనెడి ప్రతిజ్ఞయును ఘటింపదు. జ్ఞానస్వరూపమును,

నిరస్త నిఖిలదోషమును, సర్వజ్ఞమును, సమస్తకల్యాణ గుణాత్మకమును నగు దానియం దజ్ఞాన ముండుటయు, అందువలన నది సమస్త దోషములకు స్థానభూతమగుటయును ప్రాప్తించును. సామానాధికరణ్యము [1]బాధార్థముగా నేర్పడినదగు పక్షమున "త్వమ్" "తత్" పదములకు [2]అధిష్ఠాన లక్షణయు, నివృత్తి లక్షణయు నీమొదలగు లక్షణములే దోషములు, ఇట్లు దోషాన్తరము ప్రాప్తించుటయే యిందు విశేషము.

[3]"నేదంరజతమ్" (ఇది వెండికాదు) అనుచోటవలెఁ గాక, ఈ తావున ప్రమాణాన్తరముచేఁ దెలియఁబడని బాధమును గతిలేక కల్పించుకొనవలసివచ్చును. "తత్" అను పదముచేత అధిష్ఠానముతప్ప వేఱు ధర్మము తెలుపఁబడ పోవుటచేత ఈ తావున, బాధము కుదురకపోవును. పూర్వము అవరింపఁబడిన యధిష్ఠానము ఆవరింపఁబడని స్వరూపము గలదిగా "తత్" అనెడి పదముచేతఁ దెలియఁజేయఁ బడుచున్నది యందురేమో, అదియును సరికాదు. ఏలననిన, అధి

(1) ఒక్కటి వేఱొక్కటిగా భ్రమింపఁబడిన తావున నట్టి భ్రాంతిని పోగొట్టుట బాధ యనఁబడును. అందులకై సామానాధికరణ్య విశిష్టమగు పదప్రయోగము బాధార్థమగు సామానాధికరణ్యమనఁబడును. బాధార్థముగూడ సామానాధికరణ్యము గానఁబడుచున్నది. దృష్టాన్తము—చీకటిలో నిలువఁబడియుండిన స్తంభమును చోరుఁడని భ్రమించి వానితో "త్వయాదృష్టశ్చోరస్థాణుః" అనఁగా "నీవు చూచిన దొంగ స్తంభము" అని వేఱొక్కఁడు చెప్పినచో, నిచట "చోరః స్థాణుః" అను పదములు "చోరుఁడే స్తంభము" అని తెలుపుటచే సామానాధికరణ్యము గలవి. ఈ సామానాధికరణ్యము బాధార్థము ఏర్పడినది. వాస్తవమునకు తానే బ్రహ్మమైనను భ్రాంతివశమున తనను జీవునిగా భ్రమించినవాని భ్రాంతిని పోగొట్టుటకై "నీచే జీవుఁడుగా భ్రమింపఁబడిన వాఁడు బ్రహ్మము" అని యిట్లు, "తత్త్వం" అను తావునను, సామానాధికరణ్యముచేఁ జెప్పఁబడియె. కావున, "తత్త్వమసి" అను తావున నందు సామానాధికరణ్యము బాధార్థమని యద్వైతులు చెప్పుచున్నారు.

(2) ఈ తావున "తత్" "త్వమ్" శబ్దములు సర్వనామము లగుటంజేసి యవి పూర్వోక్తములగు వానిని నిర్దేశించునవి. ప్రకరణమునుబట్టి విచారింపఁగా వానిలో "తత్" శబ్దము కల్యాణగుణాకరుఁడును, జగత్కారణుండునునగు బ్రహ్మమును తెలుపునది. "త్వం" శబ్దము అచిద్విశిష్టుఁడగు జీవుఁడు శరీరముగాఁగల బ్రహ్మమును తెలుపునది. ఇట్లుండ, "తత్త్వమసి" అను వాక్యముననుండు సామానాధికరణ్యము బాధార్థమని చెప్పినపక్షమున, అందుండు "తత్" శబ్దము "అధిష్ఠాన మాత్రమును తెలుపునది యనియు, "త్వం" శబ్దము "జీవభావనివృత్తిని" తెలుపునదియనియు నిట్లు ఆ రెండుశబ్దములకును లక్షణార్థమును గల్పించుకొన వలసివచ్చును. ఇట్లు లక్షణార్థములను గల్పించుకొనుట యనెడి వేఱొక దోషము సంప్రాప్తమగునని భావము.

(3) ముత్యపు చిప్పనుచూచి వెండియను కొనినప్పుడు, ఇది వెండికాదనెడి బాధము ప్రత్యక్షముచేఁ దెలియఁబడినది. కావున, బాధమును కల్పింపవచ్చును-ఇచ్చట అట్లు మఱియొక్క ప్రమాణముచేఁ దెలియఁబడకపోయినను బాధమును కల్పింపవలసివచ్చుట దోషమని తాత్పర్యము.

ష్ఠానము ప్రకాశింపక యుండఁగా, దానిని నాశ్రయించి గలుగునవియగు భ్రాంతియును, బాధంబును సంభవింపవుగదా! భ్రమమున కాధారమగు నధిష్ఠానము ఆవరింపఁబడ లేదంటిరేని, ఆ యధిష్ఠానస్వరూపము ప్రకాశించుట భ్రమమునకు విరోధి గాన, అది ప్రకాశించునప్పుడు దాని నాశ్రయించి గలుగునవియగు భ్రమంబును, బాధంబును బొత్తుగా సందర్భింపవు. కాఁబట్టి అధిష్ఠానము కంటెను వేఱుగా పారమార్థికంబగు ధర్మమును, అది యావరింపఁబడుటనును అంగీకరింపని యెడను, భ్రాంతియును బాధంబును ఉపపాదింపఁబడవు. దృష్టాంతము—రాజును జూచి వ్యాధుఁడని భ్రమించిన తావున అదిష్ఠానమగు పురుషస్వరూపము మాత్రము తోఁచుచుండఁగా, అది కాక, పారమార్థికమగు రాజత్వము (రాజస్వరూపము) ఆవరింపఁ బడుచున్నది. అందువలననే వ్యాధుఁడనెడి భ్రాంతి కలుగుచున్నది. రాజత్వము తెలిసినతోఁడనే అది నివర్తించుటయును కలుగుచున్నది. కాని, అధిష్ఠానము మాత్రము తెలిసినతోఁడనే యది నివర్తించుచుండ లేదు. అది (అధిష్ఠానము) తెలియఁబడుచునే యున్నది గాన, దానిని తెలియఁజేయ నక్కఱ లేదు. కావున, అది (అధిష్ఠానము) భ్రమమునుపోఁగొట్టునదియును కాదు.

ఈ వాక్యమునందుండు "తత్" అనియు "త్వం" అనియు నీరెండు శబ్దములు జీవశరీరుఁడగు జగత్కారణుని తెలుపునవియగు పక్షమున నవి ముఖ్యార్థము గలవి యగుచున్నవి. ఇట్లు చెప్పినచో, ప్రకారద్వయవిశిష్టమగు నొక్కవస్తువే ప్రతిపాదింపఁబడుచున్నది. ఇందువలన సామానాధి కరణ్యము గూడ సిద్ధమగుచున్నది. ఇంతయెకాక, దోషము లేమాత్రము లేనిదియు, సమస్తకల్యాణ గుణాత్మకమునునగు పరబ్రహ్మమునకు జీవుల యందంతట నన్తర్యామిగా నుండుట యనఁబడు వేఱొక్క యైశ్వర్యముగూడ ఇందుచేఁ బ్రతిపాదింపఁబడినదగును. ఈయర్థము ఉపక్రమముతోఁ గూడ ననుకూలించును. కారణావస్థయందు సూక్ష్మములగు చిదచిత్పదార్థములను శరీరముగాఁగల బ్రహ్మమే కార్యావస్థయందు స్థూలములగు చిదచిత్పదార్థములను శరీరముగాఁగలదగుటచే కార్యమనఁబడు చున్నది. అందువలన నొకవస్తువును దెలిసి కొనుటచే నన్నివస్తువులును దెలియఁబడుచున్నవను, వేదాంతశాస్త్రప్రతిపాదితమగు ప్రతిజ్ఞ నయితము ఉపపన్నమగును. ఈపైనిచెప్పిన ప్రకారము "తత్త్వమసి" అను మహావాక్యముయొక్క యర్థము నంగీకరించినచో, "తమీశ్వరాణాం పరమం మహేశ్వరం" అనియు, "పరాస్య శక్తిర్వివిధైవశ్రూయతే" అనియు, "అపహతపాప్మా" అనియు, "సత్యకామస్సత్య సంకల్పః" అనియు నీ మొదలగు శ్రుతులు గూడ విరోధింపవు.

అద్వైతి:—"తత్త్వమసి" అనువాక్యమున [1]నిది యుద్దేశింపఁబడినది యనియు, నిది విధింపబడినది యనియు నిట్టి విభాగమెట్లు పొసగును?

భాష్యకారులు:—[2]ఇచట నొకదానిని యుద్దేశించి యొకదానిని విధించుచుండ లేదు. అయితే "ఐతదాత్మ్యమిదం సర్వం" (ఇది యంతయు నా పరమాత్మయంతరాత్మగాఁగలది)' అని పూర్వవాక్యముచేఁ దెలుపఁబడినదే యిచట ననువదింపఁబడుచున్నది. శాస్త్రిమేగదా [3]ఇంతకు పూర్వము ప్రాప్తముగాని దానిని ఇప్పుడు క్రొత్తగా విధించి సార్థకమగును!

"ఐతదాత్మ్య మిదం సర్వం" అనుశ్రుతివాక్యము "ఇదంసర్వం" అనుటచే జీవయుక్తమగు నీజగత్తును నిర్దేశించి "ఐతదాత్మ్యం" "తస్యైష ఆత్మా" అనుటచే నిదియంతయు నాపరమాత్మయే యాత్మగాఁగలదని ప్రతిపాదించి యుండెను. అందులకు హేతువు, "సన్మూలా స్సోమ్యేమా స్సర్వాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః" అనువాక్యమున "ఈప్రజలండఱు "సత్" అనంబడు బ్రహ్మమునుండియే గలుగుచున్నారనియు, ఆ బ్రహ్మమే స్థానముగాఁ

(1) "ప్రతివాక్యమున్ను ఉద్దేశ్యోపాదేయవిభాగము గలదిగా నుండవలయును. ఒక్కదానిని నిర్దేశించి యొక్కదానిని విధించుటను ఉద్దేశ్యోపాదేయ విభాగమందురు. అట్లే, "తత్త్వమసి" అనునదియును ఒక వాక్యముగాన నదియును ఒక్కదానిని నిర్దేశించి యొక్కదానిని విధింపవలయును. అందువలన నీ వాక్యము "త్వం" శబ్దముచే జీవుని నిర్దేశించి "యతఁడు బ్రహ్మము" అని "తత్" శబ్దముచే విధించుచున్నదను పక్షమున ఈ వాక్యమునను, ఉద్దేశ్యోపాదేయ విభాగము కలదని చెప్పవచ్చును." ఇట్లు అద్వైతులు వాదించుచున్నారు.

(2) ప్రత్యక్షముగాఁ దెలియఁబడు దానిని నిర్దేశించియే యొకదానిని విధించునది వాక్యమనెడి నియమములేదు. పూర్వవాక్యమునఁ దెలుపఁబడినదానిని ప్రకృతమున ననువదించునదియును వాక్యము కాఁదగును.

ప్రకృతమున, "తత్త్వమసి" అనువాక్యము పూర్వవాక్యములయందు ప్రతిపాదింపఁబడిన శరీరాత్మభావమును అనువదించి ఆయంశమును ముగించుచున్నది. కావున నిది నిగమన వాక్యము. నిగమనవాక్యము ఎప్పుడును పూర్వము ప్రతిపాదించినదానిని సంగ్రహముగా ననువదించి యాయంశమును ముగించునదియేగాని యొకదానిని నిర్దేశించి యొకదానిని విధించునది కాదు.

(3) వాక్యములకు ఉద్దేశ్యోపాదేయ విభాగముండి యుండవలయు ననెడి నియమము శాస్త్రివిధి రూపములగు వాక్యములకుఁ దగును. ఇంతకుపూర్వము ప్రమాణేతరవేద్యముగావి దానిని తెలిపి దానిని విధించుటచే శాస్త్రివిధ వాక్యములు సార్థకము లగుచున్నవి. దృష్టాంతము—"జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" ఈ మొదలగు విధివాక్యములు స్వర్గకాముని నిర్దేశించి వానికి జ్యోతిష్టో మానుష్ఠానమును విధించుచున్నవి. వీనివలె "తత్త్వమసి" అను వాక్యము విధివాక్యముకాదు అయితే ఇది నిగమన వాక్యము. కావున దీనియం దట్టి యుద్దేశ్యోపాదేయ విభాగ ముండవలసిన యావశ్యకత యేమియు గానఁబడదు.

గలవారనియు, ఆబ్రహ్మమునందే ప్రతిష్ఠగలవారనియు నివ్విధముగాఁ. గానఁబ డుచియుండెను.

“ సర్వం ఖ ల్విదం బ్రహ్మ తజ్జలానితి శా న్త ఉపాసీ త ” (ఛా. 3 ప్ర. ౧౪ ఖ. ౧ వా.) అనఁగా ఈసమస్తము బ్రహ్మమునుండిబుట్టి, బ్రహ్మచే రక్షింపఁబడి, బ్రహ్మమునందు లయమగుచున్నది గాన, యీసమస్తము బ్రహ్మము, అనఁగా బ్రహ్మమొక్కఁడే యంతరాత్మగాఁగలది. కాఁబట్టి శాంతచిత్తుఁడై యుపాసింప వలయును” అను తావున హేతువు గాన్పింపఁబడినట్లు ఇచటను హేతువు గాన్పింపఁబడినది.

బ్రహ్మమునకును తదితరములగు చిదచిత్పదార్థములకు నుండుకొనిన శరీరాత్మభావమును బట్టియే వీనికి తాదాత్మ్యము చెప్పఁబడినట్లు ఇతర శ్రుతుల వలనఁగూడ దెలియుచున్నది. ఎట్లనిన,

“ అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా ” (ఆర. 3 ప్ర. ౧౧ అను.) అను శ్రుతివాక్యము “పరమాత్మ జనులలోపల ప్రవేశించి జనులను నియమించు చున్నాడు గాన, నీతఁడు సర్వమునకు నాత్మ” అనియు, “యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యం పృథివీ నవేద, యస్య పృథివీ శరీరం యః పృథివీమన్త రో యమయతి స త ఆత్మా ఽన్తర్యామ్యమృతః ” (బృ. ౫ అ. ౭ బ్రా. 3 వా.) అను శ్రుతివాక్యము “ ఎవ్వఁడు పృథివియందున్నవాఁడై పృథివిలోపలనుండి పృథివిచే దెలిసికొనఁ బడక పృథివిని శరీరముగాఁ గలవాఁడో, వాఁడు నీయాత్మ యు, అన్తర్యామియు, జన్మమరణములు లేని వాఁడును” అని యు, “ య ఆత్మని తిష్ఠన్. ఆత్మనోఽన్తరో య మాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆ త్మానమన్తరో యమయతి సత ఆత్మాఽన్త ర్యామ్యమృతః ” (బృ. ౫ అ. ౭ బ్రా. ౨౨ వా.)అను శ్రుతివాక్యము “ ఎవ్వఁడు ప్రత్యగాత్మయం దున్న వాఁడై ప్రత్యగాత్మ లోపలనుండి ప్రత్యగాత్మచేఁ దెలిసికొనఁబడక ప్రత్యగాత్మను లోపలనుండి నియమించుచున్నాఁడో వాఁడే నీయొక్క యాత్మయు, అన్తర్యామి యు, జన్మమరణములు లేనివాఁడును” అని యును, మఱియు, “యః పృథివీమన్త రే సఞ్చరన్” అని యారంభించిన “యస్యమృత్యుశ్శరీరం యం మృత్యుర్న వేద ఏ ష సర్వ భూతా న్త రాత్మాఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః” (సుబా. ౭ ఖ.) ఇత్యాది వాక్యము “ ఎవనికి మృత్యువు శరీరమో, ఎవనిని మృత్యువు తెలిసికొనలేదో, వాఁడే సర్వభూతముల కన్తరాత్మయు, అపహతపాప్ముఁడును, ప్రకృతిసంబంధము లేనివాఁడును నొక్కఁడగు నారాయణుఁడు ” అనియు, “ తత్సృష్ట్వా త దేవానుప్రావిశత్ తదనుప్రవిశ్య సచ్చత్యచ్చా భవత్ ” (తై. ఆ. ౬ అను. ౨ వా.) అను శ్రుతివాక్యము “పరబ్రహ్మము జగత్తును, సృజించి

దానిలోఁ బ్రవేశించినదై "సత్" అనంబడు చేతన పదార్థముగాను "త్యత్" అనఁబడు అచేతనపదార్థముగాను, నాయెను" అనియును చెప్పుచు నిందుచే బ్రహ్మమునకును, చిదచిత్ప దార్థములకును గల తాదాత్మ్యము శరీరాత్మభావమును బట్టి వచ్చినదియే యని తెలియఁజేయుచున్నవి.

ఛందోగులుగూడ "అనేన జీవేనాత్మనాను ప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి" (ఛా. ౬ ప్ర. 3 ఖ. ౨ వా.) అను వాక్యమున, బ్రహ్మము జీవశరీరుఁడుగా నన్నింటిలోను ప్రవేశించియుండుటచే నవియన్నియును పదార్థములుగానును, వ్యవహార యోగ్యములయినవిగాను నగుచున్నవని పఠించియున్నారు. ఈ వాక్యము "తదను ప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్" అను వాక్యముతో నేకార్థముగలది. కావున, బ్రహ్మము జీవునిలోఁ బ్రవేశించి యుండుటచేతనే జీవుఁడును బ్రహ్మాత్మకుఁడనుపించు కొనుచున్నాఁడని తెలియ వచ్చుచున్నది.

కినుక చిదచిదాత్మకమగు నీపదార్థ జాతమంతయు బ్రహ్మమునకు శరీరమై బ్రహ్మమునాత్మగాఁ గలిగి యుండుటంజేసియే దీనికిని, బ్రహ్మమునకును తాదాత్మ్యము జెప్పఁబడినట్లు తెలియవచ్చుచున్నది. బ్రహ్మ వ్యతిరిక్తమగు నీజగత్తు నందుండు సర్వపదార్థములున్ను బ్రహ్మముకు శరీరమగుటంజేసియే యవి పదార్థములుగాఁ నెన్నఁబడుచున్నవి గాన, ఆయా పదార్థములను ప్రతిపాదించు శబ్దములును బ్రహ్మపర్యన్తమే తమతమయర్థములను దెలియఁజేయుచున్నవి. ఈ పైని గనపఱచిన హేతువుల వలన సర్వశబ్దములును సామాన్యముగా నవి దెలియఁజేయు పదార్థములతోఁ గూడుకొనిన పరబ్రహ్మమునే తెలియఁ జేయుచున్నవని సిద్ధమగుచున్నది. కాఁబట్టి "ఐతదాత్మ్యమిదం సర్వం" అను పూర్వవాక్యమున ప్రతిజ్ఞ చేయఁబడిన యర్థమునే "తత్త్వమసి" అను వాక్యము సామానాధికరణ్య రూపమగు విశేష నిర్దేశముతో ముగించుచున్నది.

కావున నిర్విశేష వస్తువొక్కటియే కలదను అద్వైతుల మతమునను, భేదాభేదవాది మతమునను, అనఁగా జీవబ్రహ్మములకు ఉపాధిని బట్టి భేదమున్ను స్వాభావికముగా నభేదమున్న కలదను భాస్కర మతమునను, అట్టి భేదమున్ను అభేదమున్ను స్వాభావికము లనెడి యాదవప్రకాశ మతమునను, కేవల భేదవాదులగు వైశేషుకులమతమునను, వైయధికరణ్యమునఁగాని సామానాధికరణ్యమునఁగాని బ్రహ్మాత్మభావము నుపదేశించునట్టి యుపనిషద్వాక్యములన్నియును పరిత్యజింపఁబడిన వగును. ఎట్లన,

అద్వైతుల మతమున నొక్కటియే వస్తువుగలదు గాన, దేనికి దేనితో తాదాత్మ్యము (ఐక్యము) ఉపదేశింపఁబడు చున్నది? దానికే అని యెదవా? అట్లంటివేని, యది తన స్వరూపమును తెలుపు వాక్యమువలననే అనఁగా "సత్యం

జ్ఞానం" అనెడి వాక్యమువలననే తెలియఁబడును. ఇట్లుండ తాదాత్మ్యోపదేశముచే నిశ్చయింపఁబడ వలసినది మఱియేదయిన కలదా?

అద్వైతి:—కల్పింపఁబడిన భేదమును నిరసింప వలసియున్నది.

భాష్యకారులు:—అది సామానాధికరణ్యరూపమగు తాదాత్మ్యోపదేశముచే నిశ్చయింపఁదగినది కాదని ఇంతకుముందే చెప్పియున్నాము కదా? సామానాధికరణ్యము బ్రహ్మమునందు ప్రకారద్వయమును ప్రతిపాదించుటచే నందులకు విరుద్ధమే యగును.

సోపాధిక భేదాభేదవాదమున, బ్రహ్మమునకే యుపాధిసంబంధము కలదుగాన, అందుమూలముగాఁ గలుగునవియు జీవునియందుండునవియును నగు దోషములు బ్రహ్మమునందునుండునవి యని ప్రసక్తించును. అందు వలన నిరస్తనిఖిల దోషమును, కల్యాణ గుణాత్మకమును నగు బ్రహ్మము జీవుఁడనియు పదేశించు వాక్యములు విరోధించును. కావున నవి పరిత్యజింపఁబడినవగును.

స్వాభావికభేదాభేదవాదముననను, బ్రహ్మము స్వయముగానే జీవుఁడని యంగీకరించి యున్నందున, గుణములవలెనే దోషములును స్వాభావికములగును. అందువలన దోషములేవియును లేనట్టిదియగు బ్రహ్మముతోఁ జీవుని కైక్యమును బోధించు శ్రుతులు విరోధించును.

కేవలభేదవాదులమతమున, అత్యంతము భిన్నములగు వాని కెవ్విధముననను ఐక్యము సంభవింపదు. కావున బ్రహ్మాత్మభావము నుపదేశించు వాక్యములు అనుపపన్నములగును. అందువలన వారిమతమున ఉపనిషద్వాక్యములన్నియును పరిత్యక్తము లగును.

ఈ సమస్త ప్రపంచమును బ్రహ్మముయొక్క శరీరమని యిట్లు నిఖిలోపనిషత్ప్రసిద్ధమగు సంశమును అంగీకరించువారి మతమున (విశిష్టాద్వైతమున) ఈసమస్తమునకును బ్రహ్మాత్మభావము నుపదేశించెడి వాక్యము లన్నియును ఎక్కువ యుపపాదింపఁబడినవి యగును. ఎట్లనిన, జాతిగుణములవలెనే ద్రవ్యములుగూడ శరీరమగుటనుబట్టి విశేషణములుగాన, "పురుషుఁడు కర్మముల మూలముగా గోవును, అశ్వంబును, మనుష్యుఁడును, దేవుఁడునయ్యెను" అని యిట్లు సామానాధికరణ్యము లోకవ్యవహారముననను, శాస్త్రమునందును ముఖ్యముగానే గన్పట్టుచున్నది. జాతి గుణములుగూడ ద్రవ్యమునకు ప్రకారములగుట "ఖణ్డోగౌః=కుంటియావు, శుక్లః పటః=తెల్లని బట్ట" అని సామానాధి కరణ్యమును బట్టి వచ్చినది మనుష్యత్వము మొదలగువానితోఁ గూడియున్నట్టి పిండములుగూడ ఆత్మకు ప్రకారము (విశేషణము) లగుటవలననే పదార్థములు కదా! "ఆత్మ మనుష్యుఁడును, నపుంసకుఁడును,

స్త్రీయును అయ్యెను" అని సామానాధికరణ్యము జాతి గుణ శరీర వాచిశబ్దము లన్నింటియందును ననుగతమైనది. ఈపైని గనఁబఱచినప్రకారము ఒకదాని యొక్క ధర్మమగుటయే సామానాధికరణ్యమును నిశ్చయించునదిగాని పరస్పర వ్యావృత్తములయిన (ఒకదానియందుండి మఱియొక దానియందుండనివి యైన) జాతిమొదలగునవి దానిని నిశ్చయించునట్టి హేతువులు కావు. తమయందుండునవియే (తమకుతాము ప్రత్యేకముగా నుండునవియే) యగు ద్రవ్యములు ఒకప్పుడు వేఱొక్క ద్రవ్యమునకు విశేషణములగు నప్పుడు, అనఁగా "దండీ = దండము గలవాఁడు కుండలీ = కుండలము గలవాఁడు" అనుతావుల మత్వర్థీయప్రత్యము ("కలిగిన" అను నర్థమునిచ్చెడి "ఇన్" మొదలగుప్రత్యయము) గానఁబడుచున్నదే గాని, (తమయాశ్రయముకంటె) వేఱుగాఁ దెలియఁజాలనివియును, వేఱుగా నుండజాలనివియును నగు పదార్థముల కట్టి ప్రత్యయము గానఁబడుచుండ లేదు. అట్టివి వేఱొక్కదానికి విశేషణము లగుట సామానాధికరణ్యము చేతనే నిశ్చయింపఁదగినది.

"ఖణ్డో గౌః = మొండియావు, ముణ్డో గౌః = బోడియావు, శుక్లః పటః = తెల్లని వస్త్రము, కృష్ణః పటః = నల్లనివస్త్రము" అనుతావుల జాతిగుణము లాయాపదార్థముల విశేషణము లయినట్లు, "ఆత్మ కర్మవశమున గోవు ఆయెను, అశ్వము ఆయెను. మనుష్యుఁడు ఆయెను, దేవుఁడు ఆయెను, పురుషుఁడు ఆయెను, స్త్రీ ఆయెను, నపుంసకుఁడు ఆయెను," అను, తావుల మనుష్యాది శరీరము లాత్మయొక్క విశేషణము లగుపక్షమున, విశేషణభూతములగు శరీరములును వానిని విశేషణములుగాఁగల యాత్మలును జాతివ్యక్తులవలెనే నియతముగా నొక్కమాఱే తెలియఁబడవలయునే? అయితే అవి యట్లు తెలియబడుచుండ లేదు. గోవు మొదలగునవి గోత్వము మొదలగువానితోఁ గూడి యున్నట్టివిగానే తెలియవచ్చునట్లు, మనుష్యాది శరీరములును ఆత్మతోఁ గూడి యున్నట్టివిగానే యాత్మతోఁగూడ, తెలియఁబడు చుండ లేదు. కావున "మనుష్యుఁడు ఆత్మ" అనుతావుల సామానాధికరణ్యము లాక్షణికమే యని చెప్పఁదగును" అని యీపైని గానఁబఱచినప్రకారము శంకింపఁదగదు. ఏలననిన,

దేవమనుష్యాది శరీరములును ఆత్మనే ముఖ్యముగా నాశ్రయించియుండు నవియగు విషయమునను, ఆత్మకుగానే యేర్పడినవియగు విషయమునను, ఆత్మకు శేషభూతములయినవియగు విషయమునను జాతి మొదలగువానితో సమానములే. ఎట్లనిన, ఆత్మ ఈ శరీరమును విడిచిపోయినతోఁడనే శరీరము నశించుటనుబట్టి దీనికి యాత్మయే ముఖ్యమైన యాశ్రయమని యవగతమగు చున్నది. జీవునికి కర్మ ఫలానుభవమును గలుగఁజేయుటకు గాను యేర్పడిన

దైనందున నీ శరీరము ఆత్మకుగానే యేర్పడినదని సిద్ధమగుచున్నది. "ఆత్మ దేవుఁడు మనుష్యుఁడు" అనెడి వ్యవహారమునుబట్టి యాత్మయొక్క విశేషణము గాఁ దెలియవచ్చుచున్నందున శరీరము ఆత్మకు శేషభూతమైనదిగాఁ దెలియు చున్నది. "గో" శబ్దము మొదలగునవి వ్యక్తిపర్యంతము తెలుపునవియగుట కిదియే హేతువు. ఇట్టి స్వభావము దండకుండలాది శబ్దములకు లేమింజేసి, యవి వేఱొక్కదానికి విశేషణములగునప్పుడు "దండీ" "కుండలీ" అనుతావుల మత్వర్థీయప్రత్యయమును చేర్పవలసియున్నది. దేవమనుష్యాది శరీరములు, ఈ పైని గానఁబఱచిన ప్రకారము, ఆత్మనే ముఖ్యాశ్రయముగాఁ గలవియు, ఆత్మ కుగానే యేర్పడినవియు, ఆత్మకు శేషభూతములయినవియును నగుటను స్వాభా వికముగాఁ గలవయినందున, "ఆత్మ దేవుఁడు ఆత్మ మనుష్యుఁడు" అనుతావుల, లోకమునందును, శాస్త్రమునందును సామానాధికరణ్యముచే వ్యవహరింపఁబడు చున్నవి. జాతివ్యక్తులు రెండును నియతముగా నొక్కమాఱే తెలియవచ్చుటకు హేతువు అవి చక్షురింద్రియ గోచరములయిన వగుటయే. ఆత్మయన్ననో, చక్షురింద్రియగోచరము కానందున చక్షురింద్రియమూలముగా శరీరము తెలియవచ్చునప్పుడది తెలియరాదు. ఏ పదార్థము వేఱుగాఁ దెలియఁదగినదో, అది వేఱొక్కదానికి శేషమైనదగుట యసంభవమని చెప్పెదవేమో, అట్లు చెప్పఁదగదు. ఏలననిన, అదియే ముఖ్యాశ్రమముగాఁ గలిగినదనుట వలనను, దానికిగానే యేర్పడినదగుటవలనను, దానికి విశేషణమగుటవలనను్నను శరీర మున్ను జాతి మొదలగునవివలెనే దానికి శేషమగుటయే ముఖ్యస్వభావము గలదిగాను తెలియవచ్చుచున్నది కదా! రెండు పదార్థములు నియతముగా నొక్కమాఱే తెలియవచ్చుటకు హేతువు అవిరెండును ఒక్క విధమైన దర్శన సామగ్రివలనఁ దెలుపఁదగినవి యగుటయే యని చెప్పియున్నాము. దృష్టాం తము—పృథివి మొదలగునది రసము, గంధము మొదలగువానిని స్వాభావిక ముగా గలిగియున్నను, అది యట్టి రసగంధాదులను గలిగియున్నట్టిదిగా చక్షు రింద్రియముచేఁ దెలియరాదుగదా. అట్లే చక్షురింద్రియముచేఁ దెలియఁదగి నదియగు శరీరమున్ను ఆత్మకు శేషమగుటయే ముఖ్య స్వభావముగాఁ గలదై నను, అది యట్టిదిగా చక్షురింద్రియమువలనఁ దెలియరాదు. ఆత్మను తెలిసి కొను సామర్థ్యము చక్షురింద్రియమునకు లేదు గదా! ఇంతమాత్రముచే శరీ రమాత్మకు శేషమయినదగుటయనెడి స్వభావము గలది కాకపోదు. ఏలననిన, అది యిట్టి స్వభావముగలది యగుటయే కదా సామానాధికరణ్యమువలన వచ్చినది. శరీరమును ఆత్మకు ప్రకార (విశేష) మైనదానిగాఁ దెలియఁజేయ సమర్థ మగు శబ్దము దానినట్లు ప్రకారమైన దానినిగాఁ దెలియఁజేయుచునే యున్నది. అయితే లోకవ్యవహారమున "శరీర" శబ్దము శరీరమాత్రమును తెలుపునదిగాను

గన్పట్టుచున్న దేగాని, ఆత్మ పర్యంతము శరీరమును తెలుపునదిగాను గన్పట్టు చుండ లేదేయని శంకింపఁదగదు. ఏలననిన, పదార్థములకుఁగలపరస్పర భేదమును చూపుటకై ఆత్మకు శేషమేయగు శరీరమును మాత్రము ఈ శబ్దము నిరూపిం చుచున్నది. అందువలనన నిది నిష్కర్షక శబ్దము. గోత్వ, శుక్లత్వ, ఆకృతి, గుణ, శబ్దములెట్లో, అట్లే యిదియును. కావున "గో" శబ్దము మొదలగునవివలెనే దేవమనుష్యాది శబ్దములున్ను ఆత్మపర్యంతములని యెఱుంగునది.

ఇట్లు దేవమనుష్యాది రూపములగు శరీరములతోఁ గూడియున్నట్టి జీవులు పరమాత్మయొక్క శరీరములగుటంజేసి వానికి శేషభూతములయినవి. కావున జీవాత్మను తెలుపునట్టి శబ్దములు పరమాత్మపర్యంతములని యెఱుంగునది. కాఁబట్టి చిదచిత్పదార్థము లీపైని గనఁబఱచిన ప్రకారము పరబ్రహ్మమునకు శేషభూతములగుటంజేసియే యవి వస్తువులుగా నెన్నఁబడుచున్నవి. అందువలన నాపరమాత్మతో నొక్కటిగాఁ జెప్పఁబడుచున్నవి. ఈ విషయము వేదార్థసంగ్రహమున సమర్థింపఁబడినది. ఇట్లు శరీరాత్మభావరూపమగునట్టి తాదాత్మ్యమునే "ఆత్మేతితూప గచ్ఛన్తి గ్రాహయన్తిచ" (బ. సూ. ౪ అ. ౧ పా. ౩ సూ.) అను సూత్రముచే సూత్రకారులు చెప్పఁబోవుచున్నారు. వాక్యకారులును "ఆత్మేత్యేవతు గృహ్ణీయాత్" అను వాక్యముచే అట్లే తెలిపియున్నారు.

ఇందు తత్త్వమేమన్నను, కొన్ని శ్రుతులు అచిత్పదార్థము భోగ్యవస్తు వనియు, జీవుఁడు భోక్తయనియు, పరబ్రహ్మము నియామకుఁడనియు నిట్లు చిద చిదీశ్వరుల స్వరూపమును విభజనపూర్వకముగాఁ దెలుపుచున్నవి. ఎట్లన,

"అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః" (శ్వే. ౪ అ. ౯) (మాయగలవాఁడు (భగవంతుఁడు) దీనివలన జగత్తును సృజించుచున్నాఁడు మఱియొకఁడు (జీవుఁడు) దానియందు నిరోధింపఁ బడి యున్నాఁడు.)

"మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం" (శ్వే. ౪ అ. ౧౦ వా.) (ప్రకృతిని మాయనుగా నెఱుంగునది. సర్వేశ్వరుని మాయగలవానిని గా నెఱుంగునది.)

"క్షరం ప్రధాన మమృతాక్షరం హరః । క్షరాత్మానా వీశతే దేవ ఏకః" (శ్వే. ౧ అ. ౧౦.) (ప్రకృతి క్షరమనఁబడును. జీవుఁడు అక్షరుఁడును అమృతుఁ డును. ఒక్కఁడగు శర్వేశ్వరుఁడు ప్రకృతినిన్ని, జీవునిన్ని ఏలువాఁడు.) ఈ శ్రుతి యందు "అమృతాక్షరంహరః" అనుతావున, "హర" శబ్దము "ప్రధానమాత్మనో భోగ్యత్వేనహర తీతిహరః=ప్రకృతిని భోగ్యవస్తువునుగా స్వీకరించువాఁడు" అనెడి, శబ్ద వ్యుత్పత్తినిబట్టి, జీవవాచకము.

"సకారణం కరణాధిపాధిపో నచాస్యకశ్చి జ్జనితా న చాధిపః" (శ్వే. ౬ అ. ౯) (ఆతఁడు అనఁగా సర్వేశ్వరుఁడు జగత్కారణము, ఇంద్రియముల కధిపతులగు జీవులకును నధిపతి. ఈతని పుట్టించినవాఁ డొక్కఁడును లేఁడు. ఈతని కధిపతియును లేఁడు.)

"ప్రధానక్షేత్రజ్ఞపతిర్గుణేశః" (శ్వే. ౬ అ. ౧౬) (ఈతుఁడు ప్రకృతికిని జీవులకును అధిపతియైనవాఁడు.)

"పతింవిశ్వస్యాత్మేశ్వరం శాశ్వతం శివమచ్యుతం" (తై. నా. ౧౧ అను) (జగత్తునకు అధిపతియైనవాఁడు, ఆత్మలకు ఈశ్వరుఁడు, శాశ్వతుఁడు, నిర్వికారుఁడు.)

"జ్ఞాజ్ఞౌద్వావజావీశనీశౌ" (శ్వే. ౧ అ. ౯) (ఒకఁడు సర్వజ్ఞుఁడును, మఱియొక్కఁడు అజ్ఞుఁడును ఒక్కఁడు ఈశ్వరుఁడును మఱియొకఁడు ఈశ్వరుఁడు కానివాఁడును. ఇద్దఱును పుట్టుక లేనివారు.)

"నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం ఏకో బహూనాం విదధాతి కామాన్" (కఠ. ౫ వ. ౧౩ వా.) (నిత్యుఁడును, ఒక్కఁడునగు నే చేతనుఁడు నిత్యులును అనేకులునగు చేతనుల (జీవుల) కోరికలను నెరవేర్చుచున్నాఁడో.)

"భోక్తా భోగ్యం ప్రేరితారంచ మత్వా" (శ్వే. ౧ అ. ౧౨) (భోక్తను అనఁగా జీవునిని, భోగ్యమును అనఁగా అచేతనమును, ప్రేరకుని అనఁగా ఈశ్వరునిని తలంచి)

"తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో ఽభిచాకశీతి" (ము. ౩ ము. ౧ ఖ. ౧ వా) వారిద్దఱిలో నొక్కఁడు (జీవుఁడు) ఫలమును (కర్మఫలమును) అనుభవించుచున్నాఁడు. వేఱొక్కఁడు (సర్వేశ్వరుఁడు) దానిని అనుభవింపక అంతటను ప్రకాశింపుచున్నాఁడు.

"పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా జుష్టస్తతస్తేనా మృతత్వమేతి" (శ్వే. ౧ అ. ౬) (ఆత్మనుసు ఈశ్వరునిని వేఱుగాఁదలంచి వానిచే ననుగ్రహింపఁబడినవాఁడై ముక్తిని పొందుచున్నాఁడు.)

"అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీం ప్రజాం జనయన్తీం సరూపాం। అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః" (తై. ౪ ప్ర. నా. ౧౦ అను. ౫) (ఎఱుపును తెలుపును నలుపును గలదియును అనఁగా సత్త్వరజస్తమో గుణములుగలదియును, సమానమైనరూపముగల చాల సంతానమును పుట్టించునదియునగు నొక్క యాఁడుమేకను (ప్రకృతిని) ప్రీతిచేయుచున్నదియగు నొకఁ మొగమేక (సంసారియగు జీవుఁడు) అనుసరించుచున్నది,

మఱియొక్క మొగమేక (ముక్తుఁడు) అనుభవింపఁబడిన భోగముగలదై దీనిని విడుచుచున్నది.)

"సమానే వృక్షే పురుషో నిమగ్నో ఒనీశయా శోచతి ముహ్యమానః. జుష్టం యదా పశ్యత్యన్య మీశమస్య మహిమానమితి వీతశోకః" (శ్వే. ౪ అ. ౭) (పురుషుఁడు ప్రకృతిచేత అజ్ఞానమును పొందినవాఁడును ఒక్కచెట్టున సంగ గియున్నవాఁడునై దుఃఖపడుచున్నాఁడు. తనకంటె వేఱగువాఁడును ప్రీతిచేయఁ బడినవాఁడునునగు ఈశ్వరుని ఎప్పుడు చూచుచున్నాఁడో, అప్పుడతఁడు దుఃఖ ములు పోయినవాఁడై ఈతని మహిమను పొందుచున్నాఁడు.)

ఈపైని యుదహరించినవి మొదలుగాఁగల శ్రుతులు చిదచిదీశ్వరులు వేఱువేఱయినవారని తెలుపుచున్నవి. స్మృతులును అట్లే తెలుపుచున్నవి. ఎట్లన, శ్రీభగవద్గీతలయందు,

శ్లో॥ అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా।
అపరేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరాం।
జీవభూతాం మహాబాహో యయేదం ధా ర్యతే జగత్॥
భ. గీ. ౭ అ. ౫ శ్లో॥

తా॥ ఓ యర్జునా! అహంకారమనియు నివ్విధముగా నాయొక్క యీ ప్రకృతి యెనిమిది విధములు గలది. ఇది యపరప్రకృతి యని చెప్పఁబడుచున్నది. దీనికంటె వేఱుగా నున్న నా గొప్పప్రకృతిని జీవునిగాఁ దెలిసికొనుము. నాచేత నీ సమస్తజగత్తున్ను ధరింపఁబడుచున్నది.

శ్లో॥ సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికాం।
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజామ్యహం।
ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్॥
భ. గీ. ౯ అ. ౭-౮ శ్లో॥

తా॥ ఓ యర్జునా! కల్పాన్తమున సమస్తభూతములును నా ప్రకృతిని పొందుచున్నవి. మఱియు కల్పాదియందు వాని నన్నింటిని సృజింపుచున్నాఁడను నాదియగు ఈ ప్రకృతిని పరిణమింపఁజేసి ప్రకృతికి పరాధీనమైన యీ సమస్త భూత సముదాయమును మాటిమాటికి సృజింపుచుందును.

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతిస్సూయతే సచరాచరం।
హేతునాఽనేన కౌన్తేయ జగద్ధి పరివర్తతే॥
భ. గీ. ౯ ౧౦ శ్లో॥

తా॥ ఓ యర్జునా! అధ్యక్షుండనైన నాచే సంకల్పింపఁబడినదై యీ ప్రకృతి స్థావరజంగమ విశిష్టమగునట్టి యీ జగత్తును గలుగఁజేయుచున్నది. ఈ హేతువువలననే జగత్తు ముందుముందు జరుగుచున్నది.

శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి॥ (భ. గీ. ౧౩ అ. ౧౯ శ్లో॥)

తా॥ ఓ యర్జునా। ప్రకృతిని, జీవునిన్ని ఈరెంటిని అనాదులుగా నెఱుంగుము.

శ్లో॥ మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహం।
సంభవ స్సర్వభూతానాం తతో భవతి భారత॥
భ. గీ. ౧౪ అ. ౩ శ్లో.

తా॥ ఓ యర్జునా! అన్నింటికిని కారణభూతమైన నాయొక్క గొప్ప ప్రకృతి యేది కలదో, దానియందు గర్భమును అనఁగా నీచేతన సముదాయమును నేను ఉంచుచున్నాను. అందుమూలముగా సమస్తభూతములును పుట్టుచున్నవి.

"జగత్తునకు కారణభూతమైనాదియయిన గొప్పబ్రహ్మము అనఁగా ప్రకృతి యనుపేరుగలదియు భూతసూక్ష్మమునునగు నచిత్పదార్థ మేదికలదో, దానియందు చేతనుఁడనఁబడు గర్భమును నేను వుంచుచున్నాను. ఇట్లు నాచే నొనర్పఁబడిన చేతనాచేత పదార్థముల సంయోగము మూలముగా దేవతలుమొదలుకొని స్థావరపదార్థముల పర్యంత ముండునవియు, అచిత్తుతోఁగలిసి యుండునవియునునగు సమస్తభూతములును గలుగుచున్నవి" అని యీశ్లోకమున కర్థము.

ఇట్లు భోక్తగాను భోగ్యవస్తువుగాను నున్నట్టివియు, అన్ని యవస్థలలో నుండునవియు అనఁగా సూక్ష్మములుగాను స్థూలములుగాను నుండునవియు నగు చేతనాచేతన పదార్థములు, పరమపురుషునికి శరీరభూతము లగుటంజేసి, యవి వానిచే నియమింపఁబడునవి యనియు, వానిని విడిచి వేఱుగా నుండఁదగనివనియు, పరమపురుషుఁడు వాని కన్నింటికి నాత్మయనియును కొన్ని శ్రుతులు తెలుపుచున్నవి. ఎట్లన,

బృహదారణ్యకోపనిషత్తునందు "యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అన్తరో యం పృథివీ న వేద, యస్య పృథివీ శరీరం యః పృథివీ మన్తరో యమయతి" (ఎవ్వఁడు పృథివియందున్నవాఁడై పృథివికి లోపలివాఁడో, ఎవనిని పృథివి యెఱుంగదో, ఎవనికి పృథివి శరీరమో, ఎవ్వఁడు పృథివి లోపలివాఁడై నియమించువాఁడో) అనువాక్యము మొదలుకొని "య ఆత్మని తిష్ఠ న్నాత్మనో ఽన్తరో, య మాత్మా న వేదయస్యాత్మా శరీరం య ఆత్మానమన్తరో యమయతి స త ఆత్మాన్తర్యామ్యమృతః" (బృ. ౫ అ. ౭ బ్రా. ౩ వా.) ఎవ్వఁడు ఆత్మయందున్నవాఁడై ఆత్మకు లోపలివాఁడో, ఎవనిని ఆత్మ యెఱుంగదో, ఎవనికి ఆత్మ

శరీరమో, ఎవ్వఁడు ఆత్మకు లోపలివాఁడై ఆత్మను నియమించుచున్నాఁడో యా తఁడు నీయాత్మయు అంతర్యామియు, అమృతస్వరూపుఁడును" అనునవియును, సుబాలోపనిషత్తునందు "యః పృథివీమన్తరే సంచరన్ యస్య పృథివీ శరీరం యం పృథివీ న వేద" (ఎవ్వఁడు పృథివిలోపల సంచరించుచున్నవాఁడో, ఎవనికి పృథివి శరీరమో, ఎవనిని పృథివి యెఱుంగదో) అను వాక్యము మొదలుకొని "యోఽక్షరమన్తరే సంచరన్ యస్యాక్షరం శరీరం యమక్షరం నవేద యో మృత్యుమన్తరే సంచరన్ యస్య మృత్యుశ్శరీరం యం మృత్యుర్న వేద ఏష సర్వభూతాన్తరాత్మా ఉపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" (సుబా. ౭ ఖ. ౧ వా) (ఎవ్వఁడు అక్షరములోపల సంచరింపుచున్నవాఁడో, ఎవ్వనికి అక్షరము శరీరమో, ఎవ్వని అక్షరమెఱుఁగదో, ఎవ్వఁడు మృత్యువులోపల సంచరించుచున్నాఁడో, ఎవ్వనికి మృత్యువుశరీరమో, ఎవనిని మృత్యువు ఎఱుఁగదో, ఇతఁడు సమస్తభూతములకును అంతరాత్మయును, నిర్దోషుఁడును, పరమపదమునను౦డువాఁడును, దేవుఁడును, ఒకఁడునగు నారాయణుఁడు) అను వాక్యమువలనను, ఈపైని చెప్పఁబడిన యంశమే ప్రతిపాదింపఁబడియె.

ఈపై శ్రుతియందుండు "మృత్యు" శబ్దము 'తమస్సనఁబడునదియు సూక్ష్మావస్థలోనుండు నదియును నగు నచిత్పదార్థమును తెలుపునది. ఎట్లన, ఈ యుపనిషత్తునందే "అవ్యక్తమక్షరే లీయతే అక్షరం తమసి లీయతే" (సుబా. ౨ ఖ.) అనుతావున "అవ్యక్తము అక్షరమునను అక్షరము తమస్సునను ఏకమగుచున్నది" అని చెప్పఁబడెను.

"అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాగ్ం సర్వాత్మా" (ఆర. 3 ప్ర. చిత్త. ౧౧ అను. ౨౧) (లోపల ప్రవేశించియున్నవాఁడై జనులను శాసించువాఁడు అన్నింటికి నాత్మయయినవాఁడు) అను శ్రుతివాక్యము సయితము ఈపైని గానఁబఱచిన యంశమునే తెలుపుచున్నది.

ఇట్లు సర్వావస్థలలో నుండునట్టి చిదచిత్పదార్థములన్నియును శరీరముగాఁ గలవాఁడగుటంజేసి యవి తనయొక్క విశేషములుగాఁ గలవాఁడగు పరమపురుషుఁడే, కార్యావస్థలో నుండునదిగాను కారణావస్థలో నుండునదిగాను నగు నీజగత్తుగా నుండువాఁడని తెలుపుటకై కొన్ని శ్రుతులు "కార్యావస్థగలదియు కారణావస్థగలదియునగు నీజగత్తు ఆబ్రహ్మమే" అని చెప్పుచున్నవి. ఎట్లన,

ఛాందోగ్యోపనిషత్తునందు "సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత" (ఛా. ౬ ప్ర. ౨ ఖ. ౧ వా) (ఈ కనఁబడు జగత్తు మొదటను సత్తు (బ్రహ్మము)గానేయుండెను ఒక్కటేమై రెండవది లేనిదై యుండెను, అది తాననేకములు కావలయుననియు

పుట్టవలయుననియును తలంచెను - అది తేజస్సును సృజించెను.) అను వాక్యము మొదలుకొని "సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠా ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వ మసి శ్వేతకేతో" (ఛా. ౬ ప్ర. ౮ ఖ ౬ వా.) (ఓ సోమ్యుఁడా ఈ ప్రజలందఱును సత్తు మూలముగాఁ గల వారు అనఁగా సత్తువలనఁ గలిగినవారు-సత్తు ఆధారముగాఁగలవారు సత్తు, ప్రతిష్ఠగాఁగలవారు అనఁగా సత్తునందు లయమును బొందువారు - ఇది యంతయును ఈతఁడాత్మగాఁగలది-అది సత్యము-ఆతఁడే ఆత్మ-ఓ శ్వేతకేతుఁడా! అది నీవుశరీరముగాఁగలది." అను వాక్యమువలనను, తైత్తిరీయోపనిషత్తునందు "సోఽకామయత బహుస్యాం ప్రజాయాయేతి స తపోతప్యత స తప స్తప్త్వా ఇదం సర్వమసృజత" (తై. ఆనం. ౬ అను) (అతఁడు, నేను అనేకములు కావలయును, నేను పుట్టవలయును, అని సంకల్పించెను - అతఁడు ఆలోచనమును చేసెను - అతఁడు ఆలోచననుచేసి ఈ కనఁబడునది ఏదిగలదో, దీనినంతయును సృజించెను.) అను వాక్యము మొదలుకొని "సత్యం చానృతంచ సత్యమభవత్" (తై. ఆన, ౬. అను) (చేతనాచేతన స్వరూపమయ్యును పరబ్రహ్మము సత్యమే అనఁగా తన స్వభావముతో నున్నదే అయ్యెను) అనువాక్యము వలనను, ఈ మొదలగు తావుల నీపైని గానఁబడుచిన యంశమే ప్రతిపాదింపఁబడియెను.

ఇతరశ్రుతులయందు తెలుపఁబడిన చిదచిదీశ్వర స్వరూపవివేకము ఇచటను అనఁగా ఛాందోగ్య తైత్తిరీయోపనిషత్తులయందును తెలుపఁబడినది. ఎట్లన,

"హన్తాహమిమా స్తిస్రో దేవతాః అనేన జీవేనాత్మనాఽను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా. ౬ ప్ర. 3 ఖ. ౨ వా.) (నేను ఈ మూడు దేవతలలోను జీవశరీరుఁడుగాఁ జొచ్చి నామరూపములను ఏర్పఱుపవలయును అని ఆ యీదేవత సంకల్పించెను) అను తావున చందోగులును, "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్ తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్" అనియు, "విజ్ఞానంచావిజ్ఞానంచ" "సత్యం చానృతంచ సత్య మభవత్" (తై. ఆన, ౬ అను.) (దానినిసృజించి దానిలోనే ప్రవేశించెను. దానిలోఁ బ్రవేశించి వికారము లేనిదియును వికారముకలదియును అయ్యెను. తెలివిగలదియును తెలివిలేనిదియును అయ్యెను. చేతనాచేతన స్వరూపమగుచు బ్రహ్మము నిర్వికారమే ఆయెను.) అనియు నీతావుల తైత్తిరీయులును ఈ విషయమును గుఱించియే పఠించియున్నారు. "అనేన జీవేనాత్మనానుప్రవిశ్యాఽనామరూపే వ్యాకరవాణి" అను శ్రుతి వాక్యము "తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్" అనియు, "విజ్ఞానంచా విజ్ఞానంచ" అనియు నీ శ్రుతులతో నేకార్థము గలదైనందున, అందు చెప్పఁబడిన

బ్రహ్మాత్మకత్వము, ఆత్మశరీరభావమునుబట్టి వచ్చినదియే యని తెలియుచున్నది. "తద్ధేదం తర్హ్యవ్యాకృతమాసీత్తన్నామరూపాభ్యాం వ్యాక్రియత" (బృ. ౩ అ. ౪ (బ్రా. ౭ వా.) (సృష్టికి పూర్వమిదియంతయు నామరూపవిభాగము లేనిదై సృష్టికి అనంతరము నామరూపవిభాగము గలదాయెను) అను శ్రుతియందు చెప్పఁబడిన నామరూప వైశద్యమనఁబడునదియును నిట్టిదియే,

కావున కార్యావస్థను, కారణావస్థనున్ను గలవాఁడు (కార్యావస్థయందు) స్థూలములును (కారణావస్థయందు) సూక్ష్మములునునగు చేతనాచేతన పదార్థములు శరీరముగాఁగల పరమపురుషుఁడే గాన, కారణముకంటెను కార్యము వేఱయినది కాదు. కావుననే, కారణము తెలియుటచే కార్యము తెలియఁబడును. కాఁబట్టి, ఒక్కటి తెలియుటచే సర్వము తెలియఁబడుననెడి వేదాంతశాస్త్రీయ ప్రతిజ్ఞయును ఎక్కువ యుపపన్నమగును.

ఛందోగులు "అహమిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా. ౬ ప్ర. ౩ ఖ. ౨ వా) అను వాక్యమున "తిస్రోదేవతాః" (పృథివి, ఉదకము, తేజస్సు) అనుటచే సమస్తమగు అచేతనపదార్థజాతమును నిర్దేశించి, సర్వేశ్వరుఁడు, తన్ను ఆత్మగాఁ గలిగియున్న జీవునితోఁగూడ, దానిలోఁ బ్రవేశించి నామరూపములను విశదపఱచెనని పఠించియున్నందున, సమస్తశబ్దములును అచేతనపదార్థవిశిష్టుఁడగు జీవునితోఁగూడియున్న పరమాత్మనే తెలుపునవి. కావున కారణావస్థలోనుండు పరమాత్మను తెలుపునట్టి శబ్దముతో కార్యవాచి శబ్దమునకు సామానాధికరణ్యము (కారణమైనదియే కార్యమనుట) ముఖ్యమైనది. స్థూలములును, సూక్ష్మములును నగు చిదచిత్పదార్థములు శరీరముగాఁగల బ్రహ్మమే కార్యమును కారణమును కావున, ఈ జగత్తు బ్రహ్మమే యుపాదానకారణముగాఁగలది. సూక్ష్మములగు చిదచిత్పదార్థములు శరీరముగాఁగల బ్రహ్మమే కారణము.

ఇట్లు బ్రహ్మము ఉపాదాన కారణమైనను, అట్టి యుపాదానకారణము (చిదచిదీశ్వర) సముదాయమగుటంజేసి, చిదచిత్పదార్థములయొక్కయు బ్రహ్మముయొక్కయును స్వభావములకు సంకరము (ఒక్కదాని స్వభావము వేఱొక్కదానిదగుట) గలుగకపోవుటయును ఎక్కువ యుపపన్నమగును. దృష్టాంతము— తెల్లనివియు, నల్లనివియు, ఎఱ్ఱనివియునునగు తన్తువుల సముదాయముతో నానావర్ణములుగల వస్త్రము నేయఁబడును. అందు యేయే తావుల యేయేవర్ణము గల తన్తువులు గలవో, ఆయాతావులను మాత్రము ఆయావర్ణములుండును. కావున కార్యావస్థయందు (వస్త్రముగానుండునట్టి యవస్థయందు) అంతటను వర్ణసంకరము గలుగదుగదా. అట్లే చిదచిదీశ్వరుల సముదాయము జగత్తును

గలుగఁజేయునది యయినను, అవి జగద్రూపమగు కార్యావస్థయందున్నప్పుడును వానికిఁగల భోక్తృత్వ భోగ్యత్వ నియన్తృత్వాదులకు సంకరము గలుగదు. ఇందు విశేషమెద్దియనిన, తన్తువులు ఒక్కటినుండి మఱియొక్కటి వేఱుగా నుండఁదగినవియేయై, పురుషుని యిచ్ఛానుగుణముగా నొకప్పుడు ఒకవిధమైన చేరిక గలవై కారణభూతములుగాను కార్యభూతములుగాను నగుచున్నవి. ప్రకృతమునన్నో, చిదచిత్పదార్థములు సర్వావస్థలయందును పరమపురుషుని శరీరమగుటంజేసి, యపి యాపరమపురుషునికి శరీరమగుటం జేసియే పదార్థములుగా నెన్నఁబడునవిగాన, అట్టి చిదచిత్పదార్థములను శరీరముగాఁ గలిగియున్నవాఁడగు పరమపురుషుఁడు సర్వకాలమును సర్వశబ్దములచేతను తెలుపఁదగినవాఁడు. ఇంతియే యీరెండు పక్షములకుఁగల విశేషము. స్వభావభేదమున్ను, అట్టి స్వభావమునకు సంకరము గలుగకుండుటయును, ఈపైని గానఁబఱచిన రెండుపక్షములకును, సమానములే. ఈ హేతువువలన, పరబ్రహ్మము కార్యభూతమగు నట్టి యీజగత్తులోఁ బ్రవేశించినను, వాని స్వరూపమున నెవ్విధమైన మార్పును గలుగదు. కావున నట్టి పరబ్రహ్మము వికారమును పొందనిదియగుటయును ఎక్కువ యుపపన్నమగును. స్థూలముగానుండునదియు, కావుననే నామరూపవిభాగముగలదియునగు చిదచిత్పదార్థజాతమునందు ఆత్మగాఁ బ్రవేశించియుండుటంజేసి పరబ్రహ్మము కార్యమనఁ బడుటయును ఎక్కువ యుపపన్నము. కార్యమనఁగా వేఱొక్క యవస్థగలది యగుటయే కదా!

పరబ్రహ్మము హేయగుణములతో సంబంధములేని దగుటంజేసి నిర్గుణవాక్యములు ఉపపన్నములు. "అపహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః" (ఛా. ౮ ప్ర. ౭ ఖ. ౧ వా)అను శ్రుతివాక్యము (పరబ్రహ్మము పాపములులేనివాఁడు, ముసలితనములేనివాఁడు, ఆకలిలేనివాఁడు, దప్పికలేనివాఁడు) అనుటచే హేయగుణములను ప్రతిషేధించి "సత్యకామస్సత్యసంకల్పః" (సత్యకాముఁడు సత్యసంకల్పుఁడు) అనుటచే పరబ్రహ్మమునకు కల్యాణగుణములు గలవని విధించుచు, నందుచే సామాన్యముగాఁ గుణములను నిషేధించిన తావున హేయగుణములే అట్లు నిషేధింపఁబడుచున్నవని ఏర్పఱుచుచున్నది.

సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడును, నిఖిలహేయప్రత్యనీక కల్యాణ గుణాకరుఁడును నగు పరబ్రహ్మముయొక్క స్వరూపము జ్ఞానమును బట్టియే నిరూపింపఁ దగినది యనియు, అది స్వయంప్రకాశమగుటంజేసి జ్ఞానస్వరూప మైనదనియును అంగీకరించియున్నందున, "బ్రహ్మము జ్ఞానస్వరూపము" అనెడివాదము నయితము ఉపపన్నమైనదియే. ఎట్లననిన, "యస్సర్వజ్ఞస్సర్వవిత్" అనియు,

"పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" అనియు, "విజ్ఞాతారమరే కేన విజానీయాత్" అనియు నీ మొదలగు శ్రుతులు బ్రహ్మము జ్ఞాత (జ్ఞానముగలది) యని తెలుపుచున్నవి. "సత్యం జ్ఞానం" ఈ మొదలగు శ్రుతులు బ్రహ్మము జ్ఞానమునుబట్టియే నిరూపింపదగినది యగుటంజేసియు, స్వయంప్రకాశ మగుటంజేసియును జ్ఞానస్వరూప మయినదని తెలుపుచున్నవి.

"సోఽకామయత బహుస్యామ్" అనియు, "తదైక్షత బహుస్యాం" అనియు, "తన్నామరూపాభ్యాం వ్యాక్రియత" అనియు, నీ శ్రుతులయందు జెప్పియున్నప్రకారము, బ్రహ్మమే తన సంకల్పమువలన విచిత్ర స్థావరజంగమరూపముగా నానావిధమైనది. కావున అందుకు విరుద్ధమైనదియు బ్రహ్మాత్మకము కానిదియు నగు నానావిధవస్తుభేద మేదియును తత్త్వము కాదు. అందువలన "మృత్యోస్స మృత్యుమాప్నోతి య ఇహ నానేవ పశ్యతి" అనియు "నేహనానాస్తి కిఞ్చన" అనియు "యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్ కేన కం విజానీయాత్" అనియు నీ మొదలగు వాక్యములు అట్టి వస్తు నానాత్వమునే నిషేధించుచున్నవి. ఇంతియెకాని, "బహుస్యాం ప్రజాయాయ" ఇత్యాదిశ్రుతియందుఁ జెప్పియున్న ప్రకారము బ్రహ్మము తన సంకల్పమువలన నానావిధనామరూపములను బొందుటచే నానావిధములగుటయన్నదో, ఈపై శ్రుతివాక్యములయందు, నిషేధింపఁబడుచుండలేదు. "యత్రత్వస్యసర్వ మాత్మైవాభూత్" ఇత్యాది నిషేధవాక్యములు పఠింపఁబడిన ప్రకరణముననే, "సర్వం తం పరాదద్యోఽన్యత్రాత్మన స్సర్వంవేద" అనియు, "తస్య హవా ఏతస్య మహతో భూతస్య నిశ్వసిత మేతదృగ్వేదః" అనియు నీ మొదలగువాక్యములు పఠింపఁబడుటనుబట్టి యీ యంశమిట్లు నిశ్చయింపఁబడుచున్నది.

ఈపైని గనఁబఱచిన ప్రకారము, చిదచిదీశ్వరుల స్వరూపములకుఁగల భేదమును వాని స్వభావములకుఁగల భేదమునున్ను తెలుపునవియు, కార్యకారణభావమును, కార్యకారణముల కభేదమునున్ను తెలుపునవియును నగు శ్రుతులకు విరోధము లేకపోవుట సంభవము. ఈ చిదచిత్పదార్థములకును పరమాత్మకును ఎల్లకాలమును శరీరాత్మభావము గలదని ప్రతిపాదించునవియును, శరీరభూతములగు చిదచిత్పదార్థములు కారణదశయందు నామరూపవిభాగమున కర్హములు కానంత సూక్ష్మములయినవనియు కార్యదశయందు అట్టి నామరూపవిభాగమున కర్హములగునంత స్థూలము లయినవనియును చెప్పునట్టి శ్రుతులనుండియే అట్లు తెలియవచ్చుచున్నది. కాఁబట్టి బ్రహ్మాజ్ఞాన వాదమునకుఁగాని, భేదా

ధిక బ్రహ్మాభేదవాదమునకుఁగాని కుయుక్తులచే నిరూపింపఁబడునదియు సర్వశ్రుతి విరుద్ధమైనట్టి మఱియే వాదమునకున్ను ఎవ్విధమునను అవకాశములేదు.

చిత్తును, అచిత్తును, ఈశ్వరుఁడును, ఈమూఁడును వేఱువేఱగు స్వభావములుగలవని శ్రుతులు తెలుపుచున్నవి. మఱియు చిదచిత్పదార్థము లీశ్వరునికి శరీరభూతములనియు ఈశ్వరుఁడు వానిని శరీరముగాఁ గలవాఁడనియును శ్రుతులే యంగీకరించుచున్నవి. కావున ఇతరశ్రుతులు కార్యకారణభావమును కార్యకారణముల కభేదమును ప్రతిపాదించుట యెంతమాత్రము విరోధింపదు.

[1]వేదశాస్త్రము ఆగ్నేయాది యాగముల నాఱింటిని వేఱువేఱుగ విధించి, ఆ యాఱింటిని రెండు సమూహములనుగా ననువదించి తరువాత "దర్శపూర్ణమాసాభ్యాం" అను వాక్యముచే వానిని స్వర్గేచ్ఛగలవాఁ డనుష్ఠింపవలయునని యెట్లు విధించుచున్నదో, అట్లే ప్రకృతమునను, "క్షరంప్రధానమమృతాక్షరం హరః క్షరాత్మానావీశతే దేవ ఏకః" అనియు, "పతిం విశ్వస్యాత్మేశ్వరం" అనియు, "ఆత్మా నారాయణః పరః" అనియు నీమొదలగు వాక్యములచే చిదచిదీశ్వరులను వేఱువేఱగు స్వరూప స్వభావములుగలవానినిగాఁ బ్రతిపాదించి, "యస్యపృథివీశరీరం" అనియు, "యస్యాత్మాశరీరం" అనియు, "యస్యావ్యక్తం శరీరం***యస్యాక్షరం శరీరం***ఏషసర్వభూతాన్తరాత్మా ఉపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" అనియు నీమొదలగు వాక్యములచే అన్నియవస్థలయందును చిదచిత్పదార్థములు పరమాత్మకు శరీరభూతములనియు పరమాత్మ వానికన్నింటికి నాత్మయనియును ప్రతిపాదించి, "సదేవసోమ్యే దమగ్రఆసీత్" అనియు "ఐతదాత్మ్యమిదం సర్వమ్" అనియు, "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనియు నీ మొదలగు వాక్యములచే "అట్లు శరీరియగు పరమాత్మను తెలుపు

---

(1) ఆగ్నేయంబును, అగ్నీషోమీయంబును, ఉపాంశుయాజంబును, రెండు ఐంద్రంబులును, ఐంద్రాగ్నంబునని ఆఱు యాగంబులుకలవు. ఒక్కొక్కయాగమున కొక్కొక్కవిధివాక్యము కలదు. వానివలననే ఇవి యేర్పడుచున్నవిగాన ఆ వాక్యములు ఉత్పత్తివాక్యము లనఁబడును. ఇవిగాక "య ఏవం విద్వాన్ పౌర్ణమాసీం యజతే" (ఇట్లు తెలిసికొనినవాఁడెవ్వఁడు పౌర్ణమాసయాగమునుసేయునో) "య ఏవం విద్వానమావాస్యాంయజతే" (ఇట్లు తెలిసికొనువాఁ డెవ్వఁడు దర్శయాగమునుసేయునో) అను రెండువాక్యములుకలవు. అవి ఆయాఱు యాగములను మూఁడేసి యాగముల నొక్కొక్క మొత్తముచొప్పున రెండు మొత్తములనుగాఁ జేయుచున్నవి. ఇవిగాక మఱియొక్కవాక్యము కూడకలదు. అది యేదియన్నను "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామోయజేత" (స్వర్గమును గోరువాఁడు దర్శయాగంబును పూర్ణమాస యాగంబును చేయునది) అనునది. ఇది అఱింటికిని స్వర్గమును గోరువాని నొకనినే యధికారినిగా నేర్పఱుచుచున్నదిగాన నాఱింటిని ఒక్కమొత్తమునుగానే చేయుచున్నది. అట్లే ఉపనిషత్తులును చిదచిదీశ్వరులనఁబడు మూఁడు తత్త్వములను, చిదచిదీశ్వరులకు శరీరశరీరిభావమును, ఐక్యమును క్రమముగా బోధించుచున్నవి.

నవియగు "సత్" "బ్రహ్మ" "ఆత్మ" ఈ మొదలగు శబ్దములచే కారణావస్థగలవాఁడును కార్యావస్థగలవాఁడును నగు వాఁడు పరమాత్మయొక్కఁడే అని యిట్లు యింతకుముందు తత్త్వత్రయముగా నంగీకరింపఁబడిన దానిని ప్రతిపాదించుచున్నది. ఇట్లు చిదచిత్పదార్థములను శరీరముగాఁ గలిగియున్న పరమాత్మను కేవల పరమాత్మ శబ్దముచే పేర్కొనినందున విరోధమేదియును లేదు. మనుష్యాకారము గల శరీరముతోఁ గూడియున్నట్టి యాత్మను నిర్దేశించి "ఈ యాత్మ సుఖముగలది" అని మనము లోకమునఁ జెప్పుచుండలేదా? అట్లే యిచటను తెలియఁగునది. కావున యీ వాద మింతటితోఁ జాలును.

"బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమువలననే యవిద్య నివర్తించుట శక్యము" అని అద్వైతులు చేయువాదము యుక్తమైనది కాదు. ఏలననిన, సంసారబన్ధము సత్యమైనదైనందున నది జ్ఞానముచే నివర్తింపఁ దగినది కాదు. పుణ్యపాపానుగుణముగా దేవమనుష్యాదిశరీరములోఁ బ్రవేశించుటచే గలుగు సుఖదుఃఖానుభవరూపమగు బంధము మిథ్యాభూతమని యేల చెప్ప శక్యము? భక్తిరూపమైనదిగా నంగీకరింపఁబడినట్టి యుపాసనము వలన సంతోషించిన పరమపురుషుని యనుగ్రహముచే నిట్టి బంధము నివర్తించునని యింతకుపూర్వమే చెప్పఁబడియె. వారికభిమతమగు బ్రహ్మాత్మైక్యజ్ఞానమన్ననో, వస్తువును యథావస్థితముగాఁ (ఉన్నదున్నట్టిదిగా) దెలుపక, విపరీతముగాఁ దెలుపునదైనందున మిథ్యారూపమైనది. కావున నది యట్టి బంధమును వృద్ధిపఱచుటయందే యుపయోగపడును. "మిథ్యైతదన్యద్ద్రష్టవ్యంహి నైతి తద్ద్రష్టవ్యతాం యతః" అనెడి శాస్త్రవాక్యమున్ను "ఒక్క పదార్థము వేఱొక్క పదార్థము కాఁదగదు. కావున నట్లగుట మిథ్య" అని కదా తెలుపుచున్నది. "ఉత్తమః పురుషస్త్వన్యః" అనియు "పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా" అనియు నీ మొదలగు వాక్యములును జీవాత్మకంటెను విలక్షణుఁడును, అట్టి జీవాత్మకంతరాత్మయునునగు పరబ్రహ్మమును గుఱించిన జ్ఞానము వలన పరమపురుషార్థస్వరూపమగు మోక్షము గలుగునని తెలుపుచున్నవి.

మఱియు, వారంగీకరించినట్టి నివర్తక (అవిద్యను నివర్తింపఁజేయునట్టి) జ్ఞానమున్ను మిథ్యారూపమైనదియే గాన, దానిని నివర్తించునట్టి దేదియో విచారింపఁదగును.

అద్వైతి:—ఈ నివర్తకజ్ఞానము తనతో విరోధించు సమస్తమగు భేదమును నివర్తింపఁజేసి, తాను క్షణికమైనందున స్వయముగానే నశించుచున్నది.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, ఆ నివర్తకజ్ఞానముయొక్క స్వరూపమును, దాని యుత్పత్తియును, దాని వినాశమును ఇవి యన్నియును కల్పితములుగదా! అందువలన నట్టి వినాశమును దానికల్పనయున్ను గలుగఁజేయునది

యగు అవిద్యను నివర్తింపఁ జేయునట్టి వేఱొక్క దానిని కనుఁగొన వలయును. అట్టి నివర్తకజ్ఞానముయొక్క వినాశమనునది బ్రహ్మస్వరూపమే యనియెదవా? అట్లగునేని, నివర్తకజ్ఞానము ఉత్పన్నమే కాకపోవునే? దాని వినాశ మెల్లకాలము నుండుటచే దాని యుత్పత్తి గలుగుట యసంభవము కదా!

భాష్యకారులు:—మఱియు "చిన్మాత్రమగు బ్రహ్మముకంటెను వేఱయిన దంతయును మిథ్య" అని యివ్విధమున సమస్తమును నిషేధించునట్టి జ్ఞానము గలవాఁ డెట్టివాఁడు?

అద్వైతి:—వాఁడు అధ్యాసరూపుఁడు.

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, అట్టివాఁడు ప్రకృతమున నిషేధింపఁబడువాఁడు. అందువలన నతఁడు ఇట్టి నివర్తక జ్ఞానమునకు (కర్మ) విషయభూతుఁడు. కాఁబట్టి యట్టి జ్ఞానమునకు కర్త యతఁడగుట యనుపపన్నము. ఒకవేళ, అట్టిది బ్రహ్మస్వరూపమే యనియెదవేమో, అట్లంటివేని, యట్టి నివర్తక జ్ఞానమును గుఱించి బ్రహ్మమునకుఁ గల జ్ఞాతృత్వము ఎట్టిది? అదియును భ్రాంతి వశమున నారోపింపఁబడినదా? అట్లది భ్రాంతివశమున నారోపింపఁబడిన దంటి వేని, యట్టి యారోపమును, అందులకుఁ గారణభూతమగు వేఱొక యవిద్యయును నివర్తకజ్ఞానమునకు విషయభూతములు కాకపోవుటచే నవి యుండేయుండును. వానిని నివర్తింపఁ జేయునట్టి వేఱొక్క-జ్ఞానము కలదని యంగీకరించుపక్షమున, అదియును మూఁడురూపములుగల దగుటంజేసి అనఁగా నొక్కదానిని గుఱించి వేఱొక్కనికిఁ గలుగు జ్ఞానమగుటంజేసి, జ్ఞాతనుబట్టి యది యనవస్థాదోషముగలది యగును. ఒకవేళ బ్రహ్మస్వరూపమే అట్టి జ్ఞాత యనియెదవా? అట్లంటివేని, మా సిద్ధాంతమునే యంగీకరించినట్లగును. నివర్తకజ్ఞానముచే నివర్తింపఁబడ వలసిన వానిలోనే ఆ నివర్తకజ్ఞాన స్వరూపంబును వాని జ్ఞాతయుఁగూడ చేరి యుందురంటిరేని, ఈ మాట భూమియందుండునదంతయును దేవదత్తునిచే ఛేదింపఁబడినదని చెప్పి ఆ దేవదత్తుఁడును ఆ ఛేదనముఁగూడ ఛేదింపఁబడిన వానిలోఁ జేరినవియే యని చెప్పెడి మాటవలెనే నవ్వదగియున్నది.

అధ్యస్తుండగు (భ్రమమునకు విషయమగు) జ్ఞాత తననాశమును కలుగఁ జేసెడి నివర్తక జ్ఞానమునకు తానే కర్త కావలసివచ్చును. అయితే అట్లు కాఁ గూడదు. తన నాశ మెన్నఁడును పురుషార్థము కాదు గదా. ఆ నాశము బ్రహ్మ స్వరూపమేయని యంగీకరించిన పక్షమున, భేదజ్ఞానమును, దానికి మూలమగు నవిద్యను మొదలగువానిని కల్పించుటయే సందర్భింపదు. ఇట్లు దైవోపహతుని దుడ్డుకఱ్ఱతోఁ గొట్టుటనుబోలినట్టి యీమాయావాద ఖండన మింతటితోఁ జాలును.

ఈ పై నిగనఁబఱచిన ప్రకారము ఈ సంసారబంధము అనాదికాలమునుండి

యాచరింపఁబడిన పుణ్య పాప రూప కర్మ ప్రవాహమనఁబడు నజ్ఞానమువలనఁ గలిగినది. ఇంతకుపూర్వము జెప్పఁబడిన బ్రహ్మజ్ఞానము వలననే యిట్టి సంసారబంధము నివర్తించును. ప్రతినిత్య మనుష్ఠింపఁబడునవియు, పరమ పురుషారాధన రూపములును, యాథాత్మ్యజ్ఞానముచే సంస్కరింపఁబడినవియునగు వర్ణాశ్రమోచిత కర్మములవలన నట్టి బ్రహ్మజ్ఞానము లభింపఁదగినది. అయితే కేవలకర్మములు అల్పములైనట్టివియు అస్థిరములైనట్టివియునునగు స్వర్గభోగాదులనిచ్చునవియనియు, ఫలాపేక్షలేక పరమపురుషారాధనముగా ననుష్ఠింపఁబడిన కర్మములు ఉపాసనారూపమగు జ్ఞానమును గలుగఁజేసి దానిమూలముగా బ్రహ్మయాథాత్మ్యానుభవరూపమగు ననంతస్థిరఫలమునిచ్చున వనియును నిదియంతయు కర్మస్వరూపజ్ఞానములేక తెలియఁబడదు. కనుక నిట్లు కేవలకర్మములను పరిత్యజించి భగవదారాధనరూపములగు కర్మములననుష్ఠించుటయనునది కర్మస్వరూపమునుగుఱించిన జ్ఞానములేక సంభవింపదు. కావున కర్మవిచారముఁజేసి యందువలననే బ్రహ్మవిచారము జేయునదియని "అథ=తరువాత, అతః=ఇందువలన" అనుటచేఁ జెప్పఁబడియె.

మహాసిద్ధాంతము యొక్క సారాంశము.

## జిజ్ఞాసాధికరణ పూర్వపక్షము

ఇందును గుఱించి పూర్వ మీమాంసకు లిట్లాక్షేపించు చున్నారు:—పూర్వు లాయర్థమును తెలుపుటకై యా శబ్దమును ప్రయోగించి యుండుటయే తప్ప, ఈ శబ్దము ఈ యర్థమును తెలుపునది యనెడి విషయమును నిశ్చయించునది వేఱొక్క టేదియును గానఁబడదు. అట్టి శబ్ద వ్యవహారమన్ననో, ఒక కార్యమును గుఱించిన యుద్దేశమునుబట్టి ప్రవర్తించునదిగాన, శబ్దమునకుఁ గల ప్రామాణ్యమనఁబడు నదియును నొకకార్యమునకు గానే యయినదియని తెలియవచ్చుచున్నది. వేదము సయితము శబ్దమేగాన, ఈపైని గానఁబడిన ప్రకారము, అందు తెలుపఁబడునది యంతయు కార్యరూపమయినదియే. కావున, వేదశాస్త్రముయొక్క అన్తిమభాగమునఁ బఠింపఁబడినవియగు నుపనిషత్తులు పరినిష్పన్నవస్తువగు పరబ్రహ్మమును తెలుపునట్టి ప్రమాణములు కాఁదగవు.

[1]పుత్రజన్మము మొదలగు సిద్ధవస్తువులను తెలుపు వాక్యములను గుఱించియన్ననో, అందు భూతభవిష్య ద్వర్తమానకాలగతములయినవి యగు ననేక హేతువు లుండఁదగును. అట్టి వాక్యములను వినినతోడనే తండ్రికిఁగలుగు

(1) (పుత్రస్తే జాతః=నీకు కొడుకుపుట్టెను) అని యొక్కఁడుచెప్పినతోడనే తండ్రికి ముఖవికాసము కలుగును. దానిని ప్రక్కనుండువాఁడు చూచి, ఈమాట సంతోషమును గలుగఁజేసెడి పుత్రోత్పత్తిని చెప్పునదికాని, సిద్ధమైన యంశమును చెప్పుటయందే శబ్దమునకు సామర్థ్యమును కల్పించునే యన్నను,

ముఖవికాసాదులకు స్థులగ్నజన్మము, సుఖప్రసవము మొదలగునవిగూడ కారణము కాఁదగును. కాఁబట్టి తండ్రికిఁ గలుగు ముఖవికాసము ఎద్దియో యొక యిష్టమైన యంశ మతనికిఁ దోఁచియుండుటను తెలియఁజేయునే గాని, యాయంశ మిట్టిదియని దానిని విశేషించి నిశ్చయింపఁజాలదు.

[1]కొన్ని పదములయొక్కయును విభక్తులయొక్కయును అర్థము నెఱిఁగియున్నవానికి మఱికొన్ని శబ్దముల యర్థమును గుఱించి గలుగు నిశ్చయము మూలముగాఁగాని, మఱికొన్ని విభక్తుల యర్థమును గుఱించి గలుగు నిశ్చయము మూలముగాఁగాని శబ్దము సిద్ధవస్తువును తెలుపుటయందు సామర్థ్యముగలదిగాఁ దెలియవచ్చునని నిశ్చయింపనేరము. ఏలననిన, అప్పుడును మనకు తెలిసిన కార్యమును తెలుపునట్టి కొన్ని శబ్దముల నాధారముగాఁ జేసికొనిగదా అందొక యంశముయొక్క యర్థమును తెలియఁదగును.

[2]త్రాటిని సర్పముగాఁగొని బీతినొందినవానితో "ఇది సర్పము కాదు" అని చెప్పినతోఁడనే వానిభయము పోవుటకు హేతువు అచట సర్పము లేదనెడి జ్ఞానమేయని నిశ్చయింప నేరము. ఈ తావునను అది నిశ్చేష్టమనిగాని, నిర్విషమనిగాని, యచేతన వస్తువనిగాని యీ మొదలగు నర్థజ్ఞానములగు ననేక భయనివారణకారణము లుండుటచే ఆ భయమును నివర్తింపఁ జేయునదిట్టిదియని నిశ్చయించుట యసంభవము.

---

(1) (కః కూజతి=ఏది కూయుచున్నది?) అని యొకఁడు ప్రశ్నముచేయఁగా, (పికః=కూజతి కోయిలకూయుచున్నది) అని మఱియొక్కఁడు ఉత్తరము నిచ్చునపుడు. "కూజతి" అను శబ్దముయొక్క యర్థము నెఱింగియుండి కోయిలకూఁతను వినుచున్న మూఁడవవాఁడు "పికః" అనుశబ్దమునకు కోయిల యర్థమని గ్రహించును. ఇట్లే (కాష్ఠైః స్థాల్యామ్ ఓదనం పచతి=కఱ్ఱలచేత కుండలో అన్నమును వండుచున్నాఁడు) అని యొక్కఁడు చెప్పఁగా "కాష్ఠైః స్థాల్యామ్" అనెడి తృతీయా సప్తమీవిభక్తుల యర్థంబును "పచతి" యనెడిక్రియాపదముయొక్క యర్థము నెఱింగినవాఁడు, "కాష్ఠ" శబ్దము కఱ్ఱలను తెలియఁజేయుననియును "స్థాలీ" శబ్దము కుండను తెలియఁజేయుననియును అనుకొనునే యనినను, ఇట్టియెడను గూడ పూర్వము తా నెఱింగియున్న మాటలను కార్యమును తెలియఁజేయువానినిగానే యెఱింగియుండునుగాన ఇఁక తా నెఱుఁగఁబోవు మాటలనుగూడ కార్యమును తెలియఁజేయు వానినిగానే తెలిసికొనును.

(2) ఒక్కఁడు త్రాటినిమాది సర్పమనుకొని భయపడును. మఱియొక్కఁడు (నాయంసర్పః, రజ్జురేషా=ఇది పాము కాదు. ఇది త్రాడు) అని చెప్పును. అప్పుడు మొదటివానికి ఇది పాము కాదు, త్రాడే అనితోఁచుటచే గలిగిన భయముపోవునే యంటిరేని, అచ్చటఁగూడ కదలిక లేనిదనియు విషములేనిదనియు ఇది యచేతనవస్తువు అనియుంగూడ చెప్పినను భయముపోవునుగాన ఇది సర్పము కాదు త్రాడు అని తెలిసికొనుటచేతనే బెదరుతీరినదని నిశ్చయించుట కవకాశములేదు.

"ఇది కార్యము (చేయఁదగినది,)" అనిన తోడనే దానినొనర్చుటకై ప్రవర్తించుచున్నందున, శబ్దము ప్రవర్తింపజేసెడి యర్థమును తెలియఁజేయునది యని యేర్పడుచున్నది. అట్లు ప్రవర్తింపఁజేయునది కార్యమేగాన, అన్ని పదంబులు ఒకవిధమైన కార్యమునే తెలియఁజేయును. కాఁబట్టి శబ్దము [1]రెండవపదార్థముతోఁగూడిన తన యర్థమును మాత్రము తెలుపునట్టి శక్తిగలదని నిశ్చయింపఁదగదు.

ఇష్టసాధనతాబుద్ధి—ఇది నేను కోరినదానిని సాధించును అనెడి తెలివి,—స్వయముగా ప్రవర్తింపఁజేయునది కాదు. అట్లు తెలిసినతరువాత ఇది కార్యము (తనచే చేయఁదగినది) అని తెలిసిన పైనే ప్రవృత్తి గలుగును. కావుననే కడచినది తనకు ఇష్టసాధనమని తెలిసినను, కాలాంతరమున కాఁదగినది తనకు ఇష్టసాధనమని తెలిసినను, ఇప్పుడు జరుగుచున్నది తనకుఇష్టసాధనమని తెలిసినను, అది తనచే చేయఁదగినది అని తెలిసిననేతప్ప, మనుష్యుఁడు ప్రవర్తించుటలేదు. ఇష్టసాధనమైనట్టి యీకార్యము నేను ప్రయత్నముచేసినఁగాని సిద్ధింపదు, కాఁబట్టి నా ప్రయత్నమువలన సిద్ధింపఁదగినది అని తోఁచువఱకును ప్రవర్తింపఁడు. కావున ఇది కార్యము, (ప్రయత్నమున సాధింపఁదగినది) అనెడి జ్ఞానమే ప్రవృత్తికి హేతువు. కావున ఇట్టి ప్రవృత్తిని గలుగఁజేయునది యెద్దియో యదియే శబ్దముచే తెలుపఁబడఁదగినది. కాఁబట్టి వేదమునుండి తెలియవచ్చునదియు కార్యమే. కావున పరినిష్పన్నవస్తువగు బ్రహ్మమును చేరుటయనెడి యనంతస్థిరఫలము వేదమునుండి తెలియరాదు.

ఇంతియెకాక "అక్షయ్యం హవై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి (ఆప. సూ. శ్రౌ. ౮ ప్ర. ౧ ఖ. ౧ సూ.) (చాతుర్మాస్యయాగమును చేయువానికి నాశములేని పుణ్యము కలుగును) అను శాస్త్రవాక్యమున కర్మములకే స్థిరఫలమున్నట్లు చెప్పఁబడియున్నది. కాఁబట్టి కర్మఫలములు అల్పాస్థిరములనియును బ్రహ్మజ్ఞానఫలము అనన్తస్థిరమనియును తెలియుటచే నొనర్పఁబడు బ్రహ్మవిచా

(1) అభిహితాన్వయవాదంబును అన్వితాభిధాన వాదంబునని రెండు వాదములు కలవు. అందు అభిహితాన్వయవాదమనఁగా నొక్క-వాక్యములో నున్నపదములు ప్రత్యేక ప్రత్యేకముగా వానివానియర్థములం దెలియఁజేసి అన్నియుంజేరి వానివానికిఁగల పరస్పరసంబంధమును చెప్పుననుట - ఎట్లన్నను, "గామానయ" అనునప్పుడు "గామ్" అనునది గోవును, "ఆనయ" అనునది తెచ్చుటనును చెప్పును. రెండును చేరిన పైని గోవునకును ఈ తెచ్చుటకును సంబంధము తెలియును. అని యిట్లు చెప్పుట అభిహితాన్వయవాదము. అట్లుకాక "గామ్" అనెడిపదము కేవలసిన యావునె చెప్పుననియు, "ఆనయ" అనునది ఆవును తెచ్చుటనే చెప్పుననియు, నిట్లు చెప్పుట అన్వితాభిధానవాదము. ఈ యన్వితాభిధానవాదమే ఈ యధికరణములోని పూర్వపక్షి మతము.

రము నారంభించుటయుక్తముకాదు. ఈపైని గానఁబఱచిన ప్రకారము పూర్వ పక్షమురాఁగా,

## ⟵ జిజ్ఞాసాధికరణసిద్ధాంతము. ⟶

ఈ శబ్దమునకు ఇదియర్థమని శబ్దార్థముల సంబంధమును తెలిసికొనుటకు లోకమునందంతటను సుప్రసిద్ధమైన విధమును విడిచి, లోకములో నెవ్వఁడు నెఱుంగని యొక్క యర్థమునే శబ్దములన్నియును తెలియఁజేయుననుటను ప్రామాణికులు అంగీకరింపరు.

పిల్లవాండ్రు శబ్దార్థ సంబంధములను ఇట్లు నిశ్చయింతురు—తల్లి తండ్రి మొదలగువారు, తండ్రి తల్లి మేనమామ మొదలగు వారినిగాని, చంద్రుఁడు, పశువు, మనుష్యులు, మృగములు, పక్షులు, సర్పములు, మొదలగు వానినిగాని, చేతితోఁజూపి ఆయా శబ్దములను జెప్పి పిల్లలకు నేర్పుదురు. పిల్లవాండ్రును మెల్లమెల్లగా ఆయాశబ్దమును చెప్పినతోడనే ఆయాయర్థము తమకు తోఁచుటనుబట్టియు, మఱియే సంబంధమును కనఁబడకపోవుటనుబట్టియు, సంకేతము (ఈశబ్దము ఈయర్థమును చెప్పవలయునని యొక్కనిచే సంకల్పింపఁబడి యుండుట), అట్టి సంకేతమును చేసినవాఁడితఁడని తెలిసినఁగాని యదియొక సంబంధమని తోఁచకపోవుటను బట్టియును, బోధకత్వము (అర్థమును తెలియఁజేయునదియగుట) యనెడి సంబంధము శబ్దార్థములకు గలదని తెలిసికొందురు. అటుపైని తమకుఁ దెలియని శబ్దములలో ఈశబ్దమున కిదియర్థమని పెద్దలచే బోధింపఁబడినవారై యన్నిశబ్దముల యర్థములను తెలిసికొందురు. అటుపైని తాముద్దేశించిన యర్థమును ఇతరులకుఁ దెలియఁజేయుటకై వాక్యములను బ్రయోగింతురు.

మఱియొకవిధమున సయితము శబ్దార్థ ములకుఁగల సంబంధమును తెలిసికొనుట సులభము—ఒకఁడు మఱియొకనితో "నీ తండ్రి సుఖముగా నున్నాఁడు అని దేవదత్తునకు తెలుపుము" అని చేతిసంజ్ఞ మొదలగుదానిచేతఁ దెలియఁజేయగా, వాఁడు నోటిమాటచేతనే "నీతండ్రి సుఖముగా నున్నాఁడు" అని దేవదత్తునితోఁజెప్పును. ప్రక్కనసుండువాఁ డొకఁడు దానిఁదెలియగోరి మూగవానివలె చేతిసంజ్ఞలను ఎఱిఁగినవాఁ డగుటచే వాఁడు దానిని దేవదత్తునికి తెలుపుటకై పోవుచున్నాఁడని యెఱింగి వానితోఁగూడ పోయి వాఁడు దేవదత్తునకుఁ దెలియఁజేయుటకై చెప్పినవాక్యమునువిని, ఈశబ్దము ఈయర్థమును తెలియఁజేయునని నిశ్చయించుకొనును.

కాఁబట్టి శబ్దములన్నియును కార్యమునే తెలుపునవియనెడి నియమము లేదు. కావున ఉపనిషత్తులు పరినిష్పన్నమైన (కార్యముకాని) పర

బ్రహ్మమును, అపరిమితఫలము నిచ్చు బ్రహ్మోపాసనమునున్ను దెలియఁజేయునవి. కాఁబట్టి బ్రహ్మస్వరూపమును నిర్ణయించునదియగు బ్రహ్మవిచారము చేయఁదగినదియే.

ఒకవేళ వేదము కార్యమునే తెలుపునని యంగీకరించినను, బ్రహ్మవిచారము చేయవలసినదియె - ఎట్లన్నను,

"ఆత్మావా అరే ద్రష్టవ్య శ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" (బృ. ౪ అ. ౪ బ్రా. ౫ వా.) (పరమాత్మ, చూడఁదగినవాఁడు, వినఁదగినవాఁడు, తలంపఁదగినవాఁడు.) అనియు, "సోన్వేష్టవ్యస్స విజిజ్ఞాసితవ్యః" (ఛా. ౮ ప్ర. ౭ ఖ ౧ వా.) (అతఁడే వెదకఁదగినవాఁడు, అతఁడే విచారింపఁ దగినవాఁడు.) అనియు, "విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత" (బృ. ౬ అ. ౪ బ్రా. ౨౧ వా.) (తెలిసికొని యుపాసించునది.) అనియు, "దహరోఽస్మి న్నన్తర ఆకాశ స్తస్మి న్యద న్తస్త దన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యమ్" (ఛా. ౮ ప్ర. ౧ ఖ. ౧ వా.) (ఈలోపలను దహరాకాశము అనఁగా బ్రహ్మము కలదు. దానిలో నుండునది యెద్దియో అదియే అనఁగా నాతని కల్యాణగుణసముదాయమే వెదకఁదగినది. అదియే విచారింపఁదగినది) అనియు, "తత్రాపి దహ్రం గగనం విశోక స్తస్మి న్యద న్త స్తదుపాసితవ్యమ్" (తై॥ నా॥ ౧౦ అను॥) (దానిలోగూడ దుఃఖసంపర్కములేని దహరాకాశము కలదు. దానిలో నేదికలదో అది యుపాసింపవలసినది) అనియు నీ మొదలగుశ్రుతులచేత బ్రహ్మోపాసనరూపమగు కార్యము విధింపఁబడుచున్నది. మఱియు అట్టి యుపాసమును అనుష్ఠించిన వానికిఁ గలుగు ఫలముగా, "బ్రహ్మవిదాప్నోతిపరమ్," (తై॥ ఆన॥ ౧॥ అను) (బ్రహ్మమునుపాసించువాఁడు పరమాత్మను పొందుచున్నాఁడు) అని బ్రహ్మప్రాప్తి వినఁబడుచున్నది. అందువలననే బ్రహ్మస్వరూపంబును దాని విశేషణములును (కల్యాణగుణములు మొదలగునవిగూడ) ఆకార్యమునకే (ఉపాసనమునకే) ఉపయోగించునవియని యేర్పడుచున్నది. [1]దృష్టాంతము:—పూర్వమీమాంసమున స్వర్గాదులు, రాత్రిసత్రప్రతిష్ఠాదులు, అపగోరణమునకైన శతయాతనలు మొదలగునవి యెట్లు కార్యమునకై యుపయోగించుచున్నవో అట్లే. ప్రకృతముననుఎఱుంగునది.

---

(1) ఇట్లు, విధివాక్యమునఁ జెప్పఁబడినదాని ఫలస్వరూపము అర్థవాదమునఁ జెప్పఁబడుట కలదు. ఎట్లన్నను, "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" (స్వర్గముఁ గోరువాఁడు జ్యోతిష్టోమయాగమును చేయునది) అను విధిలోఁ జెప్పఁబడిన స్వర్గముయొక్క విశేషములు "యస్మి న్నోష్ణం న శీతం నారతిః (దేనియందు వేడి లేదో చలి లేదో, అరతి యనఁగా ఉల్లాసము లేకపోవుట లేదో) అను నర్థవాదముచే నిరూపింపఁబడినది. ఇట్లే "రాత్రీరుపే యాత్"

"గామానయ=గోవును తోలుకొనిరా" ఇత్యాది విధ్యర్థక వాక్యములు గూడ కార్యమునే తెలుపుచుండలేదు కావున శబ్దములు కార్యమునే తెలుపు నవియని చెప్పఁదగదు. ఏలననిన, వారంగీకరించిన కార్యమనునది యిట్టిదని నిరూపింప శక్యముకాదు. ఎట్లనిన,

[1]కృతిభావభావి కృత్యుద్దేశ్యము కార్యము అనికదా వారు చెప్పుదురు. కృత్యుద్దేశ్యమనఁగా కృతికి కర్మమగునది. కృతికి కర్మమగుట యనఁగా కృతిచేత (ప్రయత్నము చేసి) పొందుటకు మిక్కిలి యిష్టమైయుండుట. మిక్కిలి యిష్టమగు నది సుఖంబును, దుఃఖముకలవానికి ఆ దుఃఖము పోవుటయును. సుఖాదికమును గోరెడి పురుషుఁడు తన ప్రయత్నమునఁగాని యది సిద్ధింపదనితోఁచిన తోడనే ప్రయత్నముచేయఁగోరి ప్రవర్తింపుచున్నాఁడు. కాఁబట్టి తానుకోరినది తన ప్రయత్నమున సిద్ధింపఁ దగియుండుటకంటె కృత్యుద్దేశ్యత్వమనునది మఱియేది యును కానఁబడదు. ఇచ్ఛావిషయమగు దానికిఁగల (కోరఁబడుదానికిఁగల) ప్రేరకత్వంబనునదియును (ప్రవర్తింపఁజేయునది యగుట) ప్రయత్నముచేసినచో, సిద్ధింపఁదగియుండుటయే. ఆ మాత్రముననే ప్రవృత్తి కలుగుచున్నదిగదా.

కృత్యుద్దేశ్యత్వ మనఁగా పురుషున కనుకూలమై యుండుటయనియును చెప్పఁదగదు. పురుషున కనుకూలమగునది సుఖమేకాని మఱియొక్కటి కాదు. దుఃఖనివృత్తి (దుఃఖము కలుగకుండుట) పురుషున కనుకూలము కాదు. పురు షున కనుకూలమైనది సుఖము, వానికి ప్రతికూలమైనది దుఃఖము, అనియే కదా సుఖదుఃఖముల స్వరూపములు తెలుపఁబడుచున్నవి. దుఃఖము ప్రతికూలము గాన అది నివర్తించుట (లేకపోవుట) యిష్టమగుచున్నదేకాని, దుఃఖనివృత్తి యనుకూలమగుటవలనఁగాదు అనుకూల ప్రతికూలములు లేకుండఁగా, తన స్వ రూపమున తానుండుటయేకదా దుఃఖనివృత్తియనఁబడును. కాఁబట్టి సుఖముతప్ప క్రియ (పని) మొదలగునది మఱియేదియును అనుకూలమగుట సందర్భింపదు. క్రియ మొదలగునది దుఃఖ (కష్టము) రూపముగానెయున్నది గాన, సుఖముకొఱ

(రాత్రి సత్రమును చేయునది) అను విధివాక్యమునఁ జెప్పఁబడిన రాత్రిసత్రముయొక్క ఫలము "ప్రతితిష్ఠన్తిహవా ఏతే యఏతా రాత్రీరుపయన్తి" (ఈ రాత్రి సత్రమును జేయువారు ప్రతిష్ఠను బొందుచున్నారు) అను నర్థవాదమునఁ జెప్పఁబడినది. ఇట్లే "తస్మాద్బ్రాహ్మణాయనాపగురేత" (కాఁబట్టి బ్రాహ్మణునిపైకి చేయి మొదలగువానిని ఎత్తఁగూడదు. అనఁగా కొట్టఁగూడదు) అను దానిచే నిషేధింపఁబడిన అపగోరణమునకు "యోపగురాతే శతేనయాతయాత్" (ఎవ్వఁడు పైకి చేయి ఎత్తునో వానికి నూరుయాతనలు గలుగును), అని యర్థవాదమున ఫలము చెప్పఁబడినది.

(1) "కృతి" యనఁగా మనకు లోపలఁగలిగెడి ప్రయత్నము అనఁగా పూనిక. దానిభావ మనఁగా అది కలుగుట. అదికలిగిన వెంటనె కలుగునది కృతిభావభావి. ఇట్టిదై కృతికి ఉద్దేశ్య మగునది అనఁగా ప్రయత్నముచే నుద్దేశింపఁబడునది కృతిభావభావికృత్యుద్దేశ్య మనఁబడుచున్నది.

కై నందునను అది అనుకూలమని చెప్పుటకుఁగూడ నవకాశములేదు. సుఖము కొఱకగుటచే దానిని జరిగించుటకు కోరికమాత్రము కలఁగును.

కృత్యుద్దేశ్యత్వమనఁగా కృతికి శేషియై యుండుట యనియును చెప్పఁదగదు. మీమతమున శేషిత్వ మనఁగా నిట్టిదని నిరూపింప శక్యముకాదు. ఏలననిన, మఱియొకదాని నుద్దేశించి చేసిన ప్రయత్నముతోఁ జేరియుండునది శేషము, ఆ యుద్దేశింపఁబడినది శేషి అని యంటివేని, ఇట్లు శేషమగుట కృతికి సంధర్భింపదుగాన, అట్టికృతిచే సాధింపఁబడవలసినది ఆకృతికి శేషియగుటయును సందర్భింపదు. మఱియొకదాని యుద్దేశంబున (కొఱకు) ప్రవర్తింపఁదగినది శేషము, ఆ మఱియొక్కటి శేషి, అనుటయును సరిగాదు. ఉద్దేశ్యమనఁగా నిట్టిదియని గదా నిరూపింపవలసియున్నది. భృత్యునికొఱకు ప్రవర్తింపఁదగియుండుట ప్రధానుఁడగు ప్రభువునకుఁగూడ కలదు. ప్రధానుఁడగు ప్రభువు భృత్యుని పోషించుటయందు తనకొఱకే ప్రవర్తించు నంటివేని, భృత్యుఁడుగూడ ప్రభువునకు ఉపచారము చేయుటయందు తనకొఱకే ప్రవర్తించును. కార్యమిట్టిదని నిరూపింపక, కార్యముతో సంబంధించి యుండునది శేషము, దానికి సంబంధించియుండునది శేషియని చెప్పుటకూడ సంభవింపదు.

కృత్యుద్దేశ్యత్వ మనఁగా కృతికి ప్రయోజన మగుటయును కాదు. పురుషుఁడు కృతిని ఆరంభించుటకు ప్రయోజన మగునదియే కృతికి ప్రయోజనము. అది ఇచ్ఛావిషయమే అనఁగా కోరఁబడునదియే.

కాఁబట్టి ఇష్టమగుటకంటె కృతికి ఉద్దేశ్యమగుటయనునది వేఱొక్కటి యని నిరూపింప శక్యముకాదు గాన, కృతిచే (ప్రయత్నముచే) సాధింపఁదగినదగుటయు కృతికి ప్రధానమగుటయును కార్యత్వమని నిరూపింప శక్యముకాదు.

నియోగము [1](అపూర్వము=అదృష్టము) కూడ, సాక్షాత్తుగా నిచ్ఛావిషయమగు సుఖముకంటెను దుఃఖనివృత్తికంటెనున్ను వేఱైనదియే కాన, అది సుఖమునకును దుఃఖనివృత్తికిని సాధన మగుటవలననే ఇష్టమైనదియును కృతిస్వార్థమై (ప్రయత్నముచేసి సంపాదింపవలసినదియై) నదియు నని యెఱుంగునది.

---

(1) స్వర్గాదిప్రాప్తికై యనుష్ఠింపఁబడు జ్యోతిష్టోమాదులు క్రియారూపములు. అవి యెంతవఱకనుష్ఠింపఁబడునో, అంతవఱకే అవియుండును. తరువాత అవి నశించును, ఇట్లుండ, కాలాంతరమున స్వర్గభోగాదుల నిచ్చునది యేది యనఁగా నట్టికర్మము లాచరింపఁబడునప్పుడు వానినినుండి యపూర్వమనఁబడునట్టి యొక శక్తి యుత్పన్న మగుననియు, అది నశింపదనియు, దానివలన నట్టి కర్మానుష్ఠాన మొనర్చినవానికి స్వర్గభోగాదులు కలఁగుననియును పూర్వమీమాంసకులు చెప్పుదురు. దీనినే నైయాయికులు అదృష్టమందురు. దీనిని కర్మఫలము నిచ్చునట్టి దానినిగా విశిష్టాద్వైతు లంగీకరింపరు. "ఫలమతఉపపత్తేః" అను సూత్రమున సర్వేశ్వరుఁడే కర్మానుష్ఠానమువలన సంతోషించి ఫలము నిచ్చునని ఆచార్యులవారు ప్రతిపాదింపఁబోవుచున్నారు.

అందువలననేగదా ఆ నియోగము క్రియకంటెను వేఱయినది. అట్లు కాకున్న, క్రియయే కార్యము (అపూర్వము) కావలయును. ఎట్లన్నను, "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను విధివాక్యములో "యజేత" అనెడి లిఙ్ (విధ్యర్థక క్రియాప్రత్యయము) కార్యమును తెలుపును "స్వర్గకామః" అనెడిపదము లేకపోయినచో, యాగమే కార్యము కావలసివచ్చును. "స్వర్గకామః" అనెడి పదముండుటచేత ఆ కార్యము స్వర్గసాధనమని యేర్పడును. అయితే జ్యోతిష్టోమమనెడి కర్మము (హోమముచేయుట మొదలగునది) స్వల్పకాలముననె ముగించును. స్వర్గమో, పురుషునికి మరణానంతరము కలుగవలసినది. కాబట్టి యీ కార్యమనునది అపూర్వము (అదృష్టము) అని స్వర్గసాధనముగానే అపూర్వము తెలియఁబడుచున్నది.

ఈ యపూర్వము మొదటను ప్రధానముగానే తోచును గాన తరువాతనుగూడ ప్రధానముగానే యుండుటకై తన్ను సంపాదించికొనువానికి తానే స్వర్గమును సమకూర్చి యిచ్చుననిగూడ చెప్పుదురు. ఇది నవ్వఁదగిన మాట. స్వర్గకామపదముతోఁ జేరినకార్యమును చెప్పెడి పదము (యజేత అనునది) మొదటనుగూడ అనన్యార్థము (ప్రధానము) అని తెలియఁజేయుట లేదు. సుఖమైనను దుఃఖనివృత్తియైనను ఈరెంటికిని సాధనమైనను కాక అన్యార్థముకానిది అనఁగా మఱియొక్క దానికొఱకై కానిది కృతిసాధ్యముగాఁ దోఁచుట సంభవింపదు.

ఇంతియెకాక, నియోగము ప్రయోజనముగుట యనఁగానేమి? సుఖమువలె నియోగముగూడ ననుకూలముగానుండుటయే యంటివేని, నియోగమే సుఖమా యేమి? సుఖమే కదా అనుకూలమైనది? అట్లుకాక, సుఖవిశేషమువలెనే నియోగ మను పేరుగలదిగూడ నొక్కవిధమైన సుఖమంటివేని, అందులకేమి ప్రమాణమో చెప్పవలసియున్నది. నాయనుభవమే యంటివేని, విషయవిశేషముల ననుభవించుటచేఁ గలిగెడి సుఖమునువలె నియోగమునునుభవించుటచేఁ గలిగిన సుఖ మిదియని నీవుగూడ ననుభవించుట లేదు. శాస్త్రము నియోగమును పురుషార్థమునుగాఁ (పురుషుఁడు కోరదగిన దానినిగా) జెప్పుచున్నదిగాన, ఈ దేహావసానమున నదియనుభవింపఁబడఁగల దంటివేని, నియోగము పురుషార్థమని చెప్పెడి శాస్త్రమేది? లౌకిక వాక్యముకాదు. అది దుఃఖస్వరూపమగు క్రియను గుఱించినది. సుఖాది సాధనము గాన, ప్రయత్నము చేయవలసినదని మాత్రమే తెలియఁజేయును. వైదిక వాక్యముగూడ దానిని గుఱించిన ప్రమాణముకాదు. అదిగూడ స్వర్గాదిసాధనముగానే ప్రయత్నముచే సాధింపందగినది యనియే తెలియఁజేయును. నిత్యనైమిత్తిక కర్మముల విధించు

స్మృతి శాస్త్రముగూడ ప్రమాణముకాదు. అది యపూర్వమును తెలుపుట “స్వర్గ కామోయజేత” అను వాక్యము అపూర్వమును తెలుపుటను బట్టియే కాన, అది యాతావునవలె నిచటను సుఖాదిసాధనముగానే తెలుపఁబడును. అదియే సుఖముగా తెలుపఁబడదు. ఐహిక ఫలమును తప్పక యిచ్చునట్టి కర్మము నాచరించుటచే దానికి ఫలముగా నన్నాదికమైనను రోగశాంతి మొదలగునదైనను కానఁబడుచున్న దేగాని, అపూర్వమనెడి సుఖ మనుభవింపఁబడుచున్నట్లు కానఁబడుచుండలేదు కావున నియోగము సుఖమనుటకు ప్రమాణము నొక్కదానినైనను కాన్పింపనేరము. అర్థవాదాదులలోఁగూడ స్వర్గాది సుఖమునుగుఱించి చెప్పియున్నట్లు నియోగమనెడి సుఖమునుగుఱించి చెప్పియుండుటను మీరున్నూ చూచియుండలేదు.

కాఁబట్టి విధివాక్యములలోనుండు విధ్యర్థక క్రియాపదముచేఁ దెలుపఁబడునది యేమనఁగా, దాని ధాతువుచేఁ దెలుపఁబడు కార్యము కర్తయొక్క యుద్యమముచే సాధింపఁబడునది యగుటయే. ఇట్లు వ్యాకరణ శాస్త్రమువలనను సిద్ధమగుచున్నది. (కాని యది మీమాంసకులు చెప్పునట్లు అపూర్వము కాదు.) ధాతువుచేఁ దెలుపఁబడెడి యాగాదిరూపమగు కార్యము అగ్న్యాది దేవతల కంతర్యామియగు పరమపురుషునికి సంతోషకరమైనది యనియును, దాని ననుష్ఠించుటచే సంతోషించిన పరమపురుషుని వలననే ఫలము సిద్ధించు ననియును “ఫలమతఉపపత్తేః” అను సూత్రమునఁ బ్రతిపాదింపఁబడును. కావున కర్మఫలము నిచ్చుటకై యపూర్వమును కల్పించుకొన నక్కఱలేదు.

కాఁబట్టి వేదాంతములు సిద్ధవస్తువగు పరబ్రహ్మమును తెలియఁజేయునుగాన, బ్రహ్మోపాసనపు ఫలము అనంతమనియు, స్థిరమనియును సిద్ధమైనది.

కేవల (పరమపురుషారాధనముగా నాచరింపఁబడని) కర్మముల యొక్క ఫలము అనిత్యమని శ్రుతులే చెప్పుచున్నవిగాన, చాతుర్మాస్య యాగపు ఫలము అక్షయమైనదని చెప్పుటకు తాత్పర్యము మిగిలిన కర్మముల ఫలముల కంటె దానిఫలము కొంచమెక్కువకాలముండునదని తెలియఁజేయుటయే. దృష్టాంతము;— “వాయుశ్చాన్తరిక్షం చైత దమృతమ్ (వాయువును ఆకాశమును నాశము లేనివి” అను తావునవలెఁబ్రకృతమునను మెఱుంగునది.

ఇట్లు కర్మములు అల్పాస్థిరఫలంబు లగుటవలనను, బ్రహ్మజ్ఞాన మనంత స్థిరఫల మగుటవలనను, బ్రహ్మమును బాగుగాఁ దెలిసికొనుటయే ఫలముగాఁగల బ్రహ్మవిచారము ఆరంభింపవలసినదియే యని యేర్పడినది.

జిజ్ఞాసాధికరణము ముగిసెను.

## జన్మాద్యధికరణము

అవతారిక:—ఇట్లు విచారింప వలసినదిగా పూర్వసూత్రమునఁ జెప్పఁబడిన బ్రహ్మ మెట్టిదనిన,

### ౨॥ సూ॥ జన్మాద్యస్య యతః.

టీ॥ అస్య = ఈ ప్రపంచమునకు, జన్మాది = సృష్ట్యాదులు, యతః = దేనినుండియో (అదియే బ్రహ్మము.)

తా॥ ఈ పరిదృశ్యమానమైన జగత్తునకు సృష్టిస్థితిలయంబులు దేనినుండి కలిగెనో, అదియే బ్రహ్మము.

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "జన్మాది" అనుపదముచే సృష్టి స్థితి లయంబులు చెప్పఁబడుచున్నవి. ఈ పదము [1]తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహిసమాసము గలది. "అస్య" అనఁగా అచింత్య వివిధ విచిత్రరచనతోఁ గూడుకొనియున్నట్టియు, నియతములగు దేశ కాల ఫల భోగములతోఁ గూడుకొనియున్నట్టియు, బ్రహ్మాది స్తంభ పర్యంతముండు జీవులతోఁ గూడియున్నట్టి యీ జగత్తుయొక్క జన్మస్థితిలయములు, "యతః" అనఁగా హేయగుణ రహితుఁడును, సత్య సంకల్పుఁడును, జ్ఞానానందాద్యనంత కల్యాణ గుణాకరుఁడును, సర్వజ్ఞుఁడును, పరమ కారుణికుఁడును, పరుఁడు నగు నే పురుషునివలనఁ గలుగు చున్నవో, అట్టివాఁడు బ్రహ్మమని యీ సూత్రము చెప్పుచున్నది.

తైత్తిరీయులు ఈ విషయమునుగుఱించి "భృగుర్వై వారుణిః వరుణం పితర ముపససార అధీహి భగవో బ్రహ్మేతి" అని యారంభించి "యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవన్తి యత్ప్రయ న్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి" (తై. భృగు ౧ అను) అనఁగా వరుణుని

---

(1) బహువ్రీహిసమాసము రెండువిధములు. ౧ తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి. ౨ అతద్గుణ సంవిజ్ఞాన బహువ్రీహి. తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి యెట్టిదనినను, "లమ్బకర్ణః" ఇత్యాదికము. (లమ్బకర్ణమ్ ఆనయ = వ్రేలాడుచున్న చెవులుగలవానిని తెమ్ము) అనినచో వాఁడు వచ్చునప్పుడు వ్రేలాడుచున్న చెవులుగూడ వానితోడనే వచ్చును గాన, నిది "తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి" యని చెప్పఁబడును. "చిత్రగుః" ఇత్యాదికము అతద్గుణసం విజ్ఞానబహువ్రీహి. (చిత్రగుమ్ ఆనయ = చిత్రములైన యావులుంగలవాని తెమ్ము) అనునప్పుడు ఆవులు వానితోఁగూడ రానక్కఱలేదు. వాఁడు మాత్రము వచ్చినఁజాలును. కాఁబట్టి ఇది "అతద్గుణసంవిజ్ఞాన బహువ్రీహి" యనఁబడును. ప్రకృతమున జన్మము మొదలగుగాఁగల స్థితి ప్రళయములే కాక జన్మముకూడ బ్రహ్మముతో నన్వయించును గాన ఇదియును తద్గుణసంవిజ్ఞాన బహువ్రీహియె.

కుమారుఁడగు భృగునను వాఁడు తండ్రి యగు వరుణుని యొద్దకుఁబోయి బ్రహ్మమును గుఱించి యుపదేశింపుమని ప్రార్థింపఁగా, బ్రహ్మాదిస్తంభ పర్యంతముండెడి సమస్తభూతములు ఎవ్వనినుండి పుట్టి, ఎవ్వనిచేత జీవించుచు, అంతమునం దెవ్వనిలోఁ బ్రవేశించుచున్నవో, వానిని బ్రహ్మమునుగా నెఱుంగుమని వరుణుఁడు ఉపదేశించెను" అని పఠించుచున్నారు. ఈ వాక్యమును గుఱించి యొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

"యతోవా ఇమాని భూతాని" అను వాక్యమువలన బ్రహ్మమును లక్షణపూర్వకముగాఁ దెలిసికొనుట అనఁగా బ్రహ్మమిట్టిదియని బ్రహ్మమును లక్షణముతో నెఱుంగుట శక్యమగునా? కాదా?

## పూర్వపక్షము.

ఈ వాక్యమువలన బ్రహ్మమును లక్షణపూర్వకముగా నెఱుంగుట యశక్యము. ఏలననిన, ఈ వాక్యమునఁ బేర్కొనఁబడిన జన్మాదులు బ్రహ్మమునకు విశేషణములు గాన, నవి బ్రహ్మమును లక్షణపూర్వకముగాఁ దెలుపనేరవు. జన్మస్థితినాశము లనఁబడు విశేషణము లనేకములు గాన, వానిలో నొక్కొక్క విశేషణము ఒక్కొక్క బ్రహ్మము చొప్పున అనేక బ్రహ్మముల నేర్పఱచును. విశేషణములు వ్యావర్తకములు గదా! అనఁగా విశేషములకు విశేష్యమును తజ్జాతీయములగు నితరవస్తువులనుండి వేఱుపఱచుట గదా స్వభావము.

అయితే "నల్లని వాఁడును, యౌవ్వనముగలవాఁడును, ఎఱ్ఱని కండ్లుగల వాఁడును, సమపరిమాణుఁడును, దేవదత్తుఁడు" అను నపుడు, "నల్లనివాఁడు యౌవ్వనముగలవాఁడు" ఈ మొదలగు విశేషణము లనేకము లయినను, అవి ఒక్క దేవదత్తునే తెలియఁజేయుచున్నవి గదా! అట్లే ప్రకృతమునను "జగజ్జన్మ కారణుఁడు, జగత్ స్థితి కారణుఁడు" ఈ మొదలగు ననేక విశేషణములు గూడ ఒక్క బ్రహ్మమునే తెలియఁజేయు ననిశంకింపఁదగదు, ఏలననఁగా, దేవదత్తుఁడొక్కఁడే యని ప్రమాణాంతరముల వలన అనఁగాఁ బ్రత్యక్షాది ప్రమాణముల వలనఁ దెలియునుగాన, ఆ యొక్కనియందే ఈ విశేషణము లన్నియును ప్రవర్తించుచున్నవని నిశ్చయింప వచ్చును. అట్లు గానిచో, ఆ తావున గూడ, విశేషణములు వ్యావర్తకము లగుటచే, అనేక దేవదత్తులనే తెలియఁజేయవలసి వచ్చును. ప్రకృతముననో, ఈ విశేషణములచే లక్షణపూర్వకముగాఁ దెలుపవలసిన బ్రహ్మము ప్రమాణాంతరముచేత, అనఁగాఁ బ్రత్యక్షప్రమాణముచేత నొక్కటియే యని తెలియఁబడుచుండలేదు. కావున విశేషణము లనేకము లగుటచే అనేక బ్రహ్మములు కావలసి యుండుట తప్పదు.

ఈ తావున "బ్రహ్మ" శబ్దము ఏకవచనముగఁ బ్రయోగింపఁబడుటచే నిది బ్రహ్మ మొక్కటియనియే తెలియఁజేయు ననియును శంకింపఁదగదు. దృష్టాంతము—గోవు నెన్నఁడును చూచియుండని వానితో "ఖణ్డో ముణ్డః పూర్ణశృంగో గౌః=మొండియావు, బోడియావు, నిండుకొమ్ములయావు" అని యిట్లు చెప్పినతోఁడనే, "గౌః" అనుశబ్దము ఏకవచనమునందున్నను, అనఁగా నొక్క గోవ్యక్తినే తెలియఁజేయునది యైనను, ఖండత్వము మొదలగు విశేషణములకుఁగల భేదమునుబట్టి గోవ్యక్తు లనేకములని అనఁగా మొండియావు వ్యక్తి బోడియావు వ్యక్తి యీ మొదలగు వ్యక్తు లనేకములని వానికిఁ దోచును గదా! అట్లే ప్రకృతమునను బ్రహ్మశబ్దము ఏకవచనమునం దున్నను, విశేషణములకుఁగల భేదమును బట్టి బ్రహ్మము లనేకంబులని తెలియవచ్చును.

మఱియు లక్షణపూర్వకముగాఁ దెలియ నుద్దేశింపఁబడిన బ్రహ్మమున కీ జన్మాదులన్నియుఁజేరి యొక [1]యుపలక్షణ మగుటయును అసంభవము. ఏలననిన, బ్రహ్మమునకు, జగజ్జన్మాదులకుఁ గారణమగుట యనెడి యాకారము తప్ప, మఱియొక్క యాకారమున్నట్లు వీనిచేఁ గాన్పింపఁబడదు. ఒక యాకారమునఁ దెలియఁబడిన దానిని, వేఱొక్క యాకారమునఁ దెలిసికొనుటకు గదా యుపలక్షణము పనికివచ్చును. దృష్టాంతము:—"ఈ సారసపక్షి యెచట నున్నదో, అది దేవదత్తుని పొలము" అను తావున పొలము యొక్క యాకారము (పొలమనఁగా నెట్టిదియో) తెలిసిన తరువాతను గదా, "సారసపక్షితో సంబంధమును గలిగియుండుట" యనెడి యుపలక్షణము "దేవదత్తుని దగుట" యనెడి మఱియొక యాకారమును దెలియఁజేయుచున్నది.

అయితే "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను శ్రుతివాక్యముచే "సత్యస్వరూపమైనదియును, జ్ఞాన స్వరూపమైనదియును, అంతము లేనిదియును బ్రహ్మము" అని యిట్లు తెలియఁజేయఁబడిన యాకారముగల బ్రహ్మమునకు జన్మాదులు అనగా జగజ్జన్మ కారణమగుటయు, స్థితికారణమగుటయు, నీ మొదలగునవి యుపలక్షణములు గావచ్చునే? యని శంకింపఁదగదు. ఏలననిన, "యతో వా ఇమాని భూతాని జాయన్తే" అనునదియెట్లు లక్షణవాక్యమో, అట్లే "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనునదియును లక్షణవాక్యమే గాన, నీ

---

(1) లక్షణములు (Definitions) విశేషణములనియును ఉపలక్షణములనియును రెండు విధములు—"నల్లనివాఁడు దేవదత్తుఁడు" అని చెప్పినచో, నల్లదనము దేవదత్తుని సర్వకాలములయందు నాశ్రయించియే యుండునుగాన, ఇది విశేషణమనఁబడును. "ఈ సారసపక్షి వ్రాలియున్నదియే దేవదత్తుని పొలము" అనునప్పుడు సారసపక్షి సర్వకాలములయందును ఆ పొలమునం దుండక కొంతకాలమే యుండునుగాన ఆ పొలమునకు సారసపక్షి ఉపలక్షణము.

రెంటికిని యన్యోన్యాశ్రయ దోషము సంప్రాప్తమగును. ఎట్లననిన, "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనువాక్యమునఁ దెలుపఁబడిన సత్యత్వాద్యాకారము ఉపలక్షణమగుటకు పైనిచెప్పిన ప్రకారము వేఱొక్క-యాకారము కావలసియుండునుగాన, జన్మాదులనే అట్టి యాకారమునుగా నన్వయింపవలయును. మఱియు నట్టి జన్మాదులు గూడ ఉపలక్షణములేగాన, అవియట్టి వగుటకు గాను వానికి మఱియొక్క యాకారముఁ గావలసియుండును. అట్టియాకారమునుగాను సత్యత్వాదికము నన్వయింపవలయును. ఇదియే యన్యోన్యాశ్రయ దోషము. కనుక, ఈ వాక్యము బ్రహ్మమును లక్షణపూర్వకముగాఁ దెలియఁజేయ నేరదనిన,

## సిద్ధాంతము.

జగత్తుయొక్క సృష్టి స్థితి సంహారముల నుపలక్షణములనుగాఁ గొని బ్రహ్మమును దెలిసికొనవచ్చును. ఉపలక్షణముయొక్క యాకారమునకంటెను ఉపలక్షింపఁబడు వస్తువుయొక్క యాకారము కంటెనున్న వేఱగు మఱియొక్క యాకార మెద్దియును తెలియరానందున, ఈ వాక్యమువలన బ్రహ్మము తెలియవచ్చుచుండలేదని చెప్పఁదగదు. ఏలననిన, ఈ యుపలక్షణములచేఁ గాన్పింపఁబడు బ్రహ్మము మితిలేని యతిశయము గల గొప్పతనము గలదియు, గొప్పశక్తి గలదియును. "బ్రహ్మ" శబ్దము "బృహతి" ధాతువువలన నుత్పన్నమైన దగుటంజేసి యిట్లు తెలియుచున్నది. జగత్తుయొక్క జన్మస్థితిలయంబు లట్టి బ్రహ్మమునకు ఉపలక్షణభూతములు. శ్రుతివాక్యము "ఏదో, దేనినుండియో, దేనిచేతనో" అని యివ్విధమున బ్రహ్మమునొక్క ప్రసిద్ధవస్తువునుగా నిర్దేశించుటచే నట్టి ప్రసిద్ధి కనుగుణముగా జన్మాదికారణ మనువదింపఁబడుచున్నది. అది యెట్లనిన, "సదేవ సోమ్యేద మగ్ర ఆసీదేక మేవాద్వితీయం తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత" (ఛాం. ఆనం. ౧ అను) అను తావున "సత్" అనఁబడునదొక్కటియే నిమిత్తోపాదాన కారణరూపమైనదిగాఁ దెలుపఁబడుటవలన నట్టి ప్రసిద్ధికలదు. ఏలననిన "సదేవేదమగ్ర ఏకమేవాసీత్=సృష్టికిఁ బూర్వమీ పరిదృశ్యమానము జగత్తు సత్తనఁబడుచు నొక్కటిగానుండెను" అనుటచే (బ్రహ్మము) ఉపాదాన కారణమగుటను ప్రతిపాదించి, తరువాత "అద్వితీయం=రెండవది లేనిది" అనుటచే వేఱొక్క నియామకుఁడు లేకుండుటను తెలిపి, తరువాత "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత=అది ప్రజలను సృజించుటకై యనేకముగా నగుదునని సంకల్పించి తేజస్సును సృజించెను" అనుటచే ఒక్కటియే వస్తువును ప్రతిపాదింపుచున్నది.

కావున "జన్మస్థితి లయంబులు దేని మూలకములో అది బ్రహ్మము" అన్నందున, జన్మస్థితిలయంబులు తమకు నిమిత్తోపాదాన కారణభూతమగు వస్తు

వైనట్టి బ్రహ్మమును గాన్పించుచున్నవి. అట్లు జగత్తునకు నిమిత్తోపాదాన కారణములుగా నుండుటనుబట్టి యూహింపఁబడిన సర్వజ్ఞత్వ, సత్యసంకల్పత్వ, విచిత్రశక్తిమత్త్వాద్యాకారములతోఁగొప్పదిగా బ్రహ్మము తెలియవచ్చుచున్నది. కావున నట్లు తెలియఁబడు బ్రహ్మమునకు జన్మాదులు లక్షణమగుటంజేసి యీతావున నాకారాంతరము తెలియరాదనెడి యనుపపత్తి లేనేలేదు.

జన్మాదులు విశేషణములుఁగా బ్రహ్మమునకు లక్షణమగు పక్షమునను, దోషము లేదు. విశేషణములు లక్షణభూతములయినను, అవి తమతో విరోధించునట్టి యాకారమునకంటెను వేఱగు ఆకారముగల వస్తువును తెలుపుచున్నవి. ఎన్నఁడును తెలిసియుండని వస్తువును గాన్పింపవలసి వచ్చినప్పుడు, పరస్పరము విరోధింపని యనేక విశేషణములు లక్షణమగునెడల, నాతావుననవి వస్తుభేదమును గలుగఁజేయవు. విశేషణములు ఒక్కవస్తువు నాశ్రయించి యుండునవిగాను తెలియవచ్చునవి గాన, అవి యన్నియును ఒక్క వస్తువును తెలుపుటయందే ముగించును. అయితే ఖణ్డత్వ ముణ్డత్వాదులన్ననో, పరస్పరము విరుద్ధము లయినవైనందున వానిలో నొక్కొక్కటియు భిన్నమైన గోవును తెలుపుచున్నది. ప్రకృతముననో, జన్మస్థితిలయంబులకు కాలభేదముండుటను బట్టి విరోధమే లేదు.

“సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ” అను శ్రుతివాక్యము “యతో వా ఇమాని భూతాని జాయన్తే” ఇత్యాది కారణవాక్యమువలనఁ దెలియవచ్చునదియు జగజ్జన్మాదికారణభూతమును నగు బ్రహ్మముయొక్క స్వరూపము తదితరములగు సమస్తవస్తువులయొక్క స్వరూపములకంటెను విలక్షణమయినదని తెలుపుచున్నది. ఎట్లనిన, అందు “సత్యం” అనుపదము బ్రహ్మము యెట్టిదైన యుపాధిని (నిమిత్తమును) యపేక్షింపని సత్తగలదని తెలుపుచున్నది. అందువలన బ్రహ్మము వికారాస్పదమగు నచేతన పదార్థముకంటెను, దానితోఁ గూడుకొని యుండు జీవుని కంటెనున్ను వేఱయినదని తెలుపఁబడియె. అవి తమను నామాన్తరమున కర్హములగు వానినిగాఁ జేయునట్టి యవస్థాంతరమును బొందునవిగాన, వేఱొక్క యుపాధ నపేక్షింపని సత్తగలవి కావు “జ్ఞానం” అనుపదము బ్రహ్మము ఎన్నఁడును సంకోచమును పొందనిదియగు జ్ఞానమే స్వరూపముగాఁ గలదని తెలుపుచున్నది. అందువలన ముక్తులు ఒకప్పుడు సంకోచమును పొందిన జ్ఞానము గలవారగుటంజేసి, బ్రహ్మము వారికంటెను వేఱయినదని తెలుపఁబడియె. “అనంతం” అనుపదము “బ్రహ్మము దేశకాలవస్తు పరిచ్ఛేదములు లేని స్వరూపముగలదని తెలుపుచున్నది. స్వరూపము గుణయుక్తమైనందున స్వరూపమునుబట్టియు గుణములనుబట్టియును బ్రహ్మము అనంతమైనది. కావున, “సత్యం” “జ్ఞానం” అనెడి విశేషణములచె వేఱుపఱుపఁబడిన బద్ధాత్మల

కంటెను ముక్తాత్మలకంటెనున్ను విలక్షణులును, సాతిశయస్వరూప గుణములు గలవారును నగు నిత్యసూరులకంటెనున్ను బ్రహ్మము విలక్షణమైనదని యిందు వలనఁ దెలుపఁబడియె. విశేషణములు వ్యావర్తకములుగదా! కావున జగజ్జన్మాదికారణముగాఁ దెలియఁబడిన బ్రహ్మము ఈ వాక్యముచే స్వేతరసమస్త వస్తువిలక్షణమైనదిగాఁ దెలుపఁబడుచున్నది. కావున ఈతావున అన్యోన్యాశ్రయ దోషములేదు. కాఁబట్టి ఈ సమస్త ప్రపంచము యొక్కయును జన్మాదులకుఁ గారణభూతమును, దోషరహితమును, సర్వజ్ఞమును, సత్యసంకల్పమును, సర్వశక్తియును నగు బ్రహ్మము సలక్షణముగాఁ దెలియ శక్యమని సిద్ధమగుచున్నది.

వేదాంతశాస్త్రమునఁ దెలియఁగోరినది నిర్విశేష వస్తువని వాదించునట్టి యద్వైతుల మతమున బ్రహ్మమును దెలియఁగోరుటయు, బ్రహ్మము జగజ్జన్మాదులకుఁ గారణమగుటయు నిది యంతయు నసంగత మగును. ఎట్లనిన, బ్రహ్మమనఁగా అంతకుమించినదేదియును లేనట్టి మహత్త్వము గలదియు, గొప్పశక్తి గలదియు నసిగదా "బ్రహ్మ" శబ్దముయొక్క యవయవార్థమునుబట్టి తెలియుచున్నది. మఱియు బ్రహ్మము జగత్తునకు జన్మస్థితిలయంబులను గలుగఁజేయునట్టిది యని గదా యీ సూత్రము నందుఁ జెప్పఁబడుచున్నది. ఇట్లే ఇఁకమీఁద రాఁబోవు సూత్రములందును, ఆయా సూత్రములక్రింద ఉదహరింపఁబడిన శ్రుతులయందును బ్రహ్మము ఈక్షణాదులు గలదిగాను తెలుపఁబడినందున, సూత్రములుగాని సూత్రములక్రింద నుదహరింపఁబడిన శ్రుతివాక్యములుగాని యద్వైతులు చెప్పునట్టి నిర్విశేషవస్తువును నిరూపించునట్టి ప్రమాణములు కాఁదగవని యెఱుంగునది. సాధింపఁబడు ధర్మములు లేనిదిగానుండక సాధనధర్మములతోఁ గూడియుండునట్టి వస్తువును గుఱించినదైనందున, తర్కమున్ను అట్టి నిర్విశేషవస్తువు విషయమై ప్రమాణము కాఁదగదు. ఒకవేళ వారు "దేనినుండి జగజ్జన్మాదిరూపమగు భ్రమము గలుగుచున్నదో, అది బ్రహ్మము" అని తమకుఁ దోచిన ప్రకారము చెప్పినను, నిర్విశేష వస్తువు సిద్ధింపదు. ఏలననిన, భ్రమమునకు మూలభూతమైనది యజ్ఞానము. అయితే బ్రహ్మము అజ్ఞానమునకు సాక్షియనిగదా వారు అంగీకరించుచున్నారు. ప్రకాశైకస్వరూపముగా నుండునది గదా సాక్షియనఁబడుచున్నది. ప్రకాశమనఁగా జడపదార్థముల కంటెను వేఱయినదై తన్నుగాని ఇతర పదార్థములను గాని వ్యవహారయోగ్యములయిన వానినిగాఁ జేయునది యనుట. అట్టిది యగు పక్షమున, నది సవిశేషవస్తువే. అది యట్టిది కాకున్న, అది తెలియరానిదియే యగును. అందువలన నది కుందేటి కొమ్మువలె తుచ్ఛమే కావలసి వచ్చును.

*అద్వైతమత విమర్శనము.*

జన్మాద్యధికరణము ముగిసెను

## శాస్త్రయోనిత్వాధికరణము

అవతారిక:—జగజ్జన్మాదులకుఁ గారణభూతమగు బ్రహ్మము వేదాంత శాస్త్రమువలనఁ దెలిసికొనఁ దగినదియని యింతకుఁ బూర్వము ప్రతిపాదింపఁ బడియెను గాని, యట్లుచెప్పుట యుక్తము కాదు. ఏలననిన, బ్రహ్మము శాస్త్ర వాక్యముచేతనే ప్రతిపాదింపఁదగినది కాదు. అనుమానమువలనఁగూడ అది సిద్ధమగుచున్నది కదా! ఇట్లు శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై.

### 3॥ సూ॥ శాస్త్రయోనిత్వాత్॥

టీ॥ శాస్త్రయోనిత్వాత్ = బ్రహ్మము శాస్త్రముచేతనే తెలుపఁదగిన దగుటవలన.

తా॥ బ్రహ్మము శాస్త్రప్రమాణము చేతనే తెలుపఁదగినది.

శ్రీ॥ భా॥ సూత్రార్థము:—శాస్త్రయోని యనఁగా "శాస్త్రం యస్య యోనిః" అను విగ్రహమును బట్టి "శాస్త్రం=శాస్త్రము, యస్య=దేనికి, యోని=కారణమో అనఁగా ప్రమాణమో" అది శాస్త్రయోని, యనఁబడు చున్నది. అట్లు అది శాస్త్రయోనిగానే యుండుటను అనఁగా శాస్త్రప్రమాణముచేతనే దెలిసికొనఁబడదగినదిగా నుండుటను శాస్త్రయోనిత్వ మందురు. బ్రహ్మ మిట్టిదగుటవలన దీనిఁ దెలిసికొనుటకుఁ దగిన ప్రమాణము శాస్త్రమే. బ్రహ్మము ఇంద్రియగోచరమగు పదార్థము కాదు గాన, నది శాస్త్రముచేతనే తెలిసికొనఁదగినది. కావున నిట్టి బ్రహ్మమును "యతో వా ఇమాని భూతాని" ఇత్యాది శాస్త్రవాక్యమే తెలియఁజేయునది.

## పూర్వపక్షము

నైయాయికుఁడు:— బ్రహ్మ మిట్టిదియని తెలియఁజేయునది శాస్త్రమే యగుట యసంభవము. ఏలననిన, ప్రమాణాంతరముల వలనఁగూడ బ్రహ్మమును దెలిసికొనవచ్చునే? ఇతర ప్రమాణములలోఁ దేనిచేతనుగూడ బ్రహ్మమును దెలిసికొనుట యసంభవ మయినచోఁగదా, శాస్త్రముచేతనే దానిఁ దెలిసికొన శక్యమని చెప్పవచ్చును.

మీమాంసకుఁడు:—శాస్త్రేతరములగు ప్రమాణములలో బ్రహ్మమును దెలియఁజేయునట్టి ప్రమాణమెద్ది? అది ప్రత్యక్షమా? ప్రత్యక్షము బ్రహ్మమును దెలియఁజేయనేరదు. ఏలననిన, ఇంద్రియసంభవమనియు యోగసంభవమని యును ప్రత్యక్షము రెండువిధములు. ఆరెంటిలో, ఇంద్రియసంభవము బాహ్యేంద్రియసంభవమనియు ఆంతరింద్రియసంభవమనియును రెండువిధములు. చక్షురాది బాహ్యేంద్రియములు సృష్టిలోనుండినవియు, సమీపమునం దుండునట్టివి

యును నగు విషయములను మాత్రము తెలుపునవి గాని, సర్వపదార్థములను సాక్షాత్కరించుటయే కాక, వానిని నిర్మించుటయందుఁ గూడ సమర్థుఁడగు పరమపురుషుని దెలియజేయుట కవి యెట్లు సమర్థములు? అంతరింద్రియమో (అంతఃకరణమో) ఆంతరములగు సుఖదుఃఖాదులకంటె వేఱగు బాహ్యవిషయములను దెలియఁజేయ వలసినప్పు డది చక్షురాది బాహ్యేంద్రియముల సహాయము లేక వానియందుఁ బ్రవర్తింపనేరదు గదా. యోగసంభవప్రత్యక్షము అనఁగా యోగము వలనఁ గలిగెడి ప్రత్యక్షము బ్రహ్మ మిట్టిదియని తెలియఁజేయునట్టి ప్రమాణము కానేరదు. భావనచేయఁగాఁ జేయఁగాఁ గలిగెడి యోగసంభవ ప్రత్యక్షము తేటగాఁ బ్రత్యక్షమువలెఁ గానఁబడుచున్నను, పూర్వము దెలిసికొనఁబడిన దానిని మరల తలంచుటయే గాన, నది ప్రమాణము అనఁగా తెలియని దానిఁ దెలియఁజేయునది కాదు. ఇట్లుండ, అది ప్రత్యక్షమెట్లు కాఁగలదు? పూర్వము తెలిసియున్న దానికంటె వేఱొక్క దానియందట్టి యోగసంభవ ప్రత్యక్షము గలుగుటకు తగిన హేతువు (ఇంద్రియ సంబంధము) గూడ గానఁబడదు. అట్టి హేతువు లేకున్నను, అది కలుగుపక్షమున, నది భ్రమమేయని చెప్పఁదగును.

ఇంతియె కాక, [1]విశేషతోదృష్టముగాని, సామాన్యతోదృష్టముగానియగు ననుమానము సయితము బ్రహ్మమిట్టిదియని తెలియఁజేయునట్టి ప్రమాణము గానేరదు. ఏలయనిన, ఇంద్రియగోచరముగానట్టి వస్తువునందు సంబంధమును నిశ్చయించుట యసంభవముగాన, విశేషతోదృష్టమగు హేతువు సంభవింపదు. మఱియు సర్వపదార్థములను ప్రత్యక్షముగాఁ దెలిసికొనుటకును వానిని నిర్మించుటకును గూడ సమర్థుఁడగు పరమపురుషునియందు నియతముగా నుండెడి సామాన్యతోదృష్టమగు హేతువుగూడ గానఁబడదు.

నైయాయికుఁడు:—జగత్తు అనేకావయవములు గలది గాన, దానియందు కార్యత్వము కలదు. కార్యమనఁగా చేయఁబడునది. అట్టిది యొక్క కర్తను కలదై

---

(1) తాను పూర్వము చూచియున్న హేతువునుబట్టి సాధ్యమును సాధించునెడను విశేషతో దృష్టము. తాను పూర్వము చూచియున్న దాని జాతిలోఁ జేరినదానిఁ బట్టి సాధించునెడను సామాన్యతో దృష్టము. ఎట్లన్నను, తాను పూర్వము ఒక్క యావునుచూచియుండి ఆతోకమాత్రము కనఁబడుటనుబట్టి యావున్నదని యూహించును. ఇచ్చట విశేషతో దృష్టము - తాను వంటయిల్లు మొదలగువానిలో పొగను చూచినప్పుడెల్ల నిప్పును చూచుచుండుటవలన కొండమీదను కూడ పొగను చూచి యచట నిప్పుగలదని యూహించును. అయితే తాను పూర్వము చూచిన పొగలలో నొకటియైనను ఈ పొగ కాదు. అయినప్పటికిని ఆ జాతిలోనిదిగాన నిప్పు ఉండవలయునని యూహించును. ఇచ్చట సామాన్యతో దృష్టము.

యుండును. ఆ కర్త ఆ కార్యమునకు [1]ఉపాదానమేదియో, ఉపకరణమేదియో, సంప్రదానమేదియో, ప్రయోజనమేదియో, వీని నన్నింటిని నెఱిఁగినవాఁడై యుండవలయును. కాఁగా, కార్యత్వమనెడి హేతువు ఇట్టి కర్తకలదియగుట యనెడు సాధ్యమును సంపాదించును. లోకమునను కుండ మొదలగు కార్యములు ఇట్టి కర్తకలవిగానే కానఁబడుచున్నవి. ఇదిగాక, జగత్తునందు అచేతనారబ్ధత్వము అనఁగా అచేతన వస్తువుయొక్క వికారమగుటకలదు. అచేతనారబ్ధమైనదెల్లను ఒక్క చేతనునకు అధీనముగా నుండునట్లు కానఁబడుచున్నది. కాఁబట్టి జగత్తునందుండెడి అచేతనారబ్ధత్వము ఏకచేతనాధీనత్వమును (ఒక్క చేతనునకు అధీనమైయుండుటను) సాధించును. కాఁబట్టి ఈ రెండు హేతువులు ప్రకృతమునఁ గలవే యన్నను,

మీమాంసకుఁడు:— చెప్పెదను. ఒక్కచేతనునకు అధీనమైయుండుట యనఁగా నేమి? వానికి అధీనముగాఁబుట్టి వానియధీనముగానె యుండుట యనఁ గూడదు. అట్లుచెప్పినచో, నీవిచ్చిన దృష్టాంతమున సాధ్యము లేకపోవును. ఎట్లనిన, రోగములేకుండ నుండెడి మన శరీరము పుట్టుటయు నుండుటయు నొక్క చేతనుని యధీనములు కావు. ఏలననిన, ఆశరీరమువలన సుఖించెడి భార్య మొదలగు సర్వచేతనుల యదృష్టమును బట్టియే ఆ శరీరము పుట్టుటయు నుండుటయును కలుగును.

ఇంతియెకాక, శరీరమనెడి యవయవి (అనేక యవయవములు గల యొక్క వస్తువు) తన యవయవములయందు [2]సమవేతమగుటయే శరీర ముండుట యనియెదవేమో, అందులకు అవయవము లన్నియును చేరియుండుటయే కావలసినది కాని, చేతనుని యపేక్ష యేమియును లేదు. ఇఁక శరీరము ప్రాణయుక్తముగానుండుట శరీరము నిలుచుటయని చెప్పినచో, నట్టి స్థితి ప్రకృతమున పక్షమైన (వివాదాస్పదమైన) భూమి సముద్రము పర్వతములు మొదలగు దాని

---

(1) ఉపాదానమనఁగా కుండకు మన్నువంటి కారణము. ఉపకరణములు పనిముట్లు. సంప్రదానమనఁగా ఆకార్యము ఎవ్వనికొఱకో వాఁడు అనఁగా ఆకార్యమునకు భోక్తయనుట.

(2) తార్కిక మతములో అవయవము వేఱు అవయవి వేఱు. ఎట్లన్నను, రెండు కపాలములను [పెంకులను] చేర్చి యొక్క కుండగాఁ జేయునప్పుడు ఆ కపాలములు అవయవములు. కుండ అవయవి. కుండగానైన తరువాతగూడ ఆ పెంకులు యుండనేయున్నవిగాన, ఆ పెంకు లనెడి అవయవములయందు కుండ యనెడి యొక్క అవయవి క్రొత్తగాఁ గలిగియున్నది. ఆ కపాలములు ఆ కుండకు ఆధారము. వానికిని దీనికిని సంబంధము సమవాయము. ఇందు సమవాయసంబంధముచేత కుండయనెడి అవయవి కపాలములయందు ఉన్నదిగాన, కుండను సమవేతమని చెప్పుదురు. ఇట్లే శరీరము కూడ దాని యవయవములయందు సమవేతమని చెప్పఁబడును.

యందే సంభవింపదుగాన, సామాన్యముగా నన్నిటియందుండెడి స్థితి (నిలిచియుండుట) యనునది ఇట్టిది యని ఏర్పడకున్నది. వానికి అధీనముగా ప్రవృత్తి కలుగుటయే వానికి అధీనమగుట యంటిరేని, అనేకులు చేరి ప్రవర్తింపవలసిన పెద్ద రథములు, రాళ్లు, వృక్షములు మొదలగువానియందు [1]వ్యభిచారము కలుగును. సామాన్యముగ ప్రవృత్తియంతయు చేతనునికి మాత్రము అధీనమై యుండుట సాధ్యమన్నచో, [2]సిద్ధసాధ్యము ప్రసక్తించును.

ఇంతియెకాక, మన ముభయుల మొప్పుకొనిన జీవులనే కర్తలనుగా నంగీకరించితిమేని, యందు సౌలభ్యము గలదు. పూర్వము జెప్పఁబడిన యుపాదానాదులను ఎఱుంగరు గాన, వారు కర్తలగుట సంభవింప దనియెదవేమో, అది సరి కాదు. జగత్తునకు ఉపాదానభూతములగు పృథివి మొదలగువానిని, ఉపకరణములగు యాగాదులనున్ను తెలిసికొనుటకు జీవుల కందఱికిని సామర్థ్యము కలదు. దృష్టాంతము:—ఇప్పుడు కూడ పృథివి మొదలగునవియును యాగము మొదలగునవియును ప్రత్యక్షముగాఁ గానఁబడుచున్నవి. సాధనభూతములగు యాగాదుల యందుండునదియు, అపూర్వమనియు, అదృష్టమనియును పిలువఁబడు శక్తి చేతనులకు గానంబడపోయినను, వారు కర్తలగుటకు బాధకము లేదు. కార్యము కలుగుటకు అది తెలియుటతోఁ బనిలేదు. అట్టి శక్తిగల యాగాదులను గుఱించిన తెలివియే కావలసినది. ఆ యాగాదికమునకు ఆకార్యమును గలిగించెడి శక్తియున్నదని తోఁచినఁ జాలును. ఆ శక్తి మనకుఁ గానఁబడ నక్కఱలేదు. దృష్టాంతము:— కుమ్మరి మొదలగు వాండ్రు తమ కార్యమునకు పనిముట్లగు దండము (కఱ్ఱ) చక్రము (కుమ్మరిసాన) మొదలగువానిని ప్రత్యక్షముగాఁ జూచినట్లు, వానికిఁగల శక్తినిగూడ ప్రత్యక్షముగాఁజూచియే కుండ, బాన మొదలగువానిని ఆరంభించుటలేదే? ప్రకృతముననో, ఆగమము (శాస్త్రము) వలన యాగాదుల కిట్టి శక్తి కలదని యెఱింగియున్న చేతనులు (జీవులు) కార్యమును గలుగఁజేయుట యసంభవము కాదు.

---

(1) వ్యభిచారమనఁగా హేతువున్నను, సాధ్యము లేకపోవుట. ప్రకృతమున అచేతన వస్తువులచేఁ గలుగుట యనెడి హేతువు పర్వతాదుల యందున్నను, ఒక్క చేతనునికి యధీనమైయుండుట యనెడు సాధ్యము లేదుగాన నిచట వ్యభిచారమనఁబడు దోషము గలదు.

(2) అనఁగా ఇప్పటికి సిద్ధమైన యంశమే గాన, నది సాధింప నక్కఱలేదనుట. ఎట్లన్నను, అచేతనములు అనేక చేతనులయధీనములై యుండుటల్లు మీమాంసకులు గూడ నొప్పియే యున్నారు.

ఇంతియెకాక, ఎట్టిది చేయుటకు శక్యమో, ఎట్టిదాని యుపాదానాదులను తెలిసికొనుటశక్యమో, అట్టిదే ఆ యుపాదానాదుల నెఱింగినవానిచేఁ జేయఁబడునదిగాను గన్పట్టుచున్నది. భూమి, పర్వతములు, మహాసముద్రములు మొదలగునవి యన్ననో, చేయశక్యములు కావు, వాని యుపాదానాదులును తెలియశక్యములు కావు. కాఁబట్టి అవి చేతనుఁడు కర్తగాఁగలవి కావు. కావున, ఏపదార్థములు చేయశక్యములో, ఏపదార్థముల యుపాదానాదులు తెలియశక్యములో, అట్టివియగు కుండ బాన మొదలయినవానివంటి వస్తువుల యందుండెడి కార్యత్వమే, చేతనకర్తృత్వమును సాధించును.

ఇంతియెకాక, అనుభవమునుబట్టి చూడగా, కుండ మొదలగు కార్య పదార్థములు ఈశ్వరుఁడు కాని వాఁడును, స్వల్పమైన తెలివియును, స్వల్పమైన శక్తియును కలవాఁడును, శరీరము కలవాఁడును, ఉపకరణములు కలవాఁడును, కోరిక కలవాఁడు నగు వానిచేత నిర్మింపఁబడునవి గాను గానఁబడుచున్నవి. కాఁబట్టి ఈకార్యత్వ రూపమగు హేతువు అట్టిచేతనునే కర్తనుగా సాధించును. అయితే యది మీరు సాధింపఁగోరిన పురుషుని సర్వజ్ఞత్వము సర్వైశ్వర్యము మొదలగువానిని సాధింపక, అందులకు విరుద్ధములైన గుణములను సాధించుటచే నది మీకు అనుకూలము కాదు.

ఇట్లైనచో, నన్ని యనుమానములును చెడునే యంటిరేని, సాధ్యవస్తువు వేఱొక్క ప్రమాణముచేఁగూడ దెలియఁబడునేని హేతువులనుబట్టి యూహింపఁబడిన విరుద్ధాంశములు ఆప్రమాణముచే నివారింపఁబడును. ప్రకృతమునన్నో, సాధ్యవస్తువగు సృష్టికర్త అనఁగా సకలనిర్మాణ చతురుఁడు వేఱొక్క ప్రమాణమునకు దేనికిని విషయముగాని వాఁడు. హేతువుతోఁ గూడ మనకు నియతముగాఁ గనఁబడుచుండెడి స్వభావములన్నియు హెచ్చుతగ్గులు లేక సామాన్యముగా నతనియందుండవలసివచ్చును. వానిని నివర్తింపఁ జేయఁదగిన ప్రమాణము లేకపోవుటచే నవియట్లే యుండును. నివర్తింపవు. కాఁబట్టి ఆగమము లేక యీశ్వరుఁ డెట్లు సిద్ధించును?

☞ ఇందును గుఱించి నైయాయికు లిట్లు వాదించుచున్నారు:—

సావయవము అనఁగా అవయవములతోఁగూడినది గాన, జగత్తు కార్య పదార్థము కాదనుట యశక్యము. ఇందునుగుఱించి న్యాయప్రయోగములు సయితము కలవు.

ప్రతిజ్ఞ:—వివాదాస్పదమైన భూమి పర్వతములు మొదలగునది కార్య పదార్థము.

హేతువు :—అవయవములు కలది గాన.

ఉదాహరణము :—కుండ మొదలగుదానివలెనె.

—०ःॐ:०—

ప్రతిజ్ఞ:—వివాదాస్పదమైన భూమి, సముద్రములు, కొండలు మొదలగు నది, కార్యపదార్థము.

హేతువు :—మహత్తై (పెద్దదై) కదలిక కలదగుటవలన.

ఉదాహరణము: —కుండవలెనె.

—०ःॐ:०—

ప్రతిజ్ఞ:—శరీరము లోకము మొదలగునది కార్యపదార్థము.

హేతువు:—పెద్దదై యుండి ఆకారవంత మగుటవలన.

ఉదాహరణము :—కుండవలెనె.

—०ःॐ:०—

అవయవయుక్తములగు వస్తువులలో "ఇదియే చేయఁబడునది అది చేయఁబడినదికాదు" అని యివ్విధమున కార్యత్వమును ఏర్పఱిచెడి స్వరూపము, సావయవత్వమే (అవయవములతోఁ గూడియుండుటయే) తప్ప, మఱియేదియును కానరాదు. [1]శక్యక్రియత్వము శక్యోపాదానాది విజ్ఞానత్వ మనునవి రెండు కార్యత్వముతో నియతముండునవిగాను గనఁబడుచున్న వే యన్నను, కార్యముగా మీ రొప్పియున్న దానివిషయమై గూడ జ్ఞానశక్తులను కార్యమును బట్టియె యూహింపవలసియున్నది. కావున, మిగిలినచోటఁగూడ సావయవత్వమునుబట్టి కార్యత్వము తెలియఁబడును. కార్యత్వమునుబట్టి జ్ఞానశక్తులను తెలిసికొనవచ్చును గాన, విశేషమేదియును లేదు. అది యెట్లన్నను, కుండ బాన మొదలగు కార్యపదార్థములను చూచుటచే వానిఁ జేసినవానికిఁగల శక్తి తెలివి వీనిని యూహించును. అట్లే తానెప్పుడును చూడనిదియు విచిత్రముగాఁ గట్టఁబడిన రాజభవనముఁజూచి దానిలో నవయవములన్నియు నొక్కవిధముగాఁ జేరియుండుటను బట్టి అది కార్యమని నిశ్చయించి అప్పుడే దానిని నిర్మించిన వాని జ్ఞానమును శక్తిని వీని వైచిత్ర్యమును ఊహించును.

కావున, శరీరము లోకములు మొదలగునవి కార్యమని యేర్పడినపైని, అన్నిటి నెఱుంగుటకును అన్నిటిని నిర్మించుటకును తగినట్టి యొక్క పురుషుఁడు సిద్ధించుచునే యున్నాఁడు.

---

(1) శక్యక్రియత్వమనఁగా దానిని చేయుట మనకు శక్యమైయుండుట. శక్యోపాదానాది విజ్ఞానత్వ మనఁగా వెనుకఁ జెప్పఁ బడిన ఉపాదానాదులు తెలియ శక్యములై యుండుట.

ఇంతియెకాక, అందఱు జీవులకును సుఖదుఃఖముల ననుభవించుట ధర్మాధర్మములను (పుణ్యాపాపములను) బట్టి వచ్చినదియేయైనను, ఆ ధర్మాధర్మములు అచేతనములుగాన, వానిఁబట్టి ఫలము నిచ్చెడి చేతనుఁడొక్కఁడు లేక, అవి స్వయముగ ఫలము నీయఁజాలవు. కావున, అందఱికిని వారివారి కర్మములకుఁ దగిన యన్ని ఫలముల నిచ్చువాఁ డొక్కఁడు కలఁడని యంగీకరింపవలసినది. దృష్టాంతము.—వడ్రంగిచేత పట్టఁబడక, యచేతనమగు బాడిసె మొదలగునది, పనిచేయవలసిన ప్రదేశము కాలము మొదలగు సాధనము లన్నియు సమకూడి యున్నను, స్వయముగ యూపస్తంభము మొదలగువానిని చేయుట గానఁబడదు. [1]బీజము (విత్తనము) అఙ్కురము (మొలక) మొదలగునవి పక్షములోఁ జేరినవే కాన, వానినిబట్టి వ్యభిచారమును చెప్పుచున్నారే యది, యా వైదిక పిశాచముల తెలివి తక్కువవలనఁ గలిగినది. సుఖాదులనుబట్టి వ్యభిచారమును చెప్పుటయు నిట్టిదియే.

ఇద్దఱు వాదులు నొప్పుకొనిన జీవులే యిట్టి కర్తలగుటయును సరిపడదు. ఏలననిన, వారికి సూక్ష్మవస్తువులను, చాటుననున్న వస్తువులను, దూరమున నున్న వస్తువులనున్ను చూచుటకు శక్తిలేదను విషయము మనమెఱింగినదియే. మనకుఁ గానఁబడురీతి ననుసరించి గదా కల్పింప వలయును. జీవునికి వలెనె ఈశ్వరునికిఁగూడ శక్తిలేదను నిశ్చయములేదు గదా! కాఁబట్టి శాస్త్రప్రమాణముచేతనే తప్ప మఱియొక్క ప్రమాణమువలన నీశ్వరుఁడు సిద్ధింపఁడని చెప్పఁదగదు. "కార్యమైనదెల్లను సమర్థుఁడైన కర్తను కలిగియే యుండును" అనెడి నియమమునుబట్టి సిద్ధించువాఁడు స్వాభావికముగా నన్ని పదార్థములను తెలిసికొనుటకును, అన్నింటిని నియమించుటకును తగిన శక్తిగలవాఁడుగానే సిద్ధించును.

"ఘటాది కార్యములను జేయువాఁడు ఈశ్వరుఁడు కానివాఁడుగానే కనఁబడుచున్నాఁడు గాన, ఈ యనుమానముచే సిద్ధించువాఁడు గూడ ఈశ్వరుఁడు కాక యుండవలయును. కావున, ప్రకృతమైన సాధ్యమునకు విరుద్ధమైన దానిని సాధింపవలసివచ్చును" అని యారోపించునది, అనుమానపురీతి నెఱుఁగకపోవుట

(1) అచేతనపదార్థములు చేతనుని సహాయములేకుండ స్వయముగ నెట్టికార్యమును చేయనేరవుగాన, నిందునుబట్టి చేతనుఁడగు ఈశ్వరుఁడొక్కఁడు కలఁడని యూహింపవచ్చునని నైయాయికులు వాదించియుండిరి. అయితే అచేతనమగు బీజము అంకురరూపమగు కార్యమును గలుగఁజేయు విషయమునను, అచేతనమగు మనస్సు సుఖరూపమగు కార్యమును గలుగఁజేయు విషయమునను, అవి చేతనుని సహాయము నపేక్షింపక స్వయముగానే వానిఁ గలుగఁజేయుచున్నవిగాన, సర్వత్ర అచేతన పదార్థము చేతనుని సహాయము కలదైయే యొక కార్యమును గలుగఁజేయునది యగుచున్నదనెడి నియమము గానఁబడదు. కావున నైయాయికుల యనుమానము యుక్తమైనదికాదని కొందఱు వాదించుచున్నారు.

వలనఁగలిగినది. ఏలననిన, [1]సపక్షమునఁ గనఁబడినంతమాత్రమున ఆ కనఁబడిన ధర్మములన్నియు, కార్యములకు హేతువులు కాకపోయినను, సాధ్యమున నుండవలయునను నిర్బంధము లేదు.

ఫలితార్థమేమన్నను, ఏదైన నొకఁడుచేఁ జేయఁబడునది, తన్ను నిర్మించెడి కర్త అట్లు తన్ను నిర్మించుటకుఁదగిన సామర్థ్యమును గలిగి యుండుటను, తన యుపాదానోపకరణముల నెఱింగియుండుటనును అపేక్షించుచున్నదే గాని, మిగిలినవాని నొనర్చుటకు సమర్థుఁడు కాకపోవుటను, మిగిలినవాని నెఱుంగకపోవుటను నపేక్షింపదు. అవి హేతువులు కావు. తన్ను నిర్మించెడు సామర్థ్యంబును తన యుపాదానోపకరణములను తెలిసియుండుటయు నను నీరెంటి వలననే యది కలుగుట సందర్భించును. ఇట్లుండ, ప్రకృతములు కానివస్తువులు తెలియకపోవుట యనునది ప్రకృతమున నుపయోగపడునది కాదు. కావున నొక దానితో సంబంధించి, కనఁబడినంతమాత్రముననే దానిని హేతువుగాఁ గల్పించుట సందర్భింపదు. ఇంతియెకాక, చేయఁబడెడి వస్తువుకాక మిగిలిన వస్తువులు తెలియకపోవుట మొదలగునది, అన్నివస్తువులను గుఱించినదా? లేక, అది కొన్నింటిని గుఱించినదా? అన్నిటని గుఱించినదని చెప్పఁగూడదు. కుమ్మరి మొదలగు వాండ్రు తమచేఁ జేయఁబడునదికాక, మఱిదేనిని బొత్తుగ నెఱుంగక యుండరు. అది కొన్నిటిని గుఱించిన దనియును చెప్పఁగూడదు. [2]అందఱు కర్తలకును ఇంత యజ్ఞాన ముండవలయు ననెడి నియమములేదు గాన, అన్ని యజ్ఞానములకును వ్యభిచారము. ఇట్లు అశక్తిని గుఱించియు నెఱుంగునది. కాఁబట్టి కార్యత్వము నకు సాధకములు కానివియగు అనీశ్వరత్వము మొదలగునవి సాధ్యవస్తువునందు సంభవింపవు గాన, విరుద్ధమును సాధింపవలసి వచ్చుటలేదు.

కుమ్మరి మొదలగువాండ్రు దండము (సానను త్రిప్పెడి కఱ్ఱ) చక్రము (కుమ్మరిసాన) మొదలగువానితోఁ బనిచేయునపుడు శరీరముతోడనే చేయుదురు గాన, జగత్తునకు ఉపాదానంబులును ఉపకరణంబులు నగు వానిని ఈశ్వరుఁడవ

(1) సపక్షమనఁగా హేతువు సాధ్యమును విడువక యుండుటను తాను చూచియున్నట్టి స్థలములు.

(2) అనఁగా నొక్క కుమ్మరివానికి ఒక్కటి తెలియక యుండును. దానినే మఱి యొక్కఁడెఱింగియుండును. వీఁడును వాఁడును గూడ కుండలను చేయుదురు గాన, ఈ యజ్ఞానము కుండపుట్టుటకు కారణమని చెప్పినయెడను, ఈ యజ్ఞానము లేనివాఁడు కుండను చేయుటలో వ్యభిచారము కలుగును. వ్యభిచారమనఁగా నిచ్చటకారణములేక కార్యము పుట్టుట. ఇట్లే ఒక్క కుమ్మరివాఁడు గొప్పరాతిని ఎత్తగలిగియుండును. ఒక్కఁడు ఎత్తలేఁడు. ఇద్దఱును కుండలను చేయుదురు. రాయిని ఎత్తలేక పోవుటయనెడు అశక్తి, కుండ పుట్టుటకు కారణమంటిమేని మునుపటివలెనే వ్యభిచారము వచ్చును.

లంబించునేని యతఁడు శరీరములేనివాఁడగుట సందర్భింపదంటిరేని, అట్లుకాదు. శరీరవ్యాపారముతోఁ బనిలేకుండగనే సంకల్ప మాత్రముననే ఇతరుల శరీరముల నాశ్రయించియున్న భూతములు, వేతాలములు (ఇవి రెండును పిశాచవిశేషములు.) మొదలగునవి పోవుటయును గరళము (పాము విషము) మొదలగునవి నశించుటయును కానఁబడుచున్నది. శరీరములేనివానికి ఇతరులను ప్రవర్తింపఁజేసెడి సంకల్పమెట్లు కలుగుచున్నదన్నను, సంకల్పించుటకు శరీరముతోఁబనిలేదు. శరీరము సంకల్పమునకు హేతువు కాదు. సంకల్పించుటకు మనస్సే హేతువు కదా. ఈశ్వరునికిఁ గూడ మనస్సు కలదని యొప్పుకొనియే యున్నాము. కార్యమును బట్టి జ్ఞానశక్తులను ఊహించునట్లు మనస్సుగూడ ఊహింపఁ బడవలసినదే. "మనస్సుతోఁజేసెడి సంకల్పము శరీరముకలవానికే కలుగును, శరీరము కలవాఁడే కదా మనస్సును కలిగియుండును" అందురేమో, అట్లుకాదు. మనస్సు నిత్యము (నశింపనిది.) కావున దేహముపోయినను మనస్సు ఉండును. కావున, శరీరముకలవాఁడే మనస్సును కలిగియుండుననుట నిలువదు.

కాఁబట్టి పుణ్యాపాపములకు పరవశుఁడై కొద్దిశక్తియు కొద్దిజ్ఞానమునుగల జీవుఁడు విచిత్రమైన యవయవ సంనివేశము (పొందిక)కల శరీరము, భూలోకము మొదలగు కార్యములను నిర్మించుటకు, సమర్థుఁడుకాఁడుగాన, సమస్త లోకములను నిర్మించుటయందు నేర్పుకలవాఁడును, తలంప శక్యముకానివాఁడును యపరిమితమైన జ్ఞానము శక్తి ఐశ్వర్యము (ప్రభుత్వము) అనునవి కలవాఁడును, శరీరము లేనివాడును, సంకల్పమాత్రమునే సాధనముగాఁ జేసికొని అనంతంబును, విస్తారంబును, విచిత్రంబునగు రచనగల ప్రపంచమును కలుగఁజేయువాఁడునగు ఈశ్వరుఁడనెడి పురుషుఁడు అనుమానముచేతనే సిద్ధించును.

ఈపైని గనఁబఱచిన ప్రకారము, బ్రహ్మము ప్రమాణాంతరముచేఁ దెలుపఁదగినది గాన ఈ యుపనిషద్వాక్యము బ్రహ్మమును ప్రతిపాదింపదు.

పరస్పరము ఎక్కువ విలక్షణము లయినవియే యగు మృత్తిక, కులాలుఁడు అను నిష్విధములయినవియే నిమిత్తోపాదానకారణములుగా లోకమునఁ గానఁబడుచున్నవి. మఱియు ఆకాశాదిరూపమగు నిరవయవద్రవ్యము కార్యపదార్థమగుట యసంభవము. కావున బ్రహ్మమొక్కటియే యీ సమస్త ప్రపంచమునకును నిమిత్తకారణమును, ఉపాదాన కారణముననిని ప్రతిపాదించుట యశక్యము.

ఈపైని గానఁబఱచిన ప్రకారము పూర్వపక్షముగారా.

## సిద్ధాంతము.

"యతో వా ఇమాని భూతాని" ఇత్యాది శ్రుతివాక్యము ఇంతకు పూర్వము గానఁబఱచిన లక్షణములు గలదియగు బ్రహ్మమును ప్రతిపాదించు

నదియే యని చెప్పఁదగును. శాస్త్రమే గదా బ్రహ్మమును తెలుపుటకు సమర్థమైనది.

“ఈ సమస్త ప్రపంచమున్ను అవయవవిశిష్టమైన దగుటంజేసి యది కార్యపదార్థము. లోకమునందు ప్రతికార్యపదార్థమును గుఱించియును అదికలుగుటకు పూర్వము దానిని నిర్మింపసమర్థుఁడగు కర్త యొక్కఁడు యుండి యున్నట్లు గానఁబడుచున్నది. కావున ఈ సమస్తమును నిర్మింపసమర్థుఁడును, అందులకుఁ గావలసిన యుపాదానోపకరణములను గుఱించిన తెలివి తేటలు గలవాఁడు నగువాఁ డొక్కఁడుండి యుండుట యనుమానవేద్యము” అని పూర్వపక్షి చేయు వాదము యుక్తమైనది కాదు. ఏలననిన, పృథివి సముద్రము మొదలగునవి కార్యపదార్థములే యైనను, అవి యన్నియు నేకకాలమున నొక్కనిచేతనే నిర్మింపఁబడిన వని తెలుపునట్టి ప్రమాణ మెద్దియునులేదు. మఱియు ఒక ఘటమువలెనె సర్వపదార్థములును ఒక్కవిధమైనట్టి కార్యమే కాఁదగవు. అవి యట్టివగు పక్షముననే యవి యన్నియు నేకకాలమున నొక్కనిచేతనే నిర్మింపఁబడిన వని చెప్పఁదగును. అయితే కార్యపదార్థము లన్నియును వేఱు వేఱు విధములై వేఱువేఱు కర్తలచే వేఱువేఱు కాలములయందొనర్పఁబడినవిగాను గన్పట్టుచున్నవి. అందువలన నవి యన్నియు నొక్కనిచేతనే ఏకకాలముననే యొనర్పఁబడిన వనెడి నియమము గానఁబడదు.

“జీవులు ఈ విచిత్రమగు జగత్తును సృజించువిషయమై యసమర్థులగుటంజేసి, కార్యత్వమును బట్టి కర్తను కల్పించునపుడు, వారి కంటె వేఱయిన వాఁడగు కర్తను గల్పింపవలయును. అయితే అట్టి కర్త లనేకులని కల్పించుట యసంభవము. కావున నొక్కఁడే కర్తకాఁదగును” అని పూర్వపక్షి చేయువాదము యుక్తమైనది కాదు. ఏలననిన, [1]జీవులే ఏదైన నొక పుణ్యవిశేషము గలవారయినచో, విచిత్రశక్తిగల వారుగాను గన్పట్టుచున్నారు. వారలు ఎక్కువ అదృష్టవంతులుగాను నెన్నఁబడు చున్నారు. కావున వారు వారివారి యోగ్యతకుఁ దగిన కార్యముల నొనర్చుట సంభవము. ఇట్లుండ, వారి కంటె వేఱయినవాఁడును, ఎంతమాత్రము మనకు తెలియరాని వేఱొకపురుషుని కల్పించుకొనుట యసంభవము.

మఱియు ఏకకాలమున సర్వము పుట్టుటయు, సర్వము గిట్టుటయును ప్రామాణికము కాఁదగదు. ఇట్లు ఎచటను గన్పట్టుచుండలేదు. ప్రతిపదార్థము మొదట యుత్పన్నమగుటయు క్రమముగ నశించుటయు నిట్లు ఉత్పత్తి వినాశ

(1) యాగవిశేషములు తపస్సు మొదలగువానిని చేసి జగత్తును సృజింపఁగల సామర్థ్యమును సంపాదించికొని జీవులు విశ్వామిత్రాదులవలె జగత్తును సృజింపవచ్చునని తాత్పర్యము.

ములు క్రమముగ గలుగునవిగాను గదా! గన్పట్టు చున్నవి. కార్యభూత మగుటచే సర్వమును ఉత్పన్న మగునదనియు, నశించునదనియునని కల్పింపవలసి యుండఁగా, వానిని మనకు గానఁబడు రీతిని కల్పించినకలైన విరోధమేదియును లేకుండును. కావున బుద్ధిమంతుఁడగు నొకఁడే కర్త యని సాధించుపక్షమున, కార్యమునకు [1]అనైకాన్త్యదోషము ప్రసక్తించును. పక్షము [2]అప్రసిద్ధ విశేషణ మనఁబడుదోషము గలది యగును. దృష్టాన్తము [3]సాధ్యవికలతయనఁబడు దోషముగలది యగును. సర్వనిర్మాణ సమర్థుఁడు ఒక్కఁడు గలఁడనెడి యంశము ప్రసిద్ధమైనది కాదుగదా. బుద్ధిమంతుఁ డొక్కఁడు కర్తయనెడి యంశము మాత్రము సాధింపఁబడునదియగు పక్షమున, [4]సిద్ధసాధనత యనఁబడును దోషము ప్రాప్తించును.

సర్వజ్ఞుఁడును, సర్వశక్తియుక్తుఁడును, నొక్కఁడు గలఁడని సాధించునది యగు కార్యత్వ మనఁబడునది ఏకకాలమున నుత్పన్నము లగునవియగు సమస్త పదార్థములయం దుండునట్టిదియా? కాక, అది క్రమముగా నుత్పన్నములగు సమస్తపదార్థములయం దుండునట్టిదియా? [5]అది ఏకకాలమున నుత్పన్నములగు సమస్తపదార్థములయందుండు నట్టిది యగు పక్షమున, దానికి కార్యత్వమే

---

(1) ఒక్కదానిని సాధించుటకై మనము గొనిన హేతువు అట్లు మనము సాధింపఁదలఁచిన దానినే కాక, వేఱొక్కదానినిగూడ సాధించుపక్షమున నది యనైకాంత్యదోష మనఁబడును ప్రకృతమున కార్యత్వమనెడి హేతువును బట్టి ఒక్కఁడే కర్తను గలిగి యుండుటను సాధించుదుమేని, ఆహేతువు అనేక కర్తలను గూడ సాధించును. అందువలన అనైకాంత్య దోషము ప్రసక్తించును.

(2) ఏ యే తావుల పొగయున్నదో, ఆయా తావులనెల్లను అగ్నియున్నట్లు, యేయేతావుల కార్యత్వము గలదో, ఆయాతావుల నెల్లను సర్వజ్ఞకర్తృకత్వము ఉన్నట్లు దెలియఁబడుచుండలేదు. కావున కార్యభూత మయినదెల్లను సర్వజ్ఞ కర్తృకముగా నుండుట ప్రసిద్ధమయినదికాదు కావున నిచట అప్రసిద్ధ విశేషణ మనఁబడు దోషము కలదు.

(3) జగత్తు కార్యపదార్థముగాన, అది సర్వజ్ఞ కర్తృకమంటివేని, కార్యభూతములగు ఘటపటాదులును కార్యపదార్థములే గదా అయితే అవి స్వల్పజ్ఞానముగల కులాలాదులచే నొనర్పఁబడునవిగాను గానఁబడుచున్నవేగాని, సర్వజ్ఞునిచే నొనర్పంబడునవిగాను గానఁబడు చుండలేదు ఈ దృష్టాంతమున సాధ్యము లేకుండుటచే నిది సాధ్యవికలతారూపమగు దోషముగలది.

(4) బుద్ధిమంతుఁడగు కర్త యుండియుండవలసియున్న యంశ మందఱు నొప్పుకొనినదే గాన, దాని నిప్పుడు సాధింప నక్కఱలేదు. సాధింప నక్కఱలేకుండ సిద్ధమైయే యుండుదానిని సాధించుట సిద్ధసాధన మనఁబడును.

(5) కార్యపదార్థము లన్నియును భిన్నభిన్నకాలముల యందుఁ జేయఁబడునవిగాను గన్పట్టుచున్నవి గాన, ఏకకాలమున నొనర్పఁబడునవి కార్యపదార్థములే గావని ప్రసక్తించును.

సిద్ధింపదు. కాక, [1]అది క్రమముగ నుత్పన్నములగు సమస్తపదార్థములయం దుండు నట్టిది యగు పక్షమున, నందుమూలముగా నది యనేక కర్తలు గలరని సాధించును. కావున విరుద్ధము. ప్రకృతమునను, ఒక్కఁడే కర్త గలఁడని సాధించుపక్షమున, [2]ప్రత్యక్షవిరోధమును, [3]అనుమానవిరోధమును. [4]శాస్త్రవిరోధమును ప్రసక్తించును. దృష్టాంతము:—“కుమ్భకారో జాయతే” (కుమ్మరివాఁడు పుట్టుచున్నాఁడు,) “రథకారో జాయతే” (వడ్రంగి పుట్టుచున్నాఁడు) ఇత్యాది శ్రుతులు కలవు గదా.

ఇంతియెకాక, శరీరములు మొదలగు కార్యభూతములగు వస్తువుల న్నింటిలోను సత్త్వరజస్తమో గుణములవలనఁ గలిగెడి సుఖాదులు సంబంధించి యున్నట్లు కానఁబడుచున్నందున, ఆ సత్త్వాదిగుణములు వీనికి మూలభూతము లని యొప్పక తప్పదు. సత్త్వాదులనఁగా, కార్యపదార్థముల యందు వైచిత్ర్యము గలుగుటకు హేతువులై కారణముల నాశ్రయించియుండు విశేషములు. ఆకార్యములు సత్త్వాది మూలకములగుట యెట్లన్నను, వానితోఁ గూడిన పురుషుని యంతఃకరణమున వికారములను గలుగఁజేయుచు నందుమూ

---

(1) కార్యపదార్థములు భిన్నభిన్న కాలములయం దొనర్పఁబడునవని యంగీకరించితివేని, అవి భిన్నభిన్న కాలములయందు భిన్నభిన్న కర్తలచే నొనర్పంబడునుగాన, నందుమూలముగ భిన్నభిన్న కర్త లేర్పడుదురు.

(2) ఘటపటాది పదార్థములు వేలువేలు కర్తలు గలవిగాను ప్రత్యక్షముగాఁ గానఁబడుటచే అన్నింటికి నొక్కఁడే కర్తయగుట ప్రత్యక్ష విరుద్ధము.

(3) మన సమీపముననుండు ఘటమును ద్వీపాంతరముననుండు ఘటమును ఈ రెండును కార్యపదార్థములే. అయితే ద్వీపాంతముననుండు ఘటము ఎవనిచే, ఏ సాధనములతోఁ జేయఁబడినదో, వానిచేతనే ఆసాధనములచేతనే మన వద్దనుండు ఘటము గూడ జేయఁబడినదని చెప్ప నేరము. ఏలననఁగా, ఈ ఘటము ద్వీపాంతరమునకుఁ బోయి యుండుట యసంభవము. ఈ విధములగు అనుమానములవలన ననేకకర్తలుండుట తెలియవచ్చుచున్నది. ఒక్కఁడే కర్తయంటివేని యిట్టి యనుమానములు విరోధించును.

(4) కార్యభూతమైన దంతయు నొక్కఁడే కర్తగాఁ గలదియగు పక్షమున, కుంభములు రథములు మొదలగునవన్నియు నొక్కఁడే కర్తగాఁగలవి. ప్రకృతమున కుంభము ఎట్లు కార్యపదార్థమో అట్లే రథమున్ను కార్యపదార్థముగాన, వాని రెంటికిని కర్తయొక్కఁడే యుండి యుండవలయును. ఇట్లుండ “కుంభకారోజాయతే రథకారోజాయతే” ఇత్యాదితావుల కుంభమును చేయువానిని కుంభకారుఁడనియు రథమును చేయువానిని రథకారుండనియు నిట్లు నిర్దేశించి వారలను భిన్నములయిన ఉత్పత్తి గలవారినిగా వ్యవహరించుట పొసగదే? కావున నిట్టి శాస్త్రము విరోధించును.

లముగా నట్టివియగుచున్నవి. పురుషునకు వానితోఁ సంబంధము కలుగుట కర్మములమూలముగా వచ్చినది. కాఁబట్టి కార్యమును గలుగఁజేయుటకు జ్ఞానంబును శక్తియును ఎట్లు ఆవశ్యకములో, అట్లే కర్మసంబంధముగూడ నట్టిదియేయని యవశ్య మంగీకరింపవలయును. జ్ఞానంబును శక్తియును విచిత్రములుగానుండుట కర్మమూలకమే కదా. కార్యమును కలుగఁజేయుటకు కోరికయు హేతువే యైనను, ఆ కోరిక ఆయావిషయములను గుఱించియే కలుగుట సత్త్వాదిగుణములను బట్టియే యుండునదిగాన, కర్మసంబంధము తప్పదు.

కాఁబట్టి క్షేత్రజ్ఞులే (శరీరవంతులగు జీవులే) కర్తలు గాని, వారలకంటె విలక్షణుఁడగు వాఁడొక్కఁడు అనుమానమువలన సిద్ధింపఁడు. ఇందును గుఱించి న్యాయప్రయోగములు (Syllogistic Statements) సయితము గలవు.

ప్రతిజ్ఞ:—శరీరము లోకములు మొదలగునది క్షేత్రజ్ఞుఁడే కర్తగాఁ గలది.
హేతువు:—అది కార్యభూత మగుటవలన.
ఉదాహరణము:—కుండవలెనే.

—

ప్రతిజ్ఞ:—ఈశ్వరుఁడు కర్త కాఁడు.
హేతువు:—అతనికి అందువలనఁ బ్రయోజనమేదియును లేకపోవుటవలన.
ఉదాహరణము:—ముక్తపురుషునివలెనే.

—

ప్రతిజ్ఞ:—ఈశ్వరుఁడు కర్త కాఁడు.
హేతువు:—అతఁడు శరీరము లేనివాఁడగుటవలన.
ఉదాహరణము:—ముక్తపురుషుని వలనే.

—

క్షేత్రజ్ఞులు మొదట శరీరము లేనివారై యుండి, తరువాతను ఈ శరీరమును పొందినట్లు కానఁబడుచున్నదే యన్నను, అప్పుడుగూడ అనాదియగు సూక్ష్మశరీరము (లింగశరీరము) ఉండనేయున్నది. ప్రయోగము:—

ప్రతిజ్ఞ:—కాలము ఎన్నఁడును లోకములేనిదై యుండుట లేదు.
హేతువు:—అదియును కాలమగుటవలన.
ఉదాహరణము:—జరుగుచున్న కాలమువలెనే.

—

ఇంతియేకాక, ఈశ్వరుఁడు శరీరముకలవాఁడై కార్యమునుచేయునా? లేక శరీరము లేనివాఁడై కార్యమును చేయునా? శరీరములేనివాఁడై కార్యమును చేయునని చెప్పఁదగదు. ఏలననిన, శరీరములేనివానికి కర్తృత్వము (ఒక్క పనిని చేయువాఁడగుట) కానఁబడదు. మనస్సువలనఁజేసెడి కార్యములు నయితము శరీరముగలవానికే సంభవములగుచున్నవి. దృష్టాంతము:—మనస్సు నిత్యవస్తువే యైనను, శరీరములులేని ముక్తులయెడను ఆమనస్సుయొక్క కార్యములు కనఁబడుటలేదు గదా! ఈశ్వరుఁడు శరీరముతోఁ గూడినవాఁడై కార్యమును చేయుచున్నాఁడని వాదించుపక్షమున, నావాదము విమర్శమునకు నిలువదు. అది యెట్లన్నను- ఆ శరీరము నిత్యమా? కాక, అనిత్యమా? నిత్యమని చెప్పఁదగదు. ఏలననిన, అవయవములుగల దానిని నిత్యమని యొప్పినయెడను, జగత్తుగూడ నిత్యమేయని యొప్పవచ్చును గాన, నీశ్వరుఁడు సిద్ధింపడు. అనిత్యమనియును చెప్పుటకు వీలులేదు. ఏలననిన, ఆ శరీరము గలుగుటకుఁ గారణమైన మఱియొక్క శరీరమంతకుముందు లేదే? ఆశరీరమునకు ఆ యీశ్వరుఁడే హేతువంటిరేని, అట్లుకాదు. శరీరములేని వానికి కారణత్వము సరిపడదు. మఱియొక్క శరీరమును కలిగియుండి ఆశరీరమునకు కారణమగు నంటిరేని, అనవస్థవచ్చును. అనఁగా ఒక్క శరీరమునకు కారణమగుటకు అంతకుముందు మఱియొక్క శరీరముతో నుండవలసివచ్చును. దానికి కారణమగుటకు మఱియొక్క శరీరముతో నుండవలసివచ్చును. ఇట్లు శరీరపరంపరకు అవధిలేకుండును.

ఇంతియేకాక, ఆ యీశ్వరుఁడు వ్యాపారము కలవాఁడా? వ్యాపారము లేనివాఁడా? అతఁడు శరీరవంతుఁడు కాఁడు గాన, వ్యాపారముగలవాఁడగుట సందర్భింపదు. అతఁడు నిర్వ్యాపారుఁడగునేని, ముక్తపురుషునివలె నిర్వ్యాపారుఁడైనవాఁడు కార్యమును చేయఁడు.

కార్యభూతమైన (పుట్టుకగల) జగత్తు, ఇచ్ఛామాత్రమే అనఁగా సంకల్పమొక్కటియే వ్యాపారముగాఁగల కర్త గలది యని చెప్పినచో, పక్షమునకు [1]అప్రసిద్ధమైన విశేషణమును వేసికొనుటయును, [2]దృష్టాంతమున సాధ్యము లేకపోవుటయును తటస్థించును.

---

(1) ఇచట జగత్తు పక్షము. కార్యభూతమగుట పక్షవిశేషణము. జగత్తునందుండు ప్రతి పదార్థమును సంకల్పమాత్రము వ్యాపారముగాఁగల కర్తచే నొనర్పఁబడినదిగాను గానఁబడనందున నీవిషయము ప్రసిద్ధ మయినదికాదు, కావున, అట్లంటిమేని, యప్రసిద్ధ విశేషణమనఁబడు దోషము ప్రాప్తించును.

(2) లోకమునఁ గానఁబడు ఘటపటాది పదార్థము లట్టి సంకల్పమాత్ర వ్యాపారునిచే నొనర్పఁబడినవిగాను గానఁబడకున్నందున, దృష్టాంతమున సాధ్యము లేకపోవును.

కాఁబట్టి మనకు లోకమునఁ గనఁబడెడి రీతినిబట్టి యీశ్వరుని సాధించుట, మనకు లోకమునఁ గనఁబడెడి రీతినిబట్టియే నిరాకరింపఁబడినదిగాన, పరబ్రహ్మమును, సర్వేశ్వరుఁడునగు పురుషోత్తముఁడు శాస్త్రమొక్కటియే ప్రమాణముగాఁ గలవాఁడని సిద్ధమగుచున్నది.

శాస్త్రమో, బ్రహ్మమును ప్రమాణాంతరములచేఁ దెలియఁబడెడి వస్తువులన్నింటికంటెను విలక్షణునిగానును, సర్వజ్ఞత్వము సత్యసంకల్పత్వము మొదలగువానితోఁ గూడినవియును, ఇంతయంతయనరాని యతిశయము గలవియును, అపరిమితములు నగు గొప్పగుణములకు సముద్రమువంటి వానినిగానును, హేయముల కన్నిటికిని విరుద్ధమైన స్వరూపము గలవానినిగానును, తెలియఁజేయుచున్నది. కావున, ఇతరప్రమాణములచేఁ దెలుపఁబడెడి వస్తువులతోఁ బోల్చుటనుబట్టి వచ్చెడి దోషము లెంతమాత్ర మితనియందుఁ బ్రసక్తింపవు.

"నిమిత్తకారణమును ఉపాదానకారణమును ఈ రెండునుజేరి యొక్కటియే యగుటయు, ఆకాశము మొదలగు నవయవ రహిత ద్రవ్యములకు కార్యత్వమును (పుట్టుకయును,) మనకెచ్చటను గానఁబడలేదుగాన, నవి సమర్థింప శక్యములుకావు" అని పూర్వపక్షి చెప్పియున్నాఁడు. అవి గూడ విరుద్ధములు గావని "ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాన్తానుపరోధాత్" (బ్ర. సూ. ౧. అ. ౪. పా. ౨౩. సూ.) "న వియ దశ్రుతేః" (బ్ర. సూ. ౨ అ. ౩. పా. ౧. సూ.) అను నధికరణములలో నిరూపింపఁబడును.

బ్రహ్మము మఱియే ప్రమాణమునకును విషయము గాక, శాస్త్రప్రమాణమునకే విషయమగుటంజేసి, "యతో వా ఇమాని భూతాని" అను శ్రుతివాక్యము అట్లు శాస్త్రప్రమాణముచేతనే తెలియఁదగినదియగు బ్రహ్మమును ప్రతిపాదించునని సిద్ధమగుచున్నది.

శాస్త్రయోనిత్వాధికరణము ముగిసెను.



## సమన్వయాధికరణము

అవతారిక:—బ్రహ్మము శాస్త్రప్రమాణమునకు తప్ప, యితర ప్రమాణములకు విషయమయినది కాకపోవు గాక! అయినను, శాస్త్రమనునది "ఇది చేయుము" "ఇది చేయకుము" అను నీవిధమగు ప్రవృత్తి నివృత్తులను తెలుపునది. బ్రహ్మమో సిద్ధవస్తువు. అట్లు సిద్ధరూపమగు బ్రహ్మమును ఈ పైని గనఁబఱచినప్రకారము ప్రవృత్తి నివృత్తి పరమగు శాస్త్రము ప్రతిపాదింపదని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై.

## ౪॥ సూ॥ త త్తు స మ న్వ యా త్.

టీ॥ తు=శంక యుక్తమైనదికాదు, తత్ = శాస్త్రము (బ్రహ్మమును ప్రతిపాదింపఁదగినది. ఏలననఁగా,) సమన్వయాత్ = శాస్త్రవాక్యము లన్నియు బ్రహ్మమును ప్రతిపాదించుటయందు సమన్వయించుటవలన.

తా॥ శాస్త్రవాక్యము లన్నియును బ్రహ్మమును ప్రతిపాదించుటయందు సమన్వయించునవి గాన, శాస్త్రము బ్రహ్మమును ప్రతిపాదింపఁదగినది. కావున, శంక యుక్తమైనది కాదు.

శ్రీ॥ భా॥ సూత్రార్థము—సూత్రమునందుండు "తు" శబ్దము ప్రసక్తించిన శంక యొక్క నివృత్తిని సూచింపునది. (తత్=) బ్రహ్మము శాస్త్రమే ప్రమాణముగాఁ గలది యగుట సంభవమే. ఏలననఁగా, (సమన్వయాత్=) పరమపురుషార్థభూతుఁడగు బ్రహ్మమునే తెలుపునవిగాను గదా! శాస్త్రవాక్యములు సమన్వయించుచున్నవి. పరమపురుషార్థ పరములుగా నన్వయించుట సమన్వయమనఁబడును. ఉపనిషద్వాక్య సముదాయము అట్టి సమన్వయము గలది. ఎట్లనిన,

తైత్తిరీయులు "యతో వా ఇమాని భూతాని జాయంతే," (తై. బృ ౧. అను) "దేని నుండి యీ భూతములన్నియు జన్మస్థితి లయములను బొందుచున్నవో, అది బ్రహ్మము" అనియు, ఛందోగులు "సదేవసోమ్యే దమగ్ర ఆసీదే కమేవాద్వితీయం తదైక్షత బహుస్యాం ప్రజాయాయేతి" (ఛా. ౬ ప్ర. ౨. ఖ. ౧. వా.) అను వాక్యమున "సృష్టికిఁ బూర్వ మీపరిదృశ్యమానమగు జగత్తంతయును ఒక్కటియు, రెండవదిలేనిదియునగు సత్తుగానే యుండెను. అది తేజస్సును సృజించెను" అనియు, వాజసనేయులు "బ్రహ్మ వా ఇదమేకమేవాగ్ర ఆసీత్" (బృ. ౩ అ. ౪ బ్రా. ౧౧ వా.) అను వాక్యమున "సృష్టికిఁ బూర్వ మిదియంతయు నొక్కటియగు బ్రహ్మముగా నుండెను" అనియు, ఐతరేయోపనిషత్తునందు, "ఆత్మావా ఇదమేకఏవాగ్రఆసీత్" (ఐ. ౧ అ. ౧ ఖ. ౧ వా.) అనఁగా "సృష్టికిఁ బూర్వ మిదియంతయు నొక్కటియగు నాత్మగా నుండెను" అనియు, తైత్తిరీయులు "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః" (తై. ఆనం. ౧ అను) అనఁగా "ఈ యాత్మనుండియే ఆకాశము పుట్టినది" అనియు "ఏకోహ వై నారాయణ ఆసీత్" (మ. ౧. అ. ౧ వా.) అను మహోపనిషద్వాక్యమున "నారాయణుఁడొక్కఁడే యుండెను" అనియు, తైత్తిరీయులు "సత్యం జ్ఞానమనంతంబ్రహ్మ" (తై. ఆనం. ౧ అను) అను వాక్యమున "సర్వదాయుండునదియు, చేతనమును, పరిచ్ఛిన్నము గానిదియు నగునది బ్రహ్మము" అనియు "ఆనందో బ్రహ్మ" (తై. బృ. ౬ అను) అను

వాక్యమున "ఆనందము బ్రహ్మము" అనియు నీ విధముగ పఠించియుండు టచే బ్రహ్మము శాస్త్రప్రమాణముచే ప్రతిపాదింపఁదగినదని సిద్ధమగుచున్నది. శబ్దార్థమునుబట్టి తెలియవచ్చునదియు, పరినిష్ఠితవస్తువునగు దానిని ప్రతిపా దింప సమర్థములగు శబ్దసముదాయములు అఖిలజగజ్జని స్థితి లయాదులకు హేతు భూతమును, దోషములకు విరుద్ధమైనదియును, అపరిమితోదారగుణసాగరమును, సర్వము నతిశయించియుండునదియును, ఆనందస్వరూపమునగు పరబ్రహ్మమును తెలుపునవిగా సమన్వయించుచుండ, ప్రవృత్తి నివృత్తి పరములగుటయనెడి ప్రయోజనము గలవిగాక పోయినంతమాత్రమున, నవి యన్యపరము లనం దగదు. ఏలననిన, సర్వప్రమాణములును తమకు విషయములగు పదార్థములను మాత్రము తెలుపునవి. ప్రయోజనము ననుసరించి ప్రమాణము లుండవు. అయితే ప్రమాణముల ననుసరించియే ప్రయోజనములుండును. పురుషార్థముతో సంబంధమున్నట్లు దెలియవచ్చుచున్నదిగాన, ప్రవృత్తి నివృత్తులతో సంబం ధము లేకపోయినంతమాత్రమున, శాస్త్రము ప్రయోజనశూన్య మనుట కవ కాశములేదు. "నీకు పుత్త్రుఁడు గలిగెను" అనియు, "ఇది సర్పము కాదు" అనియు నీ మొదలగు స్వరూపపరవాక్యములను వినుటచే గూడ హర్షము గలుగుటయు, భయము నివర్తించుటయు నీ మొదలగు ప్రయోజనములు గలుగుచున్నట్లు మనము చూచుచున్నాము గదా?

## పూర్వపక్షము.

ఈ సందర్భమున పూర్వమీమాంసకులిట్లు ఆక్షేపించుచున్నారు.—

ప్రవృత్తి నివృత్తులతో సంబంధములేక పోయినచో, శాస్త్రము నిరర్థ కము. కనుక నది బ్రహ్మమును ప్రతిపాదింపదు. ఏదయిన నొకవస్తువుయొక్క యాథాత్మ్యమును దెలియఁజేసినంత మాత్రముచే ప్రత్యక్షాది ప్రమాణములు కృతకృత్యములగు గాక! శాస్త్రమన్ననో, ఒక ప్రయోజనమును దెలియఁజేయుట యందే పర్యవసించుచున్నది. లౌకిక గ్రంథములయందు గాని, వైదిక గ్రంథ ములయందు గాని, ప్రయోజనరహితమగు వాక్య మొక్కటి యైనను గానఁ బడదు. ప్రయోజనములేక, ఒక్కఁడు వేఱొక్కనితో మాట్లాడుటయు, ఒక్కఁడు చెప్పినదానిని వేఱొక్కఁడు వినుటయును సంభవింపవు. కావున, ఒకనిని దుష్ట కార్యములనుండి నివర్తింపఁజేయుటచే వాని యనిష్టములను తొలఁగింపఁజేయుట గాని, సత్కార్యములయందుఁ బ్రవర్తింపఁజేయుటచే నిష్టములను పొందించుట గాని ప్రయోజన మని తెలియవచ్చుచున్నది. ఎట్లన, "ధనమును గోరువాఁడు రాజు నాశ్రయింపవలయును" అనియు, "ఆకలి మందముగ నున్నవాఁడు ఉద కమును ద్రాగగూడదు" అనియు, "స్వర్గాపేక్షగలవాఁడు యజ్ఞముల ననుష్ఠింప

వలయును ” అనియు “ కళంజమును భక్షింపగూడదు ” అనియు నీ మొదలగు ప్రవృత్తి నివృత్తుల కన్నిటికిని ప్రయోజన మట్టిది గానే కదా విదితమగుచున్నది. అయితే “నీకు పుత్రుఁడు గలిగెను” అనియు “ఇది సర్పము కాదు ఇది త్రాఁడు” అనియు నీ మొదలగు స్థిరవస్తు పరములగు వాక్యములనుండియును హర్షప్రాప్తియు, భయనివృత్తియు నీ మొదలుగాఁగల పురుషార్థము దెలియవచ్చుచున్నదే యని యింతకుపూర్వము జెప్పినదానిని గుఱించి విచారింపవలసియున్నది. అచట పుత్రజన్మాది రూపమగు కార్యము గలుగుటవలన హర్షప్రాప్తిరూపమగు పురుషార్థము గలుగుచున్నదా? లేక, పుత్రుఁడు గలిగినాఁడని తెలిసికొనినందున అనగా పుత్రుఁడు గలిగినాఁడనెడి జ్ఞానమువలన నట్టి పురుషార్థము గలుగుచున్నదా? ఎద్దియయిన నొకపదార్థమున్నను, అది యున్నదని తెలియనియెడల. నట్టి పురుషార్థమును గలుగదు. అయితె పదార్థమున్నదని తెలియుట వలననే హర్షప్రాప్తిరూపమగు పురుషార్థము గలుగునంటివేని, పదార్థము వాస్తవముగ లేక పోయినను, దానిని గుఱించిన జ్ఞానమువలననే పురుషార్థముసిద్ధించుచున్నదిగాన, శాస్త్రము ఒక్క పదార్థమును తెలుపునది కాఁదగదు. కావున, శాస్త్రమొక ప్రయోజనమును తెలుపుటయందు పర్యవసింపునదియేయైనను, అదియొక పదార్థముయొక్క యునికిని గుఱించి ప్రమాణము కానేరదు. కావున నన్ని తావులను వాక్యము ప్రవృత్తి నివృత్తి పరముగాఁ గాని, జ్ఞానపరముగాఁ గాని ప్రయోజన పర్యవసాయి యగుటచే, నట్టి వాక్యమును పరినిష్పన్నవస్తువును దెలియజేయునది యగుట యసంభవము. కనుక వేదాంతములు పరినిష్పన్నవస్తుభూతమగు బ్రహ్మమును ప్రతిపాదింపవు.

☞ నిష్ప్రపంచీకరణ నియోగవాదులగు మాయావాదు లిట్లు చెప్పుచున్నారు:—[1]

వేదాంతవాక్యములును కార్యపరముగానే బ్రహ్మమును గుఱించిన ప్రమాణములు గా నగుచున్నవి. ఎట్లనిన, ప్రపంచమెద్దియు లేనిదియు, రెండవది లేనిదియు, జ్ఞానైకరసమునగు బ్రహ్మము అనాద్యవిద్యావశమున ప్రపంచము గలదిగా ప్రతీయమానమగుటం జేసి, దానిని ప్రపంచరహితముగాఁ జేయవలయును. కావున, బ్రహ్మము ప్రపంచలయద్వారా శాస్త్రవిధికి విషయమగుచున్నది. ఇట్లు జ్ఞాతృజ్ఞేయరూప ప్రపంచనాశద్వారా సాధింపఁదగినదై, జ్ఞానైకరసమగు బ్రహ్మమును సాధించునట్టి శాస్త్రవిధి యెద్దియనిన, “ న దృష్టే ర్ద్రష్టారం పశ్యేః ” (బృ. ౫ అ. ౪ బ్రా. ౨ వా.) అనఁగా “ జ్ఞానమునకంటె వేఱుగ జ్ఞాతను

(1) నిష్ప్రపంచీకరణ నియోగవాదులనియు, ధ్యాననియోగవాదులనియును పూర్వపక్షులగు మాయావాదులు రెండు తెగలవారు గలరు.

తెలిసికొనకుము" అనియు "నమతేర్మన్తారం మన్వీథాః" అనఁగా "మనన మునకంటె వేఱుగ మంతను అనఁగా మననము జేయువానిని చింతింపకుము" అనియు నీమొదలగు శాస్త్రవిధులు బ్రహ్మమును జ్ఞాతయనియు జ్ఞేయమనియు నిట్టి భేద మెంతమాత్రము లేనిదానినిగాఁ జేయుమని గదా విధించుచున్నవి. బ్రహ్మము స్వతస్సిద్ధమైనదియే యైనను, ప్రపంచరహితత్వరూపమగు కార్యత్వము దానికి విరుద్ధము కాదు.

☞ ఈవిషయమును పూర్వ మీమాంసకు లిట్లు దూషించుచున్నారు.

ఇట్లు చెప్పుట యుక్తము కాదు. నియోగమే (విధియే) వాక్యములచే దెలుపఁబడునదియని చెప్పువాఁడు, ప్రథమమున, నా నియోగ మెట్టిదియో, నియోజ్య విశేషణ మెట్టిదియో, అనఁగా ఈ నియోగవాక్యమే పురుషునిగుఱించి ప్రవర్తించుచున్నదో, ఆ పురుషుఁడు పొందియుండవలసిన యధికార మెట్టిదియో, యీ నియోగమునకు విషయమెద్దియో అనఁగా నీ వాక్యముచే విధింపబడునది యేదియో, ఆ విధిని నెరవేర్చు సాధనము లేవియో, ఆ విధిని నెరవేర్చువిధ మెట్టిదియో, నియోక్త యెట్టివాఁడో అనఁగా ఈ విధిని ప్రవర్తింపఁజేయువాఁ డెట్టివాఁడో దీని నంతయును ముందుగ చెప్పవలసి యున్నది.

ఈపైని గానఁబఱచిన వానిలో, నియోజ్యవిశేషణము (ఆ పురుషుఁడు ముందుగనే సంపాదించుకొని యుండవలసినదిగాన) ఇప్పుడది నియోగవాక్యముచే విధింపఁ దగినది కాదు. మఱియు నది నిమిత్తరూపమనియు, ఫలరూపమనియును రెండు విధములు. కనుక, ప్రకృతమున, ఆ నియోజ్యవిశేషణ మెట్టిది? అది నిమిత్తరూప మయినదా? ఫలరూప మయినదా? యని విచారింపవలసి యున్నది. బ్రహ్మస్వరూపయాథాత్మ్యానుభవమే నియోజ్యవిశేషణ మనియెదవా? అట్లంటివేని, యది నిమిత్తరూప మయినది గానేరదు. ఏలననిన, నిమిత్తరూపములయిన వన్నియు నియోజ్యుఁడగు పురుషునియందు ఇట్టి నియోగమునకు పూర్వమే యుండునవిగాను గన్పట్టుచున్నవి. దృష్టాంతము:— "యావజ్జీవమగ్నిహోత్రం జుహుయాత్" అనఁగా, "జీవించి యున్నంతవఱకు అగ్నిహోత్రము ననుష్ఠింపవలయును" అను నీ మొదలగు విధివాక్యములు ఏ పురుషునికి అగ్నిహోత్రాదులను విధించుచున్నవో, అట్టి విధులకు నిమిత్తభూతములగు జీవనాదు లాపురుషునికి ఇట్టి విధికి పూర్వమే యుండునవిగాను గన్పట్టుచున్నవి గదా! అట్లే, ప్రకృతమునను, బ్రహ్మస్వరూపయాథాత్మ్యానుభవ రూపమగు నిమిత్త మిట్టి విధికి పూర్వము ఈ పురుషునియందుండునది కాదు. ఒకవేళ బ్రహ్మస్వరూపయాథాత్మ్యానుభవముగూడ జీవనాదులవంటి నిమిత్తమే యని యంగీకరించిన పక్షమున, జీవనరూపమగు నిమిత్త

ముండువఱకు అగ్నిహోత్రాదు లాచరింపఁబడు చందమున, ప్రకృతమునను, బ్రహ్మస్వరూప యాథాత్మ్యానుభవ రూపమగు నిమిత్తముండువఱకును ఈ నియోగము ననుష్ఠింపవలయునని ప్రసక్తించును. అయితే బ్రహ్మస్వరూప యాథాత్మ్యానుభవరూపమగు నిమిత్తమన్ననో నిత్యము గాన, అనఁగా నెప్పుడు నుండునది గాన, మోక్షమును పొందిన తరువాతను గూడ ఈ నియోగము ననుష్ఠింపవలయునని ప్రసక్తించును మఱియు నది ఫలరూపమనియును చెప్పఁదగదు. అట్లంగీకరించిన పక్షమున, నది యొక విధివలనఁగలుగు ఫల మగుటంజేసి, "స్వర్గకామో యజేత" "స్వర్గము నపేక్షించువాఁడు యజ్ఞమును జేయవలయును" అనియు నీ మొదలగు విధులతో సంబంధించిన స్వర్గాదిఫలము లనిత్యములగు చందమున, బ్రహ్మ స్వరూప యాథాత్మ్యానుభవ రూపమగు ఫలము నయితము అనిత్యమని ప్రసక్తించును.

ఈ నియోగమునకు విషయమెద్ది? అనఁగా నీ విధిచే సాధింపఁబడున దెద్ది? అది బ్రహ్మమనియెదవా? అట్లు చెప్పఁదగదు. బ్రహ్మము నిత్యపదార్థ మగుటంజేసి యది యొక విధిచే సాధింపఁదగినదికాదు. మఱియు బ్రహ్మము కార్యరూపమయినదియును గూడ కాదు. నిష్ప్రపంచమగు బ్రహ్మము సాధ్యమనియెదవా? ఒక వేళ, అది సాధ్యమని యంగీకరించినను అది, ఫలమేయగును. అట్టి బ్రహ్మము యజ్ఞాదులవలె కార్యరూపము గానందున, నది యొక విధికి విషయభూత మయినది కానేరదు. ఎట్లన, ఈరెంటిలో [1]సాధ్యము (సాధింపఁబడునది) యెద్ది? బ్రహ్మమా? ప్రపంచనివృత్తియా? బ్రహ్మము సాధ్యమని చెప్పఁదగదు. అది సిద్ధవస్తువు గాన సాధ్యమెట్లగును? అటుల నది సాధ్యమని యంగీకరించిన పక్షమున, సాధ్యములగు యజ్ఞాదులవలె నదియు ననిత్యమని ప్రసక్తించును. ప్రపంచనివృత్తియే సాధ్యమగు పక్షమున, ఆ నియోగమునకు విషయభూతము బ్రహ్మము కాకపోవును. ప్రపంచనివృత్తియే యా నియోగమునకు విషయమనియెదవా? అట్లు కాదు. ప్రపంచ నివృత్తి యనఁబడునది

(1) సాధ్యమనఁగా నొక్కవిధినిబట్టి సాధింపఁబడునది ఇది విషయరూపముగాను ఫలరూపముగాను నుండును. ఉదాహరణము "స్వర్గకామో యజేత" (స్వర్గమునుగోరువాఁడు యజ్ఞము నొనర్పవలయును) అనునది యొక విధి. ఈ విధినిబట్టి యొనర్పఁబడు యజ్ఞము ఈవిధియొక్క విషయరూపమగు సాధ్యము. అందువలనఁ గలుగునట్టి స్వర్గము దీని ఫలరూపమగు సాధ్యము. ఇందువలన విషయభూతములగు సాధ్యములు యజ్ఞాదులనియు, ఫలభూతములగు సాధ్యములు స్వర్గాదులనియును యేర్పడుచున్నది. కావున నిచటను విషయరూపమగు సాధ్యమును ఫలరూపమగు సాధ్యమును నొక్కటియే పదార్థము కాఁదగదు. అట్లగునేని, భాష్యమునఁ గానఁబఱచిన ప్రకారము ఇతరేతరాశ్రయదోషము వచ్చును. ఈప్రకరణమున విషయరూపమగు సాధ్యమే "సాధ్య" శబ్దముచే నిర్దేశింపఁబడినదని పాఠకులెఱుంగునది.

37

యొక ఫలముగాన, నది యొక విధికి విషయభూతమయినది కానేరదు. ఎట్లనిన; ప్రపంచనివృత్తియే గదా మోక్షము. అదియేగదా ఫలము [1]ఇట్లు ఫలభూతమగు ప్రపంచనివృత్తియే విషయభూతమంటివేని, నియోగమునుండి ప్రపంచనివృత్తిరూపమగు ఫలము గలుగుచుండుట వలనను, ప్రపంచ నివృత్తి రూపమగు విషయమునుండి నియోగము సిద్ధించుచుండుట వలనను ఈ తావున, ఇతరేతరాశ్రయదోషము ప్రసక్తించును.

ఇట్లు నియోగముచే నివర్తింపఁదగిన ప్రపంచము మిథ్యారూపమయినదా? సత్యమయినదా? మిథ్యారూపమగు పక్షమున, నది జ్ఞానముచేతనే నివర్తింపఁదగినది. కావున, నియోగమువలన నెద్దియును ప్రయోజనము లేదు. ఒకవేళ, నియోగము నివర్తక (ప్రపంచమును నివర్తింపునట్టి) జ్ఞానమును గలుగఁజేసి, తద్వారా ప్రపంచమును నివర్తింపుచున్న దనియెదవా? ఆలాగనను చెప్పఁదగదు. ఏలననిన, అట్టి జ్ఞానము ఉపనిషద్వాక్యములనుండియే గలుగుచున్నది గాన, నియోగమువలనఁ బ్రయోజనమెద్దియును గానఁబడదు. బ్రహ్మవ్యతిరిక్తమై మిథ్యాభూతమగు ఈ సమస్త ప్రపంచము వాక్యార్థజ్ఞానము వలననే బాధింపఁబడు చున్నందుచే అవయవములతోఁగూడ నియోగము సిద్ధింపదు. ప్రపంచము నివర్తింపఁదగినదగు పక్షమున, దానిని నివర్తింపఁజేయు నియోగమనఁబడునది బ్రహ్మస్వరూపమేనా? కాక, అది బ్రహ్మస్వరూపమునకంటె వేఱయినదా? అది బ్రహ్మస్వరూపమే యగు పక్షమున, నట్లు బ్రహ్మస్వరూపభూతమగు నియోగము నిత్యము ఉండునది యగుటంజేసి, దానిచే నివర్తింపదగిన ప్రపంచమనఁబడునది ఎన్నఁడును లేకపోవలసివచ్చును. మఱియు నియోగము నిత్యమగు పక్షమున, నది విషయానుష్ఠానముచే ననఁగా నట్టి నియోగముచే విధింపఁబడు యజ్ఞాదుల ననుష్ఠించుటచే సాధింపఁదగిన దగుట ఘటింపదు. అట్లు గాక, నియోగము బ్రహ్మస్వరూపమునకంటె వేఱయిన దనియెదవా? అట్లంటివేని, యా నియోగము సమస్త ప్రపంచనివృత్తిరూపమగు విషయానుష్ఠానముచే సాధింపఁదగిన దగుటంజేసి, ప్రపంచము నష్టమగుటచే (ప్రపంచాంతర్గతుఁడగు) ప్రయోక్తగూడ నష్టమగుచున్నాఁడు గాన, నట్టి నియోగమున కాశ్రయమే లేకపోవును.

---

(1) దేనినిగుఱించి యొక విధి యేర్పడుచున్నదో, దానినిబట్టి యా విధి గలుగుచున్నది అట్టిది యావిధికి విషయ మనఁబడుచున్నది. ఆ విధివలన నేఫలము మనకుఁ గలుఁగుచున్నదో, అది యావిధి వలనఁ గలుగు ఫలమనఁబడుచున్నది. ఇందువలన విషయము విధిని గలుగఁజేయునదియనియు, విధి ఫలమును గలుగఁజేయునది యనియును ఏర్పడుచున్నది. ఇట్లుండ, ప్రకృతమున విషయమును ఫలమును ప్రపంచ నివృత్తియనఁబడునది యొక్కటియే యగునేని, ఈపైని గనఁబఱచిన ప్రకారము ఇతరేతరాశ్రయ దోషము గలుగును,

కాఁబట్టి నియోగమనఁబడున దొక్కటి యున్నట్లు సిద్ధింపదు. ప్రపంచనివృత్తిరూపమగు విషయానుష్ఠానము చేతనే బ్రహ్మస్వరూప వ్యతిరిక్తమయిన దంతయు నివర్తించుచున్నది గాన, నట్టి నియోగముచే సాధింపఁబడు మోక్షమనెడి ఫలము సయితము లేకపోవును.

ప్రపంచనివృత్తియనఁబడునది కరణము గూడ అనఁగా నియోగమును సాధించుటకు ఉపయుక్తమయిన సాధనముగూడ కానేరదు. ఏలననిన అట్టి సాధనము ఆ నియోగమునందు ఉపయోగపడునట్టి విధమెద్దియును లేదు గదా. ఒక్కటి వేఱొక్కదాని విషయమై యెవ్విధముననను ఉపయోగపడని పక్షమున, దాని కది సాధనము కాఁదగదు. అట్టి విధమెద్దియును ఏల లేదంటివేని, ఈ సాధనము ఉపయోగించుపద్ధతి భావరూపమయినదా? కాక, అది యభావరూపమయినదా? సాధనమును గలుగజేయునదియనియు, సాధనమును ఉపకరించునది యనియును భావరూపమగు పద్ధతి రెండు విధములు. ఆ రెండువిధములు గూడ ప్రకృతమున పొసగవు ఏలననిన, పొట్టునుండి బియ్యమును వేఱుసేయు రోకలిపోటు మొదలగునదివలెనె యీ సమస్తప్రపంచమును నివర్తింపఁజేయునది యెద్దియును ప్రత్యక్షముగ గానంబడదు కాఁబట్టి దృష్టఫలమగు పద్ధతి సంభవింపదు. అది సిద్ధమయి యుండునట్టి సాధనముయొక్క కార్యమును గలుగఁజేయువిషయమై సహాయభూతమైనదియును గానేరదు. ఎందువలననిన, ఇట్లు సహాయభూతమైన దొకటి యుండియున్నదిగాన, ఈ సమస్త ప్రపంచమునకును నివృత్తిగలుగుట యనెడి సాధనము సిద్ధింపదు. బ్రహ్మము అద్వితీయమనెడి జ్ఞానము ప్రపంచ నివృత్తిరూపమగు కరణమును గలుగఁజేయునది యనియెదవా? అట్లగునేని, అట్టి జ్ఞానమే ప్రపంచనివృత్తిరూపమగు మోక్షమును గలుగఁజేయును గాన, అందులకై కరణాదులు గలుగఁజేయవలసినది మఱి యేదియును లేదని పూర్వమే చెప్పఁబడియె. అట్టి పద్ధతి యభావరూపమైనదియును కానేరదు. ఏలననిన, అది యభావరూపమగుటచేతనే అనఁగా నది స్వయముగా లేనిదియగుటచే నది యొక కరణమును గలుగఁజేయనేరదు. సరియే గదా, దానికి సహాయభూతమయినదియును కానేరదు. కావున, నిష్ప్రపంచమగు బ్రహ్మమే విషయముగాఁ గల నియోగ మనున దొకటి యుండుట యసంభవము.

☞ ఈ విషయమును గుఱించి ధ్యాననియోగవాదియగు మాయావాది యిట్లు చెప్పుచున్నాఁడు:—

వేదాంతవాక్యములు సిద్ధవస్తువగు బ్రహ్మస్వరూపమును నిరూపించునట్టి ప్రమాణములు కాకపోయినను, ధ్యానవిధి సామర్థ్యమువలన బ్రహ్మస్వరూపము సిద్ధించును. ఎట్లనిన:—“ఆత్మా వా అరే ద్రష్టవ్యః నిదిధ్యాసితవ్యః” (బృ. ४

అ. ౪ (బ్రా. ౫ వా.) (బ్రహ్మము శాస్త్రిద్వారా చూడఁదగినవాఁడు ధ్యానింప వలసినవాఁడు) అనియు, "య ఆత్మా అపహతపాప్మా సో ఽన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" (ఛా. ౮ ప్ర. ౭ ఖ. ౧ వా.) (పాపరహితుఁడగు బ్రహ్మము వెదకఁదగిన వాఁడు విచారింపఁ దగినవాఁడు) అనియు, "ఆత్మేత్యేవోపాసీత" (బృ. 3 అ. ౪ బ్రా. ౭ వా.) (ఆత్మయనియే యుపాసింప వలయును) అనియు, "ఆత్మానమేవ లోక ముపాసీత" (బృ. 3 అ. ౪ బ్రా. ౧౫ వా.) (లోకమును బ్రహ్మమునుగా నుపాసించునది) అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు ధ్యానమును విధింపుచున్నవి. ఇచట ధ్యానమును విధించునట్టి యీ విధివాక్యములు, తమచే విధింపఁబడు ధ్యానము ధ్యానింపఁబడు వస్తువును బట్టి నిరూపింపఁబడునది గాన, అందు మూలముగా ధ్యేయపదార్థమును సూచింపుచున్నవి. అట్లు విధివాక్యములచే సూచింపఁబడినట్టి ధ్యేయపదార్థ మావాక్యములయందుఁ జెప్పఁబడిన బ్రహ్మమే. అట్లు ధ్యేయపదార్థమగు బ్రహ్మముయొక్క స్వరూప మెట్టిది? యనెడి వివక్షరాఁగా, "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనియు, "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు ధ్యేయపదార్థమును, దానియొక్క స్వరూపమును తెలుపుచు, అందుమూలముగా నట్టి ధ్యానవిధికంగము లగుటంజేసి, ప్రమాణపదవిని బొందుచున్నవి. కావున బ్రహ్మమునకు విధివిషయభూతమగు ధ్యానమునఁ బ్రవేశముండుటంజేసి, వేదాంతవాక్యములు అట్టి బ్రహ్మముయొక్క స్వరూపమును ప్రతిపాదించుటయందు తాత్పర్యము గలవియే యగుచున్నవి. కనుక, "ఏకమేవాద్వితీయం" అనియు "తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో" అనియు, "నేహ నానాస్తి కించన" అనియు, నీ మొదలగు శ్రుతుల వలన బ్రహ్మమొక్కటియే సత్యమనియు, తదితరమయినదంతయు మిథ్యయనియును దెలియవచ్చుచున్నది. ప్రత్యక్షాది ప్రమాణములవలనను, భేదజ్ఞాననిష్ఠమగు కర్మమును ప్రతిపాదించునట్టి శాస్త్రమువలనను గదా! భేదమనఁబడున దొక్కటి యున్నట్లు తెలియవచ్చుచున్నది. అయితే భేదాభేదములు పరస్పరము విరుద్ధములు గాన, అనఁగా రెండును (ఏకకాలమున) సత్యములుగానేరవు గాన, వానిలో నొక్కటి మాత్రము, సత్యము గావలసివచ్చును. అవిద్యామూలముగాను సయితము భేద మున్నట్టు తెలియవచ్చుట సంభవము గాన, అభేదమే పరమార్థమని నిశ్చిత మగుచున్నది. ధ్యానమును గురించిన విధిచేతను, బ్రహ్మసాక్షాత్కారరూపమగు ఫలముచేతను అవిద్యయంతయు పోవుటచే నట్టి యవిద్యవలనఁ గలిగిన నానావిధ భేదజ్ఞానము సయితము నశింపఁగా, నట్టి భేదమెద్దియు లేనిదియును, అద్వితీయమును, జ్ఞానైకరసమును, బ్రహ్మరూపమునగు మోక్షము పొందఁబడుచున్నది. అయితే అట్టి బ్రహ్మభావము (మోక్షము) మహా

వాక్యమువలనఁ గలుగునట్టి యర్థజ్ఞానముచే మాత్రము సిద్ధించునది కాదు. ఏలన నిన, వాక్యార్థ జ్ఞానమాత్రముచేతనే బ్రహ్మభావము సిద్ధించుచున్నట్లు మనకుఁ దెలియవచ్చుచుండ లేదు. మఱియు నట్టి వాక్యార్థ జ్ఞానము గలిగిన తరువాతను గూడ భేదజ్ఞాన మనువర్తించుచున్నది. ఇంతియె కాక, అట్టి వాక్యార్థజ్ఞానమాత్రముచేతనే బ్రహ్మభావము సిద్ధించుపక్షమున, అందులకై శ్రుతులయందు శ్రవణ మననాదులనుగూడ విధించుట నిరర్థకము కావలసివచ్చును.

☞ సాక్షాన్మాయావాది ఈవిషయమును ఇట్లు ఆక్షేపించుచున్నాఁడు

త్రాటిని సర్పమునుగా భ్రమించినవాని భయకంపాదులు "ఇది త్రాడు సర్పము కాదు" అనెడి యుపదేశమువలన నివర్తించుచున్నవి గదా! అట్లే బంధము సయితము మిథ్యారూపమయిన దగుటంజేసి, జ్ఞానముచేతనే నివర్తింపఁదగినది. కాఁబట్టి దానికి వాక్యమువలనఁ గలుగు జ్ఞానమువలననే నివృత్తి గలుగుచున్నదనుట యుక్తము గాని, యట్టి నివృత్తి శాస్త్రవిధివలనఁ గలుగునని చెప్పుట యుక్తము కాదు. ఏలననిన, శాస్త్రవిధిచేతనే బంధనివృత్తిరూపమగు మోక్షము సాధింపఁబడుచున్నదను పక్షమున, "స్వర్గకామో యజేత" ఇత్యాది శాస్త్రవిధులచే సాధింపఁబడు స్వర్గాదులవలెనె మోక్షము సయితము అనిత్య మనవలసివచ్చును. అయితే మోక్షము నిత్యమని గదా దర్శనప్రవర్తకులందఱును ఒప్పుకొనుచున్నారు. ధర్మాధర్మరూపములగు కర్మములన్నియు, ఫలానుభవమునకుఁ దగిన శరీరమును గలుగఁజేయుచు నందుమూలముగా ఫలహేతువు లగుచున్నవి. కావున నవి బ్రహ్మాదిస్థావర పర్యంతముండెడి చతుర్విధ శరీరములతో సంబంధమును గలిగియుండుట యనెడి సాంసారిక ఫలమును మాత్రమే యిచ్చునవి యని యవశ్యమంగీకరింపవలయును. కావున మోక్షమనఁబడునది యిట్టి ధర్మానుష్ఠానముచే సాధింపఁదగినది కాదు. అట్లే "న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయోరపహతి రస్తి అశరీరం వా వ సంతం న ప్రియాప్రియే స్పృశతః" (ఛా. ౮ ప్ర. ౧౨ ఖ. ౧౧) అనఁగా "శరీర సంబంధము గలవానిని సుఖదుఃఖములు ఎన్నఁడును విడువవు. శరీరసంబంధములేనివానిని సుఖదుఃఖములు ఎన్నఁడును సంబంధింపవు" అనెడి శ్రుతివాక్యమున సయితము అశరీరత్వమనెడి మోక్షావస్థయందు ధర్మాధర్మ సాధ్యములగు సుఖదుఃఖము లేవియును లేవని తెలిపియుండుటవలన నట్టి (యశరీరత్వరూపమగు) మోక్షము ధర్మాచరణముచే సాధింపఁదగినది కాదని తెలియవచ్చుచున్నది.

అయితే ఒక్కొక్కవిధిచేత నొక్కొక్కవిధమయిన ఫలము సాధింపఁబడుచున్నది గాన, అశరీరత్వరూపమగు మోక్షము ధ్యానవిధిచేత సాధింపఁదగినదని యెదవేమో, ఆలాగునను చెప్పఁదగదు. ఏలననిన, అశరీరత్వము—శరీరసం

బంధము లేకుండుట యనునది—(ఆత్మయొక్క) స్వరూపమే గాన, నది యొకదానిచే సాధింపఁదగినట్టిది కాదు. శ్రుతులు సయితము అట్లే చెప్పు చున్నవి. ఎట్లనిన, కాఠకులు "అశరీరం శరీరేష్వ నవస్థేష్వవస్థితం । మహాంతం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి" (కఠ. ౨ వల్లి. ౨౨ వా.) అనఁగా "అనిత్యములును అవస్థితిరహితములునగు దేవమనుష్యాది శరీరములందున్నట్టిది యు, శరీరసంబంధములేనట్టిదియు, గొప్పదై వ్యాపించియున్నట్టిదియునగు నా త్మస్వరూపమును తెలిసికొనిన ఆత్మజ్ఞాని దుఃఖములను పొందడు" అని పఠించు చున్నారు. ముండకోపనిషత్తునందు "అప్రాణోహ్యమనాః శుభ్రః" (ము. ౨ ము. ౧ ఖ. ౨ వా.) అనఁగా "ఈ యాత్మ ప్రాణసంబంధములేనివాఁడును, మనస్సంబంధము లేనివాఁడును, పరిశుద్ధుఁడును" అని పఠింపఁబడెను. వాజస నేయులు "అసంగోహ్యయం పురుషః" (బృ. ౬ అ 3 బ్రా. ౧౫ వా.) అనఁగా "ఈయాత్మ శరీరాదులతో సంబంధము లేనివాఁడు" అని పఠించుచున్నారు. కాఁబట్టి యశరీరత్వరూపమగు మోక్షము నిత్యమగుటంజేసి, యది ధర్మానుష్ఠాన ముచే సాధింపఁదగినది కాదు. కనుకనే కాఠకులు "అన్యత్ర ధర్మా దన్యత్రాధర్మా దన్యత్రాస్మాత్కృతాకృతాత్ । అన్యత్రభూతాద్భవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద" అనఁగా "ధర్మాధర్మ సాధ్యమైనట్టిది కానిదియు, చేయఁబడునది కానిదియు, భూత భవిష్య ద్వర్తమాన కాలత్రయ పరిచ్ఛిన్నము గానిదియునగు బ్రహ్మస్వరూప మెద్దియో, దానిని నీవు తెలిసికొనుచున్నావు గాన, దానిని నాకుఁ దెలుపుమా" అని పఠించుచున్నారు.

ఉత్పత్తిసాధ్యములనియు, ప్రాప్తిసాధ్యములనియు, వికృతిసాధ్యములని యు, సంస్కృతి సాధ్యములనియును సాధ్యపదార్థములు నాలుగువిధములు. మో క్షము ఈనాలుగు విధములగువానిలో నెవ్విధమైనదియును గానేరదు. ఏలననిన, మోక్షమనునది బ్రహ్మస్వరూపమే గాన, అది నిత్యము. కాఁబట్టి యది యుత్పత్తి సాధ్యము అనఁగా మృత్తువలన ఘటవలెనది క్రొత్తగాఁ బుట్టునది కానేరదు. మఱియు నది యాత్మస్వరూపమే గాన, నిత్య ప్రాప్తమయిన దగుటచే నది ప్రాప్తి సాధ్యము అనఁగా నిప్పుడు క్రొత్తగాఁ బొందఁదగినది కాదు. మఱియు నది వికృతి సాధ్యమును కాదు. అట్లగునేని, క్షీరములయొక్క వికారమగు దధి మొదలగు నది వలెనే యది యనిత్యమన్నమాట వచ్చును. మఱియు నది సంస్కృతి సాధ్యము అనఁగా ప్రోక్షణమువలన యవధాన్యమువలెను, క్షాళనమువలన మలినవస్త్రమువలెను గుణవృద్ధిని గాని, దోషక్షయమును గాని పొందింపఁ దగినది కాదు. ఎట్లనిన, సంస్కారమనఁగా నెద్ది? ఏదైన నొక దోషమును బోఁ గొట్టుటను గాని, యొక యతిశయమును గలుగఁజేయుటను గాని గదా! సం స్కారమందురు. బ్రహ్మమెప్పుడును పరిశుద్ధ మగుటచే దానియందొక దోష

ముండుట కవకాశ ముండదు. బ్రహ్మము ఒక్క యతిశయమును బొందింపఁదగిన పదార్థముకాదు గాన, దాని కొక యతిశయమును గలుగఁజేయుటయును అసంభవము. కాఁబట్టి యది సంస్కారమువలన సిద్ధించునది గాదు. ఇంతియె కాక, బ్రహ్మము తనయందుండెడి క్రియకుఁగాని, యితరపదార్థములయందుండు క్రియకుఁగాని విషయ మగునది కాదు గాన, దేనితోనైన రుద్దుటచే దర్పణాదులు సంస్కరింపఁబడు చందంబుననైనను, సంస్కరింపఁబడునదియును కాదు. మఱియు దేహముతో సంబంధించినవియగు స్నానాది కార్యములచేతనున్న ఆత్మ సంస్కరింపఁదగినది కాదు. అయితే యట్టిది యవిద్యాకల్పితమును దేహసంగతమునగు నహంకారము మాత్రమే. ఆక్రియవలనఁ గలుగు ఫలము ననుభవించునదియును నదియే ఆత్మయహంకారమునకు సాక్షియగుటచే నది యహంకారము కాదు. కనుకనే మంత్రవర్ణము గూడ "తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యోఽభిచాకశీతి" (ము ३ ము. ౧ ఖ. ౧వా.) అనఁగా "అహంకారాత్మలలో నొక్కటి అనఁగా నహంకారము కర్మఫలము ననుభవించుచున్నది మఱియొక్కటి అనఁగా నాత్మకర్మఫలము ననుభవింపక ఊరక చూచుచున్నది" అనియు "ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః" (కఠ. ३ వ. ४ వా.) అను శ్రుతివాక్యము "శరీరము, ఇంద్రియములు, మనస్సు అను వానితోఁ గూడియున్న దానిని పండితులు భోక్తనుగా అనఁగా కర్మఫలము మొదలగు వాని ననుభవించునట్టిదానినిగాఁ దెలిసికొనుచున్నారు" అనియు, "ఏకో దేవస్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా కర్మాధ్యక్షః స్సర్వభూతాధివాసీ సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ" (శ్వే ౬ అ ౧౧ వా.) అను శ్రుతివాక్యము "ఆత్మ దివ్యమును, ఒక్కటియు, సర్వభూతములయందును గూఢముగా నుండునదియు, సర్వవ్యాపకమును, సర్వభూతాంతరాత్మయును, కర్మముల కధ్యక్షభూతమును, సర్వభూతములందు నుండునదియును, సాక్షియును, చేతనుఁడును, ఫలసంబంధములేనివాఁడును, గుణరహితుఁడును" అనియును "సపర్యగాచ్ఛుక్లమకాయమవ్రణం అస్నావిరం శుద్ధమపాపవిద్ధం" అను శ్రుతివాక్యము "ఆ యాత్మ యజ్ఞానములేనిది, శరీరములేనిది, కనుకనే యది గాయములులేనిది, ముసలితనములేనిది, కర్మఫలసంబంధము గాని కర్మము గాని లేనిదియని యుపాసకుఁడు తలంచును" అనియు నివ్విధముగాఁ జెప్పుచున్నవి. ఈ శ్రుతు లిట్లు జెప్పుచు, నెవ్విధమయిన యతిశయమును గలుగఁజేయుట కవకాశములేనిదియు నిత్యశుద్ధమై నిర్వికారమగు నాత్మస్వరూపమునుఅవిద్యాకల్పితమగు నహంకారమునకంటె వేఱయినదానినిగా నిశ్చయించుచున్నవి. కాఁబట్టి మోక్షమనునది యాత్మస్వరూపమే గాన, నది యొక సాధనముచే సాధింపఁదగినది గాదని సిద్ధమగుచున్నది.

ఇట్లు మోక్ష మొక్కదానిచే సాధింపఁదగినదిగాని పక్షమున, (మహా వాక్యముల) యర్థజ్ఞానమువలనఁ బ్రయోజన మెద్ది? యని యడిగెద వేమో, చెప్పెదను. మోక్ష విషయములగు ప్రతిబంధకములను నివర్తింపజేయుటయే వాక్యార్థజ్ఞానమువలనఁ బ్రయోజనము. కనుకనే "త్వం హి నః పితాఽస్మాకమవిద్యాయాః పరం పారం తారయసి" (ప్ర. ౬ ప్ర. ౮ వా.) అను శ్రుతి వాక్యము "అవిద్యనుతొలఁగించి రక్షించినవాఁడవు గాన, నీవే తండ్రివి" అని చెప్పుచున్నది. ఛందోగులు "శ్రుతం హ్యేవ మే భగవద్దృశేభ్యస్తరతి శోక మాత్మవిదితి సోఽహం భగవశ్శోచామి తం మా భగవాఞ్ శోకస్య పారం తారయతు" (ఛా. ౭ ప్ర ౧ ఖ. ౩ వా) అను వాక్యమున "నారదుఁడు సనత్కుమారుని యొద్దకేగి ఆత్మనెఱింగినవాఁడు దుఃఖము నతిక్రమించుచున్నాఁడని మీవంటివారివలన వినియుంటిని కనుక నేను చాలా దుఃఖించుచున్నాను నాదుఃఖమును బోగొట్టుమని ప్రార్థించెదను" అనియు "తస్మై మృదితకషాయాయ తమసః పారం దర్శయతి సనత్కుమారః" (ఛా. ౭ ప్ర. ౨౬ ఖ. ౨ వా.) అను వాక్యమున "పరిశుద్ధమనస్కుఁడైన నారదునకు సనత్కుమారుఁడవిద్య కంటె వేఱగు పరమార్థతత్త్వమును జూపించెను" అనియును పఠించుచున్నారు. మోక్ష మెప్పుడును ఉండియున్నదే యయినను, దానివిషయమగు ప్రతిబంధకము వాక్యార్థజ్ఞానముచే నివర్తింపఁబడు చున్నది. అయితె అట్టి నివృత్తి యనఁబడునది యొకదానిచే సాధింపఁబడునదియేయైనను, అది [1]ప్రధ్వంసాభావరూపమయినది గాన, నశించునది కాదు. మఱియు "బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి" (ము. ౩ ము ౨ ఖ. ౯ వా.) (బ్రహ్మమును దెలిసికొనినవాఁడు బ్రహ్మ మగుచున్నాఁడు) అనియు "తమేవ విదిత్వా అతిమృత్యుమేతి" (బ్రహ్మమునే తెలిసికొని జన్మ మరణాదిరూపమగు సంసారము నతిక్రమించుచున్నాఁడు) అనియు నీ శ్రుతివాక్యములు బ్రహ్మజ్ఞానము గలిగినతోఁడనే మోక్షము గలుగునని తెలుపుచు నింకుమూలముగా, బ్రహ్మమును దెలిసికొనుటకును మోక్షప్రాప్తికిని మధ్యను నియోగ (విధి) రూపమగు వ్యధానమును నిరోధించుచున్నవి. "బ్రహ్మమును దెలిసికొనుము" అనుచో (తెలిసికొనుము అను) క్రియకు కర్మమయినందువలనఁగాని, "బ్రహ్మమును ధ్యానింపుము" అనుచో, (ధ్యానింపుము అను) క్రియకు కర్మమయినందువలనఁ గాని బ్రహ్మమునకు కర్మముతో సంబంధము గలదని శంకింపఁబనిలేదు. ఏలననిన, "అన్యదేవ తద్విదితాదథో ఽవిదితాదపి" అను శ్రుతివాక్యము "బ్రహ్మము జ్ఞేయపదార్థమునకంటెను జ్ఞాతకంటెనునున్న వేఱయినది" అనియు "యేనేదం సర్వం విజానాతి తత్కేన విజానీయాత్" అను శ్రుతివాక్యము "దేని మూలముగా నీ సర్వమును తెలియునో, దానిని దేనిమూలముగాఁ

(1) ౬౭-వ పత్రమునందు ౨-వ వివరణముయొక్క ౨-వ పేరాను చూడుము.

దెలిసికొనవచ్చును?" అనియు "తదేవ బ్రహ్మ త్వం విద్ధినేదం యదిదముపాసతే" (కేన. ౧ ఖ. 3 వా) అను శ్రుతివాక్యము "నీవు దానినే బ్రహ్మముసుగా నెఱుంగుము, నీవు ఉపాసించునది బ్రహ్మము కాదు" అనియు నిర్విధముగాఁ జెప్పుచు బ్రహ్మ మీ పైని చెప్పిన ప్రకారము వెదనమునకుఁగాని ధ్యానమునకుఁగాని కర్మ (విషయ) భూతమైనది కాదని వక్కాణించుచున్నవి.

ఇంతమాత్రమున శాస్త్రము విషయములేనిది (దేనినిన్ని ప్రతిపాదింపనిది) యగునని చెప్పఁదగదు ఏలననిన, అవిద్యచేఁ గల్పింపఁబడినదై నానావిధమగు భేదజ్ఞానమును నివర్తింపఁజేయుటయే శాస్త్రము జేయు కార్యము. శాస్త్రము బ్రహ్మ మిదియని నిర్దేశింపదు. అయితే యది దేనికిని విషయము గాని ప్రత్యగాత్మస్వరూపమని ప్రతిపాదించుచు, దానియందు జ్ఞాన మనియు, జ్ఞాత యనియు, జ్ఞేయ మనియు నిర్విధముగా నవిద్యాకల్పితమగు నానావిధ భేదములను నివర్తింపుచున్నది. అట్లే గదా "న దృష్టే ర్ద్రష్టారం పశ్యేః" (బృ. ३ అ. ४ బ్రా. ౨ వా.) ఇత్యాది శాస్త్రవాక్యము "ఓ ఉషస్తుఁడా! లౌకిక దృష్టిని వ్యాపించియుండు ద్రష్టయగు నాత్మను చూడలేవు" అని యిట్లు చెప్పుచు నాత్మ దేనికిని విషయభూతమయినది కాదని తెలుపుచున్నది. ఇట్లు జ్ఞానమువలననే బంధము నివర్తించుచుండఁగా, నందులకై శ్రవణ మననాదులను శ్రుతియందు విధించియుండుట నిరర్థకమగునే యని శంకింపఁబనిలేదు. ఏలననిన, స్వాభావికముగ పరి పరి త్రోవల నాకర్షింపఁబడునట్టి యీతని మనస్సును, వాని నన్నింటినుండి త్రిప్పి, అందుమూలముగా వాక్యార్థమును బాగుగాఁ దెలియఁజేయుటకై శ్రవణ మననాదులు హేతుభూతము లగుచున్నవి. మఱియు జ్ఞానమాత్రముచే సంసారబంధము నివర్తింపఁబడుచున్నట్లు యెచటను జూచియుండ లేదందువేమో? అట్లు చెప్పఁదగదు. ఏలననిన, బంధమనఁబడునది మిథ్యారూపము గాన, నది జ్ఞానము గలిగిన తరువాతనుగూడ ననువర్తించుట యశక్యము గదా! కనుకనే యీ శరీరము పడిపోయిన తరువాతనే బంధము నివర్తించుననుట యుక్తము గాదు. దృష్టాంతము—త్రాటిని సర్పమునుగాఁ గొని భీతచిత్తుఁడైన వాని భయము "అది త్రాడుగాని సర్పము గాదు" అనెడి యాథాత్మ్యజ్ఞానమువలనఁ బోవును గాని యది సర్పము నశించితే గాని పోదనెడి నియమ మెచట నయినఁగలదా? లేదు. వాస్తవముగ, శరీరసంబంధ మనున దొకటి యున్నపక్షమున, శరీరము నశించినఁగాని బంధము పోదని చెప్పవచ్చును. అయితే బ్రహ్మ వ్యతిరిక్తమైనదంతయు నసత్యమే గాన, నట్టి శరీరసంబంధము నయిలేము బ్రహ్మవ్యతిరిక్తమగుటంజేసి యసత్యమే. ఎవ్వనికైతె బంధము నివర్తింపలేదో, వానికి జ్ఞానమనఁగానిదియని తెలియనే లేదని యవగతమగు

చున్నది. ఏలననఁగా, జ్ఞానమువలని ప్రయోజన మట్టివాని యెడలఁ గానఁబడు చుండలేదు. కాఁబట్టి శరీరమున్నను, లేకపోయినను, వాక్యార్థజ్ఞానము గలిగిన తరువాత అట్టివాఁడు ముక్తుఁడేయని చెప్పఁదగును. మోక్షము ధ్యానవిధిచే సాధింపఁదగినదికాదు గాన, ధ్యానవిధి కంగముగాను బ్రహ్మము సిద్ధించుచున్న దనుట యుక్తము కాదు. అయితే బ్రహ్మము "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనియు, "తత్త్వమసి" అనియు. "అయమాత్మా బ్రహ్మ" అనియు నిట్లు బ్రహ్మ పరములేయగు మహావాక్యములనుండి సిద్ధించుచున్నది.

☞ ఈపైని గనఁబఱచిన ప్రకారము సాక్షాన్మాయావాది చేయునట్టి వాదమును ధ్యాననియోగవాదియగు మాయావాది యిట్లు దూషించుచున్నాఁడు.

ధ్యాననియోగవాది:—ఇట్లు చెప్పుట యుక్తము కాదు. వాక్యార్థజ్ఞానము గలిగినంతమాత్రముననే బంధము నివర్తించుట యసంభవము. బంధము స్వయముగ మిథ్యారూపమై, జ్ఞానముచేతనే బాధింపఁబడునదియైనను, అది [1]యపరోక్షమగుటంజేసి, పరోక్షమగు వాక్యార్థ జ్ఞానముచే బాధింపఁబడ నేరదు. అదెటువలెననిన, రజ్జువును సర్పమునుగాను ప్రత్యక్షముగాఁ జూచుటచే భయపడిన వాఁడు "ఇది సర్పముకాదు." అని యొక పురుషునివలన పరోక్షముగాఁ దెలిసికొని నంతమాత్రమున వానిభయము పోనేరదు. అయితే వాని భయము పోవుటకు ముఖ్య కారణము వాఁడా త్రాటిని ప్రత్యక్షముగాఁ జూచుటయే.

వాక్యార్థజ్ఞానము అపరోక్షజ్ఞానమును గలుగఁజేయదు.

దృష్టాంతము:—రజ్జువును సర్పమునుగాఁ గొని భయపడి పాఱిపోవువాని కడ కొక మిత్రుఁడు వచ్చి "అది త్రాడుగాని సర్పముకాదు" అని చెప్పినంతట, వాఁడు "ఏదీ చూతము రమ్ము" అని యచటకిఁ బోయి త్రాటిని ప్రత్యక్షముగాఁ జూచిన తరువాతనుగదా వాని భయము నివర్తించుచున్నది.

శబ్దమే అపరోక్షజ్ఞానమును గలుగఁజేయునదియని చెప్పఁదగదు. ఏలననిన, శబ్దము ఇంద్రియము కాదు గదా! జ్ఞానసామగ్రు లన్నింటిలో నపరోక్ష జ్ఞానమును గలుగజేయునవి యింద్రియములే గదా? ఫలాపేక్ష లేక, కర్మముల ననుష్ఠించుటచేఁ బాపములన్నియు నశింపఁగా, శ్రవణ మనన నిదిధ్యాసనముల ననుష్ఠించుటవలన బాహ్య విషయములనుండి విముఖుఁడైన పురుషునికి శాస్త్రవాక్యమే యపరోక్షజ్ఞానమును గలుగఁజేయఁగల దనియెదవా? అట్లు చెప్పఁదగదు. ఏలననిన, ప్రతిబంధము లన్నియును పోగా, తత్పరుఁడుగా నుండి

---

(1) మనము స్వయముగాఁజూచి తెలిసికొనినది "అపరోక్షము లేక అపరోక్షజ్ఞానము" అనఁబడును. ఇతరులు చెప్పినందువలనఁగాని గ్రంథాదులవలనఁగాని యెఱుంగునది "పరోక్షము లేక పరోక్ష జ్ఞానము" అనఁబడును.

నను, జ్ఞానసాధనవిశేషములగు ఇంద్రియాదులు తమతమ విషయనియమముల నతిక్రమించునట్లు, అనఁగాఁ దముచేఁ దెలుపఁదగిన వానికంటె నితరములను గూడ తెలుపునవి యగునట్లు ఎచటను గానఁబడదు. కావున వాక్యము అపరోక్షజ్ఞానమును గలుగఁజేయుట యసంభవము.

ధ్యానము వాక్యార్థజ్ఞానమును గలుగఁజేయునట్టి యుపాయముకాదు. అట్లగునేని, యితరేతరాశ్రయ దోషము సంభవించును. ఎట్లనిన, వాక్యార్థజ్ఞానము గలిగిన తరువాతను గదా, ఆ వాక్యము నుండి తెలియవచ్చిన విషయమును గుఱించి ధ్యానించుట సంభవము. మఱియు ధ్యానము వాక్యార్థజ్ఞానమును గలుగఁజేయునదియగు పక్షమున, ధ్యానమును సంపూర్తిగ సంపాదించుకొనిన పిదప గదా, అట్టి ధ్యానమునుండి వాక్యార్థజ్ఞానము గలుగవలయును. ఇట్లు ఇతరేతరాశ్రయ దోషదూషిత మగుటంజేసి యీ పైవాదము యుక్తమైనది కాదు (ఒకవేళ ఈ దోషమును తొలఁగించుటకై) ధ్యానమున్ను వాక్యార్థజ్ఞానమున్ను భిన్నభిన్నవిషయములను గుఱించిన వనియెదవా? అట్లగు పక్షమున, ధ్యానము వాక్యార్థజ్ఞానమునకు సాధనభూతమైనది కానేరదు. ఏలననిన, ఒక్కదానిని ధ్యానించుటచే వేఱొక్కదాని సాక్షాత్కారము గలుగుట యెచటను లేదు. తెలిసికొనఁబడిన విషయమును పలుమాఱు స్మరించుకొనుటను గదా ధ్యాన మందురు. కావున, నట్టి ధ్యానము నొనర్చుటకు పూర్వము వాక్యార్థజ్ఞానము అవశ్యముగా నుండియుండ వలయును. [1]ధ్యానింపఁబడునదియగు బ్రహ్మమును గుఱించిన జ్ఞానమును గలుగఁజేయునది వేఱొక్కటి యగుటయును అసంభవము. ఒకవేళ, అట్టి ధ్యానమునకు మూలభూతమగు జ్ఞానము వాక్యాంతరములనుండి గలుగుచున్నదనియు, అవిద్యను బోగొట్టునట్టి జ్ఞానము "తత్త్వమసి" ఇత్యాది మహావాక్యములనుండి గలుగుచున్నదనియును చెప్పెదవా? అట్లంటివేని, ఇందొక్కటి విచారింపవలసియున్నది. వాక్యాంతరములనుండి గలుగునట్టిదియు ధ్యానసాధనమునగు జ్ఞానమున్ను, "తత్త్వమసి" ఇత్యాది మహావాక్యములనుండి గలుగు జ్ఞానమును ఈరెండును ఒక్కటియే విషయమును

ధ్యానము వాక్యార్థజ్ఞానమును గలుగఁజేయదు.

---

(1) ధ్యానమునకు హేతుభూతమగు జ్ఞానము వేఱొక్కదానినుండి గలుగునది కావున ధ్యానము, తరువాత గలుగునట్టి వాక్యార్థజ్ఞానమువలనఁ గలుగునది కాదు. ఇట్లు ధ్యానమును వాక్యార్థజ్ఞానమునున్ను గలుగఁజేయు సామగ్రులకు భేద ముండుటంజేసి యీ తావున అన్యోన్యాశ్రయ దోషములేదని పూర్వపక్షి సమాధానము చెప్పవచ్చును. అయితే ధ్యానింపఁబడు బ్రహ్మము ప్రత్యక్షాది ప్రమాణములకు విషయమగునది కాదు గాన, నట్టి బ్రహ్మమును గుఱించిన జ్ఞానము వేఱొక్కహేతువునుండి గలుగునది యని చెప్పఁదగదని తాత్పర్యము.

గుఱించినవియేనా? కాక, వానిలో నెక్కటి యొక విషయమును గుఱించినదియు, వేఱొక్కటి వేఱొక్క విషయమును గుఱించినదియునా? ఈ రెండును ఒక్కటియే విషయమును గుఱించినవి యగు పక్షమున, పూర్వము గానఁబఱచిన ప్రకారము, ఇతరేతరాశ్రయ దోషము సంభవించును; కాక, ఈ రెండును భిన్న భిన్న విషయములను గుఱించినవి యంటివేని, ఒకవిషయమును గుఱించిన ధ్యానము వేఱొక్క విషయమును గుఱించిన యథార్థజ్ఞానమును (సాక్షాత్కారమును) గలుగఁజేయుట యసంభవము. ఇంతియె కాక, ధ్యానమునఁబడునది ధ్యానింపఁబడు పదార్థము, ధ్యానముజేయువాఁడు ఈ మొదలగు ననేకవిధ ప్రపంచము నపేక్షించి యుండునది గాన, నది నిష్ప్రపంచ బ్రహ్మైకత్వమును తెలుపునట్టి వాక్యార్థజ్ఞానమును గలుగఁజేయుటయందు, మునుఁ గానఁబడురీతిని, యుపయోగపడనేరదు. కాఁబట్టి వాక్యార్థజ్ఞానమాత్రమున నవిద్యానివృత్తి గలుగు నంటివేని, నీమతమున శ్రుతియందుఁ జెప్పఁబడిన శ్రవణ మనన నిదిధ్యాసనవిధులు నిరర్థకములే యగును.

కావున కేవలవాక్యము వలన నపరోక్షజ్ఞానము గలుగదు గాన, వాక్యార్థజ్ఞానమువలన నవిద్య నివర్తింపదు. కావుననే [1]జీవన్ముక్తియును కలదని చెప్పుట కెంతమాత్ర మవకాశముండదు —

---

(1) జీవన్ముక్తః = జీవన్నేవ ముక్తః — జీవించియుండగానే ముక్తుఁడు అనఁగా ఆత్మజ్ఞానముచే మాయాబంధరహితుఁడని యర్థము. కనుకనే దేవీభాగవతమున,

శ్లో॥ జీవన్ముక్తస్స రాజర్షిః బ్రహ్మజ్ఞానమతిః శుచిః।
తథ్యవక్తాతిశాన్తశ్చ యోగీ యోగప్రియస్సదా ॥

తా॥ ఆ రాజర్షి బ్రహ్మజ్ఞానముగల మనస్సుగలవాఁడును, త్రికరణశుద్ధిగలవాఁడును, అసత్యము పలుకని వాఁడును, ఎక్కువ శాంతము గలవాఁడును, యోగసంపన్నుఁడును, ఎల్లప్పుడు యోగప్రియుఁడు నయినందున జీవన్ముక్తుఁడు.

ఈ జీవన్ముక్తుని స్వరూపమునుగుఱించి యిట్లు చెప్పఁబడియె. ‘‘స్వస్వరూపాఖండశుద్ధబ్రహ్మజ్ఞానేన తదజ్ఞానబాధనద్వారా స్వస్వరూపాఖండే బ్రహ్మణి సాక్షాత్కృతేసతి అజ్ఞాన తత్కార్య సంచిత కర్మసంశయ విపర్యయాదీనామపి బాధితత్వాత్ అఖిలబంధరహితో బ్రహ్మనిష్ఠః’’ అనఁగా ‘‘స్వస్వరూపమును, భేదశూన్యమును, పరిశుద్ధమును నగు బ్రహ్మమును గుఱించిన జ్ఞానముచే నట్టి బ్రహ్మము విషయమైన యజ్ఞానము బాధింపఁబడగా, అందు మూలముగ స్వస్వరూపమును, అఖండమునగు బ్రహ్మము సాక్షాత్కరింపఁబడగా, అజ్ఞానమును అట్టి యజ్ఞానమువలనఁ గలిగిన సంచితకర్మమును, సంశయ విపర్యయాదులను బాధితములగుటంజేసి, సమస్తములయిన బంధములను విడిపోయినవాఁడు బ్రహ్మనిష్ఠుఁడు. అతఁడు జీవన్ముక్తుఁడనఁబడుచున్నాఁడు.’’ ఇట్లే శ్రుతియును తెలుపుచున్నది.

ఎట్లనిన, జీవన్ముక్తి యనఁగా నేద్ది? శరీరముతోనుండగానే ముక్తి గలుగుట యనియెదవా? అట్లంటివేని, "నాతల్లి గొడ్డురాలు" అను మాటవలె నీవు చెప్పునది యసంగతము. మఱియు "అశరీరుఁడుగా నుండుట" మోక్షమనియు "సశరీరుఁడుగా నుండుట" బంధమనియు నిట్లు బంధమోక్షములను శ్రుతిప్రమాణమునుబట్టి నీవే ప్రతిపాదించియుంటివే?

జీవన్ముక్తి నిరసనము.

సాక్షాన్మాయావాది—"శరీరముతోఁ గూడియుండువాఁడను" అనెడి జ్ఞానమున్నప్పుడు, ఎవ్వని కట్టి జ్ఞానము మిథ్యయని తెలియవచ్చునో, అట్టివానికి అట్టి "శరవంతుఁడను" అనెడి యభిమానము పోవుటయే జీవన్ముక్తి.

---

శ్రు॥ "భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః
క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే॥"

తా॥ పరావరుఁడగు బ్రహ్మము సాక్షాత్కరింపఁబడఁగా, హృదయగతమును నజ్ఞానరూపము నగు బంధము విడిపోవుచున్నది. అన్ని సంశయములును ఛిన్నములగుచున్నవి. అట్టి పురుషుని సంచిత కర్మములును నశించుచున్నవి,

ఈతఁడు, జాగ్రదవస్థయందు మాంస శోణిత పురీషాది భాజనమగు శరీరముచేతను, ఆంధ్య మాంద్య పటుత్వాదులకు భాజనమగు చక్షురాదీంద్రియ సముదాయముచేతను, శోక మోహాదులకు భాజనమగు అంతఃకరణముచేతనున్ను పూర్వపూర్వ వాసనావశమునఁ జేయఁబడు కర్మములను, ఇప్పుడు అనుభవింపఁబడునవియు, జ్ఞానముతో విరోధింపనివియునగు ప్రారబ్ధకర్మములనున్ను జూచుచున్నను, అవి బాధితము లగుటంజేసి వానిని పరమార్థభూతములనుగాఁ జూడఁడు. దృష్టాంతము—గారడివాఁడు కల్పించు వస్తువులను జూచుచున్నను, అది యంతయు నింద్రజాలమని యెఱింగియుండువాఁడు వానిని పరమార్థభూతములనుగాఁ దెలిసికొనఁడు గదా! అట్లే ప్రకృతమునను ఎఱుంగునది. అట్లే "సచక్షు రచక్షురివ సకర్ణోఽకర్ణ ఇవ సమనా అమనా ఇవ సప్రాణో ఽప్రాణ ఇవ" అను శ్రుతివాక్యము తెలుపుచున్నది. స్మృతియందును,

శ్లో॥ సుషుప్తవజ్జాగ్రతి యో న పశ్యతి ద్వయం చ పశ్యన్నపి చాద్వయత్వతః।
తథాపి కుర్వన్నపి నిష్క్రియశ్చ యః। స ఆత్మవిన్నాన్య ఇతీహ నిశ్చయః॥

తా॥ ఎవఁడు, పరమార్థముగ శీతోష్ణాది ద్వంద్వ సంబంధము లేనివాఁడయినందున, జాగ్రత్తునం దట్టి ద్వంద్వ పదార్థములను జూచుచున్నను, సుషుప్తియందువలెనే వానిని జూడనివాఁడో, మఱియు నతఁడు కార్యములను జేయుచున్నను, యథార్థముగా నెట్టి కార్యమును జేయనివాఁడో అతఁడే ఆత్మవేత్తగాని వేఱొక్కఁడు కాఁడు.

ఇట్టివానికి జ్ఞానము గలుగుటకు పూర్వముండునవియేయగు ఆహార విహారాదులు అనువర్తించునట్లు, శుభవాసనలే యనువర్తించును, లేక, అతఁడు శుభవాసనలతోఁగాని యశుభవాసనలతోఁగాని సంబంధము లేక, యుదాసీనుఁడుగానైన నుండును. అట్లే శాస్త్రమునఁ జెప్పియున్నది:

ధ్యాననియోగవాది:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, మిథ్యయనెడి జ్ఞానముచే "శరీరముతోఁ గూడియుండుట" నివర్తించునేని, జీవన్ముక్తి (శరీరముతో గూడియుండగా ముక్తి) యెట్లు సంభవము? శరీర వియోగమును పొందినవాని విషయమునను శరీరముతో గూడియున్నాననెడి మిథ్యాజ్ఞానము నివర్తించుటవలననే గదా ముక్తి చెప్పఁబడుచున్నది. కావున. జీవన్ముక్తియనఁగా విశేషమేమున్నది?

సాక్షాన్మాయావాది:—"శరీరముతోఁ గూడియున్నాను" అనెడి జ్ఞానము బాధింపఁబడినను, అది (తిమిరరోగవశమున) ద్విచంద్రజ్ఞానమువలె నెవ్వనియెడల ననువర్తించుచున్నదో, వాఁడు జీవన్ముక్తుఁడు.

ధ్యాననియోగవాది:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, అట్టి బాధకజ్ఞానము బ్రహ్మవ్యతిరిక్తములగు సమస్తవస్తువులను బాధించునది గాన, శరీరయుక్తుఁడననెడి తలంపుతోఁగూడ, అందులకుఁ గారణభూతమగు నవిద్యయును, కర్మమును ఈ మొదలుగాఁగల దోషములు బాధింపఁబడుచున్నవి. అట్లు బాధిం

---

శ్లో॥ బుద్ధాద్వైత సతత్త్వస్య యథేష్టాచరణం యది।
శునాం తత్త్వదృశాం చైవ కో భేదోఽశుచి భక్షణే॥

తా॥ అద్వైత తత్త్వమును బాగుగాఁ దెలిసికొనినవాఁడు యథేష్టముగా సంచరించునట్లైన, అశుచి భక్షణము విషయమై శునకములకును తత్త్వవేత్తలకును భేదమేమున్నది?

అట్టి సమయమున అమానిత్వము మొదలగు జ్ఞానసాధనములును అద్వేష్టృత్వము మొదలగు సద్గుణములును అలంకారమువలెనే యనువర్తించుచున్నవి, కనుకనే,

శ్లో॥ ఉత్పన్నాత్మావబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః।
అయత్నతో భవన్త్యస్య న తు సాధనరూపిణః॥

తా॥ ఇట్టి యాత్మజ్ఞానముగలవాని యెడల అద్వేష్టృత్వాదిగుణములు అప్రయత్నపూర్వకముగానే యుండును. అందులకై సాధనానుష్ఠాన మక్కఱలేదు అని చెప్పఁబడినది.

ఫలితార్థమేమన్నను, ఈతఁడు ఇచ్ఛవలనఁగాని ఇచ్ఛారాహిత్యమువలనఁగాని, వేఱొక్కదానిని గుఱించిన యిచ్ఛవలనఁగాని గలిగిన సుఖదుఃఖరూపములగు ప్రారబ్ధ కర్మఫలముల ననుభవించుచు, అంతఃకరణాద్యవభాసములకును అవభాసకుఁడగుచు, అట్టి ప్రారబ్ధ కర్మఫలానుభవము పూర్తియయినప్పుడు, ప్రత్యగానంద పరబ్రహ్మమున ప్రాణము లీనముకాఁగా, అజ్ఞానమును తత్కార్యములును నశించుటంజేసి, పరమకైవల్యమును, అనంతైకరసమును, అఖిలభేద ప్రతిభానరహితమునగు బ్రహ్మముగా నగును. కనుకనే శ్రుతియును "న తస్య ప్రాణా ఉత్క్రామన్తి అత్రైవ సమవలీయన్తే." అనఁగా "అట్టి యాత్మవేత్తయొక్క ప్రాణములు బయలువెడలవు ఇక్కడనే లీనమగుచున్నవి" అని చెప్పుచున్నది. కావున నిట్లు అజ్ఞానవశమున బద్ధుఁడ ననుకొనుచున్నాఁడేగాని, వాస్తవమున నీతఁడు ముక్తుఁడే గాన, జ్ఞానము గలుగఁగానే యట్టి ముక్తుఁడే ముక్తుఁడగుచున్నాఁడు.

పఁబడినవి మరల అనువర్తించుట యసంభవము. ఒక్కఁడే యగు చంద్రుఁడు రెండుగాను గానఁబడు తావుల నన్ననో, అట్లు గానఁబడుటకు హేతుభూత మగు దోషము (తిమిరరోగము) చంద్రుఁడొక్కఁడే యనెడి బాధక జ్ఞానమునకు విషయభూతమైనది గానందున నది దానిచే బాధింపఁబడక యనువర్తించు చునే యుండుట సంభవము.

ఇంతియె కాక, "తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సంపత్స్యే" (ఛా. ౬ ప్ర. ౧౪ ఖ. ౨ వా.) అను శ్రుతివాక్యము "బ్రహ్మవేత్తకు శరీరవియోగము గలుగువఱకు మాత్రము మోక్షమును పొందుటకు విళంబము గలదు. అనంతర మతఁడు పరమాత్మను పొందుచున్నాఁడు" అనుటచే బ్రహ్మ విద్య ననుష్ఠించువానికి ముక్తి గలుగవలయునన్న, శరీరవియోగమాత్ర మపేక్షితమని తెలుపుచు, నిందుమూలముగా జీవన్ముక్తిని (జీవించియుండగానే ముక్తి గలుగుటను) నివారించుచున్నది.

ఆపస్తంబ మహర్షియును జీవన్ముక్తిని నిరసించియున్నాఁడు. ఎట్లనిన, "వేదానిమం లోకమముంచ పరిత్యజ్యాత్మాన మన్విచ్ఛేత్. బుద్ధేక్షేమ ప్రాపణం త చ్ఛాస్త్రై ర్విప్రతిషిద్ధం. బుద్ధేచేత్ క్షేమప్రాపణ మిహైవ న దుఃఖముపలభేత ఏతేన పరం వ్యాఖ్యాతం" అనఁగా "ధర్మార్థకామ సాధకములగు కర్మములను, వానివలనఁ గలుగు ఐహికాముష్మిక ఫలములనున్ను వదలుకొని, పరమాత్మను వెదకునది. వాక్యార్థజ్ఞానము గలిగినతోడనే మోక్షము గలుగుననుట, నిదిధ్యాసనమును, శరీరపాతమును, అర్చిరాదిమార్గ ప్రయాణమునున్ను విధించునట్టి శాస్త్రములకు విరుద్ధము. అట్లు వాక్యార్థజ్ఞానము గలిగినతోడనే మోక్షము గలుగునేని, యీ లోకమున నెన్నఁడును దుఃఖములను పొందక యుండవలసివచ్చును. ఇందు మూలముగ షోడులోమ్యాదులు చెప్పునదియును నిరసింపఁబడినది." అనుటచే జ్ఞానమాత్రమున మోక్షము గలుగుననెడి వాదము సయితము నిరసింపఁబడినది. కావున, అన్ని విధములయిన భేదజ్ఞానములును నివర్తించుట యనఁబడు ముక్తి జీవించియుండగానే కలుగుట యసంభవము.

కాఁబట్టి పరబ్రహ్మసాక్షాత్కారరూపమగు ఫలమును గలుగఁజేయునది యేయగు ధ్యానవిధిచే బంధనివృత్తి అనఁగా మోక్షము గలుగును.

సాక్షాన్మాయావాదిః—మోక్షమనఁబడునది యొకవిధిచే సాధింపఁబడునదియగు పక్షమున, నది యనిత్యమని ప్రసక్తించునే?

ధ్యాననియోగవాదిః—అట్లు చెప్పఁదగదు. అట్లు సాధింపఁబడునది ప్రతిబంధనివృత్తి మాత్రమే, నియోగము సాక్షాత్తుగ బంధనివృత్తిని గలుగఁజే

యను. అయితే ప్రపంచరహితమై జ్ఞానైకరసమగు బ్రహ్మమునుగుఱించిన యప రోక్షజ్ఞానము అట్టి బంధనివృత్తిని గలుగఁజేయుచున్నది. నియోగమన్ననో, అట్టి యపరోక్షజ్ఞానమును గలుగఁజేయుచున్నది.

సాక్షాన్మాయావాది:—నియోగము జ్ఞానమునెట్లు గలుగఁజేయును ?

ధ్యాననియోగవాది:—మీమతమున ఫలాపేక్షలేక యొనర్పఁబడినట్టి కర్మము జ్ఞానము నెట్లు గలిగించుచున్నది ?

సాక్షాన్మాయావాది:—కర్మముల ననుష్ఠించుటచే మనస్సు నిర్మలమ గును. అందుమూలముగ జ్ఞానము గలుగుచున్నది.

ధ్యాననియోగవాది:—అట్లే నామతమున నని యెఱుంగుము.

సాక్షాన్మాయావాది :—నామతమున మనస్సు నిర్మలముకాఁగా శాస్త్ర మువలన జ్ఞానము గలుగఁజేయఁబడుచున్నది. మీమతమున మనస్సు నిర్మలము కాఁగా, అందు జ్ఞానమును గలుగఁజేయునట్టి సాధనమెద్ది ?

ధ్యాననియోగవాది :—ధ్యానమునుగుఱించిన నియోగముచే నిర్మల మయిన మనస్సే అందులకు సాధనము.

సాక్షాన్మాయావాది:—అది మీకెట్లు తెలియును ?

ధ్యాననియోగవాది:—కర్మానుష్ఠానముచే మనస్సు నిర్మలమగుచున్నద నియు, అట్లు మనస్సు నిర్మలముకాఁగా, శ్రవణమనన నిదిధ్యాసనముల మూల ముగా నితరవిషయములయందుఁ బ్రవర్తింపని వానికి శాస్త్రవాక్యము బంధ నివర్తకమగు జ్ఞానమును గలుగఁజేయుచున్నదనియును మీకెట్లు తెలియును ?

సాక్షాన్మాయావాది :—“వివిదిషంతి యజ్ఞేన దానేన తపసా నాశకేన” (బృ. ౬ అ. ౪ బ్రా. ౨౨ వా.) అనియు, “శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసి తవ్యః” (బృ. ౬ అ. ౨ బ్రా. ౬ వా.) అనియు, “బ్రహ్మవేద బ్రహ్మైవభవతి” (ము. ౩ ము. ౨ ఖ. ౯ వా.) అనియు నీ మొదలగు శాస్త్రవాక్యములవలన నట్లు తెలియవచ్చుచున్నది.

ధ్యాననియోగవాది :—“శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః” అనియు, “బ్రహ్మవిదాప్నోతి పరం” (తై. ఆ. ౧ అను.) అనియు, “న చక్షుషా గృహ్యతే నాపి వాచా” (ము ౩ ము. ౧ వా.) అనియు, “మనసా తు విశు ద్ధేన” అనియు, “హృదామనీషా మనసా భిక్లృప్తః” (కఠ. ౬ వ. ౯ వా) (మనోనిశ్చయమును భక్తియునుగలవాఁడే పరమాత్మను సాక్షాత్కరించుచు న్నాఁడు) అనియు, నీ మొదలగు శాస్త్రవాక్యములనుబట్టి, ధ్యాన నియోగ మువలన మనస్సు నిర్మలమగుచున్నదనియు, అట్టి నిర్మలమగు మనస్సు బ్రహ్మ

పరోక్ష జ్ఞానమును గలుగఁజేయుచున్నదనియును నాకును తెలుసును. కావున దోషము లేదు.

సాక్షాన్మాయావాది:—“నేదం యదిద ముపాసతే” అను శ్రుతివాక్యము “మీరు దేనిని ఉపాసించుచున్నారో, అది బ్రహ్మముకాదు” అనుచు బ్రహ్మము ఉపాసింపఁదగిన దగుటను నిషేధించుచున్నదే?

ధ్యాననియోగవాది:—అట్లు చెప్పఁదగదు. ఈ పై శ్రుతివాక్యము బ్రహ్మము ఉపాసింపఁదగినది (ఉపాసనమునకు విషయమగునది) కాదని చెప్పుచుండ లేదు. అయితే బ్రహ్మము జగత్తుకంటెను విలక్షణమైన స్వభావము గలదని ప్రతిపాదించుచున్నది. అనఁగా జనులే జగత్తును ఉపాసించుచున్నారో, అది బ్రహ్మము కాదు. ఏది వాక్కుచే ప్రకాశింపఁజేయుట కశక్యమైనదో, మఱియు దేనిచేత వాక్కు ప్రకాశింపఁబడుచున్నదో, అదియే బ్రహ్మము” అని యీ పై శ్రుతి యొక్క యర్థము. అట్లు కాకున్న, “తదేవ బ్రహ్మ త్వం విద్ధి” అను తావున “దానినే బ్రహ్మమునుగా నుపాసింపుము” అనుట విరోధించును. మఱియు నిచట ధ్యానమునుగుఱించి విధించుటయును నిరర్థకమగును. కావున బ్రహ్మసాక్షాత్కారరూపమగు ఫలమును గలుగఁజేయునట్టి ధ్యానవిధిచేతనే యసత్యమును, సమస్త ద్రష్టృదృశ్యాది ప్రపంచరూపమునగు బంధము నివర్తించును.

☞ ధ్యాననియోగవాదియగు మాయావాది భాస్కరమతమును దూషించుటకై దానిని ఉపన్యసించుచున్నాఁడు.

భేదాభేదములకు పరస్పరము విరోధములేదని కొందఱు చెప్పుచున్నారు. అట్లు చెప్పుట యుక్తము కాదు. ఏలననిన, ఒక్కటియే వస్తువునందు (పరస్పర విరుద్ధములగు) శీతోష్ణములు గాని, తమః ప్రకాశములుగాని యుండుట యసంభవమగు చందంబున, భేదాభేదములును ఒక్కటియే పదార్థమునఁ గూడియుండుట యసంభవము. ఒకవేళ వారిట్లు వాదింపనచ్చును:—

ద్వైతాద్వైతమతోపన్యాసము

సమస్త పదార్థములును అవి తెలియవచ్చురీతినిబట్టి “ఇవి యిట్టివి” యని నిశ్చయింపఁదగినవి. అయితే, యవి భిన్నములుగాను, అభిన్నములుగానును తెలియవచ్చుచున్నవి. ఎట్లనిన, కారణస్వరూపమునుబట్టియు, జాతిస్వరూపమునుబట్టియును చూడగా, నవి యభిన్నములు గాను గానఁబడుచున్నవి. మఱియు, కార్యస్వరూపమును బట్టియు, వ్యక్తిస్వరూపమునుబట్టియును చూడగా, నవి భిన్నములుగాను తెలియవచ్చుచున్నవి. ఎండనీడలు మొదలగువానికిఁగల విరోధ మనఁబడునది యవి రెండును కలిసియుండనివి యగుటయు, భిన్నభిన్న వస్తువులయందుండునవి యగుటయు, నిర్విధమైనది. ఇట్లు ద్విపధమగు విరోధమును కార్యకారణ పదార్థ

ముల మొదలఁగాని, జాతివ్యక్తుల మొదలఁగాని యుండునదిగాఁ దెలియరాదు. అయితే యొక్కటియే వస్తువు రెండురూపములు గలదిగాను గానఁబడుచున్నది. దృష్టాంతము:—మృత్తు యీ ఘటము, కుంటియావు, బోడియావు.—ఇంతియె కాక, లోకమున నెట్టి పదార్థమును ఒక్కటియే రూపము గలదిగాను గానఁబడుచుండలేదు. తృణాదులను అగ్న్యాదులవలెనే అభేదము భేదమును నశింపఁజేయునది గానును గానఁబడుచుండలేదు. కావున, భేదాభేదములకు నాశ్యనాశకభావరూపమగు విరోధమున్ను లేదు. ఏలననిన, ఏవి మృత్తు గాను, సువర్ణము గాను, గోవుగాను, అశ్వముగాను నున్నవో, అవియే, క్రమముగ, ఘటము గాను, మకుటము గాను, కుంటిది గాను, ఆడ గుఱ్ఱముగాను నున్నవి. భిన్నముగాను, అభిన్నముగాను నుండునదియగు పదార్థము యొక్క భేదమున్ను అభేదమున్ను ఒక్కటియే యాకార మగుటకు ఈశ్వరాజ్ఞ యెద్దియును లేదు గదా! తెలియవచ్చు రీతినిబట్టి యొక్కటియే యాకారము గలది యనియెదవేమో? అట్లుంటివేని, తెలియవచ్చురీతినిబట్టియే భిన్నమనియు, అభిన్నమనియు నిట్లు రెండువిధములగు నాకారములు గలదియనియు నంగీకరింపవలయును. ఘటము, శరావము, కుంటియావు, బోడియావు ఈ మొదలగునవి గానఁబడునపుడు, కండ్లు బాగుగాఁ దెఱచి చూచినను "ఇది మృత్తిక అది ఘటము" అనియు "ఇది గోజాతి అది గోవ్యక్తి" అనియు నివ్విధముగ వానిని వేఱుగాఁ దెలిసికొన నేరఁడు. అయితే అట్టివాఁడు "ఈమృత్తిక ఘటము, కుంటియావు" అని యివ్విధముననే తెలిసికొనుచున్నాఁడు. అను వర్తమానములుగాఁ దెలియవచ్చునవి కారణమును జాతియు ననియు, వ్యావర్తమానములుగాఁ దెలియవచ్చునవి కార్యమును వ్యక్తియుననియు నిట్లు వానిని విభజనపూర్వకముగాఁ దెలిసికొనుచున్నాఁడని చెప్పెదవా? అట్లు చెప్పఁదగదు. ఏలననిన, అట్లు విలక్షణమైన యాకారము తెలియవచ్చుచుండలేదు. పరిశీలన పూర్వకముగాఁ జూచువారలకును సమక్షమున నుండు పదార్థమున నిది యనువర్తమానమైనది, అది వ్యావర్తమానమైనది యని యివ్విధముగా నాకారభేదము తెలియరాదు. కార్యమును, వ్యక్తియును ఒక్కటియేవస్తువనెడి జ్ఞానమును గలుగఁజేయునట్లు, కార్య కారణములును జాతివ్యక్తులును ఒక్కటియేవస్తువనెడి జ్ఞానమును గలుగఁజేయుచున్నవి. ఇట్లే దేశమునుబట్టియు, కాలమును బట్టియు, ఆకారమును బట్టియును ఎక్కువ విలక్షణములగు పదార్థముల విషయమైయ్యును "అదియే యిది" యనెడి ప్రత్యభిజ్ఞ గలుగుచున్నది. ఇట్లు ప్రతిపదార్థమున్ను రెండువిధములైనదిగాఁ దెలియవచ్చుచుండుటంజేసి, కార్య కారణములును, జాతివ్యక్తులును ఎక్కువ విలక్షణము లయినవని ప్రతిపాదించుట యనఁబడునది యవి తెలియవచ్చు రీతినిబట్టి బాధిత మగుచున్నది.

"ఈ మృత్తు ఘటము, కుంటియావు" అను తావులనువలెనే "నేను దేవుఁడను, నేను మనుష్యుఁడను" అను తావులను సామానాధికరణ్యమును బట్టి నైక్యము తెలియవచ్చుటచే దేహాత్మలుఁన్ను భిన్నములనియు అభిన్నములనియును ప్రసక్తించును. కావున, భేదాభేదములను నుపపాదించుట తనయింటికి తానే నిప్పు పెట్టుకున్నట్లున్నది" యని యందువేమో; అట్లు చెప్పఁదగదు. ఏలననిన, భేదాభేదములను సాధించునట్టి సామానాధికరణ్యము యొక్కయు, దాని యర్థముయొక్కయును యాథాత్మ్యము నెఱుంగమిచే పై వాదము గల్పింపఁబడినది. ఎట్లనిన, ఎవ్విధమైన బాధకమును లేనిదియేయగు జ్ఞానము అంతటను అర్థమును నిశ్చయించుచున్నది. "నేను దేవుఁడను" ఇత్యాది దేహాత్మాభిమాన రూపమగు జ్ఞానమున్ననో, ఆత్మయొక్క యథార్థస్వరూపమును తెలుపునట్టి సమస్త ప్రమాణములచేతను బాధింపఁబడునది. కావున నది రజ్జువును, గుఱించి సర్పును నెడి (భ్రాంతి) జ్ఞానమునంటిదిగాన, దేహాత్మల కభేదమును సాధింపదు. "కుంటియావు బోడియావు" అనెడి, సామానాధికరణ్య మన్ననో, యే ప్రమాణముచేతను, ఏ తావునను, బాధింపఁబడదు. కావున నిచట అతిప్రసంగ మెద్దియును లేదు.

కావుననే జీవుఁడును బ్రహ్మముకంటెను అత్యంతము భిన్నమయినవాఁడు కాఁడు. అయితే, యతఁడు బ్రహ్మముయొక్క యంశమగుటంజేసి బ్రహ్మముకంటె భిన్నుఁడును అభిన్నుఁడును. అందు అభేదము స్వాభావికము. భేదమన్ననో, ఉపాధివలనఁ గలిగినది. అది యెట్లు తెలియుననిన, "తత్త్వమసి" అనియు, "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" అనియు, "అయ మాత్మా బ్రహ్మ" అనియు నీ మొదలగు శ్రుతులవలనను, ఆథర్వణికుల సంహితోప నిషత్తునందలి బ్రహ్మసూక్తమున, "బ్రహ్మైమే ద్యావా పృథివీ" అని యారంభించి "బ్రహ్మ దాశా బ్రహ్మ దాసా బ్రహ్మైమే కితవా ఉత, స్త్రీపుంసౌ బ్రహ్మణో జాతే స్త్రియో బ్రహ్మోత వా పుమాన్" (దాశ దాస కితవాదులు బ్రహ్మమే. బ్రహ్మమే స్త్రీగాను పురుషుఁడు గాను నాయెను. బ్రహ్మము స్త్రీయా? లేక, పురుషుఁడా?) అను వాక్యమున జీవాత్మ పరమాత్మల కభేదమును జెప్పియున్నందునను, "నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానాం" అనియు "జ్ఞాజ్ఞౌద్వావజా వీశనీశౌ" అనియు, "క్రియాగుణై రాత్మగుణైశ్చ తేషాం సంయోగహేతురవరోపి దృష్టః" "సంసార హేతువులగు గుణములయొక్కయు మోక్షహేతువులగు గుణములయొక్కయును సంయోగమునకు హేతువైనది వేఱొక్కటి గానఁబడుచున్నది." అనియు, "ప్రధాన క్షేత్రజ్ఞపతి ర్గుణేశః సంసార మోక్ష స్థితి బంధ హేతుః" "ప్రకృతి జీవుల కధిపతియు, గుణముల కీశుండును, సంసారమునకును, మోక్షమునకును, స్థితికిని, బంధమునకును హేతుభూతుఁడును" అనియు, "న కా

రణం కరణాధిపాధిపః" అనియు, "తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్న న్యోఽభి చాకశీతి" అనియు, "య ఆత్మని తిష్ఠన్" అనియు. "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః న బాహ్యం కిఞ్చన వేద" అనియు, "తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు భేదమును తెలుపుచున్నందుననున్ను, జీవాత్మపరమాత్మలు భిన్నములును అభిన్నములు నని యవశ్యముంగీకరింప వలయును. అందు "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" ఈ మొదలగు శ్రుతివాక్యములు "మోక్షావస్థయందు జీవుఁడు బ్రహ్మస్వరూపమును బొందుచున్నాఁడు" అని తెలుపుచున్నందునను, యత్ర త్వస్య సర్వమాత్మైవా భూత్తత్కేన కం పశ్యేత్" అను శ్రుతివాక్యము అట్టి సమయమున ఈశ్వరుని తనకంటెను భిన్నునిగాఁ దెలిసికొనుటను నిషేధించుటవలననున్ను అభేదమే స్వాభావికమని తెలియవచ్చుచున్నది.

ఒకవేళ "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" అను శ్రుతివాక్యమున, "సహ బ్రహ్మణా = బ్రహ్మముతోఁగూడ" అని చెప్పియున్నందున, మోక్షావస్థయందును జీవబ్రహ్మములకు భేదము గలదని తెలియుచున్నదనియు, సూత్రకారులు నయితము "జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసన్నిహితత్వాచ్చ" (బ్ర. సూ. ౪ అ. ౪ పా. ౧౭ సూ.) అనియు, "భోగమాత్ర సామ్యలింగాచ్చ" (బ్ర. సూ. ౪ అ. ౪ పా. ౨౧ సూ.) అనియు నీ సూత్రములచే మోక్షావస్థయందును జీవబ్రహ్మములకు భేదము గలదని తెలిపి యున్నారని యును వాదించెదవేమో, అట్లు వాదింపఁదగదు. ఏలననిన, "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఈ మొదలగు నూఱుల కొలది శ్రుతులు ఆత్మలకు భేదము గలదను సంశయమును నిషేధించుచున్నవి. "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" అను శ్రుతివాక్యము "సమస్తములగు గుణములతోఁగూడ బ్రహ్మము ననుభవించుచున్నాఁడు" అని తెలుపుచున్నది. అనఁగా గుణవిశిష్టమగు బ్రహ్మము ననుభవించుచున్నాఁడని యర్థము. అట్లు కాకున్న. "బ్రహ్మముతోఁగూడ" అని యర్థమును చెప్పుకొంటిమేని, యిచట బ్రహ్మమునకు అప్రాధాన్యము ప్రసక్తించును. "జగద్వ్యాపారవర్జం" ఇత్యాది సూత్రముల యందు "ముక్తుఁడు సర్వేశ్వరునికంటె వేఱుగా నుండినచో వాని యైశ్వర్యమునకు న్యూనత ప్రసక్తించును" అని తెలుపఁబడును. అట్లు కాకున్న, "సంపద్యావిర్భావః స్వేనశబ్దాత్" (బ్ర. సూ. ౪ అ. ౪ పా. ౧ సూ) అను సూత్రముతో విరోధము గలుగును. కావున, అభేదమే స్వాభావికము.

బ్రహ్మమునుండి జీవులకును, జీవులకు పరస్పరము నుండునట్టి భేద మనఁబడునది బుద్ధీంద్రియ దేహరూపమగు నుపాధివలనఁ గలుగఁజేయఁబడినది. బ్రహ్మ

ము అవయవములు (విభాగములు) లేనిదియు, అంతట నుండునదియునైనను, ఘట మఠాది రూపములగు నుపాధులనుబట్టి యాకాశమున "ఘటాకాశము" "మఠాకాశము" ఇత్యాదిరూపముగు భేదము సంభవమగునట్లు బుద్ధీంద్రియ దేహాదిరూపమగు నుపాధినిబట్టి బ్రహ్మమునందును, భేదము తెలియవచ్చుట సంభవమే.

బ్రహ్మమునందు భేదమున్నచో, దానికి బుద్ధ్యాద్యుపాధులతో సంబంధము గలుగుచున్నది. మఱియు బుద్ధ్యాద్యుపాధులతో సంబంధమున్నచో, బ్రహ్మమున భేదము గలుగుచున్నది. కావున, ఈ తావున నన్యోన్యాశ్రయ దోషము ప్రసక్తించునని యందువేమో, అట్లు చెప్పఁదగదు. ఏలననిన, ఉపాధియును, తత్సంబంధమును కర్మమువలనఁ గలుగునవి. అట్టి కర్మప్రవాహము అనాది. ఇందు ఫలితార్థ మేమనఁగా, ఇంతకుఁబూర్వము జీవునికిఁగల కర్మమువలన ప్రకృతము అతనికిఁ గల శరీరేంద్రియాదులు గలిగినవి. ఈ శరీరేంద్రియాదులతో నీతనికిఁగల సంబంధమువలన నీతనికి కర్మము గలుగుచున్నది. ఇట్లు బీజాంకుర న్యాయప్రకారము కర్మోపాధుల సంబంధము అనాది యగుటంజేసి, దోషము లేదు. కావున, బ్రహ్మమునుండి జీవులకును, జీవులలోను పరస్పరము తమలోఁ దమకును అభేదమే స్వాభావికము. భేదమన్ననో, ఉపాధి వలనఁ గలిగినది. అయితే బ్రహ్మమునుండి ఉపాధులకును వానికిఁ దమలోఁ దమకును పరస్పరము అభేదమువలెనే భేదమున్ను స్వాభావికము. ఏలననిన, ఉపాధులకును వేఱొక్క యుపాధి యుండదు గదా. ఉపాధులకును వేఱొక్క యుపాధి యుండునేని, వానికిని వేఱొక్క యుపాధి యుండవలయును వానికిని వేఱొక్క యుపాధి యుండవలయునని యివ్విధమున నొక వ్యవస్థ లేకపోవును. కావున, ఉపాధులు బ్రహ్మముకంటెను భిన్నములుగానును, అభిన్నములుగానును జీవుల కర్మముల కనుగుణముగ గలుగుచున్నవి.

☞ ఈపైని గానఁబఱచిన భాస్కరమతస్థుల వాదమును ధ్యాననియోగవాది యిట్లు దూషించుచున్నాఁడు.

వేదాన్తవాక్యము లన్నియును అద్వితీయమును, సచ్చిదానందస్వరూపము నగు బ్రహ్మమును గుఱించిన ధ్యానమును విధించునవి. కావున, వేదాంతవాక్యములచే అభేదమే తెలుపఁబడుచున్నది. భేదమన్ననో, భేదావలంబియగు కర్మకాండముచేతను, ప్రత్యక్షాది ప్రమాణములచేతనున్ను తెలుపఁబడుచున్నది. అయితే భేదాభేదములు పరస్పరము విరుద్ధము లగుటంజేసియు, అవిద్యామూలముగానైనను భేదము తెలియవచ్చుట సంభవ మగుటంజేసియును, అభేదమే పరమార్థమని చెప్పఁబడియె. అయితే భేదాభేదములు రెండును ప్రతిపదార్థమునందును తెలియవచ్చుచున్నందున, వీనికి పరస్పరము విరోధము లేదని భేదాభేద వాదులు చేయువాదము యుక్తమైనది కాదు. ఏలననిన, ఒక్కపదార్థము

వేఱొక్క-పదార్థమునుండి విలక్షణమైన దగుట భేదమనియు, అట్టిది కాకుండుట యభేద మనియును గదా చెప్పెదరు. అట్లు విలక్షణముగా నుండుటయు, ఉండక పోవుటయును ఒక్కటియే పదార్థమున నుండునవియని బుద్ధిమంతుఁ డెవ్వఁడును చెప్పఁడు.

కారణ స్వరూపమును బట్టియు, జాతి స్వరూపమును బట్టియును అభేద మును, కార్యస్వరూపమును బట్టియు, వ్యక్తి స్వరూపమును బట్టియును భేద మును సిద్ధించును. కావున నిట్లు ఆకారభేదముండుటనుబట్టి విరోధమే లేదం టివేని, యది యుక్తము కాదు. ఏలననిన, ఈ పై వాదము వికల్పములకు నిలువఁజాలదు. ఎట్లనిన, ఆకారభేదమును బట్టి విరోధము లేదని చెప్పియుంటివే, అట్లనఁగా నొక్క యాకారమున భేదమున్ను వేఱొక్క యాకారమున నభేదము న్ను ఉండునని యభిప్రాయమా? లేక, భేదమును అభేదమును అకారద్వయ విశిష్టమగు వస్తువునందుండునని యభిప్రాయమా? ఇందు మొదటిపక్షము నవ లంబించితివేని, భేదము వ్యక్తియం దుండునదియును అభేదము జాతియందుం డునదియును గాన, ఆకారద్వయ విశిష్టమగు నొక్కటియే వస్తువు లేకపోవును. జాతియును వ్యక్తియును ఒక్కటియే వస్తువనియెదవా? అట్లంటివేని, ఆకారభేద మునుబట్టి భేదాభేదములకు పరస్పరము విరోధము లేదను వాదమును వదలు కొనవలసి వచ్చును. ఏలననఁగా ఒక్కటియే వస్తువు విలక్షణమును విలక్షణ ముకానిదియు నగుట విరుద్ధమని యింతకుఁ బూర్వము చెప్పఁబడియె. రెండవ పక్షము నవలంబించితివేని, పరస్పరము విలక్షణములగు రెండు ఆకారములున్ను అట్టి యాకారద్వయమున కాధారభూతమై మనకు తెలయరాని వేఱొక్క వస్తువున్ను గలవని ప్రసక్తించును. అట్టి వస్తు వొక్కటి కలదని ఒప్పుకొనినను, ఈ మూఁడింటికిని అన్యోన్యవైలక్షణ్యమే ఉపపాదింపఁబడును గాని, వాని కభే దము ఉపపాదింపఁ బడదు. ఆకారద్వయమునకు విరోధము లేక యుండుటయే తదాశ్రయమగు వస్తువు భిన్నాభిన్నముగా నుండుట యనియెదవా? అట్లం టివేని, ఒక వస్తువు నాశ్రయముగాఁ గొనియుండునవియు, అట్టి వస్తువునుండి వేఱయినవియునగు రెండు ఆకారములు భేదాభేదరూపములగు రెండు పరస్పర విరుద్ధ ధర్మముల నా వస్తువునందు గలిసియుండు వానినిగా నెట్లు జేయఁగలవు? అవి యట్లు తమ కాధారమగు వస్తువునుండి యభిన్నములగు పక్షమున, నవి యట్లెంతమాత్రము చేయనే జాలవే? ఇంతయేకాక, అట్టి యాకారద్వయమున్ను, దాని కాశ్రయమగు వస్తువున్ను పరస్పరము విలక్షణములగు వస్తువు లంటివేని, వానికి, భేదాభేదమును గలుగఁజేయునది వేఱొక్కటి కావలసి వచ్చును. ఇట్లొక వ్యవస్థ లేకపోవును. ఏలననిన, ఒక్కటిగా నంగీకరింపఁ బడిన వ్యక్తి తెలియ వచ్చునట్లు, జాతితోఁ గూడియున్నట్టి వస్తువు ఏకరూపముగాఁ దెలియవచ్చుట

సంభవింపదు. ఏలననిన, లోకమున ప్రతి పదార్థమున్ను "ఇది ఇవ్విధమైనది" అని యిట్లు ఒక్క ప్రకారము (విధము) గాను, ఒక్క ప్రకారము గలదిగానును తెలియవచ్చుచున్నది. అందు ప్రకారాంశము జాతియును, అట్టి ప్రకారము గలది వ్యక్తియును గాన, నెద్దియును ఒకటియే యాకారముగలదిగాఁ దెలియ వచ్చుట లేదు.

కావుననే జీవుఁడును బ్రహ్మముకంటెను భిన్నుఁడును అభిన్నుఁడునగుట సంభవింపదు. ఇట్లు అభేదము నిరవకాశమగు శాస్త్రముచేఁ బ్రతిపాదింపఁ బడినది యగుటంజేసి, భేదము అనాద్యవిద్యా మూలముగాఁ గల్పింపఁబడినది యని సిద్ధమగుచున్నది. "అట్లగునేని, బ్రహ్మము అజ్ఞమనియు అట్టి బ్రహ్మముకే జన్మ మరణాది దోషములు గలుగుచున్న వనియును ప్రాప్తించును. అందువలన "యస్సర్వజ్ఞః సర్వవిత్" అనియు, "ఏష ఆత్మా ఉపహతపాప్మా" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు బాధింపఁబడునే?" యని వాదించెదవేమో, అట్లు వాదింపఁదగదు. ఏలననిన, అజ్ఞానము మొదలగు దోషములు వాస్తవ ముగ లేవు. నీ మతముననో, ఉపాధికంటెను, బ్రహ్మముకంటెనున్ను వేఱుగ మఱియొక్కటి యెద్దియును లేకుండుటంజేసి, యుపాధిసంబంధమును దానినుండి గలుగునట్టి జీవత్వాజ్ఞత్వాది దోషములును వాస్తవముగానే బ్రహ్మమునం దుండ వలసివచ్చును. బ్రహ్మము నిరవయవుఁడును, నిర్గుణుఁడును గాన, నట్టి బ్రహ్మ ముతో సంబంధించియుండునట్టి యుపాధులు బ్రహ్మమును భేదించిగాని ఛేదించి గాని దానితో సంబంధింపవు. అయితే యవి బ్రహ్మ స్వరూపముతోనే సంబం ధించినవై అందే తమ కార్యముల నొనర్చుచున్నవి.

ఒకవేళ మీరిట్లు తలంపవచ్చును:—ఉపాధియుక్తుఁడగు బ్రహ్మమే జీవుఁ డు. అతఁడు అణుపరిమాణుఁడు. ఏలననిన, అతనిని ఆవరించియుండు మనస్సు అణుపరిమాణము గదా! అట్టి యావరణము అనాది. ఇట్లు ఉపాధిచే నావరిం పఁబడిన బ్రహ్మాంశముతో సంబంధించి యుండునట్టి దోషములు అట్టి యుపా ధిచే నావరింపఁబడని పరబ్రహ్మముతో సంబంధింపవు—

మీరు ఈపైని గానఁబఱచిన ప్రకారము వాదించితిరేని, ఇందొకటి విచారింప వలసి యున్నది. జీవుఁడనఁగా ఉపాధిచే ఛేదింపఁబడి (వేఱుపఱుపఁ బడి) నట్టియు, బహుస్వల్పమగు బ్రహ్మఖండమా? లేక, అట్లు ఛేదింపఁబడకయే బహుస్వల్పమును, ఉపాధితోఁ గూడియుండునదియునగు బ్రహ్మప్రదేశవిశే షమా? లేక, ఉపాధితోఁ గూడియున్నట్టి బ్రహ్మస్వరూపమేనా? లేక, ఉపా ధితోఁ గూడుకొని యుండునట్టి వేఱొక్క చేతనపదార్థమా? లేక, ఉపాధి యేనా? జీవుఁడనఁగా బ్రహ్మముయొక్క ఖండమని చెప్పఁదగదు. ఏలననిన, బ్రహ్మము ముక్కలు ముక్కలుగా ఛేదింపఁదగినది కాదు గదా! అట్లగునేని, జీవుఁడు ఆది

గలవాఁడని ప్రసక్తించును. ఒక్కటిగా నుండుదానిని రెండుగాఁ జేయుటను గదా ఛేదన మందురు. ఉపాధిచే నావృతమగు బ్రహ్మప్రదేశమే జీవుఁడంటి వేని, (బ్రహ్మప్రదేశమే యుపాధితో సంబంధించియుండునది యయినందున) అట్టి యుపాధివలనఁ గలుగు దోషములు బ్రహ్మమునఁ బ్రసక్తించును. ఉపాధి చలించునపుడు తనతో సంబంధించియున్నట్టి బ్రహ్మప్రదేశము నది యాకర్షించుట యసంభవము గాన, ప్రతిక్షణమును ఉపాధి సంయుక్తములగు ప్రదేశములు వేఱువేఱయిన వగుటంజేసి ప్రతిక్షణమును బంధమోక్షములు గలుగుచుండవలసి వచ్చును. అట్టి యుపాధి యాకర్షింపఁ గలదంటివేని, బ్రహ్మము ముక్కలు ముక్కలుగా నుండునది కాక పోవుటంజేసి, బ్రహ్మమంతయును ఆకర్షింపఁ బడవలసి వచ్చును. అయితే అంశము లేవియును లేనిదియు, వ్యాపించి యుండునదియు నగు వస్తువు ఆకర్షింపఁబడుట యసంభవ మనియెదవా? అట్లంటివేని, యుపాధి మాత్రమే పోవునదియని ప్రసక్తించును. అందువలన పూర్వము గానఁబఱచిన దోషము (ప్రతిక్షణము బంధమోక్షములు గలుగుట) ప్రసక్తించును. ముక్కలు ముక్కలుగా నుండనివి యగు బ్రహ్మప్రదేశములయందే సర్వోపాధులును సంబంధించియుండు పక్షమున, సమస్త జీవులును బ్రహ్మముయొక్కయే ప్రదేశము లగుటంజేసి తామందఱు నొక్కటియే (అభిన్నులమే) యనెడి యను సంధానము గలుగవలసివచ్చును. అట్టి ప్రదేశములు భిన్నములగుటంజేసి యట్టి యనుసంధానము గలుగదంటివేని, జీవులలో నొక్కనికిని తన యుపాధి పోవునపుడు "అతఁడే నేను". అనెడి యనుసంధానము గలుగకపోవును. ఉపాధితోఁ గూడుకొనిన బ్రహ్మస్వరూపమే జీవుఁడంటివేని, బ్రహ్మస్వరూపమునకే యుపాధి సంబంధ ముండుటంజేసి యదియే జీవుఁడు గాన, అట్టి జీవునికంటె వేఱుగ ఉపాధి సంబంధము లేనట్టి బ్రహ్మమనఁబడున దొక్కటియు కలదని సిద్ధింపక పోవును. మఱియు నన్ని శరీరములలోను నొక్కఁడే జీవుఁడు ఉండియుండ వలసి వచ్చును. ఉపాధిచే నావరింపఁబడిన వేఱొక్క చేతన పదార్థము జీవుఁడను పక్షమున, జీవుఁడు బ్రహ్మముకంటెను వేఱయినవాఁడని ప్రసక్తించును. కావున, జీవుఁడనఁగా ఉపాధియుక్తుఁడగు బ్రహ్మమే యనెడి వాదమును వదలుకొనవలసి వచ్చును. ఉపాధియే జీవుఁడను పక్షమున, చార్వాకమతము నంగీకరించినట్లగును. ఇందు ఫలితార్థమేమున్నను, అభేదమును ప్రతిపాదించునట్టి శాస్త్రముయొక్క బలమువలన భేదజాతమంతయు నవిద్యామూలకమనియే యంగీకరింపవలయును. కావున ప్రవృత్తి నివృత్తిపరముగానే శాస్త్రము ప్రామాణికమని యంగీకరించినను, వేదాంతవాక్యములు ధ్యానవిధ్యంగముగా బ్రహ్మస్వరూపమును నిరూపించునట్టి ప్రమాణము లగుట యుపపన్నమే.

☞ఈపైని గానఁబఱచిన ప్రకారము ధ్యాననియోగవాది చేయువాదమును పూర్వమీమాంసకుఁ డిట్లు దూషించుచున్నాఁడు.

అట్లు చెప్పుట యుక్తముకాదు. ఏలననిన, వేదాంతవాక్యములు ధ్యానవిధ్యంగములే యయినను, అవి యొక పదార్థముయొక్క యునికిని నిరూపించునట్టి ప్రమాణములు కాఁదగవు. అది యెట్లనిన, బ్రహ్మస్వరూపమును తెలుపునట్టి వాక్యములు ధ్యానవిధివాక్యములతో నేకీభవించినవై బ్రహ్మస్వరూపమును గుఱించిన ప్రమాణము లగుచున్నవా? లేక, అవి స్వతంత్రములుగానే యట్టివి యగుచున్నవా? అవి ధ్యానవిధివాక్యములతో నేకీభవించినవియగు పక్షమున, నవి ధ్యానమును తెలుపుటయే తాత్పర్యముగాఁ గలవియగును. కావున, బ్రహ్మస్వరూపమును తెలుపుటయందు తాత్పర్యము గలవి కాఁదగవు. లేక, అవి స్వతంత్రములగు పక్షమున, ప్రవృత్తి నివృత్తి పరములు గానందున, నవి దేనిని తెలుపునవియే కాఁదగవు.

ధ్యాననియోగవాది:—ధ్యానమనఁగా నెడతెగని స్మృతి. అది యట్లు స్మరింపఁబడు పదార్థమును బట్టియే నిరూపింపఁదగినది. ధ్యానవిధి పరములగు వాక్యములు ధ్యానమును విధింపఁగా, అట్లు ధ్యానింపవలసిన వస్తువెద్ది యనెడి వివక్షరాఁగా, "ఇదం సర్వం యదయమాత్మా" అనియు, "బ్రహ్మ సర్వానుభూః" అనియు, "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనియు, నీ మొదలగు శ్రుతివాక్యములు అట్టి వస్తువుయొక్క స్వరూపమును గుణములనున్ను తెలుపుచున్నవి. కావున, నవి ధ్యానవిధి వాక్యములతోఁ జేరినవియేయై యొక వస్తువుయొక్క యునికిని తెలుపునట్టి ప్రమాణములు కాఁదగును.

పూర్వమీమాంసకుఁడు:—ఈపైని గనఁబఱచిన ప్రకారము ధ్యానవిధికి ధ్యానింపఁబడు వస్తువును గుఱించిన జ్ఞాన మావశ్యకమేయైనను, "నామ బ్రహ్మేత్యుపాసీత" ఇత్యాది తావులయందు దృష్టివిధులవలెనె వాస్తవముగా లేనట్టి వస్తువును గొనియైనను ధ్యానము ననుష్ఠించుట సంభవము. కావున నట్టి ధ్యానము ధ్యానింపఁబడువస్తువు వాస్తవముగా నుండి యుండుట నపేక్షింపదు. కావున వేదాంతవాక్యములు ధ్యానవిధ్యంగములే యైనను, ప్రవృత్తి నివృత్తి రూపమగు ప్రయోజనములేని వగుటంజేసి, ధ్యేయవస్తువుయొక్క స్వరూపాది విశేషములను మాత్రమే తెలుపునవి. ఒకవేళ అవి స్వతంత్రములుగానే యట్టివియగు పక్షమునను, బాలురకును రోగులకును సంతోషమును గలుగఁజేయుటకై మనము జెప్పునట్టి కథలవలె నవి వస్తుస్వరూపమును గుఱించిన జ్ఞానమును గలుగఁజేయుటచేతనే కార్యకరము లగుచున్నవి. గాన, నవి పరినిష్పన్న వస్తువుయొక్క సత్తను (ఉనికిని) తెలుపునట్టి ప్రమాణములు గావు. ఈ

హేతువులనుబట్టి బ్రహ్మము శాస్త్రప్రమాణముచేతనే తెలుపఁదగినది యగుట యసంభవము.

—౦-౦-◆◀ సిద్ధాంతము. ▶◆-౦-౦—

ఇట్లు పూర్వపక్షము రాఁగా, ఇందులకు సమాధానమును ఈ సూత్రము చేఁ జెప్పుచున్నారు. ఇందుండు "సమన్వయ" శబ్దమునకు "బాగుగానన్వయించుట" యని యర్థము. అనఁగా శ్రుతివాక్యములు పరమపురుషార్థభూతుఁడును, నిరవధికాతిశయానంద స్వరూపుఁడునగు బ్రహ్మమును తెలుపునవిగా నన్వయించునవి యగుటవలన (తత్=)బ్రహ్మము శాస్త్రప్రమాణము చేతను మాత్రము తెలుపఁ దగినది యగుట సిద్ధించుచునే యున్నదని ఫలితార్థము. బ్రహ్మము నిరస్తనిఖిల దోషుఁడును, నిరతిశయానంద స్వరూపుఁడునగుటచే (వేదాంతవాక్య సముదాయము,) అతనిని పరమ ప్రాప్యునిగాఁ దెలుపుచుండఁగా, నది ప్రవృత్తినిగాని నివృత్తినిగాని తెలుపని దగుటంజేసి ప్రయోజనరహితమైనదని పూర్వ మీమాంసకులు చేయువాదము, రాజభవనమున నుండు పురుషుఁడు శ్వమాంసాది భక్షకులగు నీచుల గృహమునకుఁ బోక యుండుటంజేసి నిష్ప్రయోజకుఁడను వాదమువలెనున్నది. ఫలితార్థమేమనఁగా, దేవాసుర గన్ధర్వ, సిద్ధ, విద్యాధర, కిన్నర, కింపురుష, యక్ష, పిశాచ, మనుష్య, పశు, పక్షి, సరీసృప, వృక్ష, గుల్మ, లతా, తృణాదిరూపములగు శరీరములు గల జీవు లనేకులు గలరు. వీరు స్త్రీలనియు, పురుషులనియు, స్త్రీ పురుష భేదము లేని వారనియు నిట్టి భేదములు గలవారు. వీరు తమతమ స్థితుల కనుగుణములగు వేఱువేఱు ధారకములును, పోషకములును, భోగ్యవస్తువులును గలవారు. వీరందఱును అనాదిగా వచ్చునట్టి కర్మరూపమగు నవిద్యతోఁ గూడి యున్నందున పరాపరతత్త్వముల యదార్థ స్వరూపమునున్ను, తమయొక్క స్వరూపమునున్ను యెఱుఁగక యున్నారు. ఇట్టి యవస్థయందు వేదాంతవాక్యములు బ్రహ్మ మనఁబడునది యొక్కటి కలదనియు, ఈ జీవు లట్టి కర్మరూపమగు నవిద్యనుండి వినిర్ముక్తులై ఆ బ్రహ్మమును తమనుండి వేఱువిధమైనదిగాని దానినిగాఁ దెలిసికొను నపుడు, బ్రహ్మము తన స్వరూపము వలనను, మాహాత్మ్యము వలనను, గుణములవలనను‌న్ను వారికి మితిలేని యానందమును గలుగఁ జేయునది యనియును తెలుపుచుండుటంజేసి ప్రయోజనవంతములు. ప్రవృత్తి నివృత్తులను తెలుపునట్టి వాక్యములన్ననూ, అందువలనఁ బొందఁబడునది యిట్టిదియని తెలిసిననే తప్ప ప్రయోజనవంతములు గావు. ఇట్టి సందర్భమున, ఆ పరబ్రహ్మమును బొందునట్టి విధమెద్ది? యనెడి వివక్షరాఁగా, "బ్రహ్మవిదాప్నోతిపరం" (తై. ఆ. ౧అను) "బ్రహ్మమును ఉపాసించువాఁడు ఉత్కృష్టమగు పదమును బొందుచున్నాఁడు" అనియు, "ఆత్మానమేవలోక ముపాసీత"

(బృ. 3 అ. ४ బ్రా. ౧౫ వా.) "ప్రాపకమగు బ్రహ్మమునే ప్రాప్యమునుగా నుపాసించునది" అనియు నివ్విధముగ వేదనాది శబ్దములచే నుపాసనము బ్రహ్మప్తికిగా నగు నుపాయముగా విధింపఁబడుచున్నది. దృష్టాంతము:— తన యింట్లో నిధి గలదని యిట్లు నిధియొక్క యునికిపట్టును తెలిసికొని సంతోషించిన తరువాతను గదా అట్టి నిధిని గైకొనుటకు ప్రయత్నించును. మఱియు ఇందులకు వేఱొక్క దృష్టాంతము నయితము గలదు—ఒక పట్టణమున నొక్క రాజు గలఁడు. అతని కొక పుత్రుఁడు ఉండెను. ఆ రాజకుమారుఁడు తోడి బాలురతోఁగూడ ఆడుకొనుటకై రాజభవనమునుండి బయలువెడలి పోయి దారి తెలియక మరల స్వస్థానమునకు రాజాలక పోయెను. అంతట ఆ రాజు తన కుమారిని రాకకు బహుకాలము ఎదురుచూచి యెంతకాలమునకును రానందున పుత్రుని పోఁగొట్టు కొంటినని నిశ్చయించుకొనెను. ఇట్లుండ, దారి తెలియక యొంటరిగాఁ దిరుగుచుండు ఆ చిన్న పిల్లవాని నొక బ్రాహ్మణుఁడు తనయింటికిఁ దోడుకొని పోయి అన్నివిధములను పోషించెను. అంతట ఆ చిన్నవాఁడు సకలశాస్త్రముల నభ్యసించి పదునాఱు వర్షముల వయస్సు గల వాఁడాయెను. ఇట్టి సందర్భమున, నాప్తుఁ డొకఁడు వచ్చి "నీ తండ్రి సర్వలోకాధిపతి, గాంభీర్యౌదార్య వాత్సల్య సౌశీల్య శౌర్యవీర్య పరాక్రమాది గుణములు గలవాఁడు. నిన్ను పోఁగొట్టుకొని ఎప్పుడు గానఁబడుదువా యని నిరీక్షించుచు పట్టణమున నివసించి యున్నాఁడు" అని యిట్లు ఆ రాజకుమారునితోఁ జెప్పెనేని యా చిన్నవాఁడును తన తండ్రి సజీవుఁడనియు సర్వసంపత్సమృద్ధి గలవాఁడనియును తెలిసికొని మితిలేని యానందము గలవాఁడగుచున్నాఁడు. ఈ సందర్భమును రాజు గూడ తెలిసికొని తన కుమారుఁడు సజీవుఁడనియు, ఆరోగ్యవంతుఁడనియు, ఎక్కువ రూపసియనియు, సర్వశాస్త్రవేత్తయనియును విని కృతార్థుఁడగుచున్నాఁడు. అనంతరము కుమారునిఁ గొనివచ్చుటకై ప్రయత్నించుచున్నాఁడు. తదనంతరము వారు ఉభయులును కలుసుకొనుచున్నారు.

పరినిష్పన్నవస్తువును తెలుపునట్టి వేదవాక్యములు అట్టివస్తువు విషయమగు జ్ఞానమును గలుగఁజేయుటచేతనే యొకపురుషార్థము గలవి యగును గాన, ప్రొద్దు పుచ్చుటకై బాలురకును రోగులకును చెప్పునట్టి కథలవలెనే యవి యట్టి పదార్థము యొక్క యునికిని గుఱించిన ప్రమాణములు కాఁదగవని పూర్వపక్షి వాదించి యుండెను. ఆ వాదము యుక్తమైనది కాదు. ఏలననిన, ఒక వస్తువును గుఱించి తెలిసియున్నను, ఆ వస్తువు వాస్తవముగా లేదని నిశ్చయము గలిగెనేని, ఆ వస్తువును గుఱించిన జ్ఞానమువలన నెట్టి ప్రయోజనమును గానఁబడదు. ఎట్లనిన, అట్టి కథలవలనఁ దెలియవచ్చునట్టి పదార్థములు వాస్తవ

ముగాఁ గలవవి బాలురను రోగులును భ్రమించుటంజేసి, యట్టి సమయమున, వారికి సంతోషాశ్చర్యాదులు గలుగుచున్నవి. వారికే యట్టి సమయమున, వారు తెలిసికొనినదంతయును అసత్యమనెడి నిశ్చయము గలిగెనేని, తత్క్షణమే యందువలనఁ గలిగిన హర్షాదులన్నియును నివర్తించును గదా! ఉపనిషద్వాక్యముల విషయముననును. అవి బ్రహ్మమనఁబడునది యొక్కటి వాస్తవముగాఁ గలదనెడి యంశమును తెలుపుచుండలేదను నిశ్చయము గలుగునేని, అట్టి బ్రహ్మమును గుఱించిన జ్ఞానము ఉన్నను, అది యొక పురుషార్థమును గలుగఁజేయదు. ఈ పైని గానఁబఱచిన హేతువులనుబట్టి "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాది శ్రుతివాక్యము "నిఖిల జగదేక కారణమును, నిరస్త నిఖిలదోష గంధమును, సార్వజ్ఞ్య సత్యసంకల్పత్వాద్యనంత కల్యాణ గుణాకరమును, అనవధికాతి శయానందమును నగు బ్రహ్మము యొక్క-యునికిని తెలుపునది యగు ప్రమాణము కాదగునని సిద్ధముగుచున్నది.

 సమన్వయాధికరణము ముగిసెను.

ఈక్షత్యధికరణము

౫॥ సూ॥ ఈక్షతేర్నాశబ్దం.

టీ॥ అశబ్దం = వేదముచేతనే తెలుపఁదగినది కానిదియగు ప్రకృతి, న = జగత్కారణముగా వేదమునఁ జెప్పఁబడినది కాదు. ఏలననఁగా, ఈక్షతేః = వేదమునందు జగత్కారణమునకు ఈక్షణము జెప్పఁబడినందున.

తా॥ శ్రుతులయందుఁ జగత్కారణముగా వర్ణింపఁబడిన పదార్థము సృష్టికిఁ బూర్వము సంకల్పించినట్లు చెప్పఁబడియుండుటచేత, శాస్త్రప్రమాణముచే మాత్రము తెలియఁదగినది కానిదియగు అనఁగా ననుమానవేద్యమగు ప్రకృతి వేదప్రతిపాదితమగు జగత్కారణ వస్తువు కాదు.

శ్రీ॥ భా॥ "యతో వా ఇమాని భూతాని జాయన్తే" మొదలుగా గల శ్రుతివాక్యములచే జగత్కారణముగాఁ బ్రతిపాదింపఁబడినట్టియు, సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడును, హేయగుణరహితుఁడును, కల్యాణ గుణాకరుఁడునగు పరబ్రహ్మము విచారింపఁదగినవాఁడని పూర్వాధికరణమునఁ బ్రతిపాదింపఁబడియె. అట్లు జగత్కారణమును ప్రతిపాదించునవియగు శ్రుతులు అనుమాన సిద్ధములును, సాంఖ్యులు మొదలగువారిచే జగత్కారణముగా నంగీకరింపఁబడినవియునగు ప్రకృతి మొదలగువానిని జగత్కారణముగా బ్రతిపాదించునవి కావని "ఈక్ష

పూర్వాధికరణముతోఁగల సంబంధము.

తేర్నా శబ్దం" ఇత్యాది సూత్రములచే నీ యధికరణమునఁ బ్రతిపాదించు చున్నారు.

జగత్కారణ వస్తువును గుఱించి పఠించు సందర్భమున, ఛందోగులు "సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం తదైక్షత బహు స్యాం ప్రజాయాయేతి తత్తేజోఽసృజత" ఇత్యాది వాక్యమున "సృష్టికిఁ బూర్వ మీ జగత్తంతయు నొక్కటియేయై రెండవది లేనిదియగు సత్తుగా నుండెను. అది తేజస్సును సృజించెను" అని పఠించుచున్నారు. ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈ శ్రుతియందుఁ జెప్పఁబడిన జగత్కారణవస్తువు సాంఖ్యులచే జగత్కారణముగా నంగీకరింపఁబడినదియు, అనుమాన సిద్ధమునగు ప్రకృతియా? కాక, ఇంతకుఁ బూర్వము సర్వజ్ఞత్వాది గుణయుక్తమైనదిగాఁ జెప్పఁబడిన పరబ్రహ్మమా?

## పూర్వపక్షము

ఈ శ్రుతి [1]ప్రకృతినే జగత్కారణమునుగాఁ జెప్పుచున్నదనుట యుక్తము. ఎట్లనిన "సదేవ సోమ్యే దమగ్ర ఆసీత్" అను శ్రుతివాక్యము "చేతనులకు భోగ్యభూత మయినట్టిదియు, సత్త్వరజస్తమో గుణమయమైనట్టిదియు, ఆకాశాది నామరూపవికారంరూపమగు నవస్థను గలిగియున్నట్టిదియునగు, ఈ సమస్త వస్తుజాతముయొక్క కారణావస్థను దెలియఁజేయుచున్నది. కారణపదార్థము వేఱొక్కయవస్థను బొందుట గదా కార్యావస్థయనఁబడుచున్నది. కావున, ఏ పదార్థమెట్టిస్వభావముగలదై కార్యావస్థయందుండునో, ఆ పదార్థమే అట్టి స్వభావముగలదై యే, కారణావస్థయందు నయితము ఉండవలయును గదా? పరిశీలించితిమేని, కార్యావస్థయందుండునదియగు ఈ వస్తుజాతమంతయును సత్వ

(1) ఈదర్శనము కపిలునిచేఁ బ్రణీతము గనుక కాపిలమనియు, తత్త్వములసంఖ్య నిరువదియైదింటిని దెలుపుటచే సాంఖ్యమనియుఁ జెప్పఁబడును. ఇందు ప్రత్యక్షము, అనుమానము, శబ్దము అని ప్రమాణములు మూఁడు. ప్రకృతి, పురుషుఁడు అని ముఖ్యతత్త్వములు రెండు. అందు ప్రకృతి తనవికారములైన మహదాదులతోఁ గూడి యిరువదినాలుగు కాఁగా దానితోఁ బురుషుఁడును గూడ మొత్తమున కిరువదియైదుతత్త్వము లగును. ఈ ప్రకృతియే శాస్త్రిమున "ప్రధానము" అని వ్యవహరింపఁబడును. ప్రకృతియుఁ బురుషుఁడును వేఱువేఱని తెలియకుండుటయే బంధము. ప్రకృతికంటెఁ బురుషుఁడు వేఱని తెలియుటయే మోక్షము. ఈ మతమును గుఱించి యాచార్యులవారు ద్వితీయాధ్యాయమున స్మృత్యధికరణమునను రచనానుపపత్త్యధికరణమునను బాగుగా వివరించి యున్నారు. చదువరు లచటం జూచుకొనునది.

రజస్తమోగుణమయముగాఁ దెలియవచ్చుచున్నది. కాఁబట్టి కారణావస్థయం దిదియంతయు నట్టి సత్త్వాదిగుణములను సమానభాగముగాఁ గలిగియుండు నట్టి ప్రకృతిగానే యుండవలయును. కారణావస్థయందు నామరూపాది విశేషములన్నియును ఉపసంహృతము లగుటంజేసి సన్మాత్రముగా నుండునట్టి ప్రకృతి "సదేవసోమ్యే దమగ్ర ఆసీత్" అను వాక్యమునఁ జెప్పఁబడుచున్నది. ఈ హేతువునుబట్టియే కార్యకారణ పదార్థముల కభేదము సిద్ధించుచున్నది. ఇట్లగునేని, ఒక్క పదార్థము దెలియుటచే సర్వపదార్థములును దెలియుననెడి వేదాంతశాస్త్రీయ ప్రతిజ్ఞయును ఉపపన్నమగును. అట్లు కాకున్న, ఈ ప్రతిజ్ఞను ఉపపాదించుటకై "యొక మట్టిముద్దయొక్క స్వరూపము దెలియుటచే తత్కార్యభూతములగు ఘటశరావాది పదార్థములు ఎట్లు దెలియవచ్చునో" అని ఛందోగులు యిచ్చిన దృష్టాంతము పొసగకపోవును. కాఁబట్టి "సదేవ సోమ్య" ఇత్యాది జగత్కారణ ప్రతిపాదకవాక్యము సాంఖ్య సిద్ధాంత ప్రవర్తకుఁడగు కపిలమహర్షిచేఁ జగత్కారణముగాఁ బ్రతిపాదింపఁబడిన ప్రకృతినే జగత్కారణముగ ప్రతిపాదించుచున్నదని సిద్ధమగుచున్నది. మఱియు ఈ వాక్యము ప్రతిజ్ఞా దృష్టాంతాది నిదర్శన పూర్వకముగాఁ గారణవస్తువును ప్రతిపాదించుటచే నిది అనుమానరూపమైనది. కావున నిది యనుమానసిద్ధమగు ప్రకృతినే సచ్ఛబ్దముచేఁ దెలుపుచున్నదనిన,

## సిద్ధాంతము.

ఏది శ్రుతిచేతను మాత్రము నిరూపింపఁదగినది కాదో, అది "అశబ్దం" అనఁబడుచున్నది. అనఁగా ననుమానసిద్ధమగు ప్రకృతియని యర్థము "సదేవ సోమ్యే దమగ్ర ఆసీత్" ఇత్యాదివాక్యము అట్టి ప్రకృతిని జగత్కారణముగాఁ బ్రతిపాదించుచున్నదనుట యుక్తము గాదు. ఎట్లనిన, "తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" ఇత్యాది వాక్యమున "సచ్ఛబ్దవాచ్యమగు కారణవస్తువు ఈక్షణముతో (సంకల్పముతో) సంబంధించినదిగాను గానఁబడుచున్నది. అట్టి యీక్షణము అచేతనమగు ప్రకృతికి ఉండుట యసంభవము. కాఁబట్టి యట్లు సంకల్పింప సమర్థుఁడును, చేతనుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడు నగు పురుషోత్తముఁడే సచ్ఛబ్దవాచ్యుఁడు. ఇంతియెకాక, "స ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమాన్లోకానసృజత" అనియు "స ఈక్షాం చక్రే స ప్రాణ మసృజత" అనియు నిట్లు శాఖాంతరముల యందలి సృష్టిప్రకరణముల యందుఁ బఠింపఁబడిన వాక్యములు సయితము కారణవస్తువును ఈక్షణయుక్తమైన దానినిగాఁ దెలుపుచున్నవి.

సాంఖ్యుఁడు:—కానిమ్ము, కార్యానుగుణమయినదిగానే కదా కారణము ఉండవలయును ?

భాష్యకారులు:—వాస్తవము. సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడును, సత్యసంకల్పుఁడును, సూక్ష్మములగు చిదచిత్పదార్థములన్నియు శరీరముఁగాగల పురుషోత్తముఁడు జగత్కారణమను పక్షమున, నతఁడు సర్వకార్యముల కనుగుణుఁడే. ఎట్లనిన "పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ" అను శ్రుతివాక్యము "ఈ పురుషోత్తముని శక్తి నానావిధమయినదిగాఁ దెలియ వచ్చుచున్నది. ఈతని జ్ఞానమున్ను, బలమున్ను, క్రియయున్ను, స్వాభావికములు" అనియు, "య స్సర్వజ్ఞ స్సర్వవిత్ యస్య జ్ఞానమయం తపః" అను శ్రుతివాక్యము "ఆ పురుషోత్తముఁడు సర్వమును బాగుగాఁ దెలిసికొనినవాఁడు, సర్వప్రకారములను ఎఱింగినవాఁడు, అతనికి జ్ఞానరూపమయిన తపస్సు కలదు" అనియును, "యస్యావ్యక్తం శరీరం యస్యాత్మా శరీరం యస్య మృత్యు శ్శరీరం ఏష సర్వభూతాంతరాత్మా" అను శ్రుతివాక్యము "ఆ పురుషోత్తమునికి ప్రకృతియును, జీవుఁడును, మృత్యువున్ను, శరీరభూతములు అతఁడు సర్వభూతముల యందును నుండునట్టి యంతరాత్మ" అనియును, చెప్పుచున్నవి. ఇది యంతయును, "న విలక్షణత్వాదస్య తథాత్వంచ శబ్దాత్" అను సూత్రమున విచారింపఁబడును. జగత్సృష్టిని ప్రతిపాదించునట్టి వాక్యములచేఁ జగత్కారణముగాఁ బ్రతిపాదింపఁబడిన వస్తువు సాంఖ్యశాస్త్ర ప్రసిద్ధమగు ప్రకృతి కాదను విషయము మాత్ర మిచట విచారింపఁబడుచున్నది. కార్యకారణ పదార్థములు ఏకస్వభావములు గాని పక్షమున, వానికి కార్యకారణ భావము పొసగ దనెడి దోషము గూడ అచటనే పరిహరింపఁబడును.

"సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" అను శ్రుతివాక్యము "అనుమానము చేతనే జగత్కారణమును ప్రతిపాదించుచున్నది" అని పూర్వపక్షి చేయు వాదమున్ను యుక్తమయినది కాదు. ఎట్లనిన, అనుమానముచే నొకదానిని నిరూపించునపుడు హేతువును గాన్పింపవలయును. అనఁగా నీహేతువునుబట్టి యిది యిట్టిదిగా నూహింపఁబడుచున్నదని చెప్పవలయును. అట్టి హేతువెద్దియు నీ శ్రుతియందుఁ జెప్పఁబడనందున, నీ శ్రుతి యనుమానరూపమయినది కానేరదు.

ఛందోగులు "యేనాశ్రుతం శ్రుతం భవతి" ఇత్యాదివాక్యముచే "ఒక వస్తువు తెలియుట సమస్తమును తెలియవచ్చుటకు సాధనమగుచున్నది" అను విషయమును ప్రతిపాదించుటకై యచ్చయించి, అట్లగుట యెట్లు సంభవమని యడుగఁగా, ఆ విషయమును విశదముగాఁ దెలుపుటకై, "ఒక్క మట్టి ముద్దయొక్క స్వరూపము దెలియఁబడుటచే తత్కార్యభూతములగు ఘటశరావాది పదార్థము లన్నియును, దెలియఁబడుచున్నట్లు" అను దృష్టాంతము నిచ్చియున్నారని మెఱుంగునది. సృష్టిని వర్ణించు వాక్యముల యందంతటను "సంకల్ప

పూర్వకమగు జగత్సృష్టి" వర్ణింపఁబడియె. కావున, అచేతనమగుటచే సంకల్ప విహీనమగు ప్రకృతియొక్క వాసన గూడ ఆ వాక్యములయం దుండఁజాలదు.

అవతారిక:—"తదైక్షత" ఇత్యాది శ్రుతివాక్యము "చేతనపదార్థము లకు సహజమగు ఈక్షణమును జెప్పుచుండలేదు. అయితే యది ప్రకృతియం దుండు గౌణమగు ఈక్షణమును దెలియఁజేయునది. అది యెట్లు తెలియుననిన, "తత్తేజ ఐక్షత=ఆ తేజస్సు చూచెను" అనియు, "తా ఆప ఐక్షన్త= ఆ యుదకములు చూచెను" అనియు నీమొదలగు వాక్యములతోఁగూడ పఠింపఁ బడినందువలన నట్లు తెలియుచున్నది. అచేతన పదార్థములకుఁ గూడ చేతన ధర్మములు గౌణముగాఁ జెప్పందగును. దృష్టాంతము:—"వృష్టిం ప్రతీక్షా శ్శాలయః=వరిపైరులు వర్షమును ప్రతీక్షించుచున్నవి" అనియు "వర్షేణ బీజం ప్రతిసంజహర్ష = వర్షముచే బీజము సంతుష్టి నొందిన దాయెను." అనియు నీ మొదలగు తావుల ప్రతీక్షించుట, సంతుష్టి నొందుట మొదలగు చేతనధర్మము లచేతన పదార్థములగు వరిపైరులు మొదలగు వానికున్నట్లు జెప్పఁబడుచుండ లేదా? కాఁబట్టి "తదైక్షత" అనుతావునఁ జెప్పఁబడిన ఈ క్షణము గౌణముగాని ముఖ్యము కాదని శంకింపఁగా, నట్టి శంక ననువదించి పరిహారించుటకై.

౬॥ సూ॥ గౌణశ్చేన్నాత్మశబ్దాత్.

టీ॥ గౌణశ్చేత్ = ఈక్షితృత్వము గౌణమంటివేని, న = అది సంభ వింపదు. ఏలననఁగా, ఆత్మశబ్దాత్ =శ్రుతియం దాత్మశబ్ద ప్రయోగ ముండుట వలన,

తా॥ అచేతనమగు ప్రకృతికి ఈక్షితృత్వము గలదనుట గౌణమంటి వేని, యది యుక్తము కాదు. ఏలననిన, జగత్కారణముగాఁ జెప్పఁబడిన సత్తును తెలుపుటకై శ్రుతియం దాత్మశబ్దము ప్రయోగింపఁబడినది.

శ్రీ॥ భా॥ "తత్తేజ ఐక్షత" "తా ఆప ఐక్షన్త" ఇత్యాద్యుత్తర వాక్య ములయందు గౌణార్థమునఁ బ్రయోగింపఁబడిన "ఈక్షతి" ధాతువుతో సాహచర్యముండుటవలన, "తదైక్షత" అను పూర్వవాక్యము నందలి "ఈక్షతి" ధాతువు గూడ సృష్టికి పూర్వపు అవస్థావిశేషమును దెలియఁజేయునదియై గౌణార్థముననే ప్రయోగింపఁబడినదని పూర్వపక్షి వాదించిన వాదమున్ను యుక్తమయినది కాదు. ఎట్లననిన, "ఐతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా" అను శ్రుతివాక్యము "సత్" అనఁబడు జగత్కారణ పదార్థమును ఆత్మనుగాఁ జెప్పుచున్నది. అనఁగా, "ఐతదాత్మ్య మిదంసర్వం తత్సత్యం స ఆత్మా = ఈ పరిదృశ్యమానమగు జగత్తంతయు నాత్మసంబంధమైనది. ఆయాత్మ "సత్"

అనఁబడును. అతఁడు ఈ జగత్తుయొక్క యాత్మ" అనుటచే చేతనాచేతన ప్రపంచమును ఉద్దేశించి దాని కాత్మగా నుపదేశింపఁబడినది కేవల యచేతన పదార్థమగునేని, యట్టి యుపదేశము పొసగదు.

ఇంతియె కాక, తేజస్సు, ఉదకము, పృథివి మొదలగు పదార్థములకును పరమాత్మయే యాత్మ గాన, తేజశ్శబ్దము మొదలగునవియును, పరమాత్మ వాచకములే. కనుకనే "హన్తాహమిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అను శ్రుతివాక్యము "పరమాత్మ జీవ శరీరుఁడుగాఁ దేజస్సు, ఉదకము, పృథివి అను వానిలోఁ బ్రవేశించి వీని నామ రూపములను ప్రకటింపఁజేయుచున్నాఁడు" అని చెప్పుచు, ఈ పరమాత్మ వానిలో నంతరాత్మగా నుండుటచేతనే అవి పదార్థములుగాను, నామరూప ములను గలిగి యుండునవిగాను నగుచున్నవని తెలియఁజేయుచున్నది. కాఁబట్టి "తత్తేజ ఐక్షత" "తా ఆప ఐక్షన్త" ఇత్యాది తావులయందుఁ జెప్పఁబడిన ఈక్షణము ముఖ్యమైనదియే. సాహచర్యమునుబట్టి యైనను, ఈ తావున ఈక్ష ణము గౌణమని శంకించుట కవకాశము లేదు.

అవతారిక:—సచ్ఛబ్దవాచ్యము ప్రకృతి కాదని తెలుపునట్టి హేత్వం తరమును గానఁబఱచుటకై:—

సూ॥ త న్ని ష్ఠ స్య చ మో క్షో ప దే శా త్.

టీ॥ తన్నిష్ఠస్య = ఆ సత్తనంబడు దానిని ధ్యానించువానికి, మోక్షోప దేశాత్—చ = మోక్షప్రాప్తిని ఉపదేశించుటవలనను.

తా॥ ఆ సత్తనఁబడు దానిని ధ్యానించుటచే మోక్షము కలుగునని యుపదేశించుటవలనను సచ్ఛబ్దవాచ్యము ప్రకృతి కాదు.

శ్రీ॥ భా॥ శ్రుతులు "తత్త్వమసి" ఇత్యాదివాక్యములచే "ముముక్షు వగు శ్వేతకేతునికి ఆ సచ్ఛబ్దవాచ్యుని యాత్మనుగా ననుసంధించు కొనుమని యుపదేశించి, తరువాతి "తస్య తావదేవచిరం యావన్న విమోక్ష్యేఽథ సంప త్స్యే" అను వాక్యమున "అట్టి యనుసంధానమునందు నిష్ఠ గలవానికి శరీర పాతమే విళంబము. అనంతర మతఁడు బ్రహ్మప్రాప్తి రూపమగు మోక్షమును బొందుచున్నాఁడు" అని యుపదేశించుచున్నవి. పూర్వపక్షి వాదించిన ప్రకా రము సచ్ఛబ్దవాచ్యము అచేతనమగు ప్రకృతియే యగు పక్షమున, అట్టి యచే తన పదార్థము నాత్మనుగా ననుసంధించుకొనుట మోక్షసాధన మనెడి యుప దేశము అసంగత మగును. ఇంతియెకాక, "యథాక్రతు రస్మిన్లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి" అను శ్రుతివాక్యమున "ఈ పురుషుఁ డీలోక

మున నెట్టి ధ్యానముతో నుండునో, యీ లోకమును విడిచి పైకిపోయి, అట్టి స్థితి గలవాఁడే యగును" అని చెప్పియున్న న్యాయప్రకారము ఈ లోకమున నచేతనమగు ప్రకృతి నాత్మనుగా ననుసంధించుకొనువాఁడు ఈ లోకమునుండి బయలువెడలి యచేతనము గానే కావలసి వచ్చునే? వేలకొలది మాతా పితృలకంటె నెక్కువ కనికరముగల శాస్త్రము తాపత్రయమును గలుగఁజేయు నదియగు నిట్టి యచిత్సంబంధమును ముముక్షువునకు ఉపదేశింపదు. అచేతన మగు ప్రకృతిని జగత్కారణమునుగా నంగీకరించు సాంఖ్యులు సయితము అట్టి ప్రకృతిని ధ్యానించుటచే మోక్షము గలుగనని యంగీకరింపరే?

అవతారిక:—సచ్ఛబ్దవాచ్యము ప్రకృతి కాదనుటకు హేత్వంతరమును గానఁబఱచుటకై.

౮॥ సూ॥ హే య త్వా వ చ నా చ్చ.

టీ॥ హేయత్వావచనాత్—చ=సచ్ఛబ్దవాచ్యము త్యాజ్యముగాఁ జెప్పఁ బడక పోవుటవలనను (అది ప్రకృతి కాదు.)

తా॥ సచ్ఛబ్దవాచ్యము ప్రకృతియే యగుపక్షమున, నది హేయమని శ్రుతియందుఁ జెప్పియుండవలయును. అయితే యట్లు చెప్పియుండలేదు. ఇందు వలనఁగూడ సచ్ఛబ్దవాచ్యము ప్రకృతికాదని సిద్ధమగుచున్నది.

శ్రీ॥ భా॥ సచ్ఛబ్దము ప్రకృతినే జగత్కారణమునుగాఁ దెలియఁజేయు పక్షమున, ముముక్షువగు శ్వేతకేతునికి అట్టి యచేతనమగు ప్రకృతి నాత్మనుగా ననుసంధించుకొనుమని యుపదేశించుట మోక్షవిరుద్ధ మయినది. కావున నట్టి యనుసంధానము శాస్త్రమునందు త్యాజ్యముగా నుపదేశింపఁబడి యుండవల యునే? అట్లు ఉపదేశింపక, "తత్త్వమసి" "తస్య తావదేవ చిరం" ఇత్యాది శాస్త్రవాక్యము లట్టి యనుసంధానమును ఉపాదేయమునుగా నుపదేశించు చున్నవి. ఈ హేతువునుబట్టియు సచ్ఛబ్దవాచ్యమగు జగత్కారణవస్తువు ప్రకృతి గాదని తెలియవచ్చుచున్నది.

అవతారిక:—సచ్ఛబ్దవాచ్యమగు జగత్కారణవస్తువు ప్రకృతి గాద నుటకు హేత్వంతరమును గానఁబఱచుటకై:—

౯॥ సూ॥ ప్ర తి జ్ఞా వి రో ధా త్॥

టీ॥ ప్రతిజ్ఞావిరోధాత్=ప్రతిజ్ఞతో విరోధము గలుగుటవలన.

తా॥ ప్రకృతి జగత్కారణ మగునేని, వేదాంతశాస్త్రీయ ప్రతిజ్ఞ విరోధించును.

శ్రీ॥ భా॥ సచ్ఛబ్దము అచేతనగు ప్రకృతిని జగత్కారణమునుగాఁ దెలియఁజేయు పక్షమున, వేదాంతశాస్త్రముయొక్క ప్రతిజ్ఞకు విరోధము సంభవించును. ఎట్లనిన, ఛందోగులు, ప్రథమున, ఒకవస్తువు తెలియుట సమస్త వస్తువులును దెలియుటకు సాధక మగుచున్నదను విషయమును ప్రతిపాదించుటకై ప్రతిజ్ఞచేసిరి. అందులకై కార్యకారణ పదార్థము లభిన్నము లగుటచే అనఁగా కార్యపదార్థము కారణపదార్థముకంటె వేఱుగానందున కారణభూతమగు సత్తును దెలిసికొనుటచే కార్యభూతమును, చేతనాచేతనవిశిష్టమునగు ప్రపంచమంతయును తెలియఁబడునని గదా వారు ప్రతిపాదింపవలయును! ఈ సందర్భమున, సచ్ఛబ్దవాచ్యమగు జగత్కారణము ప్రకృతియేయగు పక్షమున, కార్యభూతమగు నీ ప్రపంచమందలి చేతన పదార్థములు అచేతనమగు ప్రకృతినుండి యుత్పన్నములు గానందున, నట్టి ప్రకృతిరూపమగు కారణము దెలియుటచే తత్కార్యభూతమగు నీ ప్రపంచమునందలి చేతన పదార్థములు దెలియఁబడనేరవు. కాఁబట్టి యుపక్రమమునఁ జేసిన ప్రతిజ్ఞ విరోధించును.

అవతారిక:—సచ్ఛబ్ద వాచ్యమగు జగత్కారణము ప్రకృతి కాదనుటకు హేత్వంతరమును గానఁబఱచుటకై:—

౧౦॥ సూ॥ స్వాప్యయాత్॥

టీ॥ స్వాప్యయాత్ = స్వ = సచ్ఛబ్దసమానార్థకమగు నాత్మయందు, అప్యయాత్ =జీవుఁడు లీనమగుటవలన (సచ్ఛబ్దవాచ్యము ప్రకృతి కాదు)

తా॥ సుషుప్త్యవస్థయందు జీవుఁడు సత్తనఁబడు దానియందు లీనమగుటంజేసియును సచ్ఛబ్దవాచ్యము ప్రకృతి కాదగదు.

శ్రీ॥ భా॥ ఛందోగులు సచ్ఛబ్దముచే నిర్దేశింపఁబడిన వస్తువును గుఱించి "స్వప్నాంతం మే సోమ్య విజానీహి యత్రైతత్పురుషః స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి తస్మాదేనం స్వపితీత్యా చక్షతే స్వంహ్యపీతో భవతి" అను వాక్యమున, "ఓ శ్వేతకేతుఁడా! సుషుప్త్యవస్థను గుఱించి తెలిసికొనుము. ఏ యవస్థయందు పురుషుఁడు "స్వపితి" యనెడి నామముచే వ్యవహరింపఁబడు చున్నాఁడో అనఁగా "నిద్రబోవు చున్నాఁడు" అని చెప్పఁబడు చున్నాఁడో, ఆ సుషుప్త్యవస్థయం దీతఁడు సచ్ఛబ్ద నిర్దిష్టమగు వస్తువుతోఁ గలిసికొనుచున్నాఁడు, తన ఆత్మను పొందినవాఁడు అగుచున్నాఁడు. ఇట్లు తనయందు లీనమగుటంజేసియే జను లట్టి సమయమునం దీతని "స్వపితి" అని పిలుచుచున్నారు" అని యీ విధముగ పఠించుచున్నారు. ఛందోగు లీసుషుప్త్యవస్థయందు సచ్ఛబ్దముచే నిర్దేశింపఁబడిన వస్తువుతోఁజేరిన జీవుని తన యాత్మయందు లీనమగువానినిగా

అనఁగా ప్రళయమును బొందువానినిగాఁ జెప్పుచున్నారు. స్వకారణమందు లయమును బొందుటగదా ప్రళయమనఁబడును. అయితే యచేతనమగు ప్రకృతి చేతనుఁడగు జీవునికిఁ గారణభూతమైనది కానేరదు.

ఇచట "స్వమపీతో భవతి" అనఁగా, జీవుఁడు తన యాత్మనే (జీవ విశిష్టమగు బ్రహ్మమును) బొందుచున్నాఁడనుట. ఎట్లనిన, సమస్తములగు చేతనపదార్థములను శరీరముగాఁ గలిగి, వానికి తానాత్మగానుండు నట్టి పరబ్రహ్మమే జీవుఁడనిగూడ జెప్పఁబడుచున్నట్లు "అనేన జీవేనాత్మనాఽను ప్రవిశ్య" ఇత్యాది శ్రుతివలనఁ దెలిసికొనుచున్నాము. అట్లు జీవుఁడనఁబడు పరబ్రహ్మము ప్రళయకాలమునందువలెనే సుషుప్తి సమయమునను నామరూపములతో సంబంధము లేకుండుటంజేసి కేవలము "సత్" అనఁబడుచున్నాఁడు. కావున, "సతా సోమ్య తదా సంపన్నో భవతి స్వమపీతో భవతి" అను శ్రుతి వాక్యము "జీవుఁ డట్టి సత్తనంబడుదానితోఁ గలుసుకొనుచున్నాఁడు. తన యాత్మనే బొందుచున్నాఁడు" అని చెప్పుచున్నది. ఈ సందర్భమున వాజసనేయులు "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కిఞ్చన వేద నాన్తరం" అనువాక్యమున "ఈ జీవుడు ప్రాజ్ఞుఁడగు పరమాత్మతోఁ గలుసుకొని వెలపలి పదార్థములను లోపలి పదార్థములనున్న దెలిసికొనఁడు" అని పఠించుచున్నారు. నామరూపములతో సంబంధము లేక ప్రాజ్ఞుఁడగు పరమాత్మతో మాత్రము గలిసికొని యుండుటనుబట్టి శ్రుతి యిట్లు జెప్పెను. మోక్షమును బొందువఱకును నామరూపములతో సంబంధము ఉండుటవలననే ఈ జీవునికి స్వవ్యతిరిక్తములగు విషయములను గుఱించిన జ్ఞానము గలుగుచున్నది. కనుకనే సుషుప్త్యవస్థయందు నామరూపములను వదలి సత్తనంబడు పరబ్రహ్మముతోఁ గలిసికొనిన జీవుఁడు మరల జాగ్రదవస్థయందు నామరూపములను బొంది ఆయా నామరూపములు గలవాఁడగు చున్నాఁడనుచు మఱి యొక శ్రుతిగూడ యీ విషయమును స్పష్టముగాఁ జెప్పుచున్నది. ఎట్లనిన, కౌషీతకులు "యదాసుప్తః స్వప్నం న కంచన పశ్యతి తదాఽస్మిన్ ఏకధా భవతి" అనువాక్యమున "కలఁగనకుండ నిద్రించు సమయమున అనఁగా సుషుప్త్యవస్థయందు పురుషుఁడు పరమాత్మతోఁ గలసికొనుచున్నాఁడు." అనియు "తస్మాదాత్మనః ప్రాణా యథాయతనం విప్రతిష్ఠంతే." అనువాక్యమున "తరువాత ప్రాణములనంబడు జీవులు ఆ పరమాత్మనుండియే తమతమ స్థానములకు మరలి పోవుచున్నవి" అనియును పఠించుచున్నారు. మఱియు ఛందోగులు. "త ఇహ వ్యాఘ్రో వా సింహో వా వృకో వా వరాహో వా దంశో వా మశకో వా యద్యద్భవన్తి తథా భవన్తి" అను వాక్యమున "ఈ జీవులు సుషుప్త్యవస్థయందు పరమాత్మతోఁ గలిసికొనుటకు పూర్వము వ్యాఘ్రరూపముతోఁగాని,

సింహరూపముతోఁగాని, వరాహరూపముతోఁగాని, తోడేలుయొక్క రూపము తోఁగాని, దోమయొక్క రూపముతోఁగాని, మత్కుణరూపముతోఁగాని, యేయే రూపముతోనుండునో, సుషుప్త్యవస్థనుండి మరల జాగ్రదవస్థను బొందునపుడు ఆ యారూపముతో నగును" అని పఠించుచున్నారు. అట్లే వాజసనేయులుగూడ సుషుప్త్యవస్థయందుండిన యీ జీవుని గుఱించి పఠించునపుడు 'ప్రాజ్ఞేనాఽత్మనా సంపరిష్వక్తః' అనఁగా "ప్రాజ్ఞుఁడగు పరమాత్మతోఁ గలసికొని యున్నాఁడు" అని పఠించియున్నారు. ఈపైని యుదహరింపబడిన హేతువులనుబట్టి విచారింపఁగా, "సత్" శబ్దవాచ్యుఁడు పరబ్రహ్మమును, సర్వజ్ఞుఁడును, పరమేశ్వరుఁడు నగు పురుషోత్తముఁడే యని విశదమగుచున్నది. కనుకనే వృత్తికారుఁడగు శ్రీ బోధాయన మహర్షి సయితము "సర్వప్రాణులును పరమాత్మతోఁ గలుసుకొనుటను బట్టియు వానిని వదలుటనుబట్టియును విచారింపఁగా, జీవుఁడు సుషుప్త్యవస్థయందు పరమాత్మతోఁ గలుసుకొనుచున్నట్లు దెలియవచ్చుచున్నది" అనియు "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః" అను శ్రుతిగూడ అట్లే తెలుపుచున్నది" అనియును ప్రసాదించియున్నారు.

అవతారిక:—సచ్ఛబ్దవాచ్యము ప్రకృతి కాదనుటకుగాను హేత్వంతరమును గానఁబఱచుటకై:—

౧౧॥ సూ॥ గతిసామాన్యాత్॥

టీ॥ గతిసామాన్యాత్ = జగత్కారణమును తెలుపునట్టి శ్రుతులయొక్క తాత్పర్యమునకు సమానభావము గలిగియుండుటవలనను.

తా॥ సామాన్యముగ జగత్కారణమును తెలుపువాక్యము లన్నియును పరబ్రహ్మమే జగత్కారణమని తెలుపుచున్నందునను, ప్రకృతి జగత్కారణము కాదు.

శ్రీ॥ భా॥ "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్ నాన్యత్కిఞ్చన మిషత్ స ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమాన్లోకా నసృజత" (ఐ. ౧ అ. ౧ ఖ. ౧) (సృష్టికి పూర్వ మాత్మ యొక్కటియే యుండెను. మఱియొక్క టెద్దియును లేదు. ఆ యాత్మ ప్రజలను సృజించుటకై సంకల్పించి యీ ప్రజలందఱిని సృజించెను" అనియు, "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః అద్భ్యః పృథివీ" (తై. ఆ. ౧ అ.) (ఆ పరమాత్మనుండి యాకాశము పుట్టెను. ఆకాశ శరీరుఁడగు పరమాత్మనుండి వాయువు పుట్టెను. వాయుశరీరుఁడగు పరమాత్మనుండి యగ్ని పుట్టెను. అగ్నిశరీరుఁడగు పరమాత్మనుండి యుదకము పుట్టెను. ఉదకశరీరుడగు పరమాత్మనుండి పృథివి పుట్టెను" అనియు, "తస్యహ వా ఏతస్య మహతో

భూతస్య నిశ్శ్వసితమేతదృగ్వేదః" (సుబా. ౨ ఖ.) (మిక్కిలి గొప్పభూతమగు నా పరమాత్మయొక్క యుచ్ఛ్వాసమే ఋగ్వేదము" అనియు; నివ్విధముగ జగత్సృష్టిని ప్రతిపాదించు వాక్యములు సంతతము దీనినంటియేగాన, ఆ వాక్యములన్నియు, దేనిని జగత్కారణముగాఁ జెప్పుచున్నవో, దానినే యీ వాక్యము నయితము జగత్కారణమునుగాఁ జెప్పుచున్నది. ఆ వాక్యములన్నియు, సర్వేశ్వరుఁడే జగత్కారణమని చెప్పుచుండుటంజేసి యీ వాక్యముగూడ సర్వేశ్వరునే జగత్కారణమునుగాఁ జెప్పుచున్నట్లు నిశ్చయింపఁబడుచున్నది.

అవతారిక :—సచ్ఛబ్దవాచ్యము ప్రకృతి కాదనుటకుగాను హేత్వంతరమును గానఁబఱచుటకై.

౧౨॥ సూ॥ శ్రుతత్వాచ్చ॥

టీ॥ శ్రుతత్వాత్—చ = సచ్ఛబ్దవాచ్యుఁడు సర్వజ్ఞత్వము మొదలగునవి గలవాఁడని శ్రుతులయందు ఉపదేశించి యుండుటవలనను,

తా॥ సచ్ఛబ్దవాచ్యుఁడు సర్వజ్ఞత్వము మొదలగునవి గలవాఁడని శ్రుతులయందు ఉపదేశించి యుండుటవలనను, అతఁడు అచేతనమగు ప్రకృతి కాదు.

శ్రీ॥ భా॥ సచ్ఛబ్దవాచ్యుఁడు అన్ని పదార్థములలో నాత్మగాఁ బ్రవేశించి వానికి నామరూపములను గావించినవాఁడనియు, సర్వజ్ఞుఁడనియు, సర్వశక్తుఁడనియు, సర్వమున కాధారభూతుఁడనియు, అపహతపాప్మత్వాది గుణములు గలవాఁడనియు, సత్యకాముఁడనియు, సత్యసంకల్పుఁడనియును, ఛందోగులే పఠించుచున్నారు. ఎట్లనినః—వీరు "అనేన జీవేనాత్మనా ఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా. ౬ ప్ర. 3 ఖ. ౧ వా.) అను వాక్యమున 'జీవశరీరుఁడుగాఁ బ్రవేశించి నామరూపముల నొనర్చుచున్నాను" అనియు, "సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజా స్సదాయతనాః సత్ప్రతిష్ఠాః ఐతదాత్మ్య మిదం సర్వం తత్సత్యం స ఆత్మా" (ఛా. ౬ ప్ర. ౮ ఖ ౬ వా.) అను వాక్యమున "ఈ ప్రజలందఱును సత్తువలనఁ గలిగినవారు. సత్తు ఆధారముగాఁ గలవారు. సత్తు ప్రతిష్ఠగాఁ గలవారు అనఁగా సత్తునందు లయమును బొందువారు. ఇది యంతయు సచ్ఛబ్దవాచ్యుఁడే యాత్మగాఁగలది. ఇది సత్యము. అతఁడే యాత్మ" అనియు, "యచ్చాస్యేహాస్తి యచ్చనాస్తి సర్వం తదస్మింత్సమాహితం అస్మిన్కామాః సమాహితాః ఏష ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సో౽పిపాసస్సత్యకామస్సత్యసంకల్పః (ఛా. ౮ ప్ర. ౧ ఖ. 3 వా.) అను శ్రుతివాక్యమున "ఇప్పుడీ యాకాశమునం దేది యున్నదో, యేది లేదో, అది యంతయు నీ యధిష్ఠాన భూతమగు పరమాకాశమనఁబడు పరమాత్మయందున్నది అన్ని నామములు ఈతనియందుఁ గూడి యున్నవి. ఈతఁడు పాప

రహితుఁడు, మసలితనము లేనివాఁడు, దప్పికలేనివాఁడు, సత్యకాముఁడు, సత్య సంకల్పుఁడు" అనియు నిర్విఘముగాఁ జెప్పుచు నీపైని జెప్పఁబడిన గుణము లీతనియందుఁ గలవని తెలియఁజేయుచున్నవి.

ఇంతియె కాక, ఇతర శ్రుతులు సయితము అట్లే తెలుపుచున్నవి.— "న తస్య కశ్చిత్పతిరస్తి లోకే న చేశితా నైవ చ తస్య లిఙ్గం స కారణం కరణాధిపాధిపో నచాస్య కశ్చి జ్జనితా న చాధిపః" అను శ్రుతివాక్యము (ఆ పరమాత్మకొక ప్రభువుగాని, వానిని నియమించువాఁడు గాని, వాని కెద్ది యయిన కారణము గాని లేదు. వాఁడే కారణభూతుడును, ఇంద్రియాదుల కధిపతియగు జీవునికి అధిపతియును. వానిని పుట్టించినవాఁడును గాని, వాని కధిపతియును గాని ఎవ్వఁడును లేడు" అనియును "సర్వాణి రూపాణి విచింత్య ధీరః నామాని కృత్వాభివదన్యదాస్తే" అను శ్రుతివాక్యము "సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరుఁడు రూపముల నన్నింటిని సృజించి వానికి నామములను ఏర్పఱచి అట్టి నామములతో వానిని పిలుచుచున్నాఁడు" అనియు, "అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా" అను శ్రుతివాక్యమున "అతఁడు జనులలోఁ బ్రవేశించి వారిని నియమించుచు నందఱికి నాత్మగా నున్నాఁడు" అనియు, "విశ్వాత్మానం పరాయణం" అను శ్రుతివాక్యము "సర్వమున కాత్మయు, సర్వమునకు నాధార మయిన వానిని" అనియును, "పతిం విశ్వస్యాత్మేశ్వరం" అను శ్రుతివాక్యము "సమస్తమును పాలించువానిని, జీవులను నియమించువానిని" అనియు, "యచ్చ కిఞ్చిజ్జగత్యస్మి‌న్ దృశ్యతే శ్రూయతే ఽపివా అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అను శ్రుతివాక్యము "లోపలను వెలుపలను అంతటనున్న నారాయణుఁడు వ్యాపించి యున్నాడు" అనియు, "ఏష సర్వ భూతాన్త రాత్మా ఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" అను శ్రుతివాక్యము "నారాయణుఁడు సర్వభూతముల కాత్మయు, అపహత పాప్ముఁడును, ఉత్కృష్టుఁడును నగు ప్రభువు" అనియు నిర్విఘముగాఁ జెప్పుచు సచ్ఛబ్ద వాచ్యుఁడగు పరమాత్మ ఈ పైని గనబఱచిన గుణములు గలవాఁడని తెలియజేయుచున్నవి.

ఈపైని గనఁబఱచిన హేతువులను బట్టి జగత్కారణమును ప్రతిపాదించు శ్రుతివాక్యములు అచేతనమగు ప్రకృతి మొదలగు దానిని జగత్కారణముగ ప్రతిపాదించుచుండ లేదని తెలియుచున్నది. కాఁబట్టి సర్వజ్ఞుఁడును, సర్వశక్తి యుక్తుఁడును, ఇంద్రాదీశ్వరుల కందఱికిని యీశ్వరుఁడును, దోషము లెంతమాత్రము లేనివాఁడును, అనవధికాతిశయ కల్యాణ గుణాకరుఁడును, పురుషోత్తముఁ డునగు నారాయణుఁడే యీ సమస్తజగత్తుకు నిమిత్తోపాదాన కారణమనియు, అతఁడే ముముక్షువులచే దెలిసికొనఁదగిన పరబ్రహ్మ మనియును సిద్ధ మగుచున్నది.

నిర్విశేష చిన్మాత్రమే బ్రహ్మమని యద్వైతులు చేయువాదమును సూత్రకారుఁడే పైని గనఁబఱచిన శ్రుతులచే ఖండించినట్లు తెలియఁగునది. ఏలననిన, ఈ యధికరణమున ముముక్షువులచేఁ దెలిసికొనఁదగిన బ్రహ్మముకు ఈక్షణాదిగుణసంబంధము నిత్యముగాఁ గలదని స్థాపింపబడియె. నిర్విశేష చిన్మాత్రమే బ్రహ్మమని వాదించునట్టి యద్వైతుల మతమున బ్రహ్మము సాక్షిభూతుఁడగుటయును గూడ అసత్యము గదా! అయితే జిజ్ఞాసాధికరణమున బ్రహ్మము ముక్షువులచేఁ దెలియఁగోరవలసినదని ప్రతిజ్ఞ చేయంబడియె. ఆ ఈ యధికరణమున నట్టి బ్రహ్మము చేతనము నెడి యంశము "ఈక్షతే ర్నాశబ్దం" అను నీ మొదలగు శ్రుతులచే ప్రతిపాదింపఁబడుచున్నది. చైతన్యగుణముతోఁ గూడి యున్నట్టిది గదా! చేతన మనఁబడుచున్నది. కావున బ్రహ్మముకు ఈక్షణమనఁబడు గుణము లేనిచో, నది యును ప్రకృతివంటిదియే యననలసి వచ్చును. ఇంతియె కాక, నిర్విశేష ప్రకాశమాత్రమే బ్రహ్మమను మతమున నది ప్రకాశమగుటను ప్రతిపాదించుట యశక్యము. ఎట్లనిన, తనును, ఇతర పదార్థలనున్ను వ్యవహారయోగ్యములనుగాఁ జేయునట్టి యొక వస్తువును గదా! ప్రకాశమందురు. ఇట్లుండ, వారి మత ప్రకార మిట్టి విశేషము లేవియును లేనట్టి వస్తువు ప్రకాశ మెట్లు కాఁగలదు? అయితే, అది ఘటాదిపదార్థములవలె అచిత్తనియే చెప్పవలసి వచ్చును. అట్లు తనను గాని, ఇతర పదార్థములను గాని వ్యవహారయోగ్యములనుగాఁ జేయకపోయినను, అది యట్లు చేయుటకు సమర్థమైన దని యెదవా? సమర్థమైనదనఁగా నేమి? అట్లనఁగా నది యట్టి సామర్థ్యము గలదగుట గదా. సామర్థ్యమనునది యొక గుణమే గాన, బ్రహ్మము గుణములు మొదలగు విశేషము లేవియును లేనిదను వాదము పరిత్యజింపఁబడినదగును. శ్రుతులు జెప్పుచుండుటంజేసి, యీ యొక్క విశేషము మాత్రము బ్రహ్మముకుఁ గలదని యంగీకరించెదనియెదవా? యీ యొక్క విశేషము నంగీకరించుటచే దీనిని బట్టి సర్వజ్ఞుఁడగుటయు, సర్వశక్తి గలవాఁడగుటయు, సర్వేశ్వరుఁడగుటయు, సమస్తకల్యాణగుణముల కాకరుఁడగుటయు, హేయగుణము లేమాత్రము లేనివాఁడనుటయు నీ మొదలగు గుణముల నన్నింటి నంగీకరింపవలసివచ్చునే? శక్తిగలవాఁడనఁగా కార్యవిశేషముల నొనర్చుటకుఁ దగినవాఁడగుట. అది యతని కార్యవిశేషములను బట్టియే నిరూపింపఁదగినది. అతఁడొనర్చిన జగన్నిర్మాణాది కార్యములు ప్రమాణవిషయములు గానివియగు పక్షమునఁగదా యతని యట్టి శక్తియును ప్రామాణికము గాదని చెప్పవచ్చును. ఇంతియెగాక ఇంతకు పూర్వము ప్రతిపాదించిన ప్రకారము ప్రత్యక్షానుమానాగమాది ప్రమాణము లన్నియు సవిశేషవస్తువునే తెలియజేయునవి. గాన, నద్వైతులచే తత్త్వముగ నంగీకరింపఁబడిన నిర్విశేష

అద్వైతమత విమర్శనము.

వస్తువును దెలియఁజేయు ప్రమాణమే లేదు. కాఁబట్టి నానావిధచేతనాచేతనాత్మకమగు జగత్తుగా నగుటకు అనఁగా "బహు స్యాం" అను శ్రుతిప్రకారము నానావిధ మగుటకై ధ్యానింప సమర్థుఁడగు పురుషోత్తముఁడే ముముక్షువులచేఁ దెలిసికొనవలసినవాఁ డని సిద్ధ మగుచున్నది.

ఈక్షత్యధికరణము ముగిసెను.



## ఆనందమయాధికరణము.

అవతారిక:—ఇట్లు తెలిసికొన నిచ్ఛయింపఁబడిన పరబ్రహ్మము చేతనులకు భోగ్యభూతమును, జడపదార్థమును, సత్త్వరజస్తమోమయమునగు ప్రకృతికంటె విలక్షణమయిన దని పూర్వాధికరణమునఁ బ్రతిపాదింపఁబడియె. ప్రకృతమున, నట్టి పరబ్రహ్మము కర్మవశ్యుఁడును, సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతియొక్క సంసర్గమువలనఁ గలిగిన నానావిధసుఖదుఃఖరూప మగు సాగరమునందు మునింగి యుండుటచే అపరిశుద్ధుఁ డయినట్టి గాని, అట్టి ప్రకృతిసంబంధమునుండి విముక్తుఁ డగుటచే పరిశుద్ధుఁ డయినట్టి గాని యగుజీవునికంటెను వేఱయినవాఁ డనియు నిఖిలహేయప్రత్యనీకనిరతిశయానందయుక్తుఁ డనియును ప్రతిపాదించుచున్నారు.

### ౧౩॥ సూ॥ ఆనందమయోఽభ్యాసాత్.

టీ॥ ఆనందమయః = ఆనందమయశబ్దవాచ్యుఁడు, (పరమాత్మయే.) ఏలననఁగా, అభ్యాసాత్ = శ్రుతులయం దానందమును నూఱునూఱు రెట్లవంతును గుణించి చెప్పినందున.

తా॥ శ్రుతులయందు ఆనందమును నూఱునూఱు రెట్లవంతున గుణించి క్రమముగ ఎక్కించి తుదకు మితిలేనియానందము గలవాఁ డానందమయుఁ డని చెప్పినందున, అతఁడు పరమాత్మయే.

శ్రీ॥ భా॥ [1]తైత్తిరీయులు "స వా ఏష పురుషో ఽన్నరసమయః" (తై.

(1) పరమాత్మను గుఱించి యుపదేశించుటకై ప్రవర్తించిన యీతైత్తిరీయోపనిషత్తు లోకబుద్ధ్యనుసారముగాను మొదట నన్నమయుఁడగు శరీరమే పరమాత్మ యని యుపదేశించి పిమ్మటఁ గ్రమక్రమముగా నాంతరములగు ప్రాణమయ మనోమయ విజ్ఞానమయకోశములను పరమాత్మ అని తెలిపి యన్నిటి యంతరమున నానందమయుఁ డున్నట్లు బోధించెను. ఈయానందమయుని లోపల మఱి యెవ్వఁడు గాని యున్నట్లు చెప్పియుండక పోవుటచే వాఁడే పరమాత్మ యని సిద్ధమగుచున్నది. ప్రకరణము వలన నానందమయవాచ్యుఁడు జీవాత్మ యని తోఁచు చున్నను, సర్వాంతరత్వము శ్రుతులవలన వానికిఁ బ్రాప్తమగుచుండుటచే వాఁడు పరమాత్మయే యని

ఆ. ౧ అను) అని యారంభించి అన్నరసమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయులను జెప్పి, యనంతరము "తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయా దన్యో. ఽంతర ఆత్మా ఆనందమయః" (తై. ఆ. ౫ అను) అనువాక్యమున విజ్ఞానమయుని కంటె నన్యుఁడు ఆనందమయుఁ డని పఠించుచున్నారు. ఇం దొకసంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈసందర్భమునఁ జేర్కొనఁబడిన ఆనందమయుఁడు బంధమోక్షములను పొందునట్టియు, జీవుఁ డనఁబడు ప్రత్యగాత్మకంటె నన్యుఁ డగు పరమాత్మయా? కాక, అట్టి ప్రత్యగాత్మయేనా?

## పూర్వపక్షము.

"తస్యైష శారీర ఆత్మా" అనువాక్యమున నీయానందమయుఁడు శారీరుఁ డని చెప్పఁబడి యున్నాఁడు. శారీరుఁ డనఁగా శరీరసంబంధము గల జీవుఁడు గదా! కావున ఆనందమయశబ్దవాచ్యుఁడు ప్రత్యగాత్మ యనుట యుక్త మనిన.

శంక:—అయినను, ఇంతకు పూర్వము జగత్కారణముగ ప్రతిపాదింపఁబడిన పరబ్రహ్మమును, జిజ్ఞాసులకు సులభమార్గమునఁ దెలియఁజేయుటకై, యతఁడు అన్నమయుఁ డనియు, ప్రాణమయుఁ డనియు నివ్విధమున క్రమముగా బోధించి, యనంతర మతఁ డానందమయుఁ డని శ్రుతివాక్యము తెలుపుచున్నది. అట్టి జగత్కారణ మగు పరబ్రహ్మము సర్వజ్ఞుఁ డనియు, సర్వేశ్వరుఁ డనియును గదా "తదైక్షత" ఇత్యాది శ్రుతివాక్యములనుబట్టి ప్రతిపాదింపఁబడియె.

సమాధానము:—సత్యమే. అయినను, అట్లు జగత్కారణముగాఁ జెప్పఁబడిన సర్వేశ్వరుఁడు జీవునికంటెను వేఱు కాఁడు. ఎట్లనిన, "అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య" "జగత్కారణవస్తువు జీవుఁడుగా నన్నింటిలోను ప్రవేశించి" అనియు "తత్త్వమసి శ్వేతకేతో" "ఓ శ్వేతకేతుఁడా! జగత్కారణ మగు బ్రహ్మము నీవే" అనియు, నీవాక్యములు ఇంతకు పూర్వము జగత్కారణముగ ప్రతిపాదింపఁబడిన పదార్థమును, జీవునిన్ని సామానాధికరణ్యముచే నిర్దేశింపుచున్నవి. అనఁగా జగత్కారణపదార్థమున్ను జీవుఁడున్ను ఒక్కటియే యని

---

సిద్ధ మగుచున్నది. ఆనందమయునకు .శిరీరాద్యవయవకల్పన చేయఁబడియుండుటచే వాఁడు పరమాత్మ కాఁ డని వచ్చిన యాక్షేపమును యుక్తము కాదు. ఏలననఁగా నవ్యవహిత పూర్వోపాధి యగు విజ్ఞానమయకోశమును బురస్కరించుకొని యవయవకల్పనయు, నన్నమయాది శరీరపరంపరాద్వారముగఁ బ్రదర్శ్యమానుఁ డగుటచే శారీరత్వకల్పనయు, వానికిఁ జేయఁబడెను. ఇంతియెకాని వాఁడు నిజముగా సంసారివలె శరీరధారి యగుటచేఁ గాదు. ఇట్లగుటచే నానందమయుఁడు పరమాత్మయే యని సిద్ధమగుచున్న దని వృత్తికారుని సిద్ధాంతము.

తెలుపుచున్నవి. ఏకత్వమును (ఒక్కటియే యను యర్థమును) దెలియఁజేయునది గదా సామానాధికరణ్యము! దృష్టాంతము.—"సో ఽయం దేవదత్తః= ఆ దేవదత్తుఁడే యీతఁడు" ఇత్యాదివాక్యములయందు "సః" అనుపదమునకును, "అయం" అనుపదమునకునుగల సామానాధికరణ్యము "ఇంతకు పూర్వము మనము చూచిన దేవదత్తుఁడే ఇప్పుడు మనకుఁ గానఁబడు దేవదత్తుఁడు" అనెడి యేకత్వమును దెలియఁజేయుచున్నది.

ఇంతియె కాక, జీవుఁడు చేతనుఁ డగుటంజేసి ఈక్షణపూర్వకముగ అనఁగా సంకల్పపూర్వకముగ సృష్టి నొనర్చుట యీతనికిఁగూడ సంభవమే. "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాదిశ్రుతులును "బ్రహ్మమును దెలిసికొనిన జీవుఁడు పరస్వరూపమును బొందుచున్నాఁడు" అనుచు "ఈ యచిత్సంబంధము లేని స్వరూప మెద్దియో, అదియే యతనికిఁ బ్రాప్య మని యుపదేశింపుచున్నవి. అట్టి యచిత్సంబంధరహితమగు జీవస్వరూపము సత్య మనియు, జ్ఞాన మనియు, అనంత మనియు, బ్రహ్మ మనియును "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" ఇత్యాది శ్రుతులు లక్షణపూర్వకముగాఁ దెలుపుచున్నవి. అట్టి స్వరూపమును బొందుటయే మోక్షము. కనుకనే "నహ వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి రస్తి। అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః" అను శ్రుతివాక్యము "శరీరసంబంధము గల జీవుని సుఖదుఃఖము లెన్నఁడును విడనాడవు. అట్టి శరీరసంబంధము లేని జీవుని సుఖదుఃఖము లెన్నఁడును సంబంధింపవు" అని చెప్పుచున్నది. కనుక నిట్లు అచిత్తగు శరీరముతో సంబంధము లేక పోవుటచే నవిద్యారహితుఁ డగు జీవునియొక్క స్వాభావికస్వరూపమే ప్రాప్యభూత మని తెలుపుటకై యుపక్రమించి తుట్టతుదకు అట్టిస్వరూపముగలవాఁ డానందమయుఁ డని కదా శ్రుతులు ఉపదేశింపుచున్నవి. ఎట్లనిన, శ్రుతులు [1]శాఖాచంద్రన్యాయప్రకార మాత్మస్వరూపమును గాన్పించుటకై యుపక్రమించి, ముందుగ నన్నమయపురుషుఁ డనఁబడునట్టి యీశరీరము నాత్మనుగా నెఱుంగు మని చెప్పి, యనంతరము అట్టి శరీరము లోపలనున్నదై దానికి ఆధారభూతమును, ప్రాణాపానాదిపంచవృత్త్యాత్మకమును నగు ప్రాణము నాత్మనుగా నెఱుంగు మని చెప్పి, తరువాత అట్టి ప్రాణములో

---

(1) శాఖాచంద్రన్యాయము:—చంద్రుఁడు ఆకాశమున నెంతయోదూరమున నున్నను, ఒకనికి చంద్రుని చూపించునపుడు మనము లోకమున సాధారణముగ "అదిగో ఆచెట్టుయొక్క కొమ్మమీఁదుగ చంద్రుఁడు ఉన్నాఁడు చూడు" అని చెప్పువాఁడుక గలదు. అట్లే ప్రకృతమునను ఆత్మ అన్నమయాదులతో నెంతమాత్రము సంబంధము లేనిదిగా నున్నను, "అన్నమయుని ఆత్మనుగా నెఱుంగుము ప్రాణమయుని ఆత్మనుగా నెఱుంగుము" అని యిట్లు చెప్పఁబడియె. ఇట్లు చెప్పుట శాస్త్రమునందు శాఖాచంద్రన్యాయ మనఁబడుచున్నది.

పలనుండు మనస్సును ఆత్మనుగా నెఱుంగు మని చెప్పుచు నివ్విధముగ "ప్రాణమయః" "మనోమయః" "విజ్ఞానమయః" ఇత్యాదివాక్యములచేఁ గ్రమముగా నొకదానివిషయమగు జ్ఞానమును, మఱియొకదానివిషయమై మరలించుచు, తుట్టతుదకు "అన్యోఽన్తర ఆత్మా ఽఽనందమయః" అనువాక్యమున "వీని కన్నింటికిని లోపలనుండు జీవాత్మను, ఆనందమయునిగా నుపదేశించి, యంతటితో నీయంతరాత్మపరంపరను ముగించుచున్నవి. కనుక శ్రుతులు "బ్రహ్మవిదాప్నోతి పరమ్" అని యుపక్రమించి బోధించిన బ్రహ్మము జీవాత్మస్వరూపమే. ఇదియే ప్రకృతమున నానందమయ మని యుపదేశింపఁబడినదిగాను నిశ్చయింపఁబడుచున్నది.

అద్వైతి:—తరువాతిశ్రుతివాక్యము "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" (బ్రహ్మము పుచ్ఛము (ఆనందమయముయొక్క యాధారము) అనుటచే ఆనందమయ మగు దానికంటెను బ్రహ్మము వే అని తెలియుచున్నదే?

సాంఖ్యుఁడు:—అట్లు చెప్పఁదగదు. బ్రహ్మమే తనయొక్క స్వభావభేదముచే పురుషాకారముతోఁ బోల్పఁబడినదై శిరస్సు, పక్షము, పుచ్ఛము ఈ మొదలగు రూపము గలదిగాను నిర్దేశింపఁబడుచున్నది. అ దెటువలె ననిన, అన్నవికారమును, దేహరూపము నగు నవయవి వస్తువు తననుండి వేఱుకానివి యగు శిరస్సు, పుచ్ఛము మొదలగు నవయవములచేతనే "తస్యేద మేవ శిరః" ఇత్యాది తావులను గాన్పింపఁబడినట్లు, ప్రకృతమునను ఆనందమయుఁడగు బ్రహ్మమున్ను తననుండి వేఱుగా నుండనివి యగు ప్రియమోదాదులచేఁ గాన్పింపఁబడు చున్నది. అందు అవయవములుగాను గాన్పింపఁబడిన ప్రియము, మోదము, ప్రమోదము, ఆనందము వీనికి నాధారభూతమగుటచే అఖండరూపమగు నానందమయవస్తువు "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అనువాక్యమునఁ జెప్పఁబడినది. ఈ తావునఁ బేర్కొనఁబడిన ఆనందమయవస్తువుకంటె బ్రహ్మము వే అయిన దగుపక్షమున, అట్టి వస్తువుకంటెను వేఱుగ ఆత్మ యనఁబడు బ్రహ్మమొక్కటి కలదని శ్రుతివాక్యమునఁ జెప్పి యుండవలయును గదా! అయితే అట్లెచటను చెప్పియుండ లేదే! దీని ఫలితార్థ మే మనఁగా, శ్రుతివాక్యములు "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (బ్రహ్మమును ఉపాసించువాఁడు ఉత్కృష్టమగు పదమును బొందుచున్నాఁడు) అనువాక్యమున బ్రహ్మమును గుఱించి చెప్ప నారంభించి, "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనువాక్యమున, బ్రహ్మము తన కంటెను వేఱగు సమస్తపదార్థములకంటెను విలక్షణ మయినదని యిట్లు బ్రహ్మమును సలక్షణముగా ప్రతిపాదించి, యట్టి బ్రహ్మమునే "తస్మా ద్వా ఏతస్మా దాత్మనః" అనువాక్యమున ఆత్మనుగా నిర్దేశించి, యది సర్వత్ర వ్యాపించి యుండుటచే దాని నాత్మనుగా నిరూపించుటకై అన్నమయాదులలో నొక్కొక్కటిలోఁ

నుండుటచే నాత్మలుగాఁ జెప్పఁబడిన ప్రాణమయాదుల నతిక్రమించి పోయి "అన్యోఽన్తర ఆత్మా ఆనందమయః" అనువాక్యమున తుదకు ఆనందమయునే యాత్మనుగాఁ జేర్కొని ముగించుచున్నవి. కావున మొదటినుండి యాత్మగాఁ జేర్కొనఁబడిన బ్రహ్మమే యానందమయుఁ డని నిశ్చయింపఁబడు చున్నది.

అద్వైతి:—శ్రుతులు "బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా" అని పఠించిన తరువాత "అసన్నేవ స భవతి అస ద్బ్రహ్మేతి వేదచేత్। అస్తి బ్రహ్మేతిచే ద్వేద స న్త మేనం తతో విదుః" (బ్రహ్మము లేనిది యని యెఱింగినచో, ఆత్మయు లేక పోవును. బ్రహ్మము కల దని యెఱింగినచో, ఆత్మయు కలఁడు) అనుశ్లోకమున బ్రహ్మమును గుఱించినజ్ఞాన మున్నచో, ఆత్మయు నుండునది యగు ననియు, అట్టి జ్ఞానము లేనిచో, ఆత్మయును లేనిది యగుననియును చెప్పుచున్న వే గాని, యానందమయ వస్తువును గుఱించిన జ్ఞానాజ్ఞానములవలన నట్లు చెప్పుచుండలేదు.

అయితే యానందమయుఁడు ప్రియమోదాదిరూపుఁడుగా నెల్లఱకును తెలిసినవాఁడే గాన, నతని యునికిని గుఱించి గాని యతని లేమిని గుఱించి గాని సంశయము గలుగుటయే యసంభవము. కావున నీపైని యుదహరించిన శ్లోకము ఆనందమయుని గుఱించినది కాదు. కావున బ్రహ్మము ఆనందమయుని కంటెను వే ఱయిన దని నిశ్చయింపఁబడు చున్నది.

సాంఖ్యుఁడు:—అట్లు చెప్పఁ దగదు. ఏల ననిన, తైత్తిరీయులు "ఇదం పుచ్ఛం ప్రతిష్ఠా" అనియు, "పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా" అనియు, "అథర్వాంగిరసః పుచ్ఛం ప్రతిష్ఠా" అనియు, "మహః పుచ్ఛం ప్రతిష్ఠా" అనియు నిట్లు పఠించి తరువాత "అన్నా ద్వై ప్రజాః ప్రజాయన్తే" ఈ మొదలగు శ్లోకముల నుదహరించి యున్నారు. ఆ శ్లోకములు పుచ్ఛమాత్రమును ప్రతిపాదింపనివై, అన్నమయాదిపురుషుని ప్రతిపాదించుచున్నవి. అట్లే, ప్రకృతమునను "అస న్నేవ" అనుశ్లోకము ఆనందమయుని ప్రతిపాదించునదియే గాని యట్టి యానంద మయునికంటెను వే ఱగు పుచ్ఛమును ప్రతిపాదించునది కాదు. ఆనందమయుఁడే బ్రహ్మ మైనను, ప్రియమోదాదిరూప మైనదిగాఁ జెప్పఁబడినట్టి యపరిచ్ఛిన్నా నందము ఉన్నది యనెడి జ్ఞానమును గుఱించి గాని, యది లే దనెడి జ్ఞానమును గుఱించి గాని యా శంక గలుగుట సంభవమే. ఏలననిన, మీ రంగీకరించిన పుచ్ఛబ్రహ్మము అపరిచ్ఛిన్నుఁ డగుటం జేసియే గదా యప్రసిద్ధుఁడు. బ్రహ్మము స్వతస్సిద్ధముగ శిరస్సు మొదలగు నవయవములు లేనివాఁ డగుటం జేసి ఆనంద మయుఁడు బ్రహ్మము కాదంటివేని, బ్రహ్మముకు పుచ్ఛరూప మగు నాధారము లేక పోవుటం జేసి పుచ్ఛము గూడ బ్రహ్మము కాకపోవును. అవిద్యాపరికల్పిత మగు వస్తువు అట్టి బ్రహ్మము కాశ్రయ మగుటంజేసి "బ్రహ్మ పుచ్ఛమ్" అనుతావున ఉపమానముగాను పుచ్ఛము మాత్రము చెప్పఁబడినది యందు వేమో, అట్లంటి

వేని, దుఃఖముకంటె విలక్షణుఁ డగు ఆనందమయబ్రహ్మముకు ప్రియశిరస్త్వాదులు సయితము ఉపమానముగానే చెప్పఁబడినవి కాఁగలవు. ఏతావతా “ సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ ” అను శ్రుతివాక్యముచే వికారాస్పదమును, జడమును, పరిచ్ఛిన్న మునగు వస్తువుకంటె విలక్షణ మయినదిగాఁ జెప్పఁబడినది యెద్దియో, యదియే దుఃఖముకంటెను విలక్షణ మయినదిగా నానందమయశబ్దముచే ఉపదేశింపఁబడు చున్నది. అందువలన అఖండైకరస మగుబ్రహ్మమును తెలుపునట్టి “ఆనందమయ” శబ్దములోని “ మయట్ ” ప్రత్యయము “ ప్రాణమయః ” ఇత్యాదిశబ్దములలోని “ మయట్ ” ప్రత్యయమువలెనే [1]స్వార్థమునఁ జేర్పఁబడినది యని యెఱుఁగునది. కావున అవిద్యాపరికల్పితుఁడును, దేవాది నానావివిధవిచిత్రభేదములు గలవాఁడు నగుజీవాత్మకు స్వాభావికమును, అఖండైకరసమును, సుఖాస్పదమును నగు రూపము ఆనందమయ మని తెలుపఁబడు చున్నది. కాఁబట్టి ప్రకృతమున ఆనంద మయుఁ డనఁగా జీవుఁడే యని సిద్ధ మగుచున్నది. ఇట్లు పూర్వపక్షము రాఁగా.

## సిద్ధాంతము.

ఆనందమయుఁడు పరమాత్మయే. ఏల ననిన, శ్రుతులయందు “ సైషా ఽనన్దస్య మీమాంసా భవతి ” (ఇట్లు ఆనందమును గుఱించి విచారింపఁబడును) అని యారంభించి “ యతో వాచో నివర్తన్తే ” అనువాక్యము వరకు నూఱు నూఱు రెట్లవంతున గుణించి క్రమముగా నెక్కించి తుట్టతుదకు అంతకు మించిన ధెద్దియును లేనట్టిదిగాఁ జెప్పఁబడిన ఆనందము అనంతదుఃఖమిశ్రిత మును, పరిమితము నగు స్వల్పసుఖము గల జీవునియం దుండుట యసంభవ మగుచు, నిఖిలహేయప్రత్యనీకుఁడును, కల్యాణములకు ముఖ్యాశ్రయుఁడును, ఇతరము లగు సర్వపదార్థములకంటెను విలక్షణుఁడును నగు పరమాత్మయే తనను గలిగి యుండువాఁ డని తెలుపుచున్నది. కనుకనే శ్రుతులును “తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయా దన్యో ఽన్తర ఆత్మా ఆనన్దమయః ” అనఁగా “ ఈ విజ్ఞానమయునికంటెను వేఱుగ లోపల నుండునట్టి యాత్మ ఆనందమయుఁడు” అని చెప్పుచున్నవి. ఈతావున విజ్ఞానమయుఁ డనఁగా జీవుఁడు. ఈ విజ్ఞానమయ శబ్దము బుద్ధిమాత్రమును తెలుపునది కాదు. ఏల ననిన, “ విజ్ఞానమయ ” శబ్దమునం దుండు “ మయట్ ” ప్రత్యయము విజ్ఞానమయుఁడు కేవల విజ్ఞాన (బుద్ధి) మాత్రముకంటెను వే ఱయినవాఁ డని తెలుపుచున్నది. వే ఱొక్కగతి లేక పోవుటం జేసి “ ప్రాణమయ ” శబ్దమునం దుండు “ మయట్ ” ప్రత్యయము

---

(1) ఏదైన నొకప్రత్యయము తనకుగాను వేఱొక్కయర్థము లేనిదై యొకప్రకృతితోఁ జేర్పఁబడినదైన నది స్వార్థమునవచ్చిన ప్రత్యయ మనఁబడును. దృష్టాంతము:—“ బాలః ” అన్నను “ బాలకః ” అన్నను ఒక్కటియే యర్థము. ఇచ్చట “ క ” ప్రత్యయము స్వార్థమున వచ్చినది.

స్వార్థమునఁ గ్రహింపఁబడినది. "విజ్ఞానమయ" శబ్దమునం దుండు "మయట్" ప్రత్యయ మన్ననో, అట్టి విజ్ఞానము గల జీవుఁ డొక్కఁడు ఉండుటం జేసి, యది ప్రాణమయశబ్దమునం దుండువానివలె నర్థము లేనిది యని చెప్పుట న్యాయ్యము కాదు. బద్ధావస్థయందు గాని ముక్తావస్థయందు గాని ప్రత్యగాత్మ జ్ఞానము గలది యని చెప్పియున్నాము గదా! ప్రాణమయాదిశబ్దములయం దుండు "మయట్" ప్రత్యయమున కర్థము కలదనువిషయమును గుఱించి యింకమీఁదు చెప్పఁబడును.

అయితే విజ్ఞానమయుని గుఱించి చెప్పునట్టి "విజ్ఞానం యజ్ఞం తనుతే" అను శ్లోకమున కేవలము "విజ్ఞాన" శబ్దమునే ప్రయోగించి యున్నారే? అది యెట్లు పొసఁగు నంటివేని, చెప్పెదను. జ్ఞాతయే యగు నాత్మయొక్కస్వరూప మున్ను స్వయంప్రకాశ మగుటం జేసి, యది విజ్ఞాన మని చెప్పఁబడుచున్నది. కావున దోషము లేదు. జ్ఞానమును బట్టియే గదా జ్ఞాతయొక్కస్వరూపము నిరూపింపఁబడుచున్నది. స్వరూపమును నిరూపించు నట్టి శబ్దములు ధర్మమును తెలుపుచు, అందు మూలముగ ధర్మయుక్తమగు పదార్థమునున్ను తెలుపుచున్నవి. "కృత్య ల్యుటో బహుళమ్" అను పాణిని సూత్రప్రకారము గాని, నంద్యాది గణములోఁ బఠింపఁబడినదానినిగా నైనను గొని, "నన్దిగృహీతి" ఇత్యాది సూత్ర ప్రకారము గాని విజ్ఞానశబ్దము కర్త్రర్థమున "ల్యుట్" ప్రత్యయుక్త మైనది గాఁ గొనఁబడుచున్నది. కావుననే "విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతే ఽపి చ" అనఁగా "విజ్ఞానము (జీవుఁడు) యజ్ఞమును జేయుచున్నది కర్మముల నొనర్చుచున్నది" అనుతావున విజ్ఞానము కర్తగా (ఒకదానిని చేయునదిగా) వినఁబడుచున్నది. కేవల బుద్ధికి కర్తృత్వ ముండుట యసంభవము. చేతనులకు ఉపకరణభూతములును, అచేతనములును, విజ్ఞానమయమునకంటె పూర్వము పఠింపఁబడినవియును నగు అన్నమయాదులను గుఱించి యట్టి కర్తృత్వము శ్రుతులయందు వినఁబడుచుండ లేదు. కావుననే చేతనాచేతనపదార్థములు వాని కసాధారణము లగు ధారకత్వాధారకత్వాదిధర్మవిశేషములను బట్టి "[1]విజ్ఞానం చావిజ్ఞానంచ" ఇత్యాదివాక్యమున విభజనపూర్వకముగాఁ బేర్కొనఁబడుచున్నవి. ఈపై శ్రుతియం దుండు "విజ్ఞాన" శబ్దము విజ్ఞానమే గుణముగాఁ గల చేతనపదార్థమును తెలుపునది. కనుకనే అన్తర్యామిబ్రాహ్మణమున "యో విజ్ఞానే తిష్ఠన్" అని కాణ్వశాఖవారు పఠించిన వాక్యమునే మాధ్యందినశాఖవారు పఠించునపుడు "య ఆత్మని తిష్ఠన్" అని పఠించుచుఁ గాణ్వపాఠమున నుండు "విజ్ఞాన" శబ్దము జీవవాచక మని విశదపఱచి యున్నారు. అట్టి జీవుని నొకవస్తువునుగాఁ గొనుటం జేసి యిచట "విజ్ఞాన" శబ్దము నపుంసకలింగమునఁ బ్రయోగింపఁ

---

(1) విజ్ఞానశబ్దము "విజ్ఞానముగలవాఁడు" అను నర్థము నిచ్చునది యగువిషయమై యీ సూత్రములఁ జూచుకొనునది.

బడినది. ఈపైని గానఁబఱచిన హేతువులను బట్టి విజ్ఞానమయుఁ డగు జీవునికంటెను వేఱయినవాఁడును, వానిలోపల నుండువాఁడు నగు పరమాత్మయే ఆనందమయుఁ డని సిద్ధ మగుచున్నది. "విజ్ఞానం యజ్ఞం తనుతే" అను శ్లోకమున జ్ఞానముమాత్రమే చెప్పఁబడి, జ్ఞాత (జ్ఞానవంతుఁడు) చెప్పఁబడక పోయినను, "అన్యో ఽన్తర ఆత్మా విజ్ఞానమయః" అనువాక్యమున నట్టిది జ్ఞాతయే యని విశదముగాఁ దెలుపఁబడుచున్నది. అది యెటువలె ననిన, "అన్నాద్వై ప్రజాః ప్రజాయన్తే" అనుశ్లోకమున కేవలము అన్నము చెప్పఁబడినను "సవా ఏష పురుషో ఽన్నరసమయః" అనువాక్యమున అన్నము మాత్రమే చెప్పఁబడక అన్నమయవస్తువు అనఁగా అన్నవికారము (శరీరము) చెప్పఁబడుచున్నది. దీని నంతయును మనస్సులో నుంచుకొనియే సూత్రకారుఁడు "భేద వ్యపదేశాత్" అనుసూత్రమును ఇఁకమీఁదు చెప్పఁబోవుచున్నాఁడు.

జగత్కారణముగాఁ జెప్పఁబడిన వస్తువు "అనేన జీవే నాత్మనా ఽను ప్రవిశ్య" అనియు, "తత్త్వ మసి" అనియు, నిట్లు జీవునితో నొక్కటిగాను గాన్పింపఁబడినందున, నది జీవునికంటెను వేఱయినది కాదనియు, కావుననే శ్రుతులు అట్టివస్తువునే "బ్రహ్మవి దాప్నోతి పరమ్" అను వాక్యముచేఁ జెప్ప నారంభించి దానినే దుఃఖముకంటె విలక్షణ మైనదానినిగా నానందమయ శబ్దముచేఁ దెలుపుచున్నవి యనియు నిట్లు పూర్వపక్షి చేసిన వాదము యుక్త మైనది కాదు. ఏల ననిన, జీవుఁడు చేతనుఁడే యయినను, "తదైక్షత బహు స్యాం ప్రజాయా యేతి తత్తేజో ఽసృజత" అను వాక్యమునఁ జెప్పియున్న ప్రకారము స్వసంకల్పమాత్రమున అనన్తవిచిత్రసృష్టిని గలుగఁజేయుట యసంభవము. ఈ జీవుఁడు ముక్తావస్థయందు సయితము జగత్సృష్టి మొదలగువాని నొనర్చుట యసంభవ మని "జగద్వ్యాపారవర్జమ్" (బ్ర. సూ. ౪ అ. ౪ పా. ౧౭ సూ.) అనియు, "భోగమాత్రసామ్యలింగాచ్చ" (బ్ర. సూ. ౪ అ. ౪ పా. ౨౧ సూ.) అనియు నీసూత్రములయందు ఉపపాదింపఁబడును.

సాంఖ్యుఁడు:—కారణభూతుఁ డగుబ్రహ్మము జీవస్వరూపుఁడేయని యంగీకరింపని పక్షమున, "అనేన జీవే నాత్మనా" అనియు, "తత్త్వ మసి" అనియు నీమొదలగు శ్రుతివాక్యములలో జీవబ్రహ్మములు నొక్కటియే వస్తువునుగాఁ జెప్పుట యెట్లు సంభవ మగును?

భాష్యకారులు:—అట్లంటివేని, నిరస్తనిఖిలదోషుఁడును, సత్యసంకల్పుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడును, అనవధికాతిశయాసంఖ్యేయకల్యాణగుణాకరుఁడును, సమస్తమునకును కారణభూతుఁడును నగు బ్రహ్మము, నానావిధానన్త దుఃఖాకరుఁడును, కర్మాధీనుఁడును, చిన్తితనిమిషితాదిప్రవృత్తియుక్తుఁడును నగు జీవుఁ డగుట యెట్లు సంభవము?

అద్వైతి:—ఈ రెంటిలో నొక్కటి వాస్తవముగా లేదు గాన,సంభవమే.

భాష్యకారులు:—అట్లు వాస్తవముగా లేనిది యేది? హేయగుణసంబంధమా? లేక, హేయగుణములకు విరుద్ధ మైనదై కల్యాణగుణములకు ముఖ్యస్థానమగు స్వభావమా?

అద్వైతి:—హేయములకువిరుద్ధ మగు కల్యాణస్వరూపము గల బ్రహ్మము అనాద్యవిద్యకు ఆశ్రయ మగుటంజేసి, అతనికి హేయసంబంధము ఉన్నట్టిదిగాను భ్రాంతివశమునఁ గానఁబడుచున్నది. కావున నట్లు హేయసంబంధము యొక్క ప్రతిభాసము (కానఁబడుట) మిథ్యయనఁబడును.

భాష్యకారులు:—మీరు చెప్పునది విరుద్ధముగా నున్నది. ఏల ననిన, బ్రహ్మము హేయములకు విరుద్ధమైనదై కల్యాణముకు ముఖ్యస్థాన మగుటయు, అనాది యగు నవిద్యకు ఆశ్రయమగుటంజేసి అనన్తదుఃఖ విషయ మగు మిథ్యాప్రతిభాసమున కాశ్రయ మగుటయును ఈ రెండును పరస్పరము విరుద్ధములు. ఎట్లనిన, అవిద్య కాశ్రయ మగుటయు, అందువలనఁగలుగు దుఃఖములప్రతిభాసమున కాశ్రయ మగుటయును గదా హేయసంబంధ మనఁబడును. అట్టి హేయములతో సంబంధించియుండునది యగుటయు, అందులకు విరుద్ధ మయిన దగుటయును ఒక్కటే వస్తువునం దుండుట విరోధించునే? అట్లయినను,వానిలో నొక్కటి (హేయసంబంధము) మిథ్యాభూతము గాన, విరోధము లే దనియెద వేమో? అట్లు చెప్పఁదగదు. ఏలననిన, అది మిథ్యాభూతమే మైనను, అది యపురుషార్థమే (దుఃఖజనకమే) గదా! దానిని తొలంగించుటకైయే గదా సమస్తవేదాంతములును ప్రవర్తించిన వని నీవే చెప్పియున్నావే? అట్లు నిరసింపఁదగినది యగు అపురుషార్థముతో సంబంధ మనఁబడునది, బ్రహ్మము హేయమునకు విరుద్ధమగు కల్యాణమునకు ముఖ్యస్థాన మగుటచే, విరోధించును. ఏమి చేయుదము?

శ్రుతులే "యే శ్రుతం శ్రుతం భవతి" (ఛా. ౧ ఖ. 3 వా) అనువాక్యమున,,ఒక్కటి తెలియుటచే సర్వము తెలియఁబడును"అని ప్రతిజ్ఞ చేసి"స దేవ సోమ్యేదమగ్ర ఆసీత్"ఇత్యాది వాక్యములచే,,బ్రహ్మము నిఖిలజగదేక కారణము" అనియు "తదైక్షత బహు స్యాం" ఇత్యాదివాక్యములచే ,,అది సత్యసంకల్పము గలది" అని యును ప్రతిపాదించి, అనంతరము "తత్త్వమసి" (ఆబ్రహ్మమే నీవు) ఇత్యాదివాక్యములచే ,,అట్టిబ్రహ్మమే జీవుఁడు'' అని సామానాధికరణ్యముచే తెలుపుటచే బ్రహ్మము అనంతదుఃఖముల కాశ్రయభూతమైన దని ప్రతిపాదించుచున్నవి. ఇట్లు శ్రుతిప్రతిపాదిత మగు నర్థము వేఱొక్కవిధ మైనదగుట యసంభవము గాన,బ్రహ్మమే యవిద్య కాశ్రయభూత మయినదని కల్పించుకొనవలయు ననియెదవా?

అట్లు చెప్పఁదగదు. ఏలననిన, శ్రుతిప్రతిపాదిత మగునర్థమును ఉపపాదించుటకుగానైనను అసంభవమును (యుక్తియుక్తముకానిదియు) విరుద్ధము నగు (ప్రమాణవిరుద్ధమునగు) దానిని కల్పించుకొనుట న్యాయ్యము కాదు.

ఒకవేళ, బ్రహ్మముకు హేయసంబంధనే వాస్తవముగాఁ గల దనియు అది కల్యాణైకస్వభావమగుట మిథ్య యనియును గ్రహించెదవా ?

అబ్బా ! అట్లంటివేని తాపత్రయపీడితు లగువారిని ఉజ్జీవింపఁజేయుటకై ప్రవర్తించినదియగు శాస్త్రము అట్టివానికి ఆతాపత్రయమువలనఁ బీడితుఁడగుటయే పరమార్థ మనియు, కల్యాణైకస్వభావ మగుట యన్ననో, భ్రాంతి మూలముగాఁ గల్పింపఁబడినది యనియును బోధించెనేని, యది వానిని బాగుగానే యుజ్జీవింపఁజేయును !

అద్వైతి:—ఈ దోషమును తొలఁగించుటకై, బ్రహ్మముయొక్క నిర్విశేష చిన్మాత్రస్వరూపము తప్ప తక్కినది అనఁగా జీవుఁడుగా నుండుట, దుఃఖిగా నుండుట యీ మొదలగునదియు, సత్యసంకల్పుఁ డగుట, కల్యాణగుణాకరుఁ డగుట, జగత్కారణ మగుట యీ మొదలగునదియు నిదియంతయును మిథ్య యని కల్పింపఁ దగును.

భాష్యకారులు:—వాక్యార్థమును బహుబాగుగా పరిశీలించుచున్నావే ! సర్వము మిథ్యయే యగుపక్షమున, తెలియఁదగిన దెద్దియును లేనేలేదు గాన, "ఒక్కటి తెలియుటచే సర్వము తెలియఁబడును" అనెడి ప్రతిజ్ఞ సిద్ధింపదు. ఏల ననిన, ఒక్కవస్తువును గుఱించిన జ్ఞాన మనఁబడునది వాస్తవముగా నుండునట్టి యొకవస్తువును గుఱించినది యగునట్లు, సమస్తపదార్థములను గుఱించినజ్ఞానమున్ను వాస్తవముగా నుండియున్నట్టివియే యగు సమస్తపదార్థములను గుఱించినదియును, ఏకవస్తువిషయకజ్ఞానములో నంతర్భూతమయినదియును నగు పక్షమునఁగదా, యొకవస్తువు తెలియుటచే సర్వము తెలియఁబడుట యనఁబడునది సిద్ధించును. దృష్టాంతము.— సత్యమగు శుక్తికను తెలిసికొనుటచే దాని నాశ్రయించియుండునట్టిదయు అసత్యము నగు రజతము తెలియరాదు గదా!

అద్వైతి:—"ఒక్కటి తెలియుటచే సర్వము తెలియఁబడును" అనెడి ప్రతిజ్ఞయొక్క యభిప్రాయ మేమనఁగా :—నిర్విశేషవస్తువు మాత్రమే సత్యము తక్కినదంతయు నసత్య మనుట.

భాష్యకారులు:—అట్లంటివేని, శ్రుతియందు "యేనాశ్రుతం శ్రుతం భవత్యమతం మతం అవిజ్ఞాతం విజ్ఞాతమ్" అనఁగా ,,దేనిచే వినఁబడనిదంతయు వినఁబడిన దగునో, తలంపఁబడని దంతయు తలంపఁబడిన దగునో, తెలియఁబడని దంతయు తెలియఁబడిన దగునో" అని యిట్లు చెప్పఁగిట్టదు. దేనిని వినుటచే

వినంబడనిదియును వినఁబడిన దగు నని గదా యీవాక్యముయొక్క యర్థము! ఇంతియెకాక, కారణముగాఁ గాన్పింపఁబడిన నిర్విశేషవస్తువుమాత్రమే వాస్తవముగ కలదని యీపై వాక్యమునఁ బ్రతిజ్ఞ చేయఁబడినపక్షమున, ««యథా సోమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం భవతి"(ఛా.౬.ప్ర ౧ఖ.౩వా) "ఒక్క మట్టిముద్దను తెలిసికొనుటచే మృద్వికారము లగు ఘటశరావాదులన్నియును తెలియంబడు చందంబున" అని యిట్లు శ్రుతియందుఁ గాన్పింపఁబడిన దృష్టాంతము సయితము పొసగక పోవును. [1]ఏలననిన, ««మట్టిముద్ద తెలియుటచే మట్టిముద్దతోఁ జేయఁబడిన ఘటశరావాదిపదార్థములు తెలియఁబడును" అని గదా నిదర్శనము గాన్పింపఁబడినది.

అద్వైతి:—అచటను వికారభూతము లగు ఘటశరావాదు లసత్యములనుటయే యభిప్రాయము.

భాష్యకారులు:— [2]మృత్తికయొక్క వికారములగు ఘటశరావాదులు రజ్జువునందు భ్రమించిన సర్పాదులవలె నసత్యము లగుట శిష్యునికి తెలియని విషయము. ఇట్లుండ, ఆచార్యుఁడు, దాని నొక ప్రసిద్ధవస్తువునుగాఁ గొని ప్రతిజ్ఞయొక్క యుపపత్తిని గాన్పించుటకై. "యథాసోమ్య" అనువాక్యమున మృత్తికను దృష్టాంతమునుగా నుపన్యసించుట పొసగదు. ఏలననిన, "తత్త్వమసి" ఇత్యాది మహావాక్యముల యర్థము నెఱుంగుటకు పూర్వము శిష్యుఁడు ఘటశరావాది వికారజాత మంతయు నసత్య మని తెలిసికొనుటకై యుపయుక్తమగునట్టి ప్రమాణ మెద్దియును, యుక్తులసహాయము గలది గాని, వాని సహాయము లేనిది గాని, గానఁబడదు. ఈవిషయమును గుఱించి " త దనన్యత్వమారమ్భణ

---

(1) ఇంతియె కాని, భ్రాంతివశమున శుక్తికను రజతమును గాఁ గొనినతావున శుక్తికను తెలిసికొనుటచే రజతము నెడి బుద్ధిపోవునట్లు మృత్తిక తెలియుటచే ఘటశరావాదులు నివర్తించునని గాన్పించి యుండ లేదే? అని భావము.

(2) ఘటశరావాది పదార్థములు అసత్యము లనఁబడు విషయము శ్వేతకేతునికి తెలియని విషయము. దానిని తెలిసికొనుటకును మార్గ మెద్దియును లేదు. అవి యన్నియును అసత్యములనుట శ్రుతియొక్కయభిప్రాయ మగునేని, శ్రుతి యట్టి యభిప్రాయమును స్పష్టముగాఁ దెలిపి తరువాత అట్టి యభిప్రాయమును నిదర్శనపూర్వకము గాఁ బ్రతిపాదించుటకై దృష్టాంతము నిచ్చియుండవలయును. తెలియనిదానిని తెలుపుటయే గదా శ్రుతియొక్క కర్తవ్యము. అట్టి యపూర్వమగు నభిప్రాయమును తెలుపకయే దృష్టాంతము నిచ్చుటచే, సామాన్యముగా శ్వేతకేతునికి ఘటాదులను గుఱించి యేది తెలియునో, దానినే నిదర్శనపూర్వకముగా ప్రతిపాదించుటకై ప్రవర్తించినట్లు విదితమగుచున్నది. కావున, ఘటశరావాదు లసత్యములనుట శ్రుతియొక్క యభిప్రాయము కాదు.

శబ్దాదిభ్యః" (బ్ర. సూ. ౧ అ. ౧పా, ౧౫ సూ.) అనుసూత్రమున విశదముగాఁ గాన్పింపఁబడును.

మఱియు "స దేవ సోమ్యేదమగ్ర ఆసీ దేక మే వాద్వితీయమ్" అనియు "తదైక్షత బహుస్యాం ప్రజాయాయేతి తత్తేజో ఽసృజత" అనియు, "హన్తాహ మిమా స్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనాఽనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" అనియు, "సన్మూలా స్సోమ్యే మాః స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః......ఐత దాత్మ్య మిదం సర్వం". అనియు నీమొదలగు వాక్యములయందు "ఈ జగత్తు సత్ అనఁబడు బ్రహ్మమే యాత్మగాఁ గల దగు

"తత్త్వమసి" అను మహావాక్యముయొక్క యర్థమును గుఱించిన విచారము.

టయు, సృష్టికి పూర్వము నామరూపవిభాగము లేకపోవుటయు, సచ్ఛబ్దవాచ్యుఁ డగుపరబ్రహ్మము జగత్తును సృజించుటలో వేఱొక్కదాని సహాయము నపేక్షింపక యుండుటయు, సృష్టికాలమున తానే యనంతస్థావర జంగమరూపమున స్వయముగా నగుదుననెడి యసాధారణసంకల్పవిశేషముతో సృజించుటయు, సమస్తము లగు చేతనాచేతన పదార్థములలోనను జీవశరీరుఁడుగాఁ బ్రవేశించి వాని నామరూపములను విశదపఱచుటయు, తాను తప్ప తక్కినవాని కన్నింటికిని తానే మూల మగుటయు, వాని కన్నింటికిని తానే యాశ్రయమగు టయు, అవి యన్నియును తనచేతనే ప్రవర్తింపఁబడుటయు, తనవలననే జీవించి యుండుటయు, తననే యాధారముగాఁ గలిగి యుండుటయు, ఇట్లు శాస్త్రము నుండియే తెలియఁదగినట్టి యనంతవిశేషములను పరబ్రహ్మము గలిగియుండుటయు నిదియంతయును ప్రతిపాదింపఁబడియె. అట్టి బ్రహ్మముతో సంబంధించి యుండు నట్టివి గాను ప్రకరణాంతరములయందు వినఁబడిన అపహతపాప్మము, నిరస్తనిఖిల దోషత్వము, సర్వజ్ఞత్వము, సర్వేశ్వరత్వము, సత్యకామత్వము, సత్యసంకల్పత్వము, అందఱికి నానందమును గలుగఁజేయునట్టి నిరతిశయానందమును గలిగి యుండు టయు నీమొదలుగా గల ప్రమాణాంతరవేద్యము లగు వేలకొలది విశేషము లును బ్రహ్మమునకుఁ గల వని ప్రతిపాదింపఁబడియె. ఇట్లు శాస్త్రప్రమాణముచేఁ దప్ప వేఱొక్క ప్రమాణముచేఁ దెలియరానివి యగు ననంతవిశేషములతోఁ గూడి యున్నట్టిదిగాఁ జెప్పఁబడినట్టి పరబ్రహ్మమును పరామర్శించునట్టి "తత్" అను శబ్దము అనఁగా "తత్త్వ మసి=తత్-త్వం-అసి" అను మహావాక్యమునం దుండెడి "తత్" అనుశబ్దము విశేషము లేవియును లేని వస్తువును మాత్రము తెలుపుఁ-ధి యని చెప్పుట కేవలము అసంగతము. కావున నది బుద్ధిహీనులు చెప్పునట్లున్నది. అందుండు "త్వం" అనుశబ్దము సంసారి యగు జీవుని తెలు పునది. అదియును విశేషములేవియునులేని వస్తువును మాత్రమే తెలుపుచున్న

దను పక్షమున, దాని స్వకీయమగు నర్థము పరిత్యజింపఁబడిన దగును. విశేషము లేవియును లేనిదై కేవలము ప్రకాశస్వరూపమగు వస్తువు అవిద్యచే మూయఁబడు పక్షమున, ఆవస్తువుయొక్క స్వరూపమునకు నాశము ప్రసక్తించును. కావున నట్లగుట యసంభవమని యింతకుఁ బూర్వమే చెప్పియున్నాము. [1] వారు చెప్పునట్లు ఈ వాక్యముయొక్క యర్థమును గైకొను పక్షమున, సమానాధికరణమునందు "తత్" "త్వం" అను శబ్దములయొక్క ముఖ్యార్థమును బరిత్యజించి లక్షణార్థమును గైకొనవలసివచ్చును.

అద్వైతి:—సామానాధికరణ్యము గల పదములు ఒక్కటియే వస్తువును బోధించునవి. కావున నవి విశేషణాంశమును తెలుపుటయందు తాత్పర్యము గలవి యగుట యసంభవము. అందువలన విశేషణాంశము నివర్తించుచున్నది. కావున నవి కేవల వస్తువును మాత్రము తెలుపుచున్నవి. కాఁబట్టి యట్టి తావుల లక్షణార్థమును గైకొనవలసిన ప్రసక్తియే లేదు.

దృష్టాంతము:—"నీల ముత్పలం=నల్ల కలువ" అనుతావున "నీల" శబ్దమును "ఉత్పల" శబ్దమును ఈ రెండును విశేష్యవస్తువు నొక్కదానినే తెలుపునవి యగుటంజేసి, నీలత్వ, ఉత్పలత్వము లనఁబడు ఈ రెండువిశేషణాంశములును వివక్షింపఁబడవు. వానిని గూడ వివక్షలోనికిఁ గొనివచ్చుపక్షమున, నీలత్వవిశిష్టమగు నాకారమును ఉత్పలత్వవిశిష్ట మగు నాకారమున్ను ఈ రెండును ఒక్కటియే యని ప్రతిపాదింపవలసి వచ్చును. అది యసంభవము.

---

(1) "తత్త్వమసి" అనువాక్యమునకు పూర్వపు వాక్యముల అర్థమును పరిశీలించితిమేని, అందు సత్యసంకల్పత్వ సర్వజ్ఞత్వాది విశిష్టమైన బ్రహ్మమును ఈ పైవాక్యమునందుండు "తత్" అనుపదము తెలుపుచున్నదనియు,అందు సంసారిత్వాది విశిష్టముగాఁ దెలుపఁబడిన జీవుని "త్వం" అనుపదము తెలుపుచున్నదనియును విశదమగుచున్నది. అయితే యద్వైతులు చెప్పురీతిని ఈ రెండుపదములును ఈ పైవిశేషము లేవియును లేని వస్తువులను తెలుపుచున్నవనియు సామానాధికరణ్యము ఆ రెంటికిని ఐక్యమును తెలుపుచున్నదనియును తెలిసికొంటిమేని, యా శబ్దముల వ్యుత్పత్తినిబట్టియు ప్రకరణమునుబట్టియును తెలుపునట్టి యర్థమును వదలుకొని వేఱొక్కయర్థము నవలంబించిన వారల మగుదుము. దీనినే లక్షణార్థముగా శాస్త్రకారులు వ్యవహరించుదురు. వ్యుత్పత్త్యర్థము నవలంబించితిమేని విరోధము ప్రసక్తించుతావులనే ఏదైన నొకపదమునకు లక్షణార్థమును చెప్పుకొనవచ్చునే కాని, ప్రతితావునను వాక్యమునందునట్టి యన్ని పదములకును లక్షణార్థమును గైకొనుట శాస్త్రసమ్మతము కాదు. ఈవిషయమును గుఱించి ఆచార్యులవారు వాదించియున్నారు.

[1]"నీల" పదముచే నైల్యగుణవిశిష్టముగాఁ జెప్పఁబడిన పదార్థము ఉత్పల పదముచే విశేషింపఁబడుచుండ లేదు గదా! అట్లు విశేషింపఁబడునేని, జాతి గుణములు పరస్పరము మిశ్రితములు గావలసి వచ్చును. కావున, నీలమయినదియు ఉత్పలమయినదియు నగు వస్తు వొక్కటియే యని యిట్లు సామానాధికరణ్యము ప్రతిపాదింపుచున్నది. దృష్టాంతము—"ఆ దేవదత్తుఁడే యీతఁడు" అను తావున నొకదేశమున నున్నవాఁ డగు దేవదత్తుఁడు ఆరూపముననే ప్రకృతకాలమున ఎప్పుడో యొకానొకకాలమున మన సమ్ముఖమున నున్నట్లు ప్రతిపాదించుట యసంభవమగుటంజేసి ఈ యుభయకాలములచేతను ఈ యుభయప్రదేశములచేతనున్ను సూచిత నగు దేవదత్తుని యాకార మొక్కటియే యని సామానాధికరణ్యము ప్రతిపాదింపుచున్నది. "నీలం" అని యి ట్లొక్కటియే పదము వినఁబడునప్పుడు తెలియవచ్చునట్టి విశేషణము సామాధికరణ్యసమయమున విరోధించును గాన, నది యప్పుడు ప్రతిపాదింపఁబడక పోయినను, వాచ్యార్థమునందలి ప్రధానాంశము ప్రతిపాదింపఁబడుటచే నిచట లక్షణార్థము లేనే లేదు. అయితే యిందు విశేషణాంశము తెలుపఁబడలేదు. ఇంతియే. అన్ని తావులను సామానాధికరణ్యముయొక్క స్వభావ మిట్టిదియే గాన, దోషము లేదు.

భాష్యకారులు:—ఈ పైని గానఁబఱచిన వాదమున సార మెద్దియును లేదు. ఏల యనిన, వాక్యములలో నన్నింటిలోను పదములచే వానివాని వ్యుత్పత్తినిబట్టి తెలియవచ్చు వస్తువుతోఁగల సంబంధవిశేషము మాత్రమే తెలియఁదగినది. ఇచట సమానాధికరణమునయందు నీలాదిపదములచేతను వ్యుత్పత్తినిబట్టి నైల్యాదివిశిష్ట మగుపదార్థమే తెలుపఁబడినదై, యదియే వేఱొక్కపదముయొక్క యర్థముతో సంబంధించినదిగాను తెలుపఁబడుచున్నది. దృష్టాంతము:— "నల్ల కలువను గొనిరా" అంటిమేని నలుపువర్ణముతోఁగూడియున్నట్టి కలువపువ్వు గదా తీసికొని రాబడుచున్నది. మఱియు "వింధ్యారణ్యమున మదోన్మత్తమైన గజసముదాయము కలదు" అంటిమేని యీ రెండుశబ్దములచేఁ దెలుపఁబడిన విశేషణములతోఁ గూడుకొనిన వస్తువే గదా యీ వాక్యముచే తెలుపఁబడుచున్నది. అట్లే వేదాంతవాక్యములలోనను సామానాధికరణ్యము గల తావులను ఆయా విశేషణములతోఁ గూడి యుండునది యగు బ్రహ్మమే తెలియఁదగినది.

---

(1) ఏది నీలత్వవిశిష్టమో అదియే ఉత్పలత్వ విశిష్టమయినదని యిట్లు నీలత్వ విశిష్టోత్పలత్వ విశిష్టవస్తువుల కైక్యము సామానాధికరణ్యముచేఁ దెలుపఁబడుపఁబడు పక్షమున అట్టివస్తువుల కైక్యము ప్రాప్తించుటయేకాక, అట్టి సమయమున నీలత్వరూపమగు గుణమును ఉత్పలత్వరూపమగు జాతినిన్ని వివక్షిలోనికిఁ గొనివచ్చుటచే నీరెంటికిని ఐక్యము ప్రాప్తించును. జాతియును గుణమును ఒక్కటియే యగుటను శాస్త్రకారు లొప్పరు అని భావము,

ఏదైన నొకవస్తువును ఒకవిశేషణముతో విశేషింపఁజేయవలసి నప్పుడు, ముందుగ ఒకవిశేషణముచే విశేషింపఁబడి యున్నట్టి వస్తుస్వరూపమే వేఱొక్క విశేషణముచే విశేషింపఁదగుననెడి నియమము లేదు. అయితే యన్ని విశేషణములచేతను ఆ (ఆ యొక్కటియగు వస్తువుయొక్క) స్వరూపమే విశేషింపఁదగును. కనుకనే కదా "భిన్నప్రవృత్తి నిమిత్తానాం శబ్దానామేకస్మిన్నర్థే వృత్తిస్సామానాధికరణ్యం" "భిన్నభిన్నార్థముల నిచ్చునవియగు శబ్దములు ఒక్కయర్థమును దెలుపుటకై ప్రవర్తించుట సామానాధికరణ్య మనఁబడును" అని యివ్విధమున సామానాధికరణ్యముయొక్క లక్షణము చెప్పఁబడినది. దీని ఫలితార్థ మేమనఁగా, భావార్థమును గాని (యొక్కటికలదని గాని) వ్యతిరేకార్థమును గాని (యొక్కటిలేదని గాని) తెలుపునట్టి వేఱొక్కపదముచేఁ దెలుపఁబడిన యాకారముకంటెను వేఱగునాకారము గలదియగుటంజేసి, యదియే వస్తువు వేఱొక్కపదముచేఁ దెలుపఁబడినదగుట యనునది సామానాధికరణ్యముయొక్క కర్తవ్యము.

దృష్టాంతము:—దేవదత్తుఁడు శ్యామవర్ణుఁడు, తరుణుఁడు, ఎఱ్ఱని నేత్రములు గలవాఁడు, దీనుఁడుకాఁడు, కృపణుఁడుకాడు, నిందనీయుఁడుకాడు.

ఏతావున నొక్కటియే వస్తువునందుండదగని రెండు విశేషణములు సామానాధికరణ్యమునకుండు పదములచేఁ దెలుపఁబడునో, ఆ తావునమాత్రము ఆ రెండు పదములలో నొక్కటి మాత్రము ముఖ్యార్థము లేనిదిగా నెన్నఁబడుచున్నదేగాని, అందును ఆ రెండుపదములును అట్టివిగా నెన్నఁబడుచుండలేదు.

దృష్టాంతము:— [1]గౌః వాహీకః=వాహీకదేశీయుఁడు మూర్ఖుఁడు.

"నీలోత్పలము = నల్లని కలువపువ్వు" మొదలగుతావుల నన్ననో, విశేషణద్వయము ఒక్కటియే వస్తువునందుండుటకు విరోధ మెద్దియును లేనందున, నొక్కటియే వస్తువు విశేషణద్వవిశిష్టమైనదిగాను ప్రతిపాదింపఁబడుచున్నది.

---

(1) "గౌః వాహీకః=వాహీకదేశీయుఁడు గోవు" అంటిమేని వాహీకదేశీయుఁడు గోవగుట యసంభవము. ఈవాక్యమునకు అర్థము లేకపోవును. అందువలన "గౌః" అను శబ్దమును సామాన్యముగా పశువును తెలుపుదానినిగాఁ గొని పశువనఁగా మూర్ఖుఁడనెడి యర్థమును గైకొనుచున్నారు. ఇచట "గౌః" అను శబ్దముయొక్క వాచ్యార్థమును (గోవు అనుదానిని) వదలుకొని మూర్ఖుఁడు అను లక్షణార్థము గైకొనఁబడుచున్నది. ఇట్లు లక్షణార్థమును గైకొనుతావునను, వాక్యమునందుండు ఒక్కపదమునకే యట్టి లక్షణార్థము గైకొనఁబడుచున్నదే కాని, వాక్యమునందుండు అన్నిపదములకు నట్టి లక్షణార్థము గైకొనఁబడుచుండలేదు. కావున "తత్త్వమసి= తత్-త్వం-అసి" అను వాక్యమునందలి పదంబు లన్నింటికిని లక్షణార్థమునే చెప్పుకొనుట న్యాయ్యము కాదని భావము.

అద్వైతి:—ఒక్క విశేషణముతోఁ గూడియుండునదిగాఁ దెలుపఁబడు నది, వేఱొక్క విశేషణముతోఁ గూడియుండు దానికంటెను విలక్షణమయిన దగుటంజేసి, యచటనుండుపదము లేక విభక్తికములే యయినను, ఘటపటశబ్ద ములవలె అవి వానిచేఁ దెలుపఁబడునట్టి వస్తువుల నైక్యమును ప్రతిపాదించుట యసంభవము. కావున సమానాధికరణమునకుండు శబ్దము విశిష్టవస్తువును ప్రతి పాదింపదు. అయితే యది విశేషణ ద్వారా స్వరూపమును నిరూపించి యైక్య మును తెలుపునదియే.

భాష్యకారులు:—విశేషణద్వయముతో సంబంధించియున్నంతమాత్రము ననే ఐక్యము నిరోధింపఁబడునేని, మీరు చెప్పిన ట్లగు గాక. అయితే యట్లు గానఁబడదు. ఏలననిన, ఒక్కవస్తువునందుండు నవిగా గ్రహింపఁదగనివి యగు రెండుధర్మములతోఁగూడి యుండవలయు నన్నచోఁ గదా, ఏకత్వము కుదురక పోవును. [1]ఘటత్వపటత్వములు రెండును ఒక్కవస్తువునం దుండదగినవి కా వనెడి యంశము ప్రమాణాంతరవిదితము. [2]"నీలోత్పలము = నల్లకలువ" ఈ మొదలగుతావులను, దండిత్వకుండలిత్వములకువలెను రూపవత్త్వరస వత్త్వ గంధవత్త్వములకు వలెనున్న విరోధము గానఁబడదు. ఇట్లు విరోధము మాత్రము లేకపోవుటయే కాదు, మఱియేమన్నను, భిన్నార్థములనిచ్చునవియగు శబ్దములు ఒకయర్థమును తెలుపునవియగుట యనఁబడు సామానాధికరణ్యా లక్షణమున్న ధర్మద్వయవిశిష్టత్వమును ఉపపాదింపుచునే యున్నది. అట్లుకా

---

(1) ఘటమనఁబడు ఒక్కటియే వస్తువునందు ఘటజాతియు, పటజాతియు నీ రెండు ధర్మములుండుట యసంభవము. ఏలననిన, ఘటము పటము కాదు. కావున "ఘటము పటము" అంటిమేని ఘటపటజాతులు ఏకవస్తునిష్ఠములగుట యసంభవము లగుటంజేసి, యిచట ఈ ఘట పటశబ్దములు రెండును ఒక్కటియే వస్తువును తెలుపుట యశక్యము.

(2) "నీలమగు నుత్పలము" అనుతావునను, నీలవర్ణముగలదియగుటయు, ఉత్పలజాతి గలదియగుటయును ఈ రెండును ఉత్పలమనఁబడు నట్టి యొకవస్తువు నందుండ కూడినవి. కావున నిచటనుండు "నీల" శబ్దమున్ను "ఉత్పల" శబ్దమున్ను ఈ రెండును ఒక్కటియే వస్తువును తెలుపఁగలవు. దృష్టాంతము:—"దండముగలవాడు కుండలములుగలవాఁడును దేవ దత్తుఁడు" అనుతావున దండముగలవాఁ డగుటయు కుండలములు గలవాఁడగుటయు నీ రెండు ధర్మములును దేవదత్తుఁడనఁబడు నొక్కనియందే యుండగలవు. కావున నీశబ్దములు దేవదత్త నొకని నే తెలుపఁగలవు. రూపము గలదియు, రసముగలదియు, గంధముగలదియును పృథివి" అనుతావున రూపమును గలిగియుండుట, రసమును గలిగియుండుట గంధమును గలిగియుండుట యనఁబడు ధర్మములు పృథివియనఁబడునట్టి యొక్కటియే వస్తువునందుండగలవు. కావున నీపద ములు పృథివియనఁబడు నట్టి యొక్కటియే వస్తువును తెలుపఁగలవు.

కున్న, విశేషములను వదలి స్వరూపమాత్రమునకైక్యమును తెలుపుపక్షమున, దాని ననేకపదములచే దెలుపవలసిన నిమిత్తమే యుండదు. అందువలన సామానాధికరణ్యమే లేకపోవును. విశేషణములు ఒకవస్తువుతో తమకుఁగల సంబంధమును తెలుపునవి కాక, అట్టివస్తువుయొక్క స్వరూపమునకు [1]ఉపలక్షణమాత్రముల (గుర్తించుటకు గానగు గుర్తుల)గుపక్షమున, వానిలో నొక్కదాని చేతనే యట్టి స్వరూపము గుర్తింపఁబడును గాన, [2]నందులకై యట్టిది వేఱొక్కటి యును ప్రయోగింపఁబడుట నిరర్థకమే యగును. అట్టి వేఱొక్కదానిచేతనున్న గుర్తింపఁజేయవలసిన యాకార మావస్తువు నందుండు పక్షమున, ఆయాకారమునుబట్టి ఆ వస్తువు సవిశేషమే యని ప్రసక్తించును.

“ [3]ఆదేవదత్తుఁడే యీతఁడు ” అను తావునను లక్షణార్థముయొక్క వాసన సయితము లేదు. అది యెందువలననఁగా, (ముఖ్యార్థభూతమగు విశేష

---

(1)ఏదైన నొకవస్తువును గుర్తించుటకు గాను చెప్పఁబడిన గుర్తు ఉపలక్షణ మనఁబడును. దృష్టాంతము:—“కాకి వాలియున్న యిల్లు దేవదత్తునిది.” అని యంటిమేని ‘కాకి వాలియుండుట’ యుపలక్షణ మనఁబడును. ఈతావున ‘కాకివాలియుండుట’ యనెడి యుపలక్షణమునకు దేవదత్తుని గృహమును గుర్తింపఁజేయుటయందు తాత్పర్యమే గాని, కాకితో దేవదత్తుని గృహమునకుఁగల సంబంధమును తెలుపుటయందు తాత్పర్యము కాదు. అట్లే ప్రకృతమునను విశేషణములు ఉపలక్షణ మాత్రములని పూర్వపక్షి యభిప్రాయము.

(2) ఈసందర్భమున పూర్వపక్షి వేఱొక్కవిధమున శంకింపవచ్చును. విశిష్టాద్వైతులు “జన్మాద్యస్యయతః”అనుసూత్రమున జన్మాదులు ఉపలక్షణమాత్రములని యంగీకరించి యున్నారే? అట్లు వారేల యంగీకరింపఁదగును? అచటను అనేక విశేషణములను ప్రయోగించుట నిరర్థకమే కాదా?”

వాస్తవమే. అయినను, అందు అనేకవిశేషణములను ప్రయోగించుటచే నందుమూలముగ బ్రహ్మముయొక్క జ్ఞానశక్త్యాదిగుణములు తెలుపఁబడుచున్న వని విశిష్టాద్వైతు లంగీకరించియున్నారు.అందువలన నేకవిశేషణములను ప్రయోగించుట కొక ప్రయోజనము కలదు.అద్వైతులట్లు గుణములు బ్రహ్మమునకుఁగలవని యంగీకరింపరు గాన, వారి మతప్రకారము అనేక విశేషణములను ప్రయోగించుట నిరర్థకమే యని తప్పక ప్రసక్తించును.

(3) “సోఽయం దేవదత్తః=ఆదేవదత్తుఁడే యీతఁడు” అనుతావున దేవదత్తుఁడనఁబడు ఒక్కటియే వస్తువు కాలాంతరదేశాన్తర సంబంధవిశిష్టమును ప్రకృత కాల ప్రకృతదేశ సంబంధ విశిష్టమయినదయినను, అనఁగా నీపైని గనఁబఱచినప్రకారము విశేషణద్వయ విశిష్టమైనను,అట్టి విశేషణద్వయమును వదలుకొని దేవదత్తుఁ డొక్కఁడే యని యీ వాక్యమువలనఁ

ణద్వయముతో సంబంధముండినను,) అందు విరోధమే లేదు గదా! ఎట్లనిన, దేశాన్తరముననుండిన దగుటచే అతీతకాలముననుండి యున్నట్టి వస్తువు సమీపమున నుండునది యగుటంజేసి ప్రస్తుతకాలముతో సంబంధించినది కావచ్చును. కావున విరోధము లేదు. కావుననే మనకు పూర్వ మొకప్పుడు కనుపించినవాఁడే మరల యిప్పుడు కనుపించునేని, మనము "ఆతఁడే యీతఁడు" అని గుర్తించుటను బట్టి, కాలద్వయ సంబంధియగు వస్తువొక్కటియే యని [1]వస్తుస్థిరత్వమును అంగీకరించువారు ఉపపాదించుచున్నారు. అట్లు కాకున్న, [2]వస్తువులు తెలియవచ్చుట విరోధించును. అందువలన సర్వము క్షణికమని ప్రసక్తించును. [3]దేశద్వయసంబంధమునకుఁ గల విరోధమో, కాలభేదమును బట్టి పరిహరింపఁబడుచున్నది.

ఇట్లు సమానాధికరణముననుండు పదములు అనేకవిశేషణములతోఁ గూడి యున్నట్టి యొక్కటియే వస్తువును తెలుపునవి యగుటంజేసియే „అరుణయైకహాయన్యా పిఙ్గాక్ష్యా సోమం క్రీణాతి" (ఎఱ్ఱనిదియు, పింగళవర్ణపు నేత్రములు గలదియు నగు,ఒక సంవత్సరము వయస్సుగల గోవుతో సోమమును కొనుచున్నాఁడు) అను వాక్యము అరుణ్యాది విశిష్టమును, ఒకసంవత్సరము వయస్సుగలదియునగు గోవుచే క్రయము సాధింపవలసినది యని విధించు

---

దెలిసికొనుచున్నాము, ఇచట విశేషణద్వయవిశిష్టమగుదాని కైక్యమును చెప్పుకొంటిమేని, యిట్టి యైక్యము పొసగదు. విరోధించును. ఏలననఁగా, దేవదత్తుఁడొక్కఁడే దేశద్వయ సంబంధము గలవాఁడగుట విరుద్ధము. ఇట్టి విరోధమును తొలఁగించుటకై యీవిశేషణద్వయమును వదలుకొనవలయును" ఇట్లు అద్వైతులు వాదింపఁగా, నందులకు సమాధానము ఈ గ్రంథమునఁ జెప్పఁబడుచున్నది.

(1) అద్వైతులును సర్వము క్షణికమనెడి బౌద్ధులవాదమును నిరసించు వారే కదా! అట్టి వారిట్లేల చెప్పఁదగును ?

(2) అట్లుకాకున్న, నిన్నటి దినము మనకుఁ గాన్పించిన వస్తువు ఈదినమున మనకుఁ గాన్పింపక పోవలసివచ్చును.

(3) ఒక్కటియే వస్తువు ఈతావునను వేఱొక్కతావునను ఉండుట విరుద్ధమే! అది యెప్పుడు? ఏకకాలమున నొక్కటియే వస్తువు రెండుతావులను ఉండజాలదు. అయితే యొక్కటియే వస్తువు ఒకకాలమున నొకతావుననుండి వేఱొక్క కాలమున వేఱొక్కతావుననుండుట విరుద్ధము కాదు. కావున నది యెందుకాలములు భిన్నములగుటంజేసి యిట్టితావున విరోధమే లేదు.

చున్నది. ఈ విషయము పూర్వ మీమాంసాశాస్త్రమున "అర్థైకత్వే ద్రవ్య గుణయోరైక కర్మ్యాన్నియమ స్స్యాత్ (పూ. మీ. 3 అ ౧ పా. ౧౨ సూ) అను సూత్రమున సవిస్తరముగ విచారింపఁబడినది.

అందు పూర్వపక్షి యిట్లు తలఁచుచున్నాఁడు—

ఏదైన నొక వస్తువుయొక్క జాతి ఆవస్తువును విడిచి ప్రత్యేకముగా నుండనట్లు, ఒకవస్తువుయొక్క గుణము సయితము ఆవస్తువును విడిచి ప్రత్యేకముగా నుండుట యసంభవ మగుటంజేసి, ఈ పైవాక్యముననుండు "అరుణయా=ఎఱుపు వర్ణముతో" అను పదము ఎఱుపు వర్ణముతోఁగూడినది యగు నొక వస్తువును తెలుపునదియే యైనను, అది "ఏకహాయన్యా" అను పదముతో నన్వయించుననెడి అనఁగా ఈ పై వాక్యము "ఎఱుపు వర్ణముగల యొక యేడాది గోవుతో" అనెడియర్థము నిచ్చుననెడి నియమ ముండుట యసంభవము. ఏల ననఁగా, ఈ పైవాక్యము "ఏకహాయన్యా క్రీణాతి=ఒక సంవత్సరపు గోవుతో కొనుచున్నాఁడు) అనియు "తచ్చ అరుణయా=ఆగోవు ఎఱ్ఱని వర్ణము గలది"

(1) ఇందునుగుఱించి పూర్వమీమాంసాశాస్త్రమున ఎక్కువగా విచారింపఁబడినది. కావున ఈ విషయమును గుఱించి యచటనే చూచుకొనుట మంచిది. అయినను, అందలి కొన్ని ముఖ్యాంశములుమాత్రము ఈ క్రింద తెలుపఁబడుచున్నవి.

"అరుణయైకహాయన్యా పింగాక్ష్యా సోమం క్రీణాతి" అనువాక్యమున నుండు "అరుణయా" అనుపదముచే తెలుపఁబడిన ఆరుణ్యము (ఎఱుపువర్ణము) ఏకహాయినీతోమాత్రము సంబంధిచినదియా? లేక, అది యీ ప్రకరణమునఁ జెప్పఁబడిన అన్నివస్తువులతోను సంబంధించినదియా? అనునది మొదటి విచారము.

అందు 'అరుణయా' అనుపదము ఆవాక్యమునందలి మిగత పదములన్నింటితోఁజేరి యొక్కటియే వాక్యమగుచున్నదా? లేక, అది వానితోఁజేరని ప్రత్యేకవాక్యమా? అనునది రెండవ విచారము.

ఈపై రెండు విచారములును పూర్వ మీమాంసాగ్రంథకర్తలచే నంగీకరింపఁబడినవి. ప్రకృతమున ఈ తావునఁజేయఁబడు విచార మేమనఁగా, ఈ పైవాక్యముననుండు "అరుణయా" ఈ మొదలగుపదములు వ్యధికరణములా? (ప్రతిపదమును ప్రత్యేకగా నొక్కొక్కయర్థము నిచ్చునవియా?) లేక సమానాధికరణములా? (అన్నియును జేరి యొకయర్థమును తెలుపునవియా?) అను నది యొక్క విచారము. ఈపైవాక్యమున నుండుపదములు కారకవిభక్త్యంతములగుట సామానాధికరణ్యమునకు విరుద్ధమా? కాదా? అనునది రెండవ విచారము. ద్వితీయావిభక్తిమొదలు షష్ఠీవిభక్తివరకును ఆఱువిభక్తులలోఁ దేనినైనను గలిగియుండుపదము కారకవిభక్త్యంతమని చెప్పఁబడుచున్నది.

అనియు నిట్లు రెండర్థములను ప్రతిపాదించుట యసంభవము. అందువలన ఈ పైవాక్యముననుండు "అరుణయా" అనుదానిని ప్రత్యేకవాక్యమునుగా విభజించితి మేని, యది యీ ప్రకరణమునఁ జెప్పఁబడిన వస్తువులన్నియును సర్వసామా న్యముగ ఎఱుపు వర్ణము గలవిగా నుండవలయు ననెడి యర్థమును తెలుపును. "అరుణయా" అను పదమును స్త్రీలింగమునఁ బ్రయోగించుట ప్రకరణమునఁ జెప్పఁబడిన నానాలింగసంబంధముగల వస్తువులఁ జూపించుటకై కావ చ్చును. కావున ప్రకరణమునఁ జెప్పఁబడిన వస్తువులలో ఒక సంవత్సరము వయస్సుగల గోవు మాత్రమే ఎఱుపువర్ణము గలదిగాను చెప్పఁబడినది యనెడి నియమ ముండనేరదు. ఈపైని గాన్పించిన ప్రకారము పూర్వపక్షము రాఁగా,

ఈ విషయమును గుఱించి సిద్ధాంతి యిట్లు చెప్పుచున్నాఁడు—

„అర్థైకత్వే ద్రవ్యగుణయోరైకకర్మ్యాన్నియమస్స్యాత్" (పూ. మీ. 3.అ ౧.పా. ౧౨ సూ) (సామానాధికరణ్య ముండుటనుబట్టి ఒక్కవస్తువు సిద్ధిం

---

అందు కారకవిభక్త్యంతములగు పదములు సామానాధికరణ్యమునకు విరుద్ధములని పూర్వ పక్షి యభిప్రాయము. అవి సామానాధికరణ్యముతో విరోధింపవని సిద్ధాంతము.

పూర్వపక్షి యభిప్రాయప్రకారము కారకవిభక్త్యంతపదము లుండుట సామానాధి కరణ్యములో విరోధించును గాన, „అరుణయైకహాయన్యా" ఇత్యాదివాక్యమున నుండుపదములు కారక విభక్త్యంతము లగుటంజేసి, యిందు సామానాధికరణ్య ముండ నేరదు. కావున నిందుండు పదములు భిన్నవాక్యములు కావలసివచ్చును. అందువలన „అరుణయా" అనుపదము భిన్నవా క్యముగాన, నది „ఏకహాయన్యా" అనుపదముతో నన్వయించున నెడి నియమ ముండదు. అట్టి నియమ మెద్దియును లేకుండుటంజేసి „అరుణయా" అనుపదము ఈ ప్రకరణమునఁ జెప్పఁబడినట్టి యే వస్తువునైనను ఎఱుపువర్ణముగలదానినిగాఁ దెలుపవచ్చునని పూర్వపక్షి యభిప్రాయము.

సిద్ధాంతి యభిప్రాయప్రకారము వాక్యముననుండుపదములు కారకవిభక్త్యంతములుగా నుండుట యనునది సామానాధికరణ్యముతో విరోధింపదు గాన, నట్టి వాక్యమున సామానాధికర ణ్యముండవచ్చును. అందువలన నందుండు పదములకు ఏకవాక్యతయును గలదు. కావున „అరు ణయా" అనుపదము విశేషణ విశేష్యభావముచే „ఏకహాయన్యా" అనుపదముతో నన్వయించు ననెడి నియమము గలదని సిద్ధాంతము.

ఇందు, పూర్వపక్షమునను సిద్ధాంతమునను „అరుణయా" అనుపదము ఆరుణ్యవిశిష్టమగు దానిని దెలుపునది యని విశిష్టాద్వైతుల యభిప్రాయము.

ఈపదము పూర్వపక్షమునను సిద్ధాంతమునను ఆరుణ్యరూపమగు గుణమును తెలుపునది యని యితరుల యభిప్రాయము.

పఁగా, ద్రవ్యగుణములు ఒక్క క్రియతోఁ సంబంధింపవచ్చును. కావున నిచట ఎఱుపువర్ణము గోవుతో సంబంధించినది యనెడి నియమముండఁ దగును" అను సూత్రము సిద్ధాంతమును దెలుపుచున్నది. అది యెట్లనిన, ఎఱుపువర్ణముగల వస్తువును తెలిపెడు "అరుణయా" అనుపదమునకును ఒకసంవత్సరమువయస్సు గల గోవును తెలిపెడు "ఏకహాయన్యా" అను పదమునకును సామానాధికరణ్య సంబంధముండుటంజేసి, వానిచేఁ దెలుపఁబడునది యొక్కటియే వస్తువని సిద్ధింపఁగా, ఏకహాయినీ రూపమగు ద్రవ్యమున్ను అరుణవర్ణరూపమగు గుణమున్ను విశేషణవిశేష్యభావముచే సంబంధించిన వగుటవలన, అవి రెండును "అరుణయా" అనుపదముచేతనే తెలుపఁబడినవై క్రయమనఁబడు కర్మముతోఁ సంబంధింప వచ్చును. విరోధ మెద్దియును లేదు. కావున ఎఱుపువర్ణము క్రయసాధనభూత మగు ఏడాదిగోవుతోఁ సంబంధించినది యనెడి నియమ ముండును.

ఏకహాయనికి క్రయముతోఁగల సంబంధమువలెనే అరుణవర్ణముతోఁ గల సంబంధమున్ను వాక్యమువలననే నిశ్చయింపవలసినదియగు పక్షమునఁ గదా, వాక్యము రెండు అర్థములను తెలుపునది యగును? ప్రకృతమునవో, అట్లుకాదే? ఏలననిన, అందుండు "అరుణయా" అనుపదముచేతనే "అరుణవర్ణము తోఁగూడిన వస్తువు" తెలుపఁబడుచున్నది. మఱియు ఈ పదమునకు "ఏకహాయనీ" అను పదముతోఁగల సామానాధికరణ్యము అట్టి యరుణవర్ణముగల వస్తువు ఏకహాయనీ యని మాత్రమే తెలుపుచున్నది. ఇంతియే కాని, యది గుణసంబంధమును తెలుపుచుండలేదు. ఏలననిన, విశిష్టములగు (విశేషములతోఁ గూడియుండునట్టి) వానికిఁ గల యైక్యమును తెలుపుటయే గదా! సామానాధికరణ్యము యొక్క యర్థము. ఏలననిన, "భిన్నప్రవృత్తి నిమిత్తానాం శబ్దానా మేకస్మిన్నర్థే వృత్తి స్సామానాధికరణ్యం" (వేఱువేఱు అర్థములను తెలుపుటకై ద్వారభూతములగు శబ్దములు ఒక వస్తువును తెలుపుట యందు పర్యవసించుట సామానాధికరణ్యమనఁబడును) అని కదా సామానాధికరణ్య లక్షణము తెలుపుచున్నది.

[1]"కనుక నేఁ"రక్తః పటః=ఎఱ్ఱని వస్త్రము" ఈ మొదలగు తావులను ఒక్కటియే యర్థము (వస్తువు) తెలుపఁబడుటం జేసి యది యొక్కటియే వాక్యమని

1 వేదమునందు విధివాక్యము లనియు, అర్థవాద వాక్యము లనియును రెండువిధములగు వాక్యములు కలవు. ఏదైన నొకకర్మమును విధించునట్టి వాక్యములు విధివాక్యము లనఁబడును. అట్టి కర్మమువలని ఫలమును తెలుపుచు నందుమూలముగ ఆకర్మమును స్తుతించునట్టి వాక్యములు అర్థవాదవాక్యము లనఁబడును. విధివాక్యములు స్వతంత్రముగనే యొకకర్మమును విధించుచుండుటచే నర్థవాదవాక్యము లట్టి విధివాక్యములతోఁజేరి యర్థమును ప్రతిపాదించునవి కావని శంకింపఁగా, అర్థవాదవాక్యములు శ్రుతులయందుఁ బఠింపఁబడుటంజేసి విధివాక్య లట్టి యర్థవాదవాక్యము

పించుకొనుచున్నది. అది యెట్లనిన, ‹‹వస్త్రము కలదు'' అని తెలుపుటయే గదా! వాక్యముయొక్క కృత్యము. ఎఱుపువర్ణముతో వస్త్రమునకుఁగల సంబంధ మనఁబడునది ‹‹రక్తః'' అనుపదముచేతనే తెలుపఁబడుచున్నది. "ఎఱుపువర్ణముగల వస్తువు వస్త్రము" అని యింతమాత్రమే సామానాధికరణ్యావలనఁ దెలుపఁదగినది. [1]ఇట్లు ఒక్కగుణముతోఁగాని రెండుగుణములతోఁ గాని, యనేక గుణములతోను గాని గూడియున్నట్టి వస్తువును వాక్యమున నుండునట్టి ఆయా పదములు వ్యస్తములు గాను గాని సమస్తములుగాను గాని. తెలిపి, సామానాధికరణ్యా సంబంధమునుబట్టి యిట్లు సర్వగుణవిశిష్టమగు వస్తువు ఒక్కటియే యని తెలియఁజేసి, దానికి ఆవాక్యము నందుఁ జెప్పఁబడిన క్రియతోఁ గల సంబంధమును తెలుపుట విరుద్ధము కాదు. [2]దృష్టాంతము :—శ్యామవర్ణుఁడును, తరుణుఁడును, ఎఱ్ఱనినేత్రములు గలవాఁడును, దండముగలవాఁడును, కుండలములు గలవాఁడును నగు దేవదత్తుఁడు కలడు. [3]తెల్లని వస్త్రముతో తెరకట్ట వలయును.

---

లతో నాకాంక్షలవని యూహించుకొనుసదియని పూర్వ మీమాంసకులు అర్థవాదాధికరణమున నిర్ణయించియున్నారు. అట్లే, ‹రక్తః పటో భవతి' అనుతావునను, ‹పటః భవతి=వస్త్రము కలదు'' ‹అంటిమేని అంతటితో నావాక్యము పూర్తియగుచున్నను, ఆవాక్యమున నుండునదియగు ‹రక్తః' అనుపదము‹వస్త్రము ఏలాగున నున్నది'? అని యిట్లుకలుగఁదగిన యాకాంక్షను, ‹‹ఎఱుపుగా నున్నది' అనుటచే తొలఁగింపుచు క్రియతో నన్వయించుచున్నది. అట్లే ప్రకృతమునను ‹అరుణయా' అనుపదము ‹ఏకహాయిని ఎట్టిది?' యని యిట్లు కలుగఁదగిన యాకాంక్షను పూర్తి చేయుచు క్రయరూపమగు క్రియతో నన్వయించుచున్నది.

(1) ‹‹రక్తః పటః'' అనుతావున‹‹శుక్లః'' అను విశేషణ మొక్కటియే గాన, అది యీపైన్నిఁ గనఁబఱచిన యాకాంక్షను పూర్తిచేయుచు క్రియతో నన్వయింపవచ్చును. అయితే యనేకవిశేషణము లుండుతావున, అవి యన్నియును సమస్తపదమున (సమాసపదమున) నుండునవి యగునేని, యవి యిట్లు క్రియతో నన్వయింపవచ్చునే గాని, యవి వ్యస్తపదములయినచో, నన్వయింపవు. ‹అరుణయా' ఇత్యాది వాక్యమునన్నో, పదములు వ్యస్తములు. మఱియు ‹రక్తః పటః' అనుతావున పదములు ప్రథమావిభక్త్యంతములు గాన, నచట సామానాధికరణ్య ముండఁదగును. ప్రకృతమునన్నో, పదములు కారకవిభక్త్యంతములు. కావున నిచట సామానాధికరణ్య ముండదు. ఇట్లు శంకింపఁగా నందులకు సమాధానము చెప్పుటకై.

(2) ఈపైని ‹వ్యస్తములుగాని సమస్తములుగాని' అనుతావున, కారకవిభక్త్యంతపదములును ప్రథమావిభక్త్యంతపదములును గ్రహింపఁబడినవి. కావున నందు ప్రథమావిభక్త్యంతములగు పదములుగల యుదాహరణమును గాన్పించుటకై.

(3) కారకవిభక్త్యంతములగు పదములుగల యుదాహరణమును జూపించుటకై ప్రథమమున కర్మకారకోదాహరణము గాన్పింపఁబడుచున్నది.

నల్లనికలువను గొని రా.[1]నల్లకలువను గొని రా.[2]తెల్లనిదియు మంచి నేత్రములు గలదియు నగు గోవును గొని రా.[3]మార్గరక్షకుఁడగు అగ్నిదేవునికొఱకు పదునొకొండు కపాలముల పురోడాశమును సమర్పించునది.—ఈ మొదలగువాక్యములు ఎట్టివియో, ,,ఎఱుపువర్ణము గలదియు, పింగళవర్ణముగల నేత్రములు గలదియు నగు గోవుతో సోమమును కొనుచున్నాఁడు''అను వాక్యము సయితము అట్టిదియే. [4]మఱియు కట్టెలతో పాత్రమున అన్నమును వండునది.''అను వాక్యమున అనేక కారకములచే విశేషింపఁబడిన యొక్కటియే క్రియ ఏకకాలమునఁ దెలియఁ బడుచున్నది. అట్లే సమానాధికరణముననుండు పదసమూహమునఁ బఠింపఁబడినట్టి యొక్కొక్క కారకపదమును ఆయా కారకము తెలియఁబడు సమయముననే అనేకవిశేషణవిశిష్టమైనదిగా నేకకాలమునఁ దెలియఁబడుచు క్రియతో నన్వయించును గాన, విరోధమెద్దియును లేదు. దృష్టాంతము:—సమర్థుఁడగు వంటవాఁడు సమపరిమాణము గల భాండమున ఎండిన ఖదిరకట్టెలతో పాయసమును అన్నమునున్ను వండగలఁడు. ఈమొదలగునవి.

ఉపాత్తద్రవ్యకవాక్యముననుండు (ద్రవ్యవాచకశబ్దము ముందుగ ప్రయోగింపఁబడియుండు వాక్యమున నుండు) గుణవాచకశబ్దము కేవలగుణమునే తెలుపును గాన, ప్రకృతమునను,,అరుణయా''అనువదపదమును అట్లే కేవలగుణమును తెలుపునది యంటివేని, యది సంభవము కాదు. ఏలననిన, లౌకికభాషయందు గాని, వైదికభాషయందు గాని, ద్రవ్యవాచకపదముతో సమానాధికరణముననుండు గుణవాచకశబ్దము కేవలగుణమును తెలుపునది గాను ఎచటను గానంబడదు. మఱియు ఉపాత్తద్రవ్యక వాక్యముననుండు గుణవాచకపదము కేవలగుణమునే తెలుపునది యనుట యసంగతము. దృష్టాంతము:—"పట శ్శుక్లః=తెల్లని వస్త్రము" అను నది ఉపాత్తద్రవ్యకవాక్యమే యైనను, అందుండు "శుక్లః" అను పదము శుక్లవర్ణ విశిష్టమైన దానినే తెలుపునది గాను. గానఁబడుచున్నది గదా! అయితే "పటస్య శుక్లః=వస్త్రముయొక్క తెలుపు వర్ణము" అను వాక్యము. శుక్లవర్ణవిశిష్టమైన వస్త్రమును తెలుపకపోవుటకు హేతువు ఆ

---

(1) సమస్తపదోదాహరమును గాన్పించుటకై:—

(2) కారకవిభక్త్యంతములగు అనేకపదములు గలవాక్యమును ఉదహరించుటకై.

(3) సంప్రదానకారకము గల వాక్యమును ఉదహరించుటకై.

(4) ఒకవిశేషణముచే విశేషింపఁబడినది వేఱొక్కవిశేషణమెచే విశేషింపఁబడునట్లైన, అప్పుడు ఆ విశేషణములు ఒకదానితరువాత నొకటివంతున నావస్తువును విశేషింపఁజేయుటచే నవి యావస్తువు నేకకాలమున తెలుపపనియు,అప్పుడు విశేషణములకు పరస్పరము మిశ్రీభావము కలుగు ననియును పూర్వపక్షి యాక్షేపించియుండెను. అందులకు సమాధానము చెప్పుటకై.

వాక్యమునను ండు "పటస్య" అను పదమును "శుక్లః" అను పదమును ఈ రెండును భిన్నవిభక్తికము లగుటయే కాని, యావాక్యము ఉపాత్తద్రవ్యక మగుట యను నది యట్టి హేతువు కాదని యెఱుంగునది. ఇచటనే "పటస్య శుక్లోభాగః = వస్త్రముయొక్క తెల్లని భాగము" అంటిమేని, యందు 'శుక్లః భాగః'=తెల్లని భాగము" అను తావున పదములు సమానవిభక్తికము లగుటంజేసి యావాక్యము శుక్లవర్ణవిశిష్టమగు ద్రవ్యమునే తెలుపునది గాను తెలియవచ్చుచున్నది.

ఏకహాయినీతోనే సోమక్రయము సంపూర్ణముగ నెరవేరుచుండగా, నిట్టి క్రయమున కరుణవర్ణముతో నెట్టి సంబంధమున్ను ఆవశ్యకమగు నట్లు కానం బడదనిపూర్వపక్షి చెప్పినదియును అసంగతము. ఏలననిన, విరోధిగుణరహిత మగు ద్రవ్యమును తెలుపునట్టి పదముతో సామానాధికరణ్యమునసుండు గుణ వాచకపదము అట్టి ద్రవ్యము నాశ్రయించి యుండునట్టి గుణమును తెలుపునది యగుటంజేసి, యది క్రియాపదముతో నన్వయింపవచ్చును. కావున నందు విరోధ మెద్దియును లేదు.

ఈపైని గనంబఱచిన ప్రకారము, సామాన్యాధికరణ్యమువలన ఆరుణ్యవిశిష్ట మగు వస్తువు తెలియవచ్చుచుండగా, దీనిని వదలి, ద్రవ్యగుణములలో నొక్కటిమాత్రము క్రయసాధన మగుట యసంభవ మగుటనుబట్టి వానికి పరస్పరము అన్వయము ఉన్నట్లు ఊహింపంబడుచున్నదని పూర్వపక్షి చెప్పినదియును అసంగతము. కావున ఈపైని గనంబఱచిన ప్రకారముగానే యీ పూర్వ మీమాంసా సూత్రముయొక్క యర్థము నెఱుంగునది.

కాంబట్టి "తత్త్వమసి=తత్-త్వం-అసి" ఈ మొదలగు సామానాధికరణ్యముగల వాక్యములయందుండు "తత్-త్వం" అను నీరెండు పదములచేతను తెలుపంబడు విశేషణములను (విశేషములను లేక గుణములను) వదలుకొనకయే ఐక్యము ప్రతిపాదింపందగినది. అయితే సమస్తహేయములకును విరుద్ధమగు కల్యాణమే స్వభావముగాం గలవాండగు పరమాత్మ, అనాదియగు నవిద్యచే గప్పంబడిన వాండును, మేరలేని దుఃఖముల ననుభవించువాండును, ముక్తుండనియు బద్ధుండనియు నిట్లు రెండు అవస్థలు గలవాండునగు చేతనునికంటెను (జీవుని కంటెను) వేఱయినవాండని యంగీకరింపనివాని మతమున ఈపైని గనంబఱచిన ప్రకారము ఐక్యమును ఉపపాదించుట యసంభవము.

అద్వైతి:—ఈపైని గనంబఱచిన ప్రకారము అంగీకరించువాని మతమునను, సమానాధికరణమునసుండు పదములు కచ్చితముగ ఆయా విశేషములతో విశిష్టములయిన వాని కైక్యమును ప్రతిపాదించునవి యనెడి పక్షము నవలంభించినచో,అందు "త్వం" అను పదముచే సకలదోషముల కాస్పదుండుగాం

జెప్పఁబడిన జీవుఁడే, "తత్" అను పదముచేఁ దెలుపఁబడినవాఁడును, కల్యాగుణస్వభావుఁడునగు పరమాత్మ యగును. అట్లయినచో, సకలదోషముల కాస్పదుండగుట యనునది పరమాత్మకుఁ బ్రాప్తించునే ?

భాష్యకారులు:—అట్లు చెప్పఁదగదు. ఏలననిన, అందును "త్వం" అను పదము సయితము జీవాంతరాత్మయగు పరమాత్మనే తెలుపునది.

అది యెట్లనిన, ,,తత్'' అనుశబ్దముచేఁ దెలుపఁబడునదియు, దోషములేవియు నెంతమాత్రములేనిదియు, సత్యసఙ్కల్పముతోఁ గూడియున్నట్టిదియు, మేరలేని యతిశయము గలదియు, లెక్కలేని కల్యాణగుణ సముదాయము గలదియు, సమస్తమునకును కారణభూతమునగు పరబ్రహ్మము "బహు స్యామ్=నేను అనేకముగా నగుదును"అని సంకల్పించి, తేజస్సు,ఉదకము, పృథివి మొదలుగాఁ గల సమస్త ప్రపంచమును సృజించి, దేవాది నానావిధాకారములతోఁ గూడియున్నట్టి యీ జగత్తునందు చేతనులగు జీవులను వారి వారి కర్మముల కనుగుణములగు శరీరములలో నాత్మలనుగాఁ బ్రవేశింపఁజేసి, తాను స్వయముగ తన యిచ్చచే ఆ జీవులలో నంతరాత్మగాఁ బ్రవేశించి, ఇట్లు తనవఱకును ఉండునవియగు దేవాది శరీరములకు నామరూపములను విశదపఱచెను. అనఁగానిట్టి సంఘాతమును ఒకవస్తువును గాను, శబ్దముచే వ్యవహరింపఁ దగిన దానిని గానును చేసె ననుట. ఇట్లు "అనేన జీవేనాత్మనా" ఇత్యాది శ్రుతివాక్యము తెలుపుచున్నది. అందు ,,అనేన జీవేనాత్మనా=ఈ జీవశరీరుఁడగు నాచే" అని చెప్పుటచే జీవుఁడు బ్రహ్మాత్మకుఁడని అనఁగా బ్రహ్మము ఆత్మగాఁగలవాఁడని తెలుపుచున్నది. జీవుఁడు బ్రహ్మాత్మకుఁడగుట యనునది బ్రహ్మము జీవునిలో నంతరాత్మగాఁ బ్రవేశించుటవలననే యని తెలియుచున్నది. ఏలననిన, ,,ఇదం సర్వమసృజత,యదిదం కిఞ్చ, తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్, తదను ప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్''(తై.ఆ.౬.అను) (బ్రహ్మము ఈపరిదృశ్యమానమైనదేది కలదో, దీని నంతయును సృజించెను. దానిని సృజించి దానిలోఁ బ్రవేశించెను. దానిలోఁ బ్రవేశించి,,సత్=చేతనము గాను'' ,,త్యత్=అచేతనము గాను''ఆయెను) అను శ్రుతివాక్యమున ,,ఇదం సర్వం=ఇది యంతయును'' అని యిట్లు నిర్దేశింపఁబడిన చేతనాచేతనరూపమగు వస్తుద్వయము ,,సత్'' ,,త్యత్'' అను శబ్దములచేతను "జ్ఞానంచాజ్ఞానంచ" అను తావున జ్ఞానాజ్ఞానశబ్దములచేతను విభజించి నిర్దేశింపఁబడి చేతనపదార్థములలోనను బ్రహ్మము ప్రవేశించెనని చెప్పియున్నందునను అట్లు తెలియుచున్నది. కావున ఈపైని గనఁబఱచిన నామరూప విశదీకరణమునుబట్టి, వాచకములగు శబ్దము లన్నియును చేతనాచేతన విశిష్టమగు పరమాత్మను తెలుపునవి యని తెలియుచున్నది. మఱియు "ఐతదాత్మ్య మిదం సర్వం"

(ఛా. ౬ ప్ర. ౮ ఖ. ౭ వా) అను శ్రుతివాక్యమే "ఇదం సర్వం=ఇది యంత యును" అనుటచే చేతన విశిష్టమగు నీ జగత్తును నిర్దేశించి "తస్యైష ఆత్మా" అను వాక్యమున "పరమాత్మ యిట్టి ప్రపంచముయొక్క యాత్మ" అని ప్రతిపాదింపుచున్నది. ఇట్లు సమస్తములగు చేతనాచేతన పదార్థములకు బ్రహ్మము ఆత్మ యగుటంజేసి, చేతనవిశిష్టమగు జగమంతయును బ్రహ్మముయొక్క శరీరము. అట్లే యితర శ్రుతులును తెలుపుచున్నవి. ఎట్లనిన, తైత్తిరీయులు "అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా" (తై. ఆరణ్య ౩ ప్రశ్న ౧౧ అను) అను వాక్యమున "బ్రహ్మము లోపల ప్రవేశించి యుండి జనులను నియమించు వాఁడును, అన్నింటికి నాత్మయయిన వాఁడును'' అనియు, వాజసనేయులు "యః పృథివ్యామ్ తిష్ఠన్ పృథివ్యా అన్తరో,యం పృథివీ నవేద, యస్య పృథివీ శరీరం, యః పృథివీ మన్తరోయమయతి,స త ఆత్మా ఽన్తర్యా మ్యమృతః" (బృ.౫. అ. ౭ బ్రా. ౩ వా) (ఎవఁడు పృథియందున్న వాఁడై, పృథివి లోపలనుండి, పృథివిచేఁ దెలిసికొనఁబడక, పృథివిని శరీరముగాఁ గలిగియుండి, పృథివిని లోపలనుండి నియమించుచున్నాఁడో, వాఁడు నీయొక్క యాత్మయు, అన్తర్యామియు, అమృతస్వరూపుఁడును) అని యిట్లు చెప్పనారంభించి, తరువాత, 'య ఆత్మని తిష్ఠన్నాత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి స త ఆత్మాఽన్తర్యామ్య మృతః" (బృ. ౫. అ. ౭. బ్రా. ౨౨. వా.) (ఎవఁడు ఆత్మయందున్నవాఁడై, ఆత్మయొక్క లోపలనుండి, ఆత్మచేఁ దెలియఁబడక, ఆత్మను శరీరముగాఁ గలవాఁడై, ఆత్మను లోపలనుండి నియమించుచున్నాఁడో, వాఁడు నీయొక్క యాత్మయు, అంతర్యామియు, అమృతస్వరూపుఁడును) అని పఠించి యున్నారు. మఱియు, సుబాలోపనిషత్తు ,యః పృథివీ మన్తరే సఞ్చరన్ యస్య పృథివీ శరీరం యోఽపామన్తరే సఞ్చరన్ యస్యాపశ్శరీరం'' (సుబా.౭.ఖ ) (ఎవఁడు పృథివిలో సంచరించువాఁడో, ఎవనికి పృథివి శరీరమో, ఎవఁడు ఉదకములలో సంచరించువాఁడో ఎవనికి ఉదకములు శరీరమో" అని యిట్లు చెప్పనారంభించి "యోఽక్షరమన్తరే సంచరన్ యస్యాక్షరం శరీరం యమక్షరం నవేద ఏష సర్వభూతాన్తరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకోనారాయణః" (ఎవఁడు జీవునిలోపల సంచరించుచున్నాఁడో,ఎవనికి జీవుఁడు శరీరమో, ఎవనిని జీవుఁడు తెలిసికొనలేఁడో, అతఁడు సమస్తములగు భూతములకంతరాత్మ, అపహతపాప్ముఁడు, స్వయంప్రకాశుఁడు, దేవుఁడు, ఒక్కఁడునగు నారాయణుఁడు) అని తెలుపుచున్నది. ఈపైని గనఁబఱచినవాక్యములు మొదలగునవి చేతనవిశిష్టమగు జగత్తును పరమాత్మయొక్క శరీరమునుగాఁ దెలిపి పరమాత్మ యట్టి జగత్తుయొక్క యంతరాత్మ యని యుపదేశించుచున్నవి

కావున చేతనుని(జీవుని) తెలుపునట్టివయినను, శబ్దములు అట్టి చేతనునికిని ఆత్మ యును, ఆ చేతనుని శరీరమునుగాఁ గలిగియుండువాఁడునగు పరమాత్మనే తెలు పునవి. దృష్టాంతము:— "చత్వారః పఞ్చదశ రాత్రాద్దేవత్వం గచ్ఛన్తి" (నలు గుఱును పఞ్చదశరాత్ర కర్మము నొనర్చుటవలన దేవత్వమును పొందుచున్నారు అనఁగా దేవతలుగా నగుచున్నారు) అనియు నీమొదలగు తావులను అచేతన మును, దేవాద్యాకారభూతమునగు పిణ్డమును తెలుపునట్టి దేవాదిశబ్దములు దే వాద్యాకారములగు పిణ్డములను శరీరమునుగాఁ గలిగియుండు జీవాత్మలనే తెలు పునవి. శరీరమనఁ బడునది శరీరవంతునికి ప్రకారమగుటంజేసియు, ప్రకారమును తెలుపునట్టి శబ్దములు ప్రకారవంతుని తెలుపుటయందే తాత్పర్యము గలవి యగుటంజేసియును శరీరవాచకములగు శబ్దములు శరీరిని (శరీరవంతుని) తెలు పుటయందే తాత్పర్యము గలవి యగుట న్యాయము. ప్రకారమనఁగా "ఇదియిట్టి ది" అని యివ్విధమున నొకపదార్థము తెలియవచ్చునప్పుడు, అందు "ఇట్టిది" అని యిట్లు తెలియవచ్చునట్టి యంశము. అట్టి ప్రకారమనఁబడునది ప్రకారవంత మగు వస్తువు నాశ్రయించియుండునది యగుటంజేసి యది తెలియవచ్చుట య నునది యావస్తువు నపేక్షించియుండును. కావున దానియందే పర్యవసించుట న్యాయము అనఁగా నట్టి ప్రకారములను తెలుపునట్టి శబ్దము ప్రకారవంతమగు పదార్థమును తెలుపుటయందే పర్యవసించును. కావుననే "గౌః=గోవుయొక్క యాకారముగల జంతువు. అశ్వః=గుఱ్ఱముయొక్క యాకారముగల జంతువు. పురుషః=పురుషాకారముగలవాఁడు—ఇట్లు ప్రకారభూతమగు ఆకృతిని తెలుపు నట్టి శబ్దములు ప్రకారవంతమగు పిండమును (శరీరమును) తెలుపుటయందు పర్య వసించునవై, అట్టిపిణ్డమున్ను చేతనునికి శరీరమగుటంజేసి వానికి ప్రకారమగుట వలనను,అట్టి పిణ్డమును శరీరమునుగాఁ గలిగియుండు చేతనుఁడును పరమాత్మకు ప్రకార మగుటవలనను ఆయాశబ్దములు పరమాత్మను తెలుపుటయందే పర్యవసింపుచున్నవి. కావున నివ్విధమున శబ్దములన్నియును పరమాత్మనే తెలుపు నవి. అందు వలన ఈపైని గనఁబఱచిన ప్రకారము పరమాత్మను తెలుపునది యగు 'తత్' అను శబ్దమునకు "త్వం" అను శబ్దముతోఁగల సామానాధికర ణ్యము ముఖ్యార్థము గలదియే.

శంక.—"ఖణ్డో గౌః=బోడి యావు, ఖణ్డః శుక్లః=తెల్ల చక్కెర" ఈ మొదలగు తావులను జాతి గుణవాచకములగు పదములకు మాత్రమే ద్రవ్య వాచకములగు పదములతో సామానాధికరణ్యము ఉన్నట్లు గానఁబడుచున్నది. ఒక ద్రవ్యము వేఱొక్క ద్రవ్యమునకు ప్రకారమగు తావులనో,మత్వర్థీయ ప్రత్య యము చేర్పఁబడుచున్నది. దృష్టాంతము:—దండీ=దండము కలవాఁడు, కుండలీ= కుండలములు గలవాఁడు.

సమాధానము:—అట్లు శంకింపఁదగదు. జాతి గాని, గుణము గాని, ద్రవ్యముగాని వీనిలో నెద్దియును సామానాధికరణ్యమును కలుగఁజేయునది కాదు. ఏలననిన,సామానాధికరణ్యము జాతిమాత్రమును గాని గుణమాత్రమును గాని యతిక్రమించి ప్రవర్తించునది కదా! అయితే ఎది ఏదైన నొకపదార్థము యొక్క ప్రకారము గానే యుండునదియో, అది యట్టి పదార్థమునకంటె వేఱుగా నుండునది గాని, యట్లు తెలియవచ్చునది గాని కాకపోవుటను బట్టి, దానిని తెలుపు శబ్దములు తమ యర్థముతో విశిష్టమైన దానిని తెలుపునవి గాన, వానికి ధర్మాంతరముతోఁ గూడియున్నట్టి యా ద్రవ్యమును తెలుపునట్టి శబ్దముతో సామానాధికరణ్యము ఉండవచ్చును. అయితే ఏతావున నెద్దియయిన నొకపదార్థము వేఱుగా నుండునదై తెలియవచ్చునదియు, తనయందుండునదియునో, ఆ పదార్థము వేఱొక్క పదార్థమునకు ప్రకారమగు తావున మాత్రమే మత్త్వర్థీయప్రత్యయము చేర్పఁబడుచున్నది. కావున దోషములేదు.

ఇట్లు అచిత్తుతోఁగూడియుండునట్టి జీవుఁడును పరమాత్మకు శరీరభూతుఁడై పరమాత్మయొక్క ప్రకారమగుటంజేసి, జీవుని నిర్దేశించుటకై ప్రయోగింపఁబడునట్టి ,,అహమ్=నేను, త్వం=నీవు'' ఈ మొదలగు శబ్దములున్న పరమాత్మనే తెలుపునవి యని "తత్త్వమసి'' అనుతావున నుండు సామానాధికరణ్యముచే గ్రహింపఁబడుచున్నది. అయితే యిట్లు జీవుఁడు శరీరరూపముగాఁ బరమాత్మతో సంబంధించి యున్నంత మాత్రమున, జీవుని ధర్మములు పరమాత్మను స్పృశింపవు. దృష్టాంతము:—మన శరీరమునందుండునవియగు బాలత్వము, యువత్వము, స్థవిరత్వము మొదలగు ధర్మములు జీవుని స్పృశింపని చందంబున, ప్రకృతమునను ఎఱుంగునది. కావున "తత్త్వమసి=తత్-త్వం-అసి'' అను సామానాధికరణ్య వాక్యముననుండు "తత్ అనుశబ్దము జగత్కారణమును, సత్యసంకల్పమును, సర్వ కల్యాణగుణాకరమును, నిరస్త సమస్త హేయగంధమునగు పరమాత్మను తెలుపునది. ఇందుండు "త్వం'' అను శబ్దము శరీర యుక్తుఁడగు జీవుని శరీరమునుగాఁ గలిగియుండునట్టి పరమాత్మనే తెలుపునది. కావున ఈపైని గానఁబఱచిన ప్రకారము ఈ వాక్యము యొక్కయర్థమును గైకొనుటచే నిచట నుండు సామానాధికరణ్యము ముఖ్యార్థము గలది యగును. ప్రకరణవిరోధమున్న లేదు. శ్రుతులలోఁ దేనితోను విరోధమును ప్రసక్తింపదు. దోషరహితమును, కల్యాణైకస్వరూపమునగు బ్రహ్మమునందు అవిద్యాది దోషములు లేశమాత్రమైనను లేవనియును సిద్ధించును. కావున (పరమాత్మకు) జీవునితో నైక్యము చెప్పియుం

డుటయును విశేషణభూతుఁడగు జీవునికంటెను పరమాత్మ వేఱయినవాఁడనియే నిరూపించును గాన, ప్రకృతమున విజ్ఞానమయుఁ డనఁబడు జీవునికంటెను ఆనందమయుఁ డనఁబడు పరమాత్మ వేఱయినవాఁడే యని సిద్ధించుచున్నది.

అయితే శ్రుతియందు "తస్యైష శారీర ఆత్మా" (తై. ఆనం 3 వా)అను తావున ఆనందమయుఁడు శారీరాత్మగాఁ (శరీరముతో సంబంధించియుండు ఆత్మగాఁ) జెప్పఁబడినందున, ఆనందమయుఁడు జీవునికంటెను వేఱయినవాఁ డగుట యసంభవ మని పూర్వపక్షి వాదించియుండెను గాని,యది యుక్తము కాదు.ఏల ననిన, ఈ ప్రకరణమున అన్నితావులను"తస్యైషశారీర ఆత్మా యః పూర్వస్య" అని యిట్లు పరమాత్మయే శారీరాత్మగాఁ బేర్కొనఁబడుచున్నాఁడు. అది యెట్లనిన, ,,తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశ స్సంభూతః" అను వాక్యమున ఆకాశాదిసృజ్యవర్గమునకు పరమకారణముగాఁ జెప్పఁబడినట్టియు, జీవునికంటెను వేఱయినవాఁడును నగు పరబ్రహ్మము ఆత్మగాఁ బేర్కొనఁబడుటచే, తక్కినవన్నియును అనఁగా ఆకాశము మొదలుకొని అన్నమయము వఱకును శ్రుతియందుఁ బేర్కొనఁబడిన వన్నియును అట్టి పరబ్రహ్మమునకు శరీరభూతముౕ లయినవని తెలియవచ్చుచున్నది. మఱియు,,యస్య పృథివీ శరీరం, యస్యాప శ్శరీరం,యస్య తేజ శ్శరీరం,యస్య వాయు శ్శరీరం,యస్యాకాశ శ్శరీరం,యస్యాక్షరం శరీరం, యస్య మృత్యుశ్శరీరం, ఏష సర్వభూతాన్తరాత్మాఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" (సు. బా. ౭ ఖం) (ఎవనికి పృథివి శరీరమో, ఎవనికి ఉదకము శరీరమో, ఎవనికి అగ్నిశరీరమో, ఎవనికి వాయువు శరీరమో, ఎవనికి ఆకాశము శరీరమో,ఎవనికి జీవుఁడు శరీరమో,ఎవనికి మృత్యువు శరీరమో, ఈతఁడు అన్నిభూతములకును అంతరాత్మ,అపహతపాప్ముఁడు,స్వయంప్రకాశుఁడు,దేవుఁడు ఒక్కఁడునగు నారాయణుఁడు) అను సుబాలోపనిషద్వాక్యము తత్త్వములన్నియును పరమాత్మయొక్క శరీరములే యనెడి యంశమును స్పష్టము గానే తెలుపుచున్నది. కావున "తస్మాద్వా ఏతస్మాదాత్మనః" (సు. బా. ౭ ఖం.) అను తావుననే అన్నమయునికి పరమాత్మయే శారీరాత్మయని తెలుపఁబడియె. ప్రాణమయుని గుఱించి చెప్పునపుడు"తస్యైష ఏవ శారీరఆత్మా యః పూర్వస్య" (ఎవఁడు పూర్వపుదానికి శారీరాత్మయో, వాఁడే దీనికిని శారీరాత్మ)అని పఠింపఁబనియే.అనఁగా పూర్వము చెప్పఁబడిన అన్నమయునికి ఎవఁడు శారీరాత్మ గాను శ్రుత్యంతరమువలనఁ దెలుపఁబడినాఁడో,ఆ పరమకారణుఁడగు పరమాత్మయే యీ ప్రాణమయునికిని శారీరాత్మ యని యర్థము. ఇట్లే మనోమయ విజ్ఞానమయుల ....

విషయమునను ఎఱుంగునది. ఆనందమయుని గుఱించి పఠించునప్పుడు "ఏష ఏవ= ఈతఁడే" అని చెప్పుట ఈతనికి వేఱొక్కఁడు ఆత్మ కాఁడని తెలుపుటకై యని యెఱుంగునది. అది యెట్లనిన, ఈపైసి గనఁబఱచిన ప్రకారము విజ్ఞానమయునికిని పరమాత్మయే శారీరాత్మగాఁ దెలియవచ్చుచున్నాఁడు. ఇట్లుండ, విజ్ఞానమయునికి ఎవఁడు శారీరాత్మయో, వాఁడే ఆనందమయునికిని శారీరాత్మయని చెప్పినపుడు, ఆనందముయొక్క నూఱునూఱు రెట్ల గుణింపును బట్టి ఆనందమయుఁడనఁగా పరమాత్మయని తెలిసియుండుటచే, పరమాత్మ స్వయముగ తనకుతానే యాత్మయని తెలియుచున్నది. ఇట్లు తనకంటె వేఱయినదగు చేతనాచేతన వస్తుసముదాయమును తనకు శరీరముగాఁ గలిగి యుండుటంజేసి పరమాత్మయే, వేఱొక్కయుపాధితో నిమిత్తము లేకుండ, శారీరాత్మ (శరీరసంబంధముగల యాత్మ) యనిపించుకొనుచున్నాఁడు. కావుననే యిట్లు పరబ్రహ్మమును తెలుపుటకై ప్రవర్తించినది యగు వేదాంతశాస్త్రమును „శారీరకమీమాంస" యని పండితులు పేర్కొనుచున్నారు. కావున విజ్ఞానమయుఁ డనఁబడు జీవునికంటెను ఆనందమయుఁ డనఁబడు పరమాత్మ వేఱయినవాఁడని సిద్ధమగుచున్నది.

అవతారిక:—

శంక:—ఈ యానందమయుఁడు జీవునికంటెను వేఱయినవాఁడు కాఁడు. ఏలననిన, "ఆనందమయః" (ఆనంద—మయట్) అనుతావున మయట్ ప్రత్యయము వికారమును తెలుపునది. ఏలననిన, వ్యాకరణశాస్త్రమున "మయడ్వైతయోః" (అష్టా ౪ అ-3 పా ౧౪3 సూ) అని యారంభించి "నిత్యం వృద్ధశరాదిభ్యః" (అష్టా. ౪ అ 3 పా. ౧౪౪ సూ) అను సూత్రమున వృద్ధసంజ్ఞగల శబ్దములకు వికారార్థమున మయట్ ప్రత్యయము విధింపఁబడుచున్నది. ఈ యానందశబ్దమున్ను వృద్ధసంజ్ఞ కలదియే కదా!

సమాధానము:—ప్రాచుర్యార్థమునఁగూడ "మయట్" ప్రత్యయము కలదు. ఏలనని, "తత్ప్రకృతవచనే మయట్" (అష్టా. ౫ అ. ౪ పా. ౨౧ సూ) అను సూత్రము ప్రాచుర్యార్థమునను "మయట్" ప్రత్యయమును విధించుచున్నది. దృష్టాంతము:—అన్నమయః యజ్ఞః=అన్న సమృద్ధిగల యజ్ఞము—ఇట్లే ఆనందమయశబ్దమును గ్రైకొనునది.

శంక:—"అన్నమయ" శబ్దము నిచట సాదృశ్యమునుగాఁ గొనుట యుక్తము కాదు. ఏలననిన, శ్రుతియందు ప్రారంభమమున "మయట్" ప్రత్యయము

వికారార్థముననే గ్రైకొనఁబడినట్లు గానఁబడుచున్నది. అట్లే ప్రకృతముననుగ్రై కొనుట న్యాయము. కావున "ఆనందమయ" శబ్దముననుండు "మయట్" ప్రత్యయము వికారార్థమునఁ గ్రైకొనఁబడుచున్నది. ఒకవేళ ఆనందమయశబ్దమున నుండు "మయట్" ప్రత్యయమును ప్రాచుర్యార్థమునఁ గ్రైకొనినను, ఆనందమయుఁడు జీవునికంటెను వేఱయినవాఁడని సిద్ధింపదు. అది యెట్లనిన, ఆనందప్రచురుఁ డన్నను, అందు దుఃఖమిశ్రత్వము తప్పకయుండును. ఏలననిన, "ఆనందప్రచురుఁడు" అనుశబ్దము ఆనందము యొక్కువ కలదనియు, దుఃఖము స్వల్పముగాఁ గలదనియును గదా తెలుపును. జీవుఁడనఁగా దుఃఖమిశ్రుఁడు గదా! కావున ప్రకరణమునుబట్టి ప్రకృతమునను ఆనందమయ శబ్దమునందలి "మయట్" ప్రత్యయమును వికారార్థమునఁ గ్రైకొనుట యుక్తము.

ఇంతియెకాక, „మృణ్మయం" (మృత్తుతోఁ జేయఁబడినది.) "హిరణ్మయం" (బంగారుతోఁ జేయఁబడినది) „దారుమయం" (దారువుతోఁ జేయఁబడినది.) ఇత్యాది లౌకికశబ్దముల యందును „పర్ణమయీ జుహూః" (పర్ణముతోఁ జేయఁబడిన జుహువు) „శమీమయః స్రుచః" (శమితోఁ జేయఁబడిన స్రుక్కులు) „దర్భమయీ రశనా" (దర్భలతోఁ జేయఁబడిన త్రాఁడు) ఇత్యాది వైదికశబ్దములయందును "మయట్" ప్రత్యయము వికారపరముగ తఱచు ప్రయోగింపఁబడుచున్నట్లు గన్పట్టుచున్నందునను వికారార్థమే శీఘ్రముగ బుద్ధికి స్ఫురించును. జీవుని కానందవికారము గలదు. అతని స్వరూపము వాస్తవమునకు ఆనందమే యయినను, ఈ సాంసారికావస్థయం దానందవికారము మాత్రమే యతనికిఁ గలదు. ఇట్లు „మయట్" ప్రత్యయము వికారపరముగ గన్పట్టుచుండుటంజేసి „ఆనందమయః" అనుచో "ఆనందవికారుఁడు" అనెడి యర్థము గ్రహింపఁదగినది. కనుక ఆనందమయుఁడు జీవునికంటె వేఱు కాఁడని శంకింపఁగా, నట్టి శంకను అనువదించి పరిహరించుటకై,

౧౩॥ సూ॥ వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్.

టీ॥ వికారశబ్దాత్ =వికారార్థము నిచ్చు "మయట్" ప్రత్యయము యొక్క ప్రయోగముండుటవలన, న=ఆనందమయుఁడు పరమాత్మ కాఁడు, ఇతి చేత్ =ఇట్లంటివేని, న=అది సరికాదు. ఏలననఁగా, ప్రాచుర్యాత్ ="మయట్" ప్రత్యయము ప్రాచుర్యార్థమునను ప్రయోగింపఁబడినదిగాను గన్పట్టుచున్నందున.

తా॥ "ఆనందమయ" శబ్దముననుండు "మయట్" ప్రత్యయము వికారార్థమును తెలుపునది యగుటంజేసి, యానందమయుఁ డనఁగా పరమాత్మ కాఁడంటివేని, యది యుక్తముఁ కాదు. ఏలననఁగా, ప్రాచుర్యార్థమునను "మయట్" ప్రత్యయము ఉండవచ్చును గదా!

శ్రీ॥ భా॥ ,,మయట్'' ప్రత్యయము వికారపరముగ గన్పట్టుచున్నది, కావున ఆనందమయుఁ డనఁగా, ఆనందవికారుఁడగు జీవుఁడు. ఇట్లు పూర్వపక్షి చెప్పునది యుక్తముకాదు. ఏలననిన, పరబ్రహ్మమునకు ఆనందప్రాచుర్యము గలదు. మఱియు ,,మయట్'' ప్రత్యయము ప్రాచుర్యార్థమునఁగూడ ప్రయోగింపఁబడుట సంభవము. కాఁబట్టి యానందమయశబ్ద మానందప్రచురుఁడగు పరబ్రహ్మమునే తెలుపునది. అది యెట్లనిన, శ్రుతియందు మానుష్యానందము ముందుగాఁ జెప్పఁబడి దానికంటె గంధర్వాదుల యానందములలో నొకటికంటె నొకటి శతగుణ మధికమని తెలియఁజేయఁబడి, పిదప ప్రాజాపత్యానందమున కంటె బ్రహ్మానందము శతాధిక మని బోధింపఁబడియె. ఇట్లు శతాధికముగ బోధింపఁబడిన నిరతిశయానందము జీవునియం దుండుట యసంభవము. కాఁబట్టి యది పరబ్రహ్మమునందుండునదిగ నిశ్చయింపఁబడుచున్నది. ఈపైని గనఁబఱచిన ప్రకారము నిరతిశయానంద యుక్తుఁడగు బ్రహ్మమునందు ఆనందవికార ముండనేరనందునను, "మయట్" ప్రత్యయము ప్రాచుర్యార్థమునఁగూడ ప్రయోగింపంబడుట సంభవ మగుట వలననున్ను ,,ఆనందమయః'' అనుశబ్దము ఆనందప్రచురుఁడగు పరబ్రహ్మమునే తెలియఁజేయుచున్నది.

ప్రకరణమునుబట్టియు, ప్రయోగప్రౌఢినిబట్టియును విచారింపఁగా, ,మయట్, ప్రత్యయము వికారపరముగాఁ దెలియవచ్చుచున్నదని పూర్వపక్షి చెప్పునది యుక్తము కాదు. ఏలననిన, అట్లగునేని, ప్రస్తుతవిషయముతో విరోధము గలుగును. కాఁబట్టి యిది వికారపరము గానేరదు.

ఎట్లనిన, "ప్రాణమయ" శబ్దార్థమును తెలిసికొంటిమేని "ప్రకరణమునుబట్టి ,,మయట్''ప్రత్యయము వికారపరము" అను పక్షమును వదులుకొనవలసి వచ్చును. అది యెట్లనిన, ప్రాణమయమనఁగా (ప్రాణవికారము=ప్రాణముతోఁ జేయఁబడినది) అనెడి యర్థము గానేరదు. అయితే పంచవృత్త్యాత్మకమగు వాయువు ప్రాణవృత్తి గలదయినంతమాత్రమునఁగాని, ప్రాణాపానాది పంచవృత్తులలో ప్రాణవృత్తి యధికమగుటవలనఁగాని ప్రాణమయాత్మ ప్రాణమయుఁ డనుపేరుచే శ్రుతియందు వ్యవహరింపఁబడుచున్నాఁడు. ,,మయట్'' ప్రత్యయమునకు ప్రాచుర్యార్థమునఁ బ్రయోగము లేదని చెప్పుట కవకాశము లేదు. ఏలననిన, ,,అన్నమయో యజ్ఞః'' (అన్నసమృద్ధిగల యజ్ఞము) ,,శకటమయీ యాత్రా'' (శకట సమృద్ధిగల యాత్ర) ఇత్యాది స్థలములయందు ,,మయట్'' ప్రత్యయము ప్రాచుర్యార్థమునందుఁ బ్రయోగింపఁబడినది గాను గన్పట్టుచున్నది గదా!

"ఆనందమయః" (ఆనందప్రచురుఁడు) అనఁగా, చాలాభాగము వఱకు ఆనందము గలవాఁడని యర్థము గాన, నప్పు డట్టి యానందమయుని యందు స్వల్పభాగము దుఃఖము సయితము గలదనియును తెలియవచ్చునని పూర్వపక్షి చేసిన వాదము సరియయినది కాదు. ఏలననిన,ఆనందప్రచురుఁ డనఁగా మిక్కిలి యధికముగ ఆనందము గలవాఁడనుట. ఇట్లు చెప్పటచే బ్రహ్మమునం దానందే తరములు(దుఃఖాదులు)గలవని తెలియరాదు సరియే కదా,అందుండు ఆనందము స్వల్పము కాదనియును తెలియవచ్చును.ఇంతియె కాక,ఆనందమయుఁ డనంబడు బ్రహ్మమునం దానందేతరములగు దుఃఖాదులు కలవా? లేవా? అను విష యము ప్రమాణాంతరములవలన నిశ్చయింపఁదగినది. అపహతపాప్మేత్యాది ప్రమాణాంతరములు పరబ్రహ్మమునందు దుఃఖాదు లేవియును లేవని గదా తెలుపు చున్నవి.కనుక బ్రహ్మమునం దానందాధిక్యము గలద నుటయనునది,అందు బ్రహ్మా నంద మధిక భాగమై యితరానందము స్వల్పభాగ మగుటను బట్టి యని యెఱుంగు నది. కావుననే "స ఏకో మానుష ఆనందః" ఇత్యాది శ్రుతివాక్యము మనుష్యా ద్యానందమును బట్టి చూడఁగా, బ్రహ్మానందము తనను మించినదెద్దియును లేనిది యగుటంజేసి యధికమైన దని గదా తెలియఁజేయుచున్నది.

ఆనందవికారుఁడుగా నుండుట జీవునికి సంభవము గాన, "ఆనందమయ" శబ్దము జీవునిఁ దెలియజేయునది యని పూర్వపక్షి చేసిన వాదమున్ను సరియ యినది కాదు ఏలననిన, జీవుఁడు జ్ఞానానందస్వరూపుఁడు గదా! అట్టి యాతఁడు ఏదొక యాకారముచే, మృత్తిక మొదలగు పదార్థములు ఘటాద్యాకారముగ పరిణమించు చందంబున పరిణమించుట శ్రుతిస్మృతిన్యాయ విరుద్ధమయిన సంగతి. జీవుఁడు జ్ఞానానందస్వరూపుఁడే యయినను,కర్మవశమున సంసారదశయం దతని జ్ఞానానందములు సంకోచమును బొందిన వగుచున్నవని యిఁకమీఁదు ప్రతిపాదిం పఁబడును. ఈపైని గనఁబఱచిన హేతువులను బట్టి యానందమయుఁడు జీవుని కంటె వేఱయినవాఁ డగు పరబ్రహ్మమే యని యెఱుంగునది.

అవతారిక:—ఆనందమయుఁడు జీవునికంటె వేఱయినవాఁడగు పరమా త్మయే యని తెలుపునట్టి వేఱొక్క హేతువును జూపించుటకై.

౧౫॥ సూ॥ తద్ధేతు వ్యపదేశాచ్చ.

టీ॥ తద్ధేతు వ్యపదేశాచ్చ=జీవుల యానందమునకు హేతువుగాఁ జెప్పఁ బడినందునను.

తా॥ ఈ యానందమయుఁడు జీవుల కానందమును గలుగఁజేయువాఁడు గాను శ్రుతులయందుఁ జెప్పియున్నందునను, ఆనందమయుఁడనఁగా జీవునికం టెను వేఱగు పరమాత్మయని విశద మగుచున్నది.

శ్రీ॥ భా॥ ,,కో హ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో న స్యాత్ ఏష హ్యేవానన్ద యాతి” అను శ్రుతివాక్యము ,,ఈ యపరిచ్ఛిన్నుఁ డగు ఆనందమయుఁడు లేని పక్షమున, నెవఁ డపానవ్యాపారమును జేయును? ఎవఁడు ప్రాణవ్యాపారమును జేయును! ఈ యానందమయుఁడే యందరికి నానంద మును గలుగఁ జేయు చున్నాఁడనుటచే నీ యానందమయుఁడే సమస్తజీవుల కానం దమును గలుగ జేయువాఁడని తెలుపుచున్నది. అందువలన వాఁడీ పై వాక్యము న జీవుల కానందమును గలుగఁ జేయునట్టి హేతువుగ దెలియఁ జేయఁబడుచు న్నాఁడు. కాబట్టి యానందింపఁబడు జీవులకంటె వానినానందింపఁ జేయు నానంద మయుఁ డగు పరమాత్మ వేఱయినవాఁడని తెలియవచ్చుచున్నది.

ఈపైని యుదహరింపఁబడిన శ్రుతియందలి “ఆనంద” శబ్దము ఆనంద మయ పరమని యిఁక మీఁదు ప్రతిపాదింపఁబడును.

అవతారిక :—

జీవునికంటె నానందమయుఁడు వేఱయినవాఁడని తెలుపునట్టి వేఱొక్క హేతువును జూపించుటకై.

౧౬॥ సూ॥ మాన్త్రవర్ణికమేవచ గీయతే.

టీ॥ మాన్త్రవర్ణిక మేవచ=మన్త్రవర్ణమునఁ జెప్పఁబడినట్టి పరబ్రహ్మమే (ప్రకృతశ్రుతియందు ఆనందమయుఁడుగా) గీయతే=చెప్పఁబడుచున్నాఁడు.

తా॥ ,,సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ” ఇత్యాది మంత్రవర్ణమునఁ జెప్పఁ బడిన పరబ్రహ్మమే ప్రకృతశ్రుతియందు ఆనందమయుఁడుగాఁ జెప్పఁబడు చున్నాఁడు.

శ్రీ॥ భా॥ “సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ” అను మంత్రవర్ణమునందుఁ జెప్పఁబడిన బ్రహ్మమే ప్రకృతమున నానందమయుఁడుగా జెప్పఁబడుచున్నాడు. అచట చెప్పఁబడినవాఁడు జీవునికంటెను వేఱయినవాఁడగు పరబ్రహ్మమే గదా! అది యెట్లనిన, అనంతరమున “బ్రహ్మవిదాప్నోతి పరం” అనుశ్రుతి వాక్యము ,,అట్టి మంత్రవర్ణ ప్రతిపాదితుఁ డగు బ్రహ్మమును జీవునికి ప్రాప్యునిగ నిర్దేశించుచున్నది.

“తదేషాభ్యుక్తా” (తై. అన. ౧ అను) అనువాక్యము వేదాధ్యేత లట్టి బ్రహ్మమును ప్రతిపాదింప నిచ్ఛయించి యీఋక్కును జెప్పిరని గదా తెలియఁ జేయుచున్నది. అనగా బ్రాహ్మణ ప్రతిపాదితార్థమునే మంత్రముగూడ విశదీక రింపుచున్నదని చెప్పుచున్న దనుట. కాఁబట్టి యుపాసకుఁ డగు జీవునికి ప్రాప్య మగు బ్రహ్మ మట్టి యుపాసకునికంటె విలక్షణ మయినది. కనుకనే యనంతరము

"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః" ఇత్యాది బ్రాహ్మణములును, మంత్రములున్ను బ్రహ్మముయొక్క అట్టి వైలక్షణ్యమునే విశదపరచుచున్నవి. ఈపైని గనఁబఱచిన హేతువులవలన, ఆనందమయుఁడు జీవునికంటె వేఱయిన వాఁడని తెలియుఁగునది.

అవతారిక:—

ఉపాసకునికంటెను వానికి ప్రాప్యమగు పదార్థము భిన్నమే యగు గాక! అయినను, మంత్రవర్ణప్రతిపాదితమగు బ్రహ్మము ఉపాసకునికంటెను వేఱగు మఱి యొక పదార్థము గానేరదు. ఏలననిన, అవిద్యయంతయును పోవుటచే నిర్విశేష చిన్మాత్రైకరసమై, పరిశుద్ధమయినట్టి యుపాసకుని స్వరూపమునే గదా "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అనుమంత్రము తెలుపుచున్నది. మఱియు ఇట్టి స్వరూపమునే "యతోవాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" అను శ్రుతివాక్యము "వాఙ్మనస్సుల కగోచరమయిన దానినిగాఁ జెప్పుటచేఁ దానిని నిర్విశేషమునుగ దెలియఁ జేయుచున్నది. ఈ హేతువులనుబట్టి జీవునియొక్క పరిశుద్ధస్వరూపమే మంత్రవర్ణమునందుఁ జెప్పియున్నట్లు తెలియుచున్నది. కావున మంత్రవర్ణమునఁ జెప్పఁబడిన యానందమయుఁడు జీవునికంటె వేఱయినవాఁడు కాడని సిద్ధమగుచున్నదని శంకింపఁగా, నట్టిశంకను పరిహరించుటకై.

౧౭॥ సూ॥ నేతరోనుపపత్తేః.

టీ॥ ఇతరః=బ్రహ్మేతరుఁడగు ముక్తజీవుఁడును, న = ఆనందమయుఁడు కాఁడు. (ఏలననఁగా) అనుపపత్తేః=ముక్తునికి నిరుపాధికమగు విపశ్చిత్త్వ ముం డుట యసంభవ మగుటవలన.

తా॥ ముక్తపురుషునికిన్ని నిరుపాధికమగు విపశ్చిత్త్వ ముండుట యసంభవ మగుటంజేసి, ఆనందమయుఁడనఁగా ముక్తపురుషుఁడు సయితము కాఁడు.

శ్రీ॥ భా॥ పరమాత్మేతరుఁడై, జీవుఁడనఁబడువాఁడు ముక్తావస్థను బొందిన వాఁడయినప్పటికిని, అట్టివాఁడున్ను మంత్రవర్ణమునఁ జెప్పఁబడిన యానందమయుఁడు కానేరఁడు. ఏలయన:—అట్టి ముక్తావస్థయందుండు జీవునికిని స్వాభావికమగు విపశ్చిత్త్వము ఉండుట సంభవముకాదు. అదియెట్లనిన, "సోఽకామయత బహు స్యాం ప్రజాయేయ" ఇత్యాది శ్రుతివాక్యము "ఆ యానందమయుఁడు ప్రజాసృష్టికిగాను తాననేకముగ నగుచున్నానని సంకల్పించెను" అనియు నిట్లు చెప్పుచు ఆనందమయునియొక్క సత్యసంకల్పత్వమును జూపించుటచే అతనికి స్వాభావికమగు విపశ్చిత్త్వమును గదా వివరించుచున్నది. "వివిధం పశ్యచ్చిత్త్వం=వివిధం=నానావిధములుగ పశ్యత్=చూచుచుండు అనఁగా దెలిసికొనుచుండు, చిత్త్వం=జ్ఞానమును గలిగియుండుట) అనెడి శబ్దవ్యుత్పత్తిని బట్టి "నానావిధములగు పదా

ర్థములను దెలిసికొను జ్ఞానమును గలిగియుండుట గదా విపశ్చిత్త్వ మనఁబడు చున్నది.ఈ శబ్దము పృషోదరాదిగణ పతితమైనందున,,పశ్యత్"అనుచో ,,యకారము"లోపించుటచే ,,వి-పశ్-చిత్త్వం—విపశ్చిత్త్వం'' అనురూపము సిద్ధించు చున్నది. ముక్తపురుషుఁడు మోక్షావస్థయందు అట్టి విపశ్చిత్త్వము గలవాఁడే యయినను,సంసారదశయం దతఁడే విపశ్చిత్త్వరహితుఁడుగాఁ గానఁబడినందున, నతని కది స్వాభావికమైనది కానేరదు. ముక్తుఁడు మోక్షావస్థయందు నిర్విశేష చిన్మాత్రుఁ డగునని యద్వైతులు చెప్పుచున్నారు. కావున, వారిమతప్రకార మతఁ డట్టి యవస్థయందు దెలుసుకొను విషయము లేవియు లేవు గాన, నతనికి అప్పుడు ,,నానావిధములగు పదార్థములను దెలిసికొనుట" యను విపశ్చిత్త్వ మెంతమాత్రము ఉండుట సంభవము కాదు.

ఏ ప్రమాణముచేతను నిర్విశేషవస్తువును ప్రతిపాదించుట యశక్య మని యింతకు పూర్వమే ప్రతిపాదించి యుంటిమి. ,,యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ"అను శ్రుతివాక్యము ''వాఙ్మనస్సులు బ్రహ్మమునుండి నివర్తించుచున్నవి"అని చెప్పినను,అందువలన నది నిర్విశేషవస్తువును ప్రతిపాదింపనేరదు. ఒకవేళ ఆ శ్రుతివాక్యము ,,వాఙ్మనస్సులు బ్రహ్మమును దెలిసికొనుటకు ప్రమాణములు గావు" అని తెలుపుచున్నదనియెదవా ? అట్లంటివేని, కుందేటి కొమ్ములవలెనే బ్రహ్మము తుచ్ఛ మను మాట వచ్చును. అనఁగా బ్రహ్మము ప్రమాణసిద్ధము గాదని చెప్పవలసివచ్చును. అయితే శ్రుతులు ,,బ్రహ్మవిదాప్నోతి పరం" అని యారంభించి ,,బ్రహ్మము విపశ్చిత్తనియు, జగత్కారణుఁ డనియు, జ్ఞానానం దైక స్వరూపుఁడనియు, ఇతరులకానందమును గలుగఁజేయు వాఁడనియు, స్వసంకల్పమాత్రమున చిదచిదాత్మకమగు నీ జగత్తు నంతయును సృజించినట్టి వాఁడనియు, ఇట్లు సృజింపంబడిన పదార్థములలోఁ బ్రవేశించి వానిలో నంతరాత్మగ నుండువాఁడనియు, భయాభయ హేతువనియు, వాయువు, ఆదిత్యుఁడు మొదలగు వారిని వారివారి పనులయందు నియమించువాఁడనియు, ఆనందమును నూఱునూఱు రెట్లవంతున గుణింపఁగా,నందఱికంటె నెక్కువ యానందము గలవాఁడనియు నివ్విధముగ నింక ననేకముగ జెప్పి, యనంతరము వాఙ్మనస్సుల కట్టి బ్రహ్మమునందు ప్రవృత్తి లేదనినంతమాత్రమున బ్రహ్మము ప్రమాణసిద్ధమైనది గాదని తెలుపుచున్నవనుట పిచ్చివాడు చెప్పునట్టిది.

మఱియు ,,యతో వాచో నివర్తన్తే" అనువాక్యమున ,,యతః" అను శబ్దముచేఁ జెప్పఁబడిన పదార్థమును,,ఆనందం బ్రహ్మణో విద్వాన్''అనువాక్యము నందలి ,,ఆనంద"శబ్దముచే నిర్దేశించి, అట్టి యానందము బ్రహ్మసంబంధమైనదని ,,బ్రహ్మణః"(బ్రహ్మముయొక్క) అను షష్ఠీ విభక్తిచే దెలిపి, వాఙ్మనస్సుల

కగోచర మగునట్టి బ్రహ్మానందమును "విద్వాన్=తెలిసికొనినవాఁడు" అనుటచే సది నిరర్థక మగుటయే కాక, యది యసంగతార్థము సయిత మగును.

కాఁబట్టి వేదము ఆనందమును నూఱునూఱురెట్లవంతున గుణించుటచే బ్రహ్మానందముయొక్క పరిమితిని జెప్పుట కుద్యమించి, ఆ యానందము పరిమితిలేని దగుటవలన నది యింతమాత్రమని జెప్పుటకు గాని, తలంచుటకు గాని, యలవికాని దని ,,యతో వాచో నివర్తన్తే" ఇత్యాది వాక్యములచేఁ జెప్పుచున్నది. మఱియు అట్టి బ్రహ్మానందము ఇంతమాత్రమని చెప్పుట కలవి గానిదియని తెలిసికొనిన విద్వాంసుఁ డభయమును బొందుచున్నాఁడు"అని ,,ఆనందం బ్రహ్మణో విద్వాన్"అను వాక్యము తెలుపుచున్నది. ఇంతియెకాక, ఇట్లు మన్త్రవర్ణమునందు విపశ్చిత్తని చెప్పఁబడిన వాఁడు ,,సోఽకామయత" ఇత్యాద్యుత్తరవాక్యమున ,,తన సంకల్పమాత్రమున జగజ్జన్మస్థిత్యాదులను గలుగఁజేయుచు జగత్తునందంతట నంతర్యామిగ నుండువాఁడని చెప్పఁబడి యున్నందున నిట్టి యానందమయుఁడు ముక్తాత్మకంటె వేఱయినవాఁ డనునది విశదమయిన సంగతియే.

అవతారిక :—ఇట్లు ఈరెండు అవస్థలయందుండు ప్రత్యగాత్మకంటెను ఆనందమయుఁడు వేఱయినవాఁడని తెలియఁబఱచు హేత్వంతరమును జూపుటకై.

### ౧౭॥ భేదవ్యపదేశాచ్చ.

టీ॥ భేదవ్యపదేశాచ్చ=జీవుఁడానందమయునికంటెను భిన్నుఁడుగాఁ జెప్పఁబడుట వలనను (ఆనందమయుఁడు జీవుఁడు కాఁడు.)

తా॥ జీవుఁడు ఆనందమయునికంటె వేఱయినవాఁడుగ శ్రుతియందుఁ జెప్పఁబడినందునను, జీవుఁడానందమయునికంటెను భిన్నుఁడు.

శ్రీ॥ భా॥ "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః" అను శ్రుతివాక్యము ,,ఆ పరబ్రహ్మమునుండి ఆకాశము పుట్టినది" అని యిట్లు మంత్రవర్ణమునఁ జెప్పఁబడిన పరమాత్మను వర్ణించుచు, అనంతరము "తస్మాద్వా ఏతస్మాద్విజ్ఞానమయాదన్యోఽన్తర ఆత్మా ఆనందమయః" అను వాక్యమున ప్రాణముకంటెను,మనస్సుకంటెనున్ను ఆనందమయుఁడు వేఱయినట్లు, జీవునికంటెనున్ను వేఱయినవాఁడని తెలుపుచున్నందునను మంత్రవర్ణమునందు ప్రతిపాదింపఁబడిన ఆనందమయుఁడు జీవునికంటెను వేఱయినవాఁడని తెలిసికొనుచున్నాము.

అవతారిక :—ఆనందమయుఁడు జీవునికంటెను వేఱయిన వాఁడని తెలుపునట్టి హేత్వంతరమును జూపించుటకై.

### ౧౮॥ సూ॥ కామాచ్చ నానుమానాపేక్షా

టీ॥ కామాచ్చ=తనకోరికవలననే జగత్తును సృజించినట్లు శ్రుతియందుఁ జెప్పియున్నందునను, అనుమానాపేక్షా=ఈతనికి జగత్సృష్టివిషయమున అచిత్సంయోగముయొక్క యపేక్ష, న=ఆవశ్యకము కాదు.

తా॥ ఈ యానందమయుఁడు తన కోరికవలన మాత్రమే జగత్తును సృజించినట్లు శ్రుతియందు వినఁబడుచున్నందున, ఈతనికి జగత్సృష్టివిషయమున నచిత్సంబంధ మపేక్షితము కానట్లు తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ అవిద్యా పరవశుఁడగు జీవుఁడు జగత్కారణుఁడను పక్షమునఁ గదా అతనికి అనుమానముచేఁ దెలిసికొనబడు నట్టిదియు, ప్రధానాదిశబ్దములచే వ్యవహరింపఁబడునట్టి యచేతన పదార్థముతో సంబంధ మావశ్యక మగును! ఏల ననిన, అట్లు అచేతన పదార్థముతో సంబంధించి యున్నందునఁ గదా చతుర్ముఖ బ్రహ్మము మొదలగు వారు జగత్కారణ మనిపించుకొను చున్నారు. ప్రకృత మందనో, „సోఽకామయత బహుస్స్యాం ప్రజాయేయ" అను శ్రుతివాక్యము "ఆ పరబ్రహ్మము ప్రజాసృష్టికి గాను తానెనేకముగా నగుదునని సంకల్పించెను" అని యారంభించి „ఇదంసర్వ మసృజత యదిదం కిఞ్చ" అను వాక్యమున "అతఁడీ సమస్తమైన జగత్తును సృజించెను" అనుచు, ఈజగత్కారణుఁడగు ఆనందమయుఁడు అచిత్పదార్థ సంబంధ మెంతమాత్రము లేకయే, తనకోరిక వలననే యీ చిదచిద్రూపమగు జగత్తునంతయును సృజించెనని తెలియఁజేయు చున్నది. కనుక నానందమయునికి జగత్తును సృజించు విషయమున అచిత్సంబంధముతో అపేక్ష లేనట్లు సిద్ధమగు చున్నది. కాఁబట్టి యీతఁడు జీవునికంటెను వేఱయినవాఁడుగాఁ దెలియవచ్చుచున్నాఁడు.

అవతారిక :—ఆనందమయుఁడు జీవునికంటెను వేఱయినవాఁడని తెలియఁజేయునట్టి మఱియొక హేతువును జూపించుటకై.

### ౧౯॥ సూ॥ అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి.

టీ॥ అస్మిన్=ఈ యానందమయునియందు, అస్య=ఈ జీవునికి, తద్యోగం=ఆనందసంబంధమును, శాస్తిచ=శాస్త్రము తెలుపుచున్నదియును.

తా॥ శాస్త్రము ఈ యానందమయునియందు ఈజీవుని కానందయోగ మును తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ ఈ యానందమయుని యందు జీవుని కానందయోగమును శాస్త్రము విధింపుచున్నవి. ఏలయన, „రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వా నందీ భవతి" అను శ్రుతివాక్యము, రసమనఁబడు యానందమయుని జీవుఁడను

వాఁడుపొంది యానందము గలవాఁడగునని జెప్పుచుండ,ఎవనివలన నెవ్వనికానందము గలుగునో వాఁడే వీఁడనిబుద్ధిమంతుఁ డెవ్వఁడు చెప్పును ?

ఇట్లు ఆనందమయుఁ డనఁగా పరబ్రహ్మమే యని నిశ్చయింపఁబడుటంజేసి "విజ్ఞాన" శబ్దముచే విజ్ఞానమయుఁడు పరామర్శింపఁబడినట్లు ,,యదేష ఆకాశ ఆనందః" అనియు ,,విజ్ఞాన మానందం బ్రహ్మ" అనియు నీమొదలగు శ్రుతుల యందు "ఆనంద" శబ్దముచే ఆనందమయుఁడే పరామర్శింపఁబడు చున్నాఁడు. కనుకనే అనఁగా ఇట్లు ఆనందమన్నను ఆనందమయుఁ డన్నను ఒక్కటియే యర్థ మగుటంజేసియే ,,ఆనందం బ్రహ్మణో విద్వాన్" అనుచో, అతఁ డానందమని చెప్పఁబడుచున్నాడు. మఱియు, అందువలననే ,,ఆనందమయ మాత్మాన ముప సంక్రామతి" అను ఫలవాక్యము గూడ ,,జ్ఞానియగు పురుషుఁ డానందమయుఁ డనంబడు ఆత్మను బొందుచున్నాఁడు" అనుచు నిట్టి యానందమయుని బొందు టయే మోక్షరూపమగు ఫలమని తెలియఁజేయుచున్నది.

పూర్వానువాకమునఁ జెప్పఁబడిన అన్నమయాదులు ఉత్తరానువాక మున ,,అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" అనియు,,ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్" అనియు,,మనో బ్రహ్మేతి వ్యజానాత్"అనియు, ,,విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్" అనియు, నీ తావుల ,,అన్న,ప్రాణ మనో విజ్ఞాన శబ్దములచేఁ జెప్పఁబడునట్లు ,,ఆనందో బ్రహ్మేతి" అనుతావునను ఆనందశబ్దముచే నానందమయుఁడే చెప్పఁ బడుచున్నాఁడని యెఱుంగునది. కనుకనే ,,ఆనందమయ ముపసంక్రమ్య" ఇత్యాద్యుపసంహార వాక్యము ఆనందమయునే పేర్కొనుచున్నది.

ఈపైని గనఁబఱచిన హేతువులనుబట్టి ప్రకృతియనఁబడుదాని కంటెను వేఱయిన వాఁడగు బ్రహ్మము జీవుఁడనఁబడువానికంటెనున్ను వేఱయినవాఁడని సిద్ధమగుచున్నది.

—ఆనందమయాధికరణము ముగిసెను.—

---

### అన్తరధికరణము.

అవతారిక:—స్వల్పపుణ్యులగు జీవులు సంకల్పమాత్రమున జగత్తును సృజించుటకును, అత్యంతానందమును బొందుటకును, నిగ్రహానుగ్రహములఁ జే యుటకున్ను సమర్థులు కాకపోవుట సంభవమే. అయినను, ఎక్కువ పుణ్యవంతు లగు ఆదిత్యేంద్ర ప్రజాపతి ప్రభృతు లట్టికార్యముల నొనర్చుటకు సమర్థు లగుట సంభవమే యని శంకింపఁగా, నట్టి శంకను ఈ సూత్రముచే నిరాకరింపుచున్నారు.

## ౨౧॥ సూ॥ అన్తస్తద్ధర్మోపదేశాత్

టీ॥ అన్తః=అక్ష్యాదిత్య మధ్యమునం దున్నవాఁడు సర్వేశ్వరుఁడే, ఏల ననఁగా:—తద్ధర్మోపదేశాత్ =పరమేశ్వరధర్మము లతని కున్నట్లు చెప్పఁబడుటవలన.

తా॥ పరమాత్మ కసాధారణములగు నపహతపాప్మత్వాది ధర్మములు, అక్ష్యాదిత్య మండలాంతర్వర్తి యగు పురుషుని కున్నట్లు చెప్పియుండుటవలన, వాఁడు పరమాత్మయేనై యుండవలెను.

శ్రీ॥ భా॥ ఛందోగులు ,యఏషో న్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః తస్య యథాకప్యాసం పుండరీకమేవమక్షిణీ తస్యోదితి నామ స ఏష సర్వేభ్యః పాప్మభ్యః ఉదితః ఉదేతి హవై సర్వేభ్యః పాప్మభ్యో యఏవం వేద తస్యర్క్చ సామచ గేష్ణౌ" (ఛా. ౧ ప్ర ౬ ఖ. ౬ వా.) ఇత్యాదివాక్యమున "బంగారు మీసములుగలిగినట్టియు,బంగారు తలవెంట్రుకలు గలిగినట్టియు,నఖాది శరీరమునందంతటను సువర్ణ ఛాయగలిగినట్టియు, నాళమునందున్న తామరపువ్వువంటి కన్నులు గలిగియున్నట్టియు, సూర్యమండలాంతర్వర్తియు నగు, హిరణ్మయపురుషుఁడు ,,ఉత్" అని నామముగలవాఁడు, ఈతఁడు సర్వపాపవిముక్తుఁడు. ఈతని నెవ్వఁడు ఉపాసించుచున్నాఁడో, వాఁడు సర్వపాపములనుండి విముక్తుఁడగుచున్నాఁడు. ఈ విషయము నెవ్వఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడును సర్వపాపములనుండి విముక్తుఁడగుచున్నాఁడు. అతనికి ఋగ్వేదమున్ను సామవేదమున్ను గానవిశేషములు" అని యివ్విధముగ నధిదైవతంబున నతని స్వరూపమును వర్ణించి,తరువాత అధ్యాత్మమున "య ఏషో ఽక్షిణి పురుషో దృశ్యతే సైవర్క్తత్సామ తదుక్థ్యం తద్యజుస్తద్బ్రహ్మ తస్యైతస్య తదేవరూపం యదముష్య రూపం యావముష్య గేష్ణౌ తౌ గేష్ణౌ యన్నామ తన్నామ"అనువాక్యమున "ఏ పురుషుఁడీ నేత్రమధ్యమున గన్పట్టుచున్నాఁడో, ఆతఁడే ఋగ్యజుస్సామశరీరుఁడును, ఉక్థశరీరుఁడును నగు పరమాత్మ ఈతఁడు అధిదైవతోపాసనమున ఆదిత్యమండల మధ్యగతుఁడుగా ఉపాసింపఁబడెడి పురుషునియొక్క హిరణ్మయస్వరూపమును, స్తుతిరూపములగు ఋక్సామములును,"ఉత్" అనియు, ఉద్గీథమనియు, అభిధేయసంజ్ఞలున్ను కలిగియున్నవాఁడు" అనియు నివ్విధముగ నధ్యాత్మవిషయమైన యుపాసనమునున్ను పఠించుచున్నారు ఇచట నొక సంశయము గలుగుచున్నది.

### సంశయము

ఇందు ఆదిత్యుని లోపలను నేత్రమునందును ఉన్నట్లు బోధింపఁబడిన పురుషుఁడు పుణ్యాతిశయమువలన ప్రాప్తించిన యైశ్వర్యముఁగలిగిఁ ఆదిత్యాది

నామములచే పిలువఁబడు జీవుఁడేనా? లేక, జీవునికంటెను వేఱయినవాఁడగు పరమాత్మయా ?

## పూర్వపక్షము.

అతఁడు పుణ్యపరిపాకముగల జీవుఁడే యనుట యుక్తము. ఏలననిన, అతఁడు ఈతావున శరీరవంతుఁడు గాను గదా వర్ణింపఁబడుచున్నాఁడు. శరీర సంబంధము జీవుల కుండుట సంభవము. జీవులకు వారివారి కర్మానుసారము ప్రియాప్రియయోగమును అనఁగా ఇష్టానిష్టములను గలుగఁజేయుటకై శరీర మేర్పడుచున్నది. కనుకనే "న హ వై సశరీరస్య సతః ప్రియాప్రియయో రపహతి రస్తి అశరీరంవా వ సంతం ప్రియా ప్రియే న స్పృశతః" అను శ్రుతివాక్యమున్ను ;;శరీర సంబంధములేని వానిని సుఖదుఃఖములు బాధింపవు. అయితే శరీరసంబంధముగల వానిని సుఖదుఃఖములు బాధింపుచునే యుండును'' అనుచు, కర్మసంబంధములేని మోక్షావస్థయనఁబడునది శరీరారాహిత్యముచేఁ బొందఁదగినదని తెలుపుచున్నది. మఱియు జీవుఁడు సయితము పుణ్యాధిక్యమువలన ఎక్కువ జ్ఞానము గలవాఁడును,ఎక్కువ శక్తిగలవాఁడును గానచ్చును. కాఁబట్టి, ఈపై శ్రుతివాక్యమునందుఁ జెప్పఁబడినప్రకారము, లోకకామిత్వము, లోకేశ్వరత్వము మొదలగునవి గూడ జీవునికే యుపపన్నములు.ఈ హేతువులను బట్టి యుపాస్యుఁడును,ఫలమునిచ్చువాఁడును, పాపమును పోఁగొట్టి మోక్షమును గలుగఁజేయువాఁడును సయితము జీవుఁడే కానచ్చును. మనుష్యులలోనను మిక్కిలి పుణ్యాత్ములగువారు కొందఱు విలక్షణము లగు జ్ఞానశక్త్యాదులను వడసి మిక్కిలి గొప్పవారు గాను గానఁబడుచున్నారు కదా! ఇంతియెకాక, వారికంటె సిద్ధగంధర్వాదులును, వారికంటె దేవతలునుఁ, వారికంటె ఇంద్రాదిలోకపాలకులును విలక్షణములైన జ్ఞానశక్త్యాదులను గలిగి యున్నారు. బ్రహ్మము మొదలు వీరలలో నెవఁడైన నొక్కఁడు ఒక్కొక్క కల్పమునందు ఉత్కృష్ట పుణ్యవిశేషముచే నిట్టి యైశ్వర్యమునుబొంది జగత్సృష్ట్యాది కార్యములను సయితమొనర్చుచున్నాఁడు. కాఁబట్టి జగదంతర్యామిత్వమును, జగత్కారణత్వమునున్ను తెలుపునట్టి యీపై శ్రుతివాక్యము ఇట్టి పుణ్యాతిశయము గలవాఁడును, సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడు నగు జీవుని గుఱించియే యట్లు చెప్పునది కానచ్చును. కావున జీవునికంటె వేఱుగ పరమాత్మ యనఁబడువాఁడు వేఱొక్కఁడు లేడు. ఇట్లుండ; "అస్థూల మనణ్వ హ్రస్వం''(స్థూలముకానిది, సూక్ష్మముకానిది, పొట్టిదికానిది) అనియు నీమొదలగు శ్రుతులట్టి జీవుని స్వరూపమునే నిరూపించుచున్నవనియు, వేదాంతశాస్త్రము గూడ అట్టి జీవోపాసనమునే విధింపుచున్న దనియును జెప్పవచ్చుననిన,

## సిద్ధాంతము.

ఆదిత్యునిలోపలను నేత్రమునందును ఉన్నట్లు తెలియఁబడు పురుషుఁడు జీవునికంటెను వేఱగు పరమాత్మయే, ఏలననిన, "ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదితః" ఇత్యాది శ్రుతివాక్యము ,,అట్టిపురుషుఁడు; సర్వపాపములకు వెలుపల నున్నవాఁడు" అనుటచే జీవునికుండుట కసంభవములైనట్టియు, జీవునికంటె వేఱయినవాఁడగు పరమాత్మయందు మాత్రముండునట్టివియగు అపహతపాప్మత్వాదిగుణము లీపైశ్రుతియందుఁ జేర్కొనఁబడిన పురుషునికిఁ గలవని తెలుపుచున్నది. అపహత పాప్మఁడనఁగా, నపహతకర్మఁ డనుట. అనఁగా నీతఁ డెంతమాత్రము పుణ్యపాపరూపమగు కర్మములకు వశ్యుఁడు గాడనుట గదా! అయితే పుణ్యపాపకర్మానుగుణముఁగ సుఖదుఃఖముల ననుభవించువారలగుటంజేసి, జీవులు కర్మవశ్యు లనఁబడుచున్నారు. కనుక అపహత పాప్మఁడుగా నుండుట అనునది జీవునికంటె వేఱయినవాఁడగు పరమాత్మయొక్క ధర్మమే.

ఇంతియెకాక, ఇట్టి యపహతపాప్మత్వమును బట్టి యుండునవి యగు లోకకామత్వము, లోకేశత్వము,సత్యసంకల్పత్వము, సర్వభూతాంతరాత్మత్వము మొదలగు స్వాభావికగుణములు గూడ పరమాత్మకు మాత్రమే సంభవములు, అట్లే "ఏష ఆత్మా ఽపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాసస్సత్యకామ స్సత్యసంకల్పః" అనియు "ఏష సర్వభూతాన్తరాత్మా ఽపహతపాప్మా దివ్యోదేవ ఏకో నారాయణః" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు ఈపైని పేర్కొనఁబడిన అపహత పాప్మత్వాది గుణములు గలవాఁడు నారాయణుఁ డనంబడు పరమాత్మయే యని తెలుపుచున్నవి. మఱియు, "సోఽకామయత బహుస్స్యాం ప్రజాయేయ"ఇత్యాది శ్రుతివాక్యమునఁ జెప్పఁబడిన ప్రకారము ,సత్యసంకల్పత్వ పూర్వముగ సమస్త చిదచిత్పదార్థములను సృజించుటయు ఏదియు నుపాధిలేకయే నిగ్రహానుగ్రహములకు హేతువగుటయు, నాగాదీంద్రియములచేగాని మవస్సుచేఁ గాని యింతమాత్రమని నిర్ధారణము జేయుట కలవిగాకుండుటయు, మితిలేని యానందమును గలిగియుండుటయు, నీమొదలగు కర్మ సంపాద్యములుగాని స్వాభావికధర్మములు జీవునియం దుండుట యెంతమాత్రము సంభవము కాదు.

,,ఆదిత్యునిలోను నేత్రమునందునునుండు పురుషునికి రూపము గలదని శ్రుతి జెప్పుచున్నది. శరీరసంబంధముగల వానికే రూపము ఉండుట సంభవము.

అట్టి శరీరసంబంధము కర్మవశమునఁ గలుగునది గాన, ఈ పురుషుఁడు కర్మవశ్యుఁడగు జీవుఁడే" యని పూర్వపక్షి వాదించి యుండెను గాని, ఆ వాదము యుక్తము కాదు. ఏలనసిన, ఈ పురుషుఁడు శరీరసంబంధముగలవాఁడైనంత మాత్రమున కర్మవశ్యుఁడును కానేరడు. సత్యసంకల్పుఁడగు పరమాత్మ తన యిచ్ఛవలనఁ గూడ శరీరమును గ్రహింప వచ్చును గదా!

శంక:—అయితే సత్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతియొక్క పరిణామరూపమగు సంఘాతము గదా శరీరమనఁబడుచున్నది. ఇట్టి శరీరముతోఁటి సంబంధమును అపహతపాప్ముఁడును, సత్యసంకల్పుఁడునగు సర్వేశ్వరుఁడు స్వయముగ కోరుట యసంభవము. ఇట్టి శరీర మతని కెవ్విధమైన పురుషార్థమున్ను కాదు గదా? కర్మవశ్యుఁడును, స్వస్వరూపజ్ఞానములేని వాఁడునగు జీవుఁ డట్టిశరీరసంబంధమును కోరకపోయినను, కర్మఫలభోగమునకై యది యతనికి తప్పక కలుగును.

సమాధానము:—కానిమ్ము. సర్వేశ్వరుఁడు సత్వరజస్తమోగుణమయమగు ప్రాకృతశరీరము గలవాఁడైనచో, నీవుపైని చెప్పినప్రకార మట్టి శరీరముతో నతనికి సంబంధముండుట యసంభవమే. అయితే యతని శరీర మట్టిది కాదే? తనకిష్టమైనట్టియు, అప్రాకృతమునగు శరీరమును గదా సర్వేశ్వరుఁడు కలిగి యున్నాఁడు. కాఁబట్టి యిచట దోష మెద్దియును లేదు.

సర్వేశ్వరుఁడు చెడుగుణములే మాత్రమును లేనివాఁడై జ్ఞానానందైకస్వరూపుఁడగుటచే స్వేతరములగు సమస్తపదార్థములకంటె విలక్షణుఁడు.అతనికి స్వాభావికములును, మితిలేని యతిశయముతోఁ గూడియున్నట్టివియును, లెక్కలేనివియునగు కల్యాణగుణములు సయితము గలవు. అట్లే తనకు ప్రియమైనట్టియు, తన కనురూపమైనట్టియు, ఏకరూపమైనట్టియు, అచింత్యాదివ్యాద్భుత నిత్య నిరవద్య నిరతిశయౌజ్వల సౌందర్య సౌగంధ్య సౌకుమార్యలావణ్య యౌవ్వనాద్యనంత గుణములకు నిధియైనట్టియు, స్వాభావికమునగు దివ్యశరీరము సయితము అతనికి గద్దు. అపారకారుణ్యసౌశీల్య వాత్సల్యౌదార్యజలనిధియు, నిరస్తనిఖిలహేయగంధుఁడును, అపహతపాప్ముఁడును, పరమాత్మయనియు, పరబ్రహ్మమనియు పురుషోత్తముఁడనియును వ్యవహరింపఁబడు నారాయణుఁడు ఉపాసకుల ననుగ్రహించుటకై వారివారి జ్ఞానమున కనుగుణమగు శరీరమును తాను స్వయముగ గ్రహించుచుండును. ఈ విషయమును నిరూపించునట్టి ప్రమాణము లేవి యనిన:—

„యతోవా ఇమాని భూతాని జాయన్తే.” ఇత్యాదిశ్రుతివాక్యము „ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను గలుగఁజేయువాఁడు బ్రహ్మమనియు,

"సదేవ సౌమ్య ఇద మగ్ర ఆసీత్" అను శ్రుతివాక్యము "సృష్టికి పూర్వ మీజగత్తంతయు సత్తుగ నుండెను" అనియు, "ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" అను శ్రుతివాక్యము "సృష్టికి పూర్వ మీజగమంతయు పరమాత్మ యొక్కఁడుగానే యుండెను" అనియు, "ఏకోహ వై నారాయణ ఆసీన్న బ్రహ్మా నేశానో నేమే ద్యావా పృథివీ" అను శ్రుతివాక్యము ,,చతుర్ముఖ బ్రహ్మయు, శివుఁడును, పృథివ్యంతరిక్షము లేవియునుండలేదు. నారాయణుఁ డొక్కఁడే యుండెను" అనియును జెప్పుచుండుటచే పరబ్రహ్మము నిఖిల జగదేక కారణుఁడని తెలియవచ్చుచున్నది. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" అను శ్రుతివాక్యము ,,వికారమును పొందనిదియు, జ్ఞాన సంకోచము లేనిదియు, పరిచ్ఛిన్నము కానిదియును పరబ్రహ్మము" అనియు, "విజ్ఞానమానందం బ్రహ్మ" అనియు నీమొదలగు శ్రుతివాక్యములు ,,జ్ఞానస్వరూపుఁడును ఆనందమయుఁడును బ్రహ్మము'' అనియు నిర్వివాదముగ జెప్పుచుండుటచే జగత్కారణుఁడగు పరబ్రహ్మముయొక్క స్వరూప మిట్టిదియని తెలియవచ్చుచున్నది. "నిర్గుణం" అను శ్రుతివాక్యము "బ్రహ్మము హేయగుణములు లేనివాఁడు'' అనియును "నిరఞ్జనం" అను శ్రుతివాక్యము ,,బ్రహ్మము వికారరహితుఁడు" అనియు, "అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపి పాస స్సత్యకామ స్సత్యసంకల్పః" అను శ్రుతివాక్యము ,,పరబ్రహ్మము అపహత పాప్ముఁడనియు, జరామరణములు లేనివాఁడనియు, శోకములేనివాఁడనియు, సత్యకాముఁడనియు, సత్యసంకల్పుఁడు" అనియును "న తస్య కార్యం కరణంచ విద్యతే న తత్సమశ్చా భ్యధికశ్చ దృశ్యతే పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియాచ" అను శ్రుతివాక్యము ,,అట్టి పరబ్రహ్మమునకు ప్రాకృతశరీరమున్ను ఇంద్రియములును లేవు. అతనితో సమానుఁడున్ను అతని కంటె నెక్కువ వాఁడును లేడు అతనికి నానావిధమైనయుత్కృష్టమగు శక్తియు గద్దు. మఱియు అతనికి స్వాభావికములగు, బలమున్ను క్రియయున్ను గలవు" అనియు "త మీశ్వరాణాంపరమం మహేశ్వరం తం దైవతానాం పరమంచ దైవతం స కారణం కరణాధిపాధిపో నచాస్య కశ్చిజ్జనితా నచాధిపః" అను శ్రుతివాక్యము ,,ఆ పరబ్రహ్మము ఈశ్వరులందఱిలో గొప్ప యీశ్వరుఁడు, దేవతలలో నుత్కృష్టమైన దేవత. అతఁడు కారణభూతుఁడు ఇంద్రియాధ్యక్షులగు జీవుల కధిపతి అతనిని బుట్టించువాఁడును అతని కధిపతియు నెవ్వఁడును లేడు" అనియు, ,,సర్వాణి రూపాణి విచింత్య ధీరో నామాని కృత్వాభి వదన్యదాస్తే" అను శ్రుతివాక్యము. ,,సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరుఁడు సమస్తములగు రూపములను ధ్యానించి నామములను గలుగఁజేసి వానితోఁ బిలుచుచున్నాఁడు" అనియు ,,వేదాహమేతం పురుషం మహాంత మాదిత్యవర్ణం తమసః పరస్తాత్"

అను శ్రుతివాక్యము ,,సూక్ష్మప్రకృతియొక్క స్పర్శములేనివాఁడును సూర్యుని వలె ప్రకాశించుచున్నవాఁడును గొప్పవాఁడునగు పురుషుని నేను ఉపాసించుచున్నాను'' అనియు ,,సర్వే నిమేషాజజ్ఞిరే విద్యుతః పురుషాదధి" అను శ్రుతివాక్యము ,,సమస్తకాలములును ఈ మెఱుపువలె ప్రకాశించుచున్న పురుషునివలనఁ బుట్టినవి'' అనియు ఈపైని గనఁబఱచిన విధముగ జెప్పుచు పరబ్రహ్మముకు ప్రకృతిసంబంధములగు హేయగుణములను, ప్రకృతి సంబంధముచే హేయమగు దేహముతో సంబంధమును, అందు మూలముగ కర్మవశ్యుఁడుగా నుండుటనున్ను ప్రతిషేధించి, అనఁగా నవి పరబ్రహ్మముకు లేవని తెలిపి, అతనికి కల్యాణగుణములును, కల్యాణస్వరూపమున్ను కలదని తెలుపుచున్నవి. ఇది యాపరబ్రహ్మముయొక్క స్వాభావికమైన రూపము. పరమకారుణికుఁడగు భగవంతుఁ డిట్టి స్వాభావికమగు రూపమును భక్తుల ననుగ్రహించుటకై వారివారి యుపాసనమున కనుగుణముగ దేవమనుష్యాద్యాకారములను తన యిచ్ఛచేఁగలుగఁ జేయుచున్నాఁడు. కనుకనే ,,అజాయమానో బహుధా విజాయతే" అనుశ్రుతివాక్యము "సర్వేశ్వరుఁడు కర్మవశమునఁ జీవులవలెఁ బుట్టనివాఁడేయైనను, భక్తుల ననుగ్రహించుటకై తనసంకల్పమువలనఁ బుట్టుచున్నాఁడు" అని చెప్పుచున్నది. శ్రీ భగవద్గీతలయందును,

శ్లో॥ ,,అజోపిసన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోపిసన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా॥

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥

భ. గీ. ౪ అ. ౬-౮.

తా॥ ,,కర్మవశమునఁగలుగు పుట్టుకలేనివాఁడనగుచు, నాశములేని స్వభావము గలవాఁడనగుచు, భూతముల కీశ్వరుఁడ నగుచు నాస్వభావము నధిష్ఠించి, నాసంకల్పముచే భక్తులను రక్షించుటకును దుష్టులను శిక్షించుటకును, ప్రతియుగమునను బుట్టుచున్నాను"

ఇట్లు భగవంతుఁడు స్వయముగాఁ జెప్పియున్నారు. ఈపైశ్లోకమున "సాధూనాం" అనుచో ,,ఉపాసకులు"అని యర్థము. అట్టి యుపాసకులను రక్షించుటయే భగవంతుని ముఖ్యోద్దేశము. అందులకై యవతరించి, సందర్భవశమున, దుష్టులనుగూడ శిక్షించుచున్నాఁడు. ఏలననిన, స్వసంకల్పమాత్రముచేతనే శత్రువులు నశించుదురు. "ప్రకృతిం స్వాం" అనుతావున ప్రకృతి యనఁగా స్వభావము. అనఁగా భగవంతుడు జీవులవలె కర్మవశ్యమగు స్వభావముతో జన్మిం

పక, అపహత పాప్మత్వము మొదలగు తన స్వభావముతో నవతరించుచున్నాఁడని తెలియుంగునది. "ఆత్మమాయయా" అనుచో, మాయయనఁగా జ్ఞానము. అనఁగా సత్యసంకల్పము. "మాయా వయునం జ్ఞానం" అను నిఘంటువునందుఁ గూడ "మాయా" శబ్దము జ్ఞానవాచకముగాఁ జెప్పఁబడినది. అనఁగా భగవంతుఁడు తనకు స్వాభావికములగు అపహతపాప్మత్వము మొదలగువానిని విడువకయే తన శుద్ధసత్త్వమయమయిన రూపమును దేవమనుష్యాదులతో సమానమయిన యాకారముగలదానినిగాఁ జేసి, తనసంకల్పముచేత దేవాదిరూపము గలవాఁడై, పుట్టుచున్నాఁడు. శ్రీ విష్ణుపురాణమునందు పరాశరుఁడును,

శ్లో॥ సమస్తాశ్శక్తయశ్చైతా నృప యత్ర ప్రతిష్ఠితాః।
తద్విశ్వరూపవైరూప్యం రూప మన్యద్ధరే ర్మహత్॥

విష్ణు. ౬ అం. ౭ అ. ౭౧ శ్లో.

తా॥ ఓ రాజా! సర్వమునకు కారణభూతుఁడగు ఏ పరబ్రహ్మము యొక్క రూపమునం దీకార్య గతములగు శక్తులన్నియునుగలవో, ఆపరబ్రహ్మముయొక్క రూపము ఈ నానావిధరూపములకంటె విలక్షణమైనదియు, శ్రే అయినదియు, గొప్పదియును.

శ్లో॥ సమస్త శక్తిరూపాణి తత్కరోతి జనేశ్వర।
దేవతిర్యఙ్మనుష్యాఖ్యా చేష్టావంతి స్వలీలయా॥

విష్ణు. ౬ అం. ౭ అ. ౭౧ శ్లో.

తా॥ ఓరాజా! అట్టి పరబ్రహ్మమే దేవమనుష్యాద్యనురూపములగు చేష్టలతోఁ గూడుకొనియున్నట్టియు,సమస్తము లగు శక్తులతోఁ గూడుకొనియున్నట్టి శరీరములను తన లీలచే నొనర్చుచున్నాఁడు.అనగా నట్టి రూపముతో నవతరించుచున్నాఁడు.

శ్లో॥ జగతాముప కారాయ న సా కర్మని మిత్తజా।

భారత.

తా॥ అతని యట్టి పుట్టుక జగదుపకారమునకు గానయినదియేగాని కర్మవశమునఁ గలుగునది కాదు.

ఈస్పైని గనఁబఱిచిన విధముగ జెప్పుచు భగవంతునికి స్వేచ్ఛాకారితమైన జన్మము రూపమున్ను కలవని చెప్పుచున్నాఁడు. మఱియు "న భూతసంఘసంస్థానో దేహోఽస్య పరమాత్మనః" అను శ్రీ మహాభారత వచనము గూడ "అట్టి పరమాత్మయొక్క శరీరము పంచభూతముల సమూహముచే నిర్మింపఁ

బడినది కాదు" అనుచు, భగవదవతారరూపమగు శరీరమునకు ప్రకృతితో సంబంధ మెద్దియునులేదని తెలియఁజేయుచున్నది.

ఈ పైని చెప్పినప్రకారము భగవంతుని కిట్టి యప్రాకృతశరీరమున్నట్లు దెలియవచ్చుచుండుటచే "య ఏషోంతరాదిత్యే హిరణ్మయః" ఇత్యాదిశ్రుతియందు వర్ణింపఁబడిన శరీరధర్మములు పరబ్రహ్మవియే యని యెఱుంగునది. కనుక ఈతావున ఆదిత్యమండలములోను నేత్రములోనును ఉన్నట్లు జెప్పఁబడినవాఁడు జీవుని కంటెవేఱగు పరమాత్మయే.

౨౨॥ సూ॥ భేదవ్యపదేశాచ్చాన్యః

టీ॥ భేదవ్యపదేశాచ్చ = జీవులకంటెను పరమాత్మ వేఱయినవాఁడని శ్రుతులందుఁ జెప్పియున్నందునను, అన్యః=పరమాత్మజీవులకంటెను వేఱయినవాఁడు.

తా॥ ఆదిత్యాదిజీవులకంటెను పరమాత్మ వేఱయినవాఁడని శ్రుతులయందుఁ జెప్పియున్నందునను, పరమాత్మజీవులకంటెను వేఱయినవాఁడు.

శ్రీ॥ భా॥ ఆదిత్యుఁడు మొదలగు జీవులకంటె పరమాత్మ భిన్నుఁడని శ్రుతులు జెప్పుచున్నవి. ఏలననిన, శ్రుతులు,,య ఆదిత్యేతిష్ఠ న్నాదిత్యాద న్తరో యమాదిత్యో న వేద యస్యాదిత్య శ్శరీరం య ఆదిత్యమ న్తరో యమయతి' ,,ఏ పరమాత్మ ఆదిత్యునియందున్న వాఁడై,ఆదిత్యునిలోపలనుండి, ఆదిత్యునిచేఁ దెలిసికొనఁబడక, ఆదిత్యుఁడు శరీరముగాఁ గలవాఁడై, ఆదిత్యునిలోపలనుండి, ఆదిత్యుని నియమించుచున్నాఁడో"అనియు,,య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽంతరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మానమంతరోయమయతి" (ఎవఁడు ఆత్మయందుండి,ఆత్మలోపలనున్నవాఁడై,ఆత్మచేఁ దెలియఁబడక,ఆత్మను శరీరముగాఁ గలవాఁడై, ఆత్మను లోపలనుండి నియమించుచున్నాఁడో"అనియు ,,యోఽక్షరమంతరే సంచరన్య స్యాక్షరం శరీరం యమక్షరం న వేద"(ఏ పరమాత్మ అక్షరునిలోపల సంచరించుచుండి, అక్షరుని శరీరముగా గలిగియుండి, అక్షరునిచేఁ దెలిసికొనఁబడక యున్నాడో" అనియు, ,,యోమృత్యుమ న్తరే సంచరన్ యస్య మృత్యుశ్శరీరం యం మృత్యుర్న వేద ఏష సర్వభూతాంతరాత్మా ఽపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" (ఎవఁడు మృత్యువులో సంచరించుచు, మృత్యువును శరీరముగాఁగలిగి, మృత్యువుచేఁ దెలియఁబడక యుండువాఁడో, వాఁడు, సర్వాంతరాత్మయు అపహతపాప్ముఁడును, దివ్యుఁడును, భగవంతుడును,ఒక్కఁడు నగు నారాయణుఁడు) అనుచు నట్టి యపహత

పాపుఁడగు పరమాత్మకు సమస్తజీవులును శరీరమనియు వానిలోనంతటను, పర మాత్మ అంతరాత్మగా నుండువాఁడనియు అనఁగా నీతడు శరీరియనియును, దెలియఁబఱచుచున్నవి గదా! ఈ హేతువువలన పరమాత్మ హిరణ్యగర్భుఁడు మొదలుగాఁగల సమస్తజీవులకంఱెను వేఱయినవాఁడని సిద్ధమగుచున్నది.

—అంతరధికరణము ముగిసెను.—

---

## ఆ కా శా ధి క ర ణ ము

అవతారిక:—„యతోవా ఇమాని భూతాని జాయన్తే” (తై. భృ. ౧ అను) ఇత్యాది శ్రుతులు బ్రహ్మము జగత్కారణమని దెలియఁజేసి, ఆబ్రహ్మ మెట్టిది యని యాకాంక్షించుకొని, „సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్” (ఇది యంతయు సృష్టికి పూర్వము సత్తుగానుండెను” అనియు, „తత్తేజోఽసృజత „ఆసత్తు తేజస్సును సృజించెను” అనియు, „ఆత్మావా ఇద మగ్రఆసీత్” (ఈ పరిదృశ్యమానమగు జగత్తు సృష్టికి పూర్వము ఆత్మగ నుండెను) అనియు, „సఇమాన్లోకానసృజత” (ఆపరమాత్మ యీలోకములను సృజించెను)అనియు „తస్మాద్వా ఎతస్మాదాత్మన ఆకాశస్సంభూతః” (ఈయాత్మనుండియే యాకా శము పుట్టెను) అనియు నీమొదలగు వాక్యములచే నట్టి జగత్కారణమగు బ్రహ్మ మిట్టిదియను విషయమును సామాన్యముగ నిర్దేశించి, తరువాత యీ బ్రహ్మము ఈక్షణవిశేషమును, ఆనందవిశేషమును గలదియగుటంజేసి యది సాంఖ్యులచే జగత్కారణముగ జెప్పఁబడు అచేతనమగు ప్రధానమున కంఱెను కర్మవశమున నెల్లప్పుడును దుఃఖభాగియగు జీవునికంఱెనున్ను వేఱయినదని యింతకు పూర్వము ప్రతిపాదింపఁబడియె. ఇప్పుడు మఱికొన్ని శ్రుతులయందు ఆ కాశాదిశబ్దములచే నిర్దేశింపఁబడి జగత్కారణముగను జగదైశ్వర్యము గలది గను జెప్పబడినదియును, ఆకాశాదినామములచే పిలువఁబడునదియు, ప్రసిద్ధము లగు చిదచిత్పదార్థములకంఱె వేఱయినదియును, ఇంతకుపూర్వము లక్షణ ముతో జెప్పఁబడిన బ్రహ్మమే యని „ఆకాశస్తల్లింగాత్” అను సూత్రము మొదలుకొని పాదాంతము వరకును ప్రతిపాదించుచున్నారు.

### ౨౩. సూ॥ ఆ కా శ స్త ల్లిం గా త్.

టీ॥ ఆకాశః=ఛాందోగ్యమున జగదాధారముగాఁ బఠింపఁబడిన ఆకా శము, పరబ్రహ్మమే. ఏలననఁగా, తల్లింగాత్ = పరబ్రహ్మముయొక్క ధర్మములు ఆశాపునఁ జేర్కొనఁబడుటవలన.

తా॥ ఛాందోగ్యమున ఆకాశశబ్దముచేఁ జగదాధారముగాఁ జెప్పఁబడినట్టిది పరబ్రహ్మమే. ఏలననఁగా, ఆకాశ మచట పరబ్రహ్మముయొక్క ధర్మములుగలదిగాఁ జెప్పఁబడియెను గదా!

శ్రీ॥భా॥ ఛందోగులు,,అస్య లోకస్య కాగతిరితి ఆకాశ ఇతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశా దేవ సముత్పద్యన్తే ఆకాశం ప్రత్యస్తం యన్తి. ఆకాశోహ్యే వైభ్యో జ్యాయా నాకాశః పరాయణం"(ఛా. ౧ ప్ర.౯.ఖ. ౧వా) అనువాక్యమున "ఈలోకమున కెద్ది యాధారమని ప్రశ్నించి యది యాకాశము ఈ సమస్త భూతములును ఆకాశమునుండియే యుత్పన్నములయి ఆకాశమునందే సంయుక్తము లగుచున్నవి. ఈ భూతములన్నింటికంటెను ఆకాశమే యుత్కృష్టమైనది. గనుక నదియే సర్వాధారము" అని యుత్తరమును పఠించుచున్నారు. ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈ పై ఛాందోగ్యవాక్యమునందలి"ఆకాశ"శబ్దము పంచభూతములలో నొక్కటిగ ప్రసిద్ధమగు భూతాకాశమును తెలుపునదియా? కాక, జగత్కారణత్వాది లక్షణయుక్తమగు పరబ్రహ్మమును తెలుపునదియా!

## పూర్వపక్షము.

ఇచట ఆకాశశబ్దము భూతాకాశమును తెలుపునది యనుటయుక్తము ఏలననిన:—శబ్దమునుండియే తెలిసికొనవలసినదాని విషయమై,యట్టిశబ్దము ఏ పదార్థమును వ్యుత్పత్తిద్వారా బుద్ధికి స్ఫురింపునట్లు జేయుచున్నదో,ఆపదార్థమే ఆశబ్దముచేఁ దెలుపఁబడునది యను న్యాయమును బట్టి యిచట ఆకాశశబ్దము భూతాకాశమును తెలుపునది యనుట యుక్తము. కాఁబట్టి భూతాకాశమే సమస్తచరాచరవస్తు సమూహారూప మగు నీ జగత్తునకు కారణ మని యీ పై శ్రుతి తెలుపుచున్నది. కనుక నిట్టి భూతాకాశమే బ్రహ్మము.

శంక:—సంకల్పపూర్వకముగ సృష్టి నొనర్చెనని శ్రుతులు జెప్పుచుండుటచే జగత్కారణమగు బ్రహ్మము అచేతనపదార్థమునకంటెనున్ను జీవుని కంటెనున్ను వేఱయినదని యింతకు పూర్వము ప్రతిపాదింపఁబడియెను గదా! ఇట్లుండ, అచేతనమగు భూతాకాశమే జగత్కారణమగు బ్రహ్మమని యెట్లు చెప్పఁదగును?

సమాధానము:—ఇంతకుపూర్వ మట్లు చెప్పినమాట వాస్తవమే. అయినను,అదియంతయును అయుక్తము. ఏలననిన:—శ్రుతులు ,,యతోవా ఇమాని భూతాని జాయంతే" ఇత్యాదివాక్యమున, ఈ జగత్తుయొక్క జన్మస్థితిలయము

లకు కారణభూత మయినది బ్రహ్మమని యిట్లు సామాన్యముగ బ్రహ్మమును గుఱించి నిర్దేశించి, యనంతర మట్టి బ్రహ్మ మెద్దియని యాకాంక్షించుకొని, ,,సర్వాణి హవా ఇమాని భూతాన్యాకాశా దేవ సముత్పద్యన్తే'' ఇత్యాది వాక్యమున అట్లు జగత్తుయొక్క జన్మస్థితిలయంబులకు హేతుభూతమయినది యాకాశమని యిట్లు విశేషముగాఁ దెలియఁజేయుచున్నవి. ఇట్లు జగజ్జన్మాదులకుఁ గారణమైనది యాకాశమే యని నిశ్చయింపఁబడుచుండ, సామాన్యనిర్దేశముచే బ్రహ్మమును దెలియజేయునట్టి ,,సదేవసౌమ్య ఇదమగ్ర ఆసీత్'' ఇత్యాది శ్రుతి వాక్యములయందలి సచ్ఛబ్దముః మొదలగునని సామాన్యముగా బ్రహ్మమును దెలియజేయునవియై, విశేషనిర్దేశముచే ఈ యాకాశమును తెలుపుచున్నవి. "ఆత్మావా ఇదమేక ఏవాగ్రఆసీత్'' అను శ్రుతియందలి "ఆత్మ" శబ్దముగూడ ఈయాకాశమునే జగత్కారణముగ జెప్పుచున్నది. ఆత్మ శబ్దము చేతనపదార్థమును బోధింపునది గదా! యని శంకింపఁ బనిలేదు. ఏలననిన,ఇది చేతనపదార్థమునే బోధింపునెడి నియమములేదు. "మృదాత్మకో ఘటః'' అనుతావున, నిది యచేతనపదార్థమునుగూడ బోధించుచున్నవి గదా! ఇంతియే కాక ,,ఆప్నోతీ త్యాత్మా'' అను ఆత్మ శబ్దవ్యుత్పత్తినిబట్టి విచారించితిమేని,వ్యాపించునట్టి పదార్థము గదా ఆత్మ యనఁబడుచున్నట్లు తెలియుచున్నది. ఈ హేతువునుబట్టి గూడ ఆత్మశబ్దము ఆకాశవాచకమే యని స్పష్ట మగుచున్నది. ఈపైని గనఁబఱచిన హేతువులవలన ఆకాశమే జగత్కారణభూతమగు బ్రహ్మమని నిశ్చితమగుటచే సృష్టివాక్యమునందుఁ జెప్పబడిన ఈక్షణాదులు సందర్భానుసారము గౌణములని యెఱుంగునది. సదాదిసాధారణ శబ్దములచే మాత్రమే జగత్కారణము జెప్పఁబడుచున్న పక్షమునఁ గదా, అట్టి జగత్కారణము సంకల్పాదులతోఁ గూడుకొనినదని శ్రుతులు జెప్పుచున్నందున నది చేతనపదార్థ మని నిర్ణయింపవచ్చును. అయితే అట్టి శ్రుతులు జగత్కారణమును ఆకాశశబ్దముచేతను గూడ జెప్పుచున్నవి. కాఁబట్టి దానిని ఈక్షణాదిశబ్దముల ముఖ్యార్థమునుబట్టి నిర్ణయించుట కవకాశము లేదు.

శంక:—కానిమ్ము. "అత్మన ఆకాశస్సంభూతః'' అను శ్రుతివాక్యము "పరమాత్మనుండి ఆకాశము పుట్టుచున్నది"అని తెలుపుచున్నదే? ఇట్లు ఒక దానినుండిపుట్టునది యగు ఆకాశము జగత్కారణమెట్లు కాగలదు?

సమాధానము:—ఆకాశవాయ్వాది సమస్తపదార్థములకును సూక్ష్మావస్థయనియు, స్థూలావస్థయనియును రెండు అవస్థలు కలవు. అందు సూక్ష్మావస్థాయుక్తమగు నాకాశము కారణము. స్థూలావస్థాయుక్తమగు నాకాశము కార్యము. ఇట్టి కార్యకారణభావమునే ''ఆత్మన ఆకాశః సంభూతః'' అను

శ్రుతివాక్యము తెలుపుచున్నది. అనఁగా నీయాకాశము సూక్ష్మమగు తన నుండియే స్థూలమగు తాను పుట్టుచున్నదనుట. ఏలననిన, ,,సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే" ఇత్యాది శ్రుతివాక్యము ,,ఈ సర్వభూతములు నాకాశమునుండియే పుట్టుచున్నవి" అనియు నివ్విధముగ జెప్పుచు ఆకాశము సమస్తభూతముల జన్మస్థితిలయములకు హేతుభూతమైనదని తెలియఁజేయుటంజేసి,యిట్లు సర్వకారణముగ జెప్పఁబడిన ఆకాశమే బ్రహ్మానుని నిశ్చయింపఁబడియె. ఇట్లు ప్రసిద్ధమగు ఆకాశమునకంటెను బ్రహ్మము వేఱుగాని దగుటంజేసి ,,యదేష ఆకాశ ఆనన్దో న స్యాత్" ,,ఆకాశో హవై నామరూపయో ర్నిర్వహితా" ఇత్యాదివాక్యముల యందలి యాకాశశబ్దము గూడ ప్రసిద్ధమగు భూతాకాశపరమే యగుట ఎక్కువ యుపపన్నము. ఈహేతువులనుబట్టి ప్రసిద్ధమగు భూతాకాశమునకంటె బ్రహ్మము వేఱుకాదని సిద్ధమగుచున్న దనిన,

## సిద్ధాంతము

ఇట్లు చెప్పుట యుక్తము కాదు. ఛందోగుల శ్రుతియందు ఆకాశమని పిలుపఁబడునది అచేతనమగు ప్రసిద్ధాకాశమునకంటె వేఱయినట్టియు, జగజ్జన్మస్థిత్యాదులకుఁ గారణభూతమైనట్టి పరమాత్మయే. ఏలననిన, పరమాత్మ యొక్క లక్షణములగు నిఖిల జగదేకకారణత్వము, సర్వపదార్థములకంటెను గొప్పవాడుగ నుండుటయు, పరాయణత్వము ఈ మొదలగునవి అట్టి యాకాశమున కుండునవిగాఁ జెప్పఁబడుచున్నవి. లోకప్రసిద్ధమగు భూతాకాశమే ఈపై శ్రుతియందాకాశశబ్దముచే వివక్షితమగు పక్షమున, నది యచేతనమగుటంజేసి, యీ సమస్తజగత్తునకును కారణమగుట యసంభవము,ఏలననిన, చేతనాచేతనవిశిష్టమగు నీజగత్తునందలి చేతనపదార్థముల కచేతనమగు భూతాకాశము కారణమగుట యసంభవము గదా !

పరాయణుఁ డనఁగా సమస్తచేతనులకును పరమప్రాప్యుఁడగుట గదా ! ఇట్లు సర్వచేతనులకును పరమప్రాప్యముగా నుండుట యచేతనమును, హేయమును, సకల పురుషార్థ విరోధియు నగు భూతాకాశమున కెట్లు సంభవము ?

సమస్తపదార్థములకంటెను గొప్పవాఁడుగా నుండుట పరమాత్మకు స్వాభావికమైనది. అది యొక యుపాధివలనఁ గలిగినది కాదు.అనఁగా నీతఁడు సమస్తకల్యాణ గుణములు గలవాఁడగుటంజేసి స్వేతర సమస్తపదార్థములకంటె నెక్కువ యుత్కర్ష గలవాఁడు. ఇట్లుండుట యచేతన మగు భూతాకాశమున కెట్లు సంభవము ?

“ శ్రుతులు సామాన్యనిర్దేశముచే జగత్కారణమును ప్రతిపాదింపఁగా, అట్టి జగత్కారణ మగు పదార్థ మెద్దియని విచారణ రాఁగా,అది యాకాశమని విశేషనిర్దేశముచే నీశ్రుతియందుఁ జెప్పఁబడియెను. కాఁబట్టి భూతాకాశమే జగత్కారణము. ఇందువలన జగత్కారణ ప్రతిపాదకములగు శ్రుతివాక్యములన్నియు నీ యభిప్రాయమున కనుగుణము గానే యర్థము చేయఁదగినవి”అని యిట్లు పూర్వపక్షి వాదించియుండెను గాని,యీ వాదము యుక్తమైనది కాదు. ఏలననిన, ,,సర్వాణి హవా ఇమాని భూతా న్యాకాశాదేవ సముత్పద్యన్తే” అను శ్రుతివాక్యము, ఆకాశమునుండి సమస్తభూతములును ఉత్పన్నములగుచున్నవనుచు జగత్కారణమగు ఆకాశము నొక ప్రసిద్ధవస్తువునుగాఁ బేర్కొనుచున్నది. ఇట్లు దీనినొక ప్రసిద్ధవస్తువునుగాఁ బేర్కొనుటచే దీనికి ప్రమాణాంతరములయం దొక ప్రసిద్ధి గలదని తెలియవచ్చుచున్నది. అట్టి ప్రమాణాంతరము లేవి యనఁగా, నవి ,,సదేవసోమ్య ఇద మగ్ర ఆసీత్” ఇత్యాది జగత్కారణ ప్రతిపాదక శ్రుతివాక్యములే కావలయును. ఆవాక్యములే, ఈపైని చెప్పిన ప్రకారము, బ్రహ్మమును జగత్కారణమునుగాఁ బ్రతిపాదించుచున్నవి. అట్లు ఈశ్రుతులచే జగత్కారణముగ ప్రతిపాదింపఁబడిన బ్రహ్మమే ,,అస్యలోకస్య కాగతిరితి ఆకాశ ఇతి హోవాచ” ఇత్యాది శ్రుతియం దాకాశశబ్దముచే నొక ప్రసిద్ధవస్తువుగా నిర్దేశింపఁబడుచున్నది. పరబ్రహ్మమును ఆకాశశబ్దముచే నిర్దేశించుటయును సంభవమే. ఏలననిన, ఆకాశ మనఁగా, ,,ఆకాశతే=తనకు తాను ప్రకాశించునది” అనియు ,,ఆకాశయతి = సర్వమును ప్రకాశింపఁజేయునది” అనియు నిట్టి శబ్దవ్యుత్పత్తినిబట్టి స్వయముగాఁ ప్రకాశించునదియును ఇతర వస్తువులను బ్రకాశింపఁజేయునది యని గదా యర్థము. పరబ్రహ్మము సర్వమును ప్రకాశింపఁజేయునది యగుటంజేసి శ్రుతియం దాకాశశబ్దముచే వ్యవహరింపఁబడుచున్నది.

ఇంతియెకాక, ఈయాకాశశబ్దము విశేషనిర్దేశముచే జగత్కారణమును తెలుపునదియే యయినను, అది చేతనాచేతన విశిష్టమగు నీజగత్తునందలి చేతన పదార్థములకు కారణము గానేరనట్టి యచేతనవస్తువును అనఁగా భూతాకాశమును దెలియఁజేయుచున్న దనుచు,“తదైక్షత బహు స్యామ్ ప్రజాయేయ” అనియు, “సోఽకామయత బహు స్యామ్ ప్రజాయేయ” అనియు, నీమొదలగు శ్రుతివాక్యములు సర్వజ్ఞత్వ సత్యసంకల్పత్వాది గుణవిశిష్టమగు నొక యపూర్వ పదార్థమును జగత్కారణముగ ప్రతిపాదింపఁగా, నట్టి శ్రుత్యర్థములకు వ్యతిరిక్తముగా జెప్పుట ప్రామాణికము గానేరదు. ఇట్లనేక శ్రుతులు అపూర్వానంతవిశేషణ విశిష్టమగు నొక యపూర్వపదార్థము జగత్కారణమని యేకకంఠముగాఁ బ్రతిపాదించుచుండ, అట్టి శ్రుతులచే ప్రతిపాదింపఁబడిన దానిని యనువదించునది

యగు ఈ శ్రుతి యీపై శ్రుతుల కన్నిటికిని విరుద్ధమైన యొక యర్థమును బోధించునదై వాటి యర్థమును వేఱుగాఁ జేయుటకు సమర్థము గాదు.

"మృదాత్మకో ఘటః" ఇత్యాది స్థలములయందు ఆత్మశబ్దము స్వరూప వాచకముగాను ప్రయోగింపఁబడుటంజేసి యది చేతనవాచకమాత్రమే యనుట యసంభవమని పూర్వపక్షి వాదించియుండెను. అయితే ఆత్మశబ్దము అచేతన వాచకముగా నెచటనయిన నొకచోట ప్రయోగింపఁబడినను,తఱచుగ అది శరీర వ్యతిరిక్తమగు పదార్థమును అనఁగా చేతనుఁడగు నాత్మను దెలియజేయునది గానే ప్రయోగింపఁబడుచున్నది. కావున "ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్" అనియు, "ఆత్మన ఆకాశ స్సంభూతః" అనియు నీమొదలగు శ్రుతివాక్యములయందు ఆత్మన్ శబ్దము శరీరేతరమగు చేతనపదార్థమును దెలియఁజేయుచున్నది. "గో"శబ్దము అనేకార్థములను తెలుపునదైనను, "సాస్నాలాంగూలాది యుక్తమగు పిండవ్యక్తిని" అనఁగా గోవును దెలియజేయుటయే దాని స్వకీయమైన యర్థము. అయితే అచ్చటచ్చట సందర్భ విశేషమునుబట్టి గోవ్యతిరిక్త పదార్థములఁ దెలియఁజేయుటకు గాను గూడ అది ప్రయోగింపఁబడవచ్చును గదా! అట్లే ప్రకృతమునను, ఆత్మశబ్దము స్వాభావికముగాఁ దనచేఁ దెలుపఁబడునదియు, శరీరవ్యతిరిక్తము నగు నాత్మను తెలుపునదియే. "స ఈక్షతలోకాన్ను సృజా" అనియు, "సోఽకామయత బహుస్యాం ప్రజాయాయ" అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు జగత్కారణవస్తువు సార్వజ్ఞ్య సత్యసంకల్పత్వాది గుణములతోఁ గూడుకొనిన దనిజెప్పుచు శ్రుతులయందు జగత్కారణముగ జెప్పఁబడిన ఈయాత్మ చేతనుఁ డని అనఁగా నందుండు ఆత్మశబ్దము చేతన వాచకమని స్థిరపఱచుచున్నవి. ఇట్లు వాక్యశేషములచే అసాధారణానేకా పూర్వవిశిష్టముగ నిశ్చయింపఁబడినట్టిదియు, నిఖిలజగదేక కారణమైనట్టిదియు, "సదేవసౌమ్యే" త్యాది ప్రమాణాంతర సిద్ధమగు పరబ్రహ్మమే ఆకాశ శబ్దముచే నొక ప్రసిద్ధవస్తువుగా, "సర్వాణిహవా ఇమాని భూతాని" ఇత్యాది వాక్యములచే నిర్దేశింపఁబడుచున్న దని సిద్ధమగుచున్నవి.

—ఆకాశాధికరణము ముగిసెను.—

## ప్రా ణా ధి క ర ణ ము

### ౨౪॥ సూ॥ అ త ఏ వ ప్రా ణః.

టీ॥ అతఏవ = పూర్వసూత్రమున నుదహరింపఁబడిన హేతువు వలననే ప్రాణః=ప్రాణశబ్దవాచ్యుఁడు (సర్వేశ్వరుఁడు.)

తా॥ పూర్వసూత్రమునఁ గానఁబఱచిన బ్రహ్మలింగ మిచటను గూడ గన్పట్టుచున్నందున ప్రాణశబ్ద వాచ్యుఁడు సర్వేశ్వరుఁడు.

శ్రీ॥ భా॥ ఛందోగులు "ప్రస్తోతర్యా దేవతా ప్రస్తావ మన్వాయత్తా" (ఛా.ఉప. ౧ ఖ.౧౧ వా) అను వాక్యమున ప్రస్తావముతో సంబంధించిన దేవతను గుఱించి ప్రస్తాపించి, అనంతరము, "కతమా సా దేవతేతి ప్రాణ ఇతి హోవాచ సర్వాణి హ వా ఇమాని భూతాని ప్రాణమే వాభిసంవిశన్తి ప్రాణమభ్యుజ్జిహతే సైషా దేవతా ప్రస్తావమన్వాయత్తా తాంచే దవిద్వాన్ ప్రాస్తోష్యో మూర్ధా తే వ్యపతిష్యత్"అను వాక్యమున "అట్టిదేవత యెద్దియనఁగా నది ప్రాణమనియు ఈ ప్రసిద్ధములయిన సర్వభూతములు ప్రళయసమయమున ప్రాణములోఁ బ్రవేశింపుచు, సృష్టిసమయమున ప్రాణములోనుండి బయలువెడలుచున్నవి గాన, నిట్లు సర్వభూతముల ప్రవేశోత్క్రమణముల కాధారమగు ప్రాణమే ప్రస్తావ భక్తియందు ఉపాస్యమగు దేవతయనియు ఇట్టి ప్రస్తావ దేవతను గుఱించిన జ్ఞానములేక ప్రస్తావముఁ జేసినట్లయితే, నీ శిరస్సు పడిపోవును"అని యిట్లు ప్రస్తోతతో చాక్రాయణఋషి పలికినట్లు పఠించుచున్నారు. ఇందొక సంశయము గలుగుచున్నది.

### సం శ య ము.

ఇచట "ప్రాణ"శబ్దము పంచవృత్త్యాత్మకమగు ప్రాణవాయువును తెలుపునదియా? కాక, పరమాత్మను తెలుపునదియా ?

### ని ర్ణ య ము

పూర్వాధికరణమునందలి యాకాశశబ్దము భూతాకాశమును తెలుపునది కాక, పరమాత్మను తెలుపునట్లు యగుచందంబున, నిచటను ప్రాణశబ్దమున్ను పంచవృత్త్యాత్మకమగు ప్రాణవాయువును తెలుపునది కాక, తద్వ్యతిరిక్తుఁడగు పరమాత్మను దెలియఁజేయునది. కనుకనే శ్రుతులును పరమాత్మకుమాత్రముండుకున్న జగత్ప్రవేశము జగన్నిష్క్రమణము మొదలగు ధర్మము లీప్రాణమునకుఁ గలవని చెప్పుచు దీని నొకప్రసిద్ధ వస్తువుగా నిర్దేశింపుచున్నవి.

శంక:—సమస్తభూతముల యొక్కయును స్థితిగతులు పంచవృత్త్యాత్మక మగు ప్రాణవాయువున కధీనములు గాన,నట్టి లోకప్రసిద్ధ మగు ప్రాణవాయువును గూడ జగత్కారణమునుగాఁ జెప్పవచ్చునే?

పరిహారము:—"సర్వాణి హవా ఇమాని భూతాని ప్రాణమేవాభి సంవిశన్తి ప్రాణమభ్యుజ్జిహతే" అను శ్రుతివాక్యము "ప్రళయకాలమున సమస్తభూతము లట్టి ప్రాణమునందు ప్రవేశించుచున్నవి. సృష్టిసమయమున నవి యట్టి ప్రాణమునుండి బయలువెడలుచున్నవి" అని చెప్పుచున్నది. అయితే శిలాకాష్ఠాది పదార్థములును, చేతనస్వరూపమున్న పంచవృత్త్యాత్మకమగు ప్రాణవాయువునందు ప్రవేశించునవిగాను గాని, దానినుండి నిష్క్రమించునవిగాను గాని గానఁబడుచుండలేదు. కావున నిచట ప్రాణశబ్దముచే వివక్షిత మయినది ప్రాణవాయువనుట యుక్తముకాదు. కాఁబట్టి "ప్రాణయతి సర్వాణి భూతాని" అనగా సమస్తభూతములయొక్క ప్రాణనవ్యాపారమును జేయించునది" అను శబ్దవ్యుత్పత్తినిబట్టి యిచట "ప్రాణ" శబ్దము పరమాత్మపరము. ఈ హేతువులనుబట్టి యాకాశప్రాణాది శబ్దవాచ్యము లోకప్రసిద్ధములగు భూతాకాశప్రాణవాయ్వాదులకంటె వేఱయినట్టియు, నిఖిల జగదేకకారణత్వము, అపహతపాప్మత్వము, సార్వజ్ఞ్యము, సత్యసంకల్పము మొదలుగాఁగల అనంతకల్యాణగుణములతోఁ గూడుకొనిన పరబ్రహ్మమే యని సిద్ధ మగుచున్నది.

ప్రాణాధికరణము ముగిసెను.

---

## జ్యోతిరధికరణము

అవతారిక:—జగత్కారణత్వయుక్తమగు నెద్దియయిన నొక యుత్కృష్టగుణముతోఁ గూడుకొనినదియు, బ్రహ్మేతర పదార్థవాచకములుగ ప్రసిద్ధములగు జ్యోతిరింద్రాదిశబ్దములచే నచ్చటచ్చట శ్రుతులయందు బోధింపఁబడునదియును పరబ్రహ్మమే యని యీయధికరణమునఁ దెలుపుచున్నారు.

### ౨౫॥ సూ॥ జ్యోతిశ్చరణాభిధానాత్

టీ॥ జ్యోతిః=జ్యోతిశ్శబ్దవాచ్యుఁడు సర్వేశ్వరుఁడు, ఏలననఁగా, చరణాభిధానాత్ సర్వభూతము లట్టివస్తువునకు పాదముగా జెప్పియుండుటవలన.

జ్యోతిస్సనంబడు వస్తువునకు సర్వభూతములు పాదముగాఁ జెప్పియుండుటవలన జ్యోతిశ్శబ్దవాచ్యుఁడు పరబ్రహ్మమే.

శ్రీ॥ భా॥ ఛందోగులు ,,అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే విశ్వతః పృష్ఠేషు సర్వతఃపృష్ఠేష్వనుత్తమేషూత్తమేషు లోకేష్విదం వావతద్యదిదమస్మి న్నంతః పురుషేజ్యోతిః'' (ఛా. 3 ప్ర. ౧3 ఖ. ౭ వా) అనువాక్యమున ఈ ద్యులోకమునకంటె మీఁదుగా నేజ్యోతిస్సు ప్రకాశింపుచున్నదో, యేజ్యోతి స్సు ప్రాణివర్గముమీఁదను భూలోకముమీఁదను అంతకంటె నుత్కృష్టములగు సమస్తములోకములమీఁదను ప్రకాశింపుచున్నదో, ఆ జ్యోతిస్సే పురుషశరీర మునందును ప్రకాశింపుచున్నది'' అని పఠించుచున్నారు. ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈపైవాక్యమున జ్యోతిశ్శబ్దముచే నిర్దేశింపఁబడినదియు,నిరతిశయ దీప్తి యుక్తమునగు పదార్థము లోకప్రసిద్ధమగు నాదిత్యాది జ్యోతిస్సే యయి, అది యిచట జగత్కారణభూతమగు బ్రహ్మముగాఁ జెప్పఁబడుచున్నదా? కాక, సమస్తచిదచిత్పదార్థములకంటె వేఱయినవాఁడును, పరమకారణభూతుఁడును, మితములేని ప్రకాశముగలవాఁడును, సర్వజ్ఞుఁడును, సత్యసంకల్పుఁడునగు పురు షోత్తముఁడే యీ పైశ్రుతియందు "జ్యోతి" శ్శబ్దముచేఁ జెప్పఁబడుచున్నాఁడా?

## పూర్వపక్షము

ఈపైశ్రుతియందు జ్యోతిశ్శబ్దముచే నిర్దేశింపఁబడినది లోకప్రసిద్ధమగు నాదిత్యాది జ్యోతిస్సే యనుట యుక్తము. ఏలననిన, అకాశప్రాణాదులవలె నిచట జ్యోతిస్సున్ను ఒక ప్రసిద్ధపదార్థముగా నుపదేశింపఁబడినను, ఆకాశ ప్రాణాదులను ప్రతిపాదించు వాక్యములందుం దట్టి యాకాశాదిశబ్దములచే నిర్దిష్ట మయినది పరబ్రహ్మమే యని తెలుపునట్టి కొన్నిచిహ్నములు చెప్పఁబడినవి. అట్లు ఈవాక్యమునం దట్టి చిహ్నము లేవియును జెప్పఁబడియుండలేదు. పరమ పురుష చిహ్నము లేవియును జెప్పఁబడకున్నందున, నిచట జ్యోతిశ్శబ్దముచే నిర్దే శింపఁబడువాఁడు పరమపురుషుఁడే యని యెట్లు గుర్తింప శక్యము? ఇంతియె కాక,ఈ జ్యోతిస్సు కుక్షిస్థమగు జాఠరాగ్నితో నొక్కటిగ శ్రుతియందుఁ జెప్పఁ బడుచున్నది. ఈహేతువులను బట్టి లోకప్రసిద్ధమగు నాదిత్యాదిజ్యోతిస్సే జగత్కారణత్వము మూలముగ నిరతిశయదీప్తియుక్తమగుటంజేసి జగత్కారణ భూతమగు పరబ్రహ్మముగ ఈపైశ్రుతియందు జెప్పఁబడుచున్నట్లు దెలియవచ్చు చున్నదనిన,

## సిద్ధాంతము

ఇట్లు చెప్పుట యుక్తము గాదు.ఈ పైశ్రుతియందు ద్యులోకసంబంధిగాఁ జెప్పఁబడిన జ్యోతిస్సు పరమపురుషుఁడే. ఏలననిన,"పాదోఽస్య విశ్వా భూతాని

త్రిపాదస్యా మృతం దివి" అను శ్రుతివాక్యము సమస్తభూతములును ఈ ద్యులోక సంబంధియగు పురుషునియొక్క పాదమని తెలుపుచున్నది గదా! "యదతః పరో దివో జ్యోతిః" ఇత్యాది శ్రుతివాక్యమునందు పరమపురుషునియొక్క యసాధారణ లక్షణము లేవియును జెప్పఁబడకపోయినను, "పాదోఽస్య విశ్వాభూతాని" ఇత్యాగి పూర్వవాక్యమునందు పరమపురుషుఁడు ద్యులోకసంబంధిగ జెప్పఁబడుటచే నిచటగూడ ద్యులోకసంబంధిగ జెప్పఁబడిన తేజస్సు పూర్వవాక్యమునందుఁ జెప్పఁబడిన పరమపురుషుఁడేయని స్మరించుట కవకాశము గద్దు. ఇట్టి జ్యోతిస్సునకు జాఠరాగ్నితోనైక్యమును జెప్పుట యొక దోషము గాదు. ఏల ననిన, అచట ఫలమునకై అట్టి జ్యోతిస్సును జాఠరాగ్న్యాత్మకమునుగా ననుసంధింపవలయునని శ్రుతి విధింపుచున్నది. ఏలననిన, శ్రీ భగవద్గీతలయందు "అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః" అను శ్లోకమున "నేనే వైశ్వానరమనంబడు జాఠరాగ్నినయి ప్రాణులయొక్క దేహము నాశ్రయించి యున్నాఁడ"అనుచు జాఠరాగ్ని భగవదాత్మకమని భగవంతుఁడు స్వయముగ నేయుపదేశించి యున్నాఁడు.

౨౬॥ సూ॥ ఛన్దోభిధానాన్నేతిచేన్నతథాచేతోఽర్పణనిగమాత్తథాహి దర్శనం.

టీ॥ ఛన్దోభిధాత్=జ్యోతిశ్శబ్దము గాయత్రియనఁబడు ఛన్దస్సును తెలుపుటచే, న=అది పరమాత్మను తెలుపునది కాదు. ఇతిచేత్=ఇట్లంటివేని, న=అది యుక్తము కాదు. తథా=అట్లు, చేతోఽర్పణనిగమాత్ = ఇచట బ్రహ్మమును గాయత్రితో సమానమయిన దానినిగా ననుసంధించుకొనవలయునని నియమించుటవలన, తథాహి=అట్లే కదా, దర్శనమ్=శ్రుతి నిదర్శనము కలదు.

తా॥ ప్రకృతమున జ్యోతిశ్శబ్దము గాయత్రియనఁబడు చన్దస్సును తెలుపునదియగుటంజేసి, యది పరమాత్మను దెలుపునది కాదంటివేని,యది యుక్తము కాదు. ఏలననఁగా, ఇచట గాయత్రీసాదృశ్యముతో పరమాత్మ ననుసంధించుకొనవలయునని విధింపఁబడుచున్నది అట్లె గదా శ్రుతియును తెలుపుచున్నది.

ఆక్షేపము.

ఛందోగులు "గాయత్రీ వా ఇదం సర్వం" (ఛా.౩ప్ర.౧౨ ఖ.౧వా)(ఇది యంతయును గాయత్రియే) అను పూర్వవాక్యమున గాయత్రమను ఛందస్సును బేర్కొని, యనంతరము "తదేతదృచాభ్యనూక్తం" అనువాక్యమున"అట్టి గాయత్రమే జెప్పఁబడినది"అనుచు నుదహరించిన ఋక్కుగూడ ఛందస్సుతో సంబం

ధించిన దగుటంజేసి యీ ప్రకరణమున జ్యోశ్శబ్దముచే ఛందస్సు చెప్పఁబడు చున్నది గాని, పరబ్రహ్మము జెప్పఁబడుచుండ లేదనిన.

సమాధానము.

ఇచట గాయత్రీ యనునది సర్వాత్మకముగాఁ జెప్పఁబడుచున్నది. ఇట్లు సర్వాత్మకముగా నుండుట చందోమాత్రమగు గాయత్రికి యసంభవము గాన, నిచట "గాయత్రీ"శబ్దము పరమాత్మను తెలుపునదియని యెఱుంగునది. ఎట్లనిన, ఫలమునకై బరబ్రహ్మమును గాయత్రీ సదృశునిగా ధ్యానింపవలయునని యీ పైశ్రుతి విధించుచున్నది. "పాదోఽస్య సర్వాభూతాని" ఇత్యాది వాక్యముచే పరబ్రహ్మము నాలుగు పాదములతోఁ గూడుకొన్నది గాను జెప్పఁబడుచున్నది. గాయత్రీ ఛందస్సునకును గూడ నాలుగు పాదములు గలవు. కాఁబట్టి యీ విషయమున పరబ్రహ్మమునకు గాయత్రీ ఛందస్సుతో సామ్యము సంభవమే. ఏల ననిన, వేదములయందు కొన్నితావుల గాయత్రీ ఛందస్సునకు నాలుగు పాదములు గానఁబడుచున్నవి. ఎట్లనిన:—

ఇంద్రశ్శచీపతిః॥ వలేన పీడితః॥

దుశ్చ్యవనోవృషా॥ సమిత్సుసాసహిః॥

ఇతరత్ర గూడ ఛందోవాచకమగు శబ్దమునకు సాదృశ్యమునుబట్టి యర్థాంతర పరముగ ప్రయోగము గలదు. ఎట్లనిన, ఛందోగులు సంవర్గ విద్యను పఠించుసందర్భమున "తేవా ఏతే పంచాన్యే పంచాన్యే దశసంపద్యన్తే" అని యుపక్రమించి "సైషావిరాడన్నాత్" అని పఠించుచున్నారు. అనఁగా నిచట వాయువు, అగ్ని, సూర్యుఁడు, చంద్రుఁడు, జలమును,అను అధిదైవతము లైదును, ప్రాణము, వాక్కు, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, అను నధ్యాత్మములైదును, జేరి పదియగుచున్నవి. విరాట్ఛందస్సునందును పదియక్షరములేయున్నవి. ఈ సామ్యమును బట్టి యివి విరాట్టుగా నుపదేశింపఁబడినవి.

ఇట్లే ప్రకృతశ్రుతియందును పాదసంఖ్యాసామ్యమును బట్టి గాయత్రీ శబ్దము పరమాత్మ పరముగాఁ బ్రయోగింపఁబడినది.

అవతారిక:—గాయత్రీ శబ్దము పరబ్రహ్మ పరమనుటకు కారణాంతరమును గానఁబఱచుటకై.

౨౭॥ సూ॥ భూతాదిపాద వ్యపదేశోప పత్తేశ్చైవం.

టీ॥ భూతాదిపాదవ్యపదేశోపపత్తేశ్చ=భూతాదులు పాదములుగాఁ జెప్పఁబడుటయును సంభవ మగును గాన,ఏవం=ఇట్లు గాయత్రీశబ్దమును సర్వేశ్వరపరము గానే యెఱుంగునది.

తా॥ గాయత్రీశబ్దము సర్వేశ్వరుని తెలుపునదియగు పక్షమున సర్వభూతము లతనిపాదమని శ్రుతియందుఁ జెప్పియుండుటయును పొసగును గాన, అట్లే యిచట నెఱుంగునది.

శ్రీ॥ భా॥ ఛందోగులు, భూత, పృథివీ, శరీర, హృదయములను నిర్దేశించి "సైషాచతుష్పదా" అనువాక్యమున నానాల్గింటిని గాయత్రికి పాదములనుగాఁ బలికి యున్నారు. అట్లు భూతాదులను పాదములనుగాఁ గలిగియుండునది కేవల ఛందస్సు గానేరదు. కాఁబట్టి యీతావున గాయత్రీశబ్దము పరమాత్మ పరమని చెప్పుట యుక్తము.

౨౭॥ సూ॥ ఉపదేశభేదాన్నేతిచేన్న ఉభయస్మిన్నప్యవిరోధాత్.

టీ॥ ఉపదేశ భేదాత్ =ఉపదేశమున భేదముండుటంజేసి, న=జ్యోతిశ్శబ్దము పరమాత్మను తెలుపునది కాదు. ఇతిచేత్ =ఇట్లంటివేని, న=అదియుక్తముకాదు. ఏలననఁగా, ఉభయస్మిన్నపి = ద్వివిధోపదేశమునను, అవిరోధాత్ = విరోధము లేనందున.

తా॥ రెండువిధములలో నెవ్విధమునను, విరోధములేదు గాన, ఉపదేశమున భేదముండుటంజేసి జ్యోతిశబ్దము పరమాత్మను తెలుపునది కాదని చెప్పఁదగదు.

శంక:—

శ్రీ॥ భా॥ "త్రిపాదస్యామృతందివి" అనుపూర్వ వాక్యమున "ఏబ్రహ్మము ద్యులోకసంబంధిగ బోధింపఁబడెనో, యదియే "పరోదివోజ్యోతిః" అను ప్రకృత వాక్యమునందు ద్యులోక సంబంధముచే గుర్తింపఁబడుట యసంభవము, ఏలననఁగా, పూర్వవాక్యమున "దివి" అను సప్తమ్యంత ప్రయోగముచే బ్రహ్మము దివి యాధారముగాఁ గలదిగా నుపదేశింపఁబడుట వలనను, ప్రకృతవాక్యమున "దివః" అను పంచమ్యంత ప్రయోగముచే బ్రహ్మము దివి యవధిగాఁ గలదిగా నుపదేశింపఁబడుట వలనను అనఁగా పూర్వాపరవాక్యములయందు ఉపదేశ భేదమున్నందున పూర్వవాక్యమున నుపదేశింపఁబడిన బ్రహ్మమే ప్రకృతవాక్యమునఁ గూడ ఉపదేశింపఁ బడుచున్నదని గుర్తించుట యసంభవమే యనిన.

సమాధానము:—అట్లు జెప్పుట యుక్తము గాదు. ఈ రెండు విధములగు నుపదేశముల యర్థస్వభావ మొక్కటియే గాన, అనఁగా బ్రహ్మము ద్యులోకమాధారముగాఁ గలదిగా నుపదేశింపఁబడినను, ద్యులోక మవధిగాఁ గలదిగా నుపదేశింపఁబడినను, యీరెండువిధములగు నుపదేశమందును బ్రహ్మమునకు ద్యులోకసంబంధము సమానమే గాన పూర్వవాక్యమున ద్యులోక

సంబంధిగా నుపదేశింపఁబడినదే ప్రకృతవాక్యమున నుపదేశింపబడుచున్నదనెడి ప్రత్యభిజ్ఞగలుగుట కెద్దియు విరోధము లేదు. దృష్టాంతము:—వృక్షాగ్రముతో సంబంధముగల డేగను గూర్చి చెప్పునపుడు "వృక్షాగ్రే శ్యేనః వృక్షాగ్రాత్పరత శ్శ్యేనః=వృక్షాగ్రమునఁ డేగకూర్చున్నది వృక్షాగ్రము మీఁదుగా డేగకూర్చున్నది"అని లోకమునందుఁ జెప్పుట కలదు అట్లే దివియందున్న బ్రహ్మమని యొక తావునను, దివికంటె పరముగానున్న బ్రహ్మమని మఱియొక తావునను నున్న, యుపదేశించియున్నను, విరోధమెద్దియును లేదు. ఈ శ్రుతివాక్యము ద్యులోకమునకు మీఁదుగ ప్రకాశించునట్టి జ్యోతిస్సు, నిరతిశయ తేజోవంతుఁడగు పరమపురుషుఁడే యని ప్రతిపాదింపుచున్నది. "ఏతావా నస్య మహిమా తతో జ్యాయాంశ్చ పురుషః, పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" (ఈతనిమహిమ యింతమాత్రము. దీనికంటెను పురుషుఁడు గొప్పవాఁడు. భూతాది సమస్త పదార్థములొక్క పాదము. తక్కిన మూఁడుపాదములు ద్యులోకమున నమృతస్వరూపము" అనియు, నివ్విధముగ శ్రుతిచే చతుష్పాత్తుగ ప్రతిపాదింపఁబడిన పరబ్రహ్మముకు"వేదాహమేతం పురుషం మహాంతమాదిత్యవర్ణం తమసః పరస్తాత్" అను శ్రుతివాక్యము అప్రాకృతశరీరము గలదని చెప్పుచుండుటంజేసి యట్టి యప్రాకృత శరీరముతోఁ గూడుకొనిన పరమపురుషునియొక్క తేజస్సుగూడ అప్రాకృతమయినదే. కావున నట్టి యప్రాకృత తేజస్సుతోఁగూడికొనిన వాఁడగుటచే పరమ పురుషుఁడే శ్రుతియందు జ్యోతిస్సని చెప్పఁబడుచున్నాఁడు.

జ్యోతిరధికరణము ముగిసెను.



## ఇంద్రప్రాణాధికరణము.

అవతారిక :—జ్యోతిశ్శబ్దముచే జెప్పఁబడునదియు, నిరతిశయదీప్తియుక్తమగు నొక ప్రసిద్ధవస్తువుగాఁ జెప్పఁబడినది పరమపురుషుఁడే యని పూర్వాధికరణమునఁ జెప్పఁబడియె. కారణభూతుఁ డగుటచే అమృతత్వమనఁబడు మోక్షమును గలుగఁజేయునట్టి వాఁడుగాను ఉపాసింపవలయునని శ్రుతులయందు ఇంద్రప్రాణాది శబ్దములచేఁ జెప్పఁబడినవాఁడును పరమపురుషుఁడే యని తెలుపుటకై :—

### ౨౯॥ సూ॥ ప్రాణ స్తథానుగమాత్.

టీ॥ ప్రాణః=ప్రాణశబ్దవాచ్యుఁడు జీవుఁడు, (ఏలననఁగా)తథా=అట్లు,అనుగమాత్=తెలియవచ్చుటవలన.

తా॥ ప్రతర్దనవిద్యాసందర్భమున ప్రాణశబ్దముచేఁ జెప్పఁబడినవాఁడు జీవుఁడని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ కౌషీతకులు, ప్రతర్దన విద్యాసందర్భమున, "ప్రతర్దనో హ వై దై వోదాసిరింద్రస్య ప్రియం ధామ ఉపజగామ యుద్ధే న చ పౌరుషేణ." (కౌ. 3 అ.౧౧) అను వాక్యమున ‚‚దేవోదాసుని కుమారుఁడగు ప్రతర్దనుడనురాజు తన యుద్ధముచేతను, పరాక్రమముచేతను, ఇంద్రుని ప్రియమందిరమునకుఁ జనియె" ఇవ్విధముగ జెప్పనారంభించి, యనంతర మింద్రుఁడు నీకిష్ట మయిన వరమును కోరుమని యతని నడుగఁగా "త్వమేవ మే వరం వృణీష్వ యం త్వం మనుష్యా య హితతమం మన్యసే" అను వాక్యమున, "మనుష్యుని కెయ్యది యెక్కువ హితమయినదో, దానిని నీవే యోచించి చెప్పుము" ప్రతర్దనుఁ డింద్రుని యడుగఁగా నంతట యింద్రుడు "ప్రాణోస్మి ప్రజ్ఞాత్మా తం మామమృత మిత్యుపాస్స్వ" "నేను ప్రాణస్వరూపుఁడను. మఱియు ప్రజ్ఞుఁడగు నాత్మను. ఇట్టి నన్ను ఆయుస్సును గాను అమృతస్వరూపుని గాను ఉపాసింపుమా!" అని ప్రత్యుత్తర మిచ్చి నట్లు యుపదేశింపుచున్నారు. ఇందొక సంశయము గలుగుచున్నది.

### సంశయము

ఇట్లు ఈ ప్రతర్దన విద్యయందు మనుష్యుల హితముకొరకు ఉపాసింపవలసిన వాఁడుగాను, ఇంద్రప్రాణశబ్దములచే నిర్దేశింపఁబడినవాఁడు, జీవుఁడా ? కాక, జీవునికంటె వేఱగు పరమాత్మయా ?

### పూర్వపక్షము

ఈ ప్రతిర్దనవిద్యయందు ఉపాస్యుడుగా నుపదేశింపఁ బడినవాఁడు జీవుఁడే యనుట యుక్తము. ఏలననిన, ‚‚ఇన్ద్ర" శబ్దము ఒక జీవవిశేషమును తెలుపుట లోక ప్రసిద్ధము. అట్టి యింద్రశబ్దముతో సామానాధికరణ్యమున శ్రుతియందుఁ బ్రయోగింపఁబడిన ‚‚ప్రాణ" శబ్దమున్ను అదియే యర్థము గలది. పైని చెప్పిన ప్రకార మింద్రుఁడు జీవుఁడు గాన, నింద్రుఁడనంబడు ప్రాణము గూడ జీవుఁడే. ఇట్లు యింద్రుఁడని పిలువంబడు జీవుఁడు, ప్రతర్దనునిచే మనుష్యుని కెయ్యది యెక్కువ హితమయినదో దానిని నీవే యోచించి చెప్పుమని యడుగఁబడిన వాఁడై మనుష్యులకు మిక్కిలి హితమయిన యుపాసనము నుపదేశింపఁదలంచి, యందులకుగాను నన్నుఉపాసింపుమని యాత్మోపాసనమును ఉపదేశించెను. మనుష్యునికి మిక్కిలి హితమయినదెద్ది? అది అమృతస్వరూపమగు మోక్షమును బొందించునట్టి యుపాయమే కదా! అయితే "తస్య తావదేవచిరం యావన్న విమోక్ష్యే అథసంపత్స్యే" ఇత్యాదిశ్రుతులచే "శరీరత్యాగానంతరమున నీచేతనునిచే బొందఁబడునట్టిదిగాఁ జెప్పఁబడునట్టి యమృత స్వరూప మగు మోక్షమును

నది జగత్కారణుఁడగు పరబ్రహ్మమును ఉపాసించుట చేతఁ గదా గలుగు చున్నది. కాఁబట్టి యట్టి యుపాయము జగత్కారణుఁడగు పరబ్రహ్మమును ఉపాసించుటయే. ఇచట జీవుఁడగు నింద్రుఁడు తన్ను ఉపాసించుటయే అమృత స్వరూప మగు మోక్షమును బొందుటకు ఉపాయమని యుపదేశించుటచే జీవుఁ డుగ ప్రసిద్ధుఁడగు నింద్రుఁడే జగత్కారణభూతమగు పరబ్రహ్మమని తెలియ వచ్చుచున్నదనిన.

—సిద్ధాంతము:—

ఇట్లు చెప్పుట యుక్తము గాదు. ఇచట ఇంద్రుఁడనియును, ప్రాణమని యును జెప్పఁబడిన వాఁడు జీవమాత్రుఁడు కాఁడు. అయితే యతఁడు జీవునికంటె వేఱగు పరబ్రహ్మమే. ఎట్లనిన, ''స ఏష ప్రాణఏవ ప్రజ్ఞాత్మా ఆనందోఽజరో ఽమృతః'' అను శ్రుతివాక్యము ''ఇట్లు ప్రాణమనంబడు వాఁడు ప్రజ్ఞుఁడగు నాత్మ యనియు, ఆనందమయుఁడనియు, ముసలితనము లేనివాఁడనియు, అమృత స్వరూపుఁడనియు'' నివ్విధముగ జెప్పుచున్నది. ఇంతకుపూర్వము ఇంద్రశబ్దము చేఁ జెప్పఁబడినవాఁడు పరబ్రహ్మమయిన పక్షమున మాత్రమే, యతనిని ఆనంద మయునిగాను, జరారహితునిగాను, అమృతస్వరూపునిగానున్ను జెప్పుట యుప పన్నమగును.

.౩౦॥ సూ॥ నదవక్తురాత్మోపదేశాదితిచేదధ్యాత్మసంబంధభూమాహ్యస్మిన్

టీ॥ వక్తుః = ఉపదేశకుఁడగు ఇంద్రుఁడు, ఆత్మోపదేశాత్ = స్వాత్మను ఉపాసింపుమని యుపదేశించుటవలన, న = ప్రాణశబ్దము బ్రహ్మవాచకము కాదు, ఇతిచేత్ = ఇట్లంటివేని, (అది సరికాదు) హి=ఏలననఁగా, అస్మిన్=ఈ ప్రకరణ మునందు, అధ్యాత్మసంబంధభూమా=అధ్యాత్మసంబంధబాహుళ్యము, (వర్తతే= కలదు.)

తా॥ ఈ తావున ఉపదేశకుఁడగు ఇంద్రుఁడు తనయాత్మను ఉపాసింపు మని యుపదేశించినాఁ డంటివేని,యది యుక్తము కాదు.ఏలననఁగా, ఈ తావున అధ్యాత్మసంబంధము లనేకములు చెప్పఁబడినవి.

—ఆక్షేపము.—

శ్రీ॥ భా॥ ఇంద్రుఁడనియు, ప్రాణమనియును, పిలువఁబడువాఁడు ఆనంద మయుఁడనియు,జరారహితుఁడనియు,అమృత స్వరూపుఁడనియును, శ్రుతి జెప్పు చున్నందున,నతఁడు పరమాత్మయే యయియుండవలయునని పూర్వసూత్రమునఁ బ్రతిపాదింపఁబడియె. అయితే అట్లు చెప్పుట యుక్తము గాదు. ఏలననిన,

ప్రథమమున, ''మామేవ విజానీహి''''నన్నే తెలిసికొనుము''అని చెప్పి, పిదప ''ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మా తం మామాయురమృత మిత్యుపాస్వ'' (నేను ప్రాణమును, ప్రజ్ఞాత్మను, నన్ను ఆయుస్సును గాను అమృతస్వరూపుని గాను ఉపాసింపుము) అని యుపదేశించినవాఁడగు ఇంద్రుఁడు ''త్రిశీర్షాణంత్వాష్ట్రి మహానం''(త్వష్ట్ర ప్రజాపతి పుత్రుఁడును, త్రిశిరస్కుఁడునగు విశ్వరూపుని నేను వధించితిని'' అనియు నిర్వివాదముగ తన పరాక్రమమును గూడ వర్ణించియుండె. ఇందువలన ఉపక్రమమున జీవుఁడుగ ప్రసిద్ధుఁడగు ఇంద్రుఁడు తననే యుపాసింపుమని ప్రతర్దనుని కుపదేశించినట్లు విశద మగుచున్నది. ఉపక్రమోపసంహారము లేక రూపములుగా నుండవలయు నను నియమమునుబట్టి యుపసంహారమున ''ఆనందో ఽజరోఽమృతః''ఇత్యాదివాక్యమున నానందమయుఁడుగాను, జరారహితుఁడుగాను నిర్వివాదముగ వర్ణింపఁబడినవాఁడు జీవుఁడేయని సిద్ధమగుచున్నదనిన,

—•—• సమాధానము •—•—

ఈ ప్రకరణమునందు అధ్యాత్మ సంబంధబాహుళ్యము జెప్పఁబడియున్నది. ఆత్మయందు సంబంధము నధ్యాత్మసంబంధ మందురు. దానియొక్క భూమ యనఁగా బహుత్వము. అనఁగా నాత్మను యాధారముగ నాశ్రయించిన పదార్థములనేకము లగుటంజేసి వాటితో సంబంధములు గూడ ననేకములుగ జెప్పఁబడి యున్నవి. ఇచట ఉపాస్యుఁడు పరబ్రహ్మమగు పక్షమున మాత్రమే యవి యన్నియును ఉపపన్నము లగును. ఎట్లనిన, ''తద్యథా రథస్యారేషు నేమిరర్పితా, నాభావరా అర్పితా ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రాస్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణేఽర్పితాః స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మాఽనందో ఽజరో ఽమృతః'' అను ఉత్తరవాక్యము ''బండిచక్రము యొక్క పూటీలు ఆకుల నాశ్రయించి యున్నట్లును,ఆ యాకులు కుండ నాశ్రయించి యున్నట్లును,భూతమాత్రలు అనఁగా పృథివ్యాది భూతములు ప్రజ్ఞామాత్రలను అనఁగా చేతనపదార్థములనాశ్రయించియున్నవి, ఆచేతనపదార్థములు ప్రాణము నాశ్రయించియున్నవి, ఈ ప్రాణమే యానందమయుఁడును, ప్రజ్ఞాత్మయును, జరారహితుఁడును, అమృతస్వరూపుఁడును'' అనియును జెప్పుచు భూతమాత్రము లనంబడు అచేతనపదార్థములను బేర్కొని యట్టి యచేతనపదార్థముల కాధారముగ ప్రజ్ఞామాత్రము లనంబడు చేతనపదార్థములను బేర్కొని, ఆచేతనపదార్థములకు కాధారభూతుఁడు ఇంద్రుఁడనియు, ప్రాణమనియును జెప్పి యట్టి వానిని ఆనందమయుని గను జరారహితునిగను నిర్వివాదముగ జెప్పుచున్నది. ఇట్లు చేతనాచేతనరూప

మగు నీసమస్తమునకును నాధారముగ శ్రుతియందుఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయే యైయుండుట సంభవముగాని యట్టివాఁడు జీవుఁడు కానేరఁడు.

ఈసూత్రమునకు వేఱొకవిధముగాను గూడ నర్థము జెప్పనచ్చును.

అధ్యాత్మసంబధమనగా పరమాత్మకసాధారణములగు ధర్మములసంబంధము లనేకములీ ప్రకరణమునందుఁ జెప్పఁబడియుండుటంజేసి ఇచటనింద్రప్రాణశబ్దవాచ్యుఁడు. పరమాత్మ యనుటయుక్తము. ఎట్లనిన, "త్వమేవ మే వరం వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే" అనువాక్యమున ,,మనుష్యుల కెక్కువ హితమైన దెద్ది యో, దానిని గుఱించిన వరమును నీవే యేర్చి వేయుమా! యని ప్రతర్దనుఁ డడుగఁగా, నంతట యింద్రుఁడు "మాముపాస్వ" (నన్ను యుపాసింపుమా) అని యుత్తర మిచ్చెను. ఇచట ఇంద్రశబ్దవాచ్యుఁడు మోక్షముకొఱకై యుపాసింపవలసినవాఁడుగాఁ జెప్పఁబడియె. మోక్షార్థము ఉపాసింపవలసినవాడు పరమాత్మ తప్ప వేఱొక్కఁడు కాడు గాన, ఈ ప్రకరణమున ప్రాణమనఁబడు ఇంద్రుఁడు పరమాత్మ యని తెలియ వచ్చుచున్నది.

అట్లే "ఏష ఏవ సాధు కర్మ కారయతి తం యమేభ్యో లోకేభ్య ఉన్నినీషతి ఏష ఏవాసాధు కర్మ కారయతి తం యమధో నినీషతి" అను శ్రుతివాక్యము ,,ప్రాణశబ్దముచేఁ జెప్పఁబడిన ఇంద్రుఁడు ఏజీవుని ఉత్కృష్టగతిని బొందించుట కిచ్ఛయించునో, వానిచే సత్కర్మమును జేయించుచున్నాఁడనియు, అతఁడే యాజీవునికి నికృష్టగతినిబొందించు పాపకర్మమును చేయించుచున్నాఁడు" అనియును జెప్పుచున్నది. అయితే సర్వకర్మములను జేయించుట పరమాత్మయొక్క ధర్మము గదా! కనుక నీప్రకరణమున నింద్రశబ్దముచేఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయే యని తెలియవచ్చుచున్నది.

అట్లే ,,తద్యథా రథస్యారేషు నేమిరర్పితా నాభావరా అర్పితా ఏవమేవైతా భూతమాత్రాః ప్రజ్ఞా మాత్రా స్వర్పితాః ప్రజ్ఞామాత్రాః ప్రాణేఽర్పితాః" అను శ్రుతి ,,బండిచక్రముయొక్క పూటీలకు ఆకులాధారమయి ఆయాకులకు కుండ యాధారమయినచందమున, యీభూతములన్నింటికిని జీవులే యాధారము ఆజీవులకు ప్రాణమాధారమగుచున్నది" అనుచు ప్రాణశబ్దవాచ్యము సర్వాధారమని తెలియఁ జేయుచున్నది. సర్వమున కాధారభూతుఁడుగా నుండుట పరమాత్మయొక్క ధర్మము గదా. కాఁబట్టి యీప్రకరణమున ప్రాణశబ్దవాచ్యము పరమాత్మయని విశదమగుచున్నది.

అట్లే "స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మాఽనన్దోఽజరోఽమృతః" అనుశ్రుతి వాక్యము ,,ఈ ప్రాణమే ప్రజ్ఞాత్మయనియు, అనందమయుఁడనియు, జరామరణ

ములు లేనివాఁడనియును చెప్పుచున్నది. ఈ శ్రుతియందుఁ జెప్పఁబడిన ఆనంద మయత్వాదులు పరమాత్మ ధర్మములు గాన, నీప్రకరణమున ప్రాణమనఁగా పరమాత్మయే యని తెలియవచ్చుచున్నది.

అట్లే "ఏష లోకాధిపతి రేష సర్వేశః" అను శ్రుతివాక్య మీ ప్రాణము లోకాధిపతి యనియు,సర్వేశ్వరుఁడనియును జెప్పుచున్నది.లోకాధిపతిగను, సర్వేశ్వరుఁడుగ నుండుట పరమాత్మ ధర్మములు గాన,నిచట ప్రాణశబ్దవాచ్యము పరమాత్మయే యని విశదమగుచున్నది.

ఈ పైని గనఁబఱచిన శ్రుతుల యందంతటను పరమాత్మ చిహ్నములనేకములు చెప్పఁబడి యుండుటచే నీప్రకరణమున ప్రాణ మనియు, ఇంద్రుఁడనియును పేర్కొనఁ బడిన వాఁడు పరమాత్మమే యని సిద్ధ మగుచున్నది.

అవతారిక:—ఇంద్రుఁడు నొక జీవుఁడే గదా! ఇట్లుండ, అతఁడు మోక్షమునకై తనను ఉపాసింపుమని యుపదేశించుట యెట్లు ఘటింపునని శంకింపఁగా, నట్టి శంకను పరిహరించుటకై:—

3౧॥ సూ॥ శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్.

టీ॥ తు=పూర్వపక్ష మయుక్తము. శాస్త్రదృష్ట్యా=శాస్త్రపద్ధతిని బట్టి చూడఁగా, ఉపదేశః = స్వాత్మోపదేశము (కృతః=చేయఁబడినది.) వామదేవవత్=వామదేవుఁడు చేసినట్లు.

తా॥ పూర్వపక్షము యుక్తముకాదు. శాస్త్రపద్ధతినిబట్టి విచారింపఁగా,వామదేవుఁడు చేసినట్లు, ఇచట స్వాత్మోపదేశము చేయఁబడినట్లు దెలియుచున్నది.

శ్రీ॥భా॥ జీవులలో నొకఁడుగ ప్రసిద్ధిఁజెందిన యింద్రుఁడు"మామేవ విజానీహి" (నన్నే తెలిసికొనుము) అనియు "మాముపాస్వ" (నన్ను ఉపాసింపుము) అనియు నిట్లుజెప్పుచు తనకంతరాత్మయగు పరమాత్మను ఉపాసింపుమని యుపదేశించుచున్నాఁడు. ఇచట ఈతఁడు ప్రమాణాంతరావగతమగు తన యాత్మను (అనగా జీవుని) యుపాసింపుమని యుపదేశింపుచుండ లేదు. అయితే తన యాత్మకు నాత్మగ శాస్త్రప్రమాణావగతుఁడగు పరమాత్మను ఉపాసింపుమని యుపదేశించుచున్నాడు. అది యెట్లంటివేని. "అనేన జీవేనాత్మనాఽను ప్రవిశ్యనామరూపే వ్యాకరవాణి" అను శ్రుతివాక్యము "పరమాత్మ జీవశరీరుఁడుగా నన్నింటిలోను ప్రవేశించి వాటి నామరూపములను ప్రకటింపఁజేయుచున్నాఁడు" అనియు, "ఐతదాత్మ్య మిదం సర్వం" అను శ్రుతివాక్యము "ఇది యంతయును పరమాత్మయే యాత్మగాఁ గలది" అనియు, "అంతః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా" అనుశ్రుతివాక్యము "పరమాత్మ అందఱిలోపలను ప్రవేశించి జనుల నందఱిని నియమించుచున్నాఁడు అతఁడందఱికి నాత్మ" అనియు, "య ఆత్మని తిష్ఠ న్నాత్మనోఽన్తరో య మాత్మా నవేద

 

యస్యాత్మా శరీరం య ఆత్మా నమన్తరో యమయతి" అను శ్రుతివాక్యము "ఏపరమాత్మ ప్రత్యగాత్మయం దున్నవాఁడై, ప్రత్యగాత్మలోపలనుండి, ప్రత్యగాత్మచేఁ దెలిసికొనఁబడక, ప్రత్యగాత్మ శరీరముగాఁ గలవాఁడై, ప్రత్యగాత్మను లోపలనుండి నియమించుచున్నాఁడో" అనియు, "ఏష సర్వభూతాంతరాత్మా ఉపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" అను శ్రుతివాక్యము" "ఈ సర్వేశ్వరుఁడు జీవు లందఱికి నాత్మ, అపహతపాప్ముఁడు, ప్రకృతిసంబంధము లేని నారాయణుఁడు" అనియు నివ్విధముగ చెప్పుచుండుటచే శాస్త్రమునం దంతటను పరమాత్మ జీవాత్మలుశరీరముగాఁ గలవాఁడుగాఁ జెప్పఁబడుట నెఱింగి, అందువలన జీవాత్మవాచకములగు "అహం = నేను" "త్వం=నీవు" ఈమొదలగు శబ్దములు జీవాత్మశరీరుఁడగు పరమాత్మను దెలియఁజేయుట యందే పర్యవసింపుచున్ననియు నెఱింగిన వాఁడై ఇంద్రుఁడు"మామేవ విజానీహి"అనువాక్యమున"మాం=నన్ను—నాకంతరాత్మయగు పరమాత్మను—తెలిసికొనుము" అనియు"మాముపాస్వ" అను వాక్యమున "మాం=నన్ను—నాకంతరాత్మయగు పరమాత్మను—ఉపాసింపుము"అనియును ఉపదేశించెను. అదెటువలెననిన, వామదేవుఁడు పరబ్రహ్మము సర్వమున కంతరాత్మయనియు, సర్వము నతనికి శరీరమనియు, శరీరవాచకములగు శబ్దములు శరీరిని తెలియఁ జేయుట యందు పర్యవసింపుచున్నవనియు నెఱింగి,"అహం" (నేను) అను శబ్దముచే తన యాత్మయే శరీరముగాఁగల పరమాత్మను నిర్దేశించి, "నేను మనువును, నేను సూర్యుఁడను, అని యివ్విధమునఁ జెప్పియుండెను.ఎట్లనిన "తదేతత్పశ్యన్ ఋషిర్వామదేవః ప్రతిపేదే అహం మను రభవం సూర్యశ్చాహం కక్షీవా౯ ఋషిరస్మి విప్రః" ఇత్యాది శ్రుతివాక్యము,,అట్లు బ్రహ్మమును సాక్షాత్కరించినవాఁడై వామదేవుఁడను మహర్షి నేను మనువునైతిని నేను సూర్యుఁడనైతిని, నేను కక్షీవంతుఁడను బ్రహ్మఋషినైతినని తెలిపెను" అని చెప్పుచున్నది. ప్రహ్లాదుఁడు గూడ "సర్వగత్వాదనన్తస్య స ఏవాహమ వస్థితః । మత్తస్సర్వమహం సర్వం మయి సర్వం సనాతనే" (అనంతుఁడగు సర్వేశ్వరుఁడు అన్నింటిలోనుండుటచే వాఁడే నేను, నానుండియే సర్వము గలుగుచున్నది. నేనే సర్వమును నాయందే సర్వమును కలదు" అని యివ్విధమునఁ జెప్పెను.

అవతారిక :—ఈ ప్రకరణమున జీవవాచకములగు శబ్దములును అచిత్పదార్థవాచకములగు శబ్దములున్ను ఉపాస్యుఁడగు పరమాత్మను దెలియజేయుటకు హేతువును శంకాప్రదర్శన పూర్వకముగ గానఁబఱచుటకై.

౩౧॥ సూ॥ జీవ ముఖ్య ప్రాణలిఙ్గాన్నేతి చేన్నోపాసాత్రైవిధ్యాదాశ్రితత్వా దిహ తద్యోగాత్.

టీ॥ జీవముఖ్య ప్రాణలిఙ్గాత్ = జీవచిహ్నములును, ముఖ్యప్రాణ చిహ్న

ములును శ్రుతియందుఁ గానఁబడుటంజేసి యిచట, న=పరమాత్మ యుపదేశిం పఁబడలేదు, ఇతిచేత్ =ఇట్లంటివేని, న=అది యుక్తము కాదు. (ఏలననఁగా)ఉపా సాత్రైవిధ్యాత్ =ఉపాసనములు మూఁడువిధములయినందున, ఆశ్రితత్వాత్ = అవి యిచట యుపదేశింపఁబడినందున, ఇహ=ఈతావున, తద్యోగాత్ =అట్టి త్రివిధోపాసనము పొసగుచున్నందున.

తా॥ జీవుని చిహ్నములును, ముఖ్యప్రాణముయొక్క చిహ్నములును ప్రకృత శ్రుతియందుఁ గానఁబడుటంజేసి, యిచట పరమాత్మను గుఱించి యుప దేశింపఁబడ లేదంటివేని, యది యుక్తము కాదు. ఏలననఁగా, ఉపాసనము త్రివి ధము. త్రివిధోపాసనములును ప్రకృతమున నుపదేశింపఁబడు చున్నవి. అట్టి యుపదేశము ఈతావున పొసగుచున్నది.

శ్రీ॥భా॥ శంక:—"న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్" (వచనమును మాత్రమే దెలిసికొనుట కిచ్ఛయింపక,వక్తనగునన్నును దెలిసికొనుము) అనియు "త్రిశీర్షాణం త్వాష్ట్రం మహనం" (ఇంద్రుఁడు మూఁడుతలలుగల త్వష్ట్ర ప్రజాపతియొక్క కుమారుని జంపెను) అనియును నిర్విధముగ జెప్పియుండుటచే యీ ప్రకరణమున జీవచిహ్నములును, "యావదస్మిన్ శరీరే ప్రాణో వసతి తావ దాయుః" "ఈ శరీమున నెంతవరకు ప్రాణముండునో, అంతవరకే ఆయుర్దాయ ము" అనియు, "అథఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాప యతి" (ప్రజ్ఞాత్మయగు ప్రాణమే యీ శరీరమును దీసికొని పైకి లేపుచున్నది" అనియును జెప్పియుండుటచే ముఖ్యప్రాణముయొక్క చిహ్నములును ఈప్రక రణమునఁ గన్పట్టుచున్నవి. కాఁబట్టి యిచట పరమాత్మయొక్క ధర్మములు జెప్పఁబడుచుండలేదు.

సమాధానము:—అట్లు జెప్పుట యుక్తము గాదు. ఏలననఁగా,మూఁడు విధములగు నుపాసనముల నుపదేశించుటకై పరమాత్మ యిచట ప్రాణాదిశబ్దము లచేత నిర్దేశింపఁబడెను.ఆ మూఁడు విముధములగు నుపాసనము లేవి యనఁగా, నిఖిలకారణభూతుఁడగు పరమాత్మను వాని స్వరూపముతో నను సంధిం చుట యొకటి, భోక్తలగు జీవులు శరీరముగాఁ గలవానినిగా ననుసంధించుట రెండవది, భోగ్యపదార్థములును భోగోపకరణములును శరీరముగాఁ గలవాని నిగా ననుసంధించుట మూఁడవది. ఇట్లు మూఁడువిధములగు బ్రహ్మోపాసన ములు ప్రకరణాంతరములయందు ఉపదేశింపఁబడినవి. ఎట్లనిన:—"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "ఆనందో బ్రహ్మ" ఇత్యాది శ్రుతివాక్యములు బ్రహ్మము యొక్క స్వరూపోపాసనమును ఉపదేశింపుచున్నవి.

"తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్, తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్, నిరుక్తం చానిరుక్తంచ, నిలయనంచానిలయనంచ,విజ్ఞానంచావిజ్ఞానంచ, సత్యం

చానృతం చ సత్యమభత్ ” అను శ్రుతివాక్యము “బ్రహ్మము జగమును సృజించి దానిలోనే ప్రవేశించి మూర్తమును అమూర్తము నయ్యెననియు, నామనిష్కర్షగలదియు, నామనిష్కర్ష లేనిదియు నాయెననియు, ఆశ్రయముగలదియు ఆశ్రయములేనిదియునాయెననియు, చేతనంబును అచేతనంబును ఆయెననియు, నిర్వికారమగు చేతనముగను వికారసహితమగు జగత్తుగను ఆయెననియును జెప్పుచు, భోక్తలగు జీవులు శరీరముగాఁగల వానినిగాను, భోగ్యపదార్థములును భోగోపకరణములును, శరీరముగాఁ గలవానిని గాను పరబ్రహ్మము నుపాసించుట యనఁబడు నీరెండువిధములగు నుపాసనముల నుపదేశించుచున్నది. కాఁబట్టి ప్రకృతమున మూఁడువిధములుగల బ్రహ్మోపాసనము యుక్తమయినదే.

ఏ తావున హిరణ్యగర్భుఁడు మొదలగు జీవులు గాని, ప్రకృతి మొదలగు నచేతనపదార్థములు గాని పరమాత్మకు మాత్ర ముండునవి యగు గుణములుగలవిగాఁ జెప్పఁబడునో, లేక, వానిఁదెలుపు శబ్దములకు పరమాత్మవాచకములగు శబ్దములతో సామానాధికరణ్యముండునో, ఆ తావుల నంతటను, ఆ యాపదార్థములలో నంతరాత్మయగు పరమాత్మయొక్క యనుసంధానము ప్రతిపాదింపఁబడుచున్నది. కాఁబట్టి ప్రకృతమున నింద్రప్రాణశబ్దములచే నిర్దేశింపఁబడినవాఁడు జీవునికంటె వేఱగు పరమాత్మయే యని సిద్ధ మగుచున్నది.

గద్య॥ ఇది, శ్రీకృష్ణానద్యుత్తరవాహినీతీరసంబంధవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలర్మేల్మంగానమేత శ్రీవేంకటేశ్వరసన్నిధ్యధ్యాపక కైంకర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళరామానుజయతివరపరమానుగ్రహసమధిగతసకలవిశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయగ్రంథ తత్త్వార్థ, వాధూలకులతిలక వేంకటాచార్య రంగమాంబాతనూజ, కావ్యరత్న, వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీత్యాద్యనేకబిరుదాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్రశుద్ధమాగధ్యవస్థాదిద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్రశ్రీభాష్యమునందు ప్రథమాధ్యాయమున ప్రథమపాదము.

శ్రీమతేరామానుజాయనమః.







# శ్రీమదాంధ్ర శ్రీభాష్యము.

## ప్రథమాధ్యాయము—ద్వితీయపాదము.

### సర్వత్రప్రసిద్ధ్యధికరణము.

ఆచార్యులవారు ప్రథమ ద్వితీయపాదములకుఁగల పూర్వాపరసంబంధమును దెలుపుటకై ప్రథమపాదముయొక్క యధికరణములయందుఁ బ్రతిపాదింపఁబడిన విషయములను క్రమముగ ఈక్రిందు పేర్కొనుచున్నారు:—

అవతారిక:—

జిజ్ఞాసాధికరణము:—సాంగముగ వేదాధ్యయనమును జేసిన పురుషుఁడు కర్మ మీమాంసను జదువుటచే కర్మముల స్వరూపమును గుఱించి బాగుగాఁ దెలిసికొని, అందుమూలముగ కేవల కర్మములు అత్యంత స్వల్పమును, అస్థిరమునునగు ఫలము నిచ్చునవి యని యెఱింగి, తానధ్యయనముఁ జేసిన వేదముయొక్క యొకభాగమగు ఉపనిషత్తులనుఁ జదువునపుడు అనంతస్థిరఫలమగు పరబ్రహ్మమును గుఱించియును, అట్టి పరబ్రహ్మముయొక్క స్వరూపమును గుఱించియును, ఉపాసనమును గుఱించియును చూచాయగాఁ దెలియుటచే పరమపురుషార్థమగు మోక్షమునం దిచ్ఛగలవాఁడై, శబ్దములు పరినిష్పన్నమగు వస్తువును తెలుపుటకు సమర్థములయిన వనెడి నిశ్చయముగలవాఁడును, ఉపనిషత్తులు పరబ్రహ్మమును తెలుపువిషయమై ప్రమాణములనెడి నిశ్చయము గలవాఁడునై అందునుగుఱించి విచారించునది యగు శారీరకమీమాంసాశాస్త్రమును జదువుట కారంభించునది యని చెప్పఁబడియె. ఇందువలన వేదాంతశాస్త్రము ప్రవర్తించుట యుక్తమే యని నిరూపింపఁబడియె.

జన్మాద్యధికరణము:—అనంతములై నానావిధములగు చేతనాచేతన పదార్థములతోఁ గూడియుండునవియు, వానిలో, భోగ్య పదార్థములనియు, భోగోపకరణములనియు, భోగస్థానములనియు ననఁబడువానితోఁ గూడియుండునట్టి యీ సమస్తమగు ప్రపంచముయొక్క జన్మ స్థితి లయంబులకును, మహా

నందమునకును తానే కారణమగు పరబ్రహ్మమును "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాది శ్రుతివాక్యము బోధించుచున్నదని ప్రతిపాదింపఁబడియె.

శాస్త్రయోనిత్వాధికరణము :—ఇట్లు జగదేకకారణమగు పరబ్రహ్మము వేఱొక్క ప్రమాణముచేఁ దేనిచేతను తెలుపఁదగినది కానిదై, శాస్త్రప్రమాణముచే మాత్రమే తెలుపఁదగినది యని ప్రతిపాదింపఁబడియె.

సమన్వయాధికరణము:—ప్రవృత్తి నివృత్తులతో సంబంధించినది కాక పోయినను, స్వరూపముచేతనే పరమపురుషార్థమయినది యగు బ్రహ్మమును తెలుపువిషయముననే ఉపనిషద్వాక్యములన్నియును సంబంధించి యున్నందున, శాస్త్రము అట్టి బ్రహ్మమును తెలుపునదియగు ప్రమాణము కాదగునని నిరూపింపఁబడియే.

ఈక్షత్యధికరణము:—ఇట్లు జగదేకకారణము గాను ఉపనిషత్తులవలనఁ దెలియవచ్చునట్టి బ్రహ్మము సంకల్పాదులు గలది యగుటం జేసి, యది సాంఖ్యస్మృతి ప్రోక్తమగు ప్రకృతికంటెను వేఱయినదియు, చేతనవిశేషమునని ప్రతిపాదింపఁబడియె.

ఆనన్దమయాధికరణము:—అట్టి బ్రహ్మము స్వభావసిద్ధమును, మేరలేని యతిశయముగలదియు నగు నానందముగలది యనియును, సర్వజ్ఞుఁడును, సమస్తచేతనులకును భయాభయహేతువును, సత్యసంకల్పుఁడును, సమస్తచేతనాచేతనుల కంతరాత్మయును నివ్విధమైన వాఁడయినందున నతఁడు బద్ధుఁడు గాని, ముక్తుఁడు గాని యగు జీవునికంటెను వేఱయినవాఁడని సమర్థింపఁబడియె.

అన్తరధికరణము:—అతఁడు ప్రకృతి సంబంధములేనిదియును, కర్మము వలన వచ్చినదికానిదియును, తనకుమాత్రము ఉండునదియు నగు దివ్యశరీరము గలవాఁడని చెప్పఁబడియె.

ఆకాశప్రాణాధికరణములు :—శ్రుతులయందు అచేతనపదార్థములఁ దెలుపు ఆకాశప్రాణాదిశబ్దములును, జగత్కారణమగుటం జేసి యొక ప్రసిద్ధవస్తువుగాఁ జెప్పఁబడు నట్టివాఁడును, సకల చేతనాచేతనవిలక్షణుఁడు నగు పరబ్రహ్మమునే తెలుపుచున్నవని చెప్పఁబడియె.

జ్యోతిరధికరణము:—పరత్త్వమునకు మాత్రమే యుండునది యగు నిరతిశయదీప్తితోఁ గూడుకొనినవాఁడును, శాస్త్రమునందు జ్యోతిస్సని వ్యవహరింపఁబడువాఁడు, ద్యులోకసంబంధము గలవాఁడగుటచే, గుర్తింపఁబడుటవలన పరబ్రహ్మముగా నతఁడు పరబ్రహ్మమే యని నిరూపింపఁబడియె.

ఇన్ద్రప్రాణాధికరణము:—అమృతత్వ మనంబడు మోక్షప్రాప్తికి హేతు వగుట పరమకారణవస్తువుకు మాత్రమే ఘటించును గాన, అట్టివాఁడగు పరమ పురుషుఁడే శాస్త్రదృష్టిచే శ్రుతియందు ఇంద్రాదిశబ్దములచేఁ బిలువఁబడుచు న్నాఁడని చెప్పఁబడియె.

ప్రథమపాదఫలితార్థము:—ఇట్లు ఇతరప్రమాణములలోఁ దేనిచేతను తెలిసికొనుట కశక్యుఁడును, సార్వజ్ఞ్యము, సత్యసంకల్పత్వము మొదలగు అపరిమితోదారగుణముల కాకరుఁడగుటంజేసి తనకంటెను వెఱగు సర్వపదా ర్థములనుండియును విలక్షణుఁడును, పరబ్రహ్మమును, పురుషోత్తముఁడు నగు నారాయణుఁడే ఉపనిషత్తులవలనఁ దెలుపఁబడువాఁడని ప్రతిపాదింపఁబడియె.

ద్వితీయ, తృతీయ, చతుర్థపాదముల ఫలితార్థము :—ఉపనిషత్తులనుండి తెలియవచ్చునది బ్రహ్మమే యైనను, కొన్ని యుపనిషద్వాక్యములు ప్రకృతి జీవాంతర్భూతమగు వస్తువిశేషముయొక్క స్వరూపమును దెలుపునవియే యని శంకించి,యట్టి శంకను తొలఁగించి, యా వాక్యములన్నియును బ్రహ్మము కల్యా ణగుణాకరుఁడని తెలుపుచున్నవని ద్వితీయ, తృతీయ, చతుర్థపాదములయందుఁ బ్రతిపాదింపఁబడుచున్నది.

అందు జీవచిహ్నములను అస్పష్టముగాఁ దెలుపు వాక్యముల యర్థము ద్వితీయపాదమున విచారింపఁబడుచున్నది. జీవచిహ్నములను స్పష్టముగాఁ దె లుపు వాక్యముల యర్థము తృతీయపాదమున విచారింపఁబడుచున్నది.చూచాయ గాఁ జీవుని ప్రతిపాదించునవి గాను తెలియవచ్చునట్టి వాక్యముల యర్థము చతుర్థపాదమున విచారింపఁబడుచున్నది.

౧॥ సూ॥ సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్.

టీ॥ (మనోమయః=మనోమయుఁడు, పరమాత్మైవ=పరమాత్మయే, ఏల ననఁగా) సర్వత్ర=ఉపనిషత్తులయందంతటను, ప్రసిద్ధోపదేశాత్ =మనోమయాది విశిష్టుఁడుగాను ప్రసిద్ధముగ పరమాత్మయే యుపదేశింపఁబడి యున్నందున.

తా॥ పరమాత్మయే ఉపనిషత్తులయందంతటను మనోమయత్వాది ధర్మ ములు గలవాఁడు గాను ప్రసిద్ధముగా నుపదేశింపఁబడియున్నందున, ప్రకృతశ్రుతి యందు మనోమయుఁ డనఁగా పరమాత్మయే.

శ్రీ॥ భా॥ ఛందోగులు "అథ ఖలు క్రతుమయః పురుషో యథాక్రతు ర స్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి స క్రతుం కుర్వీత మనోమయః ప్రాణశరీరో భారూపః" (ఛా. 3 ప్ర. ౧౪ ఖం. ౧ వా) అనువాక్యమున "పురు షుఁడు సంకల్పమయుఁడు, ఈ లోకముననున్నప్పుడు ఎవ్విధమైన భావనతోఁ

గూడిన ధ్యానముగలవాఁడగునో, ఈ లోకమును వదలి పైకి పోయినప్పుడును అవ్విధమైన వాఁడగును. కావున మనోమయుఁడనియు, ప్రాణశరీరుఁడనియు, భారూపుఁడనియు నిట్లు ధ్యానము చేయవలసినది" అని యిట్లు పఠించుచున్నారు. ఈ సందర్భమున "సక్రతుం కుర్వీత=అతఁడు ధ్యానింపవలయును" అను తావున విధింపఁబడినట్టి యుపాసనమునందు ఉపాస్యవస్తువు "మనోమయః ప్రాణశరీరః= మనోమయుఁడును ప్రాణశరీరుఁడును" అను వాక్యమున నిర్దేశింపఁబడినట్లు తెలియుచున్నది. ఇందొక సంశయము గలుగుచున్నది.

సంశయము.

ఈ తావున మనోమయుఁడనియు నివ్విధమునఁ బేర్కొనఁ బడినవాఁడు జీవుఁడా? కాక, పరమాత్మయా?

పూర్వపక్షము

అతఁడు జీవుఁడనుట యుక్తము. ఏలననిన, మనఃప్రాణములు జీవునియొక్క యుపకరణములు గదా! ఆథర్వణికులు "అప్రాణోహ్యమనాః" (ము. ౨ ము. ౧ ఖ. ౨ వా) అనువాక్యమున, పరమాత్మ ప్రాణము లేనివాఁడనియు, మనస్సు లేనివాఁడనియు నిట్లు చెప్పియుండుటంజేసి వారు పరమాత్మకు మనఃప్రాణాది సంబంధము లేదనిగదా తెలిపియున్నారు. ఒకవేళ, "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత" అను పూర్వవాక్యమునఁ బేర్కొనఁబడిన బ్రహ్మమును ఈ ప్రకృతవాక్యమున ఉపాస్య వస్తువునుగాఁ గొనియెద ననియెదవా? అట్లు చెప్పఁదగదు. ఏలననిన, ఆవాక్యమున "శాన్త ఉపాసీత=శాన్తచిత్తుఁడై యుపాసించునది" అని యిట్లు ఉపాసనమునకు సాధనభూత మగు శాన్తిని గలుగఁజేయుటకుగాను ఉపాయభూత మగు బ్రహ్మాత్మకత్వానుసంధానమును ఉపదేశించుటకై గదా బ్రహ్మము పేర్కొనఁ బడియెను. ఒకవేళ "సక్రతుం కుర్వీత= అతఁడు ఉపాసించునది" అనువాక్యమున నుపదేశింపఁబడిన యుపాసనము ఉపాస్యవస్తువు నపేక్షించుటంజేసి, బ్రహ్మము వేఱొక్క వాక్యమునఁ జెప్పఁబడినను, దానిని ప్రకృతవాక్యముతో సంబంధించుకొనవచ్చునే? యనియెదవా? అట్లు చెప్పఁదగదు. ఏలననిన, అట్టివేఱొక్క వాక్యమునఁ జెప్పబడిన బ్రహ్మముకు ప్రకృత వాక్య మునఁ జెప్పఁబడిన మనోమయత్వాదిగుణయుక్తమగు దానితో నాకాంక్ష లేదు గదా! మఱియు వేఱొక్క ప్రయోజన మెద్దియును లేకయే నిర్దేశింపఁబడిన "మనోమయః ప్రాణశరీరః" అనుదానికే [1] విభక్తియందు మార్పును గలుగఁ

---

1 ఈతావున "స క్రతుం కుర్వీత" అను వాక్యము "వాఁడు ధ్యానమును చేయునది" అని చెప్పుచున్నది. అది దేనియొక్క ధ్యానమో ఆవస్తువును తెలుపు శబ్దమెద్దియును ఈ తావున లేదు. అందులకై యట్టి పదమును ఈతావున తెచ్చిపెట్టుకొనవలయును. అయితే ఈ వాక్యముననే

జేయుటచే రెంటితో ఆకాంక్ష సిద్ధించును గదా! ఇట్లు ఈపై వాక్యమున "మనోమయః" ఇత్యాది పదములచేఁ జెప్పఁబడిన వాఁడు జీవుఁడే యని నిశ్చయింపఁబడగా, "ఏతద్బ్రహ్మ" అను ఉపసంహారవాక్యముననుండు "బ్రహ్మ" పదము సయితము జీవుని తెలుపుటకై యే గౌరవార్థము ప్రయోగింపఁబడినట్లు నిశ్చయింపఁబడుచున్నది.

## సిద్ధాంతము.

ఈ పైశ్రుతియందు మనోమయుఁడు గాను, ప్రాణశరీరుఁడు గాను నిర్విధమునఁ జెప్పఁబడిన వాఁడు పరమాత్మయే. ఏలననిన, ఉపనిషత్తులయందంతటను పరమాత్మను గుఱించియే ప్రసిద్ధముగా మనోమయత్వాదులు ఉపదేశింపఁబడుచున్నది. ఎట్లనిన, "మనోమయః ప్రాణశరీరనేతా" అనియు, "సఏషోఽన్తర్హృదయ ఆకాశః తస్మిన్నయం పురుషో మనోమయః అమృతో హిరణ్మయః" అనియు "హృదా మనీషా మనసాఽభిక్లృప్తో య ఏనం విదురమృతాస్తే భవన్తి" అనియు, 'న చక్షుషా గృహ్యతే నాపి వాచా" (ము. ౩ ము. ౧ ఖ. ౮ వా) (పరమాత్మ చక్షురింద్రియముచేఁ జూడఁదగినదియును, వాగింద్రియముచే నింత మాత్రమని చెప్పఁదగినదియును కాదు) అనియు, "మనసాతు విశుద్ధేన" (పరమాత్మ పరిశుద్ధమగు మనస్సుచే గ్రహింపఁదగినది) అనియు, అట్లే "ప్రాణస్య ప్రాణః" (కే. ౧ ఖ. ౨ వా) (పరమాత్మ ప్రాణమునకును ఆధారము) అనియు, "అథ ఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి" (కౌ. 3. ౨) అనియు, "సర్వాణి హవా ఇమాని భూతాని ప్రాణమేవాభి సంవిశన్తి ప్రాణ మభ్యుజ్జిహతే" (ఛా. ౧ ప్ర. ౧౧ ఖ.

---

మనోమయాది శబ్దములు కలవు గాన, వానిఁ గొనక, వాక్యాంతరమున నుండు శబ్దములఁ గొనుట న్యాయము కాదు. మఱియు ఈ వాక్యముననుండు మనోమయాది శబ్దములకు వేఱొక ప్రయోజనమున్న లేదు. కావున నీతావున "మనోమయః" ఇత్యాది శబ్దములనే తెచ్చి పెట్టుకొనునది. అయితే ఈతావున "ధ్యానమును చేయవలసినది" అని యున్నది గాన, అది దేనియొక్క ధ్యానమో, దానిని తెలుపునట్టి శబ్దము షష్ఠీవిభక్తియం దుండవలయును. "మనోమయః" ఇత్యాది వాక్యమున నుండు శబ్దములు ప్రథమా విభక్త్యంతములు. కావున వాటిని ఈ వాక్యమునఁ గొని వచ్చినచో, నెట్లు పొసగునంటివేని, చెప్పెదము. ఈ వాక్యముననుండు మనోమయాది పదముల ప్రథమావిభక్తిని షష్ఠీ విభక్తినిగా మార్చుకొనునది. అనఁగా ప్రథమావిభక్తిని షష్ఠీవిభక్త్యర్థమునఁ గొనునది. అప్పుడు రెంటికి ఆకాంక్ష కలుగును. అనఁగా నుపాస్య వస్తువును తెలుపునట్టి మనోమయాది పదములకు ఉపాసనమును తెలుపునట్టి "క్రతుం" అను పదముతోను, ఉపాసనమును తెలుపునట్టి "క్రతుం" అనుపదమునకు ఉపాస్యవస్తువును తెలుపునట్టి "మనోమయః" ఇత్యాది పదములతోనును ఆకాంక్ష సిద్ధించునని భావము.

౫ వా) అనియు నీ మొదలగు శ్రుతివాక్యములు పరమాత్మనే మనోమయత్వాదులచేఁ బ్రసిద్ధునిగాఁ జేర్కొనుచున్నవి. మనోమయుఁడనఁగా పరిశుద్ధమగు మనస్సుచే గ్రహింపఁదగిన వాఁడనుట. ప్రాణశరీరుఁడనఁగా, ప్రాణమునకును ఆధారభూతుఁడును, నియామకుఁడుననుట. ఇట్లు గ్రహించుటచే "ఏష మ ఆత్మా అన్తర్హృదయ ఏతద్బ్రహ్మ" (ఛా. 3 ప్ర. ౧౪ ఖ. ౪ వా) (హృదయములో నుండువాఁడు నాయాత్మ. ఈతఁడు బ్రహ్మము) అను వాక్యముననుండు బ్రహ్మశబ్దమున్ను ముఖ్యార్థముగలది యగుచున్నది. "అప్రాణోహ్యమనాః" అను శ్రుతివాక్యము పరమాత్మయొక్క స్థితి ప్రాణాధీనమైనది కాదనియు, అతని జ్ఞానము మనోధీనమైనది కాదనియు ను తెలుపుచున్నది. ఇంతియే.

☞ ఈ యధికరణమునకు వేఱొక్కవిధముగను భాష్యము చేయఁదగును:—

శ్రీ॥ భా॥ "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత" (ఛా. 3 ప్ర. ౧౪ ఖ. ౧ వా) (బ్రహ్మమునుండి పుట్టి బ్రహ్మమునందుండి బ్రహ్మమును పొందుచుండుటంజేసి సర్వము బ్రహ్మాత్మకమనుకొని శాన్తచిత్తుఁడై యుపాసించునది) అను పూర్వ వాక్యముననే యుపాసనము విధింపఁబడుచున్నది. అనఁగా సర్వము బ్రహ్మాత్మకమని యుపాసించునది యనుట. "స క్రతుం కుర్వీత" (అతఁడు ఉపాసించునది) అను తావుననో, పూర్వ వాక్యమున విధింపఁబడిన గుణములను తెలుపుటకై ఆ యుపాసననే యనువదింపఁబడుచున్నది. ఈ యుపాసనమునం దనుసంధింపవలసిన గుణములు మనోమయత్వాదులు. కావున సర్వాత్మకుఁడగు బ్రహ్మమును మనోమయత్వాది గుణవిశిష్టునిగాను ఉపాసించునదియని యీ పైవాక్యముయొక్క ఫలితార్థము. ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈ తావున "బ్రహ్మ" శబ్దము జీవుని తెలుపునదియా? కాక, పరమాత్మను తెలుపునదియా?

## పూర్వపక్షము.

ఈ తావున "బ్రహ్మ" శబ్దము జీవుని తెలుపునది యనుట యుక్తము. ఏలననిన, బ్రహ్మశబ్ద మట్టిది యగుపక్షముననే, "సర్వం ఖల్విదం బ్రహ్మ=ఇది యంతయును బ్రహ్మమే" అనుతావున "సర్వం=ఇదియంతయు" అను శబ్దముతో బ్రహ్మ మనుపదమునకు సామానాధికరణ్యము అనఁగా "ఇదియంతయును బ్రహ్మమున్ను ఒక్కటియే యనుట" ఉపపన్నమగును. ఎట్లనిన, అందు సర్వం అను శబ్దము బ్రహ్మాది స్తంబపర్యంతముఁగునదియగు సమస్తప్రపంచమును తెలుపు

నది. జీవునికే గదా అనాద్యవిద్యామూలమగు కర్మవిశేష మనెడియుపాధిచే నట్టి బ్రహ్మాది స్తంబపర్యంతముండు ప్రపంచముతో తాదాత్మ్యము గలదు. సర్వజ్ఞుఁడును, సర్వశక్తియుక్తుఁడును, అపహతపాప్మఁడును, నిరస్తసమస్తావిద్యాది దోషగంధుఁడుననగు పరబ్రహ్మముకన్ననో,సమస్తహేయాకరము లగు సర్వవస్తువులతో తాదాత్మ్యము సంభవము కాదు. జీవుని తెలుపుటకుగానును,ఒక్కొక్క-తావున,బ్రహ్మ శబ్దము ప్రయోగింపఁబడుట గలదు.కావుననే సర్వేశ్వరుని తెలుపఁగోరినపుడు పరబ్రహ్మమనియు పరమాత్మయనియు నిట్లు "పర" అను విశేషణముతో పేర్కొనుట గలదు.ప్రత్యగాత్మకు ఈయుపాధిసంబంధము పోయినపుడు, అతఁడు బృహత్త్వమును పొందుట (చాల గొప్పవస్తు వగుట)కలదు."స చానంత్యాయ కల్పతే"(శ్వే. ౫ అ. ౯ వా) (ముక్తుఁడు మేరలేని వాఁడగుచున్నాఁడు) అను శ్రుతివాక్యమున్ను అట్లే తెలుపుచున్నది.అట్టి జీవుఁడే బ్రహ్మవేత్త కాక పోయినచో, వానియెడల జగజ్జన్మస్థితిలయంబులు కర్మనిమిత్తముగ సంభవము లగుటంజేసి "తజ్జలాన్" అను వాక్యము అందులకు గానగు హేతువును తెలుపుచున్నది. "ఈ జీవాత్మ స్వయముగ అపరిచ్ఛిన్నస్వరూపుఁడగుటంజేసి,యతఁడు బ్రహ్మమే యయినను,అనాద్య విద్యామూలముగ దేవ తిర్యఙ్మనుష్య స్థావర స్వరూపుఁడుగా నగుచున్నాఁడు" అనుటయే యీ పై శ్రుతియొక్క యర్థము.

## సిద్ధాంతము.

"సర్వం ఖల్విదం"అని యిట్లు నిర్దేశింపఁబడినట్టి యీ సమస్తప్రపంచమునకు ఆత్మగా విధింపఁబడునది పరబ్రహ్మమే కాని, యది ప్రత్యగాత్మ కాదు. ఏలననిన, "తజ్జలాన్" అని యిట్లు హేతువును గాన్పించి, "సర్వం ఖల్విదం బ్రహ్మ"అని యిట్లు ఒక ప్రసిద్ధవస్తువుగా నుపదేశింపఁబడినందున అట్లు తెలియుచున్నది. అది యెట్లనిన, బ్రహ్మమునుండి గలిగినందునను, బ్రహ్మమున లీనమగుటవలననున్ను, బ్రహ్మాధీనమగు జీవనము గలదియైనందుననున్ను ఈ సమస్త ప్రపంచమున్ను బ్రహ్మాత్మకమని చెప్పుటచే, ఏది జగత్తుయొక్క జన్మస్థితిలయంబులఁ గలుగఁజేయునది గాను ఉపనిషత్తులయందుఁ బ్రసిద్ధమైనదో, అదియే యీతావున బ్రహ్మమని చెప్పఁబడినట్లు తెలియుచున్నది. అట్టిది పరబ్రహ్మమే. ఏలననఁగా, తైత్తిరీయులు "యతోవా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి" (తై. బృ. ౧ అను) అనువాక్యమున, "ఈ సమస్తభూతములును దేనినుండి పుట్టుచున్నవో, దేనివలనఁ జీవించుచున్నవో, దేనియందు లీనమగుచున్నవో, అది బ్రహ్మమని తెలిసికొనుము" అని చెప్పుటకారంభించి, తరువాత, "ఆనన్దో బ్రహ్మేతి వ్యజానాత్ ఆనన్దాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే"

(ఆనందమయుఁడు బ్రహ్మమని యెఱుంగునది. ఆనందమయుని వలనఁగదా సమస్తభూతములును పుట్టుచున్నవి'' ఇత్యాది వాక్యమున, పూర్వానువాకమున మేరలేని యతిశయముతోఁగూడుకొనిన ఆనందము గలవాఁడుగాఁ బ్రతివాదింపఁబడినవాఁడును,సర్వజ్ఞుఁడుగాఁ బ్రతిపాదింపఁబడినవాఁడు నగు పరబ్రహ్మమునుండి సమస్త భూతములును పుట్టుచున్నవని కదా తెలిపి యున్నారు. అట్లే శ్వేతాశ్వతరోపనిషత్తు నందును ''స కారణం కరణాధిపాధిపో నచాస్య కశ్చిజ్జనితా న చాధిపః'' (శ్వే. ౬ అ. ౬ వా) (ఇంద్రియాధి పతియగు జీవుని కధితిపతియగు వాఁడు కారణభూతుఁడు,వానిని పుట్టించిన వాఁడు గాని,నియమించువాఁడు గాని వేఱొక్కఁడు లేడు) అను వాక్యమున,జీవునికధిపతియగు పరబ్రహ్మమే జగత్కారణముగాఁ జెప్పఁబడుచున్నాఁడు. ఇట్లు ఉపనిషత్తులయం దంతటను పరబ్రహ్మమే కారణభూతుఁడుగాఁ బ్రసిద్ధుఁడు. కావున, ఈ ప్రపంచము బ్రహ్మమునుండి పుట్టినదయినందునను,బ్రహ్మమునందు లీనమగునదై నందునను,బ్రహ్మాధీనమగు జీవనము గలది యయినందునను్ను బ్రహ్మాత్మక మగుటంజేసి, దానికి బ్రహ్మముతోఁ తాదాత్మ్యము జెప్పఁబడుట యుపపన్నమే. కావున సర్వప్రకారమును, సర్వశరీరమును, సర్వాత్మభూతమునగు పరబ్రహ్మమును శాన్తచిత్తుఁడై యుపాసించునది యనుచు శ్రుతివాక్యమే పరబ్రహ్మముకు సర్వాత్మకత్వమును ఉపపాదించి, వానిని గుఱించిన యుపాసనమును ఉపదేశించుచున్నది.

పరబ్రహ్మము కారణావస్థగలదియు, కార్యావస్థగలదియునై సూక్ష్మములును స్థూలములునగు చేతనాచేతన పదార్థములు శరీరముగాఁ గలదియగుటంజేసి యెల్లప్పుఁడును సర్వాత్మభూతమైనది. ఇట్టి తాదాత్మ్యము ప్రతిపాదింపఁబడెనేని, పరబ్రహ్మము సకలహేయ ప్రత్యనీక కల్యాణగుణాకరుఁడగుట విరోధింపదు. ఏలననఁగా, ప్రకారభూతమగు శరీరమునందుండు దోషములు ప్రకారియగు (శరీరియగు) ఆత్మతో సంబంధింపవు సరియే కదా, మీఁది మిక్కిలి నిరతిశయైశ్వర్యమును గలుగఁజేయుటచే నవి యొక భాగుకే యని యింతకు పూర్వము ప్రతిపాదింపఁబడియే.

జీవుని కన్నింటితోను తాదాత్మ్యము సంభవమని పూర్వపక్షి వాదించినది యుక్తము కాదు. ఏలననఁగా, జీవులు, ప్రతిశరీరమునను,వేఱువేఱయిన వారగుటంజేసి వారిలోనొక్కనికి వేఱొక్కనితో తాదాత్మ్యముండుట యసంభవము. ముక్తుఁడు మేరలేని స్వరూపము గలవాఁడే యయినను, జగజ్జన్మస్థితి ప్రళయ కారణత్వమునుబట్టి వచ్చినదియగు జగత్తాదాత్మ్యము అతనికుండుట సంభవము కాదని "జగద్వ్యాపారవర్జం". (బ. సూ॥ ౪ అ. ౪ పా ౧౭ సూ) అను సూత్రమునఁ జెప్పఁబడును.

జగత్తుయొక్క జన్మస్థితిలయంబులు జీవుని కర్మములవలనఁ గలుగునవి గాన, అతఁడే కారణభూతుఁడని యిట్లు పూర్వపక్షి వాదించినదియును యుక్తము కాదు. ఏలననిన, ఆ జన్మాదులకు జీవుని కర్మమే నిమిత్తమైనను, జగత్కారణుఁడు పరమాత్మయే. కావున పరమాత్మయే యీ తావున బ్రహ్మశబ్దముచేఁ దెలుపఁబడువాఁడు. ఇవ్విధమగు సూత్రార్థము నే శాస్త్రవేత్తలు అంగీకరించుచున్నారు. వృత్తికారులగు శ్రీ బోధాయనులును "సర్వం ఖల్విఇతి సర్వాత్మా బ్రహ్మేశః" ("సర్వం ఖల్విదం" అనువాక్యమున "సర్వాత్మగాఁ జెప్పఁబడినవాఁడు పరబ్రహ్మమే") అని తెలిపియున్నారు.

౨॥ సూ॥ వి వ క్షి త గు ణో ప ప త్తే శ్చ.

టీ॥ వివక్షితగుణోపపత్తేః-చ=ఇఁకమీఁదు చెప్పఁబడు గుణములు పరమాత్మయందుండుట సంభవ మగుటవలననున్ను.

తా॥ ఇఁకమీఁదు చెప్పఁబోవు గుణములు పరమాత్మకుండుట సంభవ మగుటవలననున్ను, అట్టి వాఁడు పరమాత్మయే.

శ్రీ॥ భా॥ "మనోమయః ప్రాణశరీరో భారూపః సత్యసంకల్పః ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామ స్సర్వగన్ధ స్సర్వరస స్సర్వమిద మభ్యాత్తో ఉవాక్యనాదరః" (ఛాం 3 ప్ర. ౧ ఖ. ౨ వా) అనువాక్యమునఁ జెప్పఁబడిన గుణములు పరమాత్మకే యుండుట సంభవము. అది యెట్లనిన,

మనోమయః:—మనోమయుఁ డనఁగా, పరిశుద్ధ మగు మనస్సుచేతను మాత్రము గ్రహింపఁదగినవాఁడనుట. సర్వేశ్వరుఁడు వివేకము, విమోకము మొదలగు సాధనసప్తకానుష్ఠానముచే నుపకరింపఁబడిన యుపాసనమువలన నిర్మలముగాఁ జేయఁబడినట్టి మనస్సుచే గ్రహింపఁబడుచున్నాఁడు. సర్వేశ్వరుఁడు హేయములకు విరుద్ధములగు కల్యాణగుణములకు ముఖ్యస్థానమగుటచే సర్వపదార్థములకంటెను విలక్షణమైన స్వరూపము గలవాఁడని యిందువలనఁ దెలియుచున్నది. ఏలననిన, మలినపదార్థములే గదా మలినమైన మనస్సుచే గ్రహింపఁదగినవి.

ప్రాణశరీరః:—ప్రాణశరీరుఁ డనఁగా, జగత్తునందలి సమస్తప్రాణములకును ధారకుఁడనుట. అనఁగా ఎవనికి ప్రాణముశరీరము గాను, ఆధేయము గాను, విధేయము గాను, శేషభూతముగాను నుండునో, అట్టివాఁడు ప్రాణశరీరుఁ డనఁబడుచున్నాఁడు. "ప్రాణశరీరః" అనుతావున "శరీర" శబ్దముచే ఆధేయత్వ, విధేయత్వ, శేషత్వములు తెలుపఁబడుచున్నవని యిఁకమీఁదు ఉపపాదింపఁబడును.

భారూపః:—భారూపుఁడనఁగా, భాస్వరమగు(ప్రకాశమానమగు)రూపముగలవాఁడనుట. అనఁగా ప్రకృతి సంబంధములేనిదియు, తనకు మాత్రమే యుండునదియు, అంతకు మించిన దెద్దియును లేనిదియు నగు కల్యాణముగల దివ్యశరీరము గలవాఁడగుటంజేసి నిరతిశయ దీప్తియుక్తుఁడని యర్థము.

సత్యసంకల్పః:—సత్యసంకల్పుఁడనఁగా, తిరుగులేని సంకల్పము గలవాఁడనుట.

ఆకాశాత్మా:—ఆకాశాత్మయనఁగా, ఆకాశమువలెనే సూక్ష్మమును స్వచ్ఛమునగు స్వరూపము గలవాఁడనుట. సమస్తములగు నితర పదార్థములన్నింటికిని కారణభూతమగు నాకాశమునకున్ను ఆత్మ యయినవాఁడనుట గాని, "ఆకాశాత్మా" అను శబ్దముయొక్క యర్థము కావచ్చును. తాను స్వయముగ ప్రకాశించుచు ఇతర వస్తువులను సయితము ప్రకాశింపఁజేయునది యని గాని యీ పైశబ్దముయొక్క యర్థము గావచ్చును.

సర్వకర్మా:—"క్రియత ఇతి కర్మ" అను కర్మశబ్దవ్యుత్పత్తినిబట్టి కర్మమనఁగాఁ జేయఁబడునది యని యర్థము. కావున ఈ జగమంతయుఁ నేవనియొక్క కర్మమో, అనఁగా నెవ్వనిచే సృజింపఁబడుచున్నదో, వాఁడు "సర్వకర్మా" అనఁబడుచున్నాఁడు. ఈ కార్యములన్నియు నెవ్వనివో, వాఁడు సర్వకర్మ యనియును చెప్పవచ్చును.

సర్వకామః:—"కామ్యన్త ఇతి కామాః" అను శబ్దవ్యుత్పత్తినిబట్టి మనము కోరునట్టివి యగు భోగ్యభోగోపకరణాదులు కామములనఁబడుచున్నవి. కావున సర్వకాముఁడనఁగా పరిశుద్ధములును, సర్వవిధములునగు భోగ్యభోగోపకరణాదులు గలవాఁడనుట.

సర్వగన్ధః, సర్వరసః:—"అదృశ్యమస్పర్శం" ఇత్యాది శ్రుతివాక్యము ప్రకృతిసంబంధులగు రసమును గన్ధమున్ను మొదలగునవి సర్వేశ్వరునియందు లేవని తెలుపుటంజేసి, యప్రాకృతములును, తనయందుమాత్రము ఉండునవియును, దోషరహితములును, నిరతిశయములును, కల్యాణములును, తనచే మాత్ర మనుభవింపఁబడునవియును, సర్వవిధములునగు గన్ధ రసము లతనికిఁగలవని యర్థము.

సర్వమిదమభ్యాత్తః:—రసపర్యంతముఁ జెప్పఁబడిన కల్యాణగుణ సమూహము నంతయును స్వీకరించినవాఁడని యర్థము. "భుక్తాః బ్రాహ్మణాః=బుజించిన బ్రాహ్మణులు" అను తావున వలెనే "అభ్యాత్తః" అను శబ్దమునందు "క్త" ప్రత్యయమును కర్త్రర్థమునఁగొనునది.

అవాకీ:—వాక మనఁగా మాట. అవాకీ యనఁగా మాట్లాడనివాఁడనుట. ఏలననఁగా, అనాదరః:—అవాప్త సమస్తకాముఁడగుటచే నాదరింపవలసిన దెద్దియును లేక పోవుటంజేసి, యాదరము లేనివాఁడు. కావుననే యతఁడు అవాకీ అనఁగా మాట్లాడువాఁడుకాఁడు. అతఁడు పరిపూర్ణమగు నైశ్వర్యము గలవాఁడగుటంజేసి బ్రహ్మాదిస్తంబపర్యంతముండు సమస్త జగత్తును తృణీకరించి మాట్లాడక యుండువాఁడని యర్థము.

ఈ పైని యుదహరింపఁబడిన శ్రుతియందుఁ జెప్పఁబడినట్టి గుణములు పరమాత్మకే యుండుట సంభవము.

3॥ సూ॥ అ ను ప ప త్తే స్తు న శా రీ రః.

టీ॥ అనుపపత్తేః—తు=గుణము లుండుట యసంభవ మగుటం జేసి, శారీరః= జీవుఁడు, న=ఈప్రకరణమునఁ జెప్పఁబడ లేదు.

తా॥ శ్రుతియందుఁ జెప్పఁబడిన గుణములు జీవునియందుండుట యసంభవ మగుటంజేసి, యిచట చెప్పఁబడిన వాఁడు జీవుఁడు కాడు.

శ్రీ॥ భా॥ ఖద్యోతప్రాయుఁడును, శరీరసంబంధనిమిత్తమున అపరిమితములగు దుఃఖములతో సంబంధింపఁదగినవాఁడును, బద్ధ ముక్తావస్థలు గలవాఁడునగు జీవునియందు, పూర్వసూత్రమునఁ జెప్పఁబడిన గుణములయొక్క యతిస్వల్పభాగముయొక్క గంధమాత్రమైనను ఉండుట యసంభవము. కావున నిట్టి గుణసాగరమును గుఱించి యోచించు వారికెవ్వరికిని ఈప్రకరణమునఁ జెప్పఁబడిన వాఁడు జీవుఁడనెడి తలంపు కలుగనే కలుగదు.

४॥ సూ॥ కర్మ కర్తృవ్యపదేశాచ్చ.

టీ॥ కర్మ కర్తృవ్యపదేశాచ్చ=పరమాత్మ కర్మగను అనఁగా ప్రాప్యముగను, జీవుఁడు కర్తగను, అనఁగా ప్రాప్తగను ఉపదేశింపఁబడినందునను,

తా॥ పరమాత్మ పొందబడువాఁడు గను, జీవుఁడు పొందువాఁడు గను శ్రుతియందుఁ జెప్పియున్నందున, పరమాత్మ జీవునికంటెను వేఱయినవాఁడని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఛందోగులు "ఏత మితః ప్రేత్యాభిసంభవితాస్మి" (ఛా. 3 ప్ర. ౧४ఖ. ४వా) (ఈలోకమునుండి పైకి పోయి యీ పరమాత్మను బొందినవాఁడను) అనువాక్యమున, పరమాత్మను ప్రాప్యవస్తువునుగాఁ జెప్పియున్నారు. జీవాత్మను నన్ననో, ప్రాప్తనుగాఁ జెప్పియున్నారు. కావున, ప్రాప్తయగు జీవుఁడు ఉపాసించు

వాఁడు, ప్రాప్యమగు పరబ్రహ్మము ఉపాసింపఁబడువాఁడు. కావున ప్రాప్తకంటెను ప్రాప్యవస్తువు వేఱయినదియే యని తెలియుచున్నది.

౫॥ సూ॥ శ బ్ద వి శే షా త్.

టీ॥ శబ్దవిశేషాత్ =శబ్దవిశేషమువలనను.

తా॥ శబ్దవేషమువలనను పరమాత్మయే యుపాస్యుఁడని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఛందోగులు "ఏష మ ఆత్మాఽన్తర్హృదయే" (ఛా.౩ ప్ర.౧౪ ఖ ౩ వా) (నాయొక్క హృదయమునందు ఈయాత్మ) అనువాక్యమున జీవుని "నాయొక్క" అను షష్ఠీవిభక్తితోఁ జెప్పి, ఉపాస్యుఁడగు పరమాత్మను "ఆత్మా" అను ప్రథమా విభక్తితోఁ జెప్పియున్నారు.మఱియు,వాజసనేయుల శ్రుతియందు జీవాత్మ పరమాత్మలను గుఱించి శబ్దవిశేషములు ప్రయోగింపఁబడినవి. ఎట్లనిన, "వ్రీహిర్వా యవో వా శ్యామాకో వా శ్యామాకతండులో వా ఏవ మయమ న్తరాత్మన్ పురుషో హిరణ్మయో యథా జ్యోతి రధూమం" (శతపథ. ౧.౬.౩) అను వాక్యమున(వడ్లగింజంతగాని,యవధాన్యపు గింజంతగాని, శ్యామాకధాన్యమంతగాని, శ్యామాకముయొక్క బియ్యపుగింజంతగాని సూక్ష్మ మగువాఁడగు నంతరాత్మ (జీవుని) యందు హిరణ్మయ పురుషుఁడు పొగలేని జ్యోతిస్సుగా నున్నాఁడు) అని తెలుపుచున్నది. ఈపై శ్రుతియందు "అన్తరాత్మన్" అను సప్తమ్యన్తపదముచే జీవుఁడు తెలుపఁ బడుచున్నాఁడు "పురుషో హిరణ్మయః" అను ప్రథమా విభక్తి పదముచే ఉపాస్యవస్తువు తెలుపఁబడు చున్నది. కావున, పరమాత్మయే యుపాస్యవస్తువు.

౬॥ సూ॥ స్మృ తే శ్చ.

టీ॥ స్మృతేశ్చ=స్మృతివాక్యములనుండియును.

తా॥ స్మృతివాక్యములనుండియును ఇట్లే తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఈక్రిందు గాన్పింపఁబడు హేతువులవలనను ఉపాస్యవస్తువు జీవునికంటెను వేఱయినదని తెలియుచున్నది. "సర్వస్యచాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిః జ్ఞాన మపోహనం చ" (భ. గీ ౧౫ అ. ౧౫ శ్లో) (ఓ అర్జునా! నేను ప్రతివానియొక్కయును హృదయమునం దున్నవాఁడను. నానుండియే స్మరణమును, జ్ఞానమును, ఊహయును గలుగుచున్నవి) అనియు, "యో మామేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమం" (భ.గీ ౧౫ అ.౧౯ శ్లో) (ఓ అర్జునా! ఎవఁడు భ్రాంతిబొందనివాఁడై నన్ను ఇట్లు పురుషోత్తమునిగాఁ దెలిసికొనుచున్నాఁడో) అనియు, "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామ

యాన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా తమేవ శరణం గచ్ఛ"(భ.గీ. ౧౮ అ. ౬౧ శ్లో) (ఓ అర్జునా! ఈశ్వరుఁడు సమస్త జంతువులయొక్కయును హృదయమునందున్నవాఁడై శరీరమనఁబడు యంత్రమునం దుండునట్టి వానిని సత్త్వరజస్తమోగుణముల మూలముగ భ్రమింపఁజేయుచున్నాఁడు. కావున వానినే శరణమునుగాఁ గొనుము) అనియు నీమొదలగు స్మృతివాక్యములు జీవుని ఉపాసకుని గానును, పరమాత్మను ఉపాస్యవస్తువును గానును తెలుపుచున్నవి.

౭॥సూ॥అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతిచేన్న నిచాయ్యత్వాదేవంవ్యోమవచ్చ

టీ॥ అర్భకౌకస్త్వాత్ =ఇచట పేర్కొనఁబడిన పురుషుఁడు స్వల్పమైన స్థానము గలవాఁడుగాఁ జెప్పఁబడుటంజేసియు, తద్వ్యపదేశాచ్చ = బహుస్వల్ప పరిమాణము గలవాఁడుగాఁ జెప్పఁబడుటంజేసియును, న=అతఁడు పరమాత్మ కాఁడు, ఇతిచేత్ =ఇట్లంటివేని, న=అట్లు చెప్పఁదగదు. (ఏలననఁగా) ఏవం= ఇట్లు, నిచాయ్యత్వేన=ఉపాస్యుఁడుగాను చెప్పఁబడినందున, ఏలననఁగా, వ్యోమవచ్చ=అట్టివాఁడు ఆకాశమువలె నపరిచ్ఛిన్నుఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు.

తా॥ మనోమయత్వాదివిశిష్టుఁడుగాఁ జెప్పఁబడిన పురుషుఁడు అల్పస్థానముగలవాఁడు గాను, అణుపరిమాణుఁడుగానును శ్రుతులయందుఁ జెప్పఁబడినందున, పరమాత్మ కాఁడంటివేని, యది యుక్తము కాదు. ఏలననఁగా, అతఁడు అట్లు ఉపాసింపఁబడుటకుగాను అట్టి వాఁడుగాఁ జెప్పఁబడియె. కనుకనే అనంతర వాక్యము అతని స్వరూపమును అపరిచ్ఛిన్నమయిన దానిసిగాఁ దెలుపుచున్నది.

ఆ క్షే ప ము.

శ్రీ॥ భా॥ సూత్రమునందు "అర్భకౌకస్త్వాత్" అనఁగా, అతి స్వల్పమైన స్థానము గలది యగుటవలన"అనియు,"తద్వ్యపదేశాత్"అనఁగా అత్యంత స్వల్పమైన పరిమాణము గలదిగాఁ జెప్పఁబడుటవలన" అనియు నర్థము."ఏషమ ఆత్మాఽన్తర్హృదయే" (ఛా. 3 ప్ర. ౧౪ ఖం. 3 వా) (హృదయము లోపల నుండు నాయొక్కయాత్మ) అను శ్రుతివాక్యము "అత్యంతస్వల్పమగు హృదయముననుండు వానినిగాఁ" జెప్పుటవలనను, "అణీయాన్ వ్రీహేర్వా యవాద్వా" ఇత్యాది శ్రుతివాక్యము "అతఁడు వడ్లగింజకంటెను గాని ఆవ గింజకంటెను గాని చిన్నవాఁడు"అనుచు అతని స్వరూపమును బహు స్వల్పమైన దానినిగాఁ దెలుపుటవలనను అట్టివాఁడు పరమాత్మ కాఁడు. అయితే యెవఁడు జీవుఁడే.ఏల ననఁగా, శ్రుతులు పరమాత్మను గుఱించి చెప్పునపుడు, "సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః" అనువాక్యమున "ఏది సమస్తభూతిములకును కారణభూతమైనదో, దానిని అంతట నుండు దానినిగానును, సూక్ష్మబుద్ధిచేఁ దెలియఁదగిన దానిని గానును,నాశరహితమైన దానిని గానును

జ్ఞానులు చూచుచున్నారు"అని తెలుపుచున్నది.జీవుని గుఱించి యున్ననో, బహు సూక్ష్మమైన వానిని గాను తెలుపుచున్నవి.

—సమాధానము—

అట్లు చెప్పఁదగదు. పరమాత్మయే యుపాసనార్థము బహుస్వల్పమైన వస్తువుగాఁజెప్పఁబడుచున్నాఁడు. సూత్రమున "నిచాయ్యత్వాత్" అనఁగా ,,అట్లు ఉపాసింపఁబడుటవలన" అని యర్థము. ఇంతియె కాని, అట్లు బహు స్వల్పవస్తువుగా నుండుట యతని స్వరూపమే యనుటకాదు. ఈప్రకరణముననే యతఁడు ఆకాశమువలెనే యపరిచ్ఛిన్నుఁడని చెప్పియుండుటం జేసి యతనికి స్వభావికమగు మహత్త్వము చెప్పఁబడుచున్నది. అది యెట్లనిన, "జ్యాయాన్ పృథివ్యాః జ్యాయా నంతరిక్షాత్ జ్యాయాన్ దివో జ్యాయానేభ్యో లోకేభ్యః" అను శ్రుతివాక్యము "పృథివికంటెను గొప్పవాఁడు, అంతరిక్షముకంటెను గొప్పవాఁడు. ద్యులోకముకంటెను గొప్పవాఁడు. ఈ లోకములకంటెను గొప్పవాఁడు" అని చెప్పుచున్నది. కావున పరమాత్మ ఉపాసనోపయోగమునకు గానే శ్రుతులయందు బహుస్వల్ప వస్తువుగాఁ జెప్పఁబడుచున్నాఁడు.

అదియెట్లనిన,శ్రుతులు "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాన్త ఉపాసీత"(ఇది యంతయును బ్రహ్మమునుండి పుట్టి, బ్రహ్మము వలనఁజీవించి, బ్రహ్మములోఁ బ్రవేశించుటంజేసి బ్రహ్మాత్మకము. కావున, శాన్తచిత్తుఁడై యుపాసించునది) అను వాక్యమున,ఈ సమస్తవస్తువులముయొక్కయును జన్మస్థితిలయంబులకుఁ గారణమగుటంజేసి యీసమస్తమునకు నాత్మగాను లోపల ప్రవేశించి యీసమస్తమును జీవింపజేయుటచేతనున్ను బ్రహ్మము సర్వాత్మకమని యుపాసించునది" యని విధించి "అథ ఖలు క్రతుమయః పురుషో యథా క్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి"అను వాక్యమున, ఉపాసనమున కనుగుణముగ ఫలము గలుగునని చెప్పి, "స క్రతుం కుర్వీత"అను వాక్యమున గుణములను విధించుటకై యుపాసనము ననువదించి, "మనోమయః ప్రాణశరీరో భారూపః సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామః సర్వగన్ధః సర్వరసః సర్వమిదమభ్యాత్తో ఽవాక్యనాదరః" అనువాక్యమున, జగదైశ్వర్యవిశిష్టుఁడగు వానియొక్క స్వరూపగుణములను ఉపాసనమున నుపసంహరించుకొనవలసిన వానినిగాఁ బ్రతిపాదించి, "ఏష మ ఆత్మాఽన్తర్హృదయేఽణీయాన్ వ్రీహేర్వా యవాద్వా సర్షపాద్వా శ్యామాకాద్వా శ్యామాకతండులాద్వా" అనువాక్యమున, ఉపాసకుని హృదయము సూక్ష్మవస్తువగుటచే నందుండుపరమాత్మయును సూక్ష్మమయినవాఁ డనుచు, ఉపాసకుని యాత్మగా నుపాసింపవలసినవాఁ డగు పరమపురుషునియొక్క యుపాసనార్థమగు స్థితిని తెలిపి, "ఏషమ ఆత్మాఽన్తర్హృదయే జ్యాయాన్ పృథివ్యా జ్యా

యా నంతరిక్షాత్ జ్యాయాన్ దివో జ్యాయానేభ్యో లోకేభ్యః సర్వకర్మా సర్వకామ స్సర్వగన్ధ స్సర్వరస స్సర్వమిదమభ్యాత్తో ఒవాక్యనాదరః" అను వాక్యమున, హృదయమునందుండినవాఁడై యుపాసింపఁబడు వాఁడగు ప్రాప్యవస్తువుయొక్క అకారమును నిర్దేశించి, "ఏష మ ఆత్మాఒన్తర్హృదయే ఏతద్బ్రహ్మ" అనువాక్యమున, ఇట్టిదియగు పరబ్రహ్మము పరమకారుణ్యమువలన మనల నుజ్జీవింపఁజేయవలయు ననెడి యిచ్ఛతో మన హృదయమునం దుండుటచే మన కత్యంత సమీపమున నుండువాఁడనెడి యనుసంధానమును విధించి, "ఏత మితః ప్రేత్యాభిసంభవితాస్మి" అనువాక్యమున, ఉపాసనమునకనుగుణముగానే ఫలము గలుగుననెడి యనుసంధానమును విధించి, "ఇతి యస్య స్యాదద్ధా న విచికిత్సాస్తీతి" ఇత్యాదివాక్యమున, ఇట్లు ఫలము గలుగుననెడి నిశ్చయముగల యుపాసకునికి ఫలము గలుగువిషయమై సంశయము లేదనిచెప్పి, అంతటితో ముగింపుచున్నవి. కావున పరమాత్మ స్వల్పస్థానముననుండు వాఁడనియు, అణుస్వరూపుఁడనియును శ్రుతులయందుఁ జెప్పియుండుట యుపాసనమునకు గానని తెలియుగునది.

౮॥ సూ॥ సమ్భోగప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్.

టీ॥ సమ్భోగప్రాప్తిః=సుఖదుఃఖానుభవము సంభవించును, ఇతిచేత్ = ఇట్లంటివేని,న=అది యుక్తముకాదు. (ఏలననఁగా) వైశేష్యాత్ =హేతువునందు భేద మున్నందున,

తా॥ జీవునివలెనే పరమాత్మయును శరీరములో నుండువాఁడగు పక్షమున, అతనికివలెనే యీతనికిని సుఖదుఃఖానుభవము కలదని ప్రసక్తించునంటివేని, యది యుక్తము కాదు. ఏలననఁగా, అందులకుగానగు హేతువునందు భేదమున్నది.

శ్రీ॥ భా॥ జీవునివలెనే పరమాత్మయును శరీరము లోపలనుండువాఁడని యంగీకరించుపక్షమున, వానివలెనే యీతఁడును శరీరసంబంధ మూలకము లగు సుఖదుఃఖముల ననుభవించువాఁడని ప్రసక్తించునంటివేని, యట్లు చెప్పఁదగదు. అందులకు గానగు హేతువునందు భేదముగలదు.శరీరములోపలనుండుట మాత్రమే సుఖదుఃఖానుభవమునకు హేతువు గాదు. అయితే యది పుణ్యాపాప రూపములగు కర్మములకు పరవశుఁడుగా నుండుట. అట్లుండుటయో, అపహతపాప్ముఁడగు పరమాత్మకు అసంభవము. అట్లే గదా! "తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి"(ఆత్మ పరమాత్మలలో, ఆత్మ రుచికరమగు కర్మఫలము ననుభవించుచున్నది, పరమాత్మయన్ననో, ఊరక చూచుచున్నది) అను శ్రుతివాక్యము తెలుపుచున్నది.

—సర్వత్రప్రసిద్ధ్యధికరణము ముగిసెను.—

## అత్త్రధికరణము.

అవతారిక:—ఇట్లు పరమాత్మ భోక్త కాని పక్షమున, ఉపనిషత్తుల యందంతటను భోక్తగాఁ దెలియఁబడు వాఁడు జీవుఁడే కావలసివచ్చునని శంకింపఁగా, అట్టి శంకను పరిహరించుటకై

౯॥ సూ॥ అత్తా చరాచర గ్రహణాత్.

టీ॥ అత్తా=భోక్తగాఁ దెలియఁబడువాఁడు పరమాత్మయే. ఏలననఁగా, ఈ తావున, చరాచరగ్రహణాత్=స్థావరజంగమ పదార్థలఁ బేర్కొనినందున,

తా॥ స్థావరజంగమ పదార్థములనన్నింటిని భుజించువాఁడుగాఁ జెప్పియున్నందున, అట్టివాఁడు పరమాత్మయే.

శ్రీ॥ భా॥ కాఠకులు "యస్య బ్రహ్మచ క్షత్రం చ ఉభే భవత ఓదనః । మృత్యుర్యస్యోపసేచనం క ఇత్థా వేద యత్ర సః" (కఠ ౧ అ. ౨ వల్లి ౨౫వా) అను వాక్యమున, "బ్రాహ్మణజాతియు క్షత్రియజాతియును ఏవనికి ఆహారమో, మృత్యువు ఎవనికి ఆహారముతోఁగూడ నంజుకొను పదార్థమో, అతఁడు ఎట్టివాఁడో ఎవ్వఁడెఱుంగును" అని పఠించుచున్నారు. ఈతావున నొక సంశయము గలుగుచున్నది.

### సంశయము

ఇందు "ఓదన"మనియు "ఉపసేచన" మనియు నీ శబ్దములచే సూచింపఁబడిన భోక్త జీవుఁడేనా? కాక, అతఁడు పరమాత్మయా?

### పూర్వపక్షము.

అతఁడు జీవుఁడనుట యుక్తము. ఏలననఁగా, కర్మమూలమునఁ గదా భోక్త యగును. అట్లగుట జీవునికే సంభవము.

### సిద్ధాంతము.

ఈ పైశ్రుతియందు భోక్తగాఁ (భుజించువాఁడుగాఁ) దెలియవచ్చువాఁడు పరమాత్మయే. ఏలననఁగా, స్థావరజంగమాత్మకమగు ఈ జగత్తు నంతయును భుజించుట యనునది వానికే సంభవము. ఈ తావున కర్మమూలకమగు భోక్తృత్వము చెప్పఁబడలేదు. అయితే జగజ్జన్మస్థితిలయంబులకు హేతుభూతుఁడును, పరబ్రహ్మమునగు విష్ణువుయొక్క సంహర్తృత్వము (అన్నింటిని తన లోనికిఁ దీసికొనుట) ఈ తావునఁ జెప్పఁబడినది. "సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం" (కఠ ౧ అ. ౩ వ: ౯ వా) అను శ్రుతివాక్యమున "విష్ణువు ఈ సమస్త పదార్థములును చేరునట్టి స్థానముగాను తెలుపఁబడుటచే

నిట్లు తెలియుచున్నది. ((మృత్యుర్యస్యోప సేచనం" అను శ్రుతివాక్యము ((మృత్యువు యెవనికి ఉపసేచనమో" అని తెలుపుటవలనను, బ్రహ్మక్షత్రాది స్థావరజంగమాత్మకమగు జగమంతయును ఆహారముగాను గ్రహింపఁబడుచున్నది. తాను స్వయముగాఁదినఁబడి వేఱొక్కదానిని తినఁబడునట్లుచేయుటకు సాధనభూతమైనది కదా ఉపసేచనమనఁబడును. ఈ తావున ఉపసేచనము గాను మృత్యువు గూడ తినఁబడుటంజేసి,అట్టి మృత్యువున కాహారభూతమును, బ్రహ్మక్షత్రాది పూర్వకమును, స్థావరజంగమాత్మకమునగు సమస్తప్రపంచము భుజింపఁబడుటయే యీతావునఁ జెప్పఁబడినట్లు తెలియుచున్నది. ఇట్టి భోజనము ఉపసంహారమే. కావున నిట్టి జగదుపసంహార రూపమగు భోక్తృత్వము పరబ్రహ్మముకే సంభవము.

౧౦॥ సూ॥ ప్ర క ర ణా చ్చ.

టీ॥ ప్రకరణాత్ — చ = ప్రకరణమునుబట్టియును.

తా॥ ప్రకరణమునుబట్టియును ఇట్లే తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఇది పరబ్రహ్మమును తెలుపునట్టి ప్రకరణము. ఏలననిన, ((మహాన్తం విభుమాత్మానం మత్వా ధీరో న శోచతి" (కఠ ౧ అ. ౨ వ. ౨౨ వా) (గొప్పవాఁడును, వ్యాపకుఁడునగు పరమాత్మను ధ్యానించి జ్ఞానియగువాఁడు సంసారదుఃఖము నొందడు)అనియు((నాఽయమాత్మా ప్రవచనేన లభ్యో నమేధయా న బహునా శ్రుతేన యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వాం" (కఠ ౧ అ. ౨ వ. ౨౩ వా) ఈ పరమాత్మ ధ్యానముచేతను, బుద్ధిచేతను, ఎక్కువగా వినుటచేతను మాత్రము పొందబడుడు అయితే యెవఁడు పరమాత్మను ప్రేమించుచున్నాఁడో, వానిచే నతఁడు పొందబడుచున్నాఁడు. అట్టివానికే యతఁడు తనస్వరూపమును బాగుఁగాఁగానఁబఱచుచున్నాఁడు) అనియు నిట్లు పరమాత్మను గుఱించియే కదా యీ ప్రకరణమునఁ జెప్పఁబడుచున్నది. ((క ఇత్థా వేద యత్ర సః" అను శ్రుతివాక్యమున్ను సర్వేశ్వరుని యనుగ్రహములేనిచో నతనిని తెలిసికొనుట దుర్లభమని తెలుపుచు, పై శ్రుతియందుఁ జెప్పిన విషయమునే స్మరింపఁజేయుచున్నది.

అవతారిక:—ఈ తావున బ్రహ్మక్షత్రాదిరూపమగు నాహారముచే సూచింపఁబడిన పురుషుఁడు అపహతపాప్మఁడగు పరమాత్మ కాదు. ఏలననఁగా,అనంతరము ''ఋతం పిబన్తౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధ్యే ఛాయాతపౌ బ్రహ్మ విదో వదన్తి పఞ్చాగ్నయో యే చ త్రిణాచికేతాః''(కఠ. ౧అ. ౩ వ. ౧ వా) (కర్మఫలమగు ఈ శరీరమున కర్మఫలము ననుభవించువారును ఉత్కృష్టమునగు హృదయగుహాయం దుండువారును, ఎండనీడల

వలెనే పరస్పరము విలక్షణు లగువారిని బ్రహ్మవేత్తలును పంచాగ్నివిద్యానిష్ఠులును తెలిసికొనుచున్నారు) అనువాక్యమున, కర్మఫలము ననుభవించువాఁడే గదా రెండవదానితోఁ గూడియుండువాఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. అట్టి రెండవది ప్రాణము గాని, బుద్ధి గాని కాఁదగును. ఇచట చెప్పఁబడిన ఋతపానము కర్మఫలభోగమే.అది పరమాత్మకు అసంభవము. భోక్తయగు జీవుని కుపకరణము లగు బుద్ధి ప్రాణములకు యేదొక విధమున కర్మఫలభోగముతో సంబంధముండును. ఆ రెంటిలో దేనితోనైన నొక్కదానితోఁ గూడియుండునట్టి జీవుఁడే యీతావునఁ బ్రతిపాదింపఁబడుచున్నాఁడు. ఇది యొక్కటియే ప్రకరణ మైనందున, ఇంతవరకును జెప్పఁబడిన బ్రహ్మక్షత్రభక్షకుఁడను జీవుఁడే యని చెప్పఁదగును.

## ౧౧॥ సూ॥ గుహాంప్రవిష్టావాత్మానౌ హి తద్దర్శనాత్.

టీ॥ గుహాం=హృదయగుహను, ప్రవిష్టౌ =ప్రవేశించిన వారుగాఁ జెప్పఁబడిన వారు, ఆత్మానౌ=జీవాత్మ పరమాత్మలు. హి=ఏలననఁగా, తద్దర్శనాత్ = అట్లు శ్రుతియందుఁ గానఁ బడుటవలన,

తా॥ హృదయగుహను ప్రవేశించిన వారుగా ప్రకృతశ్రుతియందుఁ జెప్పఁబడిన వారు జీవాత్మ పరమాత్మలు. అట్లే గదా శ్రుతులవలనఁ దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఈతావున హృదయగుహలోఁ బ్రవేశించి ఋతపానముఁ జేయువారుగాఁ జెప్పఁబడినవారు జీవ ప్రాణములు గాని,బుద్ధిజీవులు గాని కారు. అయితే జీవాత్మ పరమాత్మలే యట్టివారుగాఁ జెప్పఁబడుచున్నారు. ఏలననిన, ఈ ప్రకరణమున జీవాత్మ పరమాత్మలకే హృదయగుహాయందుఁ బ్రవేశము గానఁబడుచున్నది. అదియెట్లనిన, "తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణం అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి" (చూచుటకశక్యుఁడును, అవిద్యామూలకముగఁ గానఁబడనివాఁడును,హృదయమునం దుండువాఁడును, ఆత్మాన్తర్యామియును, సనాతనుండు నగు పరమాత్మను జ్ఞానులు ధ్యానించుటచేఁ జూచుచున్నారు '' అనువాక్యమున, పరమాత్మ హృదయగృహాయం దుండునట్టివాఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. "యా ప్రాణేన సమ్భవత్యదితిర్దేవతామయీ గుహాం ప్రవిశ్య తిష్ఠన్తీ యా భూతేభిర్వ్యజాయత'' (ప్రాణముతోఁ గూడ నుండునదియు, ఇంద్రియాధీనమగు భోగముగలదియు, హృదయపుండరీకము ననుండునదియు, కర్మఫలముల ననుభవించునదియగు జీవుఁ డనఁబడునది పృథివ్యాదిభూతములతోఁ గూడినదై దేవాదిరూపముగ నానావిధములుగాఁ బుట్టుచున్నది)అను శ్రుతివాక్యమున జీవునికిని హృదయగుహాప్రవేశము జెప్పఁబడుచున్నది.

కావున ,,కర్మఫలము ననుభవించువారు" అని ఈపైశ్రుతియందు జెప్పఁబడిన దానిని ,,[1]గొడుగులవారు పోవుచున్నారు" అన్నట్లు గ్రహించునది. కావున వారిద్దఱిలో, ఒకఁడు కర్మఫలము ననుభవించువాఁడును, వేఱొక్కఁడు అట్లు అనుభవింపఁజేయువాఁడు నగుటంజేసి యుభయులకును కర్మఫలానుభవమునఁ గర్తృత్వము సంభవము.

౧౨॥ సూ॥ విశేషణాచ్చ.

టీ॥ విశేషణాచ్చ=విశేషణమువలనను.

తా॥ శ్రుతులయందు జీవాత్మ పరమాత్మలు విశేషింపఁబడినందునను అట్లు తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఈ ప్రకరణమునందంతటను జీవాత్మ పరమాత్మలు ఉపాస్యత్వ ఉపాసకత్వ విశిష్టులు గాను, ప్రాప్యత్వ ప్రాపకత్వ విశిష్టులుగాను అనఁగా పరమాత్మ ఉపాస్యుఁడు గాను జీవాత్మ ఉపాసించువాఁడు గాను, పరమాత్మ పొందఁబడువాఁడు గాను, జీవాత్మ పొందువాఁడు గానును జెప్పఁబడుచున్నారు. అది యెట్లనిన, కాఠకులు "బ్రహ్మజజ్ఞం దేవమీడ్యం విదిత్వా నిచాయ్యేమాం శాన్తి మత్యన్తమేతి" (కఠ ౧ అ. ౧ వ. ౧౭వా.) అనువాక్యమున, "జీవుని బ్రహ్మాత్మకునిగా నెఱింగి ధ్యానించి ఈ శాన్తిని బొందుచున్నాఁడు" అని పఠించుచున్నారు. ఈ పై వాక్యమున బ్రహ్మ జజ్ఞుఁడనఁగా జీవుఁడని యర్థము. జీవుఁడు బ్రహ్మమువలనఁ బుట్టినవాఁడును, జ్ఞానముగలవాఁడును గదా? ,,అట్టి యుపాసకుఁడగు జీవుని బ్రహ్మాత్మకునిగాఁ దెలిసికొని" అని యీ వాక్యముయొక్క యర్థము. అట్లే వీరు ,,యస్సేతురీజానానా మక్షరం బ్రహ్మ యత్పరం అభయం తితీర్షతాం పారం నాచికేతం చికేమహి" (కఠ.౧ అ. ३ వ. ౨ వా) అనువాక్యమున, "ఎవ్వఁడు కర్మిష్ఠులకు ఫలమునిచ్చువాఁడో, ఎవ్వఁడు వికారరహితుఁడగు పరబ్రహ్మమో, ఎవ్వఁడు సంసారమును దాటుటకిచ్ఛయించువారలకు దృఢమైన తీరమో, మఱియు నెవ్వఁడు నాచికేతాగ్ని యనఁబడు కర్మము ననుష్ఠించుటచేఁ బొందఁదగినవాఁడో, వానిని ఉపాసింపగలము" అని చెప్పుటచే నుపాస్య వస్తువగు పరమాత్మను జెప్పియున్నారు, మఱియు వీరు, "ఆత్మానం రథినం విద్ధి

(1) అనేకులు గొడుగులను వేసికొని పోవునపుడు వారిలో కొందఱికి గొడుగులు లేకపోయినప్పటికిని, మొత్తముమీద ,,గొడుగులు వేసికొనినవారు పోవుచున్నారు" అని చెప్పుట లోకమునఁ గలదు గదా! అట్లే, ప్రకృతమునను, జీవాత్మ పరమాత్మలలో, జీవాత్మమాత్రము కర్మఫలము ననుభవించునదై పరమాత్మ దాని ననుభవింపనిదియే యైనను, మొత్తముమీద ఉభయులను, ఈ పైని గనఁబఱచిన న్యాయప్రకారము, కర్మఫలభోక్తలనుగాఁ జెప్పుట దోషము కాదు.

శరీరం రథ మేవచ" (కఠ. ౧ అ. ౩ వ. ౯ వా) అనువాక్యమున "ఆత్మను సారథిని గాను శరీరమును రథమును గాను తలంచునది'' అనుటచే జీవుని ఉపాసకుని గాఁ జెప్పుచున్నారు. అట్లే వీరు "విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం'' (కఠ. ౧ అ. ౩ వ. ౯ వా) అనువాక్యమున "ఎవఁడు బుద్ధిని సారథినిగాఁగలవాఁడో, మనస్సును కళ్లెమునుగాఁ గలవాఁడో, అట్టివాఁడు మార్గాంతమున నుండునదియగు విష్ణువుయొక్క పరమపదమును బొందుచున్నాఁడు" అనుటచే జీవాత్మను ప్రాప్తను గాను పరమాత్మను ప్రాప్యవస్తువును గానును జెప్పియున్నారు. ప్రకృతముననను, "ఛాయాతపౌ=ఎండనీడలవంటివారు" అనుటచే అజ్ఞుఁడగు జీవుఁడును, సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరుఁడును విశేషించి చెప్పఁబడుచున్నారు.

ఒకవేళ, "యేయం ప్రేతే విచికిత్సా అస్తీత్యేకే నాఽయమస్తీతి చైకే" (కఠ ౧ వ.౧ వా) అను వాక్యమున, „మృతుఁడయిన వానిని గుఱించి యాతఁడు ఉన్నాఁడని కొందఱును, లేనే లేడని మఱి కొందఱును చెప్పుచు వివాదపడుచున్నారు. ఈ విషయమును గుఱించి చెప్పుమా" యని నచికేతుఁ డడిగినట్లు కాఠకులు పఠించుటచే, వీరు ఉపక్రమమున, జీవస్వరూపముయొక్క యాథాత్మ్యమును గుఱించిన ప్రశ్నను చెప్పియున్నారు గాన, నిదియంతయును జీవుని గుఱించిన ప్రకరణము గానే తెలియుచున్నదని శంకించెదరేమో? అట్లు శంకింపఁ దగదు. ఏలననిన, దేహేంద్రియాద్యతిరిక్తుఁడుగా జీవుఁడగు వాఁడు కలడా? లేడా? అని సంశయము గలుగుటచే నిట్లు ప్రశ్నించియుండలేదు. అట్లగునేని, యింతకు పూర్వము జెప్పిన రెండు వరములను నచికేతుఁడు కోరియుండుట సంభవింపదు. ఎట్లనఁగా, తండ్రి సర్వవేదస దక్షిణ మనఁబడు క్రతువు నొనర్చి, యది పూర్తియగునపుడు, ఇచ్చిన దక్షిణలు అనుకూలములైనవి కానందున, క్రతువున్ను అనుకూలమైనది కాకపోవునేమో యని తలంచి, పుత్రుఁడగు నచికేతుఁడు ఎక్కువ ఆస్తికుఁ డగుటచే తనతండ్రి తన నిచ్చివేయుటచే తన తండ్రికి మంచి కలుగునేమో యని తలంచి, "కస్మై మాం దాస్యసి=ఎవ్వనికి నన్నిచ్చెదవు" అని యిట్లు పలుమాఱు అడిగెను.

ఇట్లు పలుమాఱు అడిగి, అందు మూలముగ నిర్బంధించుటచే తండ్రి కోపించుకొని, „నిన్నుయమునికిచ్చెదను" అని చెప్పఁగా పితృవాక్యమునలన నతఁడు యముని గృహంబున కేతెంచి, అట్టి సమయమున యముఁడు గృహమునందు లేకపోవుటచే నతఁడు మూఁడురాత్రులు ఉపవాసము చేసెను. అంతట యముఁడే తెంచి, నచికేతుని యుపవాసమువలన భీతిఁజెంది, అందులకై ప్రతీకారము నొనర్చుటకుగాను, మూఁడువరములను కోరుమని నచికేతునితోఁ జెప్పెను. నచికేతుఁడు ఆస్తికాగ్రేసరుఁ డగుటం జేసి, తన విషయమై తనతండ్రికి దయవచ్చు

గాకయని మొదటి వరమునఁ గోరెను. దేహమునకంటెను వేఱుగ జీవుఁడనఁబడు వాఁడొక్కఁడు కలడని తెలియనివాని విషయమున, నిది యంతయును అసంభవ మగును. మఱియు, రెండవవరమున, ఈశరీరమును విడిచిన తరువాత అనుభవింపఁబడునట్టి ఫలమునకు సాధనభూతమగు నగ్నివిద్య కోరబడెను. అదియును, దేహముకంటెను వేఱుగ ఆత్మ యనఁబడునది యొక్కటి కలదనెడి జ్ఞానము లేనివాని కుండుట, యసంభవము.మూఁడవ వరమున"యేయం ప్రేతే విచికిత్సాస్తి త్యేకే నా యమస్తీతి చైకే, ఏతద్విద్యా మనుశిష్ట స్త్వయాహం వరాణా మేష వర స్తృతీయః"(మృతినొందినవాని కెద్దియయిన నుత్తమగతి కలదని కొందఱును, లేదని మఱి కొందఱును వివాదపడుచున్నారు. ఓ యముఁడా ! ఈ విషయము గుఱించి నాకుఁ దెలుపుమా! ఇదియే మూఁడవ వరము" అని యడుగఁబడియె. ఈ తావున,పరమపురుషార్థమనఁ బడు బ్రహ్మమును బొందుట యనెడి మోక్షము యొక్క యథార్థస్వరూపమును గుఱించి తెలిసికొనుటకై,యందులకు ఉపాయభూతమగు పరమాత్మోపాసనముయొక్కయు, ఆత్మ పరమాత్మలస్వరూపము యొక్కయును యాథాత్మ్యమును తెలిసికొనుట కిచ్చయించి, ఈపైని గనఁబఱచిన ప్రకారము ప్రశ్నింపఁబడియే. ఈ పైశ్రుతియందు "యేయం ప్రేతే=మృతినొందినవాని విషయమున" అను తావున, శరీరవియోగము మాత్రము చెప్పుట యందు తాత్పర్యము కాదు. అయితే ,,సర్వబంధములును విడిపోయినవాని విషయమున" అని చెప్పుటయందు తాత్పర్యము "న ప్రేత్య సంజ్ఞాస్తి" అను తావున వలెనే యీతావున నెఱుంగునది. మోక్షార్హుఁడగు మనుష్యుఁడు మృతినొందినపుడు అనఁగా సర్వబంధ వినిర్ముక్తుఁడయినపుడు వాని స్వరూపమును గుఱించి యనేకుల కనేకవిధములగు భిన్నాభిప్రాయములు గలవు. అందువలన నట్టివాని కెద్దియయిన నుత్తమగతి కలదా? లేదా? అనెడి సంశయము గలుగుచున్నది. అట్టి సంశయము పోవుటకై వాని స్వరూపమును గుఱించి యథార్థముగఁ దెలిపితివేని, తెలిసికొనెదనని నచికేతుఁ డడిగెను. మోక్షస్వరూపమును గుఱించి భిన్నాభిప్రాయములు లోకమునఁ గలవు. ఎట్లనిన.

కొందఱు కేవలజ్ఞానమాత్రుఁడగు నాత్మయొక్క స్వరూపము నశించుటయే మోక్షమని తెలుపుచున్నారు.

మఱి కొంద ఱట్లు జ్ఞానమాత్రస్వరూపుఁడే యగు నాత్మయొక్క యవిద్య నశించుటయే మోక్షమని చెప్పుచున్నారు.

మఱి కొందఱు పాషాణప్రాయుఁడగు నాత్మయొక్క జ్ఞానానందాదిరూపములగు సమస్త విశేషగుణములను నశింపఁగా,కైవల్యరూపమగునదియే మోక్షమని తెలుపుచున్నారు.

మఱి కొందఱు పరమాత్మ అపహతపాప్ముఁడని యంగీకరించుచు, అట్టి వానికే యుపాధిసంబంధమువలన జీవభావము గలిగి, యట్టి యుపాధిసంబంధము పోవుటచే బ్రహ్మభావము గలుగుటయే మోక్షమనుచున్నారు.

వేదాంతశాస్త్రమునం దెక్కువ ప్రావీణ్యము గలవారన్ననో, నిఖిల జగదేకకారణుఁడును, అశేషహేయ ప్రత్యనీకానన్త జ్ఞానానందైక స్వరూపుఁడును, స్వాభావికానవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణాకరుఁడును, సకలేతర విలక్షణుఁడును, సర్వాత్మభూతుఁడును నగు పరబ్రహ్మముయొక్క శరీరమగుటం జేసి వానియొక్క ప్రకారమయినవాఁడును, అనుకూలాపరిచ్ఛిన్నజ్ఞానస్వరూపుఁడును, పరమాత్మానుభవైకరసుఁడును, అనాద్యవిద్యచే తిరోహితమైన స్వరూపముగల జీవునికి అట్టి యవిద్య పోవుటచేఁ గలుఁగునదియు, స్వాభావికమునగు పరమాత్మానుభవమే మోక్షమని చెప్పుచున్నారు.

ఈతావున నచికేతుఁడు మోక్షస్వరూపమును, అట్టి మోక్షమును గలుగఁజేయుటకు సాధనభూతమగు నుపాసనమును తెలుపుమని యముని నడుగఁగా, యముఁడును అట్టి విషయమును దెలిసికొనుట దుర్లభమని తెలుపుచు నానావిధములగు భోగముల నీయజూపి, యందు మూలముగ నచికేతుని పరీక్షించి, యతనికి యోగ్యత గలదని తెలిసికొని, యంతట ఆత్మ పరమాత్మలను గుఱించిన తత్త్వజ్ఞానమును, పరమాత్మోపాసనమును, పరమపదమును బొందుట యనఁబడు మోక్షమునున్ను "తం దుర్దర్శం గూఢమనుప్రవిష్టం" అని యారంభించి, "సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం" అను వరకును ఉపదేశించి, అందులకుఁ గావలసిన విశేషముల నుపదేశించెను. కావున నిదియంతయును సరి యయినదియే. కావున నీతావున భోక్తగాఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయే యని సిద్ధమగుచున్నది.

అత్త్రధికరణము ముగిసెను.

---

### అన్తరాధికరణము.

#### ౧౩॥ సూ॥ అన్తర ఉపపత్తేః॥

టీ॥ అన్తరః=నేత్రములో నుండువాఁడుగా శ్రుతియందుఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయే. ఏలననఁగా, ఉపపత్తేః=అందుఁ బేర్కొనఁబడిన గుణములు పరమాత్మకే యుండుట సంభవ మగుటవలన.

తా॥ నేత్రములో నుండువాఁడుగా శ్రుతియందుఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయే. ఏలననఁగా, అందుఁ బేర్కొనఁబడిన గుణములు పరమాత్మయందే యుండుట సంభవము.

శ్రీ॥ భా॥ ఛందోగులు ''య ఏషో ఉక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మేతి హోవాచ ఏతదమృత మేతదభయ మేతద్బ్రహ్మ'' (ఛా. ౪ ప్ర. ౧౫ ఖ. ౧ వా) అనువాక్యమున ''ఈ నేత్రమునందే పురుషుఁడు గానఁబడుచున్నాఁడో, ఈతఁడే యాత్మ. ఈతఁడు అమృతమును, అభయమును నగుబ్రహ్మము'' అని చెప్పియున్నారు. ఈతావున నొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈ పై శ్రుతియందు నేత్రముననుండువాఁడుగాఁ జెప్పఁబడిన పురుషుఁడు ప్రతిబింబరూపమైన వాఁడా? కాక, అతఁడు చక్షురింద్రియము నధిష్ఠించియుండునట్టి దేవతావిశేషమా? జీవుఁడా? పరమాత్మయా?

## పూర్వపక్షము.

అతఁడు ప్రతిబింబాత్మకుఁడగుట యుక్తము. కావుననే యతఁడు అందఱికిని తెలిసినవాఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. మఱియు, శ్రుతియందు ''కానఁబడుచున్నాఁడో'' అనుటచే ప్రత్యక్షముగ గానఁబడువాఁడు గానును చెప్పఁబడుచున్నాఁడు.

అథవా, అతఁడు జీవాత్మ యనియును చెప్పవచ్చును. జీవాత్మ చక్షుస్సునందు విశేషముగా నుండుటంజేసి, యచట ఉండువాఁడుగా నతఁడు ప్రసిద్ధుఁడు. నేత్రము తెఱచియుండుటఁ జూచిగదా! శరీరమునందుండు జీవాత్మయొక్క స్థితిగతులను లోకులు నిశ్చయించుచున్నారు.

అథవా, ''రశ్మిభిరేషో ఉస్మిన్ ప్రతిష్ఠితః'' (ఈతఁడు రశ్ములచే నేత్రమున నుంచబడియున్నాఁడు) అనుశ్రుతి ప్రసిద్ధినిబట్టి యట్టివాఁడు నేత్రమునందుఁ బ్రతిష్ఠచేయఁబడిన దేవతావిశేషమైనను కావచ్చును.

కావున, ఈపైని గానఁబఱచినవారిలో నెవ్వఁడైనను, చక్షుస్సునందుండువాఁడగు విషయమై లోకమునఁ బ్రసిద్ధి గలదు గాన,నందుండువాఁడుగాఁ జెప్పఁబడినవాఁడు వీరిలో నొక్కఁడు కాఁదగుననిన,

## సిద్ధాంతము.

నేత్రముననుండువాఁడుగా శ్రుతియందుఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయే. ఏలననఁగా, ''ఏష ఆత్మేతి హోవాచైతదమృతమేత దభయమేతద్బ్రహ్మ ఏతం సంయద్వామ ఇత్యాచక్షతే ఏతం హిసర్వాణ్యాభిసంయన్తి ఏష ఉ ఏవ వామనిః ఏష హి సర్వాణి వామాని నయతి ఏష ఉ ఏవ భామనిః ఏష హి సర్వేషు లోకేషు భాతి'' (ఛాం. ౪ ప్ర. ౧౫ ఖ. 3 వా) (ఈతఁడు ఆత్మ. ఈ యాత్మ జననమరణములులేనిదియు,సంసారభయములేనిదియు,బృహత్త్వము గలదియు,

ఇది సంయద్వామని యని చెప్పఁబడుచున్నది. ఏలననఁగా, ఈతనినుండియే సమస్తములగు కర్మఫలములును గలుగుచున్నవి. ఈతఁడే సమస్తకర్మఫలములకు నాయకుఁడైనందున నామని యని పిలువఁబడుచున్నాఁడు. ఈతఁడు సమస్తలోకముల యందును ప్రకాశించుచున్నందున భామని యనియును పిలునఁబడుచున్నాఁడు) అను శ్రుతివాక్యమునఁ జెప్పఁబడిన గుణములు పరమాత్మకే యుండుట సంభవము.

౧౪॥ సూ॥ స్థా నా ది వ్య ప దే శా చ్చ.

టీ॥ స్థానాదివ్యపదేశాత్ - చ = చక్షుస్సునందు స్థితి మొదలగునవి పరమాత్మకుండునవి గాను శ్రుత్యంతరమునందుఁ జెప్పఁబడియున్నందునను.

తా॥ చక్షుస్స్థితి మొదలగునవి పరమాత్మకే యుండునవి గాను శ్రుత్యంతమునఁ జెప్పఁబడినందునను, ప్రకృతమున చక్షుస్సునందుండు వాఁడుగాఁ జెప్పఁబడిన వాఁడు పరమాత్మయే.

శ్రీ॥ భా॥ "య శ్చక్షుషి తిష్ఠన్" ఇత్యాది శ్రుతివాక్యమున చక్షుస్సునందుండుటయు, చక్షుస్సును నియమించుటయు నీ మొదలగునవి పరమాత్మవి గాను జెప్పఁబడినందునను, "య ఏషో౽క్షిణి పురుషః" ఇత్యాది శ్రుతివాక్యమునఁ జక్షుస్సునందుండు వాఁడుగాఁ జెప్పఁబడు వాఁడు పరమాత్మయే యని తెలియుచున్నది. కావున చక్షుస్సునం దుండునది యొక ప్రసిద్ధవస్తువుగాఁ జెప్పఁబడుటయును పరమాత్మవిషయమున సంభవమగుచున్నది. యోగాభ్యాసపరులచే పరమాత్మ చూడఁబడుటం జేసి "చూడఁబడుచున్నాఁడు" అని శ్రుతియందుఁ జెప్పియుండుటయును, ఈ పైని గానఁబఱచిన హేతువులననే, యుపపన్నమగుచున్నది.

౧౫॥ సూ॥ సు ఖ వి శి ష్టా భి ధా నా దే వ చ.

టీ॥ సుఖవిశిష్టాభిధానాత్ - ఏవ - చ = సుఖవిశిష్టుఁడుగాఁ జెప్పఁబడినవాఁడే చక్షుస్సునందుండు వాఁడుగాఁ జెప్పఁబడినందునను.

తా॥ ప్రకృతమున సుఖవిశిష్టుఁడుగాఁ జెప్పఁబడిన పరబ్రహ్మమే ఉపాసనమునకై చక్షుస్సునందుండు వాఁడుగాఁ జెప్పఁబడుటం జేసియును, ఈతఁడు పరబ్రహ్మమే.

శ్రీ॥ భా॥ ఈ కింద గాన్పింపఁబడు హేతువులనను చక్షుస్సునందుండు వాఁడుగాఁ జెప్పఁబడిన పురుషుఁడు పరమాత్మయే. ఎట్లనిన, "ఖం బ్రహ్మ కం బ్రహ్మ" ఇత్యాది పూర్వవాక్యమున సుఖవిశిష్టుఁడుగాఁ జెప్పఁబడిన బ్రహ్మమే, ప్రకృతమున ఉపాసనార్థము స్థానమును విధించుటకు గాను, సంయద్వామత్వాది గుణములను విధించుటకు గానును "య ఏషో ౽క్షిణిపురుషః" ఇత్యాది

వాక్యమున, చక్షుస్సునందుండు వాఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. సూత్రము నందుండు "ఏవ" అను పదము ఇచట గానఁబఱచిన హేతువు వేఱొక్కదాని నపేక్షించునది కాదని సూచింపుచున్నది.

శంక:—మధ్యను, అగ్నివిద్యను పఠించి యుండుటంజేసి, వ్యవధాన ముండుటవలన "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" (ఛా. ४ ప్ర ౧౦ఖ ౫వా)అను వాక్యమునఁ జెప్పఁబడిన బ్రహ్మము ప్రకృత వాక్యమునకు సామీప్యమున నుండునది కాదు. అదియెట్లనిన, అగ్నులు, "ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ"అనువాక్యము, "ప్రాణము బ్రహ్మము, సుఖము బ్రహ్మము, ఆకాశము బ్రహము" అనుటచే బ్రహ్మమును గుఱించి యుపదేశించి "అథ హైనం గార్హపత్యోఽను శశాస"(ఈతనికి గార్హపత్యాగ్ని యుపదేశించెను)అనువాక్యము మొదలుకొని అగ్న్యుపాసనమును ఉపదేశించిరి. ఈతావున నుపదేశింపఁబడినట్టి యగ్నివిద్య బ్రహ్మవిద్య కంగమనియును చెప్పఁదగదు.ఏలననఁగా: బ్రహ్మవిద్యాఫల ముతోఁ జేరక యుండునదియు, దానితో విరోధించునదియునగు ఆయుర్దాయప్రాప్తి, సన్తతికి విచ్ఛేదము గలుగకుండుట మొదలగునది గదా అట్టి యగ్ని విద్య యొక్క ఫలముగాఁ జెప్పఁబడినది.

సమాధానము:—చెప్పెదను. "ప్రాణో బ్రహ్మ" అనుతావునను, "ఏతదమృత మేతదభయ మేతద్బ్రహ్మ" అతావునను, ఈ రెండు తావులను, బ్రహ్మశబ్దము వినఁబడుచుండుటవలనను, "ఆచార్యస్తు తే గతిం వక్తా"(ఛా ४ప్ర ౧४ ఖ౧వా) (ఆచార్యుఁడు నీకు మోక్షమార్గమును జూపింపఁగలడు) అనెడి యగ్ని వచనమువలననున్ను గత్యుపదేశమునకు పూర్వము బ్రహ్మవిద్య ముగింప కున్నందున, ఈ మధ్యను జెప్పఁబడిన అగ్ని విద్య బ్రహ్మ విద్యయొక్క యంగమని నిశ్చయింపఁబడుచున్నది. "అథ హైనం గార్హపత్యోఽను శశాస" అను వాక్యమున బ్రహ్మవిద్యాధికారికి అగ్నివిద్యను ఉపదేశించినట్లు చెప్పియున్నందునను అట్లు నిశ్చితమగుచున్నది. "వ్యాధిభిః పరిపూర్ణోఽస్మి" అనువాక్యమునఁ జెప్పియున్నట్లు, బ్రహ్మప్రాప్తివ్యతిరిక్తములగు నానావిధకామముల ద్వారా గర్భ, జన్మ,జరా,మరణాది సంసారభయముచే పీడితుఁడైనట్టి యీ యుపకోసలునికి అగ్నులు"ఏషా సోమ్య తేఽస్మద్విద్యా ఆత్మవిద్యా చ" (ఓ సోమ్యుఁడా ఇది మమ్ములను గుఱించిన యుపాసనమును, ఆత్మోపాసనమున్ను) అను వాక్యమున, రెండు ఉపాసనములనున్ను అనఁగా ఆత్మోపాసనముతో నగ్న్యుపాసనమునున్ను జేర్చి యుపదేశించుట వలననున్ను అగ్నివిద్య మోక్షైకఫలమగు బ్రహ్మవిద్యయొక్క యంగమని తెలియవచ్చుచున్నది. ఈపైని గనఁబఱచిన హేతువులనుబట్టి యగ్నివిద్య బ్రహ్మవిద్యయొక్క యంగ మగుచుండఁగా, శ్రుతు

లయందు అగ్నివిద్యకు ప్రత్యేకముగ ఫలమును జెప్పుట అగ్నివిద్యను స్తుతిం చుట గానని యెఱుంగునది. ఇంతియెకాక, ఇచట మోక్షవిరుద్ధమగు ఫలమెద్ది యును చెప్పఁబడలేదు. ఏలననఁగా "అపహతే పాపకృత్యాం లోకీ భవతి సర్వ మాయురేతి జ్యోగ్జీవతి నాస్యాపర పురుషాః క్షీయన్తే ఉపవయన్తం భుఞ్జామో౽స్మింశ్చ లోకే౽ముష్మింశ్చ" అనువాక్యమునఁ జెప్పఁబడిన ఫల ములు మోక్షాధికారికి అనుకూలము లయినవియే కదా! ఎట్లనిన, ఈ వాక్య మున, "అహపహతే పాపకృత్యాం" అనఁగా, ,,అగ్నివిద్య బ్రహ్మప్రాప్తివిరోధి యగు పాపకర్మమును నశింపఁజేయుచున్నది" యని యర్థము. "లోకీభవతి" అనఁగా,,అట్లు మోక్షవిరుద్ధమగు పాపము నశింపఁగా, నతఁడు బ్రహ్మలోకమును బొందుచున్నాఁడు"అని యర్థము."సర్వమాయురేతి" అనఁగా"బ్రహ్మోపాస నము పూర్తియగుటంకుఁ గావలసిన యాయుర్దాయము నంతయు నతఁడు పొందు ను"అని యర్థము. "జ్యోగ్జీవతి"అనఁగా ,,వ్యాధులచే పీడింపఁబడక,బ్రహ్మప్రాప్తి గలుగు వరకును జీవించుచున్నాఁడు"అని యర్థము"నాస్యాపరపుషాః క్షీయన్తే" అనఁగా, ,,ఈతని శిష్యప్రశిష్యాదులును, పుత్రపౌత్రాదులును బ్రహ్మవేత్తలే యగుదురు"అని యర్థము.ఇది"నాస్య బ్రహ్మవిత్కులే భవతి"(ఈతని వంశము న బ్రహ్మవేత్త కానివాఁడుండఁడు)అను శ్రుత్యన్తరమునను,బ్రహ్మవిద్యా ఫలముగ జెప్పఁబడుచున్నది. "ఉపనయన్తం భుఞ్జామః అస్మింశ్చ లోకే౽ముష్మింశ్చ" అనఁగా,,అగ్నులమగు మేము మమ్ముల నుపాసించునట్టి యాతనిని ఈలోకము నను పరలోకమునను బ్రహ్మప్రాప్తి గలుగువరకును విఘ్నములనుండి రక్షించు చున్నారము" అనియర్థము. ఇట్లు అగ్నివిద్య బ్రహ్మవిద్యయొక్క యంగమగుటం జేసి యిది దీనియొక్క సమీపమున నుపదేశింపఁబడుట విరుద్ధము కాదు గాన, పూర్వవాక్యమున సుఖవిశిష్టమయినదిగాఁ జెప్పఁబడిన బ్రహ్మమే ప్రకృతవాక్య మున ఉపాసనాస్థానమును విధించుటకు గానును, ఉపాస్యగుణములను తెలుపు టకు గానును చెప్పఁబడుచున్నది.

శంక:—"ఆచార్యస్తు తే గతిం వక్తా" అనువాక్యమునఁ జెప్పి యున్న ప్రకారము,గతిని తెలుపుటయే మిగిలి యున్నది గాన, ఆచార్యుఁడు ఉపదేశింప వలసినది గతియే యని తెలియుచున్నది. ఇట్లుండ, ప్రకృతమున, ఉపాసనాస్థాన మున్ను ఉపాస్యగుణములున్ను ఉపదేశింపఁబడుచున్నవని యెట్లుచెప్పఁదగును?

సమాధానము:—చెప్పెదను. "ఆచార్యస్తు తే గతింవక్తా" (ఆచార్యుఁ డు నీకు గతిని తెలుపఁగలడు) అనువాక్యముయొక్క యభిప్రాయము నిట్లు యె ఱుంగునది:—

బ్రహ్మవిద్యను ఉపదేశింపకయే ఆచార్యుఁడు దేశాంతరమున కేఁగెంచ గా, బ్రహ్మవిద్య లభింపక పోవుటచే దుఃఖయగు ఉపకోసలుని ఉజ్జీవింపఁజేయు

టకై యాచార్యుని యగ్నులు ఉపకోసలుని యుపచరణమువలన సంతోషించినవై వానికి బ్రహ్మస్వరూపమును, అందుల కంగభూతమగు అగ్నివిద్యనున్ను ఉపదేశించి, ,,ఆచార్యాద్ధేవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపత్" (ఆచార్యునివలననే తెలిసికొనిన వాని విద్య మిక్కిలి బాగుండును) అను శ్రుతియొక్క యర్థమును ఆలోచించి,యీతని విద్య ఎక్కువ బాగుగానుండుటకై యీతనికి ఆచార్యుఁడే సంయద్వామత్వాది గుణవిశిష్టమగు బ్రహ్మమును, అట్టి బ్రహ్మోపాసనమునకు గానగు స్థానమును,అర్చిరాది మార్గమునున్ను ఉపదేశించుగాక" యని తలంచి ,,ఆచార్యస్తు తే గతిం వక్తా" (ఆచార్యుఁడు నీకు గతిని తెలుపఁగలఁడు" అని చెప్పినవారైను. ఈ పైవాక్యమున గతిని నిర్దేశించుట యనునది ఆ గతి బ్రహ్మవిద్య కంగమని తెలియఁజేయుటకు గానని యెఱుంగునది. అట్లే, యాచార్యుఁడును ,,అహం తు తే తద్వక్ష్యామి యథా పుష్కర పలాశ ఆపో న శ్లిష్యన్తే ఏవమేవంవిది పాపం కర్మ న శ్లిష్యతే" (ఏ వస్తువును తెలిసికొనిన వానిని,తామరాకును ఉదకము లంటనట్లు, పాపము లంటవో,ఆ వస్తువును గుఱించి నీకుఁ దెలిపెదను) అని యిట్లు చెప్ప నారంభించి, సంయద్వామత్వాది గుణవిశిష్టమగు బ్రహ్మమును నేత్రస్థానమున నుండునట్టిదానిని గాను ఉపాసించుటను, అర్చిరాదిమార్గమునున్ను ఉపదేశించెను, కావున, ,,కం బ్రహ్మ ఖం బ్రహ్మ" అనువాక్యమున సన్నద్ధమగు సుఖవిశిష్టమగు బ్రహ్మమే ప్రకృతవాక్యమునఁ జెప్పఁబడుటం జేసి, యీతావున, నేత్రముననుండు వాఁడుగాఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయే.

అవతారిక:—"కం బ్రహ్మ ఖం బ్రహ్మ" అను వాక్యమునఁ జెప్పఁబడిన పరబ్రహ్మమే ప్రకృతమున నేత్రముననుండునది గాను చెప్పఁబడిన దంటిరే? అయితే "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" అను వాక్యమున పరబ్రహ్మము తెలుపఁబడుచున్నదని మీ కెట్లు తెలియును? "కం బ్రహ్మ ఖం బ్రహ్మ" అనఁగా, "సుఖము బ్రహ్మము ఆకాశము బ్రహ్మము" అని యర్థము గాన, ,,పంచభూతములలో నొక్కటి గాను ప్రసిద్ధమగు నాకాశమునున్ను లౌకిక సుఖమునున్ను బ్రహ్మమునుగా భావించి యుపాసించునది" అని గదా యీతావున విధింపఁబడుచున్నట్లు తెలియుచున్నది. అది యెట్లనిన, "నామ బ్రహ్మ" (నామమును బ్రహ్మమునుగా భావించి యుపాసించునది) అనియు,,,మనో బ్రహ్మ" (మనస్సును బ్రహ్మమునుగా భావించి యుపాసించునది) అనియు నీ మొదలగు వాక్యముల వంటిదియే గదా యీ పైవాక్యము సయితము. ఇట్లు శంకింపగా,నట్టి శంకను పరిహరించుటకై:—

౧౭॥ సూ॥ అత ఏవ చ స బ్రహ్మ.

టీ॥ అత ఏవ చ=ఈ హేతువువలననే, సః=నేత్రమునందుండు వాఁడుగాఁ జెప్పఁబడిన పురుషుఁడు, బ్రహ్మ=పరబ్రహ్మము.

తా॥ ఈ పైని గానఁబఱచిన హేతువువలననే నేత్రమునందుండు వాఁడుగాఁ జెప్పఁబడిన వాఁడు పరబ్రహ్మమని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఈ తావున "యదేవ కం తదేవ ఖం" (ఏది సుఖమో, అదియే యాకాశము) అను వాక్యమున, సుఖవిశిష్టమగు నాకాశము పేర్కొనఁబడుటం జేసియే "ఖం" అనుశబ్దముచేఁ దెలుపఁబడునట్టి యాకాశము బ్రహ్మమని తెలియుచున్నది. అదియెట్లనిన, అగ్నులు "ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ) (ప్రాణము బ్రహ్మము "కం" బ్రహ్మము "ఖం" బ్రహ్మము)అని చెప్పఁగా, ఉపకోసలుఁడు" "విజానామ్యహం యత్ప్రాణో బ్రహ్మ కం చ ఖం చ న విజానామి" (ప్రాణము బ్రహ్మమను మాట నాకు తెలుసును. అయితే "కం" అనుదానిని "ఖం" అనుదానినిన్ని నేనెఱుంగను.) అని బదులుచెప్పెను. దీని యభిప్రాయము నిట్లు ఎఱుంగునది.

ఈ తావున ప్రాణాదులను బ్రహ్మమునుగా భావించి యుపాసించుట యనఁబడునట్టి [1]ప్రతీకోపాసనమును అగ్నులు ఉపదేశించి యుండలేదు. ఏలననిన, జన్మమరణాదిరూపమగు సంసారమువలన భీతినొందినవాఁడగు ముముక్షువుకు బ్రహ్మమును ఉపదేశించుటకైగదా అగ్నులు ఉద్యమించినవి. కావున నిచట బ్రహ్మమే ఉపాస్యవస్తువుగా నుపదేశింపఁబడినది."ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ" అను వాక్యమున, ప్రసిద్ధములగు ప్రాణసుఖాకాశములతో సామానాధికరణ్యమున (ప్రాణము బ్రహ్మము అని యిట్లు) బ్రహ్మము నిర్దేశింపఁబడినది. జగత్తుకు ధారకుఁడగుటచేఁ గాని, ప్రాణమును శరీరమునుగాఁ గలవాఁడగుటవలన ప్రాణమును నియమించువాఁ డగుటం జేసి గాని, బ్రహ్మము ఆప్రాణాదులలో, ప్రాణముతోఁ గూడియుండినవాఁడగుట సంభవము. కావున, ఉపకోసలుఁడు "విజానామ్యహం యత్ప్రాణో బ్రహ్మేతి" (ప్రాణము బ్రహ్మమని నాకు తెలుసును) అని చెప్పెను. అట్లే సుఖమును ఆకాశమును ఈరెండున్ను బ్రహ్మముకు శరీరభూతము లైనందున తన్నియామ్యములగుచు,నందుమూలముగ బ్రహ్మముకు విశేషణ భూతము లగుచున్నవా? కాక, అవి యన్యోన్యము వ్యవచ్ఛేదకములగుటచే (సుఖమెంతయో, ఆకాశమంత, ఆకాశమెంతయో, సుఖమంత అని యిట్లు తెలుపుటచే) నిరతిశయానంద స్వరూపమగు బ్రహ్మముయొక్క స్వరూ

1. చతుర్థాధ్యాయము ౭౧ పేజీని 2 వ వివరణమును జూడుము.

షమును దెలుపుచు, నివ్విధముగ బ్రహ్మముకు విశేషణము లగుచున్నవా? అందు పరస్పరము వేఱువేఱయినవగు సుఖాకాశములు బ్రహ్మముకు శరీరభూతము లగుచు, నందుమూలముగ బ్రహ్మముకు విశేషణములగు పక్షమున, విషయసుఖమునకును భూతాకాశమునకున్ను నియామకమైనది బ్రహ్మమే కావలసి వచ్చును. అందువలన బ్రహ్మస్వరూపమిట్టిది యని తెలియకపోవును. అట్లు కాక, అవి యన్యోన్యము వ్యవచ్ఛేదకములగుచు, నందుమూలముగ, బ్రహ్మముకు విశేషణములగు పక్షమున, బ్రహ్మము అపరిచ్ఛిన్నానందైక స్వరూపమగును. కావున, ఈపైని గనఁబఱిచిన, రెండువిధములలో నెవ్విధమున నవి బ్రహ్మముకు విశేషణము లగుచున్నవో, ఆవిషయమును నిశ్చయింపఁదలఁచి, ఉపకోసలుఁడు «కంచ ఖంచ న విజానామి" అనిచెప్పెను. ఉపకోసలునియొక్క యభిప్రాయమును అగ్ను లెఱింగి, «యద్వావ కం తదేవ ఖం, యదేవ ఖం తదేవ కం" (ఏది సుఖమో, అదియే యాకాశము అనఁగా అపరిచ్ఛిన్నమైనది. ఏది యపరిచ్ఛిన్నమైనదియో, అదియే సుఖము) అని బదులు చెప్పినవారాయెను. బ్రహ్మముయొక్క సుఖరూపమగు రూపము అపరిచ్ఛిన్నమైనదని యర్థము.

కావున, ఏ బ్రహ్మము ప్రాణము శరీరముగాఁ గలది యగుటచే ప్రాణవిశిష్టమైనదియో, ఆ బ్రహ్మమే అపరిచ్ఛిన్నమగు సుఖమే స్వరూపముగాఁ గలది యనుచు నిట్లు «ప్రాణంచ హాస్మై తదాకాశం చోచుః" అను వాక్యముతో నీ విషయము ముగించెను. కావున «కం బ్రహ్మం ఖం బ్రహ్మ" అను తావున, అపరిచ్ఛిన్నసుఖమగు బ్రహ్మము ప్రతిపాదింపఁబడుటంజేసి, బ్రహ్మమే యీ ప్రకరణమున ప్రతిపాదింపఁబడినది. ఆ బ్రహ్మమే, ప్రకృతవాక్యమున, నేత్రమున నుండునది గాను చెప్పఁబడినది. కావున నేత్రమున నుండువాఁడుగాఁ జెప్పఁబడిన వాఁడు పరమాత్మయే.

౧౭॥ సూ॥ శ్రు తో ప ని ష త్క గ త్య భి ధా నా చ్చ.

టీ॥ శ్రుతోపనిషత్కగత్యభిధానాత్-చ=ఉపనిషత్తుల యందుఁ బ్రతిపాదింపఁ బడిన పరమపురుషునిఁ దెలిసికొనిన వానిచే ననుసంధింపవలసిన అర్చిరాది మార్గము ఈ యక్షి పురుషోపాసకునికి ఉపదేశించి యున్నందునను,

తా॥ ఉపనిషత్తులయందుఁ బ్రతిపాదింపఁబడిన పరమపురుషునిఁ దెలిసికొనినవానిచే ననుసంధింపవలసినట్టి యర్చిరాదిమార్గమును ఈ నేత్రమునందుండు పురుషుని యుపాసించునట్టి వానికి ఉపదేశించియున్నందునను, నేత్రమునందుండునట్టి వాఁడుగాఁ జెప్పఁబడినవాఁడు పరబ్రహ్మమే.

శ్రీ॥ భా॥ పరమపురుషునియొక్క స్వరూపమును యదార్థముగాఁ దెలిసికొనినవానిచే ననుసంధింపవలసినది గాను శ్రుతులయందుఁ బ్రతిపాదింపఁబడి

నట్టిదియు, పునరావృత్తిరహితముగ పరమపురుషుని బొందించునట్టిదియు నగు నేయర్చిరాదిమార్గము కలదో, ఆ మార్గమును నేత్రమునందుండు పురుషుని తెలిసికొనిన ఉపకోసలునికి «తేఽర్చిష మేవాభి సంభవ న్త్యర్చిషోఽహ రహ్న ఆపూర్యమాణపక్షం" (ఛా. ౪ ప్ర. ౧౫ ఖ. ౫ వా) (బ్రహ్మవేత్తలు అర్చిస్సును బొంది అర్చిస్సునుండి అహస్సును అహస్సునుండి ఆపూర్యమాణపక్షమును బొందుదురు; అని చెప్పనారంభించి «చంద్రమసో విద్యుతం తత్పురుషోఽమానవస్స ఏనాన్ బ్రహ్మ గమయత్యేష దేవపథో బ్రహ్మపథ ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తన్తే" (ఛా. ౪ ప్ర. ౧౫ ఖ. ౬ వా) (తరువాత వారు చంద్రునిబొంది చంద్రునినుండి విద్యుత్తును బొందుచున్నారు. అప్పుడు అమానవపురుషుఁడు వీరిని పరబ్రహ్మమును బొందించుచున్నాఁడు. ఈ మార్గము దేవపథ మనియు బ్రహ్మపథ మనియును పిలువఁబడుచున్నది. ఈ మార్గమునఁ బోయినవారు మరల ఈ లోకమునకు రారు) అని వరకును ఉపదేశించియున్నారు. ఈ హేతువును బట్టియును నేత్రమునం దున్నట్టివాఁడుగాఁ జెప్పబడిన పురుషుఁడు పరమాత్మయే యని తెలియుచున్నది.

౧౪॥ సూ॥ అనవస్థితేరసంభవాచ్చ నేతరః

టీ॥ ఇతరః=ప్రతిబింబము మొదలగునది, న=అక్షిపురుషుఁడు కాఁడు. (ఏలననఁగా,) అనవస్థితేః=అది స్థిరముగా నుండనందునను, అసంభవాచ్చ= అమృతత్వాదులు దానియం దుండుట యసంభవ మగుటవలనను,

తా॥ నేత్రమునం దుండునదిగాను చెప్పఁబడినది ప్రతిబింబము మొదలగునది కాదు. ఏలననఁగా, అది స్థిరముగా నుండునది కాదు. మఱియు అమృతత్వాదులు దానియందుండఁ జాలవు.

శ్రీ॥ భా॥ నేత్రమునందుండువాఁడు గాను శ్రుతియందుఁ జెప్పఁబడిన వాఁడు పరమాత్మకంటెను వేఱగు ఛాయ (ప్రతిబింబము) మొదలగునది కాదు ఏలననఁగా, ప్రతిబింబాదులు నేత్రమునందు నియతముగా నుండునవి కావు. మఱియు వేఱొక్క నిమిత్తము నపేక్షించని యమృతత్వాదులట్టి ప్రతిబింబాదులకుండుట యసంభవము. అది యెట్లనిన, వేఱొక్కపురుషుఁడు ఎదురుగ నిలువబడి నప్పుడు మాత్రమే గదా! అతఁడు మన నేత్రమునఁ బ్రతిఫలించును. కావున నట్టి ప్రతిబింబము నేత్రమునందు ఎల్లప్పుడు నియమితముగా నుండుట యసంభవము. జీవుఁడు, ఇంద్రియములన్నింటితోను పనిచేయుట కనుకూలముగా నుండుటకై యన్ని యింద్రియములతోను సంబంధించినదియగు నొక ప్రదేశమున నుండువాఁడుగాన, అతఁడు నేత్రమునం దుండువాఁడు కాఁడు. «రశ్మిభిరేషోఽస్మిన్ ప్రతిష్ఠితః" (ఈతఁడు రశ్ములద్వారా నేత్రమున నుంచబడినవాఁడు) అను శ్రుతివాక్యము రశ్ములద్వారా వ్యాపించి యున్నట్లు చెప్పు

చుండుటచే, దేవతావిశేషము దేశాన్తరమున నుండునదెనను, ఇంద్రియము నధిష్ఠించియుండుట సంభవమగుటం జేసి, యవిచక్షుస్సుతో సంబంధించి యుండువది యగుట సంభవము కాదు. ఇంతియెకాక, వీటి యన్నింటికిని వేఱొక్క నిమిత్తము నపేక్షింపని యమృతత్వాదులుండుట యసంభవము. కావున నేత్రమునం దుండువాఁడుగాఁ జెప్పఁబడిన పురుషుఁడు పరమాత్మయే.

—— అన్తరాధికరణము ముగిసెను. ——



## —— అన్తర్యామ్యధికరణము. ——

అవతారిక:—"యశ్చక్షుషి తిష్ఠన్" ఇత్యాది వాక్యమున, బ్రతిపాదింపఁబడిన ప్రకారము నేత్రేంద్రియస్థితియు, దానిని నియమించుటయు మొదలగునవి పరమాత్మకే సంభవములని సాధించి, నేత్రమునందుండు వాఁడుగాఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయే యని "స్థానాదివ్యపదేశాచ్చ" (బ్ర. సూ. ౧. అ ౨ పా. ౧౪ సూ.) అను సూత్రమున నిరూపించి యున్నారు. ఆవిషయమునే యీ యధికరణమున సమర్థించుచున్నారు.

### ౧౯॥ సూ॥ అన్తర్యామ్యధిదైవాధిలోకాదిషు తద్ధర్మవ్యపదేశాత్.

టీ॥ అధిదైవాధి లోకాదిషు = అధిదైవ, అధిలోకాది పదములతోఁ గూడియున్నట్టి వాక్యములయందు, అన్తర్యామీ=అంతరాత్మగా నుపదేశింపఁబడిన వాఁడు పరమాత్మయే, ఏలననఁగా, తద్ధర్మ వ్యపదేశాత్ =అట్టి యన్తరాత్మయందు పరమాత్మయొక్క ధర్మములు ఉన్నట్లు చెప్పఁబడినందున,

తా॥ అధిదైవాధిలోకాది పదములతోఁ గూడియుండు వాక్యములయందు అన్తరాత్మగా నుపదేశింపఁ బడినవాఁడు పరమాత్మయే. ఏలననఁగా, వానియందు పరమాత్మయొక్క ధర్మములు ఉన్నట్లు తెలుపఁబడియె.

శ్రీ॥ భా॥ కాణ్వులును మాధ్యందినులునగు వాజసనేయులును ఇట్లు పఠించుచున్నారు. వారిలో కాణ్వులు "యః పృథివ్యాం తిష్ఠన్, పృథివ్యా అంతరోయం పృథివీ నవేద, యస్య పృథివీ శరీరం యః పృథివీమంతరో యమయతి." (ఎవఁడు పృథివియం దున్నవాఁడై పృథివిలోపలనుండి పృథివిచేఁ దెలిసికొనఁబడక పృథివిని తనకు శరీరముగ గలవాఁడై పృథివిలోనుండి దానిని నియమించుచున్నాఁడో, వానిని ఆత్మగను అన్తర్యామిగను అమృతస్వరూపునిగాను నెఱుఁగుము.) అని పఠించుచున్నారు. వీరు ఈ సందర్భమున ఉదకము, అగ్ని, అంతరిక్షము, వాయువు, ఆదిత్యుఁడు, దిక్కులు, చంద్రుఁడు, నక్షత్రములు, ఆకాశము, తపస్సు, ఈ మొదలుగాగల ద్యులోక సంబంధములగు సమ

స్తభూతములయందును, ప్రాణము, వాక్కు, చక్షుస్సు, శ్రోత్రము, మనస్సు, త్వక్, విజ్ఞానము, రేతస్సు, మొదలుగాగల ఆత్మీయ పదార్థములయందు నున్నట్టిదియు, ఆయాపదార్థములను నియమించునట్టిదియునగు నొక వస్తువును నిర్దేశించి, అది నీయొక్క ఆత్మయు, అంతర్యామియు, అమృత స్వరూపుఁడు నని ప్రతిపర్యాయము ఉపదేశించి యున్నారు. మాధ్యం దిను లీవస్తువును గుఱించి పఠించు సందర్భమున "య స్సర్వేషు లోకేషు తిష్ఠన్" అనియు, "యస్సర్వేషు వేదేషు" అనియు, "యస్సర్వేషు యజ్ఞేషు తిష్ఠన్" అనియు, నీ వాక్యములయం దావస్తువును లోకములయందును వేదాధి దేవతలయందును యజ్ఞాధిదేవతలయందు నుండు దానినిగాను పఠించియున్నారు. అయితే వీరు కాణ్వులవలెనే "యో విజ్ఞానే తిష్ఠన్" అని పఠించుటకు బదులుగా, "య ఆత్మని తిష్ఠన్" అని పఠించుచున్నారు. అనఁగా, విజ్ఞానమునం దున్నదాని నిగ నుపదేశించుటకు బదులుగా, ఆత్మయందున్న దానినిగాను ఉపదేశించి యున్నారు. "సత ఆత్మాంతర్యామ్యమృతః" అని యధికముగా బఠించి యున్నారు. ఇదియే వీరి పాఠమునందలి విశేషము. ఇందొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈ పై తావుల నంతరాత్మగా నుపదేశింపఁబడినవాఁడు ప్రత్యగాత్మయా? కాక, పరమాత్మయా?

## పూర్వపక్షము.

ఈతావున అంతరాత్మగాఁ జెప్పఁబడినవాఁడు ప్రత్యగాత్మ యనుట యుక్తము. ఏలననిన, "ద్రష్టా శ్రోతా" ఇత్యాది వాక్యశేషము, ఈతఁడు ద్రష్టయనియు శ్రోతయనియును జెప్పుచు, నీతనిని దర్శనాదీంద్రియాధీనమగు జ్ఞానము గలవానినిగాఁ దెలుపుచున్నది. అట్టివాఁడు ప్రత్యగాత్మయే గదా. ఇట్లు ద్రష్టయగువాఁడే యంతరాత్మగాఁ జెప్పఁబడినందునను, "నాన్యోఽతోఽస్తి ద్రష్టా" ఇత్యాది శ్రుత్యంతర మీతనికంటె వేఱగు ద్రష్ట మఱియొక్కఁడు లేడని యుపదేశించుటం జేసియును, ఈతఁడు ప్రత్యగాత్మ యని నిశ్చితమగుచున్నదనిన,

## సిద్ధాంతము.

అధిదైవాధిలోకాదిపద చిహ్నితములగు శ్రుతివాక్యములయందు ఉపదేశింపఁబడునట్టి యంతరాత్మ యపహతపాప్మయును, పరమాత్మయునగు నారాయణుఁడే. కాణ్వపాఠమునందుండు అధిదైవాదిపదయుక్తములగు వాక్యములే కాక, అధిలోకాధిపదయుక్తములగు మఱికొన్ని వాక్యములు మాధ్యందిన పాఠమునందుఁ గలవని తెలుపుటకై సూత్రమునందు అధిదైవాదులును అధిలో

కాదులును గూడఁ జేర్కొనఁబడినవి. అనఁగా ఈయుభయవిధ వాక్యముల యందును అంతరాత్మగాఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయే. ఏలననఁగా, పరమాత్మయొక్క ధర్మము లిచట యుపదేశింపఁబడినవి. తానొక్కఁడేయైనను, సర్వలోకములను, సర్వభూతములను, సమస్తములగు ద్యులోక సంబంధములగు పదార్థములనున్ను నియమించుట పరమాత్మయొక్క ధర్మము గదా? కనుకనే «య ఇమం చ లోకం పరంచ లోకం సర్వాణి చ భూతాని యోఽన్తరో యమయతి»: (ఎవఁడు ఈ లోకమును పరలోకమును సమస్తములగు భూతములనున్ను వాటి లోపలనుండి నియమించుచున్నాఁడో। అని యివ్విధముగా నుపక్రమించి, తరువాత «త మంతర్యామిణం బ్రూహి» (అట్టి యంతరాత్మను నాకెఱింగింపుము) అని యుద్దాలకుఁడు ప్రశ్నింపఁగా, అందుల కుత్తరముగాను గదా! «యః పృథివ్యాం తిష్ఠన్» ఇత్యాది శ్రుతివాక్యములు ప్రవర్తించినవి. కనుక నిట్లు సర్వలోకములయొక్కయు, సర్వభూతములయొక్కయు, సమస్తములగు దేవతలయొక్కయు, సమస్త వేదాధిదేవతలయొక్కయు, సమస్త యజ్ఞాధిదేవతలయొక్కయును లోపలప్రవేశించి వారల నన్నివిధములచేతను నియమించుటయును వానినన్నిఁటిని తనకు శరీరముగా గలిగి యుండుటచే వానికి తానాత్మగనుండుటయు, నిదియంతయును సర్వజ్ఞుఁడును, సత్యసంకల్పుఁడునగు నాపురుషోత్తమునికే తప్ప, వేఱొక్కనికి సంభవము కానేరదు కనుకనే «అన్తః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా» (తై. ఆ. చిత్తి. ౧౧. అను) (ఈతఁడు జనులలోపల ప్రవేశించి వారలను నియమించుచు, సర్వమున కంతరాత్మగా నున్నాఁడు) అనియు, «తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్, తదనుప్రవిశ్య సచ్చ త్యచ్చాభవత్» (తై. ఆ. ౬ అను) (పరమాత్మ జగత్తును సృజించి దానిలో ప్రవేశించి చేతనపదార్థములు గాను అచేతనపదార్థములుగాను నాయెను» అనియును నీమొదలగు నుపనిషద్వాక్యములు సయితము పరమాత్మయే సర్వమును నియమించువాఁడనియు, సర్వమున కాత్మయనియు నివ్విధముగ జెప్పుచున్నవి. మఱియు సుబాలోపనిషత్తునందును: «నైవేహకిఞ్చనాగ్రఆసీద మూల మనాధార మిమాః ప్రజా జాయన్తే దివ్యోదేవ ఏకో నారాయణః చక్షుశ్చ ద్రష్టవ్యంచ నారాయణః శ్రోత్రంచ శ్రోతవ్యంచ నారాయణః» (మూలము లేకయు, ఆధారము లేకయును సృష్టికి పూర్వమెద్దియును లేదు చక్షురింద్రియమును చూడఁబడువస్తువును నారాయణుఁడే. శ్రోత్రేంద్రియమును వినఁబడువస్తువును నారాయణుఁడే. వానినుండియే సర్వప్రజలును పుట్టుచున్నారు) అని యారంభించి, తరువాత «అంతశ్శరీరే నిహితో గుహాయామజ ఏకో నిత్యః యస్య పృథివీ శరీరం యః పృథివీమన్తరే సంచరన్ యం పృథివీ న వేద యస్యాపశ్శరీరం» (సుబా ౭ ఖ) (ఎవనికి పృథివిశరీరమో, ఎవఁడు పృథివిలోపల సంచరించుచు పృథివిచే దెలిసికొనబడక యున్నాఁడో,

మఱియు ఎవనికి ఉదకములు శరీరమో, యతఁడు శరీరమునందలి (హృదయ) గుహయందున్నవాఁడు. ఈతఁడు జన్మరహితుఁడును స్వతంత్రుఁడును నిత్యుఁడును) అనియు, మఱియు "యస్య మృత్యు శ్శరీరం యో మృత్యుమంతరేసంచరన్ యం మృత్యు ర్న వేద ఏష సర్వభూతాంత రాత్మా౽పహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" (ఎవనికి మృత్యువు శరీరమో, ఎవఁడు మృత్యువు లోపల సంచరించుచు మృత్యువుచేఁ దెలిసికొనబడకున్నాఁడో, ఈతఁడు సమస్త భూతముల కంతరాత్మయు, అపహతపాప్ముఁడును, ఉత్కృష్ట దేవతయును, ఒక్కఁడును నగు నారాయణుఁడు) అనియు నిర్విఘమగ జెప్పియుండుటచే నిచటగూడ పరబ్రహ్మమే సర్వమున కాత్మగను, సర్వము తనకు శరీరముగ గల వాఁడుగను, సర్వమును నియమించువాఁడుగనున్న ప్రతిపాదింపఁబడుచున్నాఁడు. మఱియు స్వాభావికముగా నమృతస్వరూపుడుగ నుండుట అనఁగా జన్మమరణములు లేకుండుట పరమాత్మయొక్క ధర్మమే. ఇంతియెకాక, ద్రష్టగను శ్రోతగ నుండుట యనునది పరమాత్మకు స్వాభావికమయినదియే గాని, యది యింద్రియాధీనమైనది కాదు. ఈతఁడు సర్వజ్ఞుఁడును సత్యసంకల్పుఁడు నగుటచే నది యాతనికి స్వాభావికమైనది. కనుకనే "పశ్యత్య చక్షుః స శృణోత్యకర్ణః, అపాణి పాదో జవనో గృహీతా" అను శ్రుతిగూడ "అతఁడు నేత్రములు లేనివాఁడైనను, చూచుచున్నాఁడు, కర్ణములు లేనివాఁడైనను, వినుచున్నాఁడు, పాణిపాదములు లేనివాఁడైనను శీఘ్రముగ బోవువాఁడును (పదార్థములను) తీసుకొనువాఁడును) అనియు నిర్విఘమగ జెప్పుచున్నది. ఇచట దర్శనమన్నను (చూచుటయన్నను) శ్రవణమన్నను (వినుటయన్నను) చక్షురాదీంద్రియజన్యమగు జ్ఞానము గాదు. అయితే యవి రూపాదులను సాక్షాత్కరించుట. జీవునికి స్వాభావికమగు జ్ఞానము కర్మసంబంధముచే తిరోహితమగుటంజేసి, యతనికి రూపాదులను సాక్షాత్కరించుట యనునది చక్షురాదీంద్రియముల మూలముగఁ గలుగుచున్నది. పరమాత్మ కన్ననో, అట్టి సాక్షాత్కారము స్వాభావికమయినది. అనఁగా పరమాత్మకు కర్మసంబంధము లేకపోవుటంజేసి, యతని కది యింద్రియజన్యమైనదికాక, స్వభావసిద్ధ మయినది. "నాన్యో౽తో౽స్తిద్రష్టా" ఇత్యాది వాక్యమున్ను పూర్వవాక్యమునందు నియంతగ జెప్పబడిన ద్రష్టకంటె వేఱగు ద్రష్ట అనఁగా స్వభావసిద్ధమయిన రూపాది సాక్షాత్కారము గలవాఁడు వేఱొక్కఁడు లేడని తెలుపుచున్నది. మఱియు "యం పృథివీ న వేద" అనియు "యమాత్మా న వేద" అనియు నీ మొదలగు వాక్యములయందు పృథివ్యాది నియామ్య పదార్థములచేఁ దెలిసికొనుటకశక్యుఁడై వాటిని నియమించుచున్నట్లు యింతకు పూర్వము జెప్పబడిన వానిని గుఱించియే "అదృష్టో ద్రష్టా, అశ్రుత శ్రోతా" అనఁగా, పృథివ్యాదు

లచే దెలిసికొనఁబడనివాఁడై వాటిని జూచువాఁడనియు, వాటిచే వినఁబడని వాఁడై వాటిని వినువాఁడనియు నిర్విధముగాఁ జెప్పి నిగమించి, అనంతరము “నాన్యోఽతోఽస్తి ద్రష్టా” ఇత్యాది వాక్యముచే అట్టి నియామకుని నిర్ణయించునట్టి వాఁడు వేఱొక్క నియామకుఁడు లేడని చెప్పఁబడియె. ఇంతియె కాక, “ఏష త ఆత్మా” (ఈతఁడు నీయొక్క యాత్మ) అనియు “స ఆత్మా” (అతఁడు ఆత్మ) యనియు నీ మొదలగు స్థలములయందు జీవుని “నీయొక్క” అను షష్ఠీవిభక్త్యంత పదముచే నిర్దేశించుచు అందు మూలముగ తదాత్మ యగు పరమాత్మను జీవునికంటెను వేఱైన వానినిగాఁ దెలియఁజేయుచున్నవి. కాఁబట్టి ఈ తావున నంతరాత్మగాఁ జెప్పబడిన వాఁడు పరమాత్మయే కాని, జీవుఁడు గానేరఁడు.

౨౦॥ సూ॥ న చ స్మార్తమతద్ధర్మాభిలాపాచ్ఛారీరశ్చ.

టీ॥ (అన్తర్యామీ=అన్తరాత్మ, స్మార్తః=ప్రకృతియును, శారీరశ్చ= జీవుఁడును, న=కాదు (ఏలననఁగా) అతద్ధర్మాభిలాపాత్ = ప్రకృతియందును, జీవునియందును ఉండజాలనివి యగు ధర్మము లట్టి యంతరాత్మయందుఁ గల వని చెప్పియున్నందున,

తా॥ అంతరాత్మగాఁ జెప్పఁబడినవాఁడు ప్రకృతి గాని, జీవుఁడు గాని కాఁడు. ఏలననఁగా, ప్రకృతియందును జీవునియందును ఉండజాలనివి యగు ధర్మము లట్టి వానియందుండుననిగాఁ జెప్పఁబడినవి.

శ్రీ॥ భా॥ ఈ తావున నంతరాత్మగాఁ జెప్పఁబడినవాఁడు సాంఖ్యస్మృతి ప్రసిద్ధమగు ప్రకృతి గాని, జీవుఁడు గాని కానేరఁడు. ఏలననిన, ప్రకృతియందుఁ గాని, జీవునియందుఁగాని యుండజాలనివి యగు ధర్మము లీ యంతరాత్మయం దున్నట్లు జెప్పఁబడియున్నవి. స్వభావసిద్ధము గానే సర్వమును సాక్షాత్క రించు శక్తిని గలిగియుండుటయు, సర్వమును నియమించుటయు, సర్వమునకు నాత్మయగుటయు, స్వాభావికముగా నమృతస్వరూపుఁడుగా నుండుటయు నీ మొదలగునవి ప్రకృతికి గాని, జీవునికి గాని యెంతమాత్రము సంభవింపవు. అనఁగా సర్వజ్ఞత్వము, సర్వనియంతృత్వము, సర్వమునకు నాత్మయగుటయు నీ మొదలగు పరమాత్మ ధర్మము లచేతనమగు ప్రధానమునం దుండఁజాలని చందంబున, నవి జీవునియందును గూడ నుండజాలవని యెఱుంగునది.

అవతారిక:—ఈపైని చెప్పఁబడిన గుణములు పరమాత్మకు మాత్రమే యుండుననియు, ప్రత్యగాత్మయందవి యుండజాలవనియును ఈ పై రెండుసూత్ర ములచేతను ప్రతిపాదించి, యీ సూత్రముచే మఱియొక స్వతంత్రకారణము ను గానఁబడుచుటకై:—

౨౧॥ సూ॥ ఉభయేపి హి భేదేనైన మధీయతే.

టీ॥ హి = ఏలననఁగా, ఉభయేపి = కాణ్వులును మాధ్యందినులును, ఏనం=జీవుని, భేదేన=అట్టి యంతరాత్మకంటె వేఱయిన వానినిగా, అధీయతే =పఠించుచున్నారు.

తా॥ కాణ్వులును మాధ్యందినులును వీరు ఉభయులును జీవుని అట్టి యంతరాత్మకంటెను వేఱయిన వానినిగాఁ బఠించుచున్నారు.

శ్రీ॥ భా॥ ఉభయశాఖలవారును అనఁగా కాణ్వులును మాధ్యందినులును అంతర్యామియగు పరమాత్మచే నియమింపబడునవి యగు వాగాద్యచేతన పదార్థములతోఁగూడ ఈప్రత్యగాత్మనున్ను విభజించి పఠించుచున్నారు. ఎట్లనిన, మాధ్యందినులు "య ఆత్మని తిష్ఠ న్ య ఆత్మనోంతరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మంతరో యమయతి స త ఆత్మాంతర్యామ్య మృతః" (ఎవ్వఁడు ప్రత్యగాత్మయందుండి, ప్రత్యగాత్మయొక్క లోపలనుండి, ప్రత్యగాత్మచేఁ దెలిసికొనబడక, ప్రత్యగాత్మయే శరీరముగ గలవాఁడై, ప్రత్యగాత్మను లోపలనుండి నియమించుచున్నాఁడో, వాఁడే నీయొక్క యాత్మయు, అంతర్యామియును, అమృతస్వరూపుఁడును) అనియును, కాణ్వులు "యో విజ్ఞానే తిష్ఠన్" ఇత్యాది వాక్యమున (ఎవఁడు విజ్ఞానమున (ఆత్మయందు) ఉండువాఁడో) అనియు నివ్విధముగాను పఠించుచున్నారు. అనఁగా ప్రత్యగాత్మ పరమాత్మచే నియమింపఁబడు వాడగుటచే నీతనిని పరమాత్మకంటె విలక్షణుని గాను ఉభయశాఖలవారును పఠించుచున్నా రనుట. కనుక, ఈ తావున నంతరాత్మగ నుపదేశింపఁబడిన వాఁడు ప్రత్యగాత్మకంటె విలక్షణుడును, అపహతపాప్మకును, పరమాత్మయు నగు నారాయణుఁడే యని సిద్ధమగుచున్నది.

అంతర్యామ్యధికరణము ముగిసెను.

అదృశ్యత్వాది గుణకాధికరణము.

౨౨॥ సూ॥ అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః.

టీ॥ అదృశ్యత్వాదిగుణకః=అదృశ్యత్వాదిగుణములు గలవాఁడు గాను శ్రుతియందుఁ జెప్పఁబడిన వాఁడు పరమాత్మయె. ఏలననఁగా, ధర్మోక్తేః= ఈ తావున పరమాత్మయొక్క ధర్మములు చెప్పఁబడుచున్నవి.

తా॥ శ్రుతియందు అదృశ్యత్వాది గుణములుగలవాఁడుగాఁ జెప్పఁబడిన వాఁడు పరమాత్మయే. ఏలననఁగా, ఈ తావున పరమాత్మయొక్క యసాధారణములగు గుణములు పేర్కొనఁబడుచున్నవి.

శ్రీ॥ భా॥ ఆథర్వణికులు «అథ పరా యయా తదక్షర మధిగమ్యతే యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుశ్శ్రోత్రం తదపాణిపాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూతయోనిం పరిపశ్యన్తి ధీరాః'' (ము. ౧ ము. ౧ ఖ. ౬ వా.) (ఏది జ్ఞానేంద్రియములచేఁ దెలియరానిదియు, కర్మేంద్రియములచే గ్రహింపరానిదియు, కారణరహితమును, బ్రాహ్మణాది వర్ణరహితమును, చక్షురాదీంద్రియరహితమును, పాణిపాదరహితమును, వికారరహితమును, విభుపరిమాణమును, వ్యాపకమును, ఎక్కువ సూక్ష్మబుద్ధిచేఁ దెలియునదియును, నాశరహితమునో, దానిని జ్ఞానులగువారు ఈ సమస్తభూతములకును కారణ భూతమైనదానినిగాఁ జూచుచున్నారు'' అని పఠించి, అనంతరము, «అక్షరాత్పరతఃపరః'' (అతఁడు ఈగొప్పదగు అక్షరము కంటెను గొప్పవాఁడు'' అని పఠించుచున్నారు. ఈ తావున నొక సంశయము గలుగుచున్నది.

—సంశయము.—

ఈ తావున అదృశ్యత్వాది గుణములుగలదిగాఁ జెప్పఁబడినట్టి యక్షరమనఁబడునదియు, అట్టి గొప్పదియగు అక్షరమనంబడుదానికంటెను గొప్పవాఁడుగాఁ జెప్పఁబడినవాఁడును వీరు ఉభయులును ప్రకృతిపురుషులా? కాక, ఈ రెండు తావులఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయేనా?

—పూర్వపక్షము.—

ఈ రెండుతావులఁ జెప్పఁబడినవారు ప్రకృతిపురుషు లనుట యుక్తము. ఏలయనిన, «అదృష్టోద్రష్టా'' (చూడబడనివాడు అయితే చూచువాఁడు) అను ఈ మొదలగు తావులయందువలెనే, ప్రకృతమునను, ఈ యక్షరమనఁబడునట్టి దానికి ద్రష్టృత్వము మొదలగు చేతన ధర్మములెవ్వియును ఉన్నట్లు చెప్పియుండలేదు. «అక్షరాత్పరతః పరః'' అనఁగా, «పరతః=వికారజాతముకంటెను వేఱగు, అక్షరాత్=ప్రకృతికంటెను, పరః=వేఱయినవాఁడు'' అను తావున వికారజాతముకంటెను వేఱయినదగు అక్షరముకంటెను వేఱయినవాఁడును, క్షేత్రజ్ఞుఁడునగు సమష్టిపురుషుఁడు ప్రతిపాదింపఁబడుచున్నాఁడు. అదియెట్లనిన, రూపాదులతోఁ గూడియుండునవియు, స్థూలరూపములును, అచేతనములునగు పృథివ్యాదిభూతములయందుండునట్టి దృశ్యత్వము (కంటికిఁగానఁబడుట) మొదలగునవి యీ యక్షరమనఁబడుదానియందు లేవని «అదృశ్యం'' ఇత్యాదివాక్యమునఁ జెప్పియుండుటంజేసి, యీ తావున అక్షరమనఁబడునది

పృథివ్యాది భూతసజాతీయమును, సూక్ష్మమునగు నచేతనపదార్థమని సూచిత మగుచున్నది. అట్టిది ప్రకృతియే. దానికంటెను వేఱయినవాఁడుగాఁ బ్రసిద్ధమైనవాఁడు సమష్టిపురుషుఁడే. ప్రకృతి సమష్టిపురుషునిచే నధిష్ఠింపఁ బడినదై మహామత్తుమొదలుకొని అణుపర్యంత ముండు సమస్త వస్తువులను గలుగఁజేయుచున్నది. అందులకుగాను దృష్టాంతములు శ్రుతియం దిట్లు పేర్కొనఁబడుచున్నవి.--యథోర్ణనాభిస్సృజతే గృహ్ణతేవా యథా పృథివ్యా మోషధయ స్సంభవన్తి యథా సతః పురుషాత్కేశలోమాని తథా క్షరా త్సంభవతీహ విశ్వం" (ము. ౧ ము. ౬-౭-౨) (సాలెపురుగు దారములఁ గలుగఁజేసి మరల వానిని తనలోనికిఁ దీసికొనుచందంబునను, పృథివియందు ఓషధు లుత్పన్నములగు చందంబునను, ఈపురుషుని తలయందుండు వెంట్రు కలును దేహమునందలి వెంట్రుకలును ఉత్పన్నములగు చందంబునను, అక్షర మనఁబడు దానినుండి యీజగమంతయును ఉత్పన్నమగుచున్నది)—కావున, ఈ ప్రకరణమున ప్రకృతిపురుషులు ప్రతిపాదింపఁబడుచున్నారని సిద్ధమగు చున్నది.

## సిద్ధాంతము.

ఈ కావున, అదృశ్యత్వాది గుణములుగలవాఁడుగాను, అక్షరమనఁ బడు దానికంటెను పరుఁడుగానును చెప్పబడినవాఁడు పరమపురుషుఁడే. ఏల ననిన, "య స్సర్వజ్ఞ స్సర్వవిత్" ఇత్యాది శ్రుతివాక్యమున నట్టివానికి సర్వజ్ఞత్వాది సర్వేశ్వరగుణములు ఉన్నట్లు చెప్పబడుచున్నవి. ఎట్లనిన, ఆథ ర్వణికులు "యయా తదక్షర మధిగమ్యతే" (ము. ౧ ము. ౧ ఖం ౫ వా.) ఇత్యాది వాక్యమున అదృశ్యత్వాది గుణయుక్తుఁడగు అక్షరునిఁ బేర్కొని, "అక్షరాత్సంభవతీహ విశ్వం" అనువాక్యమున, ఆ యక్షరునినుండియే సమస్త ప్రపంచముయొక్కయును ఉత్పత్తిని తెలిపి, "యస్సర్వజ్ఞ స్సర్వవిద్యస్య జ్ఞాన మయం తపః తస్మాదేతద్బ్రహ్మ నామ రూపమన్నంచ జాయతే" (ఎవ్వఁడు సర్వమును సామాన్యముగాను, విశేషముగానును తెలిసికొనిన వాఁడో, ఎవ నికి జ్ఞానమయమగు తపస్సు కలదో, వానినుండి యీ బ్రహ్మాణ్డమును, నామ రూపములును, పృథివియును పుట్టుచున్నవి) అను వాక్యమున, సమస్తభూత ములకును కారణభూతుఁడగు అక్షరునికి సర్వజ్ఞత్వాది గుణములు గలవని ప్రతిపాదించుచున్నారు. తరువాత, ప్రకృతమున, అదృశ్యత్వాది గుణయు క్తుఁడుగాను, భూతకారణుఁడుగాను జెప్పఁబడిన అక్షరుఁడనఁబడు సర్వజ్ఞుఁడే "అక్షరాత్పరతః పరః" అనువాక్యమున పరుఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. కావున "అక్షరాత్పరతః పరః" అనువాక్యమున పంచమీ విభక్త్యంతమున

నుండు "అక్షరాత్" అనుశబ్దము అదృశ్యత్వాది గుణములుగలవాఁడుగా నీ పైని చెప్పఁబడినట్టి యక్షరుని తెలుపునది కాదు. ఏలననిన, ఈపైని చెప్పఁ బడినట్టి యక్షరుఁడు. సర్వజ్ఞుఁడు. ఈ సమస్తమునకు కారణ భూతుఁడు, అన్నింటికంటెను పరుఁడు అందువలన, అట్టి యక్షరునికంటెను పరుఁడ యినవాఁడు వేఱొక్కఁ డుండుట యసంభవము. కావున ఈ పైశ్రుతియందుం డు "అక్షరాత్" అనుశబ్దము అచేతనమగు భూతసూక్ష్మమును తెలుపునది.

౨౩॥ సూ॥ విశేషణ భేదవ్యపదేశాభ్యాం చ నేతరౌ.

టీ॥ విశేషణ భేదవ్యపదేశాభ్యాం చ=విశేషణమునుబట్టియు, భేదము జెప్పియుండుటనుబట్టియును, ఇతరౌ=ప్రకృతిపురుషులు, న=కారు.

తా॥ విశేషణమువలనను, భేదము జెప్పియుండుటవలనను, అదృశ్య త్వాది గుణములుగలవాఁడుగాఁ జెప్పఁబడినట్టి యక్షరుఁడనఁబడువాఁడు ప్రకృతిగాని, పురుషుఁడు గాని కాఁడు.

శ్రీ॥ భా॥ ఈక్రిందు గాన్పింపఁబడు హేతువులనుబట్టియు, అదృశ్యత్వా దిగుణములు గలవాఁడుగాఁ శ్రుతియందుఁ జెప్పఁబడినవాఁడు ప్రకృతి గాని, జీవుఁడు గాని కాఁడని తెలియుచున్నది. ఎట్లనిన, ఈ ప్రకరణమున, ఒక్కటి తెలి యుటచే నన్నియును తెలియును అను ప్రతిజ్ఞను ఉపపాదించుట మొదలగునవి చెప్పఁబడినవి. ఇందుమూలముగ ఈ ప్రరణము భూతకారణముగాఁ జెప్పఁబడి నట్టియక్షరుని ప్రకృతికంటెను,జీవునికంటెను విశేషములు గలవానినిగాఁదెలుపు చున్నది. అట్లే, "అక్షరాత్పరతః పరః" ఇత్యాదిశ్రుతివాక్యము ఈయక్షరుని ప్రకృతి పురుషులకంటెను బిన్నమయినవానినిగాఁ దెలుపుచున్నది. అదియెట్లన నిన, ఆథర్వణికులు, "స బ్రహ్మవిద్యాం సర్వవిద్యాప్రతిష్ఠా మథర్వాయ జ్యేష్ఠపు త్రాయ ప్రాహ" (ముం ౧ ము. ౧ ఖ. ౧ వా.) (చతుర్ముఖుఁడు సర్వవిద్య లకును ఆధారభూతమగు బ్రహ్మవిద్యను తన జ్యేష్ఠపుత్రుఁడగు అధర్వుని కుపదేశించెను) అనువాక్యమున, సర్వవిద్యలకును ప్రతిష్ఠాభూతమగు బ్రహ్మ విద్యను గుఱించి చెప్పుట కారంభించి యుండిరి. పరవిద్యయే కదా సర్వవిద్య లకును ప్రతిష్ఠాభూత మయినది. ఇట్లు సర్వవిద్యలకును ప్రతిష్ఠాభూతమగు విద్యను అంగిరసుఁడు చతుర్ముఖాథర్వాది గురుపరంపరగుండా లభించెను. ఇట్టి విద్యను తెలియఁగోరి శౌనకుఁడు "శౌనకోహ వై మహాశాలోఽంగిరసం విధివదుపసన్నః పప్రచ్ఛ కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి" (శౌనకుఁడు శాస్త్రప్రకారము ఆంగీరసుని యాశ్రయించి "ఓ పూజ్యుఁడా! దేనిఁ దెలిసికొనుటచే నిదియంతయును తెలియును?" అని యడిగెను) అను

వాక్యమునఁ జెప్పియున్నట్లు ప్రశ్నించెను. బ్రహ్మవిద్య సర్వవిద్యలకును ఆశ్రయమగుటం జేసి, బ్రహ్మము తెలియుటచే సర్వము తెలియవచ్చునని తలంచి యతఁడు ఈపైవాక్యమున బ్రహ్మస్వరూపమును గుఱించి యడిగినవాఁ డాయెను. ఇట్లు శౌనకుఁడడుగఁగా, అంగీరసుఁడు “ద్వే విద్యే వేదితవ్యే ఇతి హస్మ యద్బ్రహ్మవిదో వదన్తి పరాచైవాపరాచేతి” (పరవిద్యయనియు, అపరవిద్యయనియును చెప్పఁబడు రెండు విద్యలు తెలిసికోనవలసినవి యని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు) అని బదులుచెప్పెను. ఈ తావున బ్రహ్మమును పొందగోరువానిచే రెండు విద్యలు తెలిసికొనవలసినవి యనఁగా, నతఁడు బ్రహ్మమువిషయమై పరోక్షజ్ఞానమును అపరోక్షజ్ఞానమునున్న సంపాదించు కొనునది యని యర్థము. ఆరెంటిలో, పరోక్షజ్ఞానమనఁగా, శాస్త్రాధ్యయనముచేఁ గలుగునట్టి జ్ఞానము. అపరోక్ష జ్ఞానమనఁగా యోగాభ్యాసమువలనఁ గలుగునట్టి జ్ఞానము. ఆరెంటిలో నపరోక్షజ్ఞానము బ్రహ్మప్రాప్తికి ఉపాయభూతమయినది. అట్టి యపరోక్షజ్ఞానము భక్తిరూపమైనది. ఏలననఁగా, “యమేవైష వృణుతే తేన లభ్యః” (ఎవనిని పరమాత్మ ప్రేమించుచున్నాఁడో, వానిచే పరమాత్మ పొందబడుచున్నాఁడు.) అనుశ్రుతివాక్యమునందే యట్టి జ్ఞానముయొక్క విశేషస్వరూపము తెలుపఁబడుచున్నది. వివేక విమోకాది సాధన సప్తకానుష్ఠానముయొక్క సహాయము గల శాస్త్రజ్ఞాన మట్టి యపరోక్షజ్ఞానమును గలుగఁ జేయుచున్నది. ఏలననఁగా “తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసా నాశకేన” ఇత్యాది శ్రుతివాక్యమున “వేదాధ్యయనముచేతను, యజ్ఞముచేతను, దానముచేతను, ఆహారనియమముతోఁ గూడుకొనిన తపస్సుచేతను బ్రాహ్మణులు పరమాత్మను తెలిసికొనుచున్నారు” అని చెప్పియుండుటవలన నిట్లు తెలియుచున్నది. అట్లే శ్రీ పరాశరమహర్షియును “తత్ప్రాప్తి హేతుః జ్ఞానం చ కర్మచోక్తం మహామునే। ఆగమోత్థం వివేకాచ్చ ద్విధా జ్ఞానం తథోచ్యతే (విష్ణు ౬ అం. ౫ అ. ౬౧ శ్లో) (ఓ మహామునీ! పరమాత్మను బొందుటకు జ్ఞానంబును కర్మంబును సాధనభూతములు. శాస్త్రమువలనఁ గలుగునదియు, వివేకాది నియమానుష్ఠానమువలనఁ గలుగునదియు నని యిట్లు జ్ఞానము రెండువిధములు” అని చెప్పియున్నాఁడు. ఆథర్వణికులును “తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః” (ము. ౧ ము. ౧ ఖ. ౫ వా) ఇత్యాదివాక్యము మొదలుకొని, “ధర్మశాస్త్రాణి” అను వరకు శాస్త్రమువలనఁ గలుగునదియు, బ్రహ్మసాక్షాత్కారము గలుగుటకు హేతుభూతమగు పరోక్షజ్ఞానమును గుఱించి చెప్పియున్నారు. అంగములతోను, ఇతిహాసపురాణములతోను, ధర్మశాస్త్రముతోను, మీమాంసముతోనుగూడ అధ్యయనము

చేయబడినట్టి వేద శాస్త్రము జ్ఞానమును గలుగఁజేయునది గదా! ‹‹అథ పరా యయా తదక్షర మధిగమ్యతే'' (౧ ము. ౧ ఖ. ౬ వా) అనువాక్యమున ఉపాసనమని పిలువఁబడునదియు, బ్రహ్మసాక్షాత్కారలక్షణమును, భక్తిరూప ము బొందినది యగు జ్ఞానము చెప్పఁబడుచున్నది ‹‹యత్తదద్రేశ్య మ గ్రాహ్యం'' ఇత్యాది వాక్యమున, ఈ పైని గనఁబఱచిన ప్రకారము, పరోక్షమనియు అపరోక్షమనియు నిట్లు రెండు విధములుగల జ్ఞానముచేఁ దెలియఁదగినవాఁడగు పరబ్రహ్మముయొక్క స్వరూపము చెప్పఁబడుచు న్నది. ‹‹యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతే చ'' ఇత్యాదివాక్యమున ఈపైని చెప్పఁబడిన స్వరూపముగలవాఁడును, పరబ్రహ్మమునగు నక్షరునినుండి చేతనా చేతనాత్మకమగు ఈ సమస్తప్రపంచమున్ను పుట్టుచున్నదని తెలుపఁబడియె. ఈ పై శ్రుతియందు ‹‹విశ్వం=ఈ ప్రపంచమంతయును'' అని చెప్పియున్నం దున నచేతనము మాత్రమే యుత్పన్న మయినట్లు చెప్పఁబడలేదని తెలియు చున్నది. ‹‹తపసా చీయతే బ్రహ్మ తతోఽన్నమభిజాయతే, అన్నాత్ప్రాణో మనస్సత్యం లోకాః కర్మసు చామృతం'' అను వాక్యమున ఈ ప్రపంచము బ్రహ్మమునుండి యుత్పన్నమయిన పద్ధతి చెప్పఁబడుచున్నది. ఈశ్రుతియొక్క యర్థమే మనఁగా, ‹‹తపసా'' అనఁగా ‹‹జ్ఞానముచే'' అని యర్థము. ‹‹యస్య జ్ఞాన మయం తపః'' అనుశ్రుతివాక్యము సర్వేశ్వరునికి జ్ఞానమయమగు తపస్సు గలదని తెలుపుచున్నది గదా! ‹‹చీయతే'' అనఁగా, ‹‹ఉపచీయతే = సన్న ద్ధమగుచున్నది.'' అని యర్థము. అనఁగా, ‹‹బహుస్యాం=నేను అనేకముగా నగుదును''అనెడి సంకల్పముతో బ్రహ్మము జగత్తునుసృజించుటకు ఉద్యుక్తమగు చున్నది యని ఫలితార్థము ‹‹తతోఽన్న మభిజాయతే—తతః=అట్టి బ్రహ్మ మునుండి, అన్నం = భోగ్యభోగోపకరణాది పదార్థజాతము ; అభిజాయతే= కలుగుచున్నది) అనఁగా, ‹‹అద్యత ఇత్యన్నం'' అను శబ్దవ్యుత్పత్తినిబట్టి తినఁ బడునది యన్నమనఁబడుచున్నది. ఈసమస్తములగు భోక్తలును భోగ్యపదా ర్థములును, సూక్ష్మభూతములును, అవ్యాకృతములు నగు అచేతన పదార్థ ములును, పరబ్రహ్మమునుండి కలుగుచున్నవని యర్థము. మనస్సు, ప్రాణము మొదలగునవియును, స్వర్గాది సుఖరూపమగు ఫలమును గలుగఁజేయు కర్మ ములవరకును సమస్తమగు ప్రకారజాతమును బ్రహ్మమునుండియే కలుగుచున్నవి. ‹‹యస్సర్వజ్ఞ స్సర్వవిత్'' ఇత్యాది వాక్యమున సృష్టికి సహాయకమగు సార్వ జ్ఞ్యము, సత్యసంకల్పత్వము మొదలగునవి చెప్పబడినవి. ఇట్లు సర్వజ్ఞుడును సత్యసంకల్పుఁడును, పరబ్రహ్మమునగు ఈ యక్షరునినుండి యీ కార్యరూ పమగు బ్రహ్మాండము, అనఁగా, నామరూప విభక్తమగు భోక్తృభోగ్య

రూపమైనదంతయును గలుగుచున్నది. «తదేతత్సత్యం" అనువాక్యము పర బ్రహ్మము వేఱొక్క నిమిత్తము నపేక్షింపకయే సత్యమైనదియని తెలుపుచు న్నది. శ్రుతులు «మన్త్రేషు కర్మాణి కవయో యాన్యపశ్యం స్తాని త్రేతా యాం బహుధా సన్తతాని తాన్యాచరత నియతం సత్యకామాః" (సత్య స్వరూపుఁడగు పరమాత్మను గోరువారలా! యే కర్మములను మహర్షులు మన్త్ర ములయందుఁ గనిపెట్టిరో, అవి త్రేత్రాగ్నుల యందు అనేక విధములుగ వ్యాప్తము లయినవి. మీరు వాటిని నియతముగా ననుష్ఠించునది) అను వాక్యమున సార్వజ్ఞ్య సత్యసంకల్పత్వాది గుణాకరుఁడును, స్వతః సత్యస్వరూ పుఁడునగు అక్షరపురుషుని పొందకోరువారువానిఁ బొందుటకై ఇతరఫలముల యెడల విరక్తిగలవారై ఋగ్యజుస్సామాథర్వ వేదములయందు దివ్యదృష్టు లగు మహర్షులచే గనిపెట్టపడినవియు, వర్ణాశ్రమోచితములును, త్రేతాగ్నుల యందు అనేకవిధములుగ వ్యాప్తములునగు కర్మముల ననుష్ఠించునది" అని తెలిపి, «ఏష వః పన్థాః" అను వాక్యమువరకును కర్మానుష్ఠానముయొక్క పద్ధతిని, శ్రుతిస్మృతులయందు విధింపఁబడిన కర్మములలో నొక్కటి లోపించి నను, తక్కినవి యనుష్ఠింపఁబడినప్పటికిని, ఫలరాహిత్యమును, శాస్త్రపద్ధతిని వదలి యనుష్ఠింపఁబడిన కర్మము అనుష్ఠింపఁ బడనిదానితో సమానమగుట నున్ను చెప్పి, «ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞ రూపాః అష్టాదశోక్తమపరం యేషు కర్మ, ఏతచ్ఛ్రేయో౽భినన్దన్తి మూఢాః జరామృత్యుం తే పున రేవాపి యన్తి" (అష్టాదశస్మృతులయందుఁ జెప్పఁబడిన కర్మములుగల ఈ యజ్ఞ ములు శిథిలములయిన ఓడలవంటివి. వీటిని నమ్ముకొనిన మూఢులు మరల మరల జన్మమరణములను పొందుదురు.) అను వాక్యమున ఫలాపేక్షతోను, జ్ఞానము లేకుండగను, కర్మముల ననుష్ఠించు వారలు మరల ఈలోకమునకు రా బొయ్యెద రనిచెప్పి, «తపశ్శ్రద్ధే యేహ్యుపవసన్తి" ఇత్యాదివాక్యమున ఫలము నపేక్షింపకయే జ్ఞానిచే ననుష్ఠింపఁ బడినట్టి కర్మము బ్రహ్మప్రాప్తికిగా నుపయో గపడుచున్నదనుచు, దానిఁ బ్రశంసించి, « పరీక్ష్య లోకాన్ " ఇత్యాది వాక్యమున, (బ్రహ్మోపాసనారహితములగు) కేవలకర్మములయెడల విరక్తిని జెంది, శాస్త్రోక్తమగు కర్మముచే నుపకరింపఁబడినదియు, బ్రహ్మప్రాప్తికి ఉపాయభూతమైదియునగు, జ్ఞానమును లభింపవలయునని కోరువాఁడు ఆచా ర్యుని యాశ్రయించునది యని విధించి, «తదేతత్సత్యం యథా సుదీప్తాత్" ఇత్యాది వాక్యముమొదలు « సో౽విద్యాగ్రన్థిం వికిరతీహ సోమ్య" అను వరకును పూర్వము చెప్పఁబడినవాఁడును, అక్షరుఁడును, భూతకారణుఁ డును, పరబ్రహ్మమునగు పరమపురుషుఁడు పూర్వము చెప్పఁబడని స్వరూ

పగుణములతోఁ గూడ సర్వాన్తరాత్మయగుటంజేసి, యతఁడు విశ్వరూపుఁడగుటను, అతనినుండియే యీసమస్తము సృజింపఁబడుటనున్ను స్పష్టముగాఁ దెలిపి, "ఆవిసన్నిహితం" ఇత్యాది వాక్యమున, అవ్యాకృతమగు దానికంటెను పరుఁడయిన వాఁడును, పరబ్రహ్మమును, పరమాకాశమున (పరమపదమున) నుండువాఁడును, అనవధి కాతిశయానంద స్వరూపుఁడునగు నాయక్షరుని హృదయగుహాయందు ఉపాసించునట్టి విధమును, ఆ యుపాసనము పరభక్తిరూపమగుటను, అట్లు ఉపాసించు వాని అవిద్య పోయి (కర్మసంబంధము విడి) వాఁడు బ్రహ్మసముఁడయి, బ్రహ్మము ననుభవించుటయనఁబడు ఫలమునున్ను ఉపదేశించి, యంతటితో ముగించుచున్నవి.

కావున నిట్లు ప్రకృతి, పురుషులనుండి, పురుషోత్తముని విశేషించి చెప్పియుండుటంజేసియు, వానినుండి భిన్నునిగాఁ జెప్పియుండుటంజేసియును, ఈపై తావుల ప్రకృతిపురుషులుచెప్పఁబడలేదని తెలియుచున్నది. ఏలననిన, వానికిని పరబ్రహ్మమునకును భేదమున్నట్లు ఈ పై తావులఁ జెప్పబడినది. అది యెట్లనిన, ఆథర్వణికులు "దివ్యోహ్య మూర్తః పురుషస్సబాహ్యాభ్యంతరోహ్యజః అప్రాణోహ్యమ నాశ్శుభ్రోహ్య క్షరాత్పరతః పరః" ఇత్యాది వాక్యమున అక్షరుఁడనఁబడు పరబ్రహ్మమునకును, ప్రకృతి పురుషులకును భేదమును తెలుపుచున్నారు. ఈ పైవాక్యమున "అక్షరా త్పరతఃపరః" అనగా "అక్షరాత్ = అవ్యాకృతమగు భూతసూక్ష్మము కంటెను, పరతః=వేఱయిన వాఁడగు సమష్టిపురుషునికంటెను, పరః=అట్టి సమష్టిపురుషుని కంటెను పరుఁడును, అదృత్వాది గుణములుగలవాఁడును, అక్షరుఁడనంబడువాఁడునగు పరమాత్మ యని యర్థము. "అశ్నుతే=వ్యాపించు యుండునది." యని గాని "న క్షరతి= నశించునది కాదు" అని గాని యక్షరశబ్దముయొక్క యర్థము నెఱుంగునది. ఇట్లి యర్థము భూతసూక్ష్మమును తెలుపు అక్షరశబ్దమునకును, వికారవ్యాప్తిని బట్టిగాని, మహదాది నామాన్తర వ్యవహారా యోగ్య రూపమగు క్షరణము (మార్పు) లేకుండుటను బట్టిగాని, ఏదొకవిధమున పొసగవచ్చును.

౨౩॥ సూ॥ రూ పో ప న్యా సా చ్చ.

టీ॥ రూపోపన్యాసాచ్చ=రూపమును జెప్పియున్నందునను,

తా॥ అట్టి పురుషునికి అగ్నిమూర్ధత్వాది రూపముఁ గలదని శ్రుతుల యందుఁ జెప్పియున్నందునను అట్టి వాఁడు పరమాత్మయే.

శ్రీ॥ భా॥ “అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ దిశ శ్శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః, వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య పద్భ్యాం పృథివీ ఏష సర్వభూతా న్తరాత్మా” (ము. ౨ ము. ౧ ఖ. ౪ వా) (అగ్ని యాతని శిరస్సు, సూర్యచంద్రులు నేత్రములు, దిక్కులు శ్రోత్రములు, వాక్కులు వేదములు, వాయువు ప్రాణము, ఆకాశము హృదయము, పృథివి పాదములు, ఈతఁడు సర్వభూతా న్తరాత్మ) అని యట్లు ముండకోపనిషద్వాక్యమునఁ జెప్పఁబడినట్టి శరీరము సర్వభూతా న్తరాత్మ యగు పరమాత్మకు మాత్రము ఉండ తగినది. కావున అదృశ్యత్వాదులు గలవాఁడుగాఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మయే.

అదృశ్యత్వాదిగుణకాధికరణము ముగిసెను.



## వై శ్వా న రా ధి క ర ణ ము.

### ౨౫॥ సూ॥ వై శ్వా న ర స్సా ధా ర ణ శ బ్ద వి శే షా త్.

టీ॥ వైశ్వానరః=వైశ్వానరశబ్దవాచ్యుఁడు పరమాత్మయే. ఏలననఁగా, సాధారణశబ్దవిశేషాత్=సామాన్యముగ అగ్న్యాదులను సయితము తెలుపునది యగు వైశ్వానరశబ్దము ప్రకృతమున పరమాత్మయొక్క ధర్మములను తెలుపు శబ్దములచే విశేషింపఁబడుటవలన,

తా॥ వైశ్వానరశబ్దము సాధారణముగ ఇతరవస్తువులను సయితము తెలుపునదైనను, ప్రకృతమున పరమాత్మయొక్క ధర్మములను తెలుపునట్టి శబ్దములచే విశేషింపఁబడుటవలన నది పరమాత్మవాచకమే.

శ్రీ॥ భా॥ ఛందోగులు “ఆత్మాన మే వేమం వైశ్వానరం సమ్ప్రత్యధ్యేషి తమేవ నోబ్రూహి” (ఛా. ౫ ప్ర. ౧౧ ఖ. ౬ వా.) అను వాక్యమున “ఈ వైశ్వానరాత్మను ఉపాసించుచున్నావు. వానినే మాకుఁ జెప్పుము” అని యారంభించి “యస్త్వేతమేవం ప్రాదేశమాత్ర మభివిమానమాత్మానం వైశ్వానరముపాస్తే” (ఛా. ౫ ప్ర. ౧౮ ఖ. ౧ వా.) అనువాక్యమున ద్యులోకాది ప్రదేశములతో సంబంధించిన వాఁడును వ్యాపకుఁడును మేరలేని వాఁడునగు వైశ్వానరాత్మ నెవ్వఁడు ఉపాసింపుచున్నాఁడో” అని యిట్లుపఠించుచున్నారు. ఇందొక సంశయము గలుగుచున్నది.

—సంశయము.—

ఈపై శ్రుతియందు వైశ్వానరుఁడుగాఁ బేర్కొనఁబడిన వాఁడు పరమాత్మయే యని నిర్ణయించుట శక్యమా? శక్యము కాదా?

—పూర్వపక్షము.—

అట్లు నిర్ణయించుట యశక్యము. ఏలననఁగా, వైశ్వానరశబ్దమునకు నాలుగు అర్థములయందుఁ బ్రయోగమున్నట్లు గానఁబడుచున్నది. అది యెట్లనిన, "అయమగ్నిర్వైశ్వానరో యేనే దమన్నం పచ్యతే యది దమద్యతే తస్యైష ఘోషో భవతి యమేతత్కర్ణావపిధాయ శృణోతి స యదోత్క్రమిష్యన్భవతి నైనం ఘోషం శృణోతి" (బృ. ౭ అ. ౯ బ్రా. ౧ వా.) (దేనిచే అన్నము పచనము చేయఁబడుచున్నదో, మఱియు దేనిచే అన్నము తినఁబడుచున్నదో, అది వైశ్వానర మనఁబడుచున్నది. మనము చెవులఁ గట్టిగ మూసికొంటిమేని, ఆ వైశ్వానరునియొక్క శబ్దమునే వినుచున్నాము. ఇట్టి శబ్దము జీవుఁడు శరీరములోనుండి బయలు వెడలు సమయమున వినఁబడదు) అను వాక్యమున, వాజసనేయులు వైశ్వానరశబ్దమును జాఠరాగ్నివాచకముగాఁ బ్రయోగించియున్నారు.

"విశ్వస్మా అగ్నిం భువనాయ దేవాః వైశ్వానరం కేతుమహ్నామకృణ్వన్" (దేవతలు జగదుపకారార్థము అగ్నిని ఆదిత్యునిగాఁ జేసిరి) అనువాక్యమున వైశ్వానరశబ్దమును మహాభూతములలో మూఁడవదియగు అగ్నిని తెలుపునదిగాను ప్రయోగింపఁబడినది. "వైశ్వానరస్య సుమతౌ స్యామ రాజా హి కం భువనానామభిశ్రీః" (వైశ్వానరునకు మనయెడల మంచి బుద్ధి పుట్టుఁగాక, ఏలననఁగా, అతఁడు లోకములకు సుఖము నిచ్చురాజును, ఐశ్వర్యవంతుఁడును) అనువాక్యమున నది దేవతావాచముగ ప్రయోగింపఁబడినది. "తదాత్మన్యేవ హృదయేఽగ్నౌ వైశ్వానరే ప్రాస్యత్" (అతఁడు దానిని తనయందే హృదయమునందుండు వైశ్వానరాగ్నియందుంచెను.) అనియు, "స ఏష వైశ్వానరో విశ్వరూపః ప్రాణోఽగ్ని రుదయత ఇతిచ" (ప్రాణము వలె నన్నిరూపములతో నతఁడు, వైశ్వానరుడు వలె నుదయించుచున్నాఁడు.) అనియు నీమొదలగు శ్రుతివాక్యములయందు వైశ్వానరశబ్దము పరమాత్మపరముగాఁ బ్రయోగింపఁబడినది. వాక్యారంభము మొదలగు తావులఁ గానఁబడు చిహ్నములను ఈపైని గానఁబడిచిన అర్థములకను గుణముగాఁగొన వచ్చును.

## సిద్ధాంతము.

సూత్రమునందుండు "విశేషణాత్" అను శబ్దమునకు "విశేషింపఁబడుట వలన" అని యర్థము. వైశ్వానరశబ్దము సాధారణముగ ఇతర వస్తువులను గూడఁ దెలుపునదియైనను, ఈ తావున నది పరమాత్మకు మాత్ర ముండునట్టి ధర్మములఁ దెలుపునట్టి శబ్దములచే విశేషింపఁబడుట వలన నది యీతావున పరమాత్మను తెలుపునది. అదియెట్లనిన, ఔపమన్యుఁడు మొదలగు అయిదుగురు మహర్షులొక్క తావునఁ జేరి "కోన ఆత్మా కిం బ్రహ్మ" (ఛా. ౫ ప్ర. ౧౧ ఖ. ౧ వా) (మాయాత్మ యెద్ది? బ్రహ్మమె య్యది?) అని విచారించి, "ఉద్దాలకో హ వై భగవన్తోఽయమారుణి స్సమ్ప్రతీమ మాత్మానం వైశ్వానర మధ్యేతి తంహన్తాఽభ్యాగచ్ఛామ" (ఛా. ౫ ప్ర. ౧౧. ఖ. ౨ వా.) (అరుణవంశమువాఁడగు ఉద్దాలకుఁడు ఇప్పుడు వైశ్వానరాత్మను ఉపాసించుచున్నాఁడు. కావున నతనియొద్దకుఁ బోవుదము) అనుకొని, యుద్దాలకునికి వైశ్వానరాత్మను గుఱించిన జ్ఞానము గలదని తెలిసికొని, యతని యొద్ద కేగిరి. ఉద్దాలకుఁడును వీరలు వైశ్వానరాత్మను గుఱించి తెలియఁగోరి వచ్చినారని యెఱింగి, తన కావిషయమును గుఱించి సంపూర్ణముగాఁ దెలియదని తలంచి, "తాన్హోవాచ అశ్వపతిర్వై భగవన్తోఽయం కేకయః సమ్ప్రతీ మమాత్మానం వైశ్వానర మధ్యేతి తంహన్తాభ్యాగచ్ఛామ" (ఛా. ౫ ప్ర. ౧౧ ఖం. ౪ వా.) (కేకయదేశపురాజగు అశ్వపతి యిప్పుడు వైశ్వానరాత్మను ఉపాసించుచున్నాఁడు. కావున అతనియొద్దకుఁ బోవుదము రమ్ము) అని చెప్పెను. అంతట వీరయిదుగురును ఉద్దాలకుఁడును ఈ యాఱుగురును కలిసి యశ్వపతి యొద్దకుఁ బోయిరి. అశ్వపతియును ఆ మహర్షులను వారి వారి యోగ్యతకుఁ దగినట్లు ఒక్కొక్కరిని ప్రత్యేకముగాఁ బూజించి "నమేస్తేనః" (ఛాం. ౫ ప్ర. ౧౧ ఖం. ౫ వా.) అనువాక్యము మొదలుకొని "యక్ష్యమాణోహవై భగవన్తోఽహమస్మి" (ఛాం. ౫ ప్ర. ౧౧ ఖం ౫ వా.) అనువాక్యము వరకును తాను యజ్ఞదీక్షలో నుండుటంజేసి వారు తా నీయబోవు బహుమానములను స్వీకరింపవచ్చునని తెలుపుచు, ఆ సందర్భమున బ్రహ్మవేత్తలు సయితము శాస్త్రనిషిద్ధమైన దానిని చేయఁగూడదనియు, శాస్త్రవిహితమైన దానిని అవశ్యము చేయవలయుననియును తెలిపి, "యావదేకైకస్మై ఋత్విజే ధనం దాస్యామి తావద్భగవద్భ్యో దాస్యామి వసన్తు భవన్తః" (ఛాం. ౫ ప్ర. ౧౧ ఖ. ౫ వా.) (ఒక్కొక్క ఋత్విక్కునకు ఎంతద్రవ్యము నిచ్చెదనో, అంతద్రవ్యమును మీకును ఈయగలను. ఉండుము) అని పలుకఁగా, వారు ముముక్షువు లగుటంజేసి వైశ్వానరాత్మను దెలియఁ

గోరిన వారై, యీ యాత్మను గుఱించియే మాకుఁ దెలుపుమా! యని యడిగిరి. "కోన ఆత్మా కిం బ్రహ్మ" (మాయాత్మయెద్ది బ్రహ్మమెయ్యది) అని యిట్లు జీవాత్మల కాత్మయగు పరమాత్మను దెలియఁగోరిన వారై యట్టివానిఁ దెలిసికొనిన వానికై వెదకుటచే వైశ్వానరాత్మ పరమాత్మ యని తెలియుచున్నది. మఱియు, ఛందోగులు ఈ విషయమును పఠించునపుడు "కోన ఆత్మా కిం బ్రహ్మ" అని యిట్లు ఆత్మ బ్రహ్మ శబ్దములతో నారంభించి తరువాత అంతటను ఆత్మ వైశ్వానర శబ్దములతో వ్యవహరించుటవలనను, వీరి వాక్యములయందు బ్రహ్మశబ్దస్థానమునఁ బఠింపఁబడు వైశ్వానరశబ్దము బ్రహ్మమునే తెలుపునది యని తెలియుచున్నది. ఇంతియె కాక, "స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మ స్వన్నమత్తి" (ఛా. ౫ ప్ర. ౧౮ ఖ. ౧ వా.) (వైశానరోపాసకుఁడు అన్నిలోకములయందును అన్నిభూతములయందును అన్ని యాత్మలయందును అన్నమును భుజించుచున్నాఁడు) అనియు "తద్యథేషీకతూల మగ్నౌప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే" (ఛా. ౫ ప్ర. వా.) (జమ్ముదూది యగ్ని యందుంచఁబడినతోడనే దగ్ధమై పోవుచందంబున, ఈ వైశ్వానరాత్మను ఉపాసించువాని సమస్తపాపములును నశించుచున్నవి) అనియు నిట్లు చెప్పబోవు వైశానరాత్మోపాసనాఫలము వైశ్వానరాత్మ పరబ్రహ్మమని తెలియఁజేయుచున్నది.

అవతారిక:—ఈ క్రిందఁ గాన్పింపఁబడు హేతువువలనను వైశ్వానరుఁడు పరమాత్మయని తెలియుచున్నది.

౨౬॥ సూ॥ స్మర్యమాణమనుమానం స్యాదితి.

టీ॥ ఇతి="అదే యిది" యని యివ్విధమున, స్మర్యమాణం=గుర్తింపఁబడునట్టి రూపము, అనుమానం=వైశ్వానరుఁడు పరమాత్మయని సూచింపునది, స్యాత్=అగును.

తా॥ "అదే యిది" యని గుర్తింపఁబడునట్టి ద్యులోకాది శరీరము వైశ్వానరుఁడు పరమాత్మ యని సూచింపుచున్నది.

శ్రీ॥ భా॥ ద్యులోకము మొదలు పృథివివరకును శ్రుతియందుఁ జెప్పఁబడిన పదార్థములు వైశ్వానరుని యవయవ విశేషములు గాను ఈతావున ఉపదేశింపఁబడుచున్నవి. అయితే యవి పరమాత్మయొక్క శరీరము గాను శ్రుతిస్మృతులయందుఁ బ్రసిద్ధినొందినవి. ఈ తావున వైశ్వానరశరీరముగాఁ జెప్పఁబడినది శ్రుతిస్మృతి ప్రసిద్ధమగు పరమాత్మశరీరముగా గుర్తింపఁ

బడినదై, వైశ్వానరుఁడును పరమాత్మయే యని సూచింపునది యగును. పరమాత్మకు ఇట్టి శరీరముండుట శ్రుతిస్మృతులయందుఁ బ్రసిద్ధమైన విషయము. అదియెట్లనిన, ఆథర్వణికులు "అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ దిశశ్శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః వాయుః ప్రాణో హృదయం విశ్వమస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాన్తరాత్మా" (ము. ౨ ము. ౧ ఖ. ౪ వా.) అను వాక్యమున "ద్యులోకము పరమాత్మయొక్క శిరస్సు, సూర్యచంద్రు లతని నేత్రములు, దిక్కు లతని శ్రోత్రములు, వేదము లతని వచనములు. వాయువతని ప్రాణము, విశ్వమతని హృదయము. పృథివి యతని పాదములు. ఈతఁడు సర్వభూతములలోనుండు అంతరాత్మ" అని తెలిపియున్నారు. ఈపై వాక్యమున "అగ్ని" యనఁగా "ద్యులోక" మని యర్థము. "అసౌ వై లోకో అగ్నిః" (ఈ ద్యులోకమే యగ్ని) అను శ్రుతి ప్రమాణమువలనఁ దెలియుచున్నది. ఇట్టి శరీరము పరమాత్మకుఁ గలదని మునులును స్మృతులయందుఁ జెప్పియున్నారు.

శ్లో॥ ద్యాం మూర్ధానం యస్య విప్రా వదన్తి ఖం వై నాభిం చన్ద్రసూర్యౌ చ నేత్రే।
దిశశ్శ్రోత్రే విద్ధి పాదౌ క్షితిం చ సోఽచిన్త్యాత్మా సర్వభూతప్రణేతా ॥

తా॥ ద్యులోకము నెవ్వని యొక్క శిరస్సును గాను, ఆకాశము నెవ్వని యొక్క నాభిని గాను, సూర్యచంద్రుల నెవ్వనియొక్క నేత్రములనుగాను, దిక్కుల నెవ్వనియొక్క శ్రోత్రములను గాను, భూమి నెవ్వనియొక్క పాదములనుగాను, బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారో, అతఁడు మనస్సుచే నింత యని యూహించుట కలవిగాని రూపము గలవాఁడును, సమస్తప్రాణులను ప్రవర్తింపఁ జేయువాఁడును.

శ్లో॥ యస్యాగ్నిరాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభిశ్చరణౌ క్షితిః ।
సూర్యశ్చక్షుర్దిశశ్శ్రోత్రం తస్మై లోకాత్మనే నమః॥

తా॥ అగ్ని, యెవ్వనియొక్క ముఖమో, ద్యులోక మెవ్వని శిరస్సో, ఆకాశ మెవ్వని నాభియో, భూమి యెవ్వని పాదములో, సూర్యుఁడెవ్వని నేత్రమో, దిక్కులెవ్వని శ్రోత్రములో, లోకాత్మయగు నట్టి వానికి నమస్కరించుచున్నాఁడను.

ప్రకృతమునను, ద్యులోకాదులు వైశ్వానరునియొక్క శిరస్సు మొదలగు నవయవములు గాను చెప్పఁబడుచున్నవి. అది యెట్లనిన, ఔపమన్యవుఁడు మొదలగు మహర్షులు "ఆత్మానమేవేమం వైశ్వానరం సంప్రత్యధ్యేషి తమేవ నో బ్రూహి" (ఛా. ౫ ప్ర. ౧౧ ఖ. ౬ వా.) (నీవు ఇప్పుడు వైశ్వాన

రాత్మను ఉపాసించుచున్నావు. అతనిని గుఱించి యే మాకును తెలుపుమా!) అని యడుగఁగా, అశ్వపతి వారలకు వైశ్వానరాత్మను గుఱించి యుపదేశింపఁ దలఁచి, వారలు ప్రత్యేకించి వైశ్వానరాత్మను దెలుపుమని యడుగుటకు వేఱొక్క కారణమెద్దియును లేనందున, వారి కతనిని గుఱించి కొంచము తెలిసి, కొంచము తెలియకయున్నదని తనలోఁదాను నిశ్చయించుకొని, వారల కేయంశము తెలియునో, యే యంశము తెలియదో, దానిఁ దెలియఁగోరి, వారిలో నొక్కొక్కని యిట్లడిగెను. అప్పుడు "ఔపమన్యవ కం త్వ మాత్మాన ముపాస్సే" (ఛా. ౫ ప్ర. ౧౧ ఖం. ౬ వా.) (నీవు దేనిని వైశ్వానరాత్మనుగాఁ దలఁచి యుపాసించుచున్నావు) అని యౌపమన్యుని యడిగెను. అంతట అతఁడు "దివమేవ భగవో రాజన్" (నేను ద్యులోకమును వైశ్వానరాత్మనుగాను ఉపాసించుచున్నాను) అని బదులు చెప్పఁగా, ద్యులోకమే సంపూర్ణముగ వైశ్వానరుఁ డనెడి యభిప్రాయమును తొలఁగించి, అది యతనియొక్క శిరస్సు మాత్రమే యని యుపదేశించుచు అట్లు తనియొక్క యొక యవయవమగు లోకముకుఁగల "సుతేస్సు" (నక్షత్రాది తేజస్సుగలది) అనెడి విశేషనామమును దెలిపెను. అట్లే సత్యయజ్ఞుఁడు మొదలగు తక్కిన మహర్షులును తమలో నొక్కొక్కరు ఆదిత్య, వాయు, ఆకాశ, ఉదక పృథువులలో నొక్కొక్క దానిని వైశ్వానరునిగాఁ దలఁచి యుపాసించుచున్నామని చెప్పఁగా వానిలో, ఆదిత్యునికి విశ్వరూపుఁడు (సమస్తమును ప్రకాశింపఁ జేయువాఁడు) అనియు, వాయువుకు పృథగ్వర్త్మ (పలుతెఱంగులు పోవునది) అనియు, ఆకాశమునకు బహుళము (గొప్పది) అనియు, ఉదకముకు "రయిః" (వేగము గలది) అనియు, భూమికి ప్రతిష్ఠ (ఆధారభూతమైనది) అనియును విశేషనామములనియు, వానిలో నాదిత్యుఁడు వైశ్వానరునియొక్క నేత్రము గాను, వాయువు ప్రాణము గాను, ఆకాశము శరీరముయొక్క మధ్య ప్రదేశము గాను, ఉదకము మూత్రకోశము గాను నివ్విధమున నవి వైశ్వానరునియొక్క యా యా యవయవము లగుట నున్ను ఉపదేశించెను. కావున నీపైని గనఁబఱచిన ద్యులోకాదులను శిరస్సు మొదలగు వానిగాఁ గలది పరమపురుషునియొక్క రూపమే. కావున వైశ్వానరుఁడు పరమపురుషుఁడే.

అవతారిక:—మరల నొక యాక్షేపమును గొనివచ్చి దానిఁ దొలఁగించుచున్నారు.

౨౭॥ సూ॥ శబ్దాదిభ్యోఽన్తః ప్రతిష్ఠానాచ్చనేతి చేన్న తథా దృష్ట్యుపదేశాద సంభవాత్పురుషమపి చైన మధీయతే.

టీ॥ శబ్దాదిభ్యః=అగ్నిశబ్దము వైశ్వానరశబ్దముతో సమానాధికరణమునఁ జెప్పఁబడుట మొదలగు హేతువులవలననుండియు, అన్తః ప్రతిష్ఠానాత్ చ = వైశ్వానరునకు శరీరాంతరవస్థానము చెప్పియుండుటవలనను చేత్ =వైశ్వానరుఁడు పరమాత్మ కాఁడంటివేని, న=అట్లుఁ జెప్పఁ దగదు. ఏలననఁగా, తథా =అవ్విధమున, దృష్ట్యుపదేశాత్ = ఉపాసనమును ఉపదేశించి యుండుట వలనను, అసంభవాత్=కేవల జాఠరాగ్నికిద్యుమూర్ధత్వాదులుండుట యసంభవమగుట వలనున్ను (వైశ్వానరుఁడు జాఠరాగ్ని కాడు) మఱియు ఏనం ఈతనిని, పురుషమపిచ=పురుషునిగానును, అధీయతేచ=పఠించుచున్నారు.

తా॥ శ్రుతియందు అగ్నిశబ్దము వైశ్వానరశబ్దముతో సమానాధికరణమునఁ బ్రయోగింపఁబడుట వలనను, అతఁడు పరమాత్మ కాఁడంటివేని, యది యుక్తము కాదు. ఏలననఁగా, అట్టి వానినిగాను ఉపాసించుమని శాస్త్రము ఉపదేశించుచున్నది. అతఁడు జాఠాగ్నియగుట యసంభవము. కొందఱు వేదశాఖలవారు ఈతనిని పురుషునిగానును పఠించుచున్నారు.

## ఆక్షేపము.

వైశ్వానరుఁడు పరమాత్మయని నిశ్చయించుట యుక్తము కాదు. శ్రుతి యందుఅగ్నిశబ్దమును వైశ్వానరశబ్దముతో సమానాధికరణమునఁబ్రయోగించి యుండుటవలనను, వైశ్వానరుఁ ఉదరము లోపలనుండు వాఁడుగాను చెప్పి యున్నందున,నతఁడు జాఠరాగ్నిగాను తెలియవచ్చుచున్నాఁడు. ఎట్లనిన, వాజసనేయులు వైశ్వానరోపాసనమును గుఱించి పఠించుసందర్భమున "స ఏషోఽగ్నిర్వైశ్వానరః" అను వాక్యమున అగ్నిశబ్దమును వైశ్వానర శబ్దములో సమానాధికరణమునఁబఠించి యున్నారు. ఈ సందర్భమున, ఛందోగులుఁ "హృదయం గార్హపత్యః, మనోఽన్వాహార్యపచనః, ఆస్యమాహవనీయః" (ఛా. ౫ ప్ర. ౧౮ ఖ. ౨ వా.) అనువాక్యమున "వైశ్వానరుని హృదయము గార్హపత్యాగ్ని, మనస్సు దక్షిణాగ్ని,ముఖముఆహవనీయాగ్ని" అనుచు వైశ్వానరుని యొక్క హృదయాదిస్థానములను అగ్నిత్రయమునుగాను భావించి యున్నారు. వీరు "తద్యద్భక్తం ప్రథమమాగచ్ఛేత్తద్ధోమీయం సయాం ప్రథమామాహుతిం జుహుయాత్తాం జుహుయాత్ప్రాణాయ స్వాహేతి" (ఛా. ౫ ప్ర. ౧౯ ఖ ౧ వా.) ఇత్యాదివాక్యమున, "ఏయన్నము మొదట లోపలికిఁ బోవునో, అది ప్రాణాహుతి, అతఁడు మొదటి యాహుతిని "ప్రాణాయస్వాహా" అనుమంత్రముతోఁ జేయునది" అనుటచే వైశ్వానరుఁడు ప్రాణాహుతలనుంచు స్థానమునుగాఁ దెలియవచ్చుచున్నాఁడు. అట్లే వాజసనేయులు "సయోహ్యేతమేవ మగ్నిం వైశ్వానరం పురుషవిధం పురుషేఽన్తః ప్రతిష్ఠితం వేద"

(ఎవ్వఁడు ఈ వైశ్వానరుని పురుషునివంటి వానిని గాను, పురుషుని లోపల నుంచబడిన వానిని గాను ఉపాసించుచున్నాఁడో” అనువాక్యమున వైశ్వానరుని పురుషుని లోపలనుండు వానినిగాఁ బల్కుచున్నారు. ఈ పైని గానఁబఱచిన ప్రకారము వైశ్వానరశబ్దమునకు అగ్నిశబ్దముతో సామానాధికరణ్యముండుట వలనను, వైశ్వానరుఁడు అగ్నిత్రయముగాఁ గల్పింపఁబడినందునను, ప్రాణాహుతుల కాధారముగాఁ జెప్పఁబడినందునను, పురుషుని లోపలనుండువాఁడుగాఁ జెప్పబడినందునను, జాఠరాగ్నిగానును తెలియవచ్చుచున్నందుననున్న, అతఁడు పరమాత్మయే యనుట యుక్తము కాదు.

సమాధానము.

అట్లు చెప్పఁదగదు. ఏలననఁగా, పూర్వము త్రిలోక శరీరుఁడుగాఁ జెప్పఁబడిన వాఁడును, పరబ్రహ్మమునగు వైశ్వానరుని జాఠరాగ్నిశరీరుని గాను దానితోఁ గూడియుండు వానిని గానును ఉపాసింపుమని యీ తావునను పదేశింపఁబడియె. కావున, ఈ పైవాక్యముల యందుండు అగ్నిశబ్దము మొదలగు వానిచే జాఠరాగ్ని మాత్రమే చెప్పఁబడు చుండలేదు. అయితే జాఠరాగ్నివిశిష్టుఁడగు పరమాత్మ చెప్పఁబడుచున్నాఁడు. ఇది యెట్లుతెలియు నంటివేని, కేవల జాఠరాగ్ని మాత్రము మూఁడులోకములను శరీరముగాఁ గలది యగుట యసంభవము. అనఁగా, త్రైలోక్యశరీరముగాఁ గైకొనఁబడిన వైశ్వానరుని తెలుపుశబ్దముతో (వైశ్వానరశబ్దముతో) సమానాధికరణమునఁ బ్రయోగింపఁబడినదియు, జాఠరాగ్ని వాచకముగాఁ దెలియవచ్చునట్టి యగ్ని శబ్దము, పరమాత్మ జాఠరాగ్నిశరీరుఁడగుటంజేసి, యట్టి జాఠరాగ్నితోఁ గూడియుండు పరమాత్మనే తెలుపునది యని యెఱుంగునది. అట్లే భగవంతుఁడును శ్రీ భగవద్గీతలయందుఁ జెప్పియున్నాఁడు.

శ్లో॥ అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపాన సమాయుక్తో పచామ్యన్నం చతుర్విధం॥

(భ. గీ. ౧౫ అ. ౧౪ శ్లో॥)

తా॥ ఓ యర్జునా ! నేను జాఠరాగ్నిశరీరుఁడనై ప్రాణుల దేహముల నాశ్రయించి యుండి ప్రాణాపాన వాయువులతోఁగూడి యుండిన వాఁడనై నాలుగు విధములగు నన్నమును పచనము చేయుచున్నాఁడను.

కావున, జాఠరాగ్ని విశిష్టుఁడగు పరమాత్మయొక్క యుపాసనము ఈ తావున ఉపదేశింపఁబడుచున్నది. ఇంతియె కాక, వాజసనేయులు ఈ వైశ్వానరుని యొక పురుషుని గాను “స ఏషోఽగ్నిర్వైశ్వానరో యత్పురుషః”

అనువాక్యమునఁ బఠించుచున్నారు. అయితే కేవలము జాఠరాగ్ని మాత్రమే పురుషుఁడు కాదు గదా! పరమాత్మయే కదా (వేఱొక్కదానితో నిమిత్తము లేకుండ, పురుషుఁడు అని పించుకొనుచున్నాఁడు. అట్లే యతఁడు వేదముల యందును "సహస్రశీర్షా పురుషః" (పురుషసూక్తం) అనియు, "పురుష ఏవ దం సర్వం" అనియు నీమొదలగు తావుల పురుషుఁడుగాను పఠింపఁబడు చున్నాఁడు.

౨౭॥ సూ॥ అత ఏవ న దేవ తా భూ తం చ.

టీ॥ అత ఏవ=అందువలననే, వైశ్వానరుఁడు, దేవతా=దేవతయును, భూతంచ=పంచభూతములలో నొక్కటియగు అగ్నియును, న=కాడు.

తా॥ కావుననే వైశ్వానరుఁ డొకదేవతా విశేషము గాని, పంచభూతములలో నొక్కటియగు అగ్నికాని కాడు.

శ్రీ॥ భా॥ ఈపైని గానఁబఱచిన హేతువులనుబట్టి వైశ్వానరుఁడు దేవతలలో నొక్కఁడు గాని, మహాభూతములలో నొక్కటియగు అగ్నికాని కాడు.

౨౮॥ సూ॥ సా క్షా ద ప్య వి రో ధం జై మి నిః

టీ॥ సాక్షాదపి=అగ్నిశబ్దము సాక్షాత్తుగానే పరమాత్మను తెలిపినను, అవిరోధః=విరోధము లేకుండుటను, జైమినిః=జైమిన్యాచార్యుఁడు (మన్యతే =తలంచుచున్నాఁడు.)

తా॥ సాక్షాత్తుగానే యగ్నిశబ్దము పరమాత్మను తెలిపినను, విరోధ మెద్దియును లేదని శ్రీజైమిన్యాచార్యులవారు తలంచుచున్నారు.

శ్రీ॥ భా॥ శ్రుతియందు వైశ్వానరశబ్దముతో సమానాధికరణమునఁ బ్రయోగింపఁబడిన అగ్నిశబ్దము (సామాన్యముగ జాఠరాగ్నిని తెలుపునదై తద్వారా)జాఠరాగ్ని శరీరుఁడగుటంజేసి తద్విశిష్టుఁడగు పరమాత్మను తెలుపుచున్నదని యింతకు పూర్వము చెప్పఁబడియె. అయితే వైశ్వానర శబ్దము వలెనే యగ్నిశబ్దమున్ను సాక్షాత్తుగానే పరమాత్మను తెలుపుచున్నదన్నను, దోషము లేదని శ్రీ జైమిన్యాచార్యులవారు తలంచుచున్నారు. అదియెట్లనిన, వైశ్వానరశబ్దము సాధారణముగ ఇతర పదార్థములనున్ను తెలుపునదియే యైనను, ప్రకృతమున నది పరమాత్మకు మాత్రమే యుండునట్టి ధర్మములను తెలుపునట్టి శబ్దములచే విశేషింపఁ బడుటంజేసి "సమస్తనరులను పాలించుట" ఇత్యాది గుణములనుబట్టి యది పరమాత్మనే తెలుపునది యని నిశ్చయించునట్లు, అగ్నిశబ్దమున్ను "ముందుపోవునది" యీమొదలగు గుణము

లనుబట్టి యగ్నిని తెలియఁజేయునది యగు నట్లు, ఆ గుణమే నిరుపాధికముగ పరమాత్మయందు సంపూర్ణముగానుండుట సంభవము గాన, ఈ ప్రకరణమున, ఆ శబ్దము పరమాత్మకు మాత్రము ఉండునట్టి గుణములను తెలుపు శబ్దములచే విశేషింపఁబడుటంజేసి యది యీతావున పరమాత్మను తెలుపునది.

అవతారిక:—అపరిచ్ఛిన్నుఁడగు పరబ్రహ్మము. "యస్త్వేత మేవం ప్రాదేశమాత్రమభి విమానం" అను శ్రుతియందుఁ జెప్పయున్నట్లు, ద్యులోకము మొదలు పృథివివరకును శ్రుతియందుఁ జేర్కొనఁబడిన ప్రదేశములతో సంబంధించి యున్నంత మాత్రమనుట (పరిచ్ఛిన్నునిగాఁ) జెప్పుట యెట్లు పొసగునని యాక్షేపింపఁగా, అందులకు సమాధానము జెప్పుటకై,

౩౦॥ సూ॥ అ భి వ్య క్తే రి త్యా శ్మ ర థ్యః

టీ॥ ప్రాదేశమాత్రత్వం=పరబ్రహ్మము ద్యులోకాదులతో సంబంధించియున్నంత మాత్రమనుట, అభివ్యక్తేః=ఉపాసకునికది తెలియవచ్చుటకుగాసని, ఆశ్మరథ్యః=ఆశ్మరథ్యాచార్యుఁడు, (మన్యతే=తలంచుచున్నాఁడు.)

తా॥ ఉపాసకుని ధ్యానమున సౌకర్యమును గలుగఁజేయుటకై పరమాత్మ ద్యులోకాదులతో సంబంధించియుండునంత మాత్రముగా శ్రుతియందుఁ జెప్పఁబడియెనని శ్రీ యాశ్మరథ్యాచార్యులవారు తలంచుచున్నారు.

శ్రీ॥ భా॥ ఉపాసకునికి ధ్యానమునందు సౌకర్యమును గలుగఁజేయుటకై పరబ్రహ్మము ద్యులోకాదులతో సంబంధించి యుండు నదిగాను శ్రుతియందుఁ జెప్పఁబడియెనని శ్రీ యాశ్మరథ్యాచార్యుల వారు తలంచుచున్నారు. పరబ్రహ్మము సర్వమును వ్యాపించియుండి మేర లేనివాఁడే యయినను, అతఁడు "ద్యౌర్మూర్థా, ఆదిత్యశ్చక్షుః, వాయుః ప్రాణః, ఆకాశో మధ్యకాయః, ఆపో వస్తిః, పృథివీ పాదా" అనువాక్యమున ద్యులోకాది ప్రదేశములతో సంబంధించి యుండినంత మాత్రమని చెప్పియుండుట యుపాసకుని యుపాసనమున సౌకర్యమును గలుగఁజేయుటకుగాను కాదగును.

అవతారిక:—పరబ్రహ్మము శిరస్సు మొదలగు నవయవములుగలవాఁడనుచు నతనిని పురుషాకారుని గాను శ్రుతియందేల చెప్పియుండవలయునని శంకింపఁగా, నందులకు సమాధానము చెప్పుటకై:—

౩౧॥ సూ॥ అ ను స్మృ తే ర్బా ద రిః

టీ॥ అనుస్మృతేః=ఇవ్విధమున భావించి యుపాసించుటకుగానని బాదరిః=బాదరాచార్యుఁడు, (మన్యతే=తలంచుచున్నాఁడు.)

తా॥ ఉపాసనమునకుగాను పరబ్రహ్మ మట్టిదిగాఁ జెప్పఁబడియెనని శ్రీ బాదరాయాచార్యులవారు తలంచుచున్నారు.

శ్రీ॥ భా॥ యస్త్వే తమేవ మభివిమాన మాత్మానం వైశ్వానరము పాస్తే స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్న మత్తి” (ఎవ్వఁడు అంతటను వ్యాపించియుండువాఁడును, మేరలేనివాఁడును నగు వైశ్వానరాత్మను, ఈపైని గనఁబఱచిన ప్రకారము, పురుషాకారునిగాను ఉపాసించుచున్నాఁడో, అతఁడు సర్వలోకములయందును, సర్వభూతముల యందును, సర్వాత్మలయందును అన్నమును భుజించుచున్నాఁడు) అనువాక్య మున బ్రహ్మప్రాప్తికిగాను ఉపాసనము ఉపదేశింపఁబడుచున్నది. ఈపై వాక్యమున “ఏత మేవం=ఈతని నివ్విధమున” అనఁగా “ఈపైని గానఁ బఱచిన ప్రకారము పురుషాకారునిగా” అని యర్థము. “సర్వేషు. లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మ స్వన్నమత్తి” “అనఁగా “సర్వలోకముల లోను, సర్వభూతములలోను, సర్వాత్మలలోనును భోగ్యవస్తువగు ఏ పర బ్రహ్మము కలదో, సర్వత్ర యుండువాఁడును స్వతస్సిద్ధముగానే మేరలేని యా నందాద్యతిశయముగల యాపరబ్రహ్మమును ఈయుపాసకుఁడు అనుభవించు చున్నాఁడు” అని యర్థము, కర్మవశ్యులగు ఈజీవులందఱును వారు వారు ప్రత్యేకముగ తమకు తమకు ఇష్టమయినట్టి యే యన్నమును భుజించుదురో ఆ యన్నము ముముక్షువులకు త్యాజ్యమగుటంజేసి యీపై వాక్యమున నుండు “అన్న” శబ్దము అట్టి యన్నమును తెలుపునది కాదని యెఱుంగు నది.

అవతారిక:—వైశ్వానరుఁడనఁగా పరమాత్మయగు పక్షమున, అతని యొక్క వక్షస్థలము మొదలగు వానిని అగ్నిగుండము మొదలగు వానిని గానుభావించునది యని యివ్విధమున నేల ఉపదేశింపఁదగును? అతఁడు జాఠరాగ్ని యగు పక్షమునఁ గదా! అవ్విధమున నుపదేశింపఁదగును? అని శంకింపఁగా ఆ శంకను పరిహరించుటకై :—

౩౦॥ సూ॥ సమ్పత్తేరితి జైమినిస్తథా హి దర్శయతి.

టీ॥ సమ్పత్తేః=అగ్నిత్వమును గలుగఁజేయుటకుగాను, ఇతి=వక్షస్థ లము మొదలగు నవి అగ్నిగుండము మొదలగునవిగాఁ జెప్పబడినవి యని జైమినిః=జైమినిముని (మన్యతే = తలంచుచున్నాఁడు.) తథాహి = అట్లే కదా దర్శయతి=శ్రుతియును తెలుపుచున్నది.

తా॥ వైశ్వానరునికి అగ్నిభావమును గలుగఁజేయుటకు గాను, అతని వక్షస్థలము మొదలగునవి యగ్నిగుండము మొదలగునవిగాఁ జెప్పఁబడినవి. అట్లే కదా శ్రుతియును తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ ద్యులోకము మొదలు పృథివివరకును శ్రుతియందుఁ జేర్కొనఁబడిన పదార్థములు శరీరముగాఁ గలవాఁడును, పరమాత్మయే యగు వైశ్వానరుని ఆరాధించుటకుగాను, ఉపాసకులచే దినదినము అనుష్ఠింపఁబడు నట్టి ప్రాణాహుతికి యగ్నిహోత్రకర్మత్వమును గలుగఁజేయుటకై వక్షస్థలము మొదలగునవి అగ్నిగుండము మొదలగునవిగాను శ్రుతియందు ఉపదేశింపఁబడినవని శ్రీ జైమిన్యాచార్యుల వారు తలంచుచున్నారు. ఏలననిన, ఉపాసనమునకుఁ దగినట్టి ఫలమును, ప్రాణాహుతికిగాను అగ్నిత్వ సంపాదానము నున్ను శ్రుతియే కాన్పించుచున్నది. అది యెట్లనిన, ఛందోగులు "స యది దమవిద్వాన్ అగ్నిహోత్రం జుహోతి యథాంగారానపోహ్య భస్మని జుహుయాత్తాదృక్స్యాత్ అథ య ఏతదేవం విద్వా నగ్నిహోత్రం జుహోతి తస్య సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మసు హుతం భవతితద్య థేషీకతూలమగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్యసర్వే స్మాపానః ప్రదూయన్తే (ఇట్టి ధ్యానములేక పాణాహుతులఁజేయుట, నిప్పుచల్లారగా భస్మమునందు హోమము చేసినట్లగును. ఇట్టి ధ్యానముతోఁ జేయువాని ప్రాణాహుతి హోమము చేయఁబడినదగును. జమ్ము దూది యగ్నిమీఁదు పడినతోడనే దగ్ధమై పోవు చందమున, అట్టివాని పాపములన్నియును నశించుచున్నవి.) అని పఠించియున్నారు.

33॥ సూ॥ ఆ మ న న్త చై న మ స్మి న్

టీ॥ అస్మిన్=ఈ యుపాసకుని శరీరమునందు, ఆమనన్తి=వైశ్వానరుని ప్రాణాహుత్యాధారమునుగా ఛందోగులు పఠించుచున్నారు.

తా॥ ఛందోగులు వైశ్వానరుని ఉపసాకునియొక్క శరీరమునందు ప్రాణాహుతుల కాధారభూతముగా నుండు వానినిగాఁ బఠించుచున్నారు.

శ్రీ॥ భా॥ పరమపురుషుఁడును, ద్యులోకమును శిరస్సునుగాఁ గలిగి యుండుట యీమొదలగు వానితోఁ గూడియుండునటి వాఁడునగు వైశ్వానరుని ఉపాసకుని శరీరమునందు ప్రాణాహుతుల కాధారమునుగాను "తస్య హ వా ఏత స్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాః" ఇత్యా

ది వాక్యమున ఛందోగులు పఠించుచున్నారు. దీని యర్థమేమనఁగా, వీరు "యస్త్వేతమేవం ప్రాదేశ మాత్ర మభివిమాన మాత్మానం వైశ్వానరము పాస్తే" (ఛా. ౫ ప్ర. ౧౮ ఖ.) అను వాక్యమున, త్రిలోకశరీరుఁడును, పరమాత్మయునగు వైశ్వానరునియొక్క యుపాసనమును విధించి, "సర్వేషు లోకేషు" అనువాక్యమున అందులకు బ్రహ్మప్రాప్తిని ఫలమునుగా నుపదేశించి, యిట్టి వైశ్వానరోపాసనమున కంగభూతమగు ప్రాణాగ్ని హోత్రమును "తస్య హవా ఏతస్య" ఇత్యాది వాక్యమున నుపదేశించుచున్నారు. పూర్వము ఉపాస్య వస్తువుగా నుపదేశింపఁ బడినట్టి వైశ్వానరుని కవయవ భూతములును, సుతేజస్సు, విశ్వరూపుఁడు ఈ మొదలగు నామధేయములు గల అగ్న్యాదిత్యులను ఉపాసకుని యొక్క శిరస్సు మొదలు పాదము వరకుండు అవయవములయందుఁ గలుగఁజేయుచున్నారు. ఈ తావున "మూర్ధైవ సుతేజాః" (శిరస్సే సుతేజస్సు) అనఁగా, "ఉపాసకుని శిరస్సే పరమాత్మయొక్క శిరస్సగు ద్యులోక మనుట "చక్షుర్విశ్వరూపః=చక్షుస్సు విశ్వరూపుఁడు" అనఁగా ఆదిత్యుఁడని యర్థము "ప్రాణః పృథగ్వర్త్మా" అనఁగా (ప్రాణము) వాయువని యర్థము. "సన్దేహో బహుళః" అనఁగా, "ఉపాసకుని శరీరముయొక్క మధ్యభాగమెద్దియో, అది పరమాత్మయొక్క శరీరమధ్యభాగమగు ఆకాశమని యర్థము. "వస్తి రేవ రయిః" అనఁగా, ఉపాసకుని యొక్క మూత్రకోశమే పరమాత్మయొక్క అవయవ భూతములగు ఉదకములని యర్థము. "పృథివ్యేవ పాదా" అనఁగా, "ఈ యుపాసకుని పాదములే సర్వేశ్వరునికి పాదభూతమగు పృథివి" యని యర్థము. ఇట్లు ఉపాసకుఁడు, త్రైలోక్య శరీరుడును పరమాత్మయునగు వైశ్వానరుని తన శరీరము నందుంచబడిన వానినిగా ననుసంధించుకొని తన వక్షస్థలము, రోమములు, హృదయము, మనస్సు ముఖము ఇవి క్రమేణ ప్రాణాహుతుల కాధారభూతుఁడును, పరమాత్మయునగు వైశ్వానరునియొక్క వేదిక, బర్హి, రోమములు, గార్హపత్యము, దక్షిణాగ్ని ఆహవనీయము లనఁబడు అగ్నిహోత్రోపకరణములను గాను భావించి ప్రాణాహుతిని అగ్నిహోత్రకర్మమును గాను భావించి, ఇవ్విధమున ప్రాణాగ్ని హోత్రమనఁబడు కర్మముతో పరమాత్మయగు వైశ్వానరుని యుపాసించునది యని "ఉర ఏవవేదిర్లోమాని బర్హిః హృదయం గార్హపత్యః" ఇత్యాది

శ్రుతివాక్యము ఉపదేశించుచున్నది. కావున పరమాత్మయగు పురుషోత్త
ముఁడే వైశ్వానరుఁడని తెలియుచున్నది.

వైశ్వారాధికరణము ముగిసెను.



గద్య॥ ఇది, శ్రీకృష్ణానద్యుత్తరవాహినీతీరస్థ బద్ధవిరామక్షేత్రాపరనామక
వైకుంఠపురవాస్తవ్య,శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక
కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణ
తార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీసేరరుళాళరామానుజయతివరపరమాను
గ్రహసమధిగతసకలవిశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయ గ్రంథతత్త్వార్థ,
వాధూలకులతిలక వేంకటాచార్యరంగమాంబాతనూజ, కావ్యరత్న,
వేదాన్తరత్న, వేదాన్తతీర్థ. వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరు
దాలంకృత, గీర్వాణాంగ్లద్రవిడాంధ్ర శుద్ధమాగధ్యవస్థాది
ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య
ప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు
ప్ర థ మా ధ్యా య ము న
ద్వితీయపాదము.
శ్రీ ర స్తు.







శ్రీమతేరామానుజాయనమః

# శ్రీమదాంధ్రశ్రీభాష్యము.



ప్రథమాధ్యాయము—తృతీయపాదము.



## ద్యుభ్వాద్యధికరణము.

౧॥ సూ॥ ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్.

శ్రీ॥ భా॥ ఆధర్వణికులు "యస్మిన్ద్యౌః పృథివీచాన్తరిక్షమోతం మనస్సహ ప్రాణైశ్చ సర్వైస్తమేవైకం జానథాత్మాన మన్యావాచో విముఞ్చథ" (ము. ౨ ము. ౨ ఖ. ౫ వా.) (దివి భువి యంతరిక్షములును సమస్తప్రాణసహితమగు మనస్సును దేని నాధారముగాఁ గలిగియున్నవో, అట్టి యాత్మ నొక్కదానిఁ దెలిసికొనుఁడు. వేఱు వేఱు మాటలను విడువుము) అని పఠించుచున్నారు. ఈ తావున నొక సంశయము గలుగుచున్నది.

### సంశయము:

ఈ తావున ద్యావాపృథివ్యాదులకాధారభూతుఁడుగా వినఁబడు వాఁడు జీవుఁడా? పరమాత్మయా?

### పూర్వపక్షము.

అతఁడు జీవుఁడనుట యుక్తము. ఏలననిన, "అరావివ రథనాభౌ సంహతా యత్ర నాడ్యః స ఏషోఽన్తశ్చరతే బహుధా జాయమానః" (బండి కుండయందు (బండి) ఆకుల వలెనే యెవ్వనియందు నాడులు ఉంచబడినవో, అతఁడు అనేక విధములుగ పుట్టుచు లోపల సంచరించుచున్నాఁడు) అను తరువాతి శ్లోకమున, పూర్వవాక్యమున ద్యులోకాదుల కాధారభూతుఁడుగాఁ జెప్పఁబడిన వాసిని తిరిగి "యత్ర=ఎవ్వనియందు" అను సప్తమ్యంతముచేఁ బరా

మర్శించి, యతఁడు నాడుల కాధారభూతుఁడగుటను తెలిపి, తిరిగి "స ఏషో౽న్తశ్చరతే బహుధా జాయమానః" అనువాక్యమున, అతఁడు నానావిధములుగాఁ బుట్టువాఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. నాడులతో సంబంధించి యుండుటయు, దేవాది శరీరుఁడు గాను నానావిధములుగ బుట్టుటయును జీవునియొక్క ధర్మములే. ఈ శ్లోకమునను, "ఓతం మనస్సహ ప్రాణైశ్చ సర్వైః" అనుతావునఁ జెప్పియున్న ప్రకారము "పంచప్రాణములకును మనస్సునకును ఆశ్రయముగా నుండుట" జీవునియొక్క ధర్మమే. ఇట్లు ఈతఁడు జీవుఁడని నిశ్చితమగుటంజేసి, ద్యావాపృథివ్యాదుల కాశ్రయమగుటనున్న యే దొక విధమున సరిపుచ్చుకొనునది.

సిద్ధాంతము.

ఈ పై వాక్యమున ద్యావాపృథివ్యాదుల కాధారభూతుఁడుగాఁ జెప్పఁబడిన వాఁడు పరమాత్మయే. ఏలననఁగా ఈ తావున బ్రహ్మమును గుఱించి మాత్రమే తెలుపునట్టి శబ్దము గలదు. "అమృతస్యైవ సేతుః" అను శబ్దము "మోక్షమును గలుగఁజేయువాఁడు" అని తెలుపుచున్నది. "తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పన్థా అయనాయ విద్యతే" (పరబ్రహ్మము నివ్విధమున ఉపాసించువాఁడు జన్మమరణాది రూపమగు సంసారమునుండి విముక్తుఁడగుచున్నాఁడు. అందులకై వేఱొక్క మార్గము లేదు.) అని చెప్పియున్నట్లు ఉపనిషత్తులయం దెల్లెడలను పరబ్రహ్మమే కదా అమృతత్వమనఁబడు మోక్షమును గలుగఁజేయువాఁడుగా వినఁబడుచున్నాఁడు పైశ్రుతియందుండు "సేతుః" అను శబ్దము "బంధించుట" యను అర్థము గలది. ఏలననఁగా, ఇది "సినోతి" ధాతువునుండి పుట్టునది. అందువలన దీనికి "బంధించునది" యనియర్థము. అనఁగా అమృతత్వమును గలుగఁజేయునది యనుట. అథవా, సేతువనఁగా "వంతెన" అని యర్థము. ఈ తావున వంతెన వంటివాఁడని యర్థము. నదులు మొదలగు వానిపైయుండు వంతెన ఆవలి వడ్డుకుఁ బోవుటకు సాధనభూతమైనది. ఈ తావున నట్టివంతెన వంటివాఁడుగాఁ జెప్పఁబడిన పరబ్రహ్మమున్ను సంసారమనఁబడు సముద్రమున కావలనుండు అమృతత్వమనఁబడు మోక్షమును జేరుటకు సాధనభూతుఁడనుట. మఱియు ఈ పై వాక్యమునఁ బ్రయోగింపఁబడిన "ఆత్మ" శబ్దము వేఱొక్క నిమిత్తము నపేక్షింపకయే పరమాత్మను తెలుపునది. ఏలననఁగా, "ఆప్నోతీత్యాత్మా = వ్యాపించునది యాత్మ" అనుశబ్దవ్యుత్పత్తినిబట్టి తక్కిన పదార్థము లన్నింటికిని నియామకుఁడగుటంజేసి

యన్నింటిని వ్యాపించి యుండుట యతనికే సంభవము. కావున "ఆత్మ" శబ్దమున్ను పరమాత్మనే తెలుపునది. మఱియు ఈ శ్రుతియందు "యస్స ర్వజ్ఞ స్సర్వవిత్" అను తావున నుండు "సర్వజ్ఞః, సర్వవిత్" ఈ మొదలగు శబ్దములున్ను పరమాత్మనే తెలుపునవి. నాడుల కాధారముగా నుండుట యనఁబడునది పరమాత్మకున్ను సంభవము. ఏలననఁగా, "సన్తతం సిరాభిస్తు లమ్బత్యా కోశసన్నిభం" (తై. నారా. ౧౩ అను) (కమలము కుళమువంటి హృదయకమలము నాడులతోఁ జుట్టబడి వ్రేలాడుచున్నది.) (తై. నా. ౧౩. అను.) అనువాక్యము మొదలుకొని "తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః" (హృదయకమలము నందలి యగ్నిశిఖ యొక్క మధ్యను పరమాత్మగలడు) అనువాక్యమువరకును పరమాత్మ నాడుల మధ్యనుండుటచే వానితో సంబంధము పరమాత్మకుఁ గలదని తైత్తి రీయులు పఠించుచున్నారు. "బహుధా విజాయమానః=అనేక విధములుగాఁ బుట్టుచుండువాఁడు" అనుటయును పరమాత్మ విషయమై పొసగుచున్నది. ఏలననిన, "అజాయమానో బహుధా విజాయతే తస్య ధీరాః పరిజానన్తి యోనిం" అనుశ్రుతి వాక్యము (కర్మవశమునఁ బుట్టనివాఁడయి స్వేచ్ఛ వలన ననేక విధములుగాఁ బుట్టువాఁడు. అతని స్వరూపమును జ్ఞానులు తెలిసికొనుచున్నారు. దేవమనుష్యాదులు తనను ఆశ్రయించి యుజ్జీవించు టకు గాను వారి వారి జాతిసంబంధమైన రూపముతోను, ఆకారముతోను గుణములతోను కర్మముతోను గూడియున్నవాఁడై తనయొక్క స్వభావ మును విడువకయే పరమపురుషుఁడు తన యొక్క యిచ్ఛవలన నానావిధ ములు గాను పుట్టుచున్నాఁడు) అని తెలుపుచున్నది. స్మృతులయందును,

"శ్లో॥ అజోపి సన్నవ్యయాత్మా భూతనామీశ్వరోపి సన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామి యుగేయుగే"

(భ. ౪. అ. ౬. శ్లో.)

తా॥ ఓ యర్జునా! నేను కర్మవశమునఁ బుట్టనివాఁడనైనప్పటికిని, పరమేశ్వర స్వభావములగు అపహత పాప్మత్వము మొదలగు వానిని విడు వకయే శుద్ధసత్వస్వభావమైన రూపమునే (విగ్రహమునే) దేవమనుష్యా దులతో సమానమైన యాకారము కలదానినిగాఁజేసి నాసంకల్పముచేత దేవాదిరూపము కలవాఁడనై పుట్టుచున్నాను. ఈ పైని గాన్పించిన ప్రకా రము చెప్పఁబడియె."

మనస్సు మొదలగు జీవోపకరణములకు ఆధార భూతుఁడగుటయును సర్వమునకు ఆధారభూతుఁడగు సర్వేశ్వరునికే సంభవము.

అవతారిక:—ఈ క్రిందు గాన్పింపఁబడు హేతువువలనను,

౨॥ సూ॥ ము క్తో ప సృ ప్య వ్య ప దే శా చ్చ

టీ॥ ముక్తోపసృప్యవ్యపదేశాచ్చ=ముక్తులచేఁ బొందబడు వాఁడుగాఁ జెప్పి యున్నందునను.

తా॥ ద్యులోకాదుల కాధారభూతుఁడుగాఁ జెప్పఁబడినవాఁడు ముక్తులచేఁ బొందఁబడువాఁడుగా శ్రుతులయందుఁ జెప్పఁబడినందునను అతఁడు పరమాత్మయే.

శ్రీ॥ భా॥ ద్యులోక పృథివ్యాధుల కాధారభూతుఁడగు ఈపురుషుఁడు సంసారబంధమునుండి విముక్తులయిన వారి చేతనున్ను పొందబడువాఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. అది యెట్లననిన, ఆథర్వణికులు “యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం। తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్యము పైతి” (ము. 3 ము ౧ ఖ 3 వా.) (కర్తయును, స్వర్ణవర్ణుఁడును, పరిపాలకుఁడును, బ్రహ్మాండమును గలుగఁ జేసిన వాఁడునునగు పరమపురుషుని యెప్పుడు ఉపాసకుఁడు సాక్షాత్కరించు చున్నాఁడో, అప్పుడీతఁడు పుణ్యాపాపములఁ బోగొట్టుకొని, ప్రకృతి సంబంధము లేనివాఁడై, పరమపురుషునితో పరమసామ్యమును బొందుచున్నాఁడు.) అరియు, “యథా నద్య స్స్యందమానాః సముద్రే అస్తం గచ్ఛన్తి నామ రూపే విహాయ తథా విద్వాన్ నామరూపాద్వి ముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యం” (ము. 3 ము. ౨ ఖ. ౮ వా.) (సముద్రమునఁ బ్రవహించునట్టి నదులు నామరూపములను వదలుకొని సముద్రము వంటివి యగు చందంబున, బ్రహ్మోపాసకుఁడును, నామరూపములఁ బోగొట్టుకొని పరాత్పరుఁడగు పురుషుని బొందుచున్నాఁడు.) అని పఠించుచున్నారు. సంసార బంధమునుండి విముక్తులయిన వారే కదా! పుణ్యాపాపములఁ బోగొట్టుకొనిన వారును, ప్రకృతి సంబధము లేనివారును, నామరూపములనుండి విముక్తిని బొందినవారును. పుణ్యాపాపకర్మముల నిమిత్తమున నచేతన పదార్థముతో సంబంధించి యుండుటయే కదా! సంసారమనంబడుచున్నది. కావున, పుణ్యాపాపములఁ బోగొట్టుకొని, యందుమూలముగ ప్రకృతిసంబంధము లేనివారై, పరబ్రహ్మముతోఁ బరమ సామ్యమును బొందిన వార

లక్షిప్రాప్యముగాఁ గాన్పింపఁబడినట్టి వాఁడును, ద్యుభ్వాద్యాధార భూతుఁడునగు పురుషుఁడు పరబ్రహ్మమే.

అవతారిక:—శ్రుతియందు పరబ్రహ్మమును మాత్రము తెలుపునట్టి శబ్దములు మొదలగునవి ఉండుటంజేసి వైశ్వానరుఁడు పరబ్రహ్మమే యని నిరూపించి, తరువాత ఇప్పుడు జీవుని మాత్రము తెలుపునట్టి శబ్దములచట లేక పోవుటం జేసియును ఈతఁడు పరబ్రహ్మమే యని తెలుపుచున్నారు.

3॥ సూ॥ నా ను మా న మ త చ్ఛ బ్దా త్ప్రా ణ భృ చ్చ.

టీ॥ అతచ్ఛబ్దాత్=ప్రకృతిని గాని, జీవుని గాని తెలుపునట్టి శబ్దమెద్దియు ప్రకరణమున లేనందున, నిచట ప్రతిపాదింపఁబడునది, అనుమానం=ప్రకృతియు, ప్రాణభృచ్చ=జీవుఁడును, న=కాదు.

తా॥ ప్రకృతిని గాని, జీవుని గాని, తెలుపునట్టి శబ్దము ప్రకరణమునం దెచటను లేనందున, నిచట ప్రతిపాదింపఁబడునది ప్రకృతిగాని, జీవుఁడు గాని కాఁడు.

శ్రీ॥ భా॥ ఈ ప్రకరణమున ప్రకృతిని తెలుపునట్టి శబ్దమెద్దియును లేనందున, ఇచట ప్రతిపాదింపఁబడునది ప్రకృతి కానట్లు, జీవుఁడును కాడు. సూత్రమునందుండు "అను మానశబ్దము" "అనుమీయత ఇత్యనుమానం" (అనుమానింపఁబడునది) అను శబ్దవ్యుత్పత్తిని బట్టి సాంఖ్యస్మృతి ప్రోక్తమగు ప్రధానమును దెలుపునది. అథవా "అనుమానప్రమితత్వాదనుమానం" (అనుమాన ప్రమాణముచేఁ గన్పట్టబడునది) అనుశబ్ద వ్యుత్పత్తినైనను గొనవచ్చును. "అతచ్ఛబ్దాత్" అనఁగా "వానిఁ దెలుపు శబ్దములు లేనందున" అని యర్థము "అర్థా భావే యదవ్యయం" అను వ్యాకరణవాక్య ప్రకారము ఈ తావున అవ్యయీభావ సమాసము.

అవతారిక:—ఈ క్రిందు గాన్పింపఁబడు హేతువులనను వైశ్వానరుఁడు జీవుఁడు కాఁడు.

౪॥ సూ॥ భే ద వ్య ప దే శా త్.

టీ॥ భేదవ్యపదేశాత్ = భేదము జెప్పియుండుటవలనను,

తా॥ భేదము జెప్పియుండుట వలనను వైశ్వానరుఁడు జీవుఁడు కాఁడు.

శ్రీ॥ భా॥ "సమానే వృక్షే పురుషో నిమగ్నో అనీశయా శోచతి ముహ్యమానః । జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్య మహిమాన మితివీత

శోకః" (శ్వే. ౪ అ. ౭) ఇత్యాది శ్రుతులయందు జీవాత్మ పరమాత్మ కంటెను వేఱయినవాఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. ఈ పై శ్రుతియొక్క యర్థమేమనఁగా, జీవుఁడు ప్రకృతిచే నజ్ఞానమును పొందింపఁబడిన వాఁడై దుఃఖించుచున్నాఁడు. ఎప్పు డీతఁడు తనకంటె వేఱయినవాఁడును, ప్రేమింపఁ బడినవాఁడునగు పరమాత్మను న్ను జగన్నియ మనరూపమగు నతని మహిమ నున్ను కనుఁగొనుచున్నాఁడో, అప్పు డీతఁడు దుఃఖములు పోయిన వాఁడగు చున్నాఁడు.

౫॥ సూ॥ ప్ర క ర ణా త్.

టీ॥ ప్రకరణాత్=ప్రకరణమును బట్టియు,

తా॥ ప్రకరణమును బట్టియును అట్లే తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఇది పరమాత్మను గుఱించి తెలుపునట్టి ప్రకరణమని "అదృ శ్యత్వాదిగుణకో ధర్మోక్తేః" (బ్ర. సూ ౧ అ ౨ పా. ౨౨ సూ) అను సూ త్రమునఁ గాన్పింపఁబడియె. అయినను, నాకులతో సంబంధించియుండుట, అనే కవిధములుగాఁ బుట్టుట, మనః ప్రాణముల కాధారమగుట యీ మొదలగునవి యీ తావునఁ జెప్పఁబడి నందున, నిది పరమాత్మను గుఱించిన ప్రకరణము కాదేమోయను సంశయము మాత్రము ఈసూత్రమున పరిహరింపఁబడుచున్నది.

౬॥ సూ॥ స్థి త్య ద నా భ్యాం చ.

టీ॥ స్థిత్య దనాభ్యాం చ=ఉనికియును, భక్షణమున్ను చెప్పి యున్నం దునను (జీవుఁడు ద్యుభ్వాద్యాయతనుఁడు కాఁడు.)

తా॥ సర్వాయతన వస్తువును తటస్థునిగాను, జీవుని కర్మఫలము నను భవించునట్టి వానినిగానును శ్రుతియందు వర్ణించి యుండుటంజేసి జీవుఁడు ద్యులోకాదుల కాధారభూతుఁడు కాఁడు.

శ్రీ॥ భా॥ "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరి షస్వజాతే తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యో ఽభిచాకశీతి" (శ్వే. ౪ అ ౬ వా.) (ఎప్పుడును కలిసియుండు వారును, స్నేహితులునగు రెండు పక్షులు (జీవాత్మ పరమాత్మలు) ఒక్కటియే వృక్షమున (శరీరమున) నుండు వారు. వారిద్దఱిలో, ఒక్కటి (జీవాత్మ) రుచియయిన ఫలమును (కర్మఫలమును) అనుభవించుచున్నది. రెండవది (పరమాత్మ) దాని నను భవింపక అంతటను ప్రకాశించుచున్నది.) అను శ్రుతివాక్యము జీవాత్మ

కర్మఫలము ననుభవించు నదియే యనియును, పరమాత్మ యన్ననో, ప్రకాశించుచున్నదై శరీమునందు మాత్రముండునది యని ప్రతిపాదింపుచున్నది. వారిలో, కర్మఫలము ననుభవింపక ప్రకాశించువాఁడే సర్వజ్ఞుఁడును, అమృతత్వమును గలుగఁజేయువాఁడును, అన్నింటిలో నాత్మగానుండువాఁడును, ద్యుభ్వాదుల కాధార భూతుఁడును కాఁగలఁడు. ఇంతియేకాని, కర్మఫలము ననుభవించుచు, దుఃఖించువాఁడగు జీవుఁడు అట్టి వాఁడు కాఁజాలఁడు. కావున ద్యులోకాదుల కాధారభూతుఁడుగా శ్రుతియందుఁ జెప్పఁబడిన వాఁడు పరమాత్మయే యని సిద్ధమగుచున్నది.

ద్యుభ్వాద్యాయతనాధికరణము ముగిసెను.



## భూమాధికరణము.

౭॥ సూ॥ భూమా సమ్ప్రసాదా దధ్యుపదేశాత్.

టీ॥ సమ్ప్రసాదాత్ = జీవునికంటె, అధ్యుపదేశాత్ = అధికుఁడుగాఁ జెప్పఁబడుటవలన, భూమా = శ్రుతియందు భూమయని చెప్పఁబడు పదార్థము పరబ్రహ్మమే.

తా॥ భూమ యనఁబడువాఁడు జీవునికంటె నధికుఁడుగాఁ జెప్పబడినందున, అతఁడు పరబ్రహ్మమే.

శ్రీ॥ భా॥ ఛందోగులు, "యత్రనాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా, అథ యత్రాన్యత్పశ్యత్యన్య చ్ఛృణోత్యన్యద్విజానాతి తదల్పం" (ఛా. ౭ ప్ర. ౨౪ ఖ. ౧ వా.) (దేని ననుభవించునప్పుడు వేఱొక్కదానిఁ దెలిసికొనఁడో, వేఱొక్కదానిని వినఁడో, వేఱొక్క దానిని సాక్షాత్కరింపఁడో అది భూమ, దేని ననువించునప్పుడు వేఱొక్క దానిఁ దెలిసికొనుచున్నాఁడో, వేఱొక్క దానిని వినుచున్నాఁడో, వేఱొక్క దానిని చూచుచున్నాఁడో, అది యల్పము) అని పఠించుచున్నారు.

ఈపై శ్రుతియందుండు "భూమా" అను శబ్దము భావప్రత్యయాంతము. అదియెట్లనిన, వ్యాకరణమునందు పృథ్వాదిగణమున "బహు" శబ్దము పఠింపఁబడుచున్నది. ఆ బహుశబ్దమున కావల "పృథ్వాదిభ్య ఇమనిజ్వా" అను సూత్రప్రకారము "ఇమనిచ్" ప్రత్యయమును బెట్టుకొనఁగా, "బహోర్లోపో భూచ బహోః" (పాణిని. ౬ అ. ౪ పా. ౧ సూ) (బహు అనునది

లోపించి దాని తావున భూ అనునది వచ్చును.) అను సూత్రప్రకారము బహు శబ్దముయొక్క స్థానమున "భూ" అనునది వచ్చుటచే "భూమా" అను శబ్దము వ్యుత్పన్నమగుచున్నది. "భూమా" అనఁగా, బహుత్వమని యర్థము. ఈ తావున "బహు" శబ్దము వైపుల్యమును తెలుపునదియేగాని, సంఖ్యను తెలుపునది కాదు. అది యెట్లు తెలియుననఁగా, "యత్రాన్యత్పశ్యతి తదల్పం" "దేనిననుభవించుచు వేఱొక్కదానిని తెలిసికొనుచున్నాఁడో అది యల్పము (స్వల్పము)" అను తరువాతి భాగమున పూర్వభాగమునఁ జెప్పఁబడిన బహుత్వమునకు ప్రతిభటమైనది అల్పమని చెప్పఁబడుచున్నందున నట్లు తెలియుచున్నది. పూర్వము చెప్పఁబడిన బహుత్వము ఈ తావునఁ జెప్పబడిన స్వల్పమయిన దానికి ప్రతిభటమైనదిగాఁ జెప్పఁబడుటంజేసి, యది యొక ధర్మిని (వస్తువును) తెలుపునదిగాఁ దెలియవచ్చుచున్నది. కావున యను శబ్ద మొక ధర్మమును తెలుపునది కాదు. ఈ హేతువులను బట్టి భూమ యనఁగా విపుల (విశాల) మయినది యని యర్థము.

అట్లు విపులమైనవాఁడు ఈతావున నాత్మగాఁ దెలియవచ్చుచున్నాఁడు. అది యెట్లనిన, ఛందోగులు "తరతిశోకమాత్మవిత్" (ఛా. ౭ ప్ర. ౧ ఖ. 3 వా.) (ఆత్మను ఉపాసించువాఁడు సంసారదుఃఖము నతిక్రమించుచున్నాఁడు) అనువాక్యమున ఆత్మను గుఱించి చెప్పుట కారంభించి భూమయనఁబడు దానిని గుఱించిన జ్ఞానమును ఉపదేశించి, "ఆత్మైవేదం సర్వం" (ఛా. ౭ ప్ర. ౧ ఖ. ౫ వా.) (ఇది యంతయును ఆత్మయే) అను వాక్యమున ఆత్మోపదేశముతో ముగించియున్నారు. ఈతావున నొక సంశయము గలుగుచున్నది.

### సంశయము.

ఈతావున "భూమా" యనఁబడువాఁడు జీవాత్మయా? పరమాత్మయా?

### పూర్వపక్షము.

ఈ తావున భూమ యనఁబడు వాఁడు జీవాత్మయనుట యుక్తము. అది యెట్లనిన, "శ్రుతంహ్యేవమే భగవద్దృశేభ్య స్తరతి శోకమాత్మవిత్) (ఆత్మను ఉపాసించువాఁడు సంసారదుఃఖము నతిక్రమించుచున్నాఁడు.) అన్నట్లు నారదుఁడు ఆత్మను తెలియఁగోరి, యందులకై సనత్కుమారుని యొద్దకేఁగి యడుగఁగా, సనత్కుమారుఁడును నామము మొదలు ప్రాణము వరకును శ్రుతియందుఁ బేర్కొనబడిన వస్తువులను ఉపాసింపుమని యుపదే

శింపఁగా, అప్పుడు నారదుఁడు "అస్తి భగవో నామ్నో భూయః) (స్వామీ! నామముకంటె గొప్పది యేదైన కలదా?) "అస్తిభగవో వాచో భూయః" (వాక్కుకంటె గొప్పది యేదైన కలదా?) అని యివ్విధమున ప్రశ్నించెను. స నత్కుమారుఁడును, "వాగ్వా వ నామ్నో భూయసీ" (నామముకంటెను వాక్కు గొప్పది) "మనోవా వ వాచో భూయసీ" (మనస్సు వాక్కు కంటెను గొప్పది) అని యివ్విధమున ప్రత్యుత్తర మిచ్చి యుండుటచే ప్రాణము కంటెను పూర్వము పేర్కొనఁబడిన వాటిని గుఱించి ప్రశ్న ప్రతివచనములు కానఁబడుచున్నది. ప్రాణమును చెప్పిన తరువాత మఱి దేనిని చెప్పియుండలేదు. దీనినిబట్టి చూడఁగా ప్రాణమువరకే యాత్మోద్దేశము చేయఁబడెనని తెలియుచునన్నది. కావున నిచట ప్రాణమనఁబడు వాఁడు ప్రాణముతోఁ గూడ శరీరమునందుండు నట్టి జీవుఁడే. అట్లు జీవుఁడుగాఁ దెలియవచ్చు ప్రాణ మొక వాయువు. "ప్రాణో హ పితా ప్రాణో హ మాతా" (ప్రాణము పిత, ప్రాణము మాత,) అను వాక్యమువలన ప్రాణమనఁబడు దానికి చైతన్యమున్నట్లు తెలియుచున్నది. మఱియు ప్రాణవంతులగు మాతా పితృల విషయమై శ్రమము గలుగఁజేయు వానిని "మాతృ ఘాతకుఁడు, పితృ ఘాతకుఁడు" అని యివ్విధమున హింసకునినిగాఁ దలంచి నిందించుట వలనను, వారికే, ప్రాణము లేనప్పుడు, యెంతశ్రమ పెట్టినను అట్టివాని నట్లు హింసకునిగాఁ దలంచి నిందింపక పోవుటవలననున్ను ప్రాణ మనఁగా, హింసించుటకుఁ దగినవాఁడగు చేతనుఁడే యని తెలియచున్నది. * ప్రాణము లేనట్టివియు, చేతనములునగు స్థావర పదార్థ

* నిదించుటయును నిందింపక పోవుటయును వారు పంచప్రాణముల రము గలవారగుటను బట్టియు, అది లేనివారగుటను బట్టియునేగాని, యది వారు సజీవులుగా నుండుటను నిర్జీవులుగానుండుటను బట్టి కాదు. కావున ఈ తావున ప్రాణమనగా ప్రాణాపానాది పంచప్రాణముల వ్యాపారమే గాని, యది జీవుడు కాదని యడుగగా నందులకు సమాధానము ఈ తావున జెప్ప బడుచున్నది. అది యెట్లనిన, వృక్షాది పదార్థములు చేతనములు (జీవము గలవి.) అయితే వాటియందు పంచప్రాణముల వ్యాపారము లేదు. అట్టి వీటికి అపాయమును గలుగఁజేయుట హింసగాను, అపాయమును గలుగ జేయిక పోవుట హింసకాకపోవుట గానుసు ఎన్నఁబడుచున్నది. దృష్టాంతము—వెదిగేపెట్టును గొడ్డలితో నరుకుట హింసగాను నరకకుండా దానిని పెంచుట హింసకాక పోవుటగానును ఎన్నంబడుచున్నది. ఓషధి వనస్పతులు

ముల విషయమై శ్రమను గలుగఁజేయుట యొక హింసగాను, శ్రమను గలుగఁజేయకపోవుట యొక హింస కాక పోవుటగానున్న గానఁబడుచున్నందునను, హింసింపఁదగినట్టిదిగాఁ జెప్పఁబడిన ప్రాణమనఁబడునది జీవుఁడే యని నిశ్చయింపఁబబడుచున్నది. కావుననే బండికుండ, ఆకులు మొదలగు దృష్టాంతముల నుపన్యసించుటనుబట్టి యీతావునఁ బేర్కొనఁబడిన వాఁడు పరమాత్మ యని భ్రమింపఁదగదు. పరమాత్మ యెడల హింస యొక్క ప్రసక్తియే లేనందునను, జీవునికంటెను వేఱయినదియు, జీవునికి భోగ్యమును వానిభోగమునకు సాధనభూతమునగు యచేన పదార్థజాతమంతయును జీవాధీనముగా నుండుటంజేసి బండికుండ ఆకులు మొదలగు దృష్టాంతము జీవుని విషయము, నను సంభవమగుటం జేసియును ఈ జీవుఁడే ప్రాణమని చెప్పఁబడు భూమ యని తెలియుచున్నది. మఱియు "శ్రుతియందు ప్రాణముకంటెను గొప్పది యెద్దియయిన కలదా?" అని యడుగుట కాని "ఇది ప్రాణముకంటెను గొప్పది" అని బదులు చెప్పుట గాని గానఁబడదు. ఇందువలన భూమను పేర్కొనుటకు పూర్వము ప్రాణమును గుఱించిన ప్రకరణమునకు విచ్ఛిత్తి యును లేదు. ఇంతియేకాక, ప్రాణోపాసకుని యతివాదినిగాఁ జెప్పి "ఎష తు వా అతివదతి" అను తావున అట్టి ప్రాణోపకునే యతి వాదినిగాఁ గుర్తింపఁజేసి, "యస్సత్యేనాతివదతి" అను తావున సత్యవచనమును ప్రాణోపాసనమున కంగమునుగా నుపదేశించి, ఉపాదేయమగు సత్యవచనమున కంగిగాను పూర్వము గాన్పింపఁబడిన ప్రాణయాథాత్మ్య జ్ఞానమును "యదా వై విజానాత్యథ సత్యం వదతి" అనువాక్యమున నుపదేశించి, దానిఁ గలుగఁజేయునట్టి ప్రయత్నములగు మనన, శ్రద్ధా, నిష్ఠల నుపదేశించి, దాని నారంభించుటకు గాను ప్రాప్యభూతుఁడును, ప్రాణమనఁబడు వాఁడునగు జీవుని యొక్క స్వరూపమును సుఖరూపమైన దానినిగాఁ దెలిసికొనునది యని యుపదేశించి, అట్టి సుఖము విపులమైనదని "భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యం" అనువాక్యమున నుపదేశింపఁబడుచున్నది. ఇట్లు జీవుని యొక్కరూపే యవిద్యాయుక్తమగు రూపము విపులమైన సుఖముగలదని యుపదేశింపబడియె. కావున, "తరతి శోక మాత్మవిత్" (ఆత్మ నెఱిగినవాఁడు దుఃఖము నతిక్రమించుచున్నాఁడు) అనెడి యారంభవాక్యముతోనను విరోధము లేదు. ఈ పైని గానఁబఱిచిన హేతువులనుబట్టి యీ తావున భూమ మనఁబడు గుణ

---

జీవము గలవిగాను "ఓషధి వనస్పతయో యచ్చకించిత్ ప్రాణభృత్ స ఆత్మాసమా ఎ స్తరాంవేద" అనియు "శరీరజైః కర్మదోషైర్యాతి స్థావరతాం నరః" అనియు నీ మొదలగు శ్రుతి స్మృతివాక్యములనుండి తెలియుచున్నవి.

ముతోఁ గూడియుండు వాఁడుగాఁ జెప్పఁబడినవాఁడు, జీవుడే యని తెలియు చున్నది.

కావుననే, ‹‹అహం›› (నేను) అని వ్యవహరింపఁబడు జీవాత్మను గుఱించి ‹‹అహమేవాధస్తాదహముపరిష్టాత్›› (ఛా ౭ ప్ర ౨౫ఖ౧ వా)(నేనేక్రిందుగాను నేనే మీఁదుగాను ఉన్నాను) అను వాక్యము మొదలు ‹‹అహమేవేదం సర్వం›› (ఛా. ౭ ప్ర. ౭ ఖ. ౧ వా) (నేనే యిదియంతయును) అను వాక్యమువరకును జీవునియొక్క వైభవము ఉపదేశింపఁబడు చున్నది. ఇవ్విధమున, భూమ యనఁబడు వాఁడు జీవుఁడే యని నిశ్చయింపఁబడుటంజేసి, అందుల కనుగుణముగాను తక్కిన వాక్యముల కర్థముఁ జేసికొనునది.

## సిద్ధాంతము.

‹‹భూమ›› యనఁబడు గుణముగలవాఁడు జీవుఁడు కాడు. అతఁడు పరమాత్మయే, సూత్రముననుండు సంప్రసాదశబ్దమునకు జీవుఁడని యర్థము. ‹‹ఏష సమ్ప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే›› (ఛాం. ౮ ప్ర. ౧౨ ఖ. ౨ వా.) (ఈ జీవుఁడు ఈ శరీరములో నుండి బయలు వెడలి పరజ్యోతిస్సును బొంది స్వస్వరూపావిర్భావము గలవాఁడగు చున్నాఁడు) ఇత్యాద్యుపనిషద్వాక్యములయందు సంప్రసాదశబ్దము జీవవాచకముగాను గదా ప్రయోగింపఁబడినది. ఈ భూమగుణవిశిష్టుఁడగు సత్యమనఁబడువాఁడు జీవాత్మకంటె నధికుఁడుగాఁ జెప్పఁబడినాడని యర్థము సత్య మనఁగా పరబ్రహ్మము. అదియెట్లనిన, శ్రుతియందు, నామము మొదలుకొని ప్రాణమువరకును పేర్కొనిన వానిలో ముందు ముందు పేర్కొనిన దానికంటెను తరువాత తరువాత పేర్కొనఁబడిన దానిని అధికమైన దానినిగాను పేర్కొని యున్నందున ముందు ముందు చెప్పఁబడిన దానికంటెను తరువాత తరువాత చెప్పఁబడినది వేఱువేఱు పదార్థమయినట్లు, యీ తావునను ప్రాణమనఁబడు జీవునికంటెను అధికుఁడుగాఁ జెప్పఁబడిన సత్యమను వాఁడును అట్టి జీవునికంటెనున్ను వేఱయినవాఁడే. ఇట్లు సత్యమనఁబడు వాఁడే భూమ యనఁబడువాఁడును గాన, సత్యమనఁబడు పరమాత్మయే యీ తావున భూమ యని యుపదేశింపఁ బడుచున్నాఁడు. కావుననే వృత్తికారులగు శ్రీ బోధాయన మహర్షియును ‹‹భూమాత్వేవేతి భూమా బ్రహ్మ నామాదిపరమ్పరయా ఆత్మన ఊర్ధ్వమస్యోపదేశాత్›› (‹‹భూమాత్వేవ›› అను శ్రుతియందు భూమయనఁబడునది బ్రహ్మము. ఏలననఁగా, నామము మొదలు ఆత్మవరకును పరంపరగాఁ బేర్కొని ఆత్మకు

తరువాత భూమను ఉపదేశించి యున్నారు.) అను వాక్యమున అట్లే తెలిపి యున్నారు.

ప్రాణమనఁబడు దానికంటెను సత్యమనఁబడునది యధికమైనదిగా నెట్లు తెలియునంటివేని, ఛందోగులు "స వా ఏష ఏవం పశ్యన్నేవం మన్వాన ఏవం విజానన్నతివాదీ భవతి" (ఛా. ౭ ప్ర. ౧౫ ఖ. ౪ వా.) అనువాక్యమున "అతఁడు ఇట్లు విని, ఇట్లు చింతించి, ఇట్లు సాక్షాత్కరించి యతివాది యగుచున్నాఁడు." అనుటచే ప్రాణోపాసకుఁడతి వాదియగు నని తెలిపి "ఏష తు వా అతివదతి యస్సత్యే నాతివదతి" (ఎవఁడు సత్యమనఁబడు దానిని తక్కిన వానిని మించినట్టి యుపాస్య వస్తువునుగాఁ దలంచుచున్నాఁడో, వాఁడే యతివాది) అనువాక్యముననుండు "తు" అను శబ్దము పూర్వము జెప్పఁబడినట్టి యతివాదినుండి ఈతనిని వేఱు పఱుచుచున్నది. కనుకనే "ఏష తు వా అతివదతి" అను వాక్యమునఁ జెప్పఁబడిన వాఁడు ప్రాణాతివాదిగా గుర్తింపఁబడుచుండ లేదు. కావున, ఈతని యతివాదిత్వమునకు నిమిత్తమగు సత్యమనునది పూర్వము జెప్పఁబడిన వాని యతివాదిత్వమునకు నిమిత్తమగు ప్రాణముకంటెను వేఱయినదిగాఁ దెలియుచున్నది.

ప్రాణోపాసకునికి సత్యవాదిత్వ మంగముగా నుపదేశింపబడిన దనియు, అందువలన నింతవరకును ప్రాణ ప్రకరణమే యనువర్తించుచున్న దనియును పూర్వపక్షి చెప్పినది యుక్తము కాదు. ఏలననఁగా, పై వాక్యము నందుండు "తు" అను శబ్దమువలఁ పూర్వము జెప్పఁబడిన అతివాది వేఱొక్క యతివాదిగా తెలియుచున్నాఁడు. ఆ యతివాదికే సత్యవచన మంగము గాను మాత్రమే సూచింపఁబడు చుండ లేదు. ఏలననిన, "ఏష తు వా అగ్నిహోత్రీ యస్సత్యే నాతివదతి" ఈ మొదలగు తావులనో, వేఱొక్క యగ్నిహోత్రి తెలియరానందున, ఏ యగ్ని హోత్రి తెలియవచ్చుచున్నాఁడో, ఆ యగ్నిహోత్రికే సత్యవచన మంగముగా విధింపఁబడుచున్న దనుకొని కష్టమైన మార్గము నవలంబించుచున్నాము.

ప్రకృతముననో, అతివాది వేఱొక్కఁడగుటకు నిమిత్తము గాను, సత్యమనఁబడు పరబ్రహ్మము తెలియవచ్చుచున్నది. ఏలననఁగా, సత్యశబ్దము "సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ" ఇత్యాది తావులఁ బరబ్రహ్మమును తెలుపునదిగాఁ బ్రయోగింపఁబడినది. కావున నట్టి పరబ్రహ్మమును ఎడతెగకుండ ధ్యానించునట్టి యతివాది పూర్వము చెప్పఁబడిన యతివాదికంటెను వేఱయిన వాఁడ

గుట సంభవము. కావున నీతావున "తు" శబ్దస్వారస్యమును బట్టి సిద్ధించు నట్టి యన్యత్వము బాధింపఁబడదు. అతివాదిత్వమనఁగా, తాను ఉపాసించునట్టి వస్తువు వేఱొక్కదాని కంటెను ఎక్కువ పురుషార్థభూత మగుటచే దానిని మించినది యనుకొనుట. ప్రాణోపాసకుఁడు తాను ఉపాసించునట్టి ప్రాణమ నఁబడు ప్రత్యగాత్మ నామము మొదలు ఆశవరకును శ్రుతియందుఁ జేర్కొ నఁబడిన యుపాస్య వస్తువుల నతిక్రమించిన దనుకొనిన వాఁడు గాన, నతఁడు అతివాది యనఁబడుచున్నాఁడు. "అట్టి ప్రత్యగాత్మయును అంత యెక్కువ పురు షార్థము కాడు గాన, నిరతిశయ పురుషార్థము పరబ్రహ్మ మనుకొనిన వాఁడు సాక్షాత్తుగా అతివాది యనిపించుకొనుచున్నాఁడు" అని "ఏష తు వా అతివదతి యస్సత్యే నాతివదతి" అను వాక్యము తెలుపుచున్నది. ఈతావున "సత్యేన" అను శబ్దముననుండు తృతీయావిభక్తి "ఇత్థం భూతలక్షణార్థమున" వచ్చి నది. కావున, "సత్యేనాతివదతి" యనఁగా సత్యమనఁబడు వాఁడును తనకుపాస్యవస్తువగు బ్రహ్మమునుబట్టి తెలియఁబడువాఁడై తాను ఉపాసించు నది పురుషార్థమున తక్కిన వాటిని యతిక్రమించినది యనుకొనువాఁడని యర్థము. కనుకనే శిష్యుఁడును "సోహం భగవస్సత్యే నాతివదాని" (ఓస్వామీ! నేను బ్రహ్మమునే తక్కినవాని నతిక్రమించిన పురుషార్థము నుగాఁ దలచుచున్నాను) అని ప్రార్థించుచున్నాఁడు. ఆచార్యుఁడును, "సత్యం త్వేవ విజిజ్ఞాసితవ్యం" (సత్యమే యుపాసింప వలసినది) అనియును ప్రత్యు త్తర మిచ్చుచున్నాఁడు.

"ఆత్మనః ప్రాణః" (ఛా. ౭ ప్ర. ౨౬ ఖ. ౧ వా.) (ఆత్మనుండి ప్రాణము పుట్టుచున్నది) అను శ్రుతివాక్యమువలన ప్రాణమనఁబడు ఆత్మకు ఉత్పత్తి యున్నట్లు తెలియుచున్నది. కావున "తరతి శోకమాత్మవిత్" అను ప్రా రంభవాక్యమునఁ జెప్పఁబడిన ఆత్మ యనునది ప్రాణమనఁబడు దానికంటెను వేఱయినదని తెలియుచున్నది.

"ప్రాణముకంటెను గొప్పదేద్ది?" అని యడుగుట గాని, "ఇది ప్రాణ ముకంటెను గొప్పది" అని ప్రత్యుత్తరచ్చుట గాని శ్రుతియందుఁ గానఁబడ నందున, ప్రారంభమునఁ జేయఁబడిన యాత్మోపదేశము ప్రాణోపదేశముతో ముగించుచున్నది యని పూర్వపక్షి చెప్పినది యుక్తము కాదు. ఏలననఁగా, ఈ తావున ఉత్తర ప్రత్యుత్తరములను బట్టి సూత్రమే భూమ యనఁబడునది జీవునికంటెను వేఱయినదిగాఁ దెలియవచ్చుచుండలేదు. అయితే ప్రమాణాం తరమును బట్టియును అట్లు తెలియవచ్చుట సంభవము. ప్రమాణాంతరము ముం

దే చెప్పఁబడినది. అది యెట్లనిన, శిష్యుఁడు "ప్రాణముకంటెను గొప్ప దెద్దియ యిన కలదా?" అని యడుగ కుండుటకు అభిప్రాయ మేమనఁగా, నామము మొదలు ఆశవరకును శ్రుతియందుఁ జెప్పఁబడిన అచేతన పదార్థములలో ముందు ముందు చెప్పఁబడినది తరువాత తరువాత చెప్పఁబడిన దాని కంటె నెక్కువ పురుషార్థము గలదగుటచే ముందు ముందు చెప్పఁ బడి నవి కొట్టుపోబడినను, పై పైగా నుపదేశించునపుడు అట్లు ఉపదేశింపఁబడిన వాని నుపాసించువాఁడు అతివాది యని యాచార్యుఁడు చెప్పియుండలేదు. ప్రాణమనఁబడు జీవుని స్వరూపమును బాగుగాఁ దెలిసికొనిన వానికి మఱి యంత పురుషార్థ మెక్కువగాఁ గలదని తలంచి "స వా ఏష ఏవం పశ్యన్నే వం మన్వాన ఏవం విజానన్నతివాదీ భవతి" (ఛా. ౭ ప్ర. ౨౬ ఖ. ౧౬ వా.) (ఇవ్విధమునఁ దెలిసికొని, యివ్విధమునఁ జింతించి, ఇవ్విధమున సాక్షాత్క రించిన వాఁడు అతివాది యగుచున్నాఁడు) అనువాక్యమున అట్టి వాఁడు అతి వాదియని చెప్పియుండెను. శిష్యుఁడును ఇంతటితో ఆత్మోపదేశము ముగించిన దనుకొని మరల ప్రశ్నింపకుండెను. ఆచార్యుఁడు దీని కంటెనున్ను ఎక్కువ పురుషార్థభూతమును సత్యమనఁబడు పరబ్రహ్మమును తానే స్వయముగ "ఏష తు వా అతివదతి య స్సత్యేనాతివదతి" అను వాక్యమున నుపదేశించెను. ఇట్లు ఆచార్యుఁడు పరమపురుషార్థరూపమగు పరబ్రహ్మమును ఉపదేశింపఁ గా, శిష్యుఁడును అట్టి పరబ్రహ్మముయొక్క స్వరూపమును, అతని నుపా సించు పద్ధతిని మొదలగు వానిఁ దెలియఁగోరిన వాఁడై "సోహం భగవ స్సత్యేనా తి వదాని" (ఓ పూజ్యుఁడా! నేను సత్యమునే యన్నింటిని మించిన దానినిగాఁ దలంచువాఁడను" అని ప్రార్థించెను. అంతట ఆచార్యుఁ డును బ్రహ్మసాక్షాత్కారము మూలకముగాఁ గలుగునది యగు సత్య వాదిత్వమును సిద్ధింపఁజేయుటకై యట్టి బ్రహ్మసాక్షాత్కారమును గలుగఁ జేయునట్టి యుపాయమగు బ్రహ్మోపాసనమును "సత్యం త్వేవ విజిజ్ఞాసిత వ్యం" అను వాక్యమున నుపదేశించి, అందులకు సాధనభూతమగు బ్రహ్మ మననమును "మతి స్త్వేవ విజిజ్ఞాసి తవ్యా" అను వాక్యమున నుపదేశించి, శ్రవణము చేసిన (వినిన) దానిని స్థిరముగా మనస్సు నందుంచుకొనుటకు గానే మనన మేర్పడినందున మననము నుపదేశించుటచే శ్రవణమునున్ను ఉపదేశించి నట్లే యని తలంచి, యట్టి శ్రవణముకు ఉపాయభూతమును, బ్రహ్మము విషయ మైన దగు శ్రద్ధను (త్వరను) శ్రద్ధా త్వేవ విజిజ్ఞాసి తవ్యా" అను వాక్యమున నుపదేశించి, యందులకు ఉపాయభూతమును బ్రహ్మవిషయమగు నిష్ఠను "నిష్ఠా త్వేవ విజిజ్ఞాసి తవ్యా" అను వాక్యమున నుపదేశించి, అందులకు ఉపా

యభూతమును అందు విషయమైన యుద్యోగ మగు క్రియను «కృతి స్త్వేవ విజిజ్ఞాసి తవ్యా'' అనువాక్యమున నుపదేశించి, యట్టి శ్రవణాద్యనుష్ఠానమునందభిలాషను గలుగఁజేయుటకై ప్రాప్యభూతుఁడును, సత్యమనఁబడువాఁడును నగు బ్రహ్మమును సుఖరూపునిగా నెఱుంగ వలయునని «సుఖం త్వేవ విజిజ్ఞాసితవ్యం'' అనువాక్యమున నుపదేశించి, వైపుల్యమున అంతకు మించిన దెద్దియును లేనిదియగు సుఖమే పరమ పురుషార్థ రూపమైనదగును గాన, ఆబ్రహ్మముయొక్క సుఖాకారమును అంతకు మించిన దెద్దియును లేని వైపుల్యము గలదానినిగాఁ దెలుసుకొనునది యని«భూమా త్వేవ విజిజ్ఞాసితవ్యః'' అనువాక్యమున ఉపదేశించి, అట్లు నిరతిశయ విపుల సుఖరూపుఁడగు బ్రహ్మముయొక్క లక్షణమును «యత్ర నాన్యత్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా'' అను వాక్యమున నుపదేశించుచున్నాఁడు. ఈపై వాక్యముయొక్క యర్థమేమనఁగా, అనవధికాతిశయ సుఖరూపుఁడగు బ్రహ్మము అనుభవింపఁబడునపుడు వాని ననుభవించువాఁడు అట్టి సమయమున వేఱొక్క దానిని దేనినిన్ని చూడఁడు. ఏలననిన, సమస్తమగు వస్తుసమూహమును బ్రహ్మస్వరూపములోను అట్టి బ్రహ్మముయొక్క విభూతిలోనున్న అంతర్గతమైయే యున్నది. కావున ఐశ్వర్యమనియును పిలువఁబడునట్టి విభూతి గుణములలోఁగూడియుండు వాఁడును, నిరతిశయ సుఖరూపుఁడునగు బ్రహ్మము ననుభవించుచు, బ్రహ్మమునుండి వేఱుగానుండున దెద్దియును లేమింజేసియే యట్టిదానిని దేనినిన్ని యతఁడు చూడఁడు. వాఁడనుభవించునది యంతయును సుఖరూపమైనది యగుటంజేసియు యట్టి సమయమున నతఁడు దుఃఖమునున్ను తెలిసికొనఁడు. అనుభవించునపుడు ఏది పురుషునికి అనుకూలముగా నుండునో, యదియే గదా సుఖమనఁబడుచున్నది.

బ్రహ్మమునుండి వేఱయినదిగాఁ దెలిసికొనఁబడినదై దుఃఖరూపముగాను పరిమిత సుఖరూపగానును తెలియవచ్చునట్టి యీ జగత్తు బ్రహ్మముయొక్క విభూతియగుటంజేసి బ్రహ్మాత్మకమైనదిగా ననుభవింపఁబడినదై సుఖరూపమైనదియే యెట్లు కాగలదు ? అని యడిగెదవేమో, చెప్పెదను. కర్మవశ్యులగు జీవులకు ఈసమస్త ప్రపంచమున్ను బ్రహ్మమునుండి వేఱుగా నుండునది గాను తెలియవచ్చుచున్నది. అప్పుడది వారివారి కర్మముకు అనుగుణముగ దుఃఖమును, పరిమిత సుఖరూపమును నగుచున్నది. కావున, బ్రహ్మమునుండి వేఱుగా నుండునదిగా ననుభవింపఁ బడునపుడు పరిమితమైన సుఖము గలది గాను గాని, దుఃఖరూప మయినది గాను గాని, యనుభవమునకు వచ్చుట కర్మమూలకమగుటంజేసి, యట్టి కర్మరూపమగు అవిద్య

పోయిన వానికి విభూతి గుణవిశిష్టుఁడగు పరబ్రహ్మముతోఁ జేరి యుండు నది గాను తెలియవచ్చునపుడా జగత్తు సుఖరూపమయినదిగా నగును. దృష్టాంతములు:—పిత్తజాడ్యముగల వాఁడు పాలు త్రాగినట్లయిన, పిత్తజాడ్యముయొక్క హెచ్చు తగ్గులను బట్టి యవి వాని నోటికి బొత్తుగ రుచిలేనివిగాను గాని, కొంచము రుచిగలవిగాను గాని తెలియవచ్చును. ఆపాలే పిత్తజాడ్యము లేనివాఁడుత్రాగినట్లయిన, అవివాని నోటికి మధురముగా నుండును. ఆడుకొనుట కుపయోగపడు బొమ్మ మొదలగు వస్తువు బాలునికి యది యట్టిది గాను తెలియరానప్పుడు, ప్రియముకానిదిగాను, అట్టిదిగాను తెలిసినప్పుడు ప్రియమైనదిగానునగును. అట్లే నిరతిశయానంద స్వరూపుఁడును, అనవధికాతిశయా సంఖ్యేయ కల్యాణగుణాకరుఁడు నగు పరబ్రహ్మముయొక్క లీలకు సాధనభూతమయినది గాను, అట్టి బ్రహ్మముచే నాత్మగా నంతట వ్యాపింపఁబడినది గానును అనుసంధింపఁబడు నప్పుడు ఈ జగత్తు సుఖమును గలుగఁజేయునదియే యగును. కావున, జగదైశ్వర్యవిశిష్టుఁడును, అనవధికాతిశయ సుఖరూపుఁడునగు బ్రహ్మము ననుభవించునపుడు అట్టివాఁడు తక్కిన దానిని దేనిని చూడడు. అప్పుడు అతఁడు దుఃఖమునున్ను అనుభవింపడు. "స వా ఏష ఏవం పశ్యన్ ఏవం మన్వానః ఏవం విజానన్నాత్మరతి రాత్మ క్రీడః ఆత్మమిధున ఆత్మానందః స స్వరాడ్భవతి తస్య సర్వేషు లోకేషు కామచారో భవతి యేఽ న్యథాఽ తోవిదు రన్యరాజాన స్తే క్షయ్య లోకా భవన్తి తేషాం సర్వేషు లోకేష్వ కామచారో భవతి" (ఛా. ౭ ప్ర. ౨౫ ఖం ౨ వా) (ఇవ్విధమునఁ జూచుచు, ఇవ్విధమునఁ దలంచుచు, ఇవ్విధమున సాక్షాత్కరించుచు నుండువాఁడు పరమాత్మయే సుఖముగాఁ గలవాఁడు, పరమాత్మయే క్రీడగాఁగలవాఁడు, పరమాత్మయే మిధునముగాఁగలవాఁడు, అతఁడు కర్మవశ్యత లేనివాఁడగును. అతనికి సర్వలోకముల లోనును స్వేచ్ఛాసంచారము గలదు ఎవ్వరు దీనికి విరుద్ధముగాఁ దెలిసికొందురో, వారు కర్మవశ్యు లగుదురు వారు నశించునట్టి లోకములను పొందుదురు. వారికి అన్నిలోకములలోనును స్వేచ్ఛాసంచారము లేదు.) అను తరువాతి వాక్యము ఈపైని గానఁబఱచిన యభిప్రాయమునే యుపపాదించుచున్నది. ఈపై శ్రుతియందు "స్వరాట్" అను శబ్దమునకు కర్మవశ్యతలేనివాఁడని యర్థము. "అన్యరాజానః" అను శబ్దమునకు కర్మవశ్యులని యర్థము. అట్లు "న పశ్యో మృత్యుం పశ్యతి నరోగం నోత దుఃఖతాం" (ఛా.౭ప్ర.౨౬ఖం.౨వా.)(పరబ్రహ్మము ననుభవించువాఁడు అవిద్య ననుభవింపడు. రోగము ననుభవింపడు. దుఃఖము ననుభవింపడు. అట్టి వాఁడు సర్వమును సాక్షాత్కరించుచున్నాఁడు సర్వమును సర్వత్ర పొం

దుచున్నాఁడు.) అను శ్రుతివాక్యమున్ను తెలుపుచున్నది. బ్రహ్మము నిరతిశయ సుఖరూప మని “ఆనందమయోఽభ్యాసాత్” (బ్ర. సూ ౧ అ. ౧పా ౧౩ సూ) అను సూత్రమున విస్తృతముగాఁ జెప్పఁబడియె. కావున ప్రాణ మనఁబడు జీవునికంటెను వేఱు వస్తు వయినవాఁడును, సత్యమనఁబడు వాఁడు నగు పరబ్రహ్మమే భూమ యని యుపదేశించి యుండుటంజేసి, యీ తావున భూమ యనఁగా పరబ్రహ్మమని సిద్ధమగుచున్నది.

## ౮॥ సూ॥ ధర్మోపపత్తేశ్చ.

టీ॥ ధర్మోపపత్తేశ్చ=ధర్మములుండుట సంభవమగుటవలనను న్ను,

తా॥ భూమ యనఁబడు వాని యందుండునవిగాను శ్రుతియందుఁ జెప్పఁబడిన ధర్మములు పరమాత్మకు మాత్రమే యుండుట సంభవమగుటంజేసి యును భూమయనఁగా పరమాత్మ యని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ భూమయనఁబడు వాని యందుండునవి గాను ఏ ధర్మములు శ్రుతులయందుఁ జేర్కొనఁబడుచున్నవో, అవియును పరమాత్మకు మాత్రమే యుండుట సంభవము. అది యెట్లనిన, “ఏతదమృతం” (ఛా. ౭ ప్ర. ౨౪ ఖం ౧ వా.) (ఇది యమృతము) అను శ్రుతియందుఁ జేర్కొనఁబడిన యనన్యాధారత్వమును, “స ఏవా ధస్తాత్” (ఛా. ౭ ప్ర. ౨౫ ఖం. ౧వా.) (అతఁడే క్రిందుమీఁదను నుండువాఁడు) అనియు, “స ఏ వేదం సర్వం” (అతఁడే యిది యంతయును) అనియు నీ శ్రుతివాక్యములయందుఁ జేర్కొనఁబడిన సర్వాత్మకత్వమును, “ఆత్మనః ప్రాణః” (ఛా. ౭ ప్ర. ౨౬ ఖ. ౧ వా) (ఆత్మనుండి ప్రాణము పుట్టుచున్నది) ఇత్యాది శ్రుతియందుఁ జెప్పియున్న ప్రకారము ప్రాణము మొదలగు సర్వపదార్థములకును ఉత్పాదకుఁడగుటయు నీ మొదలగు ధర్మములు పరమాత్మకు మాత్రమే గలవు. “అహ మేవా ధస్తాత్” (నేనే క్రిందుగా నుండువాఁడను) అను వాక్యమున, ఏ సర్వాత్మకత్వము నుగుఱించిన యుపదేశము కలదో, అదిభూమవిశిష్టుఁడగు పరమాత్మను “నేను” అను భావనతో నుపాసించునది యనెడి యుపదేశము. కనుకనే “అథాతోఽహఙ్కారాదేశః” (ఛా. ౭ ప్ర. ౨౫ ఖ. ౧ వా.) అను ఉపక్రమవాక్యమున “అహం” (నేను) అను భావనతో నుపాసించునది యని యుపదేశింపఁబడియె. “అహం” అనఁబడు ప్రత్యగాత్మకును ఆత్మగాను పరమాత్మ అన్తర్యామిబ్రాహ్మణాదులయందుఁ జెప్పఁబడుచున్నాఁడు. ప్రత్యగర్థము (లోపల నుండుట యను నది)పరమాత్మవరకును చెల్లును గాన, “అహం” అను వ్యవ

హారమున్ను పరమాత్మవరకును చెల్లగలదు. అందువలన, ప్రత్యగాత్మ శరీరుని గాను పరమాత్మను అను సంధించుకొనుటకై యీ తావున ఈ «అహం» అను భావన యుపదేశింపఁ బడియెను. పరమాత్మ సర్వపదార్థములను శరీరముగాఁ గలిగియుండు వాఁడగుటం జేసి, యతఁడు ప్రత్యగాత్మకును ఆత్మయయిన వాఁడు. ఈ విషయమే ఛాందోగ్యోపనిషత్తునందు «అథాత ఆత్మోపదేశః» (ఛా. ౭ ప్ర ౨౫ ఖ. ౧ వా) అను వాక్యము మొదలుకొని «ఆత్మైవేదం సర్వం» అను వాక్యము వరకును చెప్పఁబడినది. ఈ విషయమునే నిరూపించుటకు గాను ప్రత్యగాత్మకును ఆత్మయగు పరమాత్మనుండి సర్వమును పుట్టుచున్నదని «తస్య హ వా ఏతస్యైవం పశ్యత ఏవం మన్వా నస్యైవం విజానత ఆత్మనః ప్రాణ ఆత్మన ఆకాశః» ఇత్యాది శ్రుతివాక్యమునఁ జెప్పఁబడియె. ఉపాసకునిలో నంతర్యామిగానుండు పరమాత్మనుండి సర్వమును ఉత్పన్నమగుచున్నదని యీ పై శ్రుతియొక్క యర్థము. కావున పరమాత్మ ప్రత్యగాత్మను శరీరమునుగాఁ గలిగియుండు వాఁడనెడి జ్ఞానము నిశ్చితముగా నుండుటకై «అహం» «నేను» అనెడి భావనతోనే పరమాత్మను ఉపాసించునది. ఈపైని గానఁబడిచిన హేతువులవలన భూమవిశిష్టుఁడుగా జెప్పఁబడినవాఁడు పరమాత్మయని సిద్ధమగుచున్నది.

భూ మా ధి క ర ణ ము ము గి సె ను.



## అ క్ష రా ధి క ర ణ ము

### ౯॥ సూ॥ అ క్ష ర మ మ్బ రా న్త ధృ తేః

టీ॥ అక్షరం=అక్షరశబ్ద వాచ్యుఁడు, పరబ్రహ్మము. ఏలననఁగా, అమ్బరాన్తధృతేః=అవ్యాకృతమగు నాకాశమునకాధారభూతుఁడుగా శ్రుతియందుఁ జెప్పఁబడుటవలన.

తా॥ సూక్ష్మాకాశమున కాధారముగాఁ జెప్పఁబడుటంజేసి, యక్షరమనఁబడు వాఁడు పరమాత్మయని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ «కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చప్రోతశ్చ» (బృ. ౫ అ. ౮ బ్రా. ౭ వా) (దేనియందు ఆకాశము పడుగుపేకలుగాఁ బ్రతిష్ఠితమైయున్నది.) అని గార్గి యడుగఁగా «సహోవాచైతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివ

దన్త్యస్థూలమనణ్వహ్రస్వమదీర్ఘ మలోహిత మస్నేహ మచ్ఛాయం" (బృ. ౫ అ. ౮ బ్రా. ౮ వా) (ఓగార్గి, ఏది స్థూలము కానిదో, అణువు కానిదో, హ్రస్వము కానిదో, దీర్ఘము కానిదో, వర్ణము లేనిదో, చాయ లేనిదో, దానినే యాకాశము పడుగు పేకలుగా బ్రతిష్ఠితమై యుండునట్టి యక్షరమును గాను బ్రాహ్మణులు చెప్పుచున్నారు." అని వాజసనేయులు పఠించుచున్నారు. ఈ తావున నొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈ తావున నక్షరమని చెప్పఁబడినది, ప్రకృతియా? జీవుఁడా? కాక, పరమాత్మయా?

## పూర్వపక్షము

ఈ తావున అక్షరమని చెప్పఁబడునది ప్రకృతి యనుట యుక్తము. ఏలననిన, "అక్షరాత్పరతః పరః" (ము. ౨ ము. ౧ ఖం ౨ వా.) (వికారజాతము కంటెను వేఱయిన దగు ప్రకృతికంటెను వెఱయినవాఁడు)ఇత్యాది తావుల అక్షరశబ్దము ప్రకృతి పరముగాను ప్రయోగింపఁ బడినది. మఱియు ఇచటఁ జెప్పఁబడి నట్టి యస్థూలత్వాదులను ప్రకృతి విషయమునను సమన్వయించుకొనవచ్చును. "యయా తదక్షర మధిగమ్యతే" (ము. ౧ ము. ఖ ౫ వా) (ఏ విద్యచే అక్షరమనఁబడు పరబ్రహ్మము తెలియవచ్చుచున్నదో) ఇత్యాది వాక్యముల యందు అక్షరశబ్దమునకు పరమాత్మ వాచకము గాను ప్రయోగము గానఁబడుచున్న దందురేమో, అట్లు చెప్పఁ దగదు. ఏలననఁగా, ప్రమాణాంతమునుండి తెలియవచ్చు నదియు, శ్రుతి ప్రమాణమునుండి తెలియవచ్చు నదియు నీరెంటిలో, ప్రమాణాంతరము నుండి తెలియవచ్చునదియే కదా మొదట మనకుఁ దెలియవచ్చును. ఏది తెలియవచ్చుచున్నదో, దానిని గ్రహించుటచే దోషమేమున్నది? ఇంతియె కాక, యాజ్ఞ్యవల్క్యుఁడు"యదూర్ధ్వం గార్గి దివో, యదర్వాక్పృథివ్యాః" అని యారంభించిత్రికాలముల యందుండునట్టిది యగుసర్వమునకును, కారణభూతమగు ఆకాశమే యాధారమని ప్రతిపాదింపగా, "కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చ" (ఆకాశము దేనియందు పడుగు పేకలుగాఁ బ్రతిష్ఠితమై యున్నది) అను వాక్యమున నట్టి యాకాశమునకును కారణభూతమైనదియు, దాని కాధారభూత మైనదియు నెద్ది? యని గార్గి యడిగెను. అట్లు గార్గి యడిగినదానికి ప్రత్యుత్తరముగాఁ జెప్పఁబడు అక్షరమనఁబడునది సర్వవికారములకును కారణభూత మగుటంజేసి సర్వమున కాధార భూతమును, ప్రమా

ణాంతరమునుండి తెలియనచ్చు నదియు నగు ప్రకృతిగాఁ దెలియవచ్చుచున్నది) కావున ఈ తావున అక్షరమనఁగా ప్రకృతి యని సిద్ధమగుచున్నది.

## సిద్ధాంతము

ఈ తావున అక్షరమనఁబడునది పరబ్రహ్మము. ఏలననఁగా, ఈ అక్షరమనఁబడునది యవ్యాకృతమగు నాకాశమున కాధారమయినదిగా నుపదేశిపఁబడినది. దీని యర్థమేమనఁగా, «కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చప్రోతశ్చ” (ఆకాశము దేనియందు పడుగు పేకలుగాఁ బ్రతిష్ఠితమైనది ? అను తావునఁ జెప్పఁబడి నట్టి యాకాశము వాయువుతోఁ గలిసియుండు (త్రివృత్కృతమైన) ఆకాశముకాదు. అయితే యది యట్టి యాకాశమునకు పారభూతమును, అవ్యాకృతము నయినది. కావున నట్టి యవ్యాకృతమగు దానికిని ఆధారభూతముగాఁ జెప్పఁబడు నట్టి యక్షరమనఁబడునదియును అవ్యాకృతమే కాఁజాలదనుట. ఈతావునఁ జెప్పఁబడినట్టి యాకాశము వాయునంతము (త్రివృత్కృతము) కాదని యెట్లు తెలియునని యడిగెద వేమో, చెప్పెదను. «యదూర్ధ్వం గార్గి దివో, యదర్వాక్పృథివ్యా యదన్తరా ద్యావాపృథివీ, ఇమే యద్భూతం చ భవచ్చ భవిష్యచ్చేత్యా చక్షతే ఆకాశ ఏవ తదోతంచ” (ఓగార్గి ! ఏది అంతరిక్షమునకు పైగా నున్నదో, ఏది భూమి క్రిందునున్నదో, ఏది పృథివ్యంతరిక్షములకు మధ్యమున నున్నదో, మఱియు వేటిని పూర్వమున్న వాటిని గాను, ఇప్పుడుండు వాటిని గాను, ఇఁకమీఁదు రాఁబోవు వాటిని గానును చెప్పుచున్నారో, ఇవి యన్నియును దేనియందు పడుగు పేకలుగాఁ బ్రతిష్ఠితములై యున్నవో యది యాకాశము.) అని చెప్పినపుడు, మూఁడు కాలముల యందుండు వికారజాతమున కాధారభూతమైనదిగాఁ జూపింపఁబడి నట్టి యాకాశము వాయుయుక్తమగు నాకాశము కాఁజాలదు. ఏలననఁగా, అట్టి వాయుయుక్తమగు నాకాశమును వికారాంతర్గతమైనదియే కదా ! కావున, ఈ తావున ఆకాశమని చెప్పఁబడినది భూతసూక్ష్మముగాఁ (సూక్ష్మాకాశముగాఁ) దెలియవచ్చుచున్నది. కావున నట్టి సూక్ష్మాకాశమునకును ఆధారభూతమైనది యెద్దియని «కస్మిన్ను ఖల్వాకాశ ఓతశ్చ ప్రోతశ్చ” అను వాక్యమున నడుగఁబడియె. ఈ పైని గానఁబఱచిన హేతువులను బట్టి యీతావున నట్టి సూక్ష్మకాశమునకును ఆధారభూతమైనదిగాఁ జెప్పఁబడినట్టి యక్షరమనఁబడునది ప్రధానము (ప్రకృతి) కాఁజాలదు. శ్రుతిప్రమాణము నుండి తెలియనట్టి దానికంటెను తక్కిన ప్రమాణముల నుండి తెలియునది ముందుగా

మనస్సుకువచ్చు నది యని పూర్వపక్షి చేయు వాదము యుక్తమైనది కాదు. ఏలననఁగా, అక్షరశబ్దము (నక్షర తీత్యక్షరం=నశింపనిది యక్షరము అను) అవయవశక్తిచేఁ దన యర్థమును ప్రతిపాదింపఁ బోవునపుడది వేఱొక్క ప్రమాణముయొక్క సహాయము నపేక్షింపదు, ఒక శబ్దముచేఁ దెలుపఁబడు వస్తువును తెలిసికొనుటకు ఏ ప్రమాణము కావలయునో, అది, యా శబ్దమా వస్తువును తెలుపునప్పు డక్కర లేదు.

అవతారిక.—జీవుఁడును సూక్ష్మభూతములవరకునుండు ఈ సమస్త ప్రపంచమునకును ఆధారభూతుఁడగుట సంభవ మగుటంజేసియు, ఈ తావునఁ జెప్పఁబడు అస్థూలత్వాదు లతనియందు నుండుటంజేసియును అక్షరుఁడు జీవుఁడగుట యుక్తము. మఱియు "అవ్యక్త మక్షరే లీయతే" (సుబాల—౭) (ప్రకృతి జీవునితోఁ గలుసుకొను చున్నది) అనియు, "యస్యావ్యక్తం శరీరం, యస్యాక్షరం శరీరం" (సుబా. ౭ ఖ) (ఎవనికి ప్రకృతి (శరీరమో, ఎవనికి జీవుఁడు శరీరమో" అనియు, "క్షరస్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే" (భ. గీ. ౧౫ అ ౧౬ శ్లో) సమస్తభూతములు అక్షరమనఁ బడుచున్నవి. జీవుఁడు అక్షరమనఁబడువాడు) అనియు నీమొదలగు తావుల అక్షరశబ్దము జీవుని తెలుపునదిగాను ప్రయోగింపఁబడినది. ఇవ్విధమున శంకింపఁగా, అట్టి శంకను పరిహరించుటకై:—

౧౦॥ సూ॥ సా చ ప్ర శా స నా త్

టీ॥ సాచ=సూక్ష్మాకాశమును ధరించియుండుట యనునది, ప్రశాసనాత్=సమస్తమును నియమించుటను బట్టియే యక్షరునికిఁ గలదు.

తా॥ సూక్ష్మాకాశమును ధరించియుండుట యనఁబడునది సమస్త భూతములను నియమించుటను బట్టియే యక్షరునికిఁ గలదు.

శ్రీ॥ భా॥ అక్షరుఁడు సమస్తమును నియమించు వాఁడగుటంజేసియే, యీతనికి సూక్ష్మాకాశమును ధరించియుండుట గలదని శ్రుతులయందు ఉపదేశింపఁబడుచున్నది. అది యెట్లనిన, వాజసనేయులు "ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః, ఏతస్య వాక్షరస్య ప్రశాసనే గార్గి ద్యావా పృథివ్యౌ విధృతే తిష్ఠతః ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి నిమేషా ముహూర్తా అహోరాత్రాణ్యర్ధమాసా మాసా ఋతవ స్సంవత్సరా ఇతి విధృతా స్తిష్ఠన్తి "(బృ. ౫ అ. ౮ బ్రా. ౯ వా) ఇత్యాది వాక్యమున "ఓగార్గి యీ యక్షరునియొక్క యాజ్ఞవలన, సూర్యచంద్రులు తమ తమ స్థానములను వదలకయున్నారు.

ఈ యక్షరునియొక్క యాజ్ఞవలననే ద్యావాపృథువులు నిలిచియున్నవి. ఈ యక్షరునియొక్క యాజ్ఞవలననే నిమిషములును, ముహూర్తములును దివారాత్రములును, పక్షములును, మాసములును, ఋతువులును, సంవత్సరములును నిలిచి యున్నవి'' అని యుపదేశించి యున్నారు. సూత్రమునందుండు "ప్రశాసన'' శబ్దమునకు ప్రకృష్టమైన శాసనమని యర్థము. ఇట్లు తన శాసనమున కధీనముగ సర్వవస్తువులను ధరించి యుండుట యను నది బద్ధుఁడు గాని, ముక్తుఁడు గాని యగు జీవునికి సంభవమ్ము కాదు. కావున నితావున శాసనము చేయువాఁడుగాఁ జెప్పఁబడిన అక్షరుఁడు పురుషోత్తముఁడే.

## ౧౧॥ సూ॥ అ న్య భా వ వ్యా వృ త్తే శ్చ.

టీ॥ (అస్య=ఈ యక్షరుఁడు), అన్యభావ వ్యావృత్తేశ్చ=పరమపురుషునికంటె వేఱయినదగుటను వ్యావర్తించి యుండుటవలనను

తా॥ ఈ యక్షరుఁడు పరమపురుషునికంటె వేఱయినదగుట శ్రుతి యందు వ్యావర్తించియుండుట వలనను, ఈ తావున అక్షరుఁడనఁబడు వాఁడు పరమపురుషుఁడని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు "అన్యభావ'' శబ్దమునకు వేఱయినదగుట అనఁగా ప్రకృతి మొదలయినది యని యర్థము. ఈ యక్షర మనఁబడునది పరమపురుషునికంటె వేఱయినదగు ప్రధానము మొదలగునది కాదని వాక్యశేషము తెలుపుచున్నది. అది యెట్లనిన " తద్వా ఏతదక్షరంగార్గ్యదృష్టం ద్రష్ట్రశ్రుతం శ్రోత్రమతం మన్త్ర విజ్ఞాతం విజ్ఞాతృ నాన్యదతోఽస్తి ద్రష్టృనాన్యదతోఽస్తి శ్రోతృ, నాన్యదతోఽస్తి మన్తృ నాన్యదతోఽస్తి విజ్ఞాతృ ఏతస్మిన్నుఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ'' (బృ ౫ అ. ౮ బ్రా. ౧౧ వా) అనువాక్యశేషమున "ఓగార్గి-ఈయక్షరము చూడబడునది, కాదు అది చూచునది, వినఁబడునది కాదు వినునది, చింతింపఁ బడునది కాదు చింతించునది, తెలియఁ బడునది కాదు తెలిసికొనునది, దీనికంటెను వేఱొక్కటి తెలిసికొనునది లేదు. దీనికంటెను వేఱొక్కటి వినునది లేదు. దీనికంటెను వేఱొక్కటి చింతించునది లేదు. దీనికంటెను వేఱొక్కటి తెలిసికొనునది లేదు. ఓగార్గి దీనియందే యాకాశము పడుగు పేకలుగాఁ బ్రతిష్ఠితమై యున్నది) అని తెలుపుచున్నది. ఈ పైవాక్యమున అక్షరమనఁబడు దానికి ద్రష్టృత్వము (చూచునదియగుట) శ్రోతృత్వము (వినునది యగుట) మొదలగునవి గలవని యుపదేశించి నందున ఇది యచేతనమగు ప్రకృతి కంటెను వేఱ

యినదిగాఁ జేయఁబడు చున్నది. యోగులందఱును అట్లు కంటికిఁ గానఁబ డని వస్తువే సర్వమును సాక్షాత్క రించినది యని చెప్పుటవలనను అట్టి వస్తువు జీవుని నుండియును వేఱుపఱుపఁ బడుచున్నది. ఇట్లు వేఱొక్కదా నినుండి వేఱుపఱచుట యనునది యీ యక్షరమనఁ బడువాఁడు పరమ పురుషుఁడనెడి యంశమును ధృవపఱచు చున్నది.

అథవా, ఈ తావున, అన్యభావవ్యావృత్తియనఁగా వేఱొక్కదాని యుని కిని నిషేధించుట యనియు అర్థమును చేసికొన వచ్చును. అది యెట్లనిన, ఈ యక్షరమనఁ బడునది తక్కినవానిచేఁ జూడఁ బడనిదై, తక్కినవానిఁ జూచునది యగుచు, తనకంటెను వేఱయినవగు సమస్త పదార్థములకును ఆ ధారభూత మగుట్లు, ఈతనిచేఁ జూడ బడనిదై యీతనిఁ జూచునదగుచు, ఈతని కాధారభూతమైనది వేఱొక్కటి లేదని చెప్పుచు, „నాన్యదతో స్తి ద్రష్టృ" ఇత్యాది వాక్యశేషము అట్టి వేఱొక్కదాని యునికిని నిషేధిం చుచు, అక్షరమనఁబడునది ప్రకృతి యగుటనున్ను, జీవుఁడగుటనున్ను నిషేధిం చుచున్నది. ఇంతియే కాక, వాజసనేయులు „ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి దదతో మనుష్యాః ప్రశంసన్తి యజమానం దేవాః దర్వీం పితరో ఽన్వా యత్తాః (బృ. ౫ అ. ౮ బ్రా. ౧౧ వా) అను వాక్యమున „ఓ గార్గి! ఈ యక్ష రమనఁబడు దానియొక్క యాజ్ఞవలననే మనుష్యులు అనువశులై దాతలను కొనియాడుచున్నారు. దేవతలు అనువశులై యజ్ఞకర్తను కొనియాడుచున్నా రు. పితృదేవత లనువశులై దర్విని కొనియాడుచున్నారు." అనుటచే యజ్ఞ దాన హోమాది రూపమగు శ్రౌతస్మార్త కర్మమంతయును ఎవ్వనియొక్క యాజ్ఞచే ప్రవర్తించు చున్నదో, ఆయక్షరుఁడనఁబడు వాఁడు పరబ్రహ్మమగు పురుషోత్తముఁడే యని తెలియుచున్నది. మఱియు వీరు „యోవా ఏతదక్ష రం గార్గ్య విదిత్వాఽస్మిల్లోకే జుహోతి తపస్తప్యతే, బహూని వర్ష సహస్రా ణ్యన్తవదే వాస్య తద్భవతి యోవా ఏతదక్షరం గార్గ్య విదిత్వా స్మాల్లోకా త్ప్రైతి స కృపణః, అథ య ఏతదక్షరం గార్గి విదిత్వా స్మాల్లోకాత్ప్రైతి స బ్రాహ్మణః" (బృ. ౫ అ. ౮ బ్రా. ౧౧ వా) (ఓగార్గి ఈ యక్షరమనఁబడు దాని నెఱుఁగక ఎవఁడు వేలకొలది సంవత్సరములు ఈ లోకమున హోమ ము జేయు చున్నాఁడో, తపస్సు చేయుచున్నాఁడో, వాఁడు చేసిన దంతయును నాశము గలది యగును. ఓ గార్గి! ఎవఁడు ఈ యక్షరము నెఱుంగక ఈ లోకమునుండి పైకి పోవుచున్నాఁడో వాఁడు కృపణుఁడు. ఓగార్గి! యీ య క్షరము నెఱింగిన వాఁడై యెవఁడు పైకిపోవుచున్నాఁడో వాఁడు బ్రాహ్మ

ణుఁడు) అని పఠించుచున్నారు. కావున నెవని నెఱుంగమిచే సంసారము సంప్రాప్తించునో, మఱియు నెవని నెఱుంగుటచే అమృతత్వమనఁ బడు మోక్షము సంప్రాప్తమగుచున్నదో, అట్టి యక్షరుఁడు పరబ్రహ్మమే యని సిద్ధమగుచున్నది.

అక్షరాధికరణము ముగిసెను.

---

## ఈక్షతికర్మాధి కరణము

### ౧౨॥ సూ॥ ఈ క్ష తి క ర్మ వ్య ప దే శా త్సః

టీ॥ ఈక్షతికర్మ=ఈక్షణమునకు విషయభూతుఁడుగాఁ జెప్పఁబడిన వాఁడు, సః=పరమాత్మ, (ఏలననఁగా) వ్యపదేశాత్=అట్టివాఁడు పరమాత్మగాను శ్రుతులయందుఁ జెప్పఁబడుటవలన,

తా॥ ఈక్షణమునకు విషయభూతుఁడుగాఁ జెప్పఁబడినవాఁడు పరమాత్మ.ఏలననఁగా, అట్టి వాఁడు పరమాత్మ గాను గదా శ్రుతులయందుఁ జెప్పఁబడుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ సత్యకాముఁ డడిగిన ప్రశ్నను గుఱించి చెప్పు సందర్భమున, ఆథర్వణికులు ‹‹యః పునరేతం త్రిమాత్రేణో మిత్యనే నైవాక్షరేణ పరం పురుష మభిధ్యాయీత స తేజసి సూర్యే సమ్పన్నో యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యతే ఏవంహైవ స పాప్మనా వినిర్ముక్తః సామభి రున్నీయతే బ్రహ్మలోకం స ఏతస్మా జ్జీవఘనా త్పరాత్పరం పురిశయం పురుష మీక్షతే’’ (౫ ప్రశ్న ౫). (ఏవఁడు మూఁడు మాత్రములుగల ‹‹ఓమ్’’ అను అక్షరముతో పరమపురుషుని ధ్యానించునో, వాఁడు తేజోరూపుఁడగు సూర్యుని బొందుచున్నాఁడు. పాముయొక్క కుసము విడిపోవునట్లు అతని పాపములన్నియును తొలఁగి పోవుచున్నవి. అతఁడు సామములచే బ్రహ్మలోకమునకుఁ గొని పోబడుచున్నాఁడు. అతఁడు ఇచ్చటనుండి జీవునికంటె శ్రేష్ఠుఁడును సర్వశరీరములలోను ప్రవేశించియున్న పరమ పురుషుని చూచుచున్నాఁడు) అని పఠించుచున్నారు ఈపై శ్రుతియందు ‹‹ ధ్యానించుచున్నాఁడు చూచుచున్నాఁడు ’’ అని చెప్పుట ఒక్క దానిని గుఱించి నదియె.ఏలననఁగా, ధ్యానించుటకై యే గదా చూచుచున్నాఁడు. మఱియు ‹‹యథా క్రతురస్మిన్ ల్లోకే పురుషో భవతి’’ (ఈలోకమున పురుషుఁ డెవ్విధమున ధ్యానించుచున్నాఁడో)

అను శ్రుతియందుఁ జెప్పియున్నట్లు ధ్యానానుగుణముగ ఫలముండును అను న్యాయమునుబట్టి ఏది ధ్యానింపఁబడుచున్నదో, అదియే గదా పొందబడుచున్నది. మఱియు ఈ పైరెండు తావులను "పరుఁడగుపురుషుని ధ్యానించుచున్నాఁడు పరుఁడగు పురుషుని చూచుచున్నాఁడు" అనుటచే పరుఁడగు పురుషుఁడు ధ్యానమునకును ఈక్షణమునకును విషయభూతుఁడుగా గుర్తింపఁబడుట వలనను అట్లు తెలియుచున్నది. ఈ తావున నొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈ తావున పరుఁడగు పురుషుఁడుగాఁ జెప్పఁబడిన వాఁడు జీవసమష్టిరూపుఁడును, బ్రహ్మాండమున కధిపతియునగు చతుర్ముఖ బ్రహ్మయా? కాక, సర్వేశ్వరుఁడగు పురుషోత్తముఁడా!

## పూర్వపక్షము.

అతఁడు జీవసమష్టిరూపుఁడగు చతుర్ముఖుఁడనుట యుక్తము. ఏలననఁగా, ప్రశ్నోపనిషత్తునందు "స యో హవై తద్భగవన్మనుష్యేషు ప్రాయణాన్తమోఙ్కారమభిధ్యాయీత కతమం వా వ స తేన లోకం జయతి" (ఈ లోకమున మనుష్యులలో నెవఁడు మృతినొందు వరకు ఓంకారమును ధ్యానించునో, అట్టివాఁడే లోకమును జయించును?) అనిచెప్పుట కారంభించి, ప్రణవమును ఒకమాత్రతో నుపాసించువానికి మనుష్యలోకప్రాప్తి గలుగుననియు, రెండు మాత్రలతో నుపాసించు వానికి అంతరిక్షలోక ప్రాప్తి గలుగుననియును చెప్పి, తరువాత మూఁడు మాత్రలతో నుపాసించువానికిఁ గలుగునదిగాను చెప్పఁబడు బ్రహ్మలోక మనఁబడునది అంతరిక్షలోకమున కావల నుండునదియు, జీవసమష్టి రూపుడఁగు చతుర్ముఖుని లోకముగాఁ దెలియ వచ్చుచున్నది. అట్టి లోకమున నుండువానిచేఁ జూడఁబడు వాఁడు తల్లోకాధిపతియగు చతుర్ముఖుఁడే. "ఏతస్మా జ్జీవఘనా త్పరా త్పరం" (పరుఁడగు జీవుని కంటెను పరుఁడు) అని శ్రుతియందుఁ జెప్పియుండుటయును దేహేంద్రియాదుల కంటెను వేఱయిన వాఁడును దేహేంద్రియాదులతోఁగలిసి యుండువాఁడు నగు జీవునికంటెను వేఱయిన వాఁడగుటంజేసి యట్లుచెప్పియుండుట బ్రహ్మలోకవాసియగు చర్ముఖుని యెడల నుపపన్నమగును. కావున నిచట పరుఁడగు పురుషుఁడుగాఁ జెప్పఁబడువాఁడు సమష్టిపురుషుఁడగు చతుర్ముఖుఁడే యని నిశ్చయింపఁ బడుచున్నది. ఈ పైని గనఁపఱచిన ప్రకారము ఈతఁడు చతుర్ముఖుఁడే యని నిశ్చయింపఁ బడుటంజేసి, తరువాత

చెప్పఁబడు అజరత్వము మొదలగు నవియును ఏదొక విధమున వానితో సంబంధించినవి గానే యెన్నుకొనఁదగినవి.

—సిద్ధాంతము—

ఈ తావున ఈ క్షణమునకు విషయభూతుఁడుగాఁ జెప్పఁబడు వాఁడు పరమపురుషుఁడే. అట్టి వాఁడు పరమాత్మ గాను గదా శ్రుతుల యందుఁ జెప్పఁబడు చున్నాఁడు. అది యెట్లనిన, అట్టి వానిని గుఱించి యుదహరింపఁ బడిన ‹‹ తమోంకారేణైవా యనేనాన్వేతి విద్వాన్యత్త చ్ఛాన్త మజర మమృత మభయం పరంచ’’ అను శ్లోకమున, పరము, అజరము, అభయము, అమృతము, అని యిట్లు చెప్పఁబడునట్టి రూపము పరమాత్మదే. ఏలననఁగా, ‹‹ఏతదమృత మేతదభయ మేతద్బ్రహ్మ’’ (ఇది యమృతము, ఇది యభయము, ఇది బ్రహ్మము,) ఈ మొదలగు శ్రుతుల వలన నట్లు తెలియుచున్నది. ‹‹ఏతస్మా జ్జీవఘనా త్పరాత్పరం ’’ (పరుఁడగు జీవఘనుని కంటెను పరుఁడు) అనుట పరమాత్మను గుఱించి చెప్పినదియే గాని చతుర్ముఖుని గుఱించి చెప్పినది కాదు. ఏలననఁగా జీవఘన శబ్దము చతుర్ముఖుని గూడ తెలుపునదియే గదా! ఎవఁడు కర్మనిమిత్తమున వచ్చిన శరీరము గలవాఁడో, అట్టివాఁడు జీవఘనుఁడనఁ బడుచున్నాఁడు. చతుర్ముఖుఁడును అట్టి వాఁడే యని ‹‹యో బ్రహ్మాణం విదధాతి పూర్వం’’ ఇత్యాది శ్రుతులవలనఁ దెలియుచున్నది.

అంతరిక్ష లోకమునకు పైగా నుండునదిగాఁ జెప్పఁబడునట్టి బ్రహ్మ లోకము చతుర్ముఖ బ్రహ్మము యొక్క లోకము గాను తెలయవచ్చు చున్నదనియు, అందువలన నచటనుండువాఁడు చతుర్ముఖుఁడే యనియును పూర్వపక్షి చెప్పినది యుక్తముకాదు. ఏలననఁగా, ‹‹యత్తచ్ఛాన్త మజర మమృత మభయం’’ ఇత్యాది వాక్యము వలన, ఈక్షింపఁబడు వాఁడు పరమాత్మయని నిశ్చయింపఁ బడుటంజేసి, యట్టి పరమాత్మను ఈక్షించువాఁడు ఉండునట్టిదిగాఁ జెప్పఁబడునట్టి లోకము నశించునట్టి చతుర్ముఖ బ్రహ్మలోకము కాఁజాలదు. ఇంతియేకాక, ‹‹యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యతే ఏవం హవై స పాప్మనా వినిర్ముక్తస్స సామభిరున్నీయతే బ్రహ్మలోకం’’ అనుతావున సర్వపాపముల నుండి విముక్తిని బొందినవానికిఁ బ్రాప్యముగాఁ జెప్పఁబడునట్టి స్థానము చతుర్ముఖ బ్రహ్మముయొక్క లోకము కాదు. కావుననే యుదాహరణ శ్లోకమున ఈ బ్రహ్మలోకమును గుఱించి ‹‹యత్కవయో వేదయన్తః’’ (దేనిని కవులు తెలిసికొనుచున్నారో అది) అని చెప్పఁబడుచు

న్నది. ఈతావున కవు లనఁగా నిత్యసూరులు. ఏలననఁగా నిత్యసూరులచేఁ జూడబడునది విష్ణుసంబంధమైన స్థానమే యని «తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః" ఇత్యాది శ్రుతివాక్యముల వలనఁ దెలియుచున్నది.

అంతరిక్షమునకుఁ బైగానుండునది చతుర్ముఖ బ్రహ్మలోకమే కాదు. ఏలననఁగా, ఈ రెంటికి మధ్యను స్వర్గాదిలోకము లనేకములు గలవు. కావున, «ఏతద్వై సత్యకామ పరంచా పరంచ బ్రహ్మ యదోఙ్కారః తస్మాద్విద్వా నేతేనైవాయనేనై కతరమన్వేతి" (ఓసత్యకాముఁడా! ఓఙ్కారమే పరబ్రహ్మమును అపరబ్రహ్మమును. కావున, ఈ యోంకారమును ధ్యానించు నట్టి యుపాసకుఁడు ఈ రెంటిలో దేనినైనను బొందుచున్నాఁడు,) అని సత్యకామునికి ప్రత్యుత్తరమిచ్చునపుడు, అపరబ్రహ్మ మనఁబడు కార్య బ్రహ్మ మేదికలదో, దానిని ఐహికమనియు, ఆముష్మికమనియు నిట్లు రెండుభాగములు గాను విభజించి, ఒక్క మాత్రతో ప్రణవమును ఉపాసించు వారలకు ఐహికమనఁబడు మనుష్యలోకప్రాప్తిని ఫలమునుగాఁ జెప్పి, ఆ యోంకారమునే రెండుమాత్రలతో నుపాసించువారికి ఆముష్మికమనఁబడు అంతరిక్షలోకప్రాప్తిని ఫలముగుగాఁ జెప్పి, మూఁడుమాత్రలు గలదియు, పరబ్రహ్మవాచియు నగు ప్రణవముతో పరబ్రహ్మమును ఉపాసించు వారలు పరబ్రహ్మమునే పొందుచున్నారని యుపదేశింపఁబడియెను. కావున నెద్దియును దోషము లేదు. అందువలన ఈ తావున ఈ క్షణమునకు విషయభూతుఁడుగాఁ జెప్పఁబడిన వాఁడు పరమాత్మ యని సిద్ధమగు చున్నది.

ఈ క్షతి కర్మాధికరణము ముగిసెను.



## దహరాధికరణము

### ౧౩॥ సూ॥ దహర ఉత్తరేభ్యః

టీ॥ ఉత్తరేభ్యః=ఉత్తరవాక్యములలోఁ జెప్పఁబడిన హేతువులవలన, దహరః=దహరశబ్ద వాచ్యుఁడు (పరమాత్మయే.)

తా॥ ఉత్తరవాక్యములలోఁ జెప్పఁ బడిన హేతువుల వలన దహరశబ్ద వాచ్యుఁడు పరమాత్మయే యని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఛందోగులు “అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుణ్డరీకం వేశ్మ దహరోఽస్మిన్నంతర ఆకాశ స్తస్మిన్య దన్తస్త దన్వేష్టవ్యం తద్వావ విజిజ్ఞాసితవ్యం” (ఛా. ౮ ప్ర. ౧ ఖం. ౧ వా) (బ్రహ్మోపలబ్ధిస్థానమగు ఈ శరీరమున సూక్ష్మకమలమువంటి బ్రహ్మస్థానము కలదు. అందెద్దికలదో దానిని కనుగొనునది, దానిని ఉపాసించునది,) అని పఠించుచున్నారు. ఈ తావున నొక సంశయము గలుగు చున్నది.

## సంశయము

ఈ తావున హృదయ పుండరీకము యొక్కమధ్యమున నుండునదిగాఁ జెప్పఁబడిన దహరాకాశము పంచభూతములలో నొక్కటియగు భూతాకాశమా? కాక, జీవుఁడా? కాక, పరమాత్మా? దహరాకాశము వీనిలో నెద్ది యని చెప్పఁదగును?

## పూర్వపక్షము

ఈ తావునఁ జెప్పఁబడిన దహరాకాశము పంచభూతములలో నొక్కటి యగు ఆకాశమనుట యుక్తము. ఏలననఁగా, భాష్యయందు ఆకాశ శబ్దము భూతాకాశమును తెలుపునది గాను ప్రసిద్ధమైనది. మఱియు “తస్మిన్ యదన్తస్త దన్వేష్టవ్యం” (ఆ యాకాశమున నెద్ది కలదో దానిని కనుగొను నది) అను వాక్యమున ఆకాశము కనుగొన వలసినది యగు వేఱొక్కదానికి ఆధారభూతముగాఁ దెలియవచ్చుచున్నది.

## సిద్ధాంతము

ఈ తావున దహరాకాశ మనఁ బడునది పరబ్రహ్మము. ఏలననఁగా ఉత్తరవాక్యములయందుఁ జెప్పఁబడిన హేతువులవలన నట్లు తెలియుచున్నది. అది యెట్లనిన, “ఏష ఆత్మా ఽ పహతపాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సో ఽ పిపాస స్సత్యకామ స్సత్య సంకల్పః” అను వాక్యమున దహరాకాశముననుండునవి గాను చెప్పఁబడిన నిరుపాధికాత్మత్వము, అపహత పాప్మత్వాదికము, సత్యకామత్వము, సత్యసంకల్పత్వము మొదలగునవి దహరాకాశము పరబ్రహ్మమని తెలుపుచున్నవి. మఱియు, “అథ య ఇహాత్మాన మనువిద్య వ్రజన్త్యే తాంశ్చ సత్యాన్ కామాంస్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి” (ఎవరు ఈ యాత్మను తెలిసికొని శరీరమును వదలుచున్నారో, ఈతని కల్యాణగుణములనున్న తెలిసికొనుచున్నారో, వారికి సర్వలోకములయందును స్వేచ్ఛాసంచారము

గలదు.) (ఛా. ౮ ప్ర. ౧ ఖ ౧ వా) అను వాక్యము మొదలుకొని, «యం కామయతే సోస్య సఙ్కల్పాదేవ సముత్తిష్ఠతి తేన సమ్పన్నో మహీయతే" (ఛా ౮ ప్ర. ౨ ఖ ౧౦ వా) (అతఁడు దేనిని కోరుచున్నాఁడో, యది యతని సంకల్పమువలననే ఆవిర్భవించు చున్నది. దానితోఁ గూడి యున్నవాఁడై యతఁడు గౌరవింపఁ బడుచున్నాఁడు) అను వాక్యము వరకును దహరాకాశము నుపాసించువానికిఁ గలుగునది గాను చెప్పఁబడు సత్యకామత్వము వలన దహరాకాశము పరబ్రహ్మమని తెలియు చున్నది. ఛాందోగ్యోపనిషత్తునందు «యావాన్వా అయమాకాశ స్తావా నేషోన్త ర్హృదయ ఆకాశః" (ఛా. ౮ ప్ర. ౧ ఖ. ౩ వా.) (ఈ యాకాశము ఎంత గొప్పదో, హృదయము లోపలనుండు ఆకాశమున్ను అంత గొప్పది.) అను వాక్యమునఁ జెప్పఁ బడిన ఉపమానోపమేయ భావమున్ను దహరాకాశము భూతాకాశమగు పక్షమున పొసగదు. ఈ పైని గనఁబఱచిన ఉపమానోపమేయ భావము, అందుండు ఆకాశము హృదయావచ్ఛిన్నమగుటను బట్టి యుండునది యనియెదవేమో, అట్లగునేని, హృదయావచ్ఛిన్న మయినది భూమ్యంతరిక్షముల కాధార భూతమయిన దగుట సంభవము కాదు.

ఈ తావున దహరాకాశమనఁ బడునది పరమాత్మయే యైనను, దానిని వెలుపలనుండు ఆకాశముతోఁ బోల్చుట సంభవము కాదనియు, అట్లగు నేని, «జ్యాయాన్పృథివ్యా జ్యాయా నంతరిక్షాత్" ఇత్యాది శ్రుతివాక్యమునఁ జెప్పియున్నట్లు హృదయపరిమితమగు దహరాకాశము ద్యావాపృథివ్యాదుల కన్నింటికిని యాధారభూతమైన దగుట యసంభవమగుననియును ఆక్షేపింపఁ దగదు. ఏలననఁగా, దహరాకాశము హృదయము లోపలనుండునది యగుటచే నది స్వల్పమయినదని తలంచుదురేమో, అది స్వల్పమైనది కాదని ఈ పైవాక్యము తెలుపుచున్నది. దృష్టాంతము:- సూర్యుఁడు ఎక్కువ వేగముగాఁ బోవువాఁడైనను, «సూర్యుఁడు భాణము వలెఁ బోవుచున్నాఁడు" అని చెప్పుట యతఁడు మెల్లగాఁ బోవుచుండ లేదనుటకు గానే కదా!

«ఏష ఆత్మాఽపహతపాప్మా" ఇత్యాది వాక్యమున దహరాకాశము చెప్పఁబడు చుండలేదనియు, అయితే «దహరోఽస్మిన్నంతర ఆకాశ స్తస్మిన్యదన్తస్తద న్వేష్టవ్యం" (దానిలోపల సూక్ష్మమగు నాకాశము గలదు. దాని యందేదికలదో, అది కనుగొనఁదగినది) అను వాక్యమున దహరాకాశములోపల నుండునదియు, దానికంటెను వేఱయినదియును

గదా కనుగొనఁదగినదిగాఁ జెప్పఁబడినదనియు, కావున, "ఏష ఆత్మా ౦పహతపాప్మా" అను వాక్యమునను పై వాక్యమున కనుగొనవలసినదిగాఁ జెప్పఁబడిన దానిని గుఱించియే చెప్పియున్నట్లు గ్రహించుట యుక్తమనియుఁ నిట్లు శంకింపఁదగదు. ఏలననఁగా, శ్రుతియే దహరాకాశము నున్ను తదన్తర్వర్తియగు వస్తువునున్ను విభజించి చెప్పని యెడల అట్లు చెప్పవచ్చును. అయితే శ్రుతియే యారెంటిని విభజించి చెప్పుచున్నది. అది యెట్లనిన, ఈ తావున శ్రుతులు "అథ యది దమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోస్మి న్నంతర ఆకాశః తస్మిన్ యదన్తస్తదన్వేష్టవ్యం" అను వాక్యమున "బ్రహ్మపురం" అను శబ్దముచే ఉపాస్యుఁడుగా సన్నిహితుండయిన పరబ్రహ్మముయొక్క పురమును గాను ఉపాసకుని శరీరమును గాన్పించి, అట్టి శరీరము యొక్క మధ్యనుండు నదియు, దాని కవయవభూతమైనదియు, తామర పువ్వుయొక్క యాకారము గలదియు, స్వల్పపరిమాణము గలదియునగు హృదయప్రదేశమును పరబ్రహ్మము యొక్క గృహమునుగా వర్ణించి, సర్వజ్ఞుఁడును, సర్వశక్తుఁడును, ఆశ్రిత వాత్సల్యైక జలనిధియును, ఉపాసకుల ననుగ్రహించుటకై యట్టి గృహమునఁ గాచుకొని యున్న వాఁడును, సూక్ష్మమైన వాఁడు గాను ధ్యానింప వలసిన వాఁడునగు వానిని దహరాకాశ శబ్దముచేఁ గాన్పించి, అట్టి దహరాకాశమనఁబడు వాని యందుండునదియగు అపహత పాప్మత్వాదికమును, స్వాభావిక నిరస్తనిఖిల హేయత్వ సత్యకామత్వాదిశమును, స్వాభావికానవధికాతిశయ కల్యాణ గుణజాతమునున్ను ధ్యానింపవలసిన దానిని గాను "తదన్వేష్టవ్యం" అనువాక్యముచేఁ ఉపదేశించుచున్నవి. ఈ తావున "తదన్వేష్టవ్యం = తత్—అన్వేష్టవ్యం = అది కనుగొనవలసినది" అనుతావున "తత్" అను శబ్దముచే దహరాకాశమును, దానికిఁగల గుణసమూహమునున్ను పరమార్శించి, యా యుభయమున్ను అను సంధింపవలసినది యని యుపదేశింపఁ బడుచున్నది. అనఁగా, "యదిదమస్మిన్బ్రహ్మ పురే దహరం పుణ్డరీకం వేశ్మ" అను వాక్యమున ననువదించి, ఆ సూక్ష్మమగు కమలమువంటి గృహమున దహరాకాశ మెద్ది కలదో, దానిలోనుండు గుణ మూహ మెద్ది కలదో, ఆ యుభయమున్ను కనుగొన వలసినది యని యీ తావున విధింపఁబడుచున్నదని యర్థము.

దహరాకాశమనఁబడునది పరబ్రహ్మమగుటను, "తస్మిన్యదన్తః=దానిలో నెద్దికలదో" అనుతావునఁ జెప్పబడినది యా పరబ్రహ్మముయొక్క గుణ

సమూహమగుటనున్న ఈ రెంటిని "తత్" అనుశబ్దముచేఁ బరామర్శించి ఈరెండును కనుగొనవలసినవి యని యీ తావున విధింపఁబడినట్లు యెట్లు తెలియునని యడిగెదవేని, చెప్పెదను. సావధానముగా వినుము. శ్రుతులు "యావాన్వా అయమాకాశ స్తావానన్తర్హృదయ ఆకాశః" అనువాక్యమున దహరాకాశము ఎక్కువ గొప్పది యని చెప్పి "ఉభే అస్మిన్ ద్యావాపృథివీ అన్తరేవ సమాహితే ఉభా వగ్నిశ్చ వాయుశ్చ సూర్యా చంద్రమసా వుభా విద్యున్నక్షత్రాణి" (ఛా. ౮ ప్ర. ౧ ఖ. ౧ వా.) (పృథివ్యన్తరిక్షములు రెండును అగ్నివాయువులు రెండును, సూర్య చంద్రు లిద్దఱును, విద్యున్నక్షత్రములును ఈ దహరాకాశములోఁ జేరియుండునవి) అను వాక్యమున "అస్మిన్" అను పదముచే దహరాకాశమును పరామర్శించి, ఆ దహరాకాశము జగత్తుకంతకును ఆధారభూతమైనది యని తెలిపి, "యచ్చాస్యేహా స్తి యచ్చ నా స్తి సర్వం తదస్మిన్ సమాహితం" (ఛా. ౮ ప్ర. ౧ ఖ. 3 వా.) (ఈతనికి ఈ లోకమున నెద్ది కలదో, ఎద్ది లేదో, యది యంతయును ఈ దహరాకాశమునఁ గలదు) అను వాక్యమున "అస్మిన్" అను పదముచే దహరాకాశమును బరామర్శించి, ఉపాసకునికి ఈ లోకమున భోగ్యపదార్థము లేవి కలవో, ఏవి మనోరథమాత్రములై యీ లోకమున లేవో, అవి యన్నియును ఈ దహరాకాశమునఁ జేరియున్నవి. కావున, దహరాకాశము నిరతిశభోగ్యవస్తువని తెలిపి, అది దేహముయొక్క యొక యవయవమగు హృదయమునందుండునది యైనను, దేహమునకు నాశము గలుగునప్పటికిని, అది పరమ కారణవస్తువగుటంజేసి యతి సూక్ష్మమైనది గాన, నది యెట్టి వికారమును పొందునది కాదని తెలిపి "తత ఏతన్నై తత్సత్యం బ్రహ్మపురం" (ఛా. ౮ ప్ర. ౧ ఖ. 3 వా.) అను వాక్యమున అట్టి దహరాకాశము సత్యమైనది (వికారరహితము) అనియు, బ్రహ్మమనఁబడు పురమనియు, నిఖిలజగత్తుకును ఆధారభూతమైనది యనియును ఉపపాదించి "అస్మిన్కామాస్సమాహితాః" అనువాక్యమున దహరాకాశమును "అస్మిన్" అనుపదముచేఁ బరామర్శించి మనోహరములగు గుణములను "కామాః" అను శబ్దముచేఁదెలిపి, యవి దహరాకాశమునందుఁ గలవని చెప్పి, అట్లు మనోహరములగు కల్యాణగుణములతోఁ గూడియుండుటను, వాని కాత్మయగుటనున్న "ఏష ఆత్మాఽపహతపాప్మా" అను వాక్యము మొదలుకొని, "సత్య సంకల్పః" అను వాక్యము వరకును విశదముగాఁ దెలిపి, ఈ యెనిమది గుణములనున్ను, వానితోఁ గూడియున్నట్టి దహరాకాశమనఁబడు పరమాత్మనున్ను తెలిసికొనక, తక్కిన భోగములు సిద్ధించుటకై కర్మముల ననుష్ఠించు వారలు

బొందునట్టి ఫలము నాశయుక్తమైన దనియు, వారు సంత్య సంకల్పత్వమును బొందరనియును «యథా హ్యేవేహ ప్రజా అన్వావిశన్తి" (ఛా. ౮ ప్ర. ౧ ఖ. ౫ వా.) అనువాక్యము మొదలుకొని «తేషాం సర్వేషు లోకేష్వ కామ చారో భవతి" అనువాక్యము వరకును తెలిపి, «అథ య ఇహాత్మాన మనువిద్య ప్రజన్త్యేతాంశ్చ సత్యాన్ కామాంస్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి" ఇత్యాది వాక్యమున, దహరాకాశమనఁబడు పరమాత్మ నున్ను వానికిఁ గల మనోహరములగు అపహతపాప్మత్వాది గుణముల నున్ను ఉపాసించు వారికి ఉదారగుణసాగరుఁడగు ఆ పరమ పురుషునియొక్క యనుగ్రహమువలననే యన్ని కోరికలున్ను ఈరుడేననియు, వారు సత్య సంకల్పు లగుదు రనియును తెలుపుచున్నవి. కావున, ఈ తావున దహరాకాశమనఁబడు పరబ్రహ్మమున్ను వానికిఁ గల యపహతపాప్మత్వాది కామ్య గుణ సమూహమునున్ను ఈయుభయమును కనుగొన వలసినది యని చెప్పఁబడుచున్నట్లు నిశ్చయింపఁబడుచున్నది. ఈ విషయమును వాక్యకారులును «తస్మిన్యదన్త ఇతికామవ్యపదేశః" ఇత్యాది వాక్యమున స్పష్టపఱచియున్నారు ఈ హేతువులనుబట్టి దహరాకాశము పరబ్రహ్మమని తెలియుచున్నది.

## ౧౪॥ సూ॥ గతిశబ్దాభ్యాం తథా హి దృష్టం లిఙ్గం చ

టీ॥ గతిశబ్దాభ్యాం=ప్రజలు ప్రతిదినము సుషుప్తియందు దహరమనఁబడు దానిఁ జేరుచున్నట్లు చెప్పియుండుటవలనను, శ్రుతియందు «బ్రహ్మలోక" శబ్ద ప్రయోగ ముండుట వలనను (దహరశబ్ద వాచ్యము పరబ్రహ్మమే) తథా హి=అటులనే,దృష్టం=శ్రుత్యంతరమునఁ గూడ గానఁబడుచున్నది. మఱియు, లిఙ్గంచ=ఇట్లు ప్రతిదినము పోవుట «దహరాకాశము" పరబ్రహ్మ మగుటకు చిహ్నమయి యున్నది.

తా॥ ప్రజలు ప్రతిదినము సుషుప్తియందు దహరమనఁబడు దానిఁ జేరుచున్నట్లు చెప్పియుండుట వలనను, శ్రుతియందు బ్రహ్మలోక శబ్ద ప్రయోగ ముండు టవలనను్ను దహర శబ్దవాచ్యుఁడు పరబ్రహ్మమని తెలియుచున్నది. అట్లే శ్రుత్యంతరమునఁ గూడ కనుపడుచున్నది. మఱియు నిట్లు ప్రతిదినము పోవుట యనునది దహరాకాశము పరబ్రహ్మ మగుటకు సూచకమై యున్నది.

శ్రీ॥ భా॥ ఈ క్రిందు గాన్పింపఁబడు హేతువులను బట్టి దహరాకాశ మనఁబడునది పరబ్రహ్మమని తెలియుచున్నది. అది యెట్లనిన, «తద్యథా

హిరణ్యనిధిం నిహిత మక్షేత్రజ్ఞాః ఉపర్యుపరి సఞ్చరన్తో న విన్దేయుః ఏవ మే వేమా స్సర్వాః ప్రజా అహరహర్గచ్ఛన్త్య ఏతం బ్రహ్మలోకం నవిన్దన్త్య నృతేన హి ప్రత్యూఢాః" (ఛా. ౮ ప్ర. 3 ఖ. ౨ వా.) (ఇట్టి తావున హిరణ్యనిధి గలదని తెలియని వారు ప్రతిదినము దానిపై నడుచుచున్నను, దానిఁ గనుఁగొనని చందంబున, ప్రజలు ప్రతిదినమును పరబ్రహ్మమును బొందుచున్నను, అజ్ఞానావృతులగుటంజేసి, దీని నెఱుంగరు.) అను శ్రుతి వాక్యమున, "ఏతం=దీనిని" అను పదముచే దహరాకాశమును బరామర్శించి, ప్రతిదినమును ప్రజ లాదహరాకాశమును బొందుచున్నారని చెప్పుటయు, అట్లు పొందబడు దహరాకాశమును "బ్రహ్మలోకం" అను శబ్దముచేఁ జేర్కొనుటయును దహరాకాశ మనఁబడునది పరబ్రహ్మమని తెలుపుచున్నవి. ఈపైని గానఁబఱచిన యంశములు దహరాకాశము పరబ్రహ్మమగుటను ఎట్లు సాధించుచున్నవని యడిగితి వేని చెప్పెదను. సుషుప్తికాలమున ప్రజలందఱును పరబ్రహ్మమును బొందుచున్నట్లు వేఱొక్క శ్రుతియందు గానఁబడుచున్నది. అది యెట్లనిన, "ఏవ మేవ ఖలుసోమ్యేమాః స్సర్వాః ప్రజా స్సతి సమ్పద్య న విదు స్సతి సమ్పత్స్యా మహ ఇతి సత ఆగమ్య నవిదు స్సత ఆగచ్ఛామహ ఇతి" అను వేఱొక్క శ్రుతియందును "ఓ సోమ్యుఁడా, ఈ ప్రజ లందఱును ప్రతిదినమును పరమాత్మను బొందుచున్నను, పరమాత్మను బొందుచున్నామని యెఱుంగరు. మఱియు పరమాత్మనుండి వచ్చుచునే పరమాత్మనుండి వచ్చుచున్నామనియు నెఱుంగరు" అని చెప్పఁబడియున్నది. మఱియు, అట్లే బ్రహ్మలోక శబ్దము "ఏష బ్రహ్మలోకః సమ్రాట్" ఇత్యాది శ్రుతివాక్యమున పరబ్రహ్మమును తెలుపునది గాను ప్రయోగింపఁబడుచున్నది.

వేఱొక్క శ్రుతియందు ప్రజలు పరబ్రహ్మమును బొందుచున్నారని చెప్పియుండుట యనునది దహరాకాశము పరబ్రహ్మమగుటకు సూచకము కాక పోవు గాక! అయినను, ఈ తావున ప్రజలందఱును ప్రళయకాలమునందువలెనే దుఃఖము లన్నియును పోయినవారై, సుషుప్తికాలమున నీ దహరాకాశమున నుందురని చెప్పియుండుట యనునదియే దహరాకాశము పరబ్రహ్మమని సూచింపునది యగు సంపూర్ణమైన చిహ్నము, అట్లే బ్రహ్మలోక శబ్దమున్ను దహరాకాశ శబ్దముతో సమానాధికరణమునఁ బ్రయోగింపఁ బడినదై యది పరబ్రహ్మమగుటను, వేఱొక్క తావున నుండు ప్రయోగముతో నిమిత్తము లేకుండనే, సూచింపునట్టి చిహ్నము కాగలదు. ఈ పై విషయమునే సూత్రమునందుండు "లిఙ్గం" అను శబ్దము తెలుపుచున్నది. "బ్రహ్మలోక" శబ్దమును బ్రహ్మము

యొక్క లోకము " అను షష్ఠీతత్పురుష సమాసమునఁ గొనుట కంటెను దానిని "నిషాదస్థపతి" న్యాయమునుబట్టి "బ్రహ్మమే లోకము" అను అర్థముగల సమానాధికరణ సమాసమునఁ గొనుట న్యాయ్యము.

రెండవ విధమున భాష్యము.

అథవా, జనులు ప్రతిదినమును పొందుచున్నారని శ్రుతియందుఁ జెప్పియుండుట యనునది సుషుప్తి కాలమునఁ గలుగు బ్రహ్మప్రాప్తిని గుఱించి చెప్పినది కాదు. అయితే అంతరాత్మగా సర్వకాలములయందును ఉండు నదియు, దహరాకాశమును, పరమ పురుషార్థభూతమనగుదాని పైగా ప్రతి దినము పోవుచున్నను, సర్వదాదానియందుండువారయినను, దానిఁదెలిసికొనక దానిఁ బొందకయున్నారు. అది యెటువలెననిన, హిరణ్యనిధి యుండునట్టి స్థాన మిది యని యెఱుంగని వారు దాని మీఁదు ఉండు వారయినప్పటికిని, దానిఁ దెలిసి కొనరు. అట్లే ప్రకృతమునను ఎఱుంగునది. దహరాకాశ ముచే నియమింపఁబడువారగు సమస్తప్రజలును అట్టి దహరాశము నెఱుంగ కయే ఈపైని గనఁబఱచిన ప్రకారము దాని పైని పోవుట యనునది దహ రాకాశముకు పరబ్రహ్మత్వమును గలుగఁజేయుచున్నది. అటులనే గదా వేఱొ క్కశ్రుతియందును, పరబ్రహ్మమునందుండు వారయినను ప్రజలు తమలో నంత రాత్మగానుండు పరబ్రహ్మ నెఱుంగక యున్నారని చెప్పఁబడియె. అది యెట్ల నిన, అన్తర్యామి బ్రాహ్మణమునందు, "య ఆత్మని తిష్ఠన్నాత్మ నోఽన్తరో, య మాత్మా నవేద, య స్యాత్మా శరీరం య ఆత్మానమన్తరో యమయతి" (ఎవఁడు ఆత్మయందున్నవాఁడై అత్మ లోపలనుండి ఆత్మచేఁ దెలియఁబడక, ఆత్మను తనకు శరీరమునుగాఁ గలిగియుండి, లోపలనుండి యాత్మను నియమించుచు న్నాఁడో" అనియు, "అదృష్టో ద్రష్టా అశ్రుతశ్శ్రోతా" (ఆత్మచేఁ దెలియఁ బడక దానిఁదెలిసి కొనువాఁడు, వినఁబడక వినువాఁడు) అనియు నీ మొద లగు శ్రుతులవలన నిట్లు తెలియుచున్నది. ఈ విషయమును గుఱించి వేఱొక్క తావునఁ గన్పెట్ట వలసినదియే లేదు. ఈపైని యుదహరింపఁబడిన హిరణ్య నిధిదృష్టాంతమువలనఁ బరమ పురుషార్థముగాఁ దెలియవచ్చునట్టి హృదయ మున నుండు వాఁడునగు వాని పైని ప్రతిదినము యెల్లకాలము ప్రజలు వానిఁ దెలిసికొనకయే పోవుట యనునది యతఁడు పరబ్రహ్మమని సూచింపు టకుఁ దగినచిహ్నము.

అవతారిక:—క్రిందు గాన్పింపఁబడు హేతువువలనను దహరాశము పరబ్రహమని తెలియుచున్నది.

౧౭॥ సూ॥ ధృ తే శ్చ మ హి మ్నో ౽ స్యా స్మి న్ను ప ల బ్ధేః

టీ॥ అస్య=పరబ్రహ్మముయొక్క, ధృతేః=ధరణమనఁబడు, మహిమ్నః =మహిమ, అస్మిన్ = ఈ దహరాకాశమున ఉన్నట్లు, ఉపలబ్ధేః చ=తెలియ వచ్చుటవలనను,

తా॥ పరబ్రహ్మముయొక్క సర్వలోక ధారకత్వమనఁబడు మహిమ యీ దహరాకాశమునకుఁ గలదని శ్రుతులవలనఁ దెలియ వచ్చుటం జేసియు దహరాకాశము పరబ్రహ్మమని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ "అథ య ఆత్మా" (ఛా. ౮ ప్ర. ౪ ఖ. ౧ వా) అను తావున ప్రస్తుతమగు దహరాకాశమును నిర్దేశించి, "స సేతు ర్విధృతి స్తేషాం లోకానా మసంభేదాయ" (అతఁడు సేతువు ఈ లోకములు క్షేమముగా నుండుటకై వాటిని ధరించి యుండువాఁడు) అను వాక్యమునఁ జెప్పఁబడు జగదాధారకత్వ మనఁబడునది దహరాకాశము పరబ్రహ్మమని తెలుపుచున్నది. ఏలననఁగా, జగత్తును ధరించియుండుట యనఁబడునది పరబ్రహ్మముయొక్క మహిమ. అది యెట్లనిన, వాజసనేయులు "ఏష సర్వేశ్వర ఏషః సర్వభూతాధిపతి రేష భూతపాల ఏష సేతుర్విధరణ ఏషాం లోకానా మసంభేదాయ" (బృ. ౬ అ. ౪ బ్రా. ౨౨ వా) అనియు, "ఏతస్య వా ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః" అనియు నీమొదలగు వాక్యములయందు సర్వలోకములను ధరించి యుండుట యనఁబడు మహిమ సర్వేశ్వరునికిఁ గలదని తెలిపి యున్నందున నట్లు తెలియుచున్నది. ఇట్లు పరబ్రహ్మముది గాను శ్రుతులవలనఁ దెలియునట్టి సర్వలోకధారకత్వ రూపమగు మహిమ యీ దహరాకాశమున కుండియున్నట్లు తెలియుచున్నందునను, దహరాకాశము పరబ్రహ్మమని సిద్ధమగుచున్నది.

౧౮ సూ॥ ప్ర సి ద్ధే శ్చ

టీ॥ ప్రద్ధేశ్చ=ప్రసిద్ధివలనను.

తా॥ ఆకాశ శబ్దము పరబ్రహ్మమును తెలుపునది గాను ప్రసిద్ధినొందినదై నందునను దహరాకాశము పరబ్రహ్మమని తెలియు చున్నది.

శ్రీ॥ భా॥ "కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో న స్యాత్" (తై. ఆన ౭ అను) (ఈ యానంద మయమగు ఆకాశము లేనియెడల ఎవఁడు జీవింపఁ గలఁడు? ఎవఁడు నిలువ గలఁడు) అనియు,

"సర్వాణి హ వా ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యన్తే" (ఛా ౧ ప్ర ౯ ఖ ౧ వా)।(ఈ జంతువులన్నియును ఆకాశ(బ్రహ్మ)మునుండియే పుట్టుచున్నవి) అనియు నీమొదలగు శ్రుతులయందు "ఆకాశ" శబ్దమునకు పరబ్రహ్మ వాచకము గాను ప్రసిద్ధి గలదు. ఆకాశ శబ్దమునకు లోకమునందు పంచ భూతములలో నొక్కటి యగు నాకాశమును తెలుపుట యందుఁ బ్రసిద్ధి యున్నను, అపహతపాప్మ త్వాదులతోఁ గూడి యుండు దానిఁ దెలుపునది గాను దీనికిఁగల ప్రసిద్ధి, యట్టి భూతా కాశమును దెలుపు విషయమునఁ గల ప్రసిద్ధికంటెను ఎక్కువయినదని తాత్పర్యము.

అవతారిక:— ఇట్లు దహరాకాశము భూతాకాశమా? యనెడి శంకను తొలఁగించి, యిఁక జీవాత్మ యని శంకించి, యట్టి శంకను తొలఁగించు చున్నారు:—

౧౮॥ సూ॥ ఇతరపరమర్శాత్స ఇతి చేన్నాసంభవాత్.

టీ॥ ఇతరపరామర్శాత్ = వాక్యశేషము జీవుని పరామర్శించుటంజేసి దహరాకాశమనఁబడు వాఁడు, స ఇతిచేత్ = జీవుండు అంటివేని, న = అది యుక్తము కాదు. ఏలననఁగా, అసంభవాత్ = దహరాకాశము జీవుఁడగుట యసంభవ మగుటంజేసి.

తా॥ వాక్యశేషమున జీవుఁడే పరామర్శింపఁ బడుటంజేసి, దహరాకాశమను నది జీవుఁడే యని యంటివేని, యది యుక్తము కాదు. ఏలననఁగా, దహరాకాశము జీవుఁ డగుట యసంభవము.

—ఆక్షేపము—

శ్రీ॥ భా॥ వాక్యశేషమునుబట్టియు దహరాకాశ మనఁబడునది పరబ్రహ్మముగాఁ దెలియవచ్చు చున్నదని చెప్పినది యుక్తము కాదు. ఏలననఁగా, వాక్యశేషమున జీవుఁడే సాక్షాత్తుగాఁ బరామర్శింపఁ బడు చున్నాఁడు. అది యెట్లనిన, "అథ య ఏష సమ్ప్రసాదో ఽ స్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుపసమ్పద్య స్వేన రూపేణాభినిష్పద్యతే ఏష ఆత్మేతి హోవాచ, ఏత దమృత మేతదభయ మేతద్బ్రహ్మేతి" (ఈ జీవుఁడు శరీరములోనుండి బయలువెడలి పరజ్యోతిస్సును బొంది స్వస్వరూపావిర్భావము గలవాఁడగు చున్నాఁడు. ఈతఁడు ఆత్మ, ఇదియే యమృతమును, అభయమును, (బ్రహ్మమును) అను వాక్యశేషము జీవుని గుఱించియే కదా చెప్పుచున్నది.

"దహరో ऽ స్మిన్నంతర ఆకాశః" అను వాక్యమున హృదయ పుణ్డరీకముయొక్క మధ్యముననుండు నది గాను ఉపదేశింపఁబడి నట్టి యాకాశమును బాహ్యాకాశముతోఁ బోల్చి చెప్పుట పొసగనందున, నాయాకాశము భూతాకాశ మగుట యసంభవము కావచ్చును. అయినను, వాక్యశేషమును బట్టి దహరాకాశమును జీవునిగాఁ గొనఁదగును. ఆకాశ శబ్దమున్ను (ప్రకాశించునది; ఇత్యాది, శబ్దార్థమునుబట్టి జీవునే తెలుపునది.

—సమాధానము—

అట్లు చెప్పఁగదు. ఏలననఁగా, ఈ తావునఁ జెప్పఁబడిన అపహత పాప్మత్వాది గుణములు జీవునికుండుట సంభవము కాదు.

౧౯॥ సూ॥ ఉత్తరాచ్చే దావిర్భూత స్వరూపస్తు

టీ॥ ఉత్తరాచ్చేత్ =ఉత్తరవాక్యము వలన జీవుఁడు అపహతపాప్మత్వము మొదలగు గుణములు గలవాఁడుగాఁ దెలియవచ్చు చున్నాఁడంటివేని, అవిర్భూత స్వరూపస్తు = ఆ తావున స్వస్వరూపావిర్భావముగల జీవుని గుఱించి యట్లు చెప్పఁబడియె.

తా॥ తరువాతిది యగు ప్రజాపతి వాక్యమున జీవుఁడును అపహత పాప్మ త్వాది గుణములు గల వాఁడుగాఁ జెప్పఁబడు చున్నాఁడు గాన, ప్రకృతమున నట్టి గుణములు గలది గాను చెప్పఁబడు దహరాకాశము జీవుఁడే యంటివేని, యది యుక్తము కాదు. ఏలననఁగా, అచట స్వస్వరూపావిర్భావము గల జీవుఁడే యట్టి గుణములుగల వాఁడుగాఁ జెప్పఁబడు చున్నాడు.

—ఆక్షేపము—

శ్రీ॥ భా॥ తరువాతిది యగు ప్రజాపతివాక్యమును బట్టి చూడఁగా, జీవుఁడే యపహతపాప్మత్వాది గుణములు గలవాఁడని నిశ్చయింపఁ బడు చున్నది. ప్రజాపతి వాక్యము జీవుని గుఱించియే కదా తెలుపు చున్నది. అది యెటువలెననిన,

ఒకానొకసమయమున, ఇంద్రుఁడు "య ఆత్మా అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సో ऽ పిపాస స్సత్యకామ స్సత్యసంకల్పః సో ऽ న్వేష్టవ్య స్సవిజిజ్ఞాసితవ్య స్స సర్వాంశ్చ లోకా నాప్నోతి సర్వాం శ్చ కామాన్య స్త మాత్మాన మనువిద్య విజానాతి" (ఛా. ౮ ప్ర. ౭ ఖ ౧ వా)

(ఏ యాత్మ పాపరహితుఁడును, ముసలితనము లేనివాఁడును, నాశము లేని వాఁడును, దుఃఖము లేనివాఁడును, ఆకలి దప్పికలు లేనివాఁడునో, అట్టి యాత్మ కనుగొన దగినవాఁడు, అతఁడు ఉపాసింప వలసిన వాఁడు. ఎవఁడు అట్టి యాత్మను తెలిసికొని యుపాసించు చున్నాఁడో, వాఁడు సర్వలోకము లను బొందుచున్నాఁడు. వాని కోరికలన్నియును ఈడేరుచున్నవి.) అని యిట్లు కర్ణాకర్ణికముగా విని, యట్టి యాత్మను తెలియఁగోరి, ప్రజాపతి యొద్దకు పోయి, యతని నాశ్రయింపఁగా, ప్రజాపతియును, ఇట్టి విషయ మును తెలిసికొనుటకుఁ దగిన యోగ్యత యింద్రునికిఁ గలదా ? లేదా ? అను యంశమును క్రమముగ పరిశీలింపఁగోరి జాగ్రత్స్వప్న సుషుప్త్య వస్థలు గలవాఁడును, శరీరవంతుఁడు నగు నాత్మను గుఱించి యుపదేశింపఁగా, అట్లు ప్రజాపతి యుపదేశించిన దాని యెడల రుచి గలుగక పోవుటచే నతఁడు పరిశుద్ధాత్మస్వరూపము గుఱించిన యుపదేశమును బొందుటకుఁ దగిన వాఁడని కనిపెట్టి "మఘవన్మర్త్యం వా ఇదం శరీర మాత్తం మృత్యునా తదస్యా మృతస్యా శరీరస్యాత్మనోఽధిష్ఠానం" (ఓ ఇంద్రుఁడా! ఈ శరీరము నశించునది. మృత్యువుచే వ్యాప్తమైనది. ఇట్టి శరీరము శరీర రహితుఁడగు ఈ యాత్మయొక్క స్థానము) అను వాక్యమున శరీరము నధి ష్ఠానమును గాను, ఆత్మను అధిష్ఠాతను (ఆధిష్ఠించి యుండు వానిని) గాను అశరీరుండగు నాయత్మ యమృత స్వరూపుఁడగుటనున్ను తెలిపి, "నహవై సశరీరస్య సతః ప్రియా ప్రియయో రపహతి రస్తి అశరీరం వావ సన్తం న ప్రియా ప్రియే స్పృశతః" అను వాక్యమున శరీరసంబంధము గలవానిని, కష్టసుఖము లెన్నఁడును విడనాడవనియు, శరీర సంబంధము లేనివానికి కష్ట సుఖములు గలుగవు.) అనియును చెప్పుటచే కర్మనిమిత్తమగు శరీరముతోఁ గూడియుండు వానికి కర్మానుగుణముగ సుఖదుఃఖరూపమగు అనర్థము గలుగుటను, శరీరసంబంధము విడిపోయిన తోడనే యట్టి యనర్థము గలుగ కుండుటనున్ను తెలిపి "ఏవ మే వైష సమ్ప్రసాదో స్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి రుపసమ్పద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే" అను వాక్యమున శరీరరహితముగా నుండుటయే జీవాత్మయొక్క స్వరూప మని యుపదేశించెను. మఱియు "స ఉత్తమః పురుషః స తత్ర పర్యేతి జక్షత్క్రీడన్రమమాణ, స్త్రీభిర్వా, యానైర్వా, జ్ఞాతిభిర్వా నోపజనం స్మరన్నిదం శరీరం" (పరమాత్మ ఉత్తమ పురుషుఁడు. ఈ ముక్తాత్మ ఆపర మాత్మ యందుండి అంతట సంచరించుచు స్త్రీలతోను, వాహనములతోను, జాతులతోను క్రమముగ భుజించుచు, క్రీడించుచు, రమించుచు, బంధువుల

సమీపమునఁ బడియుండు ఈ (ప్రేతశరీరమును స్మరింప కుండును.) అనువాక్యమున అట్లు ఈ జీవుఁడు బొందునట్టి పరజ్యోతిస్సు పురుషోత్తముండగుటను, శరీరసంబంధము విడిపోయి పరజ్యోతిస్సును బొందిన యీ జీవాత్మకు బ్రహ్మలోకమున యథేష్టముగ భోగములనను భవించుటను, అప్పుడీతఁడు సుఖదుఃఖజనకమును, కర్మనిమిత్తమునగు శరీరాద్యపురుషార్థమును స్మరింపకపోవుటనున్న తెలిపి, "స యథా ప్రయోగ్య ఆచరణే యుక్త ఏవమస్మిన్ శరీరే ప్రాణో యుక్తః" అను వాక్యమున ఈపైని అపహత పాప్మత్వాది స్వరూపముగల వాఁడుగాఁ జెప్పఁబడిన జీవుఁడే బండికి కట్టిన యెద్దువలె ఈ సంసార దశయందు, కర్మనిమిత్తమగు శరీరముతో సంబంధించి యున్నాఁడనిచెప్పి, "అథ యత్రైతదాకాశ మనువిషణ్ణం స చాక్షుషః పురుషః దర్శనాయ చక్షు రథయో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా గన్ధాయ ఘ్రాణ, మథయో వేదేదమభి వ్యాహరాణీతి స ఆత్మాఽభి వ్యాహారాయ వాక్, అథయో వేదేదం శృణవానీతి స ఆత్మా శ్రవణాయ శ్రోత్ర, మథయో వేదేదం మన్వానీతి స ఆత్మా మనో ఽస్య దైవం చక్షుః" (ఛా. ౮ ప్ర. ౧౨ ఖ) (ఎవనియందు చక్షుస్సు సాధనముగా నుండినదై రూపాదులఁ బ్రకాశింపఁజేయుచున్నదో, అట్టి వాఁడు చాక్షుష పురుషుఁడు అనఁగా, చక్షుస్సు సాధనముగాఁ గల పురుషుఁడు. చూచుటకు సాధనభూతమైనది చక్షుస్సు. ఎవఁడు నేను దీనిని వాసనచూచుచున్నానని తెలిసికొనుచున్నాఁడో, అతఁడు ఆత్మ వాసనచూచుటకు గాను నగు సాధనము ఘ్రాణము. ఎవఁడు దీనిని చెప్పుచున్నానని తెలిసికొనుచున్నాఁడో వాఁడు ఆత్మ చెప్పుటకు గాను నగు సాధనము వాక్కు. ఎవఁడు దీనిని వినుచున్నానని తెలిసికొనుచున్నాఁడో, వాఁడు ఆత్మ, వినుటకుగాను నగు సాధనము శ్రోత్రము. ఎవఁడు దీనిని చింతించుచున్నానని తెలిసికొనుచున్నాఁడో వాఁడు ఆత్మ, చింతించుటకు సాధనభూతమగు మనస్సు ఈతని దివ్యచక్షుస్సు) అను వాక్యమున, చక్షురాదులు సాధనములనియు, రూపాదులు తెలియవలసిన వస్తువు లనియు, ఈ యాత్మ వానిఁ దెలిసికొను వాఁడనియును గాన్పించి, యందు మూలముగా నాత్మ శరీరేంద్రియాదుల కంటెను వేఱయిన వాఁడని నిరూపించి, "స వా ఏష ఏతేనదివ్యేన చక్షుషా మనసైతా న్కామాన్ పశ్య న్రమతే య ఏతే బ్రహ్మలోకే" (బ్రహ్మలోకమున నుండువారు ఈ దివ్యచక్షుస్సగు మనస్సుతో కల్యాణ గుణములను జూచి యానందించుచున్నారు.) అను వాక్యమున, అట్టి వానికే కర్మనిమిత్తమగు శరీరేంద్రియాది సంబంధము పోయినపుడు మనస్సనఁబడు దివ్యమగు స్వాభావిక జ్ఞానముచే సర్వమును తెలి

యవచ్చునని చెప్పి, "తం వా ఏతం దేవా ఆత్మాన ముపాసతే తస్మా త్తేషాం సర్వేచ లోకా ఆప్తా స్సర్వేచకామాః" (జ్ఞాను లిట్టి యా త్మను ఉపాసించుచున్నారు. అందు మూలముగ వారు అన్నిలోకములను పొందిన వారగుదురు. వారి యన్ని కోరికలును ఈడేరును.) అను వాక్యము నిట్టి దానినిగా నాత్మను జ్ఞానులు తెలిసికొనుచున్నారని చెప్పి, అనంతరము "సర్వాం శ్చలోకా నాప్నోతి సర్వాంశ్చ కామాన్య స్తమాత్మాన మనువిద్య విజానాతి" (ఎవఁడు అట్టి యాత్మను తెలిసికొని యుపాసించుచున్నాఁడో, వాఁడు సర్వలోకములను పొందుచున్నాఁడు. సర్వకోరికలును ఈడేరిన వాఁడగు చున్నాఁడు): అనుటచే నివ్విధమగు నాత్మను ఉపాసించువారికి సర్వకామా వాప్తిరూపమగు బ్రహ్మానుభవము గలుగునని చెప్పి యిట్లు ప్రజాపతి ముగిం చెను. కావున ఈ పైవాక్యములయందు అపహతపాప్మత్వాది గుణములు గలవాఁడుగాఁ దెలియవలసిన వాఁడుగాను ఉపక్రమమునఁ జెప్పఁబడిన వాఁడు జీవుఁడే యని తెలియుచున్నది.

పూర్వము (బద్ధావస్థయందు) కర్మరూపమగు నవిద్యచే నస్పష్టమగు అపహత పాప్మత్వాది స్వరూపముగలవాఁడును, తరువాత (ముక్తావస్థయందు) కర్మబంధము పోయినవాఁడై, శరీరములోనుండి బయలువెడలి, పరజ్యోతి స్సును బొందినవాఁడై యావిర్భూతమైన స్వరూపము గలవాఁడగుటచే, అపహ తపాప్మత్వాది గుణవిశిష్టుఁడగు జీవుఁడు, ప్రజాపతి వాక్యమునఁ జెప్పఁబడుచు న్నాఁడు. దహరవాక్యముననో, అట్లు అస్పష్టముకాని స్వరూపము గలవాఁ డును, ఎప్పుడును అపహత పాప్మత్వాది స్వరూపముగల వాఁడే యగు దహ రాకాశమనఁబడు వాఁడు తెలియవచ్చు చున్నాఁడు. ముక్తావస్థయందు ఆవి ర్భూత స్వరూపుఁడగు జీవునియందును ఉండునవి గాను తలంపశక్యములు కానివి యగు సేతుత్వము, సర్వలోకవిధరణత్వము, * సత్య శబ్దము యొక్క

---

* శాకటాయనుఁడను గొప్ప వైయాకరణి "సత్య" శబ్దముయొక్క నిర్వచనము నిట్లు తెలిపి యున్నాఁడు:—అతఁడు "అస్ భువి" అను ధాతు వునుండి యుత్పన్నమయిన "సత్" అను శబ్దముఁగొని, "ఇణ్ గతౌ" అను ధాతువుయొక్క ణ్యచ్ ప్రత్యయాంతమగు రూపమునుండి "య" కార ముఁగొని వానిలో "సత్" అనునది ఆదియందును "య" అనునది యంత మునందు నుండుటచే "సత్యం" అనుశబ్దము నిష్పన్నమగు చున్నదని చె ప్పెను. దీనియొక్క యర్థమేమనఁగా, "స న్త మర్థం ఆపయతి, ప్రత్యాపయతి గమయతీతి సత్యం = ఉన్నటి వస్తువును అనఁగా చేతనా చేతన పదార్థ

నిర్వచనము (అవయవార్థమును) బట్టి తెలియవచ్చును నదియగు :చేతనా చేతన నియన్తృత్వము మొదలగునవి దహరాకాశము పరబ్రహ్మానెడి యంశ యను నిరూపించుచున్నవి. ఈ పైని గనఁబఱచిన సేతుత్వము సర్వలోకధారకత్వము మొదలగునవి ముక్తాత్మకును ఉండుట అసంభవ మని «జగద్వ్యాపారవర్జం" (బ్ర. సూ. ౪ అ ౪ పా ౧౭ సూ) అను సూత్రమునఁ బ్రతిపాదింపఁబోవు చున్నారము.

అవతారిక:—అట్లగునేని, దహర ప్రకరణముననుండు, «అథ య ఏష సమ్ప్రసాదః" ఇత్యాది వాక్యమున జీవుని గుఱించి యేల చెప్పియుండవలయునని యడుగఁగా, నందులకు సమాధానము చెప్పుటకై

౧౯॥ సూ॥ అ న్యా ర్థ శ్చ ప రా మ ర్శః

టీ॥ పరామర్శః=ప్రజాపతి వాక్యమున జీవుని పరామర్శించుట, అన్యార్థశ్చ=వేఱొక్క ప్రయోజనమునకు గానును అగుచున్నది.

తా॥ ప్రజాపతి వాక్యమున జీవుని పరామర్శించుటకు వేఱొక్క ప్రయోజనమును గలదు.

శ్రీ॥ భా॥ దహరాకాశము అపహతపాప్మత్వము జగద్విధరణత్వము మొదలగు గుణములు గలది యగు చందంబున, జీవుఁడు ముక్తుఁడయినపుడు అట్టి దహరాకాశమనఁబడు పరమాత్మను బొందుటచే ఆయపహత పాప్మత్వాది కల్యాణ గుణములుగల వాఁడగునని చెప్పియుండుటచే అందులకు హేతుభూతమును, పరమాత్మకు మాత్రము ఉండునట్టి గుణమును ఉపదేశించుటకై యీ తావున జీవుఁడు పేర్కొనఁబడియె. ప్రజాపతి వాక్యముననను, ముక్తాత్మ స్వరూపమును దెలిసికొనియుండుట దహరోపాసనమునకుఁ గావలసినది యని చెప్పఁబడినది. పరబ్రహ్మమును బొందగోరు జీవాత్మకు స్వస్వరూపమున్ను జాతమును ప్రవర్తింపఁజేయునది యనుట. పరబ్రహ్మము «య ఆత్మని తిష్ఠన్" అనియు, «య. పృథివ్యాం తిష్ఠన్" అను శ్రుతులయందుఁ జెప్పియున్నట్లు చేతనా చేతన పదార్థములలోనుండి వాని నియమించుటచేఁ గదా వానిఁ బ్రవర్తింపఁజేయునది కాఁగలదు. యాస్కాచార్యుల నిరుక్తమనఁబడు వేద నిఘంటు భాష్యము ౯౩ పేజీని చూడుము. మఱియు «సచ్చత్యచ్చాభవత్" అనియు, «సత్యం చానృతం చ సత్యమభవత్" ఇత్యాది వేద వాక్యములయందు గాన్పింపఁబడిన నిర్వచనమున్ను ఇట్టి యర్థము నిచ్చుచున్నది.

అవశ్యముగాఁ దెలియవలసినదియె. ఏలననఁగా, జీవుఁడు స్వయముగ కల్యాణగుణములు గలవాఁడే యగుచు అనవధికాతిశయ కల్యాణ గుణసముదాయము గల పరబ్రహ్మమును (ముక్తావస్థయందు) అనుభవింపగలడు గాన, అట్టి యాత్మ తన స్వరూపమును యదార్థముగాఁ దెలిసికొని యుండుటయును బ్రహ్మోపాసనా ఫలముతోఁ జేరినదియే. "సర్వాంశ్చ లోకానా ప్నోతి సర్వాంశ్చ కామాన్" (ముక్తాత్మ సమస్తలోకములను సమస్త కల్యాణగుణములను అనుభవించుచున్నాఁడు) అనియు, "స తత్ర పర్యేతి జక్షన్ క్రీడన్" (ముక్తాత్మ పరమాత్మయందు సంచరించుచు, భుజించుచు క్రీడించుచునున్నాఁడు) అనియు నీ మొదలగు వాక్యములయందుఁ జెప్పఁబడు ఫలమున్ను దహరవిద్యాఫలమే.

## ౨౦॥ సూ॥ అల్పశ్రుతేరితి చేత్తదుక్తం

టీ॥ అల్పశ్రుతేః = దహరాకాశమును స్వల్పస్థానముననుండు దానినిగాను శ్రుతి. చెప్పుచుండుటంజేసి దహరాకాశము బ్రహ్మముకాదు, ఇతిచేత్ = ఇట్లంంటివేని, తదుక్తం=దానిని గుఱించి పూర్వము చెప్పఁబడినది.

తా॥ దహరాకాశము స్వల్పస్థానము గలది గాను శ్రుతియందుఁ జెప్పియుండుటంజేసి, యది పరమాత్మ కాదంటివేని, దానిని గుఱించి పూర్వము చెప్పఁబడినది.

శ్రీ॥ భా॥ "దహరోఽస్మిన్" (ఇందు సూక్ష్మమయినది) అను వాక్యమున స్వల్పపరిమాణము గలది గాను చెప్పియుండుట యనునది యణుపరిమాణుఁడగు జీవుని యెడల పొసగును గాని, యట్లు చెప్పియుండుట యన్నింటికంటెను గొప్పవాఁడగు పరమాత్మ విషయమై పొసగదంటివేని, యందులకు ఈయవలసిన ప్రత్యుత్తరము ఇంతకు పూర్వమే "నిచాయ్యత్వా దేవం" ఇత్యాది సూత్రమున నీయఁబడినది. కావున, ఈ తావున దహరాకాశ మనఁబడువాఁడు అవిద్యాది దోష గంధ మెంత మాత్రము లేనివాఁడును, స్వభావసిద్ధములును అంతకు మించిన వెవ్వియును లేనివియునగు జ్ఞానము, బలము, ఐశ్వర్యము, వీర్యము, శక్తి, తేజస్సు ఈ మొదలగు అపరిమితోదారగుణములకు సముద్రము వంటివాఁడునగు పురుషోత్తముఁడే. అయితే "ఘ్నన్తి త్వైనం విచ్ఛాదయన్తి" (ఈతని చంపుచునే యున్నవి. ఈతనిఁ గప్పివేయుచున్నవి) అను వాక్యమువలనఁ దెలియవచ్చునట్లు కర్మనిమిత్తమున దేహముఁ గొనినవాఁడును, తరువాత పరజ్యోతిస్సనఁబడు పరమాత్మను బొంది యపహతపాప్మత్వాది గుణకమగు స్వస్వరూప మావిర్భూత (ప్రకటిత) మయినవాఁడే

ప్రజాపతి వాక్యమునఁ జెప్పఁబడుచున్నాఁడు. కావున నీ ప్రజాపతి వాక్యమున దహరాకాశము చెప్పఁబడ లేదు.

అవతారిక:—ఈ క్రిందు గాన్పింపఁబడు హేతువువలనను అట్లు తెలియుచున్నది.

## ౨౧॥ సూ॥ అనుకృతే స్తస్య చ

టీ॥ తస్య=దహరాకాశముయొక్క, అనుకృతేశ్చ=సామ్యము జీవునికిఁ గలుగునని చెప్పియుండుట వలనను దహరాకాశము జీవుఁడు కాఁడు.

తా॥ జీవుఁడు ముక్తావస్థయందు దహరాకాశముతో సాధర్మ్యమును బొందునని చెప్పియుండుటవలనను అట్టి దహరాకాశమే జీవుఁడు కాఁడు.

శ్రీ॥ భా॥ ముక్తావస్థయందు జీవుఁడు దహరాకాశమనఁబడు పరబ్రహ్మముతో సాధర్మ్యమును (సమభావమును) బొందునని చెప్పియున్నందునను దహరాకాశమనఁగా, ముక్తావస్థయందు అపహతపాప్ముఁడును, సంసారసంబంధమునుండి విమోచనమును బొందినవాఁడును నగు జీవుఁడును కాఁడు. సూత్రమునందు "అనుకార" మనఁగా సామ్యమని యర్థము. అది యెటువలెననిన, ఆథర్వణికులు "యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిం, తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరఞ్జనః పరమం సామ్యముపైతి" (3 ము. ౧ 3) (ఎప్పుడీ యుపాసకుఁడు స్వర్ణవర్ణుఁడును, కర్తయును, పరిపాలకుఁడును, బ్రహ్మాండమును సృజించిన వాఁడును నగు పరబ్రహ్మమును సాక్షాత్కరించుచున్నాఁడో, అప్పు డీతఁడు పుణ్యపాపములు విడిపోయి, శరీరసంబంధము లేనివాఁడై పరబ్రహ్మముతోఁ బరమ సామ్యమును బొందుచున్నాఁడు) అను వాక్యమున, ముక్తావస్థయందు జీవాత్మ పరమాత్మను అనుకరించుచున్నాఁడని తెలిపియున్నారు. కావున ప్రజాపతి వాక్యమునఁ జెప్పఁబడిన వాఁడు అనుకరించువాఁడనియు, వానిచే అనుకరింపఁబడునట్టి పరబ్రహ్మము దహరాకాశమనియు నెఱుంగునది.

## ౨౨॥ సూ॥ అపిస్మర్యతే

టీ॥ స్మర్యతే అపి=స్మృతియందును అట్లు చెప్పఁబడినది.

తా॥ స్మృతియును అట్లే తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ సంసారియగు వానికిని ముక్తావస్థయందు పరమసామ్య ప్రాప్తిరూపమగు బ్రహ్మానుకారము గలుగునని స్మృతియందును చెప్పఁబడుచున్నది. అది యెట్లనిన, శ్రీ భగవద్గీతలయందు,

శ్లో॥ ఇదం జ్ఞాన మపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
సర్గేఽపి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తిచ॥

తా॥ ఓ యర్జునా! ఈ యుపాసనము నవలంబించి నాతో సాధర్మ్యము నుబొందిన వారలు సృష్టి సమయమున మరల జన్మింపరు. ప్రళయ సమయమున కష్టపడరు.

విమర్శనము:—కొందరు భాష్యకారులు "అనుకృతే స్తస్యచ" అనియు, "అపి స్మర్యతే" అనియు నీ రెండు సూత్రములను వేఱొక యధికరణమును గాను విభజించి; యాయధికరణము "త మేవ భాన్త మను భాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" (ప్రకాశించునట్టి సర్వేశ్వరుని ననుసరించి యంతయును ప్రకాశించుచున్నది. అతనియొక్క ప్రకాశముచే నిది యంతయును ప్రకాశించుచున్నది) అను శ్రుతివాక్యము సర్వేశ్వరుని గుఱించి తెలుపునది యని నిరూపించుటకై ప్రవర్తించినది యని తమ తమ భాష్యములయందు జెప్పియున్నారు. వారు చెప్పునది సరికాదు. ఏలనన్నగా, అదృశ్యత్వాది గుణకాధికరణమునను, ద్యుభ్వాద్యాయతనాధికరణమునను ఈ రెండు అధికరణములయందును ఈపై శ్రుతి పఠింపఁబడిన ప్రకరణము పరబ్రహ్మము విషయమైన దని నిరూపింపఁబడియెను. మఱియు "జ్యోతిశ్చరణాభిధానాత్" ఈ మొదలగు సూత్రములవలన పరబ్రహ్మము ప్రకాశ స్వరూపుఁడనియును తెలియవచ్చుచున్నది. ఇంతియకాక, అట్లు భాష్యముఁ జేయుట సూత్రముల యర్థముతో విరోధించును.

దహరాధికరణము ముగిసెను.



ప్రమితాధికరణము.

౨౪॥ సూ॥ శబ్దా దేవ ప్రమితః

టీ॥ ప్రమితః = అంగుష్ఠమాత్ర పరిమితి గలవాఁడుగా బోధింపఁబడిన వాఁడు (పరమాత్మయే) ఏలనన్నగా, శబ్దాదేవ=శ్రుతివలననే, యట్లు తెలియుచున్నది.

తా॥ అంగుష్ఠమాత్ర పరిమితి గలవాఁడుగాను శ్రుతులయందుఁ జెప్పఁబడిన వాఁడు పరమాత్మయే యని శ్రుతివలననే తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ శాకకులు “అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి। ఈశానో భూతభవ్యస్య న తతో విజుగుప్సతే ఏతద్వై తత్” (కఠ. ౨ అ. ౪వ ౧౨ వా) అనియు, “అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః; ఈశానో భూతభవ్యస్య స ఏవాద్య స ఉశ్వః ఏతద్వై తత్” (కఠ. ౨ అ. ౪వ ౧౩వా) అనియు నీవాక్యములయందు “అంగుష్ఠమాత్ర పురుషుడు శరీరముసంను న్నాడు. వాడు ధూమరహితమైన జ్యోతిస్సువలె నున్నాడు. మఱియు వాడు సర్వప్రపంచమునకు నియంతయు, కాలత్రయస్థాయియునై యున్నాడు” అని తెలిపియున్నారు. “అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః। తం స్వాచ్ఛరీరాత్ప్రవృహేన్ముఞ్జాదివేషీకాం ధైర్యేణ, తం విద్యాచ్ఛుక్రమమృతం” (కఠ. ౨ అ. ౬వ ౧౭వా) అనువాక్యమున “అంగు ష్ఠమాత్రపురుషుడు సర్వదా జనుల హృదయమున నంతరాత్మగా నుండు నాడు ముంజగడ్డినుండి తదంతర్వర్తి యీష కాడను వేఱుపరచు రీతిని జ్ఞాన బలముచే నీతనిని శరీరమునుండి వేఱయిన వానినిగా నెఱుంగునది.” అనియు నిట్లు బోధించియున్నారు. ఈ తావున నొక సంశయము గలుగుచున్నది.

—సంశయము.—

ఈపై వాక్యములయందు అంగుష్ఠమాత్ర పరిమితుడుగాఁ జెప్పఁబడినవాడు జీవుడా? కాక, అతడు పరమాత్మయా?

—పూర్వపక్షము.—

ఈ తావున అంగుష్ఠమాత్ర పరిమితుడుగాఁ జెప్పఁబడినవాఁడు జీవుఁ డనుట యుక్తము. ఏలననఁగా, జీవుఁడు వేఱొక్క శ్రుతియందును అంగుష్ఠ మాత్రపరిమాణుఁడుగాఁ జెప్పఁబడుచున్నాఁడు. అది యెల్లనిన, శ్వేతాశ్వతరో పనిషత్తునందు “ప్రాణాధిపస్సఞ్చరతి స్వకర్మభిః అంగుష్ఠమాత్రో రవితుల్య రూపః సంకల్పాహంకారసమన్వితో యః” (శ్వే. ౫ అ ౮ వా) (ఇంద్రియ ములకధిపతి యగు జీవుఁడు తన కర్మముల మూలముగ జన్మమరణాదులఁ బొం దుచున్నాఁడు. అతఁడు అంగుష్ఠమాత్ర పరిమాణుఁడును, సూర్యునితో సమాన మైన రూపము గలవాఁడును, సంకల్పాహంకారాదులతోఁ గూడి యుండువాఁడు ను) అని చెప్పఁబడియె. ఇంకియొకాని, వేఱొక్క తావునను పరమాత్మ అంగు ష్ఠమాత్ర పరిమాణుఁడు గాను, ఉపాసనమునకు స్థానమైనను, చెప్పఁబడి యుండ లేదు. ఇట్లు అంగుష్ఠమాత్ర పరిమాణుఁడుగాఁ జెప్పబడినవాఁడు జీవుఁడని నిశ్చితము కాఁగా, శ్రుతియందుఁ జెప్పఁబడిన నియన్తృత్వాదులను శరీరేం ద్రియ భోగ్యభోగోపకరణాదులను బట్టి జీవునికిని యుండగలదు.

## —సిద్ధాంతము.—

ఈపై శ్రుతివాక్యములయందు అంగుష్ఠమాత్ర పరిమితుడుగాఁ జెప్పఁబడిన వాఁడు జీవుఁడనుట యుక్తము. ఏలసనఁగా, శ్రుతులనుండియే యట్లు విదితమున్నది. అది యెట్లనిన, „ఈశానో భూతభవ్యస్య" అను శ్రుతియందుఁ జెప్పఁబడిన ప్రకారము కాలత్రయములనుండు పదార్థముల నన్నింటిని యనుశాసించుట యనునది కర్మపరవశుఁడగు జీవునికుండుట సంభవముకాదు.

అవతారిక:—అట్లగునేని, పరమాత్మ యంగుష్ఠమాత్ర పరిమాణుఁడుగాఁ జెప్పఁబడుట యెట్లు పొసగునని శంకింపఁగా, నదియలకు సమాధానము చెప్పుటకై—

## ౨౫॥ సూ॥ హృద్యపేక్షయా తు మనుష్యాధికారత్వాత్.

టీ॥ మనుష్యాధికారత్వాత్ = వేదాంత శాస్త్రము మనుష్యుల నుద్దేశించి ప్రవర్తించినదగుట వలన, హృది=వారి హృదయస్థానమునకు। అపేక్షయా =అనుసారముగా (అంగుష్ఠమాత్ర పరిమితత్వము చెప్పఁబడియె)

తా॥ వేదాన్త శాస్త్రోపదేశమున కర్హులగు వారు మనుష్యు లగుటచే నాను పరమాత్మను తమ హృదయమున నుపాసించుటకై యందుండు పరమాత్మయును అట్టి హృదయముయొక్క పరిమాణము ప్రకారము అంగుష్ఠమాత్రపరిమాణుఁడుగాఁ జెప్పఁబడియె.

శ్రీ॥ భా॥ ఉపాసనా సౌకర్యమునకై పరమాత్మ యుపాసకుల హృదయమునసుండుటం జేసి, యట్టి హృదయము అంగుష్ఠమాత్ర పరిమాణ మగుట వలన, దానినిబట్టి యందుండు పరమాత్మయును అంగుష్ఠమాత్ర పరిమితుఁడుగాఁ జెప్పఁబడుట పొసగుచున్నది. జీవుఁడు హృదయమున నుండు వాఁడగుటంజేసియు, అట్టి హృదయ మంగుష్ఠమాత్ర పరిమాణమగుటం జేసియును అందుండు జీవుఁడును అంగుష్ఠమాత్ర పరిమాణుఁడని చెప్పఁబడుచున్నాడు. వాస్తవమునకు అతఁడు అరాగ్రమాత్ర (బల్లెపుకొనయంత) పరిమాణుఁడని కదా శ్రుతులు తెలుపుచున్నవి. అయితే మనుష్యులకే యుపాసనము ననుష్ఠించుట సంభవమగుటచే శాస్త్రము మనుష్యులను గుఱించి ప్రవర్తించినదగుట వలనను, మనుష్యుల హృదయమువారివారి అంగుష్ఠ (బొటన వ్రేలంత) మాత్రముండుటం జేసియును అట్లు చెప్పఁబడియెను గాన, ఖర తురగ భుజగాది జంతువుల హృదయము అంగుష్ఠ మాత్రపరిమాణము కాక పోయినను, దోషము లేదు. ఈ యధికరణముతో సంబంధించిన తక్కిన విషయము

లన్నియును తరువాత అనఁగా అథశూద్రాధికరణమ్మునకు తరువాత చెప్ప నుగి-పఁబడును,



## దేవతాధికరణము.

**౨౬॥ సూ॥ తదుపర్యపి బాదరాయణస్సంభవాత్.**

టీ॥ తదుపర్యపి=మనుష్యులకంటె పైనున్న దేవతలకును, సంభవాత్=మోక్షాపేక్ష కలిగి యుండుటవలన, (వారికి వేదాంత శాస్త్రాధికారము కలదని) బాదరాయణః=శ్రీ వ్యాసాచార్యుఁడు (మన్యతే=తలఁచుచున్నాఁడు)

తా॥ బ్రహ్మోపాసనమును బోధించునట్టి వేదాంత శాస్త్రము నధిగమించుటకు మనుష్యులే ముఖ్యాధికారులుగా నున్నను, అట్టి యధికారము దేవతలకుఁ గూడ కలదని శ్రీ వ్యాసాచార్యుల వారు తలంచుచున్నారు.

శ్రీ॥ భా॥ పరబ్రహ్మము అంగుష్ఠమాత్ర పరిమాణుఁడని చెప్పినది యుపపన్నమగుటకు గాను బ్రహ్మోపాసనమును బోధించునట్టి వేదాన్త శాస్త్రము నధిగమించుటకు మనుష్యులే యధికారులని చెప్పఁబడెను. ప్రసంగవశమున ఇప్పుడు బ్రహ్మవిద్యయందు దేవతలు మొదలగు వారికి అధికారము గలదా? లేదా? యనెడి యంశమును గుఱించి విచారింపఁబడుచున్నది,

### పూర్వపక్షము.

దేవతలకు అధికారము లేదనుట యుక్తము. ఏలననిన, వారికి సామర్థ్యము లేదు. దేవతలు శరీర రహితులుగాన, వారికి వివేక విమోకాది సాధన సప్తకముచే నుపకరింపఁబడిన బ్రహ్మోపాసనము ననుష్ఠించుటకు సామర్థ్యము లేదు గదా! అయితే దేవతలు మొదలగు వారికి శరీరము గలదనియెదవా? అందుల కెద్దియును ప్రమాణము గానఁబడదే? పరినిష్పన్న (సిద్ధ) వస్తువునైనను తెలుపుట సంభవము గాన, ఉపనిషద్వాక్యములు, పరబ్రహ్మమును తెలుపవచ్చును గాక! అయినను, దేవతలకు శరీరము గలదని తెలుపునట్టి ప్రమాణమెద్దియును గానఁబడదు. ఏలననఁగా, వేదమునందు మన్త్రములును, అర్థవాదములును (స్తుతి వాక్యములును) కర్మములను గుఱించిన విధులను తెలుపునవి. కావున నవి దేవతలకు శరీరము గలదనెడి యంశమును గుఱించిన ప్రమాణములు కాఁదగవు, కర్మములను గుఱించిన విధివాక్యములలో, తాము నిరూపింపవలసిన దానినే తప్ప దేవతలయందుండునట్టి మఱి

యెట్టి విశేషములను తెలుపవు. కనుకనే దేవతల కట్టి బ్రహ్మవిద్యను గుఱించిన యర్థిత్వమున్ను (కోరిక) ఉండుట యసంభవము. ఈ పైని గనఁబఱచిన ప్రకారము దేవతలకు పరబ్రహ్మము నుపాసించుటకుఁగావలసిన సామర్థ్యము గాని, అందులను గుఱించిన యర్థిత్వము గాని యుండుట యసంభవ మగుటం జేసి వారలట్టి బ్రహ్మోపాసనమునకుఁ దగిన యధికారులు కారనుట యుక్తము.

## సిద్ధాంతము.

మనుష్యులకే కాక, వారికి పైగా దేవతలకును బ్రహ్మోపాసనమున నధికారము గలదని శ్రీ వేదవ్యాసులు తలంచుచున్నారు. ఏలనన,గా, వారికి అందులకు గాను నర్థిత్వమును సామర్థ్యమును ఉండుట సంభవము. అర్థిత్వ మనునది యాధ్యాత్మికము మొదలగు సహింపశక్యము కాని దుఃఖములు పై బడుటవలనను, పరబ్రహ్మము నిరస్తనిఖిలదోషగంధమ్మును, అనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణగణమును, నిరతిశయభోగ్యమ్మును ననెడి జ్ఞానము గలుగుట వలనను గలుగునది. సామర్థ్యమనునది శరీరేంద్రియాది పటుత్వముండుట వలనఁ గలుగునది. బ్రహ్మాదులకు శరీరేంద్రియాదులు గలవని యుపనిషత్తుల యందంతటను సృష్టి ప్రకరణములయందును, ఉపాసనములను గుఱించి చెప్పు సందర్భమునను చెప్పఁబడినది. అదియెట్లనిన, ఛందోగులు "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" (ఛా. ౬ ప్ర. ౨ ఖ. ౧ వా.) అనియు, "తదైక్షత బహుస్యాం ప్రజాయాయేతి తత్తేజోఽసృజత" (ఛా. ౬ ప్ర. ౨ ఖ. ౩ వా.) అనియును చెప్పుట కారంభించి, బ్రహ్మము అచేతన పదార్థజాతము నంతయును తేజస్సు, ఉదకము, పృథివి యీ మొదలగు నవస్థలుగల దానినిగా నేర్పరచి, "అనేన జీవేనాత్మనాఽను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి". (ఛా. ౬ ప్ర. ౩ ఖ. ౨ వా.) (జీవశరీరుఁడు గాను ప్రవేశించి నామరూపములను విశదపరచుచున్నాను) అని సంకల్పించి, చతుర్ముఖ బ్రహ్మము మొదలుకొని స్థావర పదార్థములవరకును నాలుగు విధములు గల యీ భూత సముదాయమునంతయును ఆయా కర్మముల కనుగుణమగు శరీరముగల దానిని గానును ఆయా శరీరముల కనుగుణమగు నామధేయము గల దానిని గానును, చేసెనని చెప్పియున్నారు. ఈ పైని గనఁబఱచిన ప్రకారము సృష్టిని గుఱించి తెలుపునట్టి శాస్త్రముల నంతటను దేవతలనియు, తిర్యగ్ జంతువులనియు, మనుష్యు లనియు స్థావరపదార్థము లనియు నిట్లు నాలుగువిధములు గల సృష్టిని గుఱించి చెప్పఁబడు చున్నది. వీరు దేవతలనియు, వీరు మనుష్యులనియు నివ్విధమగు భేదము వారి వారి కర్మముల కనుగుణముగ బ్రహ్మలోకాది చతుర్దశ లోకములతోఁ గల సంబంధమునుబట్టి యుండునది. ఏలననిన, అది యాత్మల స్వరూపమును బట్టి

యుండఁ జాలదు గదా! అట్లే "తద్ధోభయే దేవాసురా అనుబుబుధిరే తే హోచుః ఇన్ద్రో హైవ దేవానా మభిప్రవ్రాజ విరోచనోఽసురాణాం తౌ హాసంవిదానావేవ సమిత్పాణీ ప్రజాపతి సకాశమాజగ్మతుః తౌహప్రజాపతి రువాచ" (ఛా. ౮ ప్ర. ౭ ఖ. ౨ వా.) (దేవతలును అసురులును వీరు ఉభయులును ప్రజాపతి వాక్యమును తెలిసికొనిరి. వారిట్లు చెప్పిరి. దేవతలలో నింద్రుఁడును, అసురులలో విరోచనుండును పరస్పరము కలుసుకొనకయే సమిత్తులఁ జేతఁబట్టుకొని, ప్రజాపతి యొద్దకేగగా, అంతట ప్రజాపతి వారితో నిట్లు చెప్పెను.) అను వాక్యమువలన దేవతలు మొదలగు వారికి శరీరేంద్రియములు గలవనెడి యంశము స్పష్టముగానే తెలియుచున్నది. కర్మములను విధించుటకు గాను ప్రవర్తించిన వవి యగు మన్త్రములు అర్థవాదములు మొదలగు వానియందును "వజ్రహస్తః పురన్దరః" (ఇంద్రుఁడు వజ్రహస్తుఁడు) అనియు, "తే నేన్ద్రో వజ్ర ముదయచ్ఛత్" (౨ కాం. ౪ ప్రశ్న. ౧౨ అను.) (అందువలన ఇంద్రుఁడు తన వజ్రాయుధము నెత్తెను) అనియు నీ మొదలగు తావులను దేవాదులకు శరీరమున్నట్లు తెలియవచ్చుచున్నది. ఇట్లు చెప్పుట ప్రమాణాంతరములతో విరోధింపదు. కావున నది వాస్తవముగ వారిని గురించి చెప్పినదియే. ఒకవేళ, అనుష్ఠింపవలసిన కర్మములఁ దెలుపుటకును, వాటిని స్తుతించుటకును అట్లు చెప్పఁబడియెను గాని, నది దేవాదులకు వాస్తవముగా శరీరము గలదని తెలుపుటకై కాదనియు, అది వేఱొక్క ప్రయోజనమునకై యనియును వాదించెదరేమో, అట్లు వాదింపవలదు. ఏలననిన, స్తుతి మొదలగు దానియందు ఉపయోగపడుటకైయే యట్లు చెప్పఁబడియెను. అట్లు చెప్పియుండని యెడల స్తుతించుటయే యసంభవమగును. ఏలననిన, గుణములఁ దెలిపి గదా స్తుతి చేయుదుము. గుణములే లేకపోయినచో, స్తుతియెక్కడి నుండి వచ్చును? వాస్తవముగ గుణములు లేకపోయినను, అవి యున్నవని చెప్పుటచే వస్తువు ప్రకాశింపదు. కావున, కర్మములను స్తుతించునవి యగు నీ యర్థవాదవాక్యములు గుణములు గలవనియే తెలుపుచున్నవి. మన్త్రములున్ను కర్మములయందు వినియుక్తములై, ఆ యా కర్మముల ననుష్ఠించుట వలన నుపయోగమును తెలుపుచు సంబంధమూలముగ దేవాదులకుఁ గల శరీరాదులను తెలుపుచునే యున్నవి. అట్లు కాకున్న, దేవాదులకు శరీరము లేని పక్షమున, వారిని ఆయా కర్మముల ననుష్ఠించునప్పుడు ధ్యానించుట యసంభవమగును గదా! ఏలననిన, శరీరాది విశేషములెవ్వియును బొత్తుగ లేనివారగు దేవతలు ధ్యాన

సమయమున, మనస్సునకు నచ్చుట సంభవింపదు గదా! ఇందు కొన్ని తావుల మన్త్రములు ప్రమాణాంతరములనుండి తెలియరానివి యగు గుణములను స్వయముగానే బోధించి వాని మూలముగ కర్మమును స్తుతి చేయుచు వానిఁ బ్రకాశింపఁజేయుచున్నవి. అథవా గుణవిశిష్టమగు వస్తువును దెలుపుచున్నవి. మఱికొన్ని తావుల, ప్రమాణాంతరములనుండి తెలియవచ్చునట్టి గుణములను అనువదించి వానిమూలముగ కర్మములను స్తుతిచేసి వానిఁ బ్రకాశింపఁ జేయుచున్నవి. (వీనికి ప్రమాణాంతరములతో) విరోధము ప్రాప్తించు తావుననో, వానిఁ దెలుపు శబ్దములచే అవిరుద్ధములగు గుణములను లక్షణముచేఁ దెలిపి కర్మమును స్తుతిచేయుచు దానిఁ బ్రకాశింపఁజేయుచున్నవి. కావున కర్మములను గుఱించిన * విధియును దేవతలకు కర్మములకుఁ గాను ఫలము నిచ్చుటకుఁ దగిన శక్తి యావశ్యకముగా నుండవలసినదని కోరుచున్నది. ఏల ననఁగా, ఫలమునపేక్షించు వానిచే చేయవలసినది గాను విధింపఁబడునట్టి కర్మమనునది తాను స్వయముగ క్షణకాలములో నశించున దగుటచే కాలాంతరమునఁ బొందఁబడు స్వర్గాది ఫలమును సాధించునట్టి వేఱొక్కదాని నపేక్షించుచున్నది గదా! అయితే మంత్రముల యందును, అర్థవాదములయందును, "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా వాయుమేవ స్వేన భాగధేయే నోపధా

* వేదమునందుడు విధులకు ఏది యావశ్యమో, అదియే కదా కావలసినది. ఇట్టిచోట దేవతలయొక్క శరీరేంద్రియములతో విధికిఁ గావలసినదేమున్నదని యడుగఁగా నందులకు సమాధానము నీవాక్యము మొదలుకొని చెప్పుచున్నారు. ఈ క్రింది గ్రంథ సందర్భమువలనఁ దేవతలకు ఫలము నిచ్చు విషయమై యొక శక్తి విశేషముండి యుండవలయునని తెలియుచున్నది. దానిని బట్టి వారికి శరీరేంద్రియాదులు కూడ కలవని విదితమగుచున్నది.

అయితే పూర్వమీమాంసకులు ఇట్టిశక్తి దేవతలకుఁ గలదని యంగీకరింపరు. కర్మము నశించినను, అందుమూలముగ అపూర్వమనఁబడునదియొకటి యుత్పన్నమగుచున్నదనియు, అది కాలాంతరమున కర్తకు ఫలము నిచ్చుచున్నదనియును చెప్పుచున్నారు. అయితే ఆచార్యులవారు ఈ విషయమున వీరి యభిప్రాయము నంగీకరింపరు. దేవతలకే యట్టి శక్తి కలదు గాన వారే కాలాంతరమున ఫలము నీయగలరనియు, అందులకై యపూర్వమనఁబడు దానిని కల్పించుకొనవలసినక్కఱ లేదనియును వీరింతకు ముందు వ్రాసియున్నారు. ఈ విషయమును గుఱించి "ఉపపత్తేశ్చ" అను సూత్రమున విశదముగా వివరింపఁబడును.

దతి సపన్నినం భూతిం గమయతి " (యజుస్ ౨ కాండ ౧ ప్రశ్న ౧ అను) (వాయువే గుక్కిలి వేగముగల దేవత, ఈతఁడు వాయువు నాశ్రయించుచున్నాఁడు. వాయువే యాతని కర్మమునకు గాను ఫలమునిచ్చుచున్నది.) అనియు " యదనేన హవిషాశాస్తే తదస్మా స్తదృధ్యాత్తదస్మై దేవారాధస్తాం) (3 అష్ట ౫ ప్రశ్న) (హోమముచే నీతఁడు దేనికోరుచున్నాఁడో, దాని నీతఁడు పొందును గాక! దానిచే నీతఁడు బాగుపడు గాక! దేవతలు దానినిచ్చుచురు గాక!) అనియు నీ మొదలగు శ్రుతుల వలనఁ దేవతలు కర్మములచే నారాధింపఁబడినవారై ఫలమునిచ్చు వారలగుటయు, అందులకుఁ గావలసిన సామర్థ్యమూ దేవతలకుండి యుండుటయును ముఖ్యములే గాన, నవి వాక్యార్థమున నన్వయింపఁబడుచున్నవి. దేవతల విషయమగు పూజను తెలుపునది యగు " యజ్ = దేవపూజాయాం " అను ధాతువునుండియును అట్టి పూజచే నారాధింపఁబడునట్టి దేవతయే ప్రధానమైనదిగాఁ దెలియుచున్నది. ఇట్లు వేదవాక్యము లన్నిఁటిని పరిశీలింపఁగా, వాక్యమునుండియే విధికిఁగావలసిన దంతయును తెలియుచున్నది గాన, అట్టి వాక్యము అర్థము నిచ్చునట్టి సమయమునఁ దెలియరానిది యగు నపూర్వము (అదృష్టము) మొదలగు దానిని దేనినిన్ని అట్టి విధివాక్యముచే ప్రత్యక్షముగాఁ జెప్పఁబడినట్టి దానిని గాను గాని, అందుమూలముగా నూహింపఁబడు దానిని గానుగాని, గైకొనఁదగదు. అట్లే సమస్తములగు బ్రాహ్మణములను, మన్త్రములను, అర్థవాదములనున్ను ఆధారముగాఁ గొని ప్రవర్తించినవి యగు ధర్మశాస్త్ర పురాణేతిహాస గ్రంథములయందును చతుర్ముఖబ్రహ్మము మొదలగు వారికిని దేవతలు, అసురులు మొదలగు వారికిని దేహేంద్రియాది స్వభావభేదములును, స్థానములును, భోగములును, కృత్యములును మొదలగునవి గలవని స్పష్టముగాఁ బ్రతిపాదింపఁబడుచున్నది. కావున దేవతలకును శరీరేంద్రియాదులు గలవు గాన, వారికిని వేదాంత శాస్త్రాధ్యయనమున నధికారము ఉండియే యున్నది.

౨౭॥ సూ॥ విరోధః కర్మణీతి చేన్నానేక ప్రతిపత్తేర్దర్శనాత్

టీ॥ కర్మణి = యజ్ఞాదికర్మములయందు, విరోధః = వైరుధ్యము, ఇతి చేత్ = కలుగునంటివేని, న = అది కలుగదు. ఏలననఁగా, అనేక ప్రతిపత్తేః = అనేక శరీరములఁగొను సామర్థ్యము దేవతలకుండు నట్లు గానఁబడుట వలన,

తా॥ ఏకకాలమున ననేక శరీరములను ధరింప దేవతలు సమర్థులగునట్లు గానఁబడుటవలన యజ్ఞాది కర్మములయందు విరోధము కలుగదు.

## —ఆ క్షే ప ము.—

శ్రీ॥ భా॥ దేవతలు మొదలగు వారికి శరీరము గలదని యంగీకరించు పక్షమున, యజ్ఞాది కర్మములయందు విరోధము ప్రసక్తించును. ఏలననిన, ఇంద్రుఁడు ఒక్కఁడే గాన, నతఁడు శరీరవంతుఁడగు పక్షమున, ఏకకాలమున ననేక తావుల ననేక యాగములయందు "అగ్ని మగ్న ఆవహ" అనియు, "ఇంద్ర ఆగచ్ఛ హరివ ఆగచ్ఛ" (ఓ యింద్రుఁడా రా! ఓ యెఱ్ఱని గుఱ్ఱములు గలవాఁడా! రా! అనియు నివ్విధమగు ఆవాహనము జేయఁబడు నప్పుడు, అతఁడు ఆ యా తావులనేక కాలమున, సిద్ధముగా నుండుట యసంభవము. దేవతలు ఆ యా తావులఁ బోవుచున్నట్లు "కస్య హ వా దేవా యజ్ఞమాగచ్ఛన్తి కస్యవా న బహూనాం యజమానానాం యోవై దేవతాః పూర్వః పరిగృహ్ణాతి ఏనాః శ్వో భూతే యజతే" (ఎవ్వని యజ్ఞమునకు దేవతలు వత్తురు, ఎవ్వని యజ్ఞమునకు దేవతలు రారు. ఎవ్వఁడు మొదట దేవతలకు స్వాగతము చేయునో, వాఁడు మరునాడు దేవతలకై యజ్ఞముఁజేయును) ఇత్యాది శ్రుతులవలనఁ దెలియుచున్నది. కావున దేవతలకు శరీరేంద్రియాదులుండు పక్షమున యజ్ఞాది కర్మముల విషయమైన విరోధము ప్రసక్తించును.

## —స మా ధా న ము.—

అట్లు చెప్పుట యుక్తము కాదు. ఏలననఁగా, సౌభరి మొదలగు వారికి ఏకకాలమున అనేక శరీరములను ధరించుటకు గాను శక్తి యున్నట్లు గానఁబడుచున్నది.

౨౮॥ సూ॥ శబ్ద ఇతి చే న్నా తః ప్ర భ వా త్ప్ర త్య క్షా ను మా నా భ్యామ్

టీ॥ శబ్దే=వేదమునందుఁ దెలుపఁబడు దేవతలకు, విరోధః=అనిత్యత్వప్రాప్తిరూపమగు విరోధము, ఇతిచేత్ =ప్రాప్తించునంటివేని, న=అట్లు చెప్పఁదగదు. అతః =మనస్సునందుండునట్టి యా యింద్రాది శబ్దమునుండి, ప్రభవాత్ =ఇంద్రాది వ్యక్తి పుట్టుటవలన, ఏలననఁగా, ప్రత్యక్షానుమానాభ్యామ్, శ్రుతిస్మృతులవలన నట్లు తెలియుచున్నది.

తా॥ దేవతలకు శరీరముండు పక్షమున, వేదమునందుఁ జెప్పఁబడునట్టి యింద్రాదు లనిత్యులని ప్రాప్తించు నంటివేని, యది యుక్తము కాదు. ఏలననఁగా, బ్రహ్మముయొక్క మనస్సునందుండు నట్టి యా యింద్రాదిశబ్దము నుండి వేఱొక్క యింద్రాదివ్యక్తి పుట్టుచున్నట్లు శ్రుతిస్మృతులవలనఁ దెలియుచున్నది.

## ఆ క్షే ప ము.

శ్రీ॥ భా॥ దేవతలకు ఏకకాలమున అనేక శరీరములను ధరించునట్టి సామర్థ్యముండుటను బట్టి యజ్ఞాది కర్మముల విషయమై విరోధము లేక పోవుగాక! అయినను, వైదికశబ్దము విషయమై విరోధము ప్రాప్తించును. ఏలననిన, అట్లగుపక్షమున వేదమునందుండు ఇంద్రాది శబ్దములు అనిత్యములగు ఇంద్రాది పదార్థములను తెలుపునవి యగును. ఇంద్రాదులకు శరీరముండు పక్షమున, వారనిత్యులగుట తప్పనిసరి. ఇంద్రాది పదార్థములు నశించిన పిదప వేదమునం బఠింపంబడునట్టి యింద్రాది శబ్దము లర్థము లేనివి యనిగాని, లేక వేదము లనిత్యములని గాని ప్రసక్తించును.

## స మా ధా న ము.

అట్లు చెప్పఁదగదు. ఈ యింద్రాది శబ్దములనుండియే యింద్రాది పదార్థములు మరల మరల పుట్టుచున్నవి. అదియెట్లనిన, లోకవాడుకలో నుండు దేవదత్తాది శబ్దములవలెనే వేదమునందుండు ఇంద్రాది శబ్దములును ఏదైన నొక యింద్రాదివ్యక్తి విషయమున సంకేతముగాను మాత్రము ఉపయోగింపఁబడునవి కావు. అయితే యవి గో శబ్దము వలెనే స్వాభావికము గానే యొక యాకారభేదమును తెలుపుటకై ప్రవర్తించినవి. కావున నొకయింద్రుని యొక్క యొక వ్యక్తి నశింపఁగా, ఆ వైదికశబ్దము మనస్సునందుండుటచే దానిచేఁ దెలుపఁబడునదియగు ఇంద్రవ్యక్తిని తెలిసికొని యుండువాఁడగు బ్రహ్మము అట్టి యాకారముగల వేఱొక్క యింద్రుని సృజించుచున్నాఁడు. దృష్టాంతము:— కుమ్మరివాఁడు తన మనస్సునందుండు ఘటమనెడి శబ్దము నుండి (ఘటమనఁగా నిట్టిది యనెడి జ్ఞానమునుండి). అట్టిదయే యగు వేఱొక్క ఘటము నెట్లు సృజించుచున్నాఁడో, అట్లే ప్రకృతమునను ఎఱుంగునది. అది యెట్లు తెలియునంటివేని, శ్రుతి స్మృతుల వలన నిట్లు తెలియుచున్నది. శ్రుతు లెవ్వియనిన, "వేదేన రూపే వ్యాకరోత్సతాసతీ ప్రజాపతిః (౨ అష్ట ౬ ప్రశ్న. ౨ అను) (బ్రహ్మము పూర్వమున్నట్టిది యగు వేదముతో పూర్వమున్నట్టివి యగు రూపములను సృజించెను) అనియు, "స భూరితి వ్యాహరత్ స భూమి మసృజత స భువ ఇతి వ్యాహరత్ సోఽన్తరిక్ష మసృజత" (౨ అష్ట ౨ ప్రశ్న ౪ అను) (బ్రహ్మము భూః అని యుచ్చరించి భూమిని సృజించెను. భువః అని యుచ్చరించి యన్తరిక్షమును సృజించెను) అనియు నీ మొదలగు శ్రుతివాక్యములవలన నట్లు తెలియుచున్నది. అనఁగా, ఆ యా

యా కారములు గల యా యా పదార్థములను సృజించెనని యర్థము. స్మృతు లెవ్వియనిన,

శ్లో॥ అనాదినిధనా హ్యేషా వాగుత్సృష్టా స్వయంభువా।
ఆదౌ వేదమయీ దివ్యా యతస్సర్వాః ప్రసూతయః॥

తా॥ బ్రహ్మము ఆద్యంతములులేని వేదమయమగు వాక్కును ఉచ్చరింపఁగా, దానినుండి యన్నిపదార్థములును ఉత్పన్నములాయెను.

శ్లో॥ సర్వేషాం తు స నామాని కర్మాణి చ పృథక్ పృథక్।
వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చనిర్మమే॥

మను. ౧ అ. ౨౧ శ్లో॥

తా॥ బ్రహ్మము సర్వపదార్థములయొక్కయు, నామములను, ఉపయోగములను, వేఱువేఱు ఆకారములను మొట్టమొదట వేదశబ్దములనుండియే సృజించెను.

ఈపై శ్లోకమునందు "సంస్థాః" అను శబ్దము రూపములను తెలుపునది. అట్లే శ్రీవిష్ణుపురాణమునను,

శ్లో॥ నామరూపం చ భూతానాం కృత్యానాంచ ప్రపంచనం।
వేదశబ్దేభ్య ఏవాదౌ దేవాదీనాం చకార సః॥

(విష్ణు. ౧ అం ౫ అ ౬౩ శ్లో॥

తా॥ బ్రహ్మము ఈసమస్తభూతముల యొక్కయును, దేవతల యొక్కయును నామములను రూపములను ఉపయోగములనున్ను వేదములనుండియే మొట్టమొదట కలుగఁజేసెను.

కావున, దేవతలు మొదలగు వారికి శరీరమున్నప్పటికిని, వేదమునందుండు శబ్దములు అర్థములేనివి యగుట గాని, వేదము లనిత్యములగుట గాని ప్రసక్తింపదు.

౨౯॥ సూ॥ అత ఏ వ చ ని త్య త్వ ం.

టీ॥ అతఏవ = శబ్దస్మరణపూర్వకముగా, తత్తత్పదార్థములను సృజించుటను బట్టియే నిత్యత్వం = వేదములు నిత్యములగుట (ఉపపద్యతే = సంభవమగుచున్నది.)

తా॥ బ్రహ్మము సృష్టిసమయమున తత్తచ్ఛబ్దస్మరణ పూర్వక ముగాను తత్తత్పదార్థములను సృజించుటను బట్టియే నిత్యత్వం = వేదములు నిత్యమగుట (ఉపపద్యతే=సంభవమగుచున్నది.)

శ్రీ॥ భా॥ "మన్త్రకృతో వృణీతే" (మన్త్రములఁజేసిన వారిని వరించుచున్నాఁడు) అనియు, "నమ ఋషిభ్యో మన్త్రకృద్భ్యః" (అరణ ౭ ప్రశ్న, ౧ అను) (మన్త్రముల నొనర్చిన వారిలగు ఋషులకు నమస్కారము) అనియు "అయం సోగ్నిరితి విశ్వామిత్రస్య సూక్తం" (యజు. ౫ కాం. ౭ ప్రశ్న. 3 అను.) ("అయం సోగ్నిః" అనునది విశ్వామిత్రునిచే రచియింపఁబడిన సూక్తము) అనియు నీ మొదలగు శ్రుతులనుండి వసిష్ఠాది మహర్షులు మన్త్రములను, కాండములను మొదలగు వాని నొనర్చిన వారుగాను తెలియవచ్చుచున్నను, దేవర్షులను తెలుపునవి యగు నింద్రాది శబ్దములు ఆ యింద్రాదుల యాకారములఁ దెలుపునవి యగుట వలనను, ఆ యింద్రాదిశబ్ద స్మరణపూర్వకముగానే యా యింద్రాదులను సృజించియుండుటవలననున్న వేదములు నిత్యములగుట సంభవమగుచున్నది. ఈ పైని గనఁబఱచిన "మన్త్రకృతో వృణీత" ఇత్యాది వేదశబ్దములఁగొనియే ఆ యా కాండసూక్త మంత్రకారులగు మహర్షుల యాకారములను శక్తిని మొదలగు వానిని పరామర్శించి వారిని ఆ యా యాకారములు గల వారిని గానును, ఆ యా శక్తి గలవారిని గానును సృజించి, ప్రజాపతి వారి నా యా మంత్రములను రచియించు కార్యమున నియోగించెను వాడును ప్రజాపతిచేఁ గలుగఁజేయఁబడిన శక్తిగలవారై యా యా కార్యములకుఁ గావలసిన తపస్సు ననుష్ఠించి, యెల్లకాలముండి యుండినవియు, పూర్వీకులగు వసిష్ఠాదులచేఁ గన్పెట్టఁబడినవియునగు మన్త్రములు మొదలగు వానిని స్వయముగఁ జదువకయే స్వరమునఁ గాని అక్షరమునఁ గాని యెవ్విధమైన లోపము లేకుండ వానిఁ గన్పెట్టుచున్నారు. కావున వేదములు నిత్యములగుటయు, వసిష్ఠాదులు వానిఁజేసిన వారగుటయును సంభవము లగుచున్నవి.

అవతారిక:—(1)నైమిత్తిక ప్రళయాదులయందు ఇంద్రాదు లుత్పన్నులగు విషయమున, వేదశబ్దములఁగొని పూర్వముండు ఇంద్రాదులను స్మరిం

(1) చతుర్ముఖ బ్రహ్మముయొక్క పగటి వేళ పూర్తి యగుటచే వాఁడు శయనించు రాత్రికాలమున మూఁడు లోకములు మాత్రమే లయించును. ఈ ప్రళయము చతుర్ముఖుని దివసావసానమును నిమిత్తీకరించుకొని

చుటచే ప్రజాపతి దేవతలు మొదలగు వారిని సృజింప సమర్థుండగు గాక!(2) ప్రాకృత ప్రళయముననో, స్రష్టయగు ప్రజాపతియు, భూతాద్యహంకార పరిణామరూపమగు శబ్దమున్ను నశించును గాన, అప్పుడు శబ్దస్మరణ పూర్వకముగ ప్రజాపతి సృజించుట యెట్లు సంభవము కాగలదు? మఱియు అప్పుడు నశించిపోయిన వేదము నిత్యమున్ను ఎట్లు కాగలదు? కావున దేవతలు మొదలగు వారికి శరీరేంద్రియాదులు గలవని యంగీకరిచినను, వేదములు నిత్యములనువాని మతమున లోకవ్యవహారమునకు భాధ గలుగుట మొదలగునది ప్రాప్తించును. ఈపైని గనంబఱచిన ప్రకారము ఆక్షేపము రాఁగా, నందులకు సమాధానము చెప్పుటకై ;—

కలిగినదై నందున దీనికి నైమిత్తిక ప్రళయమను పేరు గలిగెను. వాని దినము చతుర్యుగ సహస్రపరిమితకాలము. కావున రాత్రియునంతయే యని యెఱుంగునది. అంతవరకే యీ ప్రళయముండి తరువాత అతఁడు నిద్రమేల్కొనగానే యన్నియును ఉత్పన్నములగును. “ఏష నైమిత్తికః ప్రోక్తః ప్రళయో యత్ర విశ్వసృట్ (శేతే నంతాసనో నిత్యమాత్మసాత్కృత్య చాఖిలాః” అనువాక్యము నైమిత్తిక ప్రళయము విషమునఁ బ్రమాణము.

(2) చతుర్ముఖ బ్రహ్మము నశించుటచే వానిచే సృజింపఁబడిన సమస్త పదార్థములును నశించుట ప్రాకృతప్రళయమనఁబడును. చతుర్ముఖబ్రహ్మము ముందుగనే పరబ్రహ్మమును సాక్షాత్కరించిన వాఁడు. కావున నీతఁడు బ్రహ్మాండాదులను సృజించుట మొదలుగాఁ గల కార్యముల నొనర్చుటయనెడి యాతని ప్రారబ్ధకర్మము నశింపఁగా, ముక్తిని పొందును. అట్టి సమయమున నీతని లోకమున నివసించు వారును బ్రహ్మసాక్షాత్కారము గలవారై యాతనితోఁగూడ ముక్తిని పొందుదురు “బ్రహ్మణా సహతే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరె పరస్యాంతే కృతాత్మానః ప్రవిశంతి పరం పదం” అను శ్రుతియును అట్లు తెలుపుచున్నది. ఇట్లు సత్యలోక వాసులతోఁగూడ తల్లోకాధిపతియగు చతుర్ముఖ బ్రహ్మము ముక్తిని బొందగా, వాఁడుండునట్టి బ్రహ్మాండమును దానిలోనుండు సమస్త లోకములును, వాటిలోనుండు స్థావరాదిభూత భౌతిక పదార్థములును ప్రకృతి యందు లయించును. కావున దీనిని ప్రాకృత ప్రళయమందురు. “ద్విపరార్థేత్వతిక్రాంతే బ్రహ్మణః పరమేష్ఠినః తదా ప్రకృతయస్సప్త కల్పంతే ప్రళయాయహి ఏష ప్రాకృతికో రాజన్ ప్రళయో యత్రలీయతే” అనువాక్యము ప్రాకృత ప్రళయము విషయమగు ప్రమాణము.

౨౮॥ సూ॥ సమాన నామ రూప త్వాచ్చావృత్తావప్య విరోధో దర్శనాత్ స్మృతేశ్చ.

టీ॥ ఆవృత్తావపి = మహాప్రళయము వచ్చినను, సమాననామరూప త్వాత్ = ఆప్రళయమునకుఁ బూర్వము పదార్థజాలమునకే నామరూపములుండెనో, యట్టి నామరూపములే నూతన సృష్టియందలి పదార్థములకుఁ గలుగుట వలనను, దర్శనాత్ = అటులనే శ్రుతి చెప్పుచుండుట వలనను, స్మృతేశ్చ = స్మృతియును చెప్పుచుండుట వలనను, అవిరోధః = వేదములు నిత్యములగుటకు విరోధమెద్దియును లేదు.

తా॥ మహాప్రళయము వచ్చినను, ఆప్రళయమునకుఁ బూర్వము పదార్థజాలమునకే నామరూపములుండెనో, ఆనామరూపములే నూతన సృష్టియందలి పదార్థములకుఁ గలుగుట వలనను, అటులనే శ్రుతి స్మృతులయందుఁ జెప్పియుండుట వలననున్ను వేదములు నిత్యములగుటకు విరోధమెద్దియును లేదు.

శ్రీ॥ భా॥ సమస్తము ప్రళయమును బొందినప్పుడు జగత్తు యుత్పన్నమయినను, అందలి పదార్థములకు పూర్వమున్నట్టి నామరూపములే యుండుటం జేసి విరోధమెద్దియును లేదు. అట్లే భగవంతుఁడగు పురుషోత్తముండును ప్రళయము కాఁగా, పూర్వముండిన జగత్తును స్మరించుచు, "బహుస్యాం" అన్నట్లు అనేక విధములుగా నగుదునని సంకల్పించి, తనయందు శక్తిమాత్రావశేషములు గాను లీనములై యుండు భోగ్య భోక్తృ పదార్థ జాతమును విభజించి మహత్తు మొదలుగాఁ గల బ్రహ్మాండము సంతయును హిరణ్య గర్భుని వరకును పూర్వమున్నట్లు సృజించి, పూర్వమున్నట్టివిగానే యుండుట మొదలగు విశేషములతోఁ గూడియున్న వేదములనున్ను బయలు పఱచి, హిరణ్యగర్భుని కుపదేశించి, పూర్వమువలెనే యతనిని దేవాద్యాకారము గల జగత్తుయొక్క సృష్టియందు నియమించి తాను స్వయముగ నట్టి హిరణ్యగర్భుని కంతరాత్మగా నుండెను. కావున పూర్వము చెప్పిన దంతయును సంభవమే. ఇంతకు పూర్వము ఉచ్చరించిన క్రమమువలనఁ గలుగు సంస్కారవశమున నట్టి క్రమవిశేషమును స్మరించుకొని యట్టి క్రమప్రకారము ఉచ్చరింపఁబడుటయే వేదములు అపౌరుషేయములగుటయున్ను, నిత్యములగుటయును, అది మనకును. సర్వేశ్వరునికిని సమానమే. ఇందు విశేషమేమనఁగా, పురుషోత్తముఁడు అట్టి సంస్కా-

లేముతో నిమిత్తము లేకుండగనే వేదముల ననుసంధింపఁగలఁడు. అది యెట్లు తెలియునదఁగా, శ్రుతి స్మృతుల వలన నట్లు తెలియుచున్నది. "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యోవై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" (శ్వే. ౬ అ. ౧౮ వా.) (ఎవఁడు చతుర్ముఖ బ్రహ్మమును సృజించి యతనికి వేదముల నుపదేశించుచున్నాఁడో) అను శ్రుతివాక్యమట్లు తెలుపుచున్నది. మఱియు, మను స్మృతియందును "ఆసీదిదం తమో భూతం" (మను. ౧ అ. ౫ శ్లో) మొదలుకొని "సోఽభిధ్యాయ శరీరాత్స్వాత్సిసృక్షుర్వివిధాః ప్రజాః। అప ఏవ ససర్జాదౌ తాసువీర్యమపాసృజత్। తదణ్డమభవద్ధైమం సహస్రాంశు సమప్రభం తస్మిన్జజ్ఞే స్వయం బ్రహ్మా సర్వలోక పితామహః" (బ్రహ్మము ధ్యానించి తన శరీరమునుండి నానావిధములగు ప్రజలను సృజింపఁదలంచి ప్రథమమున జలమును సృజించెను. ఆ జలమున వీర్యము నుంచెను. అది బంగారపు వర్ణముగలదియు, సూర్య ప్రభగల బ్రహ్మాణ్డమాయెను: ఆ యణ్డమున సర్వలోకపితామహుఁడగు బ్రహ్మము పుట్టెను) అని చెప్పఁబడియె. పురాణములయందును "తత్ర సుప్తస్య దేవస్య నాభౌ పద్మమజాయత తస్మిన్ పద్మే మహాభాగ వేదవేదాంగ పారగః। బ్రహ్మోత్పన్నః సతే నోక్తః ప్రజాస్సృజ మహామతే" (యోగనిద్రలోనుండు పరబ్రహ్మముయొక్క నాభియందొక పద్మము పుట్టెను. ఆ పద్మమున వేదవేదాంగ పారగుఁడగు చతుర్ముఖ బ్రహ్మము పుట్టెను. అంతట పరబ్రహ్మ మతనితో ప్రజలను సృజింపుమని చెప్పెను) అనియు, అట్లే "పరో నారాయణో దేవస్తస్మాజ్జాతశ్చతుర్ముఖః" (పరబ్రహ్మమగు నారాయణుని వలనఁ జతుర్ముఖ బ్రహ్మము పుట్టెను) అనియు, అట్లే "ఆదిసర్గమహం వక్ష్యే" (మొదటి సృష్టిని గుఱించి చెప్పుచున్నాను) అని యారంభించి "సృష్ట్వా నారం తోయమన్తస్స్థితోఽహం। యేన స్యాన్మే నామ నారాయణేతి కల్పేకల్పే తత్ర శయామి భూయః సుప్తస్య మే నాభిజం స్యాద్యథాబ్జం। ఏవం భూతస్య మే దేవి నాభిపద్మే చతుర్ముఖః ఉత్పన్నస్సమయా చోక్తః ప్రజాస్సృజమహామతే" (నారమనఁబడు ఉదకమును సృజించి నే నందులో నుండుటంజేసి నాకు నారాయణుఁడని పేరు గలిగెను. నేను ప్రతికల్పమునను అందు శయనించుచున్నాఁడను. యోగనిద్రయందుండు నానాభియందు పద్మము పుట్టెను. ఓ దేవి యిట్టి నా నాభికమలమున చతుర్ముఖ బ్రహ్మము పుట్టగా ప్రజలను సృజింపుమని నాచేతఁ జెప్పఁబడెను) అనియు నీ మొదలగు పురాణ వాక్యములనుండియును అట్లు తెలియుచున్నది.

కావున దేవతలు మొదలగు వారికిని అర్థిత్వసామర్థ్యములుండుట సంభవమగుటంజేసి వారికిని బ్రహ్మవిద్యయందధికారము గలదని సిద్ధమగు చున్నది.

దేవతాధికరణము ముగిసెను.



## మధ్వధికరణము.

౩౦॥ సూ॥ మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః

టీ॥ మధ్వాదిషు=మధువిద్య మొదలగు నుపాసనములయందు, అసంభవాత్=వస్వాది దేవతలకు ఉపాసనాయోగ్యత సంభవింపదు. కావున, అనధికారం=వారికి బ్రహ్మవిద్యాధికారము లేదని, జైమినిః = జైమినిముని, మన్యతే=తలంచుచున్నాఁడు.

తా॥ మధువిద్య మొదలగు ఉపాసనములయందు వస్వాది దేవతలకు యోగ్యత సంభవింపదు. కావున దేవతలకు బ్రహ్మవిద్యాధికారము లేదని శ్రీజైమిని ముని తలంచుచున్నాఁడు.

శ్రీ॥ భా॥ దేవతలు మొదలగు వారికిని బ్రహ్మవిద్యయందధికారము గలదని చెప్పఁబడియె. అందును గుఱించి యొక సంశయము గలుచున్నది.

### సంశయము.

ఏ యుపాసనములయందు ఏ దేవతలు ఉపాస్యదేవతలో, ఆ యుపాసనములయందా దేవతల కధికారము కలదా? లేదా?

### పూర్వపక్షము.

మధువిద్య మొదలగు వాని ననుష్ఠించు విషయమున దేవతలు మొదలగు వారికి అధికారము లేదని జైమినిముని తలంచుచున్నాడు, ఏలనన్గా, ఆదిత్యవస్వాదులచే నుపాసింపఁబడు అదిత్యవస్వాదులు వేఱుగా నుండుట యసంభవము గదా! ముందుగనే వస్వాదులుగా నుండు వారికట్టి వస్వాది పదవి తిరిగి సంపాదించుకొనవలసినది కాదు గదా! “అది యెట్లనిన, మధువిద్యయందు ఋగ్వేదాదులయందుఁ బ్రతిపాదింపఁబడునట్టి కర్మము

ననుష్ఠించుటచే సంపాదింపఁబడునదియు, రశ్మలద్వారా పొందబడునట్టి రస మున కాశ్రయమగుటచే మధువని పిలువఁబడునట్టి ఆదిత్యునియొక్క యంశ ములు వస్వాదులచే భుజింపఁబడునవిగా నుపాసింపవలసిన వనియు అందులకు ఫలము వస్వాది పదవి యనియును ఛాందోగ్యమున "అసౌ వా ఆదిత్యో దేవమధు" (ఛా. 3. ప్ర. ౧. ఖ. ౧. వా.) (ఈ యాదిత్యుఁడు దేవతలకు మధువు) అని యారంభించి "తద్యత్ప్రథమ మమృతం తద్వసవ ఉపజీవన్తి" (ఛా. 3 ప్ర. ౬ ఖ. ౧ వా.) (మొదట పొందఁబడిన యమృతమును వసు వులు అనుభవించుచున్నారు) అనిచెప్పి "సయ ఏత దేవ మమృతం వేద వసూనామే వైకో భూత్వా అగ్నినైవముఖే నైత దేవా మృతందృష్ట్వాతృప్యతి" (ఛా. 3 ప్ర. ౬ ఖ. ౩ వా) (ఎవఁడు ఈ యమృతము నిట్లు ఉపాసించునో, అతఁడు వసువులలో నొక్కఁడై అగ్నిద్వారా యాయమృతమునుజూచి తృప్తుఁ డగుచున్నాడు) అనుటచేఁ దెలుపఁబడియె.

## ౩౧॥ సూ॥ జ్యో తి షి భా వా చ్చ.

టీ॥ జ్యోతిషి=పరబ్రహ్మము విషయమున; భావాచ్చ=దేవతలకు ఉపా సనముండుట వలనను,

తా॥ పరబ్రహ్మము విషయమగు ఉపాసనము దేవతలకున్నట్లు శ్రుతు లవలనఁ దెలియుటవలనను అట్లు తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ "తం దేవా జ్యోతిషాం జ్యోతిర్హోపాసతేఽమృతం" (బృ. ౬ అ. ౪ బ్రా. ౧౬ వా.) (దేవతలా పరమాత్మను జ్యోతిస్సులకు జ్యోతిస్సు ను గాను, అయుస్సును గాను, అమృతమును గాను ఉపాసించుచున్నారు) అను శ్రుతివాక్యమువలన దేవతలకు పరబ్రహ్మము విషయమగు నుపాసనము న్నట్లు తెలియుచున్నది. పరబ్రహ్మమును ఉపాసించుట యనునది దేవతలకును మనుష్యులకును సమానమేయై యుండగా, దేవతలను బ్రహ్మోపాసకులను గాను ప్రత్యేకించి జెప్పుటవలన దేవతలు పరబ్రహ్మోపాసకులే గాని యితర దేవతోపాసకులు కారని యిందువలన సూచితమగుచున్నది. కావున వస్వాది దేవతోపాసనములయందు దేవతల కధికారము లేదని సిద్ధమగుచున్నది.

అవతారిక:—ఈపైని గనఁబడిన ప్రకారము ఆక్షేపమురాఁగా, అందులకు సమాధానము చెప్పుటకై:—

65

3_॥ సూ॥ భావం తు బాదరాయణో ౽స్తి హి.

టీ॥ భావం = వస్వాది దేవతలకును మధ్వాద్యుపాసనములయందధికారమంకుటను, బాదరాయణః = వ్యాసాచార్యుడు, (మన్యతే=తలంచుచున్నాడు). అస్తి హి=అట్టి స్థితి కలదు గదా!

తా॥ వస్వాది దేవతలకును మధ్వాద్యుపాసనముల యందధికారము కలదని వ్యాసాచార్యుడు తలంచుచున్నాడు. అట్టి స్థితి వారికిఁ గలదు గదా!

సిద్ధాంతము.

శ్రీ॥ భా॥ ఆదిత్య వస్వాదులకు మధ్వాద్యుపాసనములయందును అధికారము గలదని శ్రీవ్యాసాచార్యుడు తలంచుచున్నాడు. ఆదిత్య వస్వాదులకుఁ గూడ తమ స్థితిలోనుండు బ్రహ్మమును ఉపాసించుటచే వస్వాదిరూపమును బొంది, యందు మూలముగ బ్రహ్మమును బొందుటకిచ్ఛగలుగుట సంభవము. ప్రకృతకాలమున వసువులుగా నుండు వారికి కాలాంతరమునను వసువులుగానే ఘటనలయుననెడి కోరిక యుండవచ్చును. ఈ తోవున కార్యావస్థయనియు, కారణావస్థయనియు ననఁబడునట్టి యీ యుభయావస్థలలోనుండు నట్టి బ్రహ్మమును గుఱించిన యుపాసనము విధింపఁబడుచున్నది. అది యెట్లనిన, "అసౌ వా ఆదిత్యో దేవ మధు" (ఛా. 3 ప్ర. ౧ ఖ. ౧ వా.) అను వాక్యము మొదలుకొని "అథ తత ఊర్ధ్వ ఉదేతి" (ఛా. 3 ప్ర. ౧౧ ఖ. ౧ వా) అను వాక్యము వరకు ఆదిత్యవస్వాది కార్యపదార్థరూపమగు స్థితిలోనుండు బ్రహ్మము నుపాసించునది యని విధింపఁబడుచున్నది. "అథ తత ఊర్ధ్వ ఉదేతి" ఇత్యాది వాక్యము మొదలుకొని యాదిత్యాంతరాత్మగానుండు వాఁడును కారణావస్థలోనే యుండునట్టి బ్రహ్మము నుపాసించునది యని యుపదేశింపఁబడుచున్నది. ఇట్లు కారణావస్థయనియు కార్యావస్థయనియు నీ రెండు అవస్థలు గల బ్రహ్మమును ఉపాసించువాఁడు కల్పాంతరమున వస్వాది స్వరూపమును బొంది యది ముగిసిన తోడనే పరబ్రహ్మమును బొందుచున్నాడు. మఱియు, "సహా వా అస్మా ఉదేతి న నిమ్రోచతి స కృద్ధివా హాస్మై భవతి య ఏతా మేవం బ్రహ్మోపనిషదం వేద" (ఛా. 3 ప్ర. ౧౧ ఖ. వా.) (ఎవఁడు ఈ మధువిద్యారూపమగు బ్రహ్మోపాసనము ననుష్ఠించుచున్నాడో వానికి సూర్యుడు ఉదయించినను అస్తమించినను ఒక్కటియే అతని కెల్లప్పుడు పగలుగానే యుండును) అను శ్రుతివాక్యమున మధువిద్య బ్రహ్మోపాసనముగాఁ జెప్పఁబడినందునను వస్వాద్యైశ్వర్యరూపమగు ఫలము

బ్రహ్మప్రాప్తితో ముగించునది గాను తెలియవచ్చుటవలననున్ను వస్వాదు లకు భోగ్యభూతమగు నాదిత్యాంశమును గురించి విధింపఁబడునట్టి యుపాస నము అట్టి యవస్థతోనుండునట్టి బ్రహ్మమును గురించినదియే యని తెలి యబడుచున్నది. కావున నిట్టి యుపాసనము ఆదిత్యవస్వాదుల చేతనున్ను అనుష్ఠించుటకు శక్యమైనది. ఇట్లు ఈ తావున బ్రహ్మమే యుపాస్యవస్తువు గాన, "తం దేవా జ్యోతిషాం జ్యోతిః" అనువాక్యమును ఉపపన్నమగు చున్నది. కావుననే వృత్తికారులును "అస్తి హి మధ్వాదిషు సమ్భవో బ్రహ్మ ణ ఏవ సర్వత్ర నిచాయ్యత్వాత్" (ఉపాసనముల యందంతటను బ్రహ్మము యుపాసింపఁబడుచుండు గాన మధ్వాద్యుపాసనములను దేవతలనుష్ఠించుట సంభ వము" అని ప్రసాదించియున్నారు.

—— మధ్వధికరణము ముగిసెను. ——



## —— అపశూద్రాధికరణము. ——

**33॥ సూ॥ శుగస్యతదనాదరశ్రవణా త్తదాద్రవణాత్సూచ్యతే హి.**

టీ॥ అస్య = ఈ జానశ్రుతికి, తదనాదరశ్రవణాత్ = తత్ = హంసల యొక్క, అనాదరశ్రవణాత్ = అనాదరద్యోతకములగు వాక్యములను వినుట వలన, శుక్ = దుఃఖము కలిగెను. తదా = అది కలిగిన వెంటనే, ఆద్రవణాత్ = గురువును వేగముగాఁ బొందుట వలన, సూచ్యతే హి = పూర్వము హంసల వలనఁ గలిగిన దుఃఖము సూచింపఁబడెను గదా ?

తా॥ దుఃఖముచే రైక్వుఁడను గురువు నొద్దకుఁ బరుగెత్తుట వలన "ఓశూద్రుఁడా!" యని రాజు సంబోధింపఁబడెనే కాని, యతఁడు జన్మముచే శూద్రుఁడగుట వలనఁ గాదు. ఈ తావున రాజునకు హంస వాక్యముల వలనఁ గలిగిన దుఃఖము సూచితమగుచున్నది.

శ్రీ॥ భా॥ శూద్రునికి బ్రహ్మవిద్య యందధికారము కలదా? లేదా? యనెడి యంశము ఈ యధికరణమున విచారింపఁబడుచున్నది.

—— పూర్వపక్షము. ——

శూద్రునికి బ్రహ్మవిద్యయందధికారము కలదనుట యుక్తము. ఏలన నిన, అధికారమనునది యర్థిత్వసామర్థ్యములను బట్టి గదా యుండునది.

శూద్రునికిన్ని యవి యుండవచ్చును. శూద్రునికి అగ్న్యుపాసనము లేదుగాన, నట్టి యగ్న్యుపాసనము మూలముగా సాధింపఁబడునట్టి కర్మముల విషయమున నతని కధికారము లేక పోవు గాక, అయినను, బ్రహ్మోపాసనము మనస్సుతో మాత్రమే చేయఁబడునది గాన, దానియందు శూద్రుని కధికారము ఉండేయున్నది. బ్రహ్మోపాసనమునకు శాస్త్రవిహితమగు కర్మము కావలసియున్నను, దానికి ఆ యా వర్ణాశ్రమోచితమగు కర్మమే కావలసినది గాన, శూద్రునికిని వాని వర్ణమునకుఁ దగినట్లు తనకు పైగానుండు వర్ణముల వారికి తాను చేయునట్టి శుశ్రూషయే యందులకు గాను కావలసిన కర్మము కాగలదు. కావున «తస్మాచ్ఛూద్రో యజ్ఞేఽనవక్లృప్తః» (కావున శూద్రునికి యజ్ఞము ననుష్ఠించుటయం దధికారము లేదు) అను శ్రుతివాక్యమునను అగ్న్యుపాసనము మూలముగా ననుష్ఠింపఁబడునవి యగు నగ్నిహోత్రాది కర్మములయందే శూద్రునికి అధికారము లేదని యనువదింపఁబడియె. అదియే న్యాయసిద్ధము. ఒకవేళ వేదాధ్యయనముఁ జేయకయు, వేదాంత వాక్యశ్రవణముఁ జేయకయు, అందుమూలముగ బ్రహ్మస్వరూపమునున్ను వాని నుపాసించునట్టి పద్ధతినిన్ని తెలిసికొనక యుండునట్టి శూద్రుండు బ్రహ్మము నుపాసించుట యెట్లు సంభవమని యడిగెదవేమో, చెప్పెదను. శూద్రుఁడు వేదాధ్యయనముఁ జేయకపోయినను, వేదాంత వాక్యశ్రవణముఁ జేయకపోయినను, అతఁడు ఇతిహాసపురాణ శ్రవణముఁ జేయుటచే నైనను వానికి బ్రహ్మస్వరూపజ్ఞానమును బ్రహ్మోపాసనమును గుఱించిన జ్ఞానమున్ను కలుగవచ్చును. శూద్రుండును ఇతిహాసపురాణములను వినవచ్చునని «శ్రావయేచ్చతురో వర్ణాన్కృత్వా బ్రాహ్మణమగ్రతః» (బ్రాహ్మణుని ముందుగా నుంచుకొని నాల్గువర్ణము వారికి ఇతిహాస పురాణములను వినిపింపవలయును) అను శ్రుతివాక్యము అనుజ్ఞనిచ్చుచున్నది. మఱియు, విదురుఁడు మొదలగు వారును బ్రహ్మనిష్ఠులుగానున్నట్లు ఇతిహాస పురాణములవలనఁ దెలిసికొనుచున్నాము. సంవర్గవిద్యావిషయమై శూద్రులకును అధికారమున్నట్లు ఉపనిషత్తుల వలనఁ దెలిసికొనుచున్నాము. అది యెటనిన, «ఆజహారేమాశ్శూద్రానేనైవ ముఖేనాలాపయిష్యథా» (ఓ శూద్రుఁడా, ఈ దక్షిణలఁగొని వచ్చినందున బ్రహ్మోపదేశమును పొందగలవు) అనువాక్యమున ఆచార్యుఁడగు రైక్వుఁడు శుశ్రూషాపరుఁడగు జానశ్రుతి యను వానిని «ఓ శూద్రుఁడా» అని పిలిచి బ్రహ్మవిద్య నుపదేశించినట్లు చెప్పఁబడియె. కావున శూద్రునికిని బ్రహ్మవిద్య యందధికారము గలదు.

## సిద్ధాంతము.

శూద్రునికి బ్రహ్మవిద్య యందధికారముండుట యసంభవము. వానికి సామర్థ్యము లేదు. బ్రహ్మస్వరూపమునున్న బ్రహ్మము నుపాసించు పద్ధతినిన్ని తెలియనివాఁడును, అట్టి యుపాసనమున కంగములగు వేదాధ్యయనయజ్ఞాదులయం దధికారము లేని వానికి ఉపాసనము ననుష్ఠించుటకు సామర్థ్యముండుట యసంభవము. సామర్థ్యము లేని వానికి అర్థిత్వమున్నప్పటికిని, అధికారముండనేరదు. వేదాధ్యయనము లేక పోవుటంజేసి సామర్థ్యముండజాలదు. ఏలననిన, త్రైవర్ణికులను గుఱించినది యగు వేదాధ్యయనవిధివలన సిద్ధమగు స్వాధ్యాయము మూలముగ సంపాదింపఁదగినదియగు జ్ఞానమును తప్ప వేఱొక్క విధమునఁ బొందఁబడు జ్ఞానమును కర్మవిధులు అంగీకరింపని చందంబున, బ్రహ్మోపాసన విధులును అంగీకరింపవు. కావున వేదాధ్యయన విధి వలన స్వాధ్యాయముఁ (వేదాధ్యయనముఁ) జేసి యందుమూలముగ జ్ఞానమును సంపాదించుకొనిన వానికే బ్రహ్మోపాసనము ఉపాయభూతము కాఁగలదు. అందువలన శూద్రునికి బ్రహ్మోపాసనము ననుష్ఠించు విషయమున సామర్థ్యముండుట యసంభవము. ఇతిహాసపురాణములును వేదార్థములను నిశ్చయించుచు నందుమూలముగానే యుపాయమును తెలుపుచున్నవియే కాని, యవి స్వతంత్రముగాఁ దెలుపుచుండలేదు. శూద్రుఁడు ఇతిహాసపురాణములను వినవచ్చుననుట పాపక్షయము కొఱకైనయే కాని, ఉపాసనమునకు గాను కాదు. విదురాదులన్ననో జన్మాంతరమున లభించిన జ్ఞానము శేషముండుటచే జ్ఞానముగలవారు. అయితే ప్రారబ్ధకర్మవశమున నిట్టి జన్మమును పొందిరి. ఇంతియే. కావున వారు బ్రహ్మనిష్ఠులు కాదగుదురు.

సంవర్గ విద్యాసందర్భమున శుశ్రూషాపరుఁడును, పౌత్రాయణుండునగు జానశ్రుతి యనువానిని "ఓ శూద్రుఁడా" అని పిలుచుటచే శూద్రునికిని బ్రహ్మోపాసనమున నధికారమున్నట్లు సూచితమగుచున్నదని పూర్వపక్షి చెప్పినది యుక్తము కాదు. ఏలననఁగా, శుశ్రూషాపరుఁడును పౌత్రాయణుఁడునగు జానశ్రుతికి సరియయిన బ్రహ్మవిద్య లేనందున నతనిని గుఱించి హంసలు చెప్పిన యనాదరవాక్యములను విని యతఁడు వెంటనే బ్రహ్మవేత్తయగు రైక్వుని యొద్ద కాతురతతో బోవుటచే నతనికి దుఃఖము కలదని యిందువలన సూచితమగుచున్నది. అందువలన నతఁడు "ఓ శూద్రుఁడా!" యని పిలువఁబడెను. ఇంతియెకాని, నాల్గవవర్ణమునఁ బుట్టినందున నతనిని

"శూద్రుఁడా!" యని పిలిచి యుండలేదు. ఈ కావున "శోచతీతి శూద్రః=శోకించువాఁడు గాన శూద్రుఁడు" అనునది శూద్రశబ్దముయొక్క వ్యుత్పత్తి. ఇచట "శుచేర్దశ్చ" అను వ్యాకరణ సూత్రమువలన "శుచ్" ధాతువునందలి "శు" అను అక్షరమునకు దీర్ఘమున్ను చకారస్థానమున దకారమున్ను రేఫయున్ను వచ్చుటచే "శూద్ర" అనుశబ్దము ఏర్పడుచున్నది. కావున, ఈ కావున దుఃఖియగుటయే శూద్రశబ్ద ప్రయోగముచే సూచితమగుచున్నదియే కాని, శూద్రజాతి యీ కావున సూచింపఁబడుచుండలేదు. ఎట్లనిన,

ఒకానొకప్పుడు పౌత్రాయణుండగు జానశ్రుతి యను రాజుండెను. అతఁడు ఎక్కువగా ద్రవ్యము నిచ్చువాఁడు గాను, మిక్కిలి యన్నదానముచేయువాఁడు గాను నుండెను. ఇట్లు ధార్మికులలో నగ్రేసరుండగు నీతని ధర్మమునకు సంతోషించిన వారలగు సిద్ధులు మహాత్ములు ఈతనికి బ్రహ్మవిచారమునందిచ్ఛను గలుగఁజేయదలంచి, హంసరూపములఁ దాల్చి, రాత్రి సమయమున నీతనికి సమీపముగాఁ బోవుచుండగా, నప్పుడా రెండుహంసలలో నొక్కటి వేఱొక్క దానితో "భో భోయి భల్లాక్ష భల్లాక్ష జానశ్రుతేః పౌత్రాయణస్య సమందివా జ్యోతిరాతతం తన్మా ప్రసాంక్షీస్తత్త్వా మాప్రధాక్షీత్" (ఛా. ౪ ప్ర. ౧ ఖ. ౨ వా) (ఓ హంస! ఓ హంస! పౌత్రాయణుఁడగు జానశ్రుతియొక్క సూర్యతేజస్సువంటి తేజస్సు వ్యాపించియున్నది. దానిని దాటకుమా! అది నిన్ను దహింపకపోవు గాక!) అని యిట్లు జానశ్రుతియొక్క స్తోత్రరూపమగు వాక్యమును విని వేఱొక్క హంస "కమ్వర ఏన మేతత్సన్తం సయుగ్వానమివ రైక్వ మాత్థ" (వీఁడెవఁడు? ఈతనిని బండితోఁగూడి యుండు రైక్వునివలెఁ జెప్పుచున్నావేల?) అని యడిగెను. అనఁగా వీఁడెవఁడని యీతనిని బ్రహ్మజ్ఞుఁడగు రైక్వునివలెనే గుణశ్రేష్ఠునిగాఁ జెప్పెదవు? రైక్వుఁడే లోకమున నెక్కువ గుణములు గలవాఁడు. జానశ్రుతి యెక్కువ ధర్మాత్ముఁడేయైనను, బ్రహ్మజ్ఞుఁడు కానందున నీతనియందు రైక్వుని తేజస్సువలెనే నన్ను దహింపఁజేయునట్టి యంత యెక్కువ గుణమేమున్నది? అని యర్థము. ఇట్లు ఒక హంస చెప్పఁగా, రెండవహంస రైక్వుఁడెట్టివాఁడని యడిగెను. "లోకమున బాగుగా ననుష్ఠింపఁబడిన కర్మమెద్ది గలదో, అందఱియందు నెట్టి జ్ఞానము కలదో, అది యంతయును ఎవని జ్ఞానకర్మములలో నంతర్భూతమైనదియో, అట్టివాఁడు రైక్వుఁడు" అని బదులు చెప్పెను. ఇట్లు బ్రహ్మజ్ఞానము లేకుండుటచే తనను నిందించునదియు, అట్టి జ్ఞానముండుటచే రైక్వుని స్తుతించునట్టిదియునగు హంసవాక్యమును వినినవాఁడగు జానశ్రుతి తన యొద్ద

నుండు క్షత్తయను వానిని రైక్వుని వెదకుటకై పంపి వాని సమాచారముఁ దెలిసికొని యతఁడురాఁగా, తానును ఆఱునూరుల గోవులను, స్వర్ణములను, రథమును, గుఱ్ఱమును కానుకలనుగా గొని రైక్వుని యొద్దకేగి "అను మ ఏతాం భగవో దేవతాం శాధి యాం దేవతాముపాస్సే" (ఓపూజ్యుఁడా ఏదేవతను నీవు ఉపాసించుచున్నావో, ఆ దేవతను గుఱించి నాకు తెలుపుమా!" అని యడిగెను అనఁగా, నీవు ఉపాసించునట్టి దేవతను గుఱించిన ధ్యానమును నాకుఁ గలుగఁజేయుము యని యర్థము.

రైక్వుఁడు యోగమహిమవలన ఈ మూఁడు లోకముల సమాచారములఁ దెలిసిన వాఁడగుటంజేసి, జానశ్రుతి బ్రహ్మజ్ఞానము లేక పోవుటను బట్టి హంసలాడిన యనాదరణ వాక్యములను వినుట వలన దుఃఖితుఁడగుటనున్ను, అటుపిమ్మటనే బ్రహ్మజ్ఞానముకై ప్రయత్నించుటనున్ను తెలిసికొని యాతఁడు బ్రహ్మవిద్యను లభించుట కర్హుండనియును ఎఱిఁగి చిరకాలము సేవచేయక ద్రవ్యమిచ్చి బ్రహ్మవిద్యను తెలియఁగోరినట్టి యాతఁడు యథాశక్తి ద్రవ్యము నొసంగుటచే నితనియందు బ్రహ్మవిద్య స్థిరముగా నుండునని తలంచి, యతని నను గ్రహింపఁగోరి, బ్రహ్మవిద్యోపదేశమునకుఁ గావలసిన యోగ్యతనుసూచింపునట్టి యతని దుఃఖమును "ఓ శూద్రుఁడా!" అని పిలుచుటచేఁ దెలుపుచు, "అహ హారేత్వా శూద్ర తవైవ సహ గోభిరస్తు" అని యిట్లు చెప్పెను. అనఁగా, ఈ గోవులను రథమును నీవే యుంచుకొనుము. బ్రహ్మవిచారమునకై దుఃఖించుచుం డునట్టి నీయొక్క బ్రహ్మవిద్య నీవింత మాత్రము నాకిచ్చుటచేతనే స్థిరపడదనెను. అంతట జానశ్రుతి స్వశక్త్యను గుణముగానే గోవులు మొదలగు వానిని, ధన మును, కన్యకనున్ను గొనివచ్చి మరల రైక్వుని యాశ్రయించెను. అంతట రైక్వుఁ డును వాని యోగ్యతనే తెలుపుచు "ఓశూద్రుఁడా!" యని పిలిచి "ఆజహారేమా శూద్రానేనైవ ముఖేనాలాపయిష్యథా" అని చెప్పెను. అనఁగా ఈ ధనమును నీ శక్తి కనుగుణముగాఁ గొనివచ్చితివి. కావున నీవు చిరకాలసేవ చేయక పోయినను ఈ ద్రవ్యము మూలముగ బ్రహ్మవిద్యను లభింపగలవని చెప్పి వానికి బ్రహ్మవిద్య నుపదేశించెను. కావున బ్రహ్మవిద్యోపదేశ యోగ్యతను తెలు పుటకై యా తావున శూద్రశబ్దముచే దుఃఖమే సూచింపఁబడినది గాని శూ ద్రజాతి సూచింపఁబడలేదు.

**౩౮॥ సూ॥ క్షత్రియత్వావగతేశ్చ.**

టీ॥ క్షత్రియత్వగతేశ్చ=జానశ్రుతి క్షత్రియుండను నిశ్చయము కలుగుటవలనను,

తా॥ జానశ్రుతి క్షత్రియుండను నిశ్చయముండుట వలనను అతఁడు శూద్రుఁడు కాడని తెలియుచున్నది.

శ్రీ॥ "బహుదాయీ" (ఛా. ४ ప్ర. ౧ ఖ. ౧ వా) (అధికముగా నిచ్చువాఁడు) అనువాక్యమువలన దానపతిత్వమున్ను, "బహుపాక్యః" అను వాక్యము మొదలుకొని "సర్వ త ఏవ మేత దన్నమత్స్యన్తి" (ఛా. ४ ప్ర. ౧ ఖ. ౫ వా) (అంతటను ఈ యన్నమును భుజించుచున్నారు) అను వాక్యముపఱకు బహుతరపక్వాన్నదా తృత్వమున్ను తెలియవచ్చుట వలనను "సహ సజ్జిహాన ఏవ: క్షత్తారము వాచ" అనువాక్యమువలనఁ దెలియవచ్చు క్షత్తృప్రేషణము వలనను, బహుగ్రామదానమువలనఁ దెలియవచ్చు జనపదాధిపతిత్వము వలనను జానశ్రుతి క్షత్రియుండని తెలియుటచే నతఁడు శూద్రుఁడు కాఁడు.

అవతారిక:—శ్రుత్యారంభమున నుండు ఆఖ్యాయిక వలన జానశ్రుతి క్షత్రియుఁడుగాఁ దెలియవచ్చుచున్నాడని చెప్పఁబడియె. అంతము నందుండు ఆఖ్యాయిక వలనను అతండు క్షత్రియుండుగాఁ దెలియవచ్చుచున్నాడని యీ సూత్రముచేఁ దెలుపుచున్నారు.

3౫॥ సూ॥ ఉ త్త ర త్ర చై త్ర ర థే న లి ఙ్గా త్॥

టీ॥ ఉత్తరత్ర=ఉత్తర వాక్యమునందు, చైత్రరథేన = క్షత్రియుండైన చైత్రరథునితోఁ గూడ, లిఙ్గాత్ = సంవర్గ విద్యాభ్యాసముఁ జేయుట వలనను (జానశ్రుతి క్షత్రియుండు)

తా॥ చైత్రరథుండు నిస్సంశయముగా క్షత్రియుండు. జానశ్రుతి అతనితో సహభోజనాధ్యయనములు చేసినట్టు శ్రుత్యుత్తర వాక్యములలోఁ జెప్పఁబడియుండుట వలనను అతఁడు క్షత్రియుండని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఈ జానశ్రుతికి ఉపదేశింపఁబడునట్టి యీ సంవర్గవిద్యయందే ఇఁకమీఁదు పేర్కొనఁబడు అభిప్రతారి యను క్షత్రియుని బట్టియును జానశ్రుతి క్షత్రియుండని తెలియుచున్నది. అది యెట్లనిన, ఛందోగులు "అథ హ శౌనకంచ కాపేయ మభిప్రతారిణంచ కాక్షసేనిం పరివిష్యమాణౌ బ్రహ్మచారీ బిభిక్షే" (ఛా. ४ ప్ర. 3 ఖ. ౫ వా.) (శౌనకవంశసంభవుఁడగు కాపేయునిని కాక్షసేని వంశసంభవుఁడగు అభిప్రతారినిన్ని బ్రహ్మచారి భిక్ష

నడిగెను; అను వాక్యము మొదలుకొని «బ్రహ్మచారిన్నేదముపాస్మహే» అనువాక్యము వరకును సంవర్గ విద్యా సందర్భమునఁ బఠింపఁబడిన కాపేయ అభిప్రతారులను వారిని భిక్షకై యాచించిన బ్రహ్మచారికిని సంవర్గ విద్య తో సంబధమున్నట్లు తెలియుచున్నది. ఈ ముగ్గురిలో అభిప్రతారియను వాఁడు క్షత్రియుండు. తక్కిన యిద్దఱును బ్రాహ్మణులు. కావున ఈవిద్య యందు బ్రాహ్మణునికి తక్కిన జాతివారిలో క్షత్రియునితోను మాత్రమే సంబంధమున్నట్లు తెలియుచున్నది గాని శూద్రునితో సంబంధమునట్లు తెలి యవచ్చుచుండ లేదు. కావున ఈ విద్యతో సంబంధించిన బ్రాహ్మణుఁడగు రైక్వునికంటె వేఱగు జానశ్రుతియును క్షత్రియుండని చెప్పుట యుక్తము గాని, యతఁడు శూద్రుండనుట యుక్తము కాదు.

అయితే అభిప్రతారి చైత్రరథుఁడగుటయు అతఁడు క్షత్రియుఁడగుట యును ఈ ప్రకరణమునఁ జెప్పియుండలేదే? ఇట్లుండ, అతఁడు చైత్రరథుండ నియు, క్షత్రియుండనియును నిశ్చయించుట యెట్లు? అని యడిగెదవేని, యందు లకు సమాధానమును సూత్రకారులే «లిఙ్గాత్» అనుపదముచేఁ దెలిపి యున్నారు. అదీ యెట్లనిన, «అథ హ శౌన కంచ కాపేయ మభిప్రతారి ణంచ కాక్షసేనిం» అనువాక్యమున అభిప్రతారిని కాపేయునితోఁ గూడ పేర్కొనుటను బట్టి అభిప్రతారికి కాపేయునితో సంబంధమున్నట్లు తెలియు చున్నది. వేఱొక్క తావున «ఏతేన వై చైత్రరథం కాపేయా అయాజన్» (తాండ్య. ౨. ౧౨. ౫) (ఇట్లు కాపేయులు చైత్రరథుని యజ్ఞము చేయిం చిరి.) అనువాక్యము వలన కాపేయులతో సంబంధముగల వాఁడు చైత్ర రథుండని తెలియుచున్నది. అట్లే «తస్మాచ్చైత్రరథోనామైకః క్షత్రపతిర్జా యత» (చైత్రరథుండను క్షత్రియుం డొక్కఁడు పుట్టెను) అనువాక్యమువలన చైత్రరథుండు క్షత్రియుండనియును తెలియుచున్నది. కావున అభిప్రతారి చైత్రరథుండనియు, క్షత్రియుండనియును తెలియుచున్నది.

అవతారిక:—శూద్రునికి బ్రహ్మవిద్యయం దధికారముండుట న్యాయ విరుద్ధమనియు, అట్టి యధికారమును సూచింపు చిహ్నమెద్దియును శ్రుతుల యందు గానఁబడదనియును ఇంతకు పూర్వము చెప్పఁబడియె. ప్రకృతసూ త్రమున శూద్రునికి బ్రహ్మవిద్య యందధికారము లేకపోవుట న్యాయసిద్ధమని శ్రుతిస్మృతులవలనఁ దెలియవచ్చుచున్నదని తెలుపుచున్నారు.

౩౬॥ సూ॥ సంస్కారపరామర్శాత్తదభావాభిలాపాచ్చ ॥

టీ॥ సంస్కారపరామర్శాత్ = బ్రహ్మవిద్య నుపదేశించు తావుల నెల్లను ఉపనయనాది సంస్కారములు చెప్పబడినందునను, తదభావాభిలాపాచ్చ = శూద్రుని కట్టి సంస్కారయోగ్యత నిషేధింపబడినందు వలనను (శూద్రునకు బ్రహ్మవిద్యాధికారము లేదు.).

తా॥ బ్రహ్మవిద్య నుపదేశించు తావుల నెల్లను ఉపనయనాది సంస్కారములను పరామర్శించి యున్నందునను, శూద్రుని కట్టి సంస్కారయోగ్యత శాస్త్రముచే నిషేధింపఁబడుచున్నందునను శూద్రునికి బ్రహ్మ విద్యాధికారము లేదని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ బ్రహ్మవిద్య నుపదేశించు తావుల నంతటను "ఉపత్వా నేష్యే" (నీకు ఉపనయనము చేయుదును) అనియు, "తంహోవాచోపనిన్యే" (ఉపనయనముచేసి బ్రహ్మవిద్యను తెలిపెను) అనియు నీ మొదలగు వాక్యములయందు ఉపనయనాది సంస్కారములు పరామర్శింపఁబడుచున్నవి. మఱియు "న శూద్రే పాతకం కిఞ్చిత్ న చ సంస్కారమర్హతి" (శూద్రుని యందు పాతకమెద్దియును లేదు. అయితే యతఁడు ఉపనయనాది సంస్కారమునకు యోగ్యుడు కాడు) అనియు, "చతుర్థో వర్ణ ఏకజాతిర్న చ సంస్కారమర్హతి" (శూద్రజాతి యొక్కటి ఉపనయనాది సంస్కారమునకు కర్హము కాదు.) ఈ మొదలగు తావులన్నియు శూద్రునికి ఉపనయనాది సంస్కార యోగ్యత నిషేధింపఁబడుచున్నది.

౩౭॥ సూ॥ తదభావనిర్ధారణే చ ప్రవృత్తేః ॥

టీ॥ తదభావనిర్ధారణేచ = (జాబాలునికి) జాతిశూద్రత్వము లేదని నిశ్చయించిన పిమ్మటనే, ప్రవృత్తేః = గౌతమఋషి యతనికి ఉపనయనాది సంస్కారములఁ జేయ ప్రయత్నించుటవలనను,

తా॥ జాబాలుఁడు శూద్రుఁడు కాఁడని నిశ్చయించిన పిమ్మటనే యతనికి గౌతమఋషి ఉపనయనాది సంస్కారముల నొసఁగుటకు ప్రయత్నించుట వలనను అట్లు తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ "నైతదబ్రాహ్మణో వివక్తుమర్హతి సమిధం సోమ్యాహర" (ఛా. ౪ ప్ర. ౪ ఖ. ౫ వా.) (ఓ సౌమ్యుఁడా ఇట్టి సత్యమును బ్రాహ్మణుఁడు

కానివాఁడు చెప్పనేరఁడు. కావున సమిత్తులఁగొనిరా, అన్నట్లు జాబాలుఁడు శూద్రుఁడుకాడని నిశ్చయించిన పిమ్మటనే గౌతముఁడు వానికి బ్రహ్మవిద్య నుపదేశించుటకై ప్రయత్నించినందునను శూద్రునికి బ్రహ్మవిద్యాధికారము లేదని తెలియుచున్నది.

3౮॥ సూ॥ శ్ర వ ణా ధ్య య నా ర్థ ప్ర తి షే ధా త్.

టీ॥ శ్రవణాధ్యయనార్థ ప్రతిషేధాత్ = వేదశ్రవణమును, తదధ్యయనమును, తదర్థానుష్ఠానమును శూద్రుని విషయమై నిషేధింపబడినందున,

తా॥ వేదశ్రవణమును, తదధ్యయనమును, తదర్థానుష్ఠానమును శూద్రుని విషయమై శాస్త్రమున నిషేధించి యున్నందున శూద్రునికి బ్రహ్మవిద్య యందధికారములేదని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ వేదశ్రవణమును, తదధ్యయనమును, తదర్థానుష్ఠానమును "పద్యుహ వా ఏతచ్ఛ్మశానం యచ్ఛూద్ర స్తస్మాచ్ఛూద్రసమీపే నాధ్యేతవ్యం" (శూద్రుఁడు పాదములుగల శ్మశానమగుటచే వాని సమీపమున వేదాధ్యయనము జేయరాదు) అనియు "తస్మాచ్ఛూద్రో బహుపశురయజ్ఞియః" (అందువలన శూద్రుఁడు పశుసదృశుఁడు అతనిచే యజ్ఞముఁ జేయింపరాదు) అనియు నీ మొదలగు శ్రుతులయందు నిషేధింపఁబడినవి. ఈ పై వాక్యమున "బహుపశుః" అనఁగా పశుసదృశుఁడని యర్థము. ఇట్లు వేదమును వినని వానికి వేదాధ్యయనము గాని, తదర్థజ్ఞానము గాని, తదర్థానుష్ఠానము గాని, సంభవములు కావు. కావున నవియన్నియును ఇందుమూలముగ నిషేధింపఁబడినవియే యని తెలియుఁగునది.

3౯॥ సూ॥ స్మృ తే శ్చ.

టీ॥ స్మృతేశ్చ = అటులనే స్మృతియందుఁ జెప్పియుండుట వలనను,

తా॥ అటులనే స్మృతియందును చెప్పఁబడియె.

శ్రీ॥ భా॥ స్మృతియందును శూద్రునికి వేదశ్రవణాదులు నిషేధింపఁబడుచున్నవి. అది యెట్లనిన, "అథహాస్య వేద ముపశృణ్వతస్త్రపు జతుభ్యాం శ్రోత్రప్రతి పూరణముదాహరణే జిహ్వాచ్ఛేదో, ధారణే శరీరభేదః" (శూద్రుఁడు వేదమును విని నటయిన సీసముతో శ్రోత్రములను నింపుటను, ఉచ్చరించి నటయిన, జిహ్వాచ్ఛేదమును, తదర్థావధారణముఁ జేసెనేని, శరీరఖండనమును చేయునది) అనియు, "నచాస్యో పదిశేద్ధర్మం న చాస్య వ్రతమాదిశేత్" (ఈతనికి ధర్మము నుపదేశింపఁగూడదు. వ్రతమును జేయింపఁగూడదు) అని

యు నిట్లు స్మృతులు తెలుపుచున్నవి. కావున శూద్రునికి బ్రహ్మవిద్య యం దధికారము లేదని సిద్ధమగుచున్నది.

## అద్వైతమతవిమర్శనము.

నిర్విశేషచిన్మాత్రమగు బ్రహ్మమే పరమార్థమనియు, తక్కిన దంతయును మిథ్యయనియు, బంధమనునది వాస్తవముగా నొక్కటి లేదనియు, అది వాక్యశ్రవణము వలనఁ గలుగు వస్తు యాథాత్మ్యజ్ఞాముచే నివర్తించునది యనియు, అది నివర్తించుటయే మోక్షమనియును చెప్పునట్టి యద్వైతుల మతమున శూద్రునికి బ్రహ్మజ్ఞానమునం దధికారము లేదని చెప్పుట యశక్యము. ఏలననఁగా, ఉపనయనము లేక పోయినను, వేదాధ్యయనముఁ జేయక పోయినను, నిర్విశేష చిన్మాత్రమగు బ్రహ్మమే సత్యమనియు, తక్కిన దంతయు నట్టి బ్రహ్మమునఁ గల్పింపఁబడినది గాన, మిథ్యయనియు నిట్టి వస్తుయాథాత్మ్యజ్ఞానము ఏదొక వాక్యమునుండి గలుగవచ్చును. అంతమాత్రముచేతనే సంసారబంధము నివర్తించును గదా! అయితే తత్త్వమస్యాది వాక్యమునుండియే జ్ఞానము గలుగవలయుననియు, వేదోక్త వాక్యమునుండి యది గలుగఁగూడదనియు నిట్టొక నియమముండుటయును అశక్యము. ఏలననఁగా, జ్ఞానమునునది పురుషాధీనమైనది కాదు. జ్ఞానమును గలుగఁజేయునట్టి సామగ్రియున్నట్లయిన, దానిఁ గోరకపోయినను, అది కలుగును గదా! ఇంతియె కాక, వేదవాక్యమునుండియే వస్తుయాథాత్మ్యజ్ఞానము గలిగినయిన, సంసారబంధము నివర్తించుననియును చెప్పనేరము. ఏలననఁగా, ఏదైన నొక హేతువువలన వస్తుయాథాత్మ్య జ్ఞానముగలిగెనేని, బంధము నివర్తించును గదా! నిర్విశేష చిన్మాత్రమగు బ్రహ్మమే పరమార్థమనియు, తక్కిన దంతయును మిథ్యయనియు నిట్టి జ్ఞానము పౌరుషేయవాక్యము నుండియును గలుగవచ్చును. అంతమాత్రముననే భ్రమము నివర్తించును. దృష్టాంతము:—శుక్తికను రజతముగా భ్రమించిన బ్రాహ్మణుని భ్రాంతి యెవ్వఁడగు పురుషుని వాక్యమువలన నివర్తించు చందంబున, శూద్రాదుల భ్రాంతియును నివర్తింపఁగలదు. అట్లే వేదవేత్తల సంప్రదాయము మూలముగాఁ దెలియవచ్చిన వాక్యములనుండి శూద్రునికిని వస్తు యాథాత్మ్య జ్ఞానము గలుగుటచే జగత్తనెడి భ్రమము నివర్తింపఁగలదు. “న చాస్యోపదిశేద్ధర్మం” ఇత్యాది నిషేధశాస్త్రముండుటంజేసి వేదవేత్తలు శూద్రాదులకు ధర్మోపదేశముఁ జేయరని చెప్పఁదగదు. ఏలననఁగా, తత్త్వమస్యాది వాక్యమువలన బ్రహ్మాత్మభావము గలవారు వేదముయొక్క శిరస్సుననుండు వారగుటంజేసి వారి యెడల నధికారనియమము

లెవ్వియును వర్తింపవు గాన, నిషేధశాస్త్రమేమియును చేయనేరదు. ఇట్టి నిషేధముల నన్నింటి నతిక్రమించిన వారి వాక్యము వలననైనను శూద్రాదులకు జ్ఞానము తప్పక కలుగును. శుక్తికాదుల విషయమునఁ గలిగిన రజతాది భ్రమమువలెనే పౌరుషేయవాక్యమువలన తత్త్వజ్ఞానము కలిగిన పిమ్మట శూద్రుని భ్రాంతి నివర్తింపదని చెప్పఁదగదు. అట్లు చెప్పితివేని, తత్త్వమస్యాది వాక్యమును విని పిమ్మట బ్రాహ్మణునికిని జగద్రూపమగు భ్రమము నివర్తింపక పోవుగాక!

ఒకవేళ నిదిధ్యాసనము మూలముగానే ద్వైతవాసన పోగా, తత్త్వమస్యాది వాక్యము భ్రమనివర్తకమగు జ్ఞానమును గలుగఁజేయుచున్నదనియు, కావున నిందువిశేషమెద్దియును లేదనియు, నిదిధ్యాసనమనఁగా, బ్రహ్మాత్మభావమును తెలుపునట్టి వాక్యము ఏయర్థమును ప్రతిపాదించునో, ఆ యర్థము విషయమగు భావనయే యనియు, అట్టి భావనయే ద్వైతవాసనను నివర్తింపఁగలదనియు, నిట్లు నిదిధ్యాసనవిధి దృష్టఫలము నిచ్చునది యనియును చెప్పెదవా? అట్లు చెప్పితివేని, వేదాధ్యయనాదులు గూడ జ్ఞానమునందిచ్ఛను మాత్రము గలుగఁజేయుటయందు ఉపయోగపడునవి గాన, శూద్రునికి అట్టి యిచ్ఛ గలిగిన తరువాత పౌరుషేయ వాక్యమూలకముగ నిదిధ్యాసనాదుల నుండి విపరీత వాసన (ద్వైతవాసన) నశింపఁగా, జ్ఞానము గలుగఁగలదు. అట్టి జ్ఞానమువలన నపారమార్థికమగు బంధము నివర్తింపఁగలదు. అథ వా, నిర్విశేషస్వప్రకాశ చిన్మాత్రమగు ప్రత్యగ్వస్తువునందు అజ్ఞానసాక్షిత్వమున్ను అందుమూలముగ వివిధవిచిత్ర జ్ఞాతృజ్ఞేయ వికల్పరూపమగు సమస్త ప్రపంచమును ఆరోపింపఁబడినవి యని తర్కసహాయము గల ప్రత్యక్షానుమాన ప్రమాణముల మూలముగ నిశ్చయించి, యిట్టి పరిశుద్ధమగు ప్రత్యగ్వస్తువునందు అనవరత భావనచే విపరీతవాసనను పోఁగొట్టుకొని, ఆ ప్రత్యగ్వస్తువునే సాక్షాత్కరించి శూద్రాదులు గూడ మోక్షమును బొందగలరు గాన, మిథ్యాభూతమగు విచిత్రైశ్వర్య విచిత్రసృష్ట్యాద్యలౌకిక కానంత విశేషములఁ దెలుపు వేదవాక్యము వలనఁ బ్రయోజనమెద్దియును గానఁబడదు. కావున శూద్రాదులకే బ్రహ్మవిద్య యందధికారము బహుబాగుగా నుండవచ్చును. ఈలాగుననే బ్రాహ్మణులకును బ్రహ్మజ్ఞానము గలుగవచ్చును గాన, ఉపనిషత్తులకు నీళ్లు వదలవచ్చును.

అయితే స్వాభావికముగ లోకవ్యవహారమున భ్రాంతిమూలముగఁ బ్రవర్తించునట్టి యాత్రనికి ఈ లౌకికవ్యవహారము భ్రాంతి మాత్రమనియు, పరమా

ర్థమిది యనియు నిట్లు ఏదైన నొకదాని మూలముగాఁ దెలిసిన పిమ్మటనే కదా! ప్రత్యక్షానుమానముల ద్వారా దానిఁ దెలిసికొనవలయుననెడి యిచ్ఛయును కలుగఁగలదు. అందువలన నట్టి జ్ఞానమును గలుగఁజేయునది గాను వేదమున్ను ఒక్కటి కలదని యంగీకరించెదమనియెదవా? అట్లు చెప్పఁదగదు. ఏలననఁగా, సంసారము వలన భయపడు వారలకు సాంఖ్యులు మొదలగు వారే ప్రత్యక్షానుమానముల మూలముగ వస్తునిరూపణముఁ జేయుచు ప్రత్యక్షానుమానముల ద్వారా జ్ఞానమునఁ దిచ్ఛను గలుగఁజేయుచున్నారు. అట్టి యిచ్ఛగలిగిన పిమ్మట, ప్రత్యక్షానుమానముల స్వరూపము బాగుగాఁ దెలిసినచో, నందుమూలముగ నిత్యశుద్ధ స్వప్రకాశాద్వితీయకూటస్థచైతన్యమే సత్యమనియు, తక్కిన దంతయును దానిమీఁదు భ్రాంతి మూలముగాఁ గల్పింపఁబడిన దనియును స్పష్టముగాఁ దెలియవచ్చును. ఇట్టి స్వప్రకాశమగు వస్తువునందు శ్రుతుల మూలముగాఁ దెలియఁదగిన వేఱొక్క విశేషమెద్దియయిన కలదనియును మీరు (అద్వైతులు) అంగీకరింపరు. మీమతమున శ్రుతియును ఆరోపితములై స్వరూపవ్యతిరిక్తములగు వానిని నివర్తించునది గదా! సన్మాత్రమగు ఆత్మ ఆనందరూపమనెడి జ్ఞానము గలుగుటకు గాను ఉపనిషత్తనఁబడునది యొకటి కలదని యంగీకరింపవలయు ననియెదవా? అట్లు చెప్పఁదగదు. ఏలననఁగా, తక్కిన రూపములన్నింటి నుండియును విలక్షణమగు చైతన్య స్వరూపమే గదా ఆనంద రూపమనఁబడుచున్నది.

మోక్షసాధనము గాను ఉపనిషత్తులయందు విధింపఁబడిన జ్ఞానము ఉపాసనారూపమనియు, అది భగవంతుని సంతోషపరచుటయే యనియు, అది శాస్త్రమునుండి మాత్రమే తెలియఁదగినదనియు, అట్టి యుపాసనమును విధించునట్టి శాస్త్రము ఉపనయనాది సంస్కారపూర్వకముగా వేదాధ్యయనముఁ జేయుటచేఁ గలిగిన జ్ఞానమును వివేక విమోకాది సాధనవిశిష్టమైన దానినే యట్టి యుపాసనముఁ గలుగఁజేయునట్టి యుపాయమునుగా నంగీకరించుచున్నదనియు, ఉపాసనము మూలముగ ప్రీతి గలిగిన పురుషోత్తముండు ఉపాసకునికి స్వాభావికాత్మ యాథాత్మ్యజ్ఞానము నిచ్చి, కర్మము వలనఁ గలిగిన యవిద్యను నశింపఁజేసి, సంసారబంధమునుండి విముక్తిఁ గలుగఁజేయుచున్నాఁడనియును చెప్పు వారి పక్షమున (విశిష్టాద్వైతుల మతమున,) ఈ పైని గాన్పించిన ప్రకారము, శూద్రులకు బ్రహ్మ విద్య యందధికారము లేదనుట సంభవము.

అపశూద్రాధికరణము ముగిసెను.

## ప్ర మి తా ధి క ర ణ శే ష ము.

అవతారిక:—ఇట్లు ప్రసక్తానుప్రసక్తముగ వచ్చిన అధికార విషయములను గూర్చిన విచారమును ముగించి, ప్రకృతమున్న అంగుష్ఠమాత్ర పరిమితుఁడుగాఁ జెప్పఁబడిన వాఁడు భూతభవ్యములను నియమించువాఁడుగాఁ దెలియుటవలన నతఁడు పరబ్రహ్మమని తెలుపునట్టి వేఱొక్క హేతువును గాన్పించుచున్నారు.

## ౪౦॥ సూ॥ క మ్ప నా త్.

టీ॥ కమ్పనాత్ = ఈతని భయమువలన సర్వమును చలించుచున్నట్లు శ్రుతియందుఁ జెప్పియున్నందున, ఈతడు పరమాత్మ.

తా॥ ఈతని భయమువలన సర్వము చలించుచున్నట్లు శ్రుతియందుఁ జెప్పియున్నందున ఈతఁడు పరమాత్మ.

శ్రీ॥ భా॥ "అఙ్గుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి" (కఠ. ౨. అ. ౪ వ. ౧౨ వా.) అనువాక్యమునకును "అఙ్గుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా" (కఠ. ౨ అ. ౬ వ. ౧౭ వా.) అనువాక్యమునకును మధ్యను "యదిదం కిఞ్చ జగత్సర్వం ప్రాణ ఏజతి నిస్సృతం మహద్భయం వజ్రముద్యతం య ఏతద్విదురమృతాస్తే భవన్తి భయా దస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః భయాదిన్ద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః" (ఉన్నతమగు నీప్రపంచమంతయుఁ బ్రేరింపఁబడినదై, స్వవ్యాపారమును జేయుచున్నది ఎత్తఁబడిన వజ్రాయుధము వలెనే మహత్తైన యీ ప్రాణము భయావహమైయున్నది. దీని నుపాసించువారు మోక్షమును బొందుచున్నారు. ఈతని భయమువలననే యగ్ని దహింపుచున్నది. సూర్యుఁడు ఔష్ణ్యమును గలుగఁ జేయుచున్నాఁడు. ఈతని భయమువలననే ఇంద్రుఁడును వాయువును అయిదవది యగు మృత్యు దేవతయును వారి వారి కార్యములఁ జేయుచున్నారు) అనువాక్యమున్న, ఈ సమస్తప్రపంచమును అగ్నిసూర్యాదులును అంగుష్ఠమాత్రపరిమాణుఁడును ప్రాణమని పిలువఁబడు పురుషుని యాధారమునసుండు వారనియు, వానిలోనుండి వచ్చుచున్నారనియు, వానికి మిక్కిలి భయపడుచున్నారనియును నిట్లొక విధమైన చలనము (వణకు) చెప్పబడినది. అనఁగా వాని యాజ్ఞనతిక్రమించిన యెడల యేమగునో యని వజ్రాయుధమును పైకెత్తుట వలననను వలెనే యీ సమస్తప్రపంచమును వణకుచున్నదని యర్థము. ఈపై శ్రుతి

“భయాదస్యాగ్నిస్తపతి” అనువాక్యముతో నేకార్థమైనందున ఇందుండు “వజ్రమ్” అనుశబ్దమునందు ప్రథమావిభక్తిని పఞ్చమ్యర్థముగఁ గొను నది. అనఁగా వజ్రమను దానికి వజ్రాయుధమునుండి యని యర్థము చెప్పఁగో నునది. ఇట్లు సమస్తప్రపంచమును భయపడునట్లు చేయుట పరబ్రహ్మము యొక్క స్వభావము. ఏలననఁగా, “ఏతస్య వాక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యా చంద్రమసౌ విధృతౌ తిష్ఠతః” (ఓగార్గి యీ యక్షరమనఁబడు పరబ్రహ్మము యొక్క యాజ్ఞవలన సూర్యచంద్రులు తమ తమ స్థానములను విడువకయు న్నారు) అనియు, “భీషాస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ మృత్యుర్ధావతి పఞ్చమః” (ఈపర బ్రహ్మముయొక్క భయమువలన వాయువు వీచుచున్నది. సూర్యుఁడు ఉదయిం చుచున్నాఁడు. ఈతని భయమువలననే అగ్నియును ఇంద్రుఁడును, అయిద వదియగు మృత్యుదేవతయును తమ తమ కార్యములయందుఁ బ్రవర్తించుచు న్నారు) అనువాక్యమువలన పరబ్రహ్మమగు పురుషోత్తమునికే యిట్టి యైశ్వ ర్యమున్నట్లు తెలియుచున్నది. ఈపైని గానఁబడుచిన హేతువులవలనను అఙ్గు ష్ఠమాత్రపరిమితుఁడు గాను శ్రుతులలోఁ జెప్పఁబడిన వాఁడు పరబ్రహ్మమని సిద్ధమగుచున్నది.

అవతారిక:—ఈక్రింది గొన్పింపఁబడు హేతువులవలనను అంగుష్ఠ మాత్ర పరిమితుఁడుగాఁ జెప్పఁబడినవాఁడు పరబ్రహ్మము.

౪౧॥ సూ॥ జ్యోతిర్దర్శనాత్.

టీ॥ జ్యోతిః = జ్యోతిస్సుగా, దర్శనాత్ = శ్రుతియందుఁ జెప్పబడినం దునను,

తా॥ ఈ యంగుష్ఠమాత్రపరిమితుఁడు జ్యోతిస్సుగాను శ్రుతియందుఁ జెప్పఁబడినందునను ఈతఁడు పరబ్రహ్మమని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఆ యంగుష్ఠమాత్రపరిమితుని గుఱించినవి గాను ఈపైని యుద హరింపఁబడిన రెండు వాక్యముల మధ్యనుండు “న తత్ర సూర్యోభాతి న చ న్ద్రతారకం నేమా విద్యుతో భాన్తి కుతోయ మగ్నిః। త మేవ భాన్తమనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి” అనువాక్యమున వానియందు సూ ర్యుఁడు ప్రకాశింపడు. చంద్రతారకములు ప్రకాశింపవు. ఈ విద్యుత్తులును ప్రకాశింపవు. ఇఁక అగ్ని విషయమై చెప్పవలసిన దేమున్నది? ప్రకాశించు నట్టి వానిని యనుసరించి యంతయును ప్రకాశింపుచున్నది.” అని చెప్పియుం

డుటచే సర్వతేజస్సులను గప్పివేయునదియు, సర్వతేజస్సులకును కారణభూతమై వాటి కుపోద్బలకమైనదియు, పరబ్రహ్మమునకు మాత్రమే యుండునదియు నగు తేజస్సు ఈ యంగుష్ఠమాత్రపరిమితునికి యున్నటుల దెలియుచున్నది. ఈ పైని యుదహరింపఁబడినశ్లోకమును ఆథర్వణికులు పరబ్రహ్మమునుగుఱించి పఠిం చుచున్నారు. మఱియు ఉపనిషత్తుల యందంతటను "పరంజ్యోతి రుపసమ్ప ద్యస్వేన రూపేణాభి నిష్పద్యతే,, (ఛా. ౮. ప్ర. ౧౨. ఖ. ౨. వా.) అనియు, "తం దేవా జ్యోతిషాం జ్యోతి రాయుర్హోపాసతేఽమృతం,, (బృ. ౬. అ. ౪. బ్రా. ౧౬) అనియు, "అథ యదతః పరోదివో జ్యోతిర్దీప్యతే,, (ఛా. 3. ప్ర. ౧3. ఖ. ౭. వా.) అనియు నీమొదలగు వాక్యములయందు పరబ్రహ్మమే పరజ్యో తిస్సుగాను పేర్కొనఁబడుచున్నది. కావున ప్రకృతమున అంగుష్ఠమాత్ర పరి మితుఁడుగాఁ జెప్పఁబడినవాఁడు పరబ్రహ్మమని సిద్ధమగుచున్నది.

ప్రమితాధికరణశేషము ముగిసెను.

---

## అర్థాన్తరత్వాదివ్యపదేశాధికరణము.

### ౪౨॥ సూ॥ ఆకాశోఽర్థాన్తరత్వాదివ్యపదేశాత్.

టీ॥ ఆకాశః= ఆకాశశబ్దవాచ్యము పరబ్రహ్మము, ఏలననఁగా, అర్థాం తరత్వాదివ్యపదేశాత్ = ప్రత్యగాత్మకంటెను విలక్షణమైనదిగాను చెప్పఁ బడుటవలన.

తా॥ ప్రత్యగాత్మకంటెను విలక్షణమైనదిగాను చెప్పఁబడినందున ఆకాశ శబ్దవాచ్యము పరబ్రహ్మము.

శ్రీ॥ భా॥ ఛందోగులు "ఆకాశోహవై నామరూపయో ర్నిర్వహి తా తే యదన్తరా తద్బ్రహ్మ తదమృతం స ఆత్మా" (ఛా. ౮. ప్ర. ౧౪. ఖ. ౧. వా.) (నామరూపములను నేర్పరచునదిగా నీలోపలనుండు ఆకాశము అమృ తము అది యాత్మ)" అని పఠించుచున్నారు. ఇందొక సంశయముగలుగు చున్నది.

సంశయము.

ఈతావున నాకాశ మనఁబడునది ముక్తాత్మా? లేక, పరమాత్మా?

పూర్వపక్షము.

అది ముక్తాత్మ యని చెప్పఁదగును. ఏలననఁగా, "అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చన్ద్ర ఇవ రాహోర్ముఖాత్ ప్రముచ్య ధూత్వా శరీరమకృతం

కృతాత్మా బ్రహ్మలోక మభిసమ్భవామీతి" (ఛా. ౮. ప్ర. ౧౩. ఖ, ౧. వా.) (అశ్వము రోమములను విదలించినట్లు పాపమును బోఁగొట్టుకొని, చంద్రుఁడు రాహుముఖమునుండి బయలువెడలినట్లు శరీరములోనుండి బయలువెడలి కృతార్థుండనై నిత్యమగు బ్రహ్మలోకమును బొందుచున్నాను) అనుపై వాక్యమున ముక్తాత్మను గుఱించియే గదా చెప్పఁబడుచున్నది. ఏలనఁగా, నామరూపములు పోయినట్టి యా ముక్తాత్మయే గదా "తేయదన్తరా". (ఏది నీలోపలనున్నదో) అనుటచేఁ జెప్పఁబడుచున్నాఁడు "నామరూపయోర్నిర్వహితా" (నామరూపములను నిర్వహించియుండువాఁడు) అను వాక్యమునను పూర్వావస్థలో నుండునట్టి యాతఁడే గుర్తింపఁ జేయఁబడినాడు. ఈ ముక్తాత్మయే గదా పూర్వము అనఁగా బద్ధావస్థయందు దేవాది నామరూపములను ధరించియుండినవాఁడు. వానిదే గదా ప్రస్తుతము ముక్తావస్థయందు నామరూపములులేని యవస్థ "తద్బ్రహ్మ తదమృతం" (అది బ్రహ్మము అది యమృతము) అని చెప్పఁబడుచున్నది. అది సంకోచము నెంతమాత్రము పొందని ప్రకాశము గలదియగుటచే దాని నాకాశము (అంతటను ప్రకాశించునది) అనియును చెప్పఁదగును. అయితే యీవాక్యము దహర విద్యను ప్రతిపాదించు వాక్యములతో సంబంధించినది యైనందున నిచట నాకాశ మనఁబడునదియును దహరాకాశమే యనియెదవేమో, అటుల చెప్పఁదగదు. ఏలననిన, ఆవాక్యమునకును ప్రకృతవాక్యమునకును మధ్యను ప్రజాపతి వాక్యము గలదు. ఆ ప్రజాపతివాక్యమున జీవుఁడు ముక్తుఁడగువరకు నతని స్వరూపమును తెలిపి, అనంతరము "విధూయ పాపం" అను వాక్యము చెప్పఁబడియె. కావున ముక్తావస్థలోనుండు ఆత్మయే ఇచట చెప్పఁబడినట్లు ప్రకరణ సందర్భమునుబట్టి తెలియవచ్చుచున్నది. కావున నిచట ఆకాశమనఁగా ముక్తాత్మయని తెలియుచున్నది.

—సిద్ధాంతము.—

ఈతావున ఆకాశమని చెప్పఁబడునది పరబ్రహ్మము. ఏలనఁగా "ఆకాశోహవై నామరూపయోర్నిర్వహితా" (ఆకాశము పదార్థములనామరూపములను ఏర్పరచునది) అనువాక్యమునఁ జెప్పఁబడిన నామరూప నిర్వాహకత్వ మనఁబడునది యీతావున నాకాశ మనఁబడునది బద్ధుండుగాని ముక్తుఁడుగానీ యగు నాత్మకంటెను విలక్షణమైనదని నిరూపించుచున్నది. ఏలనఁగా, బద్ధావస్థలో నుండునట్టి యాత్మ తానుస్వయముగ నామరూపములను బొందునట్టివాఁడు గాన, నతఁడు నామరూపములను నిర్వహించువాఁడు కాఁదగఁడు.

ముక్తపురుషునికి జగన్నిర్మాణసామర్థ్యము లేదుగాన, నతఁడును ఎంతమాత్ర
ము నామరూపములను నిర్వహింపనేరడు. సర్వేశ్వరుఁడన్ననో, సకల జగన్ని
ర్మాణ ధురంధరుఁడు గాన, నతఁడునామరూపములను నిర్వహించువాఁడనెడియం
శము శ్రుతులనుండి నిరూపితమగుచున్నది. అది యెట్లనిన, «అనేన జీవేనా
త్మనాఽను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి" (ఛా.౬.ప్ర.౩౮.ఖ.౨.వా.)(జీవ
శరీరుఁడుగాఁ బ్రవేశించి యాయాపదార్థముల నామరూపములను విశదపరను
చున్నాను) అనియు, «యస్సర్వజ్ఞస్సర్వవిత్ యస్యజ్ఞానమయం తపః తస్మాదే
తద్బ్రహ్మనామ రూపమన్నంచజాయతే" (ముం.౧.ప్ర.౧.ఖ.౯.వా.) (ఏవఁడు
సర్వమును సామాన్యముగాను విశేషముగానును తెలిసికొనినవాఁడో ఎవనివలన
నామమును, రూపమును, పృథివియును గలుగుచున్నవో) అనియు «సర్వాణి
రూపాణి విచింత్య ధీరో నామాని కృత్వాభివదన్యదాస్తే" (పురుష)
(సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరుఁడు సమస్తరూపములను పరిశీలించి వానికిఁదగిన
పేర్లనుపెట్టి పిలుచుచున్నాడు) అనియు నీమొదలగు వాక్యము లట్లు తెలుపు
చున్నవి. కావున నిర్వహింపఁబడిన నామరూపములను బొందియుండు జీవుని
కంటెను అట్టి నామరూపములను నిర్వహించునట్టి యాకాశమనఁబడునది వేఱ
యినదియగు పరబ్రహ్మమే. ఈ విషయమునే «యదన్తరా—నది ఈ నామ
రూపములకంటె వేఱయినదియో" అనువాక్యము ఉపపాదించుచున్నది. అనఁ
గా, ఏకారణమువలన ఈ యాకాశము నామరూపములతో సంబంధించియుం
డని వేఱొక్కటియో, అందువలన నది యీనామరూపములను నిర్వహించు
నది, అనఁగా, నపహతపాప్మమును, సత్యసంకల్పమునైనందున, నిర్వహిం
చునదియని యర్థము. సూత్రమునందుండు«అది"శబ్దముచే బృహత్త్వము అ
మృతత్వము మొదలగునవి వివక్షింపఁబడుచున్నవి. నిరుపాధికమగు బృహత్త్వ
ము మొదలగునవి పరమాత్మకే సంభవములు. కావున నీతావున నాకాశ
మనఁబడునది పరమాత్మయే.

«ధూత్వాశరీరం" అను అనంతరవాక్యమున ముక్తాత్మయే చెప్పఁబడు
చున్నాఁడని పూర్వపక్షి చెప్పినది సరికాదు. ఏలననఁగా, «బ్రహ్మలోక మన
సంభవాని" అను అనంతరవాక్యమున పరబ్రహ్మమే చెప్పఁబడినట్లు ప్రకరణ
మునుబట్టి తెలియుచున్నది. ఒకవేళ, యీవాక్యమున పొందువాఁడగు ముక్తా
త్మచే పొందఁబడునదిగాను పరబ్రహ్మము నిర్దేశింపఁబడినను, పొం
దునట్టివాఁడుగాఁ జెప్పఁబడిన ముక్తాత్మ నామరూపములను నిర్వహించుట
యసంభవ మగుటంజేసి, యీతావున బొందఁబడునదియగు పరబ్రహ్మమే చె

ప్పఁబడినదని తెలియుచున్నది. కావున నాకాశశబ్దముచే ప్రకృతమగు దహరాకాశమే గుర్తింపఁబడుటవలనను, ప్రజాపతి వాక్యమున్ను ఉపాసకుని స్వరూపమును దెలుపుటకై ప్రవర్తించిన దైనందునను ఈ తావున నాయుపాస్యమగు దహరాకాశమునే ప్రాప్యమునుగా నుపసంహరించు కొనునది. ఆకాశశబ్దము న్ను ప్రత్యగాత్మను తెలుపునది గాను ప్రయోగింపఁబడి నట్లెచటను కానఁబడదు. కావున నీతావున ఆకాశమనఁబడునది పరబ్రహ్మమే.

అవతారిక:—శ్రుతులయం దైక్యము చెప్పఁబడినందునను, ద్వైతజ్ఞానము నిషేధింపఁబడి నందునను ప్రత్యగాత్మకంటెను వేఱుగానాత్మయే వే ఱొక్కటి లేదు. పరిశుద్ధావస్థలోనుండు ప్రత్యగాత్మయే పరమాత్మయనియు, పరబ్రహ్మమనియు, పరమేశ్వరుఁడనియును వ్యవహరింపఁబడుచున్నాఁడు. కావున పొందువాఁడుగాను ప్రకృతమునఁ జెప్పఁబడిన ముక్తాత్మకంటె వేఱయినదియు, పొందబడునదిగాను చెప్పఁబడునది బ్రహ్మలోకము. కావున ప్రకృతమున నామరూపములను నిర్వహించునదిగాను చెప్పఁబడునట్టి యాకాశమున్ను అదియే కాఁగలదు. ఇట్లు ఆక్షేపము రాఁగా, నందులకు సమాధానము చెప్పుటకై

౪౩॥ సూ॥ సుషుప్త్యుత్క్రాన్త్యోర్భేదేన॥

టీ॥ సుషుప్త్యుత్క్రాన్త్యోః=జాగ్రత్సుషుప్త్యవస్థలయందు, భేదేన=ప్రత్యగాత్మకంటెను పరమాత్మను వేఱయిన వస్తువునుగా, వ్యపదేశాత్ =చెప్పియున్నందున.

తా॥ జాగ్రత్సుషుప్త్యవస్థలనుబట్టి ప్రత్యగాత్మకంటెను పరమాత్మను వేఱయిన వస్తువునుగాఁ జెప్పియున్నందున ప్రత్యగాత్మకంటెను వేఱుగ పరమాత్మ గలడు.

శ్రీ॥ భా॥ పూర్వసూత్రమునుండి "వ్యపదేశాత్" అను పదమును ఈ సూత్రమునఁ గొనితెచ్చుకొనునది. సుషుప్తియందును జాగ్రత్తునందును ప్రత్యగాత్మకంటెను వేఱుగ పరమాత్మగలండని చెప్పియున్నందున ప్రత్యగాత్మకంటెను వేఱుగ పరమాత్మయుండే యున్నాఁడు. అదియెట్లనిన, వాజసనేయులు "కతమ ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు" (బృ. ఉ. అ. ౩. బ్రా. ౭. వా.) (ఎవఁడు ఆత్మ? ప్రాణములయందు విజ్ఞానస్వరూపుఁడుగా నుండువాఁడు ఆత్మ) అను వాక్యమున ప్రకృతమగు ప్రత్యగాత్మను గుఱించి చెప్ప నారంభించి "ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో నబాహ్యం కిఞ్చనవేద" (బాహ్యవస్తువులఁ దెలిసికొనక సర్వజ్ఞుఁడగు సర్వేశ్వరునితోఁ గలిసియున్నాఁడు) అనువాక్యము

న నతఁడు సుషుప్త్యవస్థయందు దేనిఁదెలిసికొనక పరమాత్మతోఁ గలిసియు న్నాఁడని తెలుపుచున్నారు. అట్లే నిద్రనుండి మేల్కాను సమయమునందు, "ప్రాజ్ఞేనాత్మ నాన్వారూఢ ఉత్సర్జన్యాతి" (బృ. ౬. అ. ౩. బ్రా. ౩౫. వా.) (సర్వజ్ఞుఁడగు పరమాత్మయందుండి వానినుండి బయలు వెడలుచున్నాఁడు) అని చెప్పియున్నారు. సుషుప్తియందుండు నపుడుగాని, మేల్కానునపుడు గాని, కించిద్జ్ఞుఁడగు నీ జీవాత్మకు అదేకాలమున సర్వజ్ఞుఁడగు తనతోనే గలిసియుం డుట గాని, తనపైయుండుట గాని సంభవింపవు. వేఱొక్క జీవునితో ననియును చెప్పఁదగదు. అతఁడును సర్వజ్ఞుఁడగుట యసంభవము గదా!

## ౪౩॥ సూ॥ ప త్యా ది శ బ్దే భ్యః.

టీ॥ పత్యాదిశబ్దేభ్యః = శ్రుతియందు పతి మొదలగు శబ్దములుండుట వలనను, ఈ ప్రకరణమున ఆకాశమనఁబడువాఁడు పరమాత్మ.

తా॥ ఇట్లు కలుసుకొనఁబడువాఁడు శ్రుతియందు "పతి" మొదలగు శబ్దములచే నిర్దేశింపఁబడినందునను అతఁడు పరబ్రహ్మమని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఇట్లు కలుసుకొనఁబడు పరమాత్మ శ్రుతియందు తత్రతత్ర "సర్వస్యాధిపతి స్సర్వస్యవశీ సర్వస్యేశానః" (బృ. ౭ అ. ౪ బ్రా. ౨౨ వా.) (సర్వమున కధిపతియు, సర్వమును తన వశమున నుంచుకొనినవాఁడును, సర్వమును నియమించువాఁడును) అనియు, "స న సాధునా కర్మణా భూయాన్నో ఏవాసాధునా కనీయాన్" (బృ. ౬. అ. ౪. బ్రా. ౨౪వా.) (ఈతఁడు మంచికర్మ ముచే గొప్పవాఁడు గాను గాని, చెడుకర్మముచే క్రొద్దవాఁడుగాను గాని కాడు) అనియు "ఏషసర్వేశ్వర ఏషభూతాధిపతి రేషభూతపాల ఏష సేతుర్విధరణ ఏషాం లోకానా మసంభేదాయ" (బృ. ౬ అ. ౪ బ్రా. ౨౫ వా.) (ఈతఁడు సర్వేశ్వరుఁడు, ఈతఁడు భూతాధిపతి, భూతపాలకుఁడు, ఈతఁడు ఈలోకముల నన్నింటిని చెదరిపోకుండ ధరించియుండువాఁడు) అనియు, "తమేతం వేదాను వచనేన బ్రాహ్మణా వివిదిషన్తి ఏతమేవ విదిత్వా మునిర్భవతి। ఏతమేవ ప్రవ్రా జినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి సవా ఏషమహానజ ఆత్మాఽన్నాదో వసుదానోఽ జరోఽమృతోఽభయోబ్రహ్మ" (బృ. ౬ అ. ౪ బ్రా. ౨౨ వా.) (ఈతనిని బ్రాహ్మణులు వేదాధ్యయనము మూలముగాఁ దెలియఁగోరుచున్నారు. ఈత నిని ఉపాసించి మునియగుచున్నాఁడు. ఈతనిఁ బొందగోరియే సన్యాసులు సన్యసించుచున్నారు. ఈ యాత్మ గొప్పవాఁడు, కర్మవశమున పుట్టనివాఁడు అన్నమునిచ్చువాఁడు, ధనమునిచ్చువాఁడు, ముసలితనము లేనివాఁడు, మర

ణము లేనివాఁడు, సంసారభయము లేనివాఁడు, (బ్రహ్మము) అనియు నీమొదలగు వాక్యములయందు పతి మొదలగు శబ్దములచేఁ జెప్పఁబడుచున్నాడు. ఈ పై వాక్యములయందుఁ జెప్పఁబడిన పతిత్వము, జగదాధారత్వము, సర్వేశ్వరత్వము మొదలగునవి ముక్తావస్థలో నుండువాఁడైనను ప్రత్యగాత్మయందుండఁజాలవు. కావున నామరూపములను నిర్వహించునదిగాను, శ్రుతియందుఁ జెప్పఁబడినట్టి యాకాశము ముక్తాత్మకంటెను వేఱయినది. ఐక్యము చెప్పియుండుట యనునది చిదచిదాత్మకమగు నిదియంతయు బ్రహ్మకార్యమగుటచే బ్రహ్మాత్మకమగుటనుబట్టి యుండునది గాను « సర్వంఖల్విదంబ్రహ్మ ” ఇత్యాది వాక్యములు ఉపపాదించుచున్నవని యింతకుపూర్వమే సమర్థించియున్నాము. ద్వైతమును నిషేధించియుండుటయును ఆ హేతువువలననే కాన,దోషము లేదు.

గద్య॥ ఇది శ్రీకృష్ణానద్యుత్తర వాహినీతీరస్థ బన్దవిరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య,శ్రీమదలర్మేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర,శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తి హరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళరామానుజయతివరపరమానుగ్రహసమధిగత!సకలవిశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయ గ్రంథతత్వార్థ, వాధూలకులతిలక వేఙ్కటాచార్య రంగమాంబాతనూజ, కావ్యరత్న వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేకబిరుదాలంకృత, గీర్వాణాంగ్ల ద్రవిడాంధ్ర శుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్ర శ్రీభాష్యమునందు ప్రథమాధ్యాయమున తృతీయపాదము



    

శ్రీమతేరామానుజాయనమః.

# శ్రీమదాంధ్రశ్రీభాష్యము.

## ప్రథమాధ్యాయము—చతుర్థపాదము.

### ఆనుమానికాధికరణము.

౧॥ సూ॥ ఆనుమానిక మప్యేకేషా మితిచేన్న శరీరరూపక విన్యస్తగృహీ తే ర్దర్శయతిచ

టీ॥ ఆనుమానికమపి=ప్రధానముగూడ, కొందఱి (కాఠకుల) శాఖయందు, ఇతిచేత్=ప్రతిపాదింపఁ బడినదంటివేని, న=అది సరికాదు. ఏలననఁగా, శరీరరూపక విన్యస్తగృహీతేః=(పూర్వవాక్యమునందు) రథరూపముగా వర్ణింపఁబడిన శరీరమునే యిచట, అవ్యక్తపదము బోధించుటవలన, దర్శయతిచ = అటులనే శ్రుతియును గాన్పించుచున్నది.

తా॥ సాంఖ్యస్మృతి ప్రసిద్ధమగు ప్రధానముగూడ కాఠకుల శాఖయందుఁ బ్రతిపాదింపఁబడు చున్నదంటివేని, యది సరికాదు. ఏలననఁగా, అచట (పూర్వవాక్యమున) రథరూపముగా వర్ణింపఁబడిన శరీరమే యవ్యక్తపదముచే బోధింపఁ బడుచున్నది. అటులనే కదా శ్రుతియును తెలుపుచున్నది.

శ్రీ॥ భా॥ పరమపురుషార్థమగు మోక్షము లభించుటకు సాధనముగాను విచారింపవలసినదియు, జగజ్జన్మ స్థితిసంహారములకుఁ గారణభూతమగు బ్రహ్మము అచిద్వస్తువగు ప్రధానాది పదార్థముకంటెను బద్ధావస్థయందుఁగాని, ముక్తావస్థయందుఁ గాని యుండు చేతనపదార్థముకంటెనున్న విలక్షణమైనదనియు, హేయగుణము లేమాత్రము లేనిదనియు, సర్వజ్ఞమనియు, సత్యసంకల్పమనియు, సమస్త కల్యాణ గుణాత్మకమనియు, సర్వాన్తరాత్మ భూతమనియు, నిరంతరైశ్వర్యమనియును జెప్పఁబడియె. ప్రకృతమున సాంఖ్యస్మృతి ప్రసిద్ధమును, బ్రహ్మాత్మకము కానిదియునగు ప్రకృతిని, పురుషుని మొదలగువానిఁ బ్రతిపాదించుచు నందుమూలముగ ప్రకృతినే జగత్కారణమునుగాఁ బ్రతిపాదించునవి

గాను తోచబడునట్టి కొన్ని శ్రుతులు కొన్ని శాఖలయందుఁ గానఁబడుచున్న వని శంకించి, బ్రహ్మమే జగత్కారణమనెడి యంశమును స్థిరపఱచుటకుగాను ఆశంకను నిరాకరించుచున్నారు. అదియెట్లనిన,

కాఠకులు "ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః। మనసస్తు పరా బుద్ధిః ర్బుద్ధేరాత్మా మహాన్పరః। మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషఃపరః పురుషాన్న పరం కిఞ్చి త్సాకాష్ఠా సాపరాగతిః" (కఠ. ౧.అ. ౩. వ. ౧౦. వా) అనువాక్యమున పదార్థములు ఇంద్రియములకంటె ప్రధానములు అనఁగా వాటినుండి పరీకరింపవలసినవి. పదార్థములకంటె మనస్సు ప్రధానము. మనస్సుకంటె బుద్ధిప్రధానము. బుద్ధికంటె ఆత్మ ప్రధానము. ఆత్మ కంటె అవ్యక్తముప్రధానము. అవ్యక్తముకంటె పురుషుండు ప్రధానుడు. పురుషుఁడే కడపటివాఁడు అతఁడే యాధారభూతుఁడు) అని తెలిపియున్నారు. ఈ తావున నొక సంశయము గలుగుచున్నది.

## సంశయము.

ఈ పైవాక్యమునందు "అవ్యక్తం" అనుశబ్దము సాంఖ్యస్మృతిప్రసిద్ధమును, బ్రహ్మాత్మకము కానిదియునగు ప్రకృతిని తెలుపునదియా? కాక, ఆ శబ్దము దానిఁ దెలుపునది కాదా!

## పూర్వపక్షము.

ఈ తావున "అవ్యక్త" శబ్దము ప్రకృతిని తెలుపునది. ఏలననఁగా, "మహతః పరమవ్యక్త మవ్యక్తాత్పురుషఃపరః" అను వాక్యమున "మహత్తు, అవ్యక్తము, పురుషుఁడు అని యిట్లు సాంఖ్యస్మృతి ప్రసిద్ధమగు తత్త్వప్రక్రియ పేర్కొనఁబడినట్లు గుర్తింపఁబడుచున్నందున నిచట అట్టి ప్రకృతియే చెప్పఁబడినట్లు తెలియవచ్చుచున్నది. ఇంతియెకాక, "పురుషాన్న పరంకిఞ్చిత్సా కాష్ఠా సా పరాగతిః" అను తావున ఇరువదియయిదు తత్త్వములకుపైగా తత్త్వమొద్దియును లేదని చెప్పియున్నందునను అట్లు తెలియుచున్నది. అందువలననట్టి యవ్యక్తమే జగత్కారణముగాఁ దెలియుచున్నది. కావున కొన్ని శాఖలయందు అనుమాన ప్రమాణసిద్ధమగు ప్రకృతియును జగత్కారణముగాఁ జెప్పఁబడినట్లు తెలియుచున్నదని పూర్వపక్షమురాఁగా,

## సిద్ధాంతము.

ఈతావున "అవ్యక్త" శబ్దముచే అబ్రహ్మాత్మకమగు ప్రకృతి తెలుపఁబడుచుండలేదు. ఏలననఁగా, శరీరముగాఁ గొనవలసినది యిచట అవ్యక్తశబ్ద

ముచే గ్రహింపఁబడుచున్నది. అనఁగా ఆత్మ, శరీరము, బుద్ధి, మనస్సు, ఇంద్రియములును నివి రథస్వామిగాను రథముగాను నివ్విధముగ వర్ణింపఁబడు సందర్భమున రథముగాను చెప్పఁబడిన శరీరమును అవ్యక్తశబ్దము తెలుపుచున్నదనుట. అదియెట్లనిన, ఇంతకు పూర్వము "ఆత్మానం రథినంవిద్ధి శరీరం రథమేవచ। బుద్ధింతు సారథింవిద్ధి మనఃప్రగ్రహ మేవచ। ఇంద్రియాణి హయానాహు ర్విషయాంస్తేషుగోచరాన్" (కఠ. ౧. అ. ३. వ. 3. వా.) (ఆత్మను రథస్వామినిగాను, శరీరమును రథమునుగాను, బుద్ధిని సారథినిగాను, మనస్సును కళ్లెమునుగాను, ఇంద్రియములను గుఱ్ఱములనుగాను, విషయముల నట్టిగుఱ్ఱములు పోవు తావులనుగాను నెఱుంగునది) అను వాక్యము మొదలుకొని "సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం" (కఠ.౧.అ.3. వ.౯.వా) (అట్టివాఁడు విష్ణుసంబంధమగు పరమపదమును బొందుచున్నాఁడు) అనువరకును కఠోపనిషత్తునందు మోక్షమార్గముయొక్క యంతమగు విష్ణుపదమును బొందఁగోరునట్టి యుపాసకుని రథస్వామినిగాను, వాని శరీరము మొదలగు వానిని రథరథావయవములనుగానును, నిరూపించి యారథాదులను ఎవఁడు తనవశమునఁ బెట్టుకొని యుండునో, అతఁడే యట్టి విష్ణుపదమును బొందుచున్నాడని చెప్పి, రథాదులుగా వర్ణింపఁబడినట్టి వానిలో నేవి యేవిని వశీకరించు విషయమునఁ బ్రధానములో, నవి "ఇంద్రియేభ్యఃపరా" ఇత్యాది వాక్యమునఁ జెప్పఁబడుచున్నవి. ఆతావున నశ్వములుగా వర్ణింపఁబడినట్టి యింద్రియములకంటెను వానికి విషయములుగా వర్ణింపఁబడిన శబ్దాదివిషయములు వశీకరణ విషయమున నుత్కృష్టములు. ఏలననఁగా, జితేంద్రియుండైనను, విషయసన్నిధానమున వానినాపిపెట్టుట దుష్కరముగదా! అట్టివిషయములకంటెను కళ్లెముగా వర్ణింపఁబడిన మనస్సు ప్రధానము. ఏలననఁగా, మనస్సు విషయానాసక్తిగలదగునేని, విషయములు సమీపమందున్నను, లేకపోయినను, లోపము లేదుగదా! అట్టి మనస్సుకంటెను సారథిగా వర్ణింపఁబడినట్టి బుద్ధి ప్రధానమైనది. ఏలననఁగా, [1]నిశ్చయము లేనియెడల కేవల మనస్సువలనఁ బ్రయోజన మేద్దియు నుండదు. అట్టి బుద్ధికంటెనున్న రథస్వామిగా వర్ణింపఁబడినట్టి యాత్మ కర్తయగుటంజేసి ప్రధానుఁడు. ఏలననఁగా సర్వమున్ను ఆత్మయొక్క సంకల్పమున కధీనమైనందున నాత్మయొక్కటియే "మహాన్" (గొప్పది) అనియిట్లు విశేషింపఁబడుచున్నది. అట్టియాత్మకంటెను రథముగా వర్ణింపఁబడినట్టి శరీరము ప్రధానము. ఏలననఁగా జీవాత్మయొక్క పురుషార్థ సాధనములగు నన్ని ప్రయత్నములును అట్టి[2]శరీర

(1) నిశ్చయాత్మికాబుద్ధిః, సంశయాత్మకం మనః. (2) "శరీరమాద్యంఖలుధర్మసాధనం"

మున కధీనములు గదా! అట్టి శరీరముకంటెను మున్న అన్నింటిలోను నాత్మగా నుండువాఁడును అంతర్యామియును మోక్షమార్గమున కంతమునను ండువాఁడు నగు పరమపురుషుఁడు ప్రధానుఁడు. ఏలననఁగా, నితఁడు కుండు ఆత్మపదము ను శ్రుతియందుఁ జేర్కొనఁబడినవన్నియు నట్టి పరమపురుషుని సంకల్పమున కధీనములుగదా! ఆతఁడే యంతరాత్మగానుండి యుపాసనమును గూడ నెర వేర్చువాఁడు. ఏలననఁగా, జీవాత్మకుఁగల కర్తృత్వము పరమపురుషాధీనమైన దని «పరాత్తు తచ్ఛ్రుతేః» (బ్ర. సూ. ౨. అ. ౩. పా. ౪౦) అను సూత్రమున సూత్రకారులే చెప్పఁబోవుచున్నారు. వశపరచుకొనవలసిన యుపాసనము జరుగుటకు ముఖ్యోపాయ భూతుఁడును, పరమప్రాప్యుండును నతండే. ఈ విషయ మునే «పురుషాన్న పరం కించిత్సా కాష్ఠా సా పరాగతిః» (పరమపురుషునికం టెను ప్రధానమైనదేదియును లేదు. అతఁడే పరమకాష్ఠయు పరమగతియును.) అను శ్రుతివాక్యము తెలుపుచున్నది. అట్లే యంతర్యామి బ్రాహ్మణమునను, «య ఆత్మని తిష్ఠన్» ఇత్యాది వాక్యములయందు «ఆతఁడు సర్వమును సాక్షాత్క రించుచు నియమించుచున్నాఁడు» అని చెప్పి «నాన్యోఽతోఽస్తి ద్రష్టా» అను వా క్యమున నీతనికంటెను నియామకుఁడు వేఱొక్కండు లేఁడని చెప్పఁబడియె.

శ్రీభగవద్గీతలయందును,

శ్లో॥ అధిష్ఠానం తథా కర్తా కరణంచ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవంచైవాత్ర పంచమమ్॥

భ. గీ. ౧౮. అ. ౧౪. శ్లో.

తా॥ శరీరంబును, కర్తయును, వివిధమగు కరణంబును, వేఱువేఱుగా అనేకవిధములగు చేష్టలును వీనిలో నైదవదియగు దైవంబును ఈ యైదు కారణములను తెలిసికొనుమా!

ఈ పైశ్లోకమున దైవమనఁగా పురుషోత్తముండే. ఏలననఁగా, «సర్వస్య చాహం హృదిసన్నివిష్టో మత్తః స్మృతిః జ్ఞానమపోహనంచ» (భ. గీ. ౧౫. అ. ౧౫. శ్లో.) (నేను అందఱియొక్క హృదయమునందుండువాఁడను నావలననే జ్ఞా నము ప్రకాశించుటయు సంకోచించుటయును) అను వాక్యమువలన నట్లు తెలియుచున్నది. వాటిని వశపరచునది వానిని శరణు జొచ్చుటయే. కనుకనే

శ్లో॥ ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥
తమేవ శరణం గచ్ఛ। భ. గీ. ౧౮. అ. ౬౧. శ్లో॥

తా॥ ప్రకృతియందుండు ఈసమస్త జంతువుల హృదయమునందు సర్వే శ్వరుండుండి వాటినన్నింటిని తనజ్ఞానముచేఁ ద్రిప్పుచున్నాఁడు. వానినే శరణు జొచ్చుము!

ఇట్లు “ఆత్మానం రథినం విద్ధి” ఇత్యాదివాక్యమున రథస్వామి మొదలగునవిగాను వర్ణింపఁబడినట్టి యింద్రియాదులు “ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః” ఇత్యాది వాక్యమున వానిఁ దెలుపు శబ్దముల మూలముగానే గుర్తింపఁబడుచున్నవి. అయితే రథముగా వర్ణింపఁబడిన శరీరమో అట్లు తెలియవచ్చుచుండ లేదు. అందువలన మిగిలినదియగు శరీరము అందుండు అవ్యక్తశబ్దముచేఁ దెలుపఁబడునదిగాను నిశ్చయింపఁబడుచున్నది. కావున నీసందర్భమున సాంఖ్యమతప్రసిద్ధమగు ప్రకృతియొక్క ప్రసక్తియే లేదు. మఱియు నీతావున తన్మతప్రసిద్ధమగు ప్రక్రియయును గుర్తింపఁబడుచుండ లేదు. ఏలననఁగా, “ఇంద్రియేభ్యః పరాహ్యర్థాః” అనుతావున నింద్రియములకంటెను శబ్దాదిపదార్థములు పరములుగాఁ జెప్పఁబడినవి. వారిమతమున శబ్దాదులు ఇంద్రియములకు కారణభూతములుగా నెన్నంబడుచుండ లేదు గదా! “అర్థేభ్యశ్చ పరంమనః” అనుతావునఁ జెప్పఁబడిన ప్రకారము శబ్దాదులకంటెను మనస్సు పరమగుటయును వారి మతమునఁ జెప్పియుండలేదు. ఇందులకు కారణము వారిమతమున శబ్దాదులు మనస్సునకు కారణభూతములుగా నెన్నఁబడకపోవుటయే. ఆట్లే “బుద్ధేరాత్మా మహాన్పరః” (బుద్ధికంటెను గొప్పవాఁడగు నాత్మ పరుండు) అనిచెప్పియుండుటయును వారి మతప్రకారము మసంగతమగును. ఏలననఁగా, వారు బుద్ధియనఁగా మహత్తత్త్వమని గదా యంగీకరించుచున్నారు. మహత్తత్త్వముకంటెను మహాత్ము పరమైనదనుటయును వారిమతమున సంభవముకాదు. మహచ్ఛబ్దమును ఆత్మశబ్దమున విశేషణముగా నన్వయించుటయును పొసగదు. కావున నీశ్రుతి ... ధముఁ జెప్పఁబడిన యవ్యక్తమును శరీరమునుగానే గ్రహించుకొనునది. కావుననే “ఏష సర్వేషు భూతేషు గూఢోత్మా న ప్రకాశతే। దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః। యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః తద్యచ్ఛేజ్జ్ఞాన ఆత్మని జ్ఞానమాత్మని నియచ్ఛేచ్ఛాన్త ఆత్మని” అను శ్రుతివాక్యము ఈ విషయమునే తెలుపుచున్నది. అదియెట్లనిన, ఈవాక్యము బాహ్యాంతరింద్రియములను జయించనివారి కీపురుషుఁడు (పరమాత్మ) గానఁబడుట దుర్లభమని తెలిపి అశ్వములుగా వర్ణింపఁబడినట్టి యింద్రియములను వశపరచుకొను మార్గము నిట్లు తెలుపుచున్నది. “యచ్ఛేద్వాఙ్మనసీ” (వాక్కును మనస్సునందు నియమించునది) అనఁగా వాక్కు మొదలగు కర్మేంద్రియములను జ్ఞానేంద్రియములను మన

న్నుయొక్క యధీనమునందునదియని యర్థము. “సుపాం సులుక్” అను వ్యాకరణ సూత్రప్రకారము వాక్ శబ్దమునందుండు ద్వితీయావిభక్తికి లోపముగలిగినది, “మనసీ” అనుశబ్దమున నంతిమాక్షరము దీర్ఘమునందుండుట ఛాందసము. “తద్య చ్ఛేత్ జ్ఞాన ఆత్మని” అనగా మనస్సును బుద్ధియందుంచునదని యర్థము, ఈశ్రుతి యందుండు “జ్ఞాన” శబ్దము పూర్వము పేర్కొనఁబడిన బుద్ధిని తెలుపునది, “జ్ఞానఆత్మని” (జ్ఞానే, ఆత్మని) అనుతావునందు సప్తమీ విభక్తులువ్యధి కరణార్థమును తెలుపునవి అనఁగా ఆత్మయందుండు బుద్ధియందు నియమిం చునది యని యర్థము. “జ్ఞానమాత్మనిమహతి నియచ్ఛేత్ (కఠ.౧అ. ౩ వ, ౧౩ వా) అనఁగా బుద్ధిని కర్తయును గొప్పవాఁడునునగు నాత్మయందు నియ మించునది. “తద్యచ్ఛే చ్ఛాన్త ఆత్మని” అనగా కర్తయగు నా యాత్మను సర్వాంతరాత్మయగు పరమాత్మయందు నియమించునది. ఈ వాక్యమున నాత్మను తెలుపునట్టి శబ్దము “తం” అని పుల్లింగమునఁ బ్రయోగింపఁబడు టకు బదులుగా “తత్” అని నపుంసకలింగమునఁ బ్రయోగింపఁబడినది. ఇట్టి వాఁడగు రథికుఁడు వైష్ణవ పదమును బొందునని యర్థము,

అవతారిక:— (న వ్యక్తం అవ్యక్తం అను విగ్రహమువలన) అవ్యక్త శబ్దము అదృశ్య పదార్థమును తెలుపుచుండగా, నది దృశ్యమగు శరీరమునెట్లు తెలుపునని మరల వాదము రాఁగా:—

౨॥ సూ॥ సూక్ష్మంతు తదర్హత్వాత్,

టీ. సూక్ష్మంతు = అవ్యాకృతమగు సూక్ష్మశరీరము అవ్యక్త శబ్దాభి ధేయము (ఏలననఁగా) తదర్హత్వాత్ =అవ్యాకృతమగు సూక్ష్మచిద్వస్తువు లే వికారమును పొందినవై రథముభలెనే పురుషార్థ సాధన మగుట వలన,

తా॥ ఈ తావున అవ్యక్త శబ్దము సూక్ష్మశరీరమును తెలుపునది, ఏల ననఁగా, అట్టిసూక్ష్మశరీరమే కదా, స్థూలదశను పొందినదై రథము వలెనే పురుషార్థ సాధన మగుచున్నది,

శ్రీ॥ భా॥ అవ్యాకృతమగు భూత సూక్ష్మమే కదా! అవస్థా విశేష మును బొందినదై శరీర మనిపించుకొనుచున్నది, అట్టి యవ్యాకృతమగు శరీర మీతావున అవ్యక్త మనఁబడుచున్నది. ఏలననఁగా, అట్టి యవ్యాకృతమగు నచిత్పదార్థమే కదా! వికారమును బొందినదై రథము వలెనె పురుషార్థ సాధన మగుచున్నది,

అవతారిక:—అవ్యక్త శబ్దము అవ్యాకృతమగు భూతసూక్ష్మమును తెలుపునదియని యంగీకరించు పక్షమున, నది సాంఖ్య స్మృతిప్రసిద్ధమగు నవ్యక్తమునే తెలుపునదియని యంగీకరించుటచే బాధ యేమున్నది. అచట నున్న భూతకారణమే కదా ! యవ్యక్త శబ్దముచే దెలుపఁబడుచున్నది. ఇట్లు శంకింపఁగా నందులకు సమాధానము చెప్పటకై.

౩॥ సూ॥ తదధీనత్వా దర్థవత్

టీ॥ తదధీనత్వాత్ = సర్వేశ్వరుని యధీనములో నుండునది యైనందున, అర్థవత్ = భూతసూక్ష్మ మొక యుపయోగము కలది యగున్నది.

తా॥ సర్వేశ్వరుని యధీనములో నుండునది యగుటంజేసి భూతసూక్ష్మ మొక కార్యమున నుపయోగపడునది యగుచున్నది.

శ్రీ॥ భా॥ పరమ కారణ భూతుండగు పరమపురుషుని యధీనములో నుండునది యగుటంజేసి భూతసూక్ష్మ మొక ప్రయోజనముకలది యగుచున్నది. అది యెట్లనిన, అవ్యక్తమును (ప్రకృతియును) దాని వికారములును వాస్తముగను భూతముగ లేనే లేవని మేము చెప్పుచుండలేదు. అయితే యవి పరమపురుషుని శరీరములగుటచే వాని నాత్మగా కలవి కాకుండ యుండుట లేదని మాత్రము చెప్పుచున్నాము. ఏలననగా, పరమ పురుషుని యాత్మనుగా గలిగి యుండునవి యగుటంజేసియే కదా ప్రకృతి మొదలగునవి తమ కార్యములను సాధించు చున్నవి. అట్లు కాకున్న, వాటికి స్వరూపస్థితి ప్రవృత్తిభేదములే లేకపోవలసి వచ్చును. కావుననట్టివాటినిగా నంగీకరించి యుండనందుననే వారి సిద్ధాంత ప్రక్రియ నిరసింపంబడినది. ఏలననఁగా, శ్రుతి స్మృతులయందంతటను జగత్తుయొక్క యుత్పత్తి ప్రళయములను వర్ణించు తావులను సర్వేశ్వరుని మహిమను వర్ణించు తావులనున్న, ప్రకృతియు, వికృతులును, పురుషుఁడును, సర్వేశ్వరాత్మకములుగాను పేర్కొనంబడుచున్నవి. అది యెట్లనిన; సుబాలోపనిషత్తునందు. "పృథివ్యప్సు ప్రలీయతే" (పృథివి యుదకములయందు లీనమగుచున్నది,) అని యారంభించి "తన్మాత్రాణి భూతాదౌ లీయన్తే భూతాదిర్మహతి లీయతే మహానవ్యక్తే లీయతే అవ్యక్త మక్షరే లీయతే అక్షరంతమసి లీయతే తమః పరేదేవ ఏకీభవతి" (పంచతన్మాత్రలు భూతాది (భూతకారణ మగు అహంకారమునందు) లయమగు చున్నవి. భూతాది మహత్తునందు లయమగుచున్నది, మహత్తు అవ్యక్తమున లయమగుచున్నది. అవ్యక్త మక్షరునితోఁ జేరుచున్నది, అక్షరుఁడు తమస్సుతో జేరుచున్నాడు. తమస్సు పరమాత్మయం

డు లయమగుచున్నది”) అని పఠింపఁబడెను. అట్లే మరియొక తావున “యస్య పృథివీ శరీరం యస్యాపశ్శరీరం యస్య వాయుశ్శరీరం - యస్య తేజశ్శరీరం యస్యాకాశశ్శరీరం యస్యాహంకారశ్శరీరం యస్య బుద్ధిశ్శరీరం యస్యావ్యక్తం శరీరం యస్యాక్షరం శరీరం యస్య మృత్యుశ్శరీరం ఏష సర్వభూతాంతరాత్మా ఽపహతపాప్మా దివ్యోదేవ ఏకోనారాయణః” (ఎవనికి పృథివి శరీరమో, ఎవనికి ఉదకములు శరీరమో, ఎవనికి వాయువు శరీరమో, ఎవనికాకాశము శరీరమో, ఎవని కహంకారము శరీరమో, ఎవనికి మృత్యువు శరీరమో, అతండు సర్వభూతాంతరాత్ముడయ్యు, దివ్యస్వరూపుఁడగు దేవుఁడు నొక్కఁడునగు నారాయణుండు”) అని పఠింపఁబడియె. అట్లే శ్రీభగవద్గీతలయందున్,

శ్లో॥ భూమిరాపోఽనలోవాయుః ఖంమనో బుద్ధిరేవచ ।
అహంకార ఇతీయంమే భిన్నా ప్రకృతిరష్టధా॥

తా॥ ఓ అర్జునా! భూమి, ఉదకము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధియని యిట్లు నాయొక్క ప్రకృతి యెనిమిది విధములు గలది.

శ్లో॥ అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరాం ।
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతేజగత్॥

తా॥ ఓ అర్జునా! ఇది గొప్పది. దీనికంటెను గొప్పదియు, జీవస్వరూపమునగు వేఱొక్క ప్రకృతియును నాది కలదు. దానిచే నీ జగమంతయును ధరింపఁబడుచున్నది.

శ్లో॥ ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా॥

తా॥ ఓ అర్జునా! సమస్త భూతములున్ను ఈ ప్రకృతిలోనుండి వచ్చుచున్నవి. అయితే నేను ఈ సమస్త ప్రపంచముయొక్క యుత్పత్తికిని సంహారమునకును కారణభూతుఁడను.

శ్లో॥ మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ ।
మయిసర్వ మిదంప్రోతం సూత్రేమణిగణా ఇవ॥

తా॥ ఓ అర్జునా! నాకంటెను వేఱుగ సర్వాధారమైన వస్తువేదియును లేదు. అయితే మణులు దారము నాధారముగాఁ జేసికొని దండయందు నిలువఁబడియున్నట్లు, ఈ సమస్త భూతములును నన్నే యాధారముగాఁగొని నాయందే యుండియున్నవి.

అట్లే శ్రీవిష్ణుపురాణము నందున్,

శ్లో॥ వ్యక్తం విష్ణుః తథావ్యక్తం పురుషః కాల ఏవ చ॥

విష్ణు. ౧. ౨. ౧౮.

తా॥ వ్యక్తమును, ప్రపంచమును; విష్ణువును, అవ్యక్తమును (ప్రకృతియును) పురుషుండును కాలమును

అని యిట్లు చెప్పి,

శ్లో॥ ప్రకృతిర్యా మయాఖ్యాతా వ్యక్తావ్యక్త స్వరూపిణీ।
పురుషశ్చాప్యుభావేతౌ లీయతే పరమాత్మని॥

తా॥ నాచే ముందు పేర్కొనంబడినదియు, వ్యక్తావ్యక్త స్వరూపము గానుభయవిధమగు ప్రకృతియు, పురుషుండును ఈ రెండును పరమాత్మ యందు లయమగుచున్నవి.

శ్లో॥ పరమాత్మాచ సర్వేషా మాధారః పరమేశ్వరః।
విష్ణునామా స వేదేషు వేదాంతేషుచ గీయతే॥

తా॥ వాటి యన్నింటికిని పరమేశ్వరుండగు పరమాత్మయే యాధార భూతుండు. అతండు వేదములలోను ఉపనిషత్తులలోనును విష్ణువని చెప్పం బడు చున్నాడు.

౪॥ సూ॥ జ్ఞేయత్వా వచనాచ్చ.

టీ॥ జ్ఞేయత్వా వచనాచ్చ=అవ్యక్త మనంబడు ప్రకృతి మోక్షార్థము తెలియవలసినదిగాను చెప్పంబడనందునను.

తా॥ ఈ తావునం జెప్పంబడినట్టి యవ్యక్తము మోక్షార్థము తెలియ వల సినదిగాను చెప్పంబడ నందునను అది సాంఖ్యతంత్రప్రసిద్ధమగు ప్రకృతి కాదు.

శ్రీ॥ భా॥ ఈ తావున అవ్యక్తమని జెప్పంబడునది సాంఖ్యతంత్రప్రసిద్ధమగు ప్రకృతియగు పక్షమున, నది జ్ఞేయము గానును, అనంగా తెలిసికొన వలసినది గానును ఇచట చెప్పియుండవలయునే? ఏలననంగా, సాంఖ్యులు వ్యక్తావ్యక్తముల స్వరూపముం దెలిసికొనుటచే మోక్షము గలుగుననుచు నవియన్ని యును తెలిసికొనవలసినవియని గదా! చెప్పుచున్నారు. అయితే ప్రకృత శ్రుతియందన్ననో, అవ్యక్తము తెలియవలసిన వస్తువుగాను చెప్పంబడలేదు. కావున నీ తావునం జెప్పంబడిన అవ్యక్తము సాంఖ్యతంత్ర ప్రసిద్ధమగు నవ్యక్తము కాదని యిందువలనం దెలియుచున్నది.

సూ॥ వదతీతి చేన్న ప్రాజ్ఞో హి తథా ప్రకరణాత్.

టీ॥ వదతీతిచేత్ = శ్రుతియు నవ్యక్తమును తెలుపుచున్న దంటివేని, న = అది యుక్తముకాదు. ప్రాజ్ఞో హి = ప్రాజ్ఞుండగు పరమాత్మయే గదా, అట్టివాడు గాఁ జెప్పఁబడుచున్నాఁడు. ప్రకరణాత్ = ప్రకరణమును బట్టి యట్లు తెలియఁబడుచున్నది.

తా॥ ఉత్తరత్ర శ్రుతియే యవ్యక్తమును తెలిసికొనవలసిన దానినిగా జెప్పుచున్న దంటివేని, యది యుక్తము కాదు. ఏలననఁగా, నచట తెలియవలసిన వాడుగా జెప్పఁబడినవాడు ప్రాజ్ఞుండగు పరమాత్మ. అట్లు ప్రకరణము వలనఁ దెలియుచున్నది.

శ్రీ॥ భా॥ "అశబ్దమ స్పర్శమరూప మవ్యయం తథాఽరసం నిత్యమగన్ధవచ్చయత్ అనాద్యనన్తం మహతః పరంధ్రువం నిచాయ్యతం మృత్యుముఖాత్ప్రముచ్యతే" (కఠ.౧.అ.3.వ.౧౫.వా) (శబ్దరహితమును, స్పర్శరహితమును, రూపరహితమును, నాశరహితమును, రసమును, నిత్యమును, గన్ధరహితమును, అనాదియును, అనంతమును, మహత్తుకంటెనున్న పరమైనదియును స్థిరమైనదియు నగు నది యెద్దికలదో; దానిఁదెలిసికొని జననమరణాది రూపమగు సంసారము నుండి విముక్తుండగుచున్నాఁడు) అను అనంతర శ్రుతివాక్యమే యవ్యక్తమును జ్ఞేయమగు వస్తువునుగాఁ దెలుపుచున్న దంటివేని, యట్లు చెప్పఁదగదు. ఏలననఁగా, ప్రాజ్ఞుండగు పరమపురుషుండే ధ్యానింపవలసిన వాడుగాను ఈశ్లోకమునఁ బ్రతిపాదింపఁ బడుచున్నాఁడు. అదియెట్లనిన, "విజ్ఞానసారథి ర్యస్తుమనః ప్రగ్రహవాన్నరః. సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమంపదం ఏషుసర్వేషుభూతేషు గూఢోఽఽత్మాన ప్రకాశతే. దృశ్యతేత్వగ్ర్యయాబుద్ధ్యా సూక్ష్మయాసూక్ష్మదర్శిభిః" (౧.అ3.వ.౧_౨.వా) (ఎవఁడు ధ్యానరూపమగు సారథిగలవాఁడో, మరియు మనోరూపమగు కళ్లెముగలవాఁడో వాఁడు మోక్షమార్గమున కంతమునునుండు పరమపదమును బొందుచున్నాఁడు. ఈపరమాత్మ సమస్తభూతములలోను నుండువాఁడు. అయితే యీతండు బయటికి స్పష్టముగా ప్రకాశింపడు. సూక్ష్మదృష్టిగలవారిచేఁ దమసూక్ష్మదృష్టిచే దెలియఁబడుచున్నాఁడు) అను తావున ప్రాజ్ఞుఁడగు పరమాత్మయేగదా ప్రకరణ సందర్భమువలనఁ దెలియవచ్చుచున్నాఁడు. కనుకనే "పురుషాన్న పరంకించిత్" (ఈపురుషునికంటెను వేఱుగ నొక్కటియును లేదు.) అనువాక్యమున ఇరువదియైదవ తత్త్వమునకంటెను వేఱుగ తత్త్వమెద్దియునులేదని యిట్లు నిషేధింపఁబడుచున్నది. "యత్తదద్రేశ్యమగ్రాహ్యం" ఇత్యాదిశ్రుతి ప్రసిద్ధములగు ధర్మములును సర్వేశ్వరునివియే "మహతః

పరః" అను శ్రుతియందుఁ జెప్పియున్నట్లు మహత్తుకంటెను (గొప్పవస్తువుకంటెను) వేరయినదిగా నుండుటయును పరమాత్మయొక్క ధర్మమే. ఏలననఁగా, "బుద్ధేరాత్మా మహాన్పరః" అను పూర్వవాక్యమునఁ జెప్పఁబడిన జీవాత్మకంటెను వేఱయినవాఁడుగాను గదా పరమాత్మ యిచటఁ జెప్పఁబడుచున్నాఁడు,

## ౬॥ సూ॥ త్రయాణామేవచైవముపన్యాసః ప్రశ్నశ్చ.

టీ॥ త్రయాణామేవ చ=ఉపాయోపేయోపేతృలుమూఁడింటిని గుఱించియె, ఏవం=ఈలాగున, ఉపన్యాసః=ఉపన్యసించుటయు, ప్రశ్నశ్చ=ప్రశ్నించుటయును.

తా॥ ఉపాయము, ఉపేయము, ఉపేతయును ఈ మూఁడే యీతావున నుపన్యసింపఁబడినవి. ఈమూఁడింటినిగుఱించియే యీతావున ప్రశ్నింపఁబడినవి.

శ్రీ॥భా॥ ఉపాయమును, ఉపేయమును, ఉపేతయు నీమూఁడే యీప్రకరణమున నిట్లు ఉపన్యసింపఁబడినవి. అనఁగా నీమూఁడే తెలియవలసినవిగాను ఉపన్యసింపఁబడుటయును ప్రశ్నింపఁబడుటయును గానఁబడుచున్నది. ఇంతియె కాని, యవ్యక్తము మొదలగునది వేఱొక్కటి యెద్దియునట్లు ఉపన్యసింపఁబడుచుండలేదు. అదియెట్లనిన, నచికేతసుండు మోక్షేచ్ఛగలవాఁడై తనకు పురుషార్థమున యోగ్యతను గలుగఁజేసికొనుటకై తనవిషయమున తనతండ్రి మంచి మనస్సు గలిగియుండుటను, మృత్యువొసంగిన మూఁడు వరములలో నొకటి వరమునకుగాను లభించి, రెండవవరమునకుగాను మోక్షోపాయభూతమగు నచికేతాగ్నివిద్యను తెలుపుటకై కోరినట్లు "స త్వమగ్నిం స్వర్గ్యమధ్యేషి మృత్యో ప్రబ్రూహి తం శ్రద్దధానాయ మహ్యం స్వర్గలోకా అమృతత్వం భజన్త ఏతద్ద్వితీయేన వృణే వరేణ" (కఠ౧.౧.౧౩) (ఓ మృత్యువా! మోక్షసాధకమగు నే యగ్నిని నీవు ఉపాసించుచున్నావో, దేనిమూలముగ జనులు అమృతత్వమును (మోక్షమును) బొందుచున్నారో, దానిని శ్రద్ధాళువగు నాకు ఉపదేశింపుమా!) అనువాక్యమువలనఁ దెలియుచున్నది. ఈ పై శ్రుతియందుండు స్వర్గశబ్దము పరమపురుషార్థమగు మోక్షమును తెలుపునది. ఏలననఁగా, అట్టి స్వర్గమునందుండువారు "అమృతత్వం భజన్తే," (జన్మమరణములు లేనివారు) అనిగదా శ్రుతి తెలుపుచున్నది. తరువాత నాశయుక్తమగు ఫలమును నిందింపఁబడియున్నది. మఱియు, "త్రిణాచికేతస్త్రిభిరేత్య సన్ధిం త్రికర్మకృత్తరతి జన్మమృత్యూ" (యజనాధ్యయన దానము లనఁబడు మూఁడు కర్మముల ననుష్ఠించి యందుమూలముగ పరబ్రహ్మోపాసనముచే నత

నితో సంబంధమును బొందినవాఁడు జన్మమరణముల నతిక్రమించుచున్నాడు ) అనిగదా ప్రత్యుత్తర మీయఁబడియె. అటుపైని, నచికేతసుఁడు మూఁడవ వరమునకుగాను మోక్షస్వరూపమునుగుఱించి యడుగుచు తద్వారా ఉపేయస్వరూపమును గుఱించియు, ఉపేతృస్వరూపమును గుఱించియు, కర్మానుష్ఠానసహాకృతమును,ఉపాసనారూపమునునగు ఉపాయముయొక్క స్వరూపమును గుఱించియును ‹‹యేయం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నాయమస్తీతిచైకే। ఏతద్విద్యా మనుశిష్టస్త్వయాహం వరాణామేష వరస్తృతీయః'' (కఠ౧. అ,౧వ. ౧౩.వా. )సర్వబంధవినిర్ముక్తుఁడయిన మోక్షాధికారినిగుఱించి కొందరు కలదనియు,మఱికొందరు లేదనియు నిట్లు వివాదపడుచున్నారు. ఈవిషయమును గుఱించి నాకుఁదెలుపుమా. ఇదియే మూఁడవ వరమునకుఁగాను నేను కోరునది.)అని యివ్విధముగా నడిగెను.యముఁడును అట్టి యుపదేశమునకుఁదగిన యోగ్యతనుగుఱించి నచికేతసుని పరీక్షించి.‹‹తందుర్దర్శం గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్టం పురాణం అధ్యాత్మయోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి''(కఠ౧. అ.౨.వ.౧౨. వా.) (కానరానివాఁడును,గుణత్రయతిరోహితుఁడుటగుటచే రహస్యముగానుండువాఁడును,శరీరములోఁ బ్రవేశించియుండువాఁడును, హృదయగుహయందుండువాఁడును,దానిలోపలనుండు వస్తువులో అనగా జీవునిలోనుండువాఁడునునగు పరమాత్మను యోగమార్గముచే ధ్యానించినవాఁడు సుఖదుఃఖములను విడనాడుచున్నాఁడు.) అని యిట్లు ఉపదేశించెను. ఇట్లుసామాన్యముగానుపదేశింపఁగా,నచికేతసుఁడు సంతోషించినవాఁడై,‹‹ ఈపై వాక్యమున,‹‹దేవం మత్వా'' అనుతావున, ఉపాసింపవలసినవాఁడుగాఁ జెప్పఁబడిన దేవునియొక్కయు, ‹‹ అధ్యాత్మయోగాధిమేన'' అనుతావునఁ దెలియవలసినవాఁడును, ప్రాప్తయునగు జీవాత్మయొక్కయును, ‹‹మత్వాధీరో హర్షశోకౌ జహాతి''అనుతావున నుపదేశింపఁబడిన బ్రహ్మోపాసనముయొక్కయును స్వరూపములను పరిశోధించుటకై మఱల‹‹అన్యత్రధర్మాద న్యత్రాధర్మా దన్యత్రాస్మాత్కృతాకృతాత్ । అన్యత్రభూతాచ్చభవ్యాచ్చ యత్తత్పశ్యసి తద్వద ''( కఠ. ౧. అ. ౨. వ. ౧౪. వా. ) ( ధర్మముకంటెను అధర్మముకంటెను విలక్షణమైనదిగాను, చేయఁబడిన దానికంటెను చేయబడని దానికంటెనున్ను విలక్షణమైనదిగాను, పూర్వమున్న దానికంటెను ఇకముందుఁరాబోవు దానికంటెనున్ను విలక్షణమైనదానినిగానును నీవు దేనిఁ దెలిసికొనుచున్నావో, తెలుపుమా ) అని యడిగెను. ఇట్లు భూతభవిష్యద్వర్తమానకాలీనములగు తక్కిన సాధ్యసాధకములన్నిఁటికంటెను విలక్షణములగు మూఁడిం

టినీ గుఱించి యడుగగా, మొదట ప్రణవమునుగుఱించి ప్రశంసించి తద్వాచ్యమగు ప్రాప్యవస్తుస్వరూపమును తదంతర్గతమగు ప్రాప్త్రు (ఆత్మ) స్వరూపమును, ప్రాప్యవస్తుస్మరణ (భగవద్ధ్యాన) రూపమగు ఉపాయమును వీటినిగుఱించి మరల సామాన్యముగఁ దెలుపఁదలంచి, మొదట ‹‹ సర్వే వేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణిచ యద్వదన్తి యదిచ్ఛన్తో బ్రహ్మచర్యంచరన్తితత్తేపదం సంగ్రహేణబ్రవీమ్యో మిత్యేతత్ '' (కఠ.౧.అ. ౨. వ. ౧౫. వా.) ( సమస్తవేదములును ఏస్థానమునుగుఱించి బోధించుచున్నవో, తపోవంతులందఱును దేనిఁ దెలుపుచున్నారో, దేనిఁ గోరి జనులు బ్రహ్మచర్యము ననుష్ఠించుచున్నారో, ఆ స్థానమును గుఱించి నీకు సంగ్రహముగఁ దెలిపెదను. అది ‹‹ ఓమ్ '' అనునది యే) అని యిట్లు యముఁ డుపదేశించెను. ఇట్లు ఉపదేశించి, మరల ప్రణవమును గుఱించియే ప్రశంసించి యంతు మొదట ప్రాప్తయగు ప్రత్యగాత్మయొక్క స్వరూపమును ‹‹ న జాయతే మ్రియతే వా విపశ్చిత్ '' ( చేతనుఁడు పుట్టువాఁడుగాని నశించువాఁడుగాని కాఁడు. ) ఇత్యాదివాక్యమున నుపదేశించి యున్నాఁడు. ప్రాప్యుఁడును, పరబ్రహ్మమునగు విష్ణువుయొక్క స్వరూపమును ‹‹ అణోరణీయాన్ '' (కఠ. ౧. అ. ౨. వ. ౧౯. వా.) ఇత్యాది వాక్యము మొదలుకొని ‹‹ క ఇత్థం వేద యత్రసః '' అను వాక్యమువరకు నుపదేశించుచు మధ్యను ‹‹ నాయమాత్మా ప్రవచనేన లభ్యో నమేధయా '' ఇత్యాది వాక్యమున నుపాయభూతమగు నుపాసనము భక్తిరూపమైనదియనియును ఉపదేశించెను. ‹‹ ఋతం పిబంతౌ '' అను వాక్యమున నుపాస్యునకును ఉపాసకునితోఁగూడ నంధుటంజేసి యుపాసన మనుకూలముగా నుండునని చెప్పి ‹‹ ఆత్మానం రథినం విద్ధి '' ఇత్యాది వాక్యము మొదలుకొని ‹‹ దుర్గం పథస్తత్కవయో వదన్తి '' (కఠ.౧.౩.౧) అనువాక్యమువరకును ఉపాసనముయొక్క పద్ధతినిన్ని యుపాసకునికి విష్ణుపదప్రాప్తినిన్ని తెలిపి ‹‹ అశబ్ద మస్పర్శమ్ '' ఇత్యాది వాక్యముతో నీవిషయమును ముగించెను. కావున నీతావున నీమూఁడే (ఉపాయోపేయోపేతలు) జ్ఞాతవ్యములుగా నువన్యసింపఁ బడినవియును, ప్రశ్నింపఁబడినవియునని తెలియుచున్నది. కావున నిచట సాంఖ్యతంత్ర ప్రసిద్ధమగు నవ్యక్తము గ్రహింపఁబడదు.

౭॥ సూ॥ మహద్వచ్చ

---

టీ॥ మహద్వచ్చ=మహచ్ఛబ్దమువలెనే.

తా॥ మహచ్ఛబ్దము మహత్తత్త్వమును తెలుపనిచందంబున అవ్యక్తశబ్దమున్ను ప్రకృతిని తెలుపఁజాలదు.

శ్రీ॥ భా॥ ‹‹ బుద్ధేరాత్మా మహాన్పరః '' అను వాక్యమున మహచ్ఛబ్ద

ము ఆత్మశబ్దముతో సామానాధికరణ్యమునఁ బ్రయోగింపఁబడుటంజేసి, యది సాంఖ్యతంత్రసిద్ధమగు మహత్తత్త్వమును తెలుపఁజాలని చందంబున, నీతావున నవ్యక్తము ఆత్మకు పరమైనదిగాను చెప్పఁబడినందున నదిసాంఖ్యతంత్రసిద్ధమగు ప్రకృతిని తెలుపఁజాలదు.

ఆనుమానికాధికరణము ముగిసెను.

---

## చమసాధికరణము.

౮॥ సూ॥ చమసవదవిశేషాత్॥

టీ॥ అవిశేషాత్ = విశేషమెద్దియును చెప్పఁబడనందున, చమసవత్ = చమసశబ్దమువలెనే

తా॥ విశేషమెద్దియును చెప్పఁబడనందున, చమసశబ్దమువలెనే అవ్యక్తశబ్దమున్ను ప్రకృతిని తెలుపఁజాలదు.

శ్రీ॥ భా॥ ఈయధికరణమునఁగూడ సాంఖ్యుల ప్రక్రియయే నిరసింపఁబడుచున్నది. ఇంతియెకాని; బ్రహ్మాత్మకములగు ప్రకృతి మహదహంకారముల స్వరూపము నిరసింపఁబడుచుండలేదు. ఏలననఁగా బ్రహ్మాత్మకములుగా నవి యున్నట్లు శ్రుతి స్మృతులు ప్రతిపాదించుచున్నవి. అవియెట్లనిన, ఆథర్వణికులు "వికారజననీమజ్ఞా మష్టరూపా మజాం ధ్రువాం" (వికారములను గలుగఁజేయునదియు, జ్ఞానరహితమును, ఎనిమిది రూపములు గలదియు, పుట్టుక లేనిదియు, స్థిరమైనదియు) అనియు, "ధ్యాయతే ధ్యాసితా మేన తన్యతే ప్రేర్యతే పునః సూయతే పురుషార్థంచ తేనైవా ధిష్ఠితం జగత్" (దేనిచే ప్రకృతి ధ్యానింపఁబడుచున్నదో, ధ్యానింపఁబడినదై విస్తరింపఁబడుచున్నదో, ప్రేరింపఁబడుచున్నదో, పురుషార్థమును గలుగఁజేయుచున్నదో; దానిచే నీప్రపంచము అధిష్ఠింపఁబడుచున్నది.) అనియు; "గౌరనాద్యన్తవతీ సా జనిత్రీ భూతభావినీ సితాసితాచ రక్తాచ సర్వకామదుఘా విభోః పిబన్త్యేనామవిషమా మవిజ్ఞాతాః కుమారకాః ఏకస్తు పిబతే దేవః స్వచ్ఛందోత్ర వశానుగాం ధ్యానక్రియాభ్యాం భగవాన్ భుంక్తేఽసౌ ప్రసభం విభుః సర్వసాధారణీం దోగ్ధ్రీం పీడ్యమానాంతు యజ్వభిః" (ఆద్యంతములులేనిదియు, సృష్టిని గలుగఁజేయునదియు, ఇంతకుముందుండి యికమీదుండునదియు, సత్వరజస్తమోగుణమయమయినదియు, వ్యాపకుఁడగు నీశ్వరునికి లీలారసమును గలుగఁజేయునదియు, గుణత్రయసామ్యరూపమగు దీనిని జ్ఞానహీనులగువారు అనుభవించుచున్నారు. స్వతంత్రుఁడగు నొక్కఁడు తనధ్యానముచేతను సృష్ట్యాది కార్యములచేతనున్ను దీనిని తన

వశమున నుంచుకొని యనుభవించుచున్నాడు. ఇది యజ్ఞమునందు యజమానులచే నాశ్రయింపఁబడి వారికి సర్వఫలముల నిచ్చునది.) అనియు ‹‹చతుర్వింశతిసంఖ్యాతమవ్యక్తం వ్యక్తముచ్యతే›› (అవ్యక్తముగానుండి వ్యక్తమైనట్టి యాప్రకృతి ఇరువదినాలుగు పదార్థములు గలదిగాను చెప్పఁబడుచున్నది.) అనిపఠించుచున్నారు. ఈ పైవాక్యములయందు ప్రకృత్యాది పదార్థముల స్వరూపము చెప్పఁబడినది. ఎవనిని యీప్రకృత్యాదు లాత్మనుగా గలిగియున్నవో, అట్టి పరమపురుషుంను ‹‹ తంషడ్వింశక మిత్యాహుః సప్తవింశ మథాపరే పురుషం నిర్గుణం సాంఖ్య మథర్వశిరసో విదుః›› (కొందఱు ఈపురుషుని ఇరువదియారవ వానినిగాఁ దెలిసికొనుచున్నారు. మరికొందఱు ఈతనిని ఇరువదియేడవ వానినిగాఁ జెప్పుదురు. నిర్గుణుండును సాంఖ్యుండునగు నీపురుషునిగుఱించి యాథర్వణికులిట్లు తెలిసికొనుచున్నారు.) అను వాక్యమునఁ బ్రతిపాదింపఁ బడుచున్నాడు. మరికొందఱు ఆథర్వణికులు ఈవిషయమునుగుఱించి పఠించు సందర్భమున, ‹‹ అష్టౌప్రకృతయః షోడశవికారాః›› (ఎనిమిది ప్రకృతులు పదునారు వికృతులు) అని పఠించుచున్నారు. శ్వేతాశ్వతరులును ‹‹సంయుక్తమేతత్ క్షరమక్షరంచ వ్యక్తావ్యక్తంభరతే విశ్వమీశః అదృశ్యశ్చాత్మా బధ్యతే భోక్తృభావాత్ జ్ఞాత్వాదేవం ముచ్యతే సర్వపాశైః›› (జీవుండును ప్రకృతియును ఈరెండును పరస్పరము కలిసియున్నవి. వ్యక్తావ్యక్తమగు దీనిని సర్వేశ్వరుఁడు పాలించుచున్నాడు. కర్మఫలభోక్త యగుటంజేసి యసమర్థుండగు జీవుండు సంసారమున బంధింపఁ బడుచున్నాడు. పరమాత్మను ఉపాసించి పాపవిముక్తుండగుచున్నాడు) అనియు, ‹‹జ్ఞాజ్ఞౌద్వావజావీశ నీశావజాహ్యేకా భోక్తృభోగార్థయుక్తా। అనన్తశ్చాత్మా విశ్వరూపోహ్యకర్తా త్రయంయదా విన్దతే బ్రహ్మమేతత్ ›› (జీవుండును, ఈశ్వరుండును, పుట్టుకలేనివారు. వీరిలో జీవుండు అసమర్థుండు. ఈశ్వరుండు సమర్థుండు అనాదియగు ప్రకృతియును గలదు. ఇది భోక్తయగు జీవుని భోగమున కుపయుక్తమైనది. ఈశ్వరుండు అనంతుఁడు. ఈప్రపంచమంతయు నతని శరీరముగాగలవాడు పుణ్యపాపకర్మముల నొనర్చువాడుకాడు. ఈమూటినిఁ దెలిసికొనినవాడు ముక్తుండగుచున్నాడు.) అనియు, ‹‹ క్షరం ప్రధాన మమృతాక్షరం హరః క్షరాత్మా నావీశతే దేవఏకః। తస్యాభిధ్యానాద్యో జనాత్తత్త్వభావాద్భూయశ్చాన్తే విశ్వమాయా నివృత్తిః›› (ప్రకృతినాశయుక్తము. జీవుఁడు నాశరహితుండు ఈశ్వరుండొక్కఁడు ఈప్రకృతిపురుషులను పాలించువాఁడు. మరల మరల నీశ్వరుని యోగమార్గముచే ధ్యానించుటవలన సమస్తమగు నజ్ఞానమున్ను నివర్తించును) అనియు, ‹‹ఛన్దాంసి యజ్ఞాః క్రతవో వ్రతాని భూ

తం భవ్యం యచ్చ వేదా వదన్తి అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః మాయాంతుప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం తస్యావయవ భూతైస్తు వ్యాప్తంసర్వ మిదంజగత్" ( వేదములును, యజ్ఞములును, క్రతువులును, వ్రతములును జరిగినదియును, జరుగబోవునదియును, దేనిని తెలుపుచున్నవో, దానినంతయును మాయావంతుండగు సర్వేశ్వరుండు ఈప్రకృతిలోనుండి సృజించుచున్నాడు. దీనియందు వేఱొక్కండు మాయచే బంధింపఁ బడియున్నాడు. ప్రకృతియే మాయ. అట్టి మహేశ్వరుండు మాయగలవాఁడు. అట్టి యీశ్వరుని యవయవములచే నీజగమంతయును వ్యాపింపఁబడినది) అనియు నివ్విధముగ ప్రకృతిపురుషులయొక్కయును ఈశ్వరునియొక్కయును స్వరూపమునుగుఱించి శ్వేతాశ్వతరులు పఠించియున్నారు. అట్లే ఉత్తరత్రయును, "ప్రధానక్షేత్రజ్ఞ పతిర్గుణేశః సంసారమోక్షస్థితిబంధహేతుః" (ఈశ్వరుండు ప్రకృతిపురుషులను నియమించువాఁడు, గుణములకీశుండు, బంధమోక్షస్థితులకుఁ గారణభూతుండు ) అని పఠింపఁబడినది. స్మృతియందును,

శ్లో॥ ప్రకృతిం పురుషంచైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధిప్రకృతిసంభవాన్॥

భ. గీ. ౧౩. అ. ౨౦. శ్లో.

తా॥ ప్రకృతిని పురుషుని యీరెంటిని అనాదిగా నుండువాటినిగా నెఱుఁగుము. వికారములను గుణములనున్న అట్టి ప్రకృతినుండి గలుగువాటినిగా నెఱుంగుము.

శ్లో॥ కార్యకారణ కర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుష స్సుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥

తా॥ కార్యకారణ పదార్థముల నొనర్చునది ప్రకృతి. సుఖదుఃఖముల ననుభవించువాఁడు పురుషుండు.

శ్లో॥ పురుషః ప్రకృతిస్థోపి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్।
కారణం గుణసంగోస్య సదసద్యోనిజన్మసు॥

తా॥ పురుషుండు ప్రకృతిలోనున్నను ప్రకృతివలనఁగలుగు గుణముల ననుభవించుచున్నాడు. ఈతనికి మంచిజన్మముగాని చెడుజన్మముగాని కలుగుటకు హేతువు సత్వరజస్తమోగుణ సంబంధమే.

శ్లో॥ సత్వం రజస్తమఇతి గుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నన్తి మహాబాహో దేహేదేహిన మవ్యయం॥

తా॥ ప్రకృతిసంబంధముపలనఁ గలుగునట్టి సత్వరజస్తమోగుణములు నాశరహితుండగు జీవుని శరీరయుక్తునిగాఁ జేయుచున్నవి.

అట్లే, శ్రీభగవద్గీతలయందును,

శ్లో॥ సర్వభూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికాం।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహం॥

తా॥ ఓ అర్జునా! ప్రళయసమయమున ఈభూతములన్నియును నాలోఁ జేరుచున్నవి, సృష్టిసమయమున వాటిని నేను బయలికి వదలుచున్నాఁడను.

శ్లో॥ ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునఃపునః।
భూతగ్రామ మిమంకృత్స్న మవశం ప్రకృతేర్వశాత్॥

తా॥ ఓ అర్జునా! నేను ప్రకృతిని యధిష్ఠించి యీభూత సముదాయమునంతయును ప్రకృతినుండియే సృజించుచున్నాఁడను.

శ్లో॥ మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరం।
హేతునానేన కౌంతేయ జగద్ధి పరివర్తతే॥

తా॥ ఓ అర్జునా! నేనధ్యక్షుఁడనుగా నుండుటచే ప్రకృతి స్థావర జంగమ విశిష్టమగు జగత్తును సృజించుచున్నది. నావలననే యీజగత్తు జరుగుచున్నది,

ఇవ్విధమున జెప్పఁబడినది. కావున అబ్రహ్మాత్మకములగుటం జేసి సాంఖ్యతంత్ర ప్రసిద్ధములగు ప్రకృతి మొదలగునవి నిరసింపఁబడుచున్నవి.

అయితే శ్వేతాశ్వతరులు ,, అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః అజో హ్యేకో జుషమాణోను శేతే జహాత్యేనాం భుక్తభోగామజోన్యః (శ్వే. ౪. ౫.) (సత్వరజస్తమోగుణాత్మకమును, ఒక్కటియునగు ప్రకృతి తనతో సమానరూపముగల మహదాదితత్వములను సృజించుచున్నది. పుట్టువులేని యొకపురుషుండు దాని ననుభవించుచుఁ బొర్లుచున్నాడు. పుట్టువులేని మరియొకపురుషుండు భుక్తభోగముగల దానిని విడుచుచున్నాఁడు) అని పఠించుచున్నారు. ఈతావున నొకసంశయము గలుగుచున్నది,

## సంశయము.

ఈ శ్రుతియందు సాంఖ్య సిద్ధాంతప్రసిద్ధమగు జడప్రకృతి మాత్రము చెప్పఁబడుచున్నదా? కాక, బ్రహ్మాత్మకమగునట్టిది యగు నాప్రకృతి చెప్పఁబడుచున్నదా?

## పూ ర్వ ప క్ష ము.

కేవల ప్రకృతిమాత్రము చెప్పఁబడుచున్నదనుట యుక్తము. ఏలననఁగా నిది “అజామేకాం” (పుట్టుకలేనిది) అను తావున నొకదానిచే సృజింపఁబడిన పదార్థముగాఁ జెప్పఁబడనందునను, “బహ్వీః ప్రజాస్సృజమానాం సరూపాః” అను తావున నది స్వతంత్రముగ ననేకములును, తనతో సమానరూపములుగల ప్రజలను సృజించుచున్నట్లు చెప్పఁబడినందునను అట్లు తెలియుచున్నది,

## సి ద్ధా ం త ము.

అట్లు చెప్పుట యుక్తముకాదు. ఈ శ్రుతియందు “అజా” అను శబ్దము “నజాయతే ఇత్యజా=పుట్టువులేనిది” అను వ్యుత్పత్తినిబట్టి పుట్టువులేనిదియని యింతమాత్రము తెలుపుచున్నది. ఆశ్రుతియందు ఈశబ్దము సాంఖ్యసిద్ధాంతప్రసిద్ధమును, బ్రహ్మాత్మకము కానిదియునగు ప్రకృతిని తెలుపునదియగుట కెవ్విధమైన విశేషమును నచటఁ గానఁబడదు. అది యెటువలెననిన “అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వ బుధ్నః” అను వాక్యము నందుండు చమస శబ్దమువలన నేదోయొక భక్షణపాత్రమనెడి యర్థము తెలియవచ్చునే కాని, యొక యజ్ఞమునందుపయోగపడునట్టి యొక విశేషమైన చమసపాత్రమనెడి యర్థము తెలియరాదు. ఏలననఁగా, యౌగికశబ్దము లొక విశేషార్థమును తెలుపునట్లు నిశ్చయింపవలయునన్న, అర్థప్రకరణాదులను బట్టియే తప్ప వేఱొక్కవిధమున గానినట్టి యర్థము నిచ్చువాటినిగాను నిశ్చయించుట యశక్యము. ఈ తావుననే “యదేతం తచ్ఛిరః ఏషహ్యర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వబుధ్నః” అను వాక్యశేషమునుబట్టి చమసమనఁగా శిరస్సని నిశ్చితమగునట్లు ప్రకృతశ్రుతియందును అర్థప్రకరణాదులనుబట్టియే యాయజయనఁబడు పుట్టువులేని వస్తువు ఏలాంటిది యని నిశ్చయింపఁదగును, మరియు ఈ తావున “అజా” అనఁగా సాంఖ్యసిద్ధాంతప్రసిద్ధమగు ప్రకృతియని తెలుపునట్టి యర్థప్రకరణాదులును గానఁబడవు. మరియు నిది స్వతంత్రముగ సృజించునట్టిదిగాను తెలియవచ్చుచుండలేదు, ఏలననఁగా, “బహ్వీః ప్రజాస్సృజమానాం” అను తావున నిది సృజించునదియని మాత్రమే తెలియవచ్చుచున్నది. కావున నీమంత్రమున అబ్రహ్మాత్మకమగు ప్రకృతి చెప్పఁబడుచుండలేదు,

అవతారిక:—బ్రహ్మాత్మకమగు ప్రకృతియే యీ తావునఁ జెప్పఁబడుచున్నదని నిరూపించునట్టి విశేషహేతువున్న దిచట గానఁబడుచున్నదని తెలుపుటకై:—

౯॥ సూ॥ జ్యోతిరుపక్రమాతు తథాహ్యధీయత ఏకే.

టీ॥ అజా=ఈ తావునఁ జెప్పఁబడిన ప్రకృతి, జ్యోతిరుపక్రమాతు=బ్రహ్మము కారణముగాఁగలది. ఏలననఁగా, తథాహి=అట్లకదా, ఏకే = కొందరు అధీయతే=పఠించుచున్నారు.

తా॥ ఈ తావునఁ జెప్పఁబడిన ప్రకృతి బ్రహ్మము కారణముగాఁగలది. అట్లగదా! కొన్ని శాఖలవారు పఠించుచున్నారు.

శ్రీ॥భా॥ఈ తావునఁ జెప్పఁబడినట్టి "అజా" యనునది జ్యోతిస్సుతో నారంభింపఁబడినది. జ్యోతిస్సనగా బ్రహ్మము. "తం దేవా జ్యోతిషాం జ్యోతిః" అనియు "అథ యదతః పరో దివో జ్యోతిర్దీప్యతే" అనియు నీ మొదలగు శ్రుతులయందు జ్యోతిశ్శబ్దము బ్రహ్మమును తెలుపునదిగాను ప్రసిద్ధినొందినది. సూత్రమునందు "జ్యోతిరుపక్రమా" అనఁగా బ్రహ్మమే కారణము గాఁగలది యని యర్థము. "తథాహ్యధీయత ఏకే" అనునది అందులకు హేతువును తెలుపునది. అది యెట్లనిన, ఈ తావునఁ జెప్పఁబడినట్టి "యజ" యనుదానిని బ్రహ్మాత్మకమైన దానినిగాను కొందరు అనఁగా తైత్తిరీయులు పఠించుచున్నారు. అది యెట్లనిన, "అణోరణీయాన్మహతో మహీయానాత్మా గుహాయాం నిహితో స్య జన్తోః" అను వాక్యమున హృదయగుహాయందు ఉపాసనమునకై సిద్ధముగానుండు బ్రహ్మమును గుఱించి చెప్పి, "సప్త ప్రాణాః ప్రభవన్తి తస్మాత్" అను వాక్యమున సమస్తలోకములును చతుర్ముఖబ్రహ్మము మొదలగువారును అట్టి బ్రహ్మమునుండి బుట్టుచున్నారని చెప్పి, యనంతరము "అజామేకాంలోహిత శుక్ల కృష్ణాం బహ్వీంప్రజాం జనయన్తీం సరూపాం అజోహ్యేకో జుషమాణోను శేతే జహాత్యేనాం భుక్తభోగా మజోన్యః" అను వాక్యమున సర్వకారణభూతమగు నజయనఁబడు ప్రకృతి యట్టిబ్రహ్మమునుండి పుట్టునదిగాను జెప్పఁబడుచున్నది. స్వేతరసమస్త వస్తుసముదాయము బ్రహ్మమునుండి యుత్పన్నమైనందున నంతయును బ్రహ్మాత్మకమని యుపదేశించు సందర్భమునఁ జెప్పఁబడుటంజేసి, అనేకములును, తనతో సమానరూపములునగు ప్రజలను సృజించునదియు, కర్మవశ్యుండగు జీవునిచే ననుభవింపఁ బడునదియు, జ్ఞానియగు వేఱొక్కయాత్మచే త్యజింపఁబడునదియు నగు యీ యజ యనఁబడు ప్రకృతి యును ప్రాణసముద్ర పర్వతాదులవలెనే బ్రహ్మమునుండి యుత్పన్నమైనదై బ్రహ్మాత్మకమైనదిగాఁ దెలియవలసినది. కావున నీ పైయుదాహరణమున చమస మనఁగా నొక విశేషవస్తువుగాను వాక్యాంతరమునుబట్టి నిశ్చితమగు నట్లు, ప్రకృతమునను అజ యనంబడు ప్రకృతి యనునది బ్రహ్మాత్మకమని యీ

పైని యుదహరించిన వాక్యాంతరమునుబట్టి నిశ్చితమగుచున్నది. ఈ శ్వేతాశ్వతరశ్రుతి యందు ఆరంభమున "కిం కారణం బ్రహ్మ" (కారణభూతమగు బ్రహ్మమెట్టిది ?) అని చెప్పి, యనంతరము "తే ధ్యానయోగానుగతా అపశ్యన్దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం" (స్వగుణములచే నిరూపింపఁబడునట్టి యాత్మశక్తిని దేవతలు యోగముచే జూచిరి.) అని చెప్పియుండుటచే నజయనఁబడునది పరబ్రహ్మముయొక్క శక్తిరూపమైనదిగాఁ దెలియవచ్చుచున్నది. ఉత్తరత్రగూడ "అస్మాన్మాయీ సృజతేవిశ్వమేతత్తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః। మాయాంతు ప్రకృతింవిద్యాన్మాయినంతు మహేశ్వరం" అనియు "యోయోనింయోనిమధితిష్ఠత్యేకః" అనియు నీమొదలగు శ్రుతివాక్యముల వలనను అజ యనఁబడునది పరబ్రహ్మముయొక్క శక్తిగాఁ దెలియవచ్చుచున్నది. కావున నీతావున సాంఖ్యసిద్ధాంతప్రసిద్ధమును, స్వతంత్రమును నగు ప్రకృతియొక్క గంధమాత్రమైనను తెలియవచ్చుచుండుట లేదు.

అవతారిక :—బ్రహ్మమునుండి పుట్టినదియు, యెఱ్ఱగను, తెల్లగను, నల్లగను నుండు యీప్రకృతి పుట్టువు లేనిది యెట్లుకాఁగలదు ? పుట్టువులేనిది బ్రహ్మమునుండి పుట్టినది యెట్లు కాఁదగును ? అని శంకింపఁగా నందులకు సమాధానము చెప్పుటకై:—

౧౦॥ సూ॥ కల్పనోపదేశాచ్చమధ్వాదివదవిరోధః.

టీ॥ కల్పనోపదేశాచ్చ=సృష్టి యుపదేశింపఁబడినందున, మధ్వాదివత్ = మధువిద్యాదులయందువలెనే, అవిరోధః=విరోధముండదు.

తా॥ సృష్టిని యుపదేశించియున్నందున మధువిద్యాదులయందువలెనే విరోధముండదు.

శ్రీ॥భా॥ ఈ ప్రకృతి పుట్టువులేనిది యగుటయు, బ్రహ్మమునుండిపుట్టినది యగుటయును విరోధింపవు. ఏలననఁగా, కల్పన నుపదేశించినందువలన. సూత్రమునందుండు కల్పనశబ్దమునకు సృష్టియని యర్థము. అనఁగా, సృష్టినియుపదేశించియున్నందుననని ఫలితార్థము. ఉదాహరణము :— "సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్" (చతుర్ముఖబ్రహ్మము సూర్యచంద్రులను పూర్వమున్నట్లు సృజించెను.) ఇత్యాది తావుల కల్పనయనఁగా సృష్టిగాను గ్రహింపఁబడుచున్నది. ప్రకృతమునను, "అస్మాన్మాయీ సృజతేవిశ్వమేతత్" (ఈ ప్రకృతినుండి శక్తిమంతుండగు బ్రహ్మము జగత్తును సృజించుచున్నాడు) అను తావున జగత్సృష్టి యుపదేశింపఁబడుచున్నది. అనఁగా తననుండి-వేఱుగానుండనిదియు, సూక్ష్మభూతమును నగునీకారణవస్తువునుండి శక్తిమంతుం

డగు సర్వేశ్వరుండు ఈ సమస్త జగత్తును సృజించుచున్నాడని యర్థము. ఇట్లు సృష్టిని యుపదేశించియున్నందున నీప్రకృతి కార్యకారణరూపముచే రెండవస్థలుగలదిగాఁ దెలియ వచ్చుచున్నది. ఇది ప్రళయకాలమున బ్రహ్మమును బొంది నామరూప విభాగము లేనిదై బహుసూక్ష్మమైనదిగా నుండును. సృష్టిసమయముననో, సత్వాదిగుణములు ప్రకటితములై విభక్తనామరూపములు గలదియు, వ్యక్తిమొదలగు శబ్దములచేఁ జెప్పఁబడునదియు, తేజస్సు, పృథివి మొదలగునవిగాను పరిణమించినదియునై ఎఱుపు, తెలుపు, నలుపు వర్ణములు గలదిగానుండును. కావున నిది కారణావస్థలోనుండినప్పుడు అజ (పుట్టువులేనిది) యనఁబడుచున్నది. కార్యావస్థయందన్ననో, ఇది బ్రహ్మసృష్టము. కావున విరోధము లేదు. అది యెటువలెననిన, మధ్వాదులవలెనే ప్రకృతమనను ఎఱుంగునది. అది యెట్లనిన, కారణావస్థయం దొక్కఁడుగానే యుండునట్టి యాదిత్యుడు కార్యావస్థయందు ఋగ్యజుస్సామాథర్వ వేదప్రతిపాద్యమగు కర్మమువలన గలుగఁ జేయఁబడు రసమున కాశ్రయమగుటచే వస్వాదిదేవతలకు భోగ్యముగానుండుటకై యాశ్వరుం డతనియందు మధుత్వ కల్పనమును ఉదయాస్తమయ కల్పనమునుచ్చు జేయుట విరుద్ధము కానట్లు, ప్రకృతమనను ఎఱుంగునది «అసౌవా ఆదిత్యోదేవమధు» (ఛా.3.౧.౧.) (ఈ యాదిత్యుండు దేవతలకు మధువు) అను వాక్యము మొదలుకొని «అథ తత ఊర్ధ్వ ఉదేత్య నైవోదేతా నాస్తమేతై కల ఏవ మధ్యేస్థాతా» (ఏకస్వభావుఁడగు నితండు ప్రళయకాలమున ప్రాణ్యనుగ్రహార్థములగు ఉదయాస్తమయములనుండి విముక్తుడై తరువాత యుదయింపఁడుఅస్తమింపఁడు) అను వాక్యము వరకును ఈవిషయము తెలుపఁబడినది. ఈపైవాక్యమున «ఏకలః» అనఁగా ఏకస్వభావుండని యర్థము. కావున నీమంత్రమున బ్రహ్మాత్మకమగు ప్రకృతియే చెప్పఁబడుచున్నదికాని సాంఖ్యసిద్ధాంత ప్రసిద్ధమగు ప్రకృతి చెప్పఁబడుచుండ లేదు.

తేజోబన్న లక్షణమగు నొక్క యజ (పుట్టువులేని వస్తువు)మాత్రము ఈ తావునఁ జెప్పఁబడుచున్నదని కొందరు తలంచుచున్నారు. వారి నొక్కటి యడుగవలసియున్నది. తేజోబన్నములే తేజోబన్నాత్మకముగ నొక్కటియగు నజయా? కాక యది తేజోబన్నరూపమగు బ్రహ్మమా? కాక తేజోబన్నములకు కారణభూతమగు నెద్దియో యొక్కటియా? మొదటి పక్షము యుక్తము కాదు. ఏలననఁగా, తేజోబన్నములు మూడు గాన «అజామేకాం» అను శ్రుతియందొక్కటి యని చెప్పియుండుట విరోధించును. తేజోబన్నములనేకము లయినను, త్రివృత్కరణముచే నవి యొక్కటి యగుచున్నవి యని

చెప్పదవేమో ? అట్లు చెప్పందగదు. ఏలననఁగా, త్రివృత్కరణముచేసినను, బహుత్వము పోదు. "తాసాంత్రి వృతం త్రివృతమేకైకాం కరవాణి" అను శ్రుతివాక్యము "పృథివ్యప్తేజస్సులలో నొక్కొక్కటి మూఁడు మూఁడు భాగములుగలదిగాఁ జేయఁబడుచున్నది యనిగదా తెలుపుచున్నది. రెండవపక్షము నయితము యుక్తముకాదు. ఏలననఁగా, ఈపక్షమున నొక్కటి యడుగవలసి యున్నది. తేజోబన్నరూపముగ వికారమునుబొందిన బ్రహ్మమే అజయా ? కాక,స్వస్వరూపములోనుండినదై వికారము నెద్దియునుబొందని బ్రహ్మమే యజ యా? వీనిలో మొదటిపక్షమున బహుత్వము పొసగదుగాన నదియు క్తము కాదు. రెండవపక్షము నవలంబించితిమేని, "లోహితశుక్లకృష్ణాం"అనునది విరో ధించును. కావున స్వస్వరూపములోనున్నట్టి బ్రహ్మము తేజోబన్న లక్షణమైన దియని చెప్పుటయశక్యము. మూఁడవ పక్షముననను, అజాశబ్దముచే తేజోబన్న ములను నిర్దేశించి యాతేజోబన్నశబ్దములు వాటికారణావస్థను తెలుపుచున్న వని నిర్ణయింపవలసివచ్చును. అయితే అంతకంటెను అజాశబ్దము శ్రుతియం దుఁదెలుపఁబడిన ప్రకారము తేజోబన్నముల కారణావస్థను తెలుపునది యను టయే మంచిది.

అయితే "అజా" అనఁగా భాషయందుమేక యనియర్థముగాన నిచట ప్రకృతియందు మేక యను కల్పనను శ్రుతి యుపదేశించుచున్నదనియును మీరు చెప్పుచున్నారు. అందువలని ప్రయోజనము లేదుగాన నదియు నసంగతము. "ఆత్మానం రథినం విద్ధి" ఇత్యాదితావుల బ్రహ్మప్రాప్తికిగానగు నుపాయమును తెలుపుటకుగాను శరీరాదులు రథాదులుగాను కల్పింపఁబడుటయును, వస్వాదుల మనమున నొక భోగ్యవస్తువనెడి తలంపును గలుగఁజేయుటకై యాదిత్యుని మధువునుగా గల్పించుటయును ఉపయోగపడునట్లు, ప్రకృతియందు మేక యనెడి కల్పనకు ఉపయోగమేమున్నది? ఇటు ఉపయోగము లేకపోవుట మా త్రమేకాదు,విరోధమున్ను ప్రాప్తించును. అదియెట్లనిన, ప్రకృతి యచేతనము. జగత్తుకంతటికిని కారణభూతమైనది. తనతో సంబంధించినచేతనులగు జీవులం దఱియొక్కయును సుఖదుఃఖములకును మోక్షమునకును హేతుభూతమైనది. మేకయన్ననో, చేతనము కొన్ని జంతువులను మాత్రము కనునది. కొందఱితోను మాత్రము సంబంధము గలది.దీని యుపయోగమున్ను బహుస్వల్పము. తాను వదలుటకు తాను కారణముకాదు.తనతో సంబంధించినవారిచే వదలఁదగినది. ఇట్లుండ,ప్రకృతిని ఇట్టి మేకతోఁబోల్చుట యనునది యెంతమాత్రము పొసగదు. విరుద్ధమే. మరియు, "అజామేకాం" అనియు, "అజోహ్యేకః" అనియు,

"అజోన్యః" అనియు నీతావులలో నొక్కొక్క తావునను "అజ"శబ్దమునకు వేఱువేఱు అర్థములఁజెప్పుటయును మంచిది కాదు. "అజ"శబ్దమును ప్రయోగించినతావుల నంతటను మేక యనెడి కల్పనయే చేయబడుచున్నదంటివేని, యిదియును యుక్తము గాదు. ఏలననఁగా "జహాత్యేనాం భుక్తభోగామజోన్యః" అను వాక్యము విద్వాంసుఁడు ప్రకృతితో సంబంధమును బొత్తుగ వదలుచున్నాఁడనిగదా తెలుపుచున్నది. ఇట్లుండ, ఈ తావున వీనితోఁగాని వేఱొక్కనితోఁగాని సంబంధముగలదియగు మేకను అజాశబ్దము తెలుపుననుట మిక్కిలి విరుద్ధము.

చమసాధికరణము ముగిసెను.

## సంఖ్యోపసంగ్రహాధికరణము.

౧౧ ॥ సూ ॥ సంఖ్యోపసఙ్గ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ

టీ ॥ సంఖ్యోపసంగ్రహాదపి=ఇరువదియైదను సంఖ్య శ్రుతియందు గన్పట్టుచున్నను, న=ఇచ్చట సాంఖ్యమత ప్రసిద్ధములగు తత్త్వములు చెప్పఁబడలేదు. ఏలననఁగా, నానాభావాత్=ఇవి వాటికంటె వేఱయిన వయినందునను, అతిరేకాచ్చ=ఎక్కువసంఖ్యగలవయిన వైనందునను.

తా ॥ "పంచపంచ" ఇత్యాది శ్రుతివాక్యమునందలి "పంచపంచ" అనుశబ్దముచే అయిదయిదులు అను సంఖ్య ప్రతిపాదింపఁబడినను, ఇచట సాంఖ్యమత ప్రసిద్ధములగు తత్త్వము లుపదేశింపఁబడుచుండలేదు. ఏలననఁగా, ఇందు ఉపదేశింపఁబడినవి వాటికంటెను వేఱయినవియును ఎక్కువ సంఖ్యగలవియును.

శ్రీ ॥ భా ॥ వాజసనేయులు "యస్మిన్ పఞ్చపఞ్చజనా ఆకాశశ్చప్రతిష్ఠితః తమేవం మన్యఆత్మానం విద్వాన్ బ్రహ్మామృతోమృతం" (బృ. ౬ అ. ౪ బ్రా. ౧౭ వా) (దేనియందుఁ బ్రకాశస్వరూపుఁడగు పురుషుండుచేరి 25 తత్త్వములు ప్రతిష్ఠితములై యున్నవో, ఆ వ్యాపకశీలుండగు పురుషుని నెవఁడు తెలిసికొనుచున్నాఁడో, వాఁడు అమృతుండై మోక్షమును బొందుచున్నాఁడు) అని పఠించుచున్నారు. ఇందొక సంశయముగలుగుచున్నది.

### సంశయము.

ఈ మంత్రము సాంఖ్యమత ప్రసిద్ధములగు తత్త్వములను ప్రతిపాదించునదియా? కాదా?

70a

## పూర్వపక్షము.

ఈ పై శ్రుతివాక్యము సాంఖ్యమత ప్రసిద్ధములగు తత్త్వములను ప్రతిపాదించునది యనఁదగును. ఏలననఁగా, నిచట పంచశబ్దముచే విశేషింపఁబడిన పంచజనశబ్దమునుండి (అయిదయిదులు ఇరువదియైదు) అని చెప్పియుండుటంజేసి యిరువదియైదు తత్త్వములు తెలియవచ్చుచున్నవి. అది యెట్లనిన, ఈ తావున "పంచజనాః" అను పదము సమాహార సమాసముగలది. అనఁగా సముదాయమును తెలుపునది. "పంచానాం జనానాం సమాహారః=పంచజనాః" అని విగ్రహవాక్యము. పంచపూల్యః "అయిదుకుప్పలు" అన్నట్లు ఇదియు నయిదింటి సమూహమును తెలుపునది. "పంచజనాః" అనుపదము (నపుంసకలింగమునఁ బ్రయోగింపఁబడక) పుల్లింగమునఁ బ్రయోగింపఁబడుట ఛాందసము. అట్టి సమూహములెన్నియనెడి వివక్షరాఁగా, "పంచపంచ జనాః" అనుతావుననుండు మొదటి "పంచ" శబ్దము రెండవ పంచశబ్దమునకు విశేషణమై యవి యయిదని తెలుపుచున్నది. అయిదుగల యయిదు కుప్పలు అన్నట్లు ఏరుంగునది. కావున "పంచపంచజనాః" అనువాక్యమువలన ఇరువదియైదు పదార్థములు తెలియవచ్చుచుండగా, నవి యేవి యనెడి వివక్షరాఁగా, ఇది మోక్షప్రకరణమైనందున నిచట ముముక్షువులచేఁ దెలియవలసినవి గాను, సాంఖ్య స్మృతి ప్రసిద్ధములగు ప్రకృతి మొదలగునవియే యుపదేశింఁబడినట్లు తెలియవచ్చుచున్నది. "మూలప్రకృతి రవికృతిర్మహదాద్యాః ప్రకృతి వికృతయస్సప్త। షోడశకశ్చవికారోన ప్రకృతిర్న వికృతిః పురుషః" (దేనియొక్కయును వికారముకానిదియగు మూల ప్రకృతియు, ప్రకృతులును వికృతులును నగు మహత్తు మొదలగునవి అనఁగా మహత్తత్త్వము=అంతఃకరణము—బుద్ధి అహంకారము పంచ సూక్ష్మతన్మాత్రలు అనునవి యేడును వికారభూతములు మాత్రమునగునవి పదునారు అనగా పంచస్థూలతన్మాత్రలును, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు అనునవి పదునాఱును ప్రకృతియును వికృతియును కానివాఁడగు పురుషుండును) అనునవి గదా సాంఖ్యస్మృతియందు (ముముక్షువులచేఁ దెలియవలసినవిగా) ప్రసిద్ధములు. కావున నీపై శ్రుతివాక్యము సాంఖ్యసిద్ధాంత ప్రసిద్ధములగు తత్త్వములను ప్రతిపాదించునదియనిన,

## సిద్ధాంతము.

"పంచపంచజనాః" అను వాక్యమున ఇరువదియైదను సంఖ్య చెప్పఁబడినట్లంగీకరించినను, అచట సాంఖ్య సిద్ధాంత ప్రసిద్ధములగు తత్త్వములు చెప్పఁబడినట్లు తెలియవచ్చుచుండలేదు. ఏలననఁగా, ఈతావున అయిదయి

దులుగాఁ బేర్కొనంబడిన జనములనునవి సాంఖ్య తంత్రప్రసిద్ధములగు వాని కంటెను వేఱయినవిగాను తెలియవచ్చుచున్నవి. అది యెట్లనిన, ఇవి "యస్మిన్ పఞ్చపఞ్చజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః" (ఏ పరబ్రహ్మమున అయిదయిదులగు జనములును ఆకాశమున్ను నెలకొనియున్నవో) అను వాక్యమున "యస్మిన్" అను యచ్ఛబ్దముచే దెలుపఁబడిన పరబ్రహ్మము నాశ్రయించిన వగుటచే బ్రహ్మాత్మకము లయినవిగాను గదా తెలియవచ్చుచున్నవి. అచట యచ్ఛబ్దముచేఁ దెలుపఁబడినదానినే "తమేవమన్య ఆత్మానం విద్వాన్బ్రహ్మామృతోఽమృతం" అనుతావున "తం" అను తచ్ఛబ్దముచేఁ బరామర్శించుటను బట్టి పూర్వము యచ్ఛబ్దముచేఁ దెలుపబడిన పఞ్చ జనములనునవి సాంఖ్య తంత్ర ప్రసిద్ధములగు తత్వములు కావు. మరియు ఈ తావునఁ బ్రతిపాదింపఁబడినవి ఇరువదియైదు కంటెను యెక్కువయినవిగానును తెలియవచ్చుచున్నవి. ఏలననిన, యచ్ఛబ్దముచేఁ దెలుపఁబడిన బ్రహ్మమున్ను ఆకాశమున్ను ఎక్కువ. కావున, "తంషడ్వింశక మిత్యాహుః సప్తవింశమథాపరే" (పరమాత్మను ఇరువదియారవ వానినిగా కొందరును ఇరువదియేడవ వానినిగాను మరికొందరును చెప్పుచున్నారు) అను శాస్త్రవాక్యమునఁ బ్రసిద్ధములగు సమస్తతత్వములకును ఆశ్రయ భూతుఁడును సర్వేశ్వరుండునునగు పరమపురుషుండే యీతావునఁ దెలియఁ జేయఁబడుచున్నాడు. సూత్రమునందుండు "అపి" అనుశబ్దమువలన "పఞ్చపఞ్చజనా" అనుతావున ఇరువదియైదు తత్వములు తెలియవచ్చుటయే యసంభవమను యభిప్రాయము సూచితము. అది యెటులనిన, వారిమతమున అయిదింటిచేఁగలుగఁజేయఁబడిన అయిదయిదులుగల సమూహము లే యుండుట యసంభవముగదా! వారి మతమున, అయిదింటిచే గలుగఁజేయఁబడినట్టి అయిదయిదులుగల యొక జాతి మొదలగునది లేదు. ఒకవేళ వారిమతమున పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, పంచమహాభూతములు, పంచతన్మాత్రలు తక్కనవి యయిదునుగలవుగాన నట్టి యవాంతర సంఖ్యయుండుటకు నిమిత్తముగల దంటివేని, యదియు క్తముకాదు. ఆకాశము వేఱుగాఁ జెప్పఁబడినందున అయిదింటిచేఁ గలుగఁజేయఁబడిన సమూహ మొక్కటియున్నట్లు సిద్ధింపదు. కాఁబట్టి "పంచ పంచజనాః" అనుతావున నుండునది సమాహార సమాసము కాదు. అయితే యిది "దిక్ సంఖ్యేసంజ్ఞాయాం" అను వ్యాకరణ సూత్రప్రకారము సంజ్ఞను బట్టివచ్చినది. అట్లు కాకున్న, అనఁగా సమాహార సమాసమగు పక్షమున, "పఞ్చపఞ్చజనాః" అనుతావున లింగము భేదించును. కావున పంచజనము

లబడునవి కొన్నికలవు అవియయ్యిదని మాత్రమే యిచట చెప్పఁబడుచున్నది. ‹‹ సప్తసప్తర్షయః ›› అని చెప్పుచుండలేదా! అట్లె ఇచటను నెఱుంగునది.

అవతారిక :—పంచజనము లనఁబడునవి యేవియనఁగా,

౧౨ ॥ సూ ॥ ప్రాణాదయోవాక్యశేషాత్.

టీ॥ వాక్యశేషాత్ =ఉత్తరవాక్యమునుబట్టి, ప్రాణాదయః = పంచజనములనఁగా ప్రాణాదులని తెలియుచున్నది.

తా॥ ఉత్తరవాక్యమునుబట్టి పంచజనులనగా ప్రాణాదులని తెలియుచున్నది.

శ్రీ ॥ భా॥ ‹‹ ప్రాణస్య ప్రాణముత చక్షుషశ్చక్షుః శ్రోత్రస్య శ్రోత్రమన్నాస్యాన్నం మనసోమనో యే విదుః ›› (ప్రాణమునకును ప్రాణమువంటివాఁడును, చక్షుస్సునకును చక్షుస్సువంటివాఁడును, శ్రోత్రమునకును శ్రోత్రమువంటివాఁడును, అన్నమునకును అన్నమువంటివాఁడును, మనస్సునకును మనస్సువంటివాఁడునునగు వానిని యెవరు తెలిసికొనుచున్నారో) అను ఉత్తరవాక్యమువలన పంచపంచజనులను నవిప్రాణాదులుగాఁ దెలియవచ్చుచున్నవి.

అవతారిక:—అయితే కాణ్వశాఖయందును మాధ్యందినుల శాఖయందును ‹‹యస్మిఁ పంచపంచజనాః ›› అను పాఠము సమానమేయయినను, ‹‹ప్రాణస్యప్రాణం›› ఇత్యాది వాక్యశేషమున కాణ్వుల శాఖయందు అన్నము పఠింపఁబడుచుండలేదే? ఇట్టుండ, పంచపంచజనులనునవి ప్రాణాదులని నిశ్చయించుట యశక్యమని శంకింపఁగా, నందులకు సమాధానముచెప్పుటకై :—

౧౩ ॥ సూ ॥ జ్యోతిషైకేషా మసత్యన్నే.

టీ॥ ఏకేషాం=కాణ్వశాఖీయుల పాఠమున, అసత్యన్నే =అన్నము పేర్కొనఁబడకపోయినను, జ్యోతిషా=జ్యోతిస్సుచే (ప్రాణాదులు తెలియఁబడుచున్నవి).

తా॥ కాణ్వుల శాఖయందు అన్నము పేర్కొనఁబడకపోయినను అచట పేర్కొనఁబడిన జ్యోతిస్సునుబట్టి పంచజనములనఁగా ప్రాణాదులని తెలియుచున్నది.

శ్రీ ॥ భా ॥ కాణ్వశాఖీయుల పాఠమున అన్నము పేర్కొనఁబడకపోయినను, జ్యోతిస్సునుబట్టి పంచజనములనఁగా ఇంద్రియములని తెలియుచున్నది. వారి పాఠమునందలి వాక్యశేషము నిచటనుదహరించినది. నిదర్శనార్థమని యెఱుంగునది. అది యెట్లనిన, ‹‹ యస్మిన్ పఞ్చపఞ్చజనాః ›› ఇత్యాది వాక్యమునకు ముందుండు ‹‹ తం దేవాజ్యోతిషాం జ్యోతిరాయుర్హో పాసతేఽమృతో

వృతః" అను వాక్యమున జ్యోతిస్సులకును జ్యోతిస్సుగాను బ్రహ్మము పేర్కొ
నఁబడుటచే బ్రహ్మముయొక్క సంకల్పమున కధీనముగా తమకార్యములకా
నర్పునవియగు కొన్నిజ్యోతిస్సులున్నట్లు తెలియుచున్నది. అయితే ‹‹పంచపంచ
జనాః" అను వాక్యమున పంచజనములనగా పలానివియని చెప్పియుండనందున
నవియే విషయములను ప్రకాశింపఁజేయునట్టి ఇంద్రియములని తెలియుచున్నది.
ఈ పై వాక్యమున ‹‹ ప్రాణస్య ›› అను పదముచే స్పర్శనేంద్రియము తెలుపఁ
బడుచున్నది. [1] ఏలననఁగా స్పర్శనేంద్రియము వాయువుతో సంబంధించినది.
[2]మరియుజ్యోతిశ్శబ్దము ముఖ్యప్రాణమును తెలుపుట యసంభవము. ‹‹చక్షుషః››
అను తావున చక్షుస్సనగా నేత్రేంద్రియము. శ్రోత్రస్య" అనుతావున శ్రో
త్రమనఁగా శ్రవణేంద్రియము. ‹‹ అన్నస్య ›› అనుతావున అన్న శబ్దము ఘ్రా
ణేంద్రియమును రసనేంద్రియమునున్ను తెలుపును.

అదియెట్లనిన,అన్న మనఁగా పృథివి.ఘ్రాణేంద్రియము పృథివితోసంబంధించిన
దిగాన,నిచట పృథివీవాచకమగు అన్నశబ్దము ఘ్రాణేంద్రియమును తెలుపును.
‹‹ అద్యతేఽనేనేతి అన్నం=దీనిచే అన్నమురుచిచూడబడుచున్నది ›› అను
వ్యుత్పత్తిసిబట్టి యన్న శబ్దము రసనేంద్రియమును తెలుపును. ‹‹ మనసః ››
అనఁగా మనస్సు. ఈతావున అన్నశబ్దము ఘ్రాణేంద్రియమును రసనేంద్రి
యమునున్ను తెలుపునదిగాను గ్రహింపఁబడుటంజేసి పంచసంఖ్యయును విరు
ద్ధము కాదు. కావున విషయములను తెలుపునవియును; మనస్సుపర్యంతము
లునగు ఇంద్రియములు ఈ తావున పంచజన శబ్దముచేఁ దెలుపఁబడుచున్నవి.
అట్టి సంఖ్యకు విరోధము లేకుండుటకుగాను నిచట అన్నశబ్దము ఘ్రాణ రస
నేంద్రియములను రెంటిని తెలుపునదిగాను తంత్రముగ గ్రహింపఁబడినది.
కావున నిట్లు ‹‹ యస్మిన్పఞ్చపఞ్చజనా ఆకాశశ్చ ప్రతిష్ఠితః ›› అను వాక్య
మున పంచజనశబ్దముచేఁ దెలుపఁబడిన యింద్రియములును, ఆకాశశబ్దముచే
నిర్దేశింపఁబడిన మహాభూతములును బ్రహ్మమున నెలకొనియున్నవని తెలి
యుచున్నది. కావున ఈపై వాక్యమునందు సర్వతత్త్వములు బ్రహ్మము నాశ్ర
యించియుండునవియని ప్రతిపాదించియుండుటచే నిచట సాంఖ్యసిద్ధాంత ప్రసి
ద్ధములగు తత్త్వముల ప్రసక్తియే లేదు. కావున ఉపనిషత్తులలో నన్ని తావు

(1) స్పర్శనేంద్రియము వాయువునందు లీనమగుటంజేసి వాయువుతో సంబంధించినది.

(2) ప్రాణమనఁగా ప్రాణవాయువనియును ముఖ్యప్రాణమనియును అర్థము కలదు. ఈతావున ప్రాణశబ్దమును ముఖ్యప్రాణపరముగా గొనకపోవుటకుఁ గారణమేమనఁగా ‹‹జ్యోతిషాంజ్యోతిః››అను తావుననుండు ‹‹జ్యోతిషాం››అను జ్యోతిశ్శబ్దము ముఖ్యప్రాణము ను తెలుపఁజాలదు.

లను సంఖ్య చేర్చుకొనఁబడినను, చేర్చుకొనఁబడకపోయినను సాంఖ్యమతప్రసిద్ధములగు తత్త్వములు తెలుపఁబడుచుండలేదని సిద్ధమగుచున్నది.

సఙ్ఖ్యోపసంగ్రహాధికరణము ముగిసెను.

## కారణత్వాధికరణము.

౧౪॥ సూ॥ కారణత్వేన చాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః

టీ॥ ఆకాశాదిషు=ఆకాశాదుల విషయమున, కారణత్వేన = కారణముగాను, యథావ్యపదిష్టోక్తేః= బ్రహ్మము పూర్వము చెప్పఁబడినట్టిదిగానే చెప్పఁబడినందున.

తా॥ ఆకాశాదులవిషయమై కారణముగాఁ జెప్పఁబడినబ్రహ్మము పూర్వము చెప్పఁబడినట్టిదిగానే చెప్పఁబడినందున యంతటను బ్రహ్మమేజగత్కారణము.

## పూర్వపక్షము.

శ్రీ॥ భా॥ మరల సాంఖ్యుం డిట్లు వాదించుచున్నాఁడు:—ఉపనిషత్తుల యందు ఒక్కదాని నుండియే సృష్టి గలుగుచున్నట్లు చెప్పియుండనందునఁ, జగత్తునకు బ్రహ్మమొక్కటియే కారణమనుట యుక్తము కాదు. అది యెట్లనిన, "సదేవ సౌమ్యేద మగ్రఆసీత్" (ముందు ఇది సత్తుగానేయుండెను) అనుశ్రుతి వాక్యము సత్తనంబడు దానినుండి సృష్టిగలుగుచున్నట్లు తెలుపుచున్నది. "అసదేవేదమగ్రఆసీత్" (మొదట యిది అసత్తుగానే యుండెను) అనుశ్రుతివాక్యము అసత్తునుండి సృష్టి గలుగుచున్నదనియును తెలుపుచున్నది. వేఱొక్కతావున "అసదేవేదమగ్రఆసీత్తత్సదాసీత్తత్సమభవత్" (ముందు ఇది అసత్తుగానేయుండి యది సత్తయినృజించెను) అనియును చెప్పఁబడియె. కావున సృజించినదిట్టిదియనెడి నిశ్చయము ఉపనిషత్తులయందు లేనందున జగత్తునకుఁ గారణము బ్రహ్మమేయని నిశ్చయించుట యశక్యము. అయితే ప్రకృతియే దీనికిఁగారణమని నిశ్చయించుట శక్యము. ఏలననఁగా, "తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీత్" అనువాక్యమున అవ్యాకృతమగు ( అస్పష్టమగు ) ప్రకృతియందు జగత్తుయొక్క ప్రళయమును జెప్పి, "తన్నామరూపాభ్యాం వ్యాక్రియత" (అది నామరూపములతో స్పష్టపడెను) అనువాక్యమున నట్టి యవ్యాకృతమగు దానినుండి జగత్తు గలుగుచున్నట్లును చెప్పఁబడుచున్నది. అవ్యాకృతమనఁగా నవ్యక్తము. నామరూపములతో స్పష్టముకానిదియని యవ్యక్తశబ్దమున కర్థము. ఆ యవ్యక్తము ప్రకృతియే. దీనిస్వరూపము నిత్యమగుటనుబట్టియు, మార్పునొందునది యగుటనుబట్టియును జగత్కారణ ప్రతిపాదక వాక్యములయందుండు సచ్ఛబ్దాసచ్ఛబ్దములు బ్రహ్మమును దెలుపువిషయమున వలెనే దీనిఁ దెలుపువిష

యమునను విరోధింపవు. ఇట్లు అవ్యాకృతమే (అవ్యక్తమే) జగత్కారణమని నిశ్చితము కాఁగా, కారణవస్తువుతో సంబంధించినవిగాను చెప్పఁబడిన ఈక్షణాదులు సృష్ట్యాన్మఖ్యమును తెలుపుటయం దభిప్రాయము గలవియని యెఱుంగునది. అట్టివాక్యములయందుండు "బ్రహ్మ" "ఆత్మ" శబ్దములు క్రమముగ బృహత్త్వమును వ్యాపిత్వమునున్ను తెలుపునవి యగుటంజేసి యవి ప్రకృతినే తెలుపునవి. కావున నిట్లు సాంఖ్యస్మృతి ప్రతిపాదితమును న్యాయసిద్ధమునునగు ప్రకృతియే జగత్కారణముగాను ఉపనిషత్తులయందుఁ బ్రతిపాదింపఁబడుచున్నది.

## సిద్ధాంతము.

ఇట్లు పూర్వపక్షముగాఁగా నిందులకు సమాధాన మిట్లు చెప్పఁబడుచున్నది—సర్వజ్ఞుండును, సర్వేశ్వరుండును, సత్యసంకల్పుండును, నిరస్తనిఖిలదోషుండునునగు పరబ్రహ్మమునుండియే జగత్తు ఉత్పన్నమగుచున్నదని నిశ్చయింపవచ్చును. ఏలననఁగా, అట్లు గాన్పింపఁబడినదియే కదా ఆకాశాదులవిషయమునఁ గారణముగాను చెప్పఁబడినది. అట్లు గాన్పింపఁబడినది యనఁగా సర్వజ్ఞత్వాది గుణవిశిష్టముగాను గాన్పింపఁబడినది యని యర్థము. సూత్రమునందుండు "యథావ్యపదిష్టం=అట్లుగాన్పింపఁబడిన" అనుపదము "జన్మాద్యస్యయతః" (బ్ర. సూ. ౧. అ. ౧. పా. ౨. సూ.) ఇత్యాది సూత్రములచే ప్రతిపాదింపఁబడిన బ్రహ్మమనెడి యర్థము గలది. అట్టి బ్రహ్మమొక్కటియే కదా ఆకాశాదుల విషమునఁ గారణముగాను శాస్త్రమునఁ జెప్పఁబడుచున్నది. అది యెట్లనిన, "తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశస్సంభూతః" (తై. ఆ. ౧. ౨.) (ఈయాత్మనుండి ఆకాశము కలిగినది) అనియు, "తత్తేజోసృజత" (ఛాం. ౬. ౨. ౩.) (ఆబ్రహ్మము తేజస్సును సృజించెను) అనియు, నీమొదలగుతావుల సర్వజ్ఞమగు బ్రహ్మమే జగత్కారణముగాను చెప్పఁబడుచున్నది. దీని యభిప్రాయ మేమనఁగా, "సత్యంజ్ఞాన మనంతం బ్రహ్మ" అనియు, "సోశ్నుతే సర్వాన్కామాన్ సహబ్రహ్మణా విపశ్చితా" అనియు నీమొదలగుతావుల ప్రకరణావగతమును, సర్వజ్ఞమునునగు బ్రహ్మమే "తస్మాద్వా ఏతస్మాత్" అనువాక్యమునఁ బరామర్శింపఁబడుచున్నది. అట్లే "తదైక్షత బహుస్యాం" అనుతావున సర్వజ్ఞముగాఁ జెప్పఁబడిన బ్రహ్మమే "తత్తేజోసృజత" అనుతావునఁ బరామర్శింపఁబడుచున్నది. ఇట్లే సృష్టిని ప్రతిపాదించువాక్యములయందంతటను యోచించుకొనునది. కావున జగత్తు బ్రహ్మమే కారణముగాఁ గలదియని నిశ్చయింపఁబడుచున్నది.

అయితే "అసద్వా ఇదమగ్ర ఆసీత్" అనుతావున అసత్తు జగత్కారణముగాను చెప్పఁబడుచుండ, సర్వజ్ఞుండును, సత్యసంకల్పుండునునగు బ్రహ్మ

మే జగత్కారణమని యేల నిశ్చయింపకూడదనని శంకింపగా,

౧౫॥ సూ॥ సమాకర్షాత్

టీ॥ సమాకర్షాత్ =పరామర్శింపుటవలన,

తా॥ పరామర్శనుబట్టియు బ్రహ్మమే జగత్కారణముగాఁ దెలియ వచ్చుచున్నది.

శ్రీ॥ భా॥ “అసద్వా ఇదమగ్ర ఆసీత్” (తై. ఆ. ౭. ౧.) అనుతావు నను, సర్వజ్ఞమును, ఆనందమయమును, సత్యసంకల్పమునునగు బ్రహ్మమే ప రామర్శింపఁబడు చున్నది. అది యెట్లనిన, “తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయా దన్యోఽన్తర ఆత్మాఽఽనన్దమయః” (తై.ఆ.౫.) అనియు, “సోఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి” అనియు, “ఇదం సర్వమసృజత యదిదం కిఞ్చ, తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్, తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్” అనియునీమొదలగు బ్రాహ్మణవాక్యములు ఆనందమయమగు బ్రహ్మముసత్యసంకల్పమును, సర్వమును సృజించినదియును, అన్నింటిలో ప్రవేశించుటచే సది యన్నింటికి నాత్మభూతమైనదియునని చెప్పి, ఇట్లు చెప్పినదానికి సాక్షిగాను “అసద్వా ఇదమగ్ర ఆసీత్” అను శ్లోకము నుదహరించు చున్నవి. అట్లే తరువాతివాక్యములలోను “భీషాస్మాద్వాతః పవతే” అనుతావు నట్టిబ్రహ్మమునే పరామర్శించి దాని సర్వనియామకత్వ,నిరతిశయానంద త్వాది గుణములు చెప్పఁబడు చున్నవి. కావున నీపైమంత్ర మట్టిబ్రహ్మమును గుఱించినదియే. అట్టి సమయమున అనఁగా సృష్టికి పూర్వమున నామరూప విభాగ మెద్దియును లేకుండుటం జేసి యదియే యట్టిసమయమున “అసత్” అని వ్యవహరింపఁ బడుచున్నది. “అసదేవేద మగ్రఆసీత్” అను వాక్యమునను ఇవ్విధముగానే స్వర్వహించుకొనునది.

అయితే “తద్ధేదంతర్హ్యవ్యాకృతమాసీత్” అనుతావున ప్రకృతియే జగత్కారణముగాను చెప్పఁబడుచున్నదని పూర్వపక్షి చేయువాదము యుక్తమైనది కాదు. ఏలననఁగా, అచటను అవ్యాకృత శబ్దముచే అవ్యాకృత శరీరము గల (నామరూప విభాగము లేని) బ్రహ్మమే తెలుపఁబడు చున్నది. అది యెట్లనిన, “సఏష ఇహప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః పశ్యన్ చక్షుశ్శృణ్వన్ శ్రోత్రంమన్వానోమన ఆత్మేత్యేవోపాసీత” (బృ. ౩. ౪. ౭.) అనువాక్యమునందు “సఏష” అను శబ్దముచే పూర్వము అవ్యాకృత శబ్దముచేఁ దెలుపఁబడినదియే యన్నింటిలోను ప్రవేశించి వాటిని నియమించునదిగాను పరామర్శింపఁ బడుచున్నది. ఏలననఁగా, “తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్” అనియు, “అనేన జీవేనాత్మనాను ప్రవిశ్య నామరూపేవ్యాకరవాణి” అనియు నీమొ

దలగు తావుల స్రష్టగాను సర్వజ్ఞుండుగాను చెప్పఁబడిన బ్రహ్మమే కార్యపదార్థములలోఁ బ్రవేశించి వాటికి నామరూపములఁ గలుగఁజేసినదిగాను బ్రసిద్ధిగలది. అన్నింటిలోఁ బ్రవేశించుటయనునది వాటిని నియమించుటకుగానని «అన్తఃప్రవిష్టశ్శాస్తా జనానాంసర్వాత్మా'' అనువాక్యమువలనఁ దెలియఁవచ్చుటం జేసి యచేతనమగు ప్రకృతి కట్టి ప్రవేశముండుట యసంభవము. కావున అవ్యాకృతమనఁగా అవ్యాకృత శరీరముగల బ్రహ్మము. అట్లు సృష్టికి పూర్వము నామరూప విభాగములేని బ్రహ్మము సృష్టిసమయమున స్వయముగానే నామరూప విభాగము గలదిగా నగుచున్నదని «తన్నామ రూపాభ్యాం వ్యాక్రియత'' అనువాక్యము తెలుపుచున్నడి. ఇట్లు అర్థముచేసికొనినచో, శ్రుతియందుఁ జెప్పఁబడిన ఈక్షణాదులు సయితము ముఖ్యములే యగును. మరియు ప్రకృతి నిరతిశయ బృహత్త్వము గలదియు, నియమనమునకుగాను నన్నింటిలో వ్యాపించియుండునదియును కానందున, నట్టి గుణములఁ దెలుపు « బ్రహ్మ '' శబ్దమును «ఆత్మ'' శబ్దమును ప్రకృతిని యెంతమాత్రము తెలుపఁజాలవు. ఈహేతువులను బట్టి జగత్తు బ్రహ్మమే కారణముగాఁ గలదని సిద్ధమగుచున్నది.

కారణత్వాధికరణము ముగిసెను.

## జగద్వాచిత్వాధికరణము.

### ౧౬॥ సూ॥ జగద్వాచిత్వాత్

టీ॥ జగద్వాచిత్వాత్ = కర్మశబ్దము జగద్రూపమగు కార్యమును దెలుపునదయినందున,

తా ॥ కర్మశబ్దము జగద్రూపమగు కార్యమును తెలుపుటం జేసియు నిచట జీవుండుఁ పేర్కొనఁబడలేదు.

## పూర్వపక్షము.

శ్రీ॥ భా ॥ మరల సాంఖ్యుఁ డిట్లు వాదించుచున్నాడు:—వేదాంతవాక్యములు చేతనవస్తువును జగత్కారణమునుగాఁ బ్రతిపాదించుచున్నను, సాంఖ్యసిద్ధాంత ప్రసిద్ధములగు ప్రకృతిపురుషులకంటెను వేఱయిన వస్తువొక్కటి జగత్కారణముగాఁ దెలియవలసినదిగాను వేదాంతవాక్యములనుండి తెలియవచ్చుచుండ లేదు. అదియెట్లనిన, కౌషీతకులు బాలాకికిని అజాతశత్రువునకు జరిగిన సంవాదమును పఠించు సందర్భమున, కర్మఫలభోక్తయగు జీవునే కారణవస్తువునుగాఁ దెలిసికొనునదియని పఠించుచున్నారు:—అదియెట్లనిన, «బ్రహ్మతే బ్రువాణి'' (నీకు బ్రహ్మముఁ దెలిపెదను) అని యారంభించి «యోవైబాలాక ఏతే

షాం పురుషాణాం కర్తా యస్య వై తత్కర్మ స వై వేదితవ్యః'' (ఓ బాలాకి యెవం డు ఈపురుషులకు కర్తయో, యీకర్మ మెవ్వనిదో, అనఁగా ఎవనితో సంబం ధించినదో, వాడు తెలియవలసినవాడు) అను వాక్యమున బాలాకి తానుప్ర స్తావించిన ప్రశ్నమున కతండుప్రత్యుత్తర మీయనేరనందున అజాతశత్రువే వానికి ‹‹స వై వేదితవ్యః'' (అతఁడే యెఱుంగవలసినవాఁడు) అని బ్రహ్మ ము నుపదేశించెను. ఈతావున ‹‹యస్య వై తత్కర్మ'' (ఇదియెవనితో సంబంధించిన కర్మమో) అను వాక్యమునఁ జెప్పఁబడిన కర్మసంబంధ మునుబట్టి ప్రకృతి నధిష్ఠించియుండు వాడును, కర్మఫలభోక్తయునగు పురుషుండే యిచట తెలియవలసిన వాడుగా నుపదేశింపఁబడిన బ్రహ్మమని నిశ్చయింపఁ బడుచున్నది. వేఱొక్కనికిఁ గర్మసంబంధ మున్నట్లు అంగీకరించియుండలేదు. గదా! కర్మ మనునది పుణ్యపాప రూపమైనది. అది జీవునికే యుండుట సంభ వము. ‹‹క్రియత ఇతికర్మ'' (చేయబడునది కర్మము) అను శబ్దవ్యుత్పత్తినిబట్టి ప్రత్య క్షాది ప్రమాణగోచరమగు జగత్తే యట్టి కర్మమనియు, ఈ జగమంతయు ఎవ్వ ని కృత్యమో, వాడు తెలియవలసిన వాడనుటచే జీవుని కంటెను వేఱయిన వస్తువే యిచట తెలియ వచ్చుచున్నదనియును చెప్పఁదగదు. అటయినచో ‹‹యో వై బాలాక ఏతేషాం పురుషాణాం కర్తా యస్య వై తత్కర్మ'' (ఎవఁడు ఈ పురుషులకు కర్తయో, ఇది యెవ్వని కర్మమో) అను తావున మరల కర్మము ను గుఱించి చెప్పుట నిరర్థక మగును. మరియు లోకమునందును, శాస్త్రమునం దును కర్మశబ్దము పుణ్యపాపరూపమగు కర్మమునే తెలుపుటయందు ప్రసిద్ధి గలది. మరియు భోక్తలగు జీవుల కర్మమునకుగానే జగత్తు సృజింపఁబడుటనుబట్టి యును, యిచట పురుషులకుఁ గర్తగాఁ జెప్పఁబడినవాడు జీవుండగుట యుప పన్నము. ఈపై శ్రుత్యర్థ మెట్లనగా, ఆదిత్య మండలమున నుండునట్టి జీవుని భోగ్యభోగోప కరణములగు పురుషులకు ఎవఁడు కారణభూతుండో, ఇట్లు కార ణమగుటకు హేతుభూతమగునట్టి పుణ్యపాప రూపమగు కర్మము ఎవ్వనిదో, వాడు తెలియవలసినవాడు అనఁగా వాని స్వరూపము ప్రకృతికంటెను వేఱయిన దిగాను తెలిసికొనవలసినది యని యర్థము. అట్లే ఉత్తరవాక్యములయందును ‹‹తౌ హ సుప్తం పురుష మాజగ్మతుః తం యష్టినాచిక్షేప'' (వారిద్దఱును నిద్ర పోవు మనుజుని యొద్దకేగి వానిని కఱ్ఱతో తట్టిరి) అని యిట్లు నిద్రించినవాని యొ ద్దకేగి వానిని కఱ్ఱతో తట్టుట మొదలగునవి యతఁడు భోక్తయని తెలుపుటయం దే చిహ్నము లగుచున్నవి. అటె ఉత్తరవాక్యములయందును భోక్తయే ప్రతి పాదింపఁ బడుచున్నాడు. అది యెట్లనిన, ‹‹తద్యథా శ్రేష్ఠీ స్వైర్భుఙ్క్తే యథా

హాస్స్వాః శ్రేష్ఠినం భుఞ్జన్త్యేవమేవైష ప్రజ్ఞాత్మైతైరాత్మభిర్భుంక్తే ఏవమేవైత ఆత్మాన ఏనంభుఞ్జన్తీతి'' (ఒక ధనికుఁడు తనవారితోఁగూడ ఎట్లుభుజించునో, తనవారతనిని యెట్లు భుజింపఁజేయుదురో, అట్లె యీయాత్మ యితరాత్మలతో భుజించుచున్నది. ఇతరాత్మ లీయాత్మను భుజింపఁజేయుచున్నవి.) అని యిట్లుచెప్పఁబడియె.

అట్లె "క్వైష ఏతద్బాలాకే పురుషః శయిష్ట క్వైవ ఏతదభూత్కుత ఏతదాగాత్ '' (ఓ బాలాకి యీతండెచ్చట శయనించెను, ఈతం డెచ్చట నుండెను, మరియు నీతండెచ్చటనుండివచ్చెను) అని యిట్లు బాలాకి నడుగఁగా, నతండు బదులుచెప్పనేరనందున అజాతశత్రువే స్వయముగ నిట్లు చెప్పెను— "హితా నామ నాడ్యస్తాసు తదాభవతి యదాసుప్తస్స్వప్నం నకంచనపశ్యత్యథాస్మిన్ప్రాణ ఏవైకధాభవతి తదైనంవాక్సర్వైర్నామభిస్సహాప్యేతి మనస్సర్వైర్ధ్యానైస్సహాప్యేతి స యదా ప్రతిబుధ్యతే యథాగ్నేర్జ్వలతస్సర్వాదిశో విస్ఫులింగా విప్రతిష్ఠేరన్ ఏవమేవైతస్మాదాత్మనః ప్రాణాయథాయతనం విప్రతిష్ఠన్తేప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః'' (ఈతండు స్వప్నము నెంతమాత్రము జూడక నిద్రించునపుడు హితము లనఁబడు నాడులయందుండును. అప్పు డీతండు ప్రాణముతోనే చేరియుండును. అప్పుడు వాక్కు తనవిషయములగు నామములతోఁగూడ ఈతనియందుఁ జేరుచున్నది. మనస్సు చింతనముల నన్నింటితోఁగూడ ఈతనిం జేరుచున్నది. ఈతండు మేల్కొనునపుడు, అగ్ని జ్వలించునప్పుడు దానినుండి రవ్వలంతటను ప్రసరించునట్లు, ఈతనినుండి ప్రాణములు బయలువెడలి వాటివాటి స్థానములకుఁ బోవుచున్నవి. ప్రాణములనుండి దేవతలును, దేవతలనుండి లోకములును ప్రసరించుచున్నవి.) అను వాక్యమున సుషుప్తికాధారమగుటచే స్వప్నసుషుప్తి జాగరితావస్థల యందుండువాఁడుగాను, వాక్కు మొదలగుఇంద్రియముల సంగమమునకును నిర్గమమునకును ఆశ్రయమునుగాను ఈజీవాత్మనే "అథాస్మిన్ప్రాణఏవైకధాభవతి''(ఈప్రాణమనఁబడుజీవుని యందుఁ జేరుచున్నవి) అనుటచేఁ దెలిపియున్నాఁడు. ఈజీవాత్మ ప్రాణములనుధరించియుండు వాఁడగుటనుబట్టి యాతఁడు ప్రాణమనియే యిచట నిర్దేశింపఁబడియె. ఏలనఁగా, "స యదా ప్రతిబుధ్యతే''(అతఁడు ఎప్పుడు మేల్కొనునో,)అను వాక్యమున నట్లు ప్రాణశబ్దముచేఁ దెలుపఁబడినదానినిగుఱించి మేల్కొటయను నది వినఁబడుచున్నది. ముఖ్యప్రాణేశ్వరులకు సుషుప్తిప్రబోధములుండుట యసంభవము గదా! అథవా, "అస్మిన్ ప్రాణే''అనుతావునునుండు నప్తమీవిభక్త్యంతపదములను వ్యధికరణార్థమునను గైకొనవచ్చును. అప్పుడు యాత్మ

యందుండు ప్రాణమునందు వాగాదింద్రియములుఁ జేరుచున్నవని యర్థము. ఒకవేళ యిచటనుండు ప్రాణశబ్దమును ముఖ్యప్రాణవాచకమునుగాఁ గొని నప్పటికిని, యీప్రకరణమున జీవుండే ప్రతిపాదింపఁ బడుచున్నాడు. ఏల ననఁగా ప్రాణము జీవుని కొకవిధమైన సాధనము గదా! కావున నీప్రకరణ మున ప్రారంభమున జెప్పఁదలచిన బ్రహ్మము సాంఖ్యసిద్ధాంత ప్రసిద్ధుండగు పురుషుండే గాన, వానికంటెను వేరుగ ఈశ్వరుండుండుట సిద్ధింపదు. కారణ వస్తువునందుండునవిగాను సృష్టిని వివరించు వాక్యములయందుఁ జెప్పఁబడినటి యీక్షణాదులు చేతనుని యందుండునవి గాన,అవి యీపురుషునియందే యు పపన్నములు. కావున నట్టిపురుషునిచే నధిష్ఠింపఁబడినట్టి ప్రకృతియే జగత్కా రణమని సిద్ధించుచున్నది.

—✤ సిద్ధాంతము. ✤—

ఇట్లు పూర్వపక్షము రాఁగా, ఇందులకు సమాధాన మిట్లు చెప్పఁబడు చున్నది:— పుణ్యాపాపకర్మ పరవశుండును, నీచుండును, ఈశరీరములో నుండువాఁడును, ప్రకృతియొక్క ధర్మములను తనయందు ఆరోపించుటచే దాని మార్పులకు హేతుభూతుండునగు జీవుండు ఈతావునఁ జెప్పఁబడుచుండ లేదు. అయితే నిరస్త సమస్తావిద్యాదిదోష గంధుండును, అనవధికా సంఖ్యే య కల్యాణగుణ గణనిధియును, నిఖిల జగదేక కారణభూతుండునునగు పురు షోత్తముండు ఈతావునఁ జెప్పఁబడుచున్నాడు. ఏలననఁగా, ‘‘యస్యవైతత్కర్మ’’ అనుతావున‘‘ఏతత్’’శబ్దముతో నన్వయముగల‘‘కర్మన్’’శబ్దము పరమపురుషు నిచే నొనర్పంబడినట్టి జగద్రూపమగు కార్యమును తెలుపునది. ఏలననఁగా, నిచటనుండు ‘‘ఏతత్’’ శబ్దము అర్థప్రకరణాదులచే నిశ్చయింపఁబడినట్టి యొక యర్థవిశేషము లేనిదై సామాన్యముగ ప్రత్యక్షాది ప్రమాణ నిరూపితమును,స్థా వరజంగమాత్మకమునునగు జగత్తును తెలుపునది.మరియు ఈతావున పుణ్యపాప రూపమగు కర్మము ఇచటనుండు ‘‘కర్మన్’’శబ్దముచేఁ దెలుపఁబడుచుండలేదు. ఏలననఁగా,ఉపక్రమమున‘‘బ్రహ్మతే బ్రువాణి’’ (నీకు బ్రహ్మమునుగురించి తెలి పెదను) అని యారంభించి బ్రహ్మమని బాలాకిచేఁ గాన్పింపఁబడిన యాదిత్య మండలస్థులగు పురుషులు బ్రహ్మముకాక పోవుటంజేసి ‘‘మృషావై ఖలు మాసం వదిష్ఠాః’’ (అసత్యమును చెప్పకుమా) అనుటచేవానిని బ్రహ్మమును దెలియని వానినిగా నిశ్చయించి వాడెరింగియుండని బ్రహ్మమును గురించి తెలుపుటకై యజాతశత్రువు ‘‘యోవై బాలాక’’ ఇత్యాది వాక్యముఁ జెప్ప తొడంగెను ఈతావున పుణ్య పాపకర్మ సంబంధముగల వారును ఆదిత్యాదుల యందుండు

వారును, వారి జాతివారునగు పురుషులు బాలాకికిఁ దెలిసినవారే కాన, వానికిఁ దెలిసియుండని యొక పురుషునిఁ దెలుపుటకుగాను ప్రయోగింపఁబడినట్టి కర్మశబ్దము పుణ్యపాపములను మాత్రము దెలుపునట్టిది కాదు. క్రియామాత్రమును దెలుపునదియును కాదు. అయితే యిది యీ సంపూర్ణ జగద్రూపమగు కార్యమును తెలుపునది. అట్లు అర్థముచేసి కొనిననే కదా, యిచట తెలియని దానిని యుపదేశించినట్లగును. † కర్మసంబంధోపలక్షితమగు స్వాభావిక స్వరూపముగలవాడును, పూర్వము తెలియనివాడునగు పురుషుండు ఈతావునఁ దెలియవలసిన వాఁడుగాను ఉపదేశింపఁబడు పక్షమున, § నిచట లక్షణార్థము గ్రైకొనఁబడినదగును. ఇచట తెలియవలసినవాని స్వరూపము కర్మ సంబంధమే కాన, నది “యస్యవైతత్కర్మ” (ఈ కర్మమెవ్వనిదో) అన్నంత మాత్రముననే సిద్ధించును. మరియు “యస్యవైతత్” అనునపుడు “ఏతత్” శబ్దము నిరర్థకమగును. “య ఏతేషాం కర్తా యస్య వైతత్ కర్మ” అనుతావున కర్మమును మరల పేర్కొనుట కభిప్రాయమేమనఁగా—ఓ బాలాకి నీచే బ్రహ్మముగఁ బేర్కొనబడిన పురుషులకెవ్వండు కర్తయో, అనఁగా వారెవ్వనిచే సృజింపఁబడినారో, ఇంతేకాదు, ఈ సమస్త ప్రపంచమును యెవ్వని కృత్యమో, ఉత్కృష్టులును నికృష్టులునునగు చేతనులును అచేతనములును సమస్తపదార్థములు నెవ్వని కృత్యమగు విషయమున తుల్యములో, అట్టి పరమకారణభూతుండగు పురుషోత్తముండు తెలయవలసినవాడని యెఱుంగునది. జీవుల కర్మమునుబట్టియే జగత్తు సృజింపఁబడినను, జీవుండు తనకు భోగ్యములగు వస్తువులను అందులకుఁ గావలసిన యుపకరణాదులనున్ను స్వయముగ గలుగఁజేసికొన జాలడు. అయితే యతఁడు స్వకర్మానుగుణముగ ఈశ్వరునిచే సృజింపఁబడిన దాని నంతయును అనుభవించు చున్నాడు. కావున నతండు ఈ పైని గనఁబరచిన పురుషులను సృజించువాఁడు కాఁజాలడు. కావున ఉపనిషత్తుల యందంతటను పరమకారణముగా ప్రసిద్ధినొందిన పరబ్రహ్మము యీ తావునఁ దెలియవలసినదిగాను ఉపదేశింపఁ బడుచున్నది.

---

† “కర్మసంబంధోపలక్షితమగు = ఆగంతుకముగావచ్చిన కర్మసంబంధమువలన గుర్తింపఁబడు” అని యర్థము.

§ కర్మసంబంధము గలదానిఁ దెలుపునట్టి శబ్దము కర్మసంబంధరహితమగుదానిఁ దెలుపుటయందు అముఖ్యము అనఁగా నది యావిషయమున దాని ముఖ్యార్థము గలది కాదు.

౧౭॥ సూ॥. జీవ ముఖ్యప్రాణ లిఙ్గాన్నేతి చేత్తద్వ్యాఖ్యాతం

టీ॥ జీవ ముఖ్యప్రాణ।లిఙ్గాత్ =జీవచిహ్నములును ముఖ్యప్రాణ చిహ్నములును ఈ తావునఁ దెలియవచ్చుటంజేసి, న=ఇచట బ్రహ్మము చెప్పఁబడుచుండలేదు, చేత్ =ఇట్లంటివేని, తద్వ్యాఖ్యాతం=ఆ విషయము నిర్వహింపఁబడినది.

తా॥ జీవ చిహ్నములును, ముఖ్యప్రాణ చిహ్నములును దెలియవచ్చుటంజేసి, యీతావున పరబ్రహ్మము చెప్పఁబడుచుండలే దంటివేని, ఆ విషయమును గుఱించి నిర్వహింపఁ బడినది.

శ్రీ॥ భా॥ ఈ ప్రకరణమున జీవచిహ్నములును ముఖ్యప్రాణము యొక్క చిహ్నములును తెలియ వచ్చుటంజేసి యిచట భోక్తయగు జీవుండే ప్రతిపాదింపఁబడు చున్నాడు గాని, పరమాత్మ కాదంటివేని, యీ విషయమును గుఱించి ప్రతర్దనవిద్యా సందర్భమునఁ జెప్పఁబడినది. అది యెట్లనిన, ఉపక్రమోపసంహారములఁ బరిశీలించుటచే వాక్యము బ్రహ్మపరమని నిశ్చితమగు తావుల, నితరవస్తువులను తోఁపింపఁజేయు చిహ్నముల నట్టి నిశ్చయమున కనుగుణముగానే వర్ణింప వలయునని యచట ప్రతిపాదింపఁ బడియె. ప్రకృతమునను, ప్రారంభమున, “బ్రహ్మ తే బ్రువాణి”(నీకుబ్రహ్మమును తెలుపు చున్నాను)అనుటచే బ్రహ్మము ప్రస్తావింపఁ బడినది. మధ్యను “యస్యవైతత్ కర్మ” అను తావున నిర్దేశింపఁబడిన వాడు పురుష మాత్రుండు గాడనియు, నిఖిలజగదేకకారణమగు బ్రహ్మమే యనియును చెప్పియున్నాము. ఉప సంహారమునను, “సర్వాన్పాప్మనోపహత్య సర్వేషాంచ భూతానాంశ్రైష్ఠ్యం స్వారాజ్య మాధిపత్యం పర్యేతి యఏవం వేద” (ఎవఁడు ఇట్లు ఉపాసించు చున్నాఁడో, వాడు సమస్త పాపములను పోగొట్టుకొని, జంతురాశిలోనంతటను శ్రేష్ఠత్వమును, స్వారాజ్యమును(స్వాధీనత్వమును) ఆధిపత్యమును (అపహతపాప్మత్వాది గుణాష్టకమును) బొందుచున్నాడు) అనుటచే బ్రహ్మోపాసనము యొక్కయే ఫలమయినదియు, సర్వపాపాపహతి పూర్వకముగ లభింపఁబడు స్వారాజ్యము చెప్పఁబడినది. కావున నీ పైవాక్యము బ్రహ్మపరమని నిశ్చయింపఁ బడుటంజేసి, యచ్చటచ్చట జీవచిహ్నములును ముఖ్యప్రాణ చిహ్నములును తెలియవచ్చినను, వాటిని బ్రహ్మ పరములుగానే వర్ణించు కొనునది. ప్రతర్దనవిద్యయందు ఉపాసాత్రైవిధ్య ముపదేశింపఁ బడుటనుబట్టి అనఁగా బ్రహ్మమును ఉపాసించుటకుగాను మూఁడు పద్ధతులు ఉపదేశింపఁ బడుటనుబట్టి, యచటఁ దెలియవచ్చునట్టి జీవచిహ్నములును ముఖ్యప్రాణ చిహ్నములును బ్రహ్మ సంబంధ

ములైనవియే యని చెప్పఁబడియె. ప్రకృతమునను, "అథాస్మిన్ ప్రాణఏవై కథా" అను తావున సామానాధికరణ్యముండుట సంభవమగుచుండఁగా, వైయధికరణ్యము నాశ్రయించుట యోగ్యముకానందునను, బ్రహ్మమును తెలుపుటకుగానే యిచట ప్రాణశబ్దము ప్రయోగింపఁబడినట్లు నిశ్చయింపఁబడుట చేత నున్న ప్రాణశరీరకముగ బ్రహ్మము నుపాసించుటకై యిచట ప్రాణము పేర్కొనంబడుచున్నది యనుట పొసగును.

అవతారిక:— అయితే జీవచిహ్నముల నెట్లు బ్రహ్మసంబంధులనుగా గొనశక్యమని శకింపఁగా, నందులకు సమాధానము చెప్పుటకై:—

౧౮॥ సూ॥ అన్యార్థంతు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యామపిచైవమేకే.

---

టీ॥ తు = పూర్వపక్షము యుక్తముకాదు. ప్రశ్నవ్యాఖ్యానాభ్యాం=ప్రశ్నమును బట్టియు,ప్రతివచనమును బట్టియును, అన్యార్థం=వేఱొక్కవిషయమునకుగాను ఇచ్చట జీవుండు పేర్కొనఁబడియెనని, జైమినిః = శ్రీ జైమిన్యాచార్యుండు, (మన్యతే = తలంచుచున్నాడు) అపిచ=మఱియు, ఏకే = కొందరు, ఏవం=ఇట్లు(పఠించుచున్నారు)

తా॥ పూర్వపక్షము యుక్తముకాదు. వేఱొక్క యుద్దేశముననే యిచట జీవుండు పేర్కొనం బడినట్లు ప్రశ్న ప్రతివచనములనుబట్టి తెలియుచున్నదని శ్రీ జైమిన్యాచార్యులవారు తలంచుచున్నారు. ఇట్లే కొందరు వేదశాఖలవారును పఠించుచున్నారు.

శ్రీ॥ భా॥ జీవుండుచెప్పఁబడుటనుబట్టి వాక్యము జీవపరమను కొనగూడదని సూత్రము నందుండు "తు" శబ్దము సూచింపుచున్నది. ఈ ప్రకరణమున జీవునిఁ బేర్కొనుట వేఱొక్క యుద్దేశముననని అనఁగా, జీవునికంటెను వేఱగు బ్రహ్మస్వరూపమును తెలుపుటకుగానని శ్రీ జైమిన్యాచార్యులవారు తలంచుచున్నారు. ఏలననఁగా, ప్రశ్న ప్రతివచనములనుబట్టి యట్లు తెలియుచున్నది. అది యెట్లనిన, "తౌ హ సుప్తం పురుషమాజగ్మతుః"(వారు నిద్రించు పురుషుని యొద్దకేగిరి) ఇత్యాదివాక్యమున నజాతశత్రువు బాలాకినిఁదోడ్కొని ప్రాణము మాత్రము మేల్కొనియుండునట్టి నిద్రించుపురుషునియొద్దకేగి ప్రాణముయొక్క *పేరులచే బిలిచి, కర్రతోఁ తట్టుటచే జీవుండు ప్రాణాదుల కంటెను వేరయిన

---

* బృహత్, (గొప్పది) పాండరవాసాః, (తెల్లని వస్త్రముగలది) సోమ, (చంద్రుండు) రాజన్, (రాజు) అనునవి ప్రాణముయొక్క పేర్లు. "తౌహసుప్తం పురుషమీయతుః తం హాజాతశత్రురామంత్రయాం చక్రే బృహత్ పాండరవాసః సోమ రాజన్" అను శ్రుతి యిట్టిపేర్లను తెలుపు చున్నది.

వాడని బాలాకికిఁ దెలిపి అటుపిమ్మట «క్వైష ఏతద్బాలాకే పురుషోశయిష్ట క్వవా ఏతదభూత్కుత ఏతదాగాత్'' ఇత్యాదివాక్యముననట్టి జీవునికంటెను వేరయిన వాడగు పరమాత్మను గుఱించి తెలిపినట్లు విశదమగుచున్నది. ఇందులకుగా నుదహరింపఁబడిన «యదా సుప్తస్స్వప్నం న కథంచన పశ్యత్యథాస్మి న్ప్రాణ ఏవైకధా భవతి ఏతస్మాదాత్మనః ప్రాణాయథాయతనం విప్రతిష్ఠన్తే ప్రాణేభ్యో దేవా దేవేభ్యోలోకాః'' అను వివరణవాక్యమున్ను జీవునికంటెను వేఱువస్తువగు పరమాత్మను తెలుపునదియే. నిద్రనొందిన యీజీవుండు ఎవ్వని యందుండి జాగరిత స్వప్నావస్థ సంబంధులగు సుఖదుఃఖముల యనుభవమువలనఁ గలుగు కాలుష్యము లేకుండ, ప్రసన్నుండై, స్వస్థతను బొందియుండునో, యెవ్వనినుండి యీతండు కర్మానుభవమునకై మరల తిరిగివచ్చునో, అతఁడే పరమాత్మ. అది యెట్లనిన, «సతాసోమ్య తదాసమ్పన్నో భవతి'' అనియు, «ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యంకిఞ్చన వేదనాన్తరం'' అనియు నీమొదలగుతావుల జీవాత్మకంటెను వేఱువస్తువగు పరమాత్మ సుషుప్త్యవస్థయందు జీవునికాధార భూతుండుగ ప్రసిద్ధినొందినవాఁడు. కావున నిచట జీవునిఁ బేర్కొనుట జీవుని

---

«మహత్'' అని పిలుచుటకుఁ గారణ మేమనఁగా «ప్రాణోవావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ'', అను శ్రుతియందుఁ జెప్పియున్నట్లు ప్రాణము జ్యైష్ఠ్య శ్రైష్ఠ్య గుణములతో గొప్ప మహిమ గలది.

«పాండరవాసాః'' అని పిలుచుటకుఁ గారణమేమనఁగా: — «కిం మే వాసః'' (నాకు వస్త్రమెద్ది) అని ప్రాణమడుగఁగా, «ఆపోవావవాసః'' ఉదకములే వస్త్రమనిబదులు చెప్పఁబడియె. భోజనము చేయబోవునపుడు ద్విజులు జాపోసనము బుచ్చుకొను తీర్థము ప్రాణమునకు వస్త్రముగాను ఉపనిషత్తులయందుఁ జెప్పఁబడినది. «యచ్ఛుక్లం తదపాం'' అను శ్రుతివలన నుదకముయొక్క స్వాభావికవర్ణము తెలుపుగాను తెలియవచ్చుటంజేసి యచట ప్రాణము తెల్లని వస్త్రము గలదిగాను చెప్పఁబడినది.

«సోమః'' అని పిలుచుటకుఁగారణ మేమనఁగా: — సప్తాన్నబ్రాహ్మణమున «అథైతస్య ప్రాణస్యాప శ్శరీరం జ్యోతీరూప మసౌచంద్రః'' అను వాక్యమున చంద్రుని జ్యోతిస్సు ప్రాణముయొక్క రూపముగాను చెప్పఁబడినది. అందువలన ప్రాణమునకు చంద్రసంబంధముగలదు. అట్టి సంబంధమునుబట్టి ప్రాణమున్ను చంద్రుండని పిలువఁబడినది. బజారులో వంకాయ లమ్మువానిని «ఓ వంకాయలు'' అని మనము పిలుచుచుండలేదా: అట్లే యిచటను ఎఱుంగునది.

«రాజా'' అని పిలుచుటకుఁ గారణ మేమనఁగా:—«ప్రాణో వైసమ్రాట్'' అను శ్రుతివాక్యమున ప్రాణము చక్రవర్తిగా చెప్పఁబడినది.

కంటెను వేఱువస్తువగు పరమాత్మను ప్రతిపాదించుటకుగానని ప్రశ్నోత్తరము లను బట్టినిశ్చయింపఁ బడుచున్నది.

ఇచట వినఁబడు ప్రశ్న ప్రతివచనములు జీవుని గుఱించినవి యనియు, సుషుప్త్యవస్థయందు జీవుని కాధారభూత ములు నాడులే యనియు, ఇంద్రియ ములు ప్రాణమని వ్యవహరింపఁబడునట్టి జీవునియందే లయమగుచున్నవని యును పూర్వపక్షి చేయువాదము యుక్తమైనదికాదు. ఏలననఁగా, నాడులు స్వప్నసమయమున జీవుఁడుండు తావు. ఈ పైని గనఁబఱచిన ప్రకారము బ్రహ్మ మే సుషుప్తి సమయమున జీవుఁడుండు స్థానము. మరియు, ప్రాణమని పిలువఁ బడు బ్రహ్మమునందే జీవునికిని వాని యుపకరణములగు వాగాదీంద్రియముల సముదాయమునకును సంగమ నిర్గమములు చెప్పఁబడినవి. ఇంతియెకాక, వాజసనేయు లీబాలాక్యజాత శత్రుసంవాదమును గుఱించి పఠించు సందర్భ మున, పరమాత్మను, సుషుప్తినిబొందినవాఁడును, విజ్ఞానమయుండుననగు జీవునికంటెను వేఱువస్తువుగు గాను «యఏష విజ్ఞానమయః పురుషః క్వైష తదాభూత్కుత ఏతదాగాత్'' (ఈ విజ్ఞానమయుండగు జీవుండు సుషుప్తి సమ యమున నెచ్చట నుండెను? మరల ఎచ్చట నుండివచ్చెను?) అనియు, «యత్రై ష ఏతత్సుప్తో భూద్యఏష విజ్ఞానమయః పురుషః తదైతేషాం ప్రాణానాం విజ్ఞా నేన విజ్ఞానమాదాయ యఏషో న్త ర్హృదయ ఆకాశ స్తస్మింఛ్ఛేతే''. (సుషుప్తి సమయమున ఈపురుషుండెచ్చట నుండుననగా ఈ విజ్ఞానమయుండగు జీవుం డప్పుడు ఇంద్రియములకుఁగల విజ్ఞానశక్తిని తన యందుంచుకొని లోపలనుండు హృద యాకాశమున శయనించుచున్నాడు) అనియు నీ మొదలగు వాక్యముల యందుఁ జెప్పఁబడియె. ఈ పైవాక్యములయందు ఆకాశ మనఁగా, పర మాత్మ. ఏలననఁగా ఆకాశశబ్దము పరమాత్మను తెలుపునది గాను « ద హరోస్మిన్నంతర ఆకాశః'' ఇత్యాది తావుల ప్రసిద్ధమైనది. కావున నీప్రకరణ మున జీవునీ వేఱొకనుట యనునది ప్రాజ్ఞుండగు పరమాత్మను గురించితెలు పుటకైయని తెలియుచున్నది. కావున నీపైవాక్యమున జీవునికంటెను వేఱు వస్తువును, నిఖిల జగత్కారణమునునగు పరబ్రహ్మము తెలియ వలసినదిగా నుపదేశింపఁబడుటంజేసి సాంఖ్యసిద్ధాంతప్రసిద్ధుండగు పురుషుండుగాని వానిచే నధిష్టింపఁబడినట్టి ప్రకృతి గాని జగత్కారణము గాను వేదాంతములయందె చటను చెప్పఁబడినట్లు తెలియవచ్చు చుండలేదని సిద్ధమగుచున్నది.

జగద్వాచిత్వాధికరణము ముగిసెను.

## వాక్యాన్వయాధికరణము.

### ౧౯॥ సూ ॥ వాక్యాన్వయాత్.

టీ॥ వాక్యాన్వయాత్ =సర్వేశ్వరుండు జగత్కారణమగు పక్షమున నే వాక్యముసంగలి యవయవములుపరస్పరము అన్వయము గలవి యగుచున్నవి.

తా॥ సర్వేశ్వరుండు జగత్కారణముగా గొనఁబడిన పక్షమున నే వేదాంత వాక్యావయవములు పరస్పర మన్వయముగలవి యగుటను బట్టి యును అట్లు తెలియు చున్నది.

శ్రీ॥ భా ॥ సాంఖ్యసిద్ధాంత ప్రసిద్ధములగు పురుషుండు మొదలగుతత్త్వములఁ దెలుపు వాక్యములు కొన్ని తావులగానఁ బడుచుండుటం జేసి,యీశ్వరుం డనువాడు వేఱొక్కండుండుట సంభవము కాదని మరల శకించి, యట్టి శంకను నిరాకరించు చున్నారు.

వాజసనేయులు మైత్రేయీ బ్రాహ్మణమున ‘‘నవా అరే పత్యుః కామాయ పతిః ప్రియోభవత్యాత్మ నస్తుకామాయపతిః ప్రియోభవతి’’ (ఓమైత్రేయీ భర్తకుగాను భర్త ప్రియుండగుకాడు అయితే యాత్మకుగాను భర్త ప్రియుండగు చున్నాడు) అని యారంభించి, ‘‘నవా అరే సర్వస్యకామాయ సర్వంప్రియంభవత్యాత్మనస్తుకామాయ సర్వంప్రియంభవతి ఆత్మావా అరేద్రష్టవ్యశ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః మైత్రేయ్యాత్మని ఖల్వరేదృష్టే శ్రుతేమతే విజ్ఞాతే ఇదంసర్వం విదితం’’ (ఓమైత్రేయీ సర్వమునకుగాను సర్వము ప్రియముకాదు అయితే ఆత్మకుగాను సర్వము ప్రియమగుచున్నది. ఆత్మయే ఎఱుంగవలనది, వినవలసినది,మననము చేయవలసినది, ధ్యానింప వలసినది, ఇట్లు ఆత్మ తెలియబడి,మననముచేయబడి ఉపాసింపఁబడినచో,సర్వమును తెలియఁబడిన దగును.) అని పఠించు చున్నారు.

### సంశయము

ఈ పైవాక్యమునఁ దెలియవలసినవాఁడుగాఁ జెప్పఁబడినవాఁడు సాంఖ్యసిద్ధాంత ప్రసిద్ధుండగు పురుషుండేనా? కాక, అతండు సర్వజ్ఞుండును, సత్యసంకల్పుండునగు, సర్వేశ్వరుండా?

### పూర్వపక్షము.

అతఁడు సాంఖ్యసిద్ధాంత ప్రసిద్ధుండగు పురుషుండు. ఏలననఁగా నిచట మొదటినుండి కడవరకు పురుషుండే తెలియవచ్చు చున్నాడు. ఉపక్రమమున భార్యాభర్తలను పుత్రవిత్త పశ్వాదులను గుఱించిన ప్రీతితో సంబంధించినట్టి వానిని చెప్పుటచే నిచట జీవాత్మయే చెప్పఁబడినట్లు తెలియుచున్నది. మధ్య

ను, "విజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యస్సముత్థాయ తాన్యేవాను వినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తి" (ఈవిజ్ఞానపు ముద్దయగువాఁడు ఈభూతములనుండి బయలువెడలి వాటితోఁగూడ నశించుచున్నాడు) అను తావున నీతనికి జన్మనాశములతో సంబంధ మున్నట్లు తెలియుటచే నిచట చెప్పఁబడినవాఁడు జీవుఁడేయని తెలియుచున్నది. అట్లే అంతమునను, "విజ్ఞాతార మరే కేన విజానీయాత్" (తెలిసికొనువానిని (జీవుని) యెట్లు తెలుసుకొనవలయును) అనుటచే జీవుండే వేర్కొనఁబడినట్లు తెలియవచ్చుచున్నాడు. కావున నిచట ఈశ్వరుండు చెప్పఁబడు మండలేదు. కావున నీపైవాక్యము సాంఖ్యసిద్ధాంత ప్రసిద్ధుండగు పురుషుని తెలుపునది గాను నిశ్చయింపఁ బడుచున్నది. అయితే ప్రారంభమున "అమృతత్వస్య తు నాశాస్తి విత్తేన" (మోక్షమునకు ద్రవ్యముతో నిమిత్తములేదు) అని చెప్పియున్నందున, నీవాక్యము మోక్షోపాయము నుపదేశించునదిగాను తెలియవచ్చుచుండగా, నది పురుషుని ప్రతిపాదించునని యేల చెప్పఁదగునని యడిగెదవేమో చెప్పెదము. అట్టి మోక్షోపాయమును ప్రతిపాదించునదియై నందుననే యది పురుషుని ప్రతిపాదించునది యగుచున్నది. అది యెటులన, అచేతనపదార్థముల ధర్మములను తనయం దారోపించుకొనని పురుషుని యథార్థస్వరూపమును దెలిసికొనుటయే కదా సాంఖ్యతంత్రమున మోక్షోపాయముగా నుచెప్పఁబడుచున్నది. కావున ప్రకృతి సంబంధ రహితమగు జీవాత్మస్వరూపమిచట మోక్షమునకు గాను "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" ఇత్యాదివాక్యమున నుపదేశింపఁ బడుచున్నది. మరియు అన్నియాత్మలయొక్కయును ప్రకృతి వియుక్తమగు రూపము ఒక్కవిధమైనదియే గాన, నట్లు ప్రకృతి వియుక్తమగు స్వాత్మస్వరూపమును యథార్థముగా నెఱుంగుటచే నన్నియాత్మలును తెలిసినవియే యగుటనుబట్టి, యిచట ఆత్మను తెలిసికొనుటచే సర్వము విదితమగుటయును పొసగుచున్నది. దేవతలు మొదలు స్థావరపదార్థములవఱకును సమస్త భూతములలో నుండునట్టియాత్మస్వరూప మొక్కవిధమైనదియే కాన, "ఇదం సర్వం యదయమాత్మా" (ఇదియంతయు నాత్మయే) అని యిట్లు ఒక్కటియే యాత్మయగుట యుపదేశింపఁబడియె. దేవాది శరీరముల యాకారములు ఆత్మయొక్క యాకారము కాకపోవుటంజేసి "సర్వం తం పరాదద్యాత్" అను తావున వేఱొక్క యాకారమగుటను నిషేధించియున్నారు. ఆత్మయొక్క యాకారమొక్కవిధమైనదియైయుండగా ప్రకృతి పరిణామరూపమగు దేవాది శరీర భేదమునుబట్టి యాత్మాకారమునున్ను వేఱువేఱయిన దానింగా దెలిసికొనుట మిథ్యాజ్ఞానమని, "యత్ర హి ద్వైతమివ భవతి" ఇత్యాది శ్రుతులయందు చెప్ప

బడుచున్నది. జగదుత్పత్తి ప్రకృతినధిష్టించి యుండువాడగుటచే పురుషుండే నిమిత్తముగాఁ గలదియగుటవలన "తస్యహావా మహతో భూతస్య నిశ్వసిత మేతద్దృగ్వేదః" ఇత్యాది వాక్యమునఁ జెప్పియున్నట్టి ఋగ్వేదాద్యుత్పత్తి యును అపురుషునివలనఁ గలుగవచ్చును. ఇట్లు ఈపై వాక్యము పురుషపరము గాను నిశ్చయింపఁబడగా, దానితో నేకార్థము గలవియగుటంజేసి యుపనిష ద్వాక్యము లన్నియును సాంఖ్యసిద్ధాంత ప్రసిద్ధుండగు పురుషునే తెలుపుచు న్నవి. కావున నట్టి పురుషునిచే నధిష్ఠింపఁబడినట్టి ప్రకృతియే జగత్తుకు ఉపా దాన కారణము గాని యట్టివాఁడు ఈశ్వరుండు కాఁడు.

## సిద్ధాంతము.

వాక్యముయొక్క యన్వయమునుబట్టి చూడఁగా ఈపైవాక్యమున సర్వే శ్వరుఁడే చెప్పఁబడినట్లు తెలియుచున్నది. ఏలననఁగా, అటు అర్థముచేసికొని ననే వాక్యావయవములకు పరస్పరము అన్వయము కుదురును. అది యెట్లనిన "అమృతత్వస్య తునాశాస్తి విత్తేన" (మోక్షమునకు ద్రవ్యముతో నిమిత్తము లేదు.) అని యాజ్ఞవల్క్యుండు చెప్పఁగా, నంతట మైత్రేయి "యేనాహం నా మృతాస్యాం కిమహం తేన కుర్యాం యదేవభగవాన్ వేద తదేవమేబ్రూహి" (దేనిమూలముగ నాకు మోక్షము లభింపదో, దానితో నాకేల? తాము దేనిఁ దెలిసికొంటిరో, దానిఁ దెలుపుదురుగాక!) అను వాక్యమున మోక్షమున కు పాయములు కాకపోవుటచే ధనాదుల ననాదరణచేసి మోక్షప్రాప్త్యుపా యభూతమగు దానికై ప్రార్థించునట్టి మైత్రేయికట్టి యుపాయముగాఁ గనుఁ గొనవలసినది గాను ఉపదేశింపఁబడినట్టి యీయాత్మ పరమాత్మయే. ఏలననఁ గా, "తమేవం విదిత్వాఽతి మృత్యుమేతి" అనియు "తమేవం విద్వాన్ అ మృత ఇహ భవతి నాన్యఃపన్థాః" ఇత్యాదితావుల మోక్షమునకు బ్రహ్మోపా సనమే యుపాయముగాఁ బ్రతిపాదింపఁబడినది. పరమపురుషుని విభూతిలోఁ జేరినవాఁడును, పరమపురుషుని బొందువాఁడునగు జీవాత్మయొక్క స్వరూప మును గుఱించిన జ్ఞానము మోక్షసాధనమగు పరమపురుషుని గుఱించినయుపా సనమున నుపయోగపడునదిగాను ఎఱుంగునది. ఇంతియెకాని, యది స్వతం త్రముగ మోక్షోపాయమని యెఱుంగదగదు. కావున ఈతావున పరమాత్మ యే మోక్షోపాయము గాను "ద్రష్టవ్యః" ఇత్యాది వాక్యములయందు ఉపదే శింపఁబడుచున్నాడు. అట్లే తస్య హా వా ఏతస్య మహతో భూతస్య నిశ్వసిత మేతద్య దృగ్వేదః" ఇత్యాది వాక్యమున ఈసమస్త ప్రపంచమునకును కారణ ముగాఁ జెప్పఁబడియున్నది పరమపురుషునికంటెను వేఱయినవాఁడును

బద్ధుండుగాని, నిర్వ్యాపారుండగు ముక్తుండుగాని యగు పురుషమాత్రుని యెడల సంభవింపదు. అట్లే ‘‘ఆత్మనోవా అరే దర్శనేన’’ ఇత్యాది వాక్యమునఁ జెప్పియు న్నట్లు ఒక్కటి తెలియుటచే సర్వము తెలియవచ్చుట యనునది సర్వాత్మయగు పరమాత్మ విషయముననే పొసగును. ఆత్మల యాకార మొక్కవిధమైనదియే కాన, ఒక్కదానిఁ దెలిసికొనుటచే సర్వాత్మలను గుఱించియును తెలియవచ్చునని పూర్వపక్షి చేయువాదము యుక్తమైనది కాదు. ఏలననఁగా, అప్పుడు అచేతనమగు ప్రపంచమును గుఱించిన జ్ఞానము లేకపోవుటచే నన్నింటి విషయమగు జ్ఞానము కలుగనేరదు. మరియు అట్టి ప్రతిజ్ఞను ఉపపాదించుటకై ‘‘ఇదం బ్రహ్మేదం క్షత్రం’’ (ఇది బ్రాహ్మణజాతి ఇది క్షత్రియజాతి) అని యారంభించి ‘‘ఇదం సర్వం యదయమాత్మా’’ అను తావున ప్రత్యక్షాది ప్రమాణసిద్ధమును, చేతనాచేతన మిశ్రమమును నగు ప్రపంచమును ‘‘ఇదం=ఇది’’ అను శబ్దముచేఁ గాన్పించి ‘‘ఏతదయమాత్మా’’ (ఇది యీ యాత్మ) అనుటచే నిది యొక్కటియే యాత్మగలది యనెడి యుపదేశమున్ను పరమాత్మవిషయముననే యుపపన్నమగుచున్నది. చిదచిన్మిశ్రమమును, పై శ్రుతియందు ‘‘ఇదం’’ అను శబ్దముచేఁ దెలుపఁబడునట్టిదియునగు జగత్తుకు అచిత్తుతోఁ జేరియుండువాఁడు (బద్ధుండు) గాని, యట్లుదానితోఁ జేరకయుండువాఁడు (ముక్తుండు) గాని యగు జీవుని స్వరూపముతో నైక్యము పొసగదు. కనుకనే ‘‘సర్వం తం పరాదద్యోఽన్యత్రాత్మనః సర్వం వేద’’ (ఎవఁడు పరమాత్మకంటె వేఱుగానుండు దానిని గాను దీనినంతయును తెలుసుకొను చున్నాఁడో వాని నంతయును వేఱుగాఁ జేయును) అను శ్రుతివాక్యము ఇది యంతయు పరమాత్మకంటెను వేఱుగానుండు నదియనెడి జ్ఞానమును నిందించుచున్నది. అట్లే మైత్రేయీ బ్రాహ్మణమునను, మొట్టమొదట ‘‘మహద్భూతమనంత మపారం’’ అను వాక్యమునఁ దెలియ వచ్చునట్టి మహత్త్వాదిగుణములు పరమాత్మయందే యుండుట సంభవము. కావున నట్టి పరమాత్మయే యీ తావునఁ బ్రతిపాదింపఁబడు చున్నాఁడు.

పతి, జాయాపుత్ర ధనాదుల విషయమగు ప్రీతితో సంబంధము గలవాఁడగు జీవునే యెఱుంగవలసిన వానినిగా నుపక్రమమున ప్రతిపాదించి యున్నందున, నీ పైవాక్య మట్టి జీవునిగుఱించి నదియే యని పూర్వపక్షి చేయు వాదము సయితము యుక్తమైనది కాదు. ఏలననఁగా, ‘‘ఆత్మనస్తు కామాయ’’ అను వాక్యముననుండు ‘ఆత్మన్’ శబ్దము జీవాత్మను దెలుపునదియగు పక్షమున, ‘‘ఆత్మావా అరే ద్రష్టవ్యః’’ ఇత్యాదివాక్యముతో నన్వయము లేక పోవును. అందువలన ‘‘ఆత్మావా అరే ద్రష్టవ్యః’’ అను తావున

నాత్మ సాక్షాత్కారమున కుపయుక్తముగ "ఆత్మనస్తు కామాయ "అని యుపదేశించినట్లు తెలియుచున్నది. "ఆత్మనః కామాయ" అనగా ఆత్మ యొక్క కామసంపత్తికిగానని యర్థము. "కామ్యన్త ఇతి కామాః = కోరబడునవి) అను శబ్దవ్యుత్పత్తినిబట్టి యాత్మయొక్క యిష్టసంపత్తికిగా నని యేర్పడు చున్నది.ఆత్మయొక్క యిష్టసంపత్తికిగాను భర్తృభార్యాదులు ప్రియులగుచున్నారని చెప్పినంతమాత్రమున జీవుని స్వరూపము తెలియవలసిన దని యేర్పడదు. అయితే ప్రియమే తెలియవలసినదని యేర్పడుచున్నది. ఆత్మయొక్క ఇష్టప్రాప్తికి గాను పత్యాదులు ప్రియులు గావున, నట్టిపత్యాది రూపమగు ప్రియమును విడిచి అదిలేనట్టి యాత్మస్వరూపము నెఱుంగవలయు ననుట యసంగతమగును. ఇంతియేకాక, పత్యాదులు తమస్వరూపమును బట్టి ప్రియులు కారు ఆత్మనుబట్టి యేవారు ప్రియులు అని చెప్పఁగా స్వాత్మనుబట్టి వారే తెలియవలసిన వారని యేర్పడును మరియు తనకు శేషభూతులుగా వారు ప్రియులుకావచ్చును. ఈ వాక్యమునకు "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" ఇత్యాది వాక్యముతో సంబంధములేని పక్షమున వాక్యభేదము సంభవించును. పోని, వాక్యభేదము నంగీకరించినను, పూర్వ వాక్యమువలన నెప్పినైన ప్రయోజనమును గానఁబడదు. కావున భర్తృ భార్యాదిరూపమగు సమస్త ప్రియమును వదలు కొనిఆత్మనే కన్గొట్టవలయునన్ యర్థము ఎవ్విధమునఁ దెలియవచ్చునో, అవ్విధమున వాక్యార్థముఁ జెప్పవలయును. దానిఁ జెప్పె దము. "అమృతత్వస్యతు నాశాస్తి విత్తేన" అను తావున నిత్యమును, దోషరహితమును, నిరతిశయానందమునునగు మోక్షము గలుగఁ జేయునట్టి యుపాయములు ధనధాన్యాదులు కావనియు, భార్యా పుత్ర ధన ధాన్యాదులవలనఁ గలుగునదియు, సాతిశయమును, దుఃఖమిశ్రమును, కాదాచిత్కముగ ననుభవింపఁబడునట్టి సుఖము భర్తృ భార్యాదుల స్వరూపమునుబట్టి కలుగునదికాదు. అయితే యది నిరతిశయానంద స్వభా వుండగు పరమాత్మనుండియే గలుగు జేయఁబడునది. కావున ఎవఁడు స్వయముగ నిరతిశయానందముగలవాఁడై యితర పదార్థములనున్ను అట్టి యానందముయొక్క లేశమాత్రముగల వానినిగాఁ జేయుచున్నాఁడో, అట్టి పరమాత్మ గన్గొట్టవలసినవాఁడని యీ తావున నుపదేశింపఁబడు చున్నది. ఈ యభిప్రాయమును "న వా అరే పత్యుః కామాయ పతిః ప్రియోభవతి" ఇత్యాది వాక్యము తెలుపుచున్నది. అది యెట్లనిన, పతిజాయాపుత్రవిత్తా దులు తమ కొరకు కార్యముఁ గలుగఁజేసికొనుటకై "నేను ప్రియముగా నగు

దును" అను సంకల్పముతో నవి ప్రియము లగుచుండలేదు. అయితే యవి యాత్మయొక్క కామమునకుగాను అనఁగా తన భక్తులయిష్టములను నెరవేర్చవలయునని యెడి పరమాత్మయొక్క యుద్దేశమును పూర్తిచేయుటకు గానని యర్థము. అది యెట్లనిన, పరమాత్మ యజ్ఞాదికర్మములచే నారాధింపఁబడి కర్మానుగుణముగ ఆయా దేశకాలములకుఁ దగినట్లు తన భక్తులకు ఆయా వస్తువులు ప్రియము లగునట్లు చేయుచున్నాఁడు. "ఏష హ్యేవా నందయాతి" అను శ్రుతివాక్యమట్లు తెలుపుచున్నది. ఏలననఁగా, వస్తువులు స్వరూపసిద్ధముగ ప్రియములు కాని, అప్రియములు కాని కాజాలవు. అదియెట్లనిన.

శ్లో॥ తదేవప్రీతయే భూత్వా పునర్దుఃఖాయ జాయతే।
తదేవకోపాయ యతః ప్రసాదాయ చ జాయతే॥
తస్మాద్దుఃఖాత్మకం నాస్తి నచకిఞ్చిత్సుఖాత్మకం॥

తా॥ ఒక్కటియే వస్తువు ఒక్క సమయమున సంతోషమును కలుగఁజేయునదై కాలాంతరమున నదియే దుఃఖమును గలుగఁజేయునదియగుచున్నది. అదియే యొకప్పుడు కోపమును గలుగఁజేయునదియు, మరియొకప్పుడు అనుగ్రహమును గలుగఁజేయునదియు నగుచున్నది.

"ఆత్మనస్తుకామాయ" అను తావుననుండు "ఆత్మన్" శబ్దము జీవాత్మను తెలుపునదియే యైనను, "ఆత్మావా అరేద్రష్టవ్యః" అను తావుననుండు "ఆత్మన్" శబ్దము పరమాత్మను తెలుపునదియే. దీని యర్థమేమనఁగా, భర్తృభార్యాదుల యిష్టముఁ గలుగఁజేయుటకుగాను వారలకు పరవశుండగు వానిచే యట్టి భర్తృభార్యాదులు ప్రియులుగాను గ్రహింపఁబడరు. అయితే ఆత్మకు ప్రియముఁ గలుగఁజేయుటకుగానే స్వతంత్రముగ స్వప్రియములు గాను గ్రహింపఁబడుచున్నారు. కావున నెవ్వఁడు నిర్హేతుకముగను నిర్దోషముగను నిరవధికముగనున్న ఆత్మకు ప్రియుండగు పరమాత్మయో, ఆతఁడే తెలియవలసినవాఁడు గాని, దుఃఖమిశ్రమము అల్పసుఖమును దుఃఖాధిక్యమునున్ను గలుగఁజేయునవియు అట్టి విషయమున పరాధీనులయి యుండునవియు నగు పతిజాయాపుత్ర విత్తాది రూపములగు విషయము లట్టివి కావు. ఈప్రకరణమున జీవాత్మను తెలుపునట్టి శబ్దముచే పరమాత్మ తెలుపఁబడుటంజేసి "ఆత్మనస్తు కామాయ" అను తావునను, "ఆత్మావా అరేద్రష్టవ్యః" అనియు నీరెండు తావులను పూర్వము గానఁబడిన ప్రకారము ఆత్మన్ శబ్దములు ఒక్కవస్తువును తెలుపునవియే.

ఇతరుల మతమునను జీవశబ్దము పరమాత్మను తెలుపు నది యని నిరూపించుటకై:—

౨౦॥ సూ॥ ప్రతిజ్ఞా సిద్ధే ర్లింగమా శ్మరథ్యః

టీ॥ ప్రతిజ్ఞాసిద్ధేః=ఒక్కటి తెలియుటచే సర్వము తెలియునని నెడివేదాంత శాస్త్రపు ప్రతిజ్ఞ సిద్ధించుటకుగా నిది, లింగం=సూచకమని, ఆశ్మరథ్యః=ఆశ్మ రథ్యాచార్యులు, మన్య తే=తలంచుచున్నారు.

తా॥ ఒక్కటి తెలియుటచే సర్వము తెలియునని నెడి వేదాంత శాస్త్రపు ప్రతిజ్ఞ సిద్ధించుటకుగా నిది సూచకమని యాశ్మరథ్యాచార్యులు తలంచుచు న్నారు.

శ్రీ॥ భా॥ ఒక్కటి తెలియుటచే సర్వము తెలియవచ్చునని నెడి వేదాంత శాస్త్రపు ప్రతిజ్ఞ సిద్ధించుట కిది హేతువు. ఏలనన౯గా, జీవాత్మను తెలుపు నట్టి శబ్దములచే పరమాత్మ తెలుప౯బడుచున్నాడని యాశ్మరథ్యాచార్యులు తలంచియుండెను. అది యెట్లనిన, ఈ జీవు౯డు పరమాత్మచే౯ జేయ౯బడినవాడు. అందువలన నతండును పరమాత్మయే. అట్లుకానిపక్షమున, నత౯డు పరమాత్మనుండి వేఱుగానుండు వస్తువగుటం జేసి పరమాత్మ తెలియుటచే ఈజీవుండు తెలియ౯రాడు. “ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్” అను వాక్యమున సృష్టికి పూర్వము పరమాత్మయొక్క౯౦డే యుండెనని నిర్ధారణముగా౯ జెప్పుటనుబట్టి యు. “యథా సుదీప్తా త్పావకా ద్విస్ఫులింగా స్సహస్రశః ప్రభవన్తే తథాక్షరా ద్వివిధాస్సోమ్యభావాః ప్రజాయన్తే తత్రచైవాపియన్తి” (జ్వలించునట్టి యగ్ని నుండి సమానరూపములగు వేలకొలది రవ్వలు బయలువెడలు చందంబున, నాశరహితుండగు పరమాత్మనుండియును రెండువిధములగు పదార్థములు గలుగుచున్నవి. అవి వానియందే లయమగుచున్నవి ) ఇత్యాది వాక్యములయందు బ్రహ్మమునుండి జీవు లుత్పన్ను లగుచున్నట్లును వానియందే లయమగుచు న్నట్లును చెప్పియున్నది. అందువలన జీవులు బ్రహ్మముచే౯ జేయ౯బడిన వస్తువు లగుటనుబట్టి యవి బ్రహ్మముతో నైక్యము గలవిగాను తెలియవచ్చుచున్నవి. కావున నిచట జీవవాచకమగు శబ్దముచే పరమాత్మ తెలుప౯బడుచున్నది.

౨౧॥ సూ॥ ఉత్క్రమిష్యత ఏవంభావాదిత్యౌడులోమిః

టీ॥ ఉత్క్రమిష్యతః = శరీరములోనుండి బయలువెడలు జీవునికి, ఏవంభావాత్ = బ్రహ్మస్వరూపమువంటి స్వరూపముండుటనుబట్టి జీవవాచకశబ్దముచే బ్రహ్మము తెలుప౯బడెనని, ఔడులోమిః = ఔడులోమ్యాచార్యుండు, (మన్య తే=తలంచుచున్నాడు.)

తా॥ఈ శరీరములోనుండి బయలువెడలి పరమాత్మను బొందునట్టి జీవుని స్వరూపము బ్రహ్మస్వరూపమువంటిది కాన, జీవవాచక శబ్దముచే బ్రహ్మము తెలుపఁబడియెనని ఔడులోమ్యాచార్యులు తలంచుచున్నారు.

శ్రీ॥భా॥జీవుండు బ్రహ్మముచే కలుగఁజేయఁబడినవాఁడుగాన వానికి బ్రహ్మముతో నైక్యముండుటనుబట్టి యొక్కటి తెలియుటచే సర్వము తెలియఁబడు ననెడి వేదాంతిశాస్త్రపు ప్రతిజ్ఞను ఉపపాదించుటకై జీవవాచకశబ్దముచే బ్రహ్మము తెలుపఁబడుచున్నదని చెప్పినది యుక్తము కాదు. ఏలననఁగా“నజాయతే మ్రియతేవా విపశ్చిత్” (జీవుఁడు పుట్టువాఁడు గాని నశించువాఁడు గాని కాఁడు) అను శ్రుతివలన జీవుఁడు పుట్టువులేనివాఁడని తెలియవచ్చుటవలనను, జీవాత్మలచే వాని ప్రాచీన కర్మముల ననుభవింపఁజేయుటకై జగత్తు సృజింపఁబడున ట్లంగీకరింపఁబడుచున్నది. అట్లుకాకున్న, [1]విషమసృష్టికి యుపపత్తి లేక పోవును. జీవుఁడు బ్రహ్మముయొక్క కార్యము గాన ఆకాశాదులవలె నశించును బ్రహ్మత్వమును బొందుట తప్పని సరి. అందులకై మోక్షయుపాయమును విధించుటయు, దాని ననుష్ఠించుటయును నిరర్థకము లగును. ఘటాది పదార్థములు స్వకారణమగు మృత్తికతోఁ జేరునట్లు, జీవులును స్వకారణమగు బ్రహ్మముతోఁ జేరుపక్షమున, అది వాని నాశనమే యగుటంజేసి మోక్షమనునది యొక పురుషార్థము (పురుషునిచే కోరబడునది) కాకపోవును. అయితే జీవునికి జన్మనాశము లున్నట్లు శ్రుతియందుఁ జెప్పియున్నదే యని యడిగెద వేమో, ఆ విషయమును గుఱించి యిఁకమీఁదు చెప్పఁబోవుచున్నాము. కావున “ఏష సంప్రసాదో౽స్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుపసమ్పద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే” (జీవుఁడు ఈశరీరములోనుండి బయలువెడలి పరజ్యోతిస్సును (పరమాత్మను) బొంది స్వ స్వరూపావిర్భావము గలవాఁడగు చున్నాఁడు) అనియు, “యథా నద్యస్స్యన్దమానాః సముద్రే౽స్తంగచ్ఛన్తి నామరూపే విహాయ, తథా విద్వాన్నామరూపా ద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యం” (ప్రవహించునటి నదులు నామరూపములఁ బోఁగొట్టుకొని సముద్రముతోఁ గలియుచందంబున, ఈ జీవుండును శరీరప్రయుక్తములగు

(1) సర్వేశ్వరుండు వారివారి కర్మములనుబట్టి వాటి కనుగుణముగ వారివారికి జన్మములఁ గలుగఁజేయుచున్నాఁడని యంగీకరించుపక్షమున, వారివారి కర్మానుగుణముగ కొందరిని ఉత్కృష్టులనుగాను మరికొందరిని నికృష్టులనుగానును సృజించుట సాధ్యపడును. అట్లుకాక, సర్వేశ్వరుండు తనయిష్టప్రకారము సృజించుపక్షమున, వానికి పక్షపాతము కలదను మాట వచ్చును.

నామరూపములు లేనివాఁడై పరాత్పరుఁడును, స్వయంప్రకాశుఁడునగు పరమాత్మను బొందుచున్నాఁడు) అనియు నీమొదలగు శ్రుతులయందు ఈశరీరములోనుండిబయలువెడలు జీవునికి పరమాత్మయొక్క స్థితి గలుగుటంజేసి, యీ ప్రకరణమునఁ బరమాత్మను తెలుపుటకుగాను జీవవాచకమగు శబ్దము ప్రయోగింపఁబడియెనని శ్రీయాడులోమ్యాచార్యులవారు తలంచినవారయిరి.

౨౨॥ సూ॥ అవస్థితే రితి కాశకృత్స్నః

టీ॥ అవస్థితేః=పరబ్రహ్మము జీవునిలో నంతరాత్మగా నుండుటనుబట్టి జీవవాచకమగు శబ్దమల్లె పరబ్రహ్మమును తెలుపునదిగాఁ బ్రయోగింపఁబడెను, ఇతి = అని, కాశకృత్స్నః = కాశకృత్స్నాచార్యుండు, మన్యతే= తలంచుచున్నాడు.

తా॥ జీవునిలో నంతరాత్మగా నుండుటనుబట్టి బ్రహ్మము జీవవాచకమగు శబ్దముచేఁ దెలుపఁబడెనని శ్రీ కాశకృత్స్నాచార్యులవారు తలంచుచున్నారు.

శ్రీ॥ భా॥ ఈ శరీరములోనుండి బయలువెడలునపుడు జీవుండు బ్రహ్మముయొక్క స్థితిని బొందుటంజేసి జీవవాచకమగు శబ్దముచే బ్రహ్మము తెలుపఁబడుచున్నదని చెప్పినది యుక్తముకాదు. ఏలననఁగా. అట్టివాదము వికల్పములకు (వికల్ప యుక్తమగు తర్కముకు) నిలువఁజాలదు. అది యెట్లనిన, ఈ జీవుఁడు శరీరములోనుండి బయలువెడలుటకు పూర్వ మిట్టివాఁడుగా నుండక పోవుట యనునది యాతనికి స్వభావసిద్ధమా? కాక, యొక యుపాధినిబట్టి వచ్చినదా? ఉపాధినిబట్టి వచ్చినదగు పక్షమున, అట్టి యుపాధి యనునది వాస్తవముగా నుండునదా? వాస్తవముగా లేనిదా? అట్టి స్థితి యతనికి స్వభావసిద్ధమగు పక్షమున, నతనికి బ్రహ్మముయొక్క స్థితి మరల సంప్రాప్తమగుట సంభవముకాదు. ఏలననఁగా, జీవేశ్వరులకుఁగల భేదము స్వరూపమునుబట్టి యుండునది గాన, స్వరూపమున్నంతవరకును అది పోజాలదు. భేదము నశించి పోవునపుడు దానితోఁగూడ స్వరూపము సహితము నష్టమై పోవుచున్నదని వానిం జెదవా? అటగునేని, జీవుడు స్వరూపముతోఁ గూడ నశించి పోవుచున్నాడు గాన, వానికి పరబ్రహ్మస్థితి కలుగుట కవకాశమే లేదే? మీరు మిక్కిలి పైనిగానఁబడుచిన ప్రకారము మోక్షమనునది మోక్షపురుషార్థము కాదనియు నీమొదలగు దోషములు సంప్రాప్తించును. వాస్తవమగు నొక యుపాధినిబట్టి యాభేదము సంప్రాప్తమైన పక్షమున, ఈ జీవుండు శరీరములోనుండి బయలువెడలుటకు పూర్వమున్న బ్రహ్మ

మే కావున శరీరములోనుండి బయలువెడలునప్పుడీతండు బ్రహ్మభావమును బొందుచున్నాడనుట పొసగదు. అది యెట్లనిన, ఉపాధికంటెను బ్రహ్మము కంటెను నున్న వేఱుగ వేఱొక్కవస్తు వెద్దియును లేనందునను, అవయవరహితుడగు బ్రహ్మమునకు ఉపాధిమూలములగు నాచ్ఛేదనాదులు (మాయబడుట మొదలగునవి) గలుగుట యసంభవమగుటంజేసియును భేదమనునది యుపాధి యొక్క సంబంధమువలననే. కావున జీవుండు శరీరములోనుండి బయలువెడలుటకు పూర్వమునున్న బ్రహ్మమే. ఉపాధి సంబంధియగు భేదము వాస్తవమైనది కాదంటివేని, శరీరములోనుండి బయలువెడలునప్పుడు బ్రహ్మభావ మెవ్వనికిం గలుగుచున్నదో చెప్పవలయును? అవిద్యారూపమగు నుపాధిచేం గప్పంబడిన స్వరూపముగల బ్రహ్మమునకే యది గలుగుచున్నదంటివేని, యట్లుం జెప్పందగదు. ఏలయనంగా, నిత్యముక్త స్వయంప్రకాశమగు జ్ఞానమే స్వరూపముగాంగల పరబ్రహ్మమునకు అవిద్యామూలకమగు తిరోధానము (స్వరూపము మాయబడుట) గలుగుట యసంభవము. వస్తుస్వరూప మట్లే యుండగా, దానియొక్క ప్రకాశము నివర్తించుటను గదా తిరోధానమందురు. ప్రకాశమే వస్తుస్వరూపమని యంగీకరించుపక్షమున, దానికి తిరోభానమే సంభవింపకపోవచ్చును. అథవా, దానికది స్వరూపనాశమే కావలసివచ్చును. కావున వాని స్వరూపము ఎప్పుడును ప్రకటితముగా నుండునదిగాన, శరీరములోనుండి బయలువెడలు సమయముననే యది ప్రకటితమగు బ్రహ్మభావముగలది యగునని తెలుపుటకై సూత్రమునందు «ఉత్క్రమిష్యతః» అను విశేషణము నిచ్చియుండుట నిరర్థకమే. ఏలననంగా, «అస్మాచ్ఛరీరాత్సముత్థాయ» అనువాక్యము పూర్వము బ్రహ్మముగా నుండియుండని వాడిప్పుడు నూతనముగా బ్రహ్మమగుచున్నాడని తెలుపుచుండలేదు. అయితే పూర్వమునుండియుండిన స్వరూపమే యిప్పుడు ప్రకటితమగుచున్నదని తెలుపుచున్నది. అట్లులనే కదా «సంపద్యావిర్భావస్స్వేన శబ్దాత్» ఇత్యాది సూత్రములచే సూత్రకారులు చెప్పంబోవుచున్నారు. కావున «అనేన జీవేనాత్మనానుప్రవిశ్య» అనియు, «య ఆత్మని తిష్ఠన్ ఆత్మనోఽన్తరో యమాత్మా న వేద యస్యాత్మా శరీరం య ఆత్మానమన్తరో యమయతి స త ఆత్మాన్తర్యామ్యమృతః» అనియు, «యోఽక్షరమన్తరే సఞ్చరన్ యస్యాక్షరం శరీరం యమక్షరం న వేద ఏష సర్వభూతాన్తరాత్మాపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః» అనియు, «అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాం సర్వాత్మా» అనియు నీ శ్రుతులయందుం జెప్పియున్నట్లు పరమాత్మ తనకు శరీరభూతులగు జీవులలో నంతరాత్మగా నుండుటంజేసి జీవవాచకమగు శబ్దముచే

నతఁడు తెలుపఁబడు చున్నాడని శ్రీకాశకృత్స్నాచార్యులు తలంచుచున్నా రు. జీవశబ్దము పరమాత్మ పర్యంతము జీవునిఁ దెలుపునది గాని, యది కేవలము జీవునిమాత్రము తెలుపునదికాదని యింతకుపూర్వము “నామరూపే వ్యాకరవాణి” అను వాక్యమునఁ జెప్పఁబడియె. ఇట్లు జీవాత్మ పరమాత్మలకుఁగల శరీర శరీరి భావమునుబట్టి వారల కైక్యము నుపపాదించినచో, బ్రహ్మము సర్వజ్ఞత్వాపహత పాప్మత్వాది గుణములు గలదియని చెప్పునవియు, సంసారమున నజ్ఞానవశమున దుఃఖపడుచుండు జీవునికి బ్రహ్మోపాసనమువలన మోక్షము సిద్ధించునని చెప్పునవియు, జగత్తుయొక్క సృష్టిప్రళయములఁ జెప్పునవియు, జగత్తుకు బ్రహ్మముతో నైక్యముఁ జెప్పునవియును ఈసమస్త శ్రుతులును బాగుగా నుపపాదింపఁబడినవి యగుచున్నవి. కావున ఈస్థాని గనఁబఱచిన శ్రీకాశకృత్స్నాచార్యులవారి మతమునే సూత్రకారులును అంగీకరించి యున్నారు.

ఈతావున వాక్యముల యానుపూర్వికమగు నర్థమెద్దియనగా:—

ప్రథమమున మైత్రేయి మోక్షోపాయ మెద్దియని యాజ్ఞవల్క్యుని యడుగగా, నంతట యాజ్ఞవల్క్యుండు “ఆత్మావా అరేద్రష్టవ్యః” ఇత్యాది వాక్యమున పరమాత్మోపాసనమును మోక్షోపాయమునుగాఁ దెలిపి, ఉపాస్య వస్తువగు బ్రహ్మముయొక్క లక్షణమును, దున్దుభ్యాది దృష్టాంతములచే ఉపాసనమున కుపకరణములగు మనస్సుమొదలగు నింద్రియముల నియమనమును న్ను “ఆత్మనిఖల్వరేదృష్టే” ఇత్యాదివాక్యమున సామాన్యముగఁజెప్పి “సయథార్ద్రైధాగ్నేః” ఇత్యాది వాక్యములయందును “సయథా సర్వాసామపాం సముద్ర ఏకాయనం” ఇత్యాది వాక్యములయందును ఉపాస్యవస్తువగు పరబ్రహ్మము నిఖిల జగదేకకారణ మగుటను, సమస్తవిషయములయెడలఁ బ్రవృత్తికి మూలకారణములగు నింద్రియములు నియమనమునున్న వివరముగానుపదేశించి “సయథా సైన్ధవఘనః” ఇత్యాది వాక్యమున మోక్షోపాయ విషయమునఁ బ్రవృత్తిని గలుగఁజేయుటకై ప్రోత్సాహపరచుటకుగాను, జీవాత్మ స్వరూపముదుగానుండు పరమాత్మయొక్క యపరిచ్ఛిన్నమగు జ్ఞానమాత్రాకారమును దెలిపి, యట్టిజ్ఞానైకాకారుండగువాడే సంసారదశయందు పంచభూతముల పరిణామమునను వర్తించియుండుటను “విజ్ఞానఘనఏవైతేభ్యోభూతేభ్యస్సముత్థాయ తాన్యేవాను వినశ్యతి” అనువాక్యమునఁ దెలిపి, మోక్షదశయందీ జీవుని స్వాభావికమగు నపరిచ్ఛిన్నజ్ఞానమున కెవ్విధమైన సంకోచమున్ను లేక పోవుటంజేసి యప్పుడతనికి సంసారదశయందువలెనే శరీరముతోనొక్కటిగాఁ

దలంచుటచేఁగలుగు ‘‘నేను దేవుండను, నేను మనుష్యుండను’’ అను జ్ఞానమె ద్దియును లేదని‘‘నప్రేత్య సంజ్ఞాస్తి’’ అను వాక్యమునఁజెప్పి, ఈ నానావిధము లగు వస్తువులను బ్రహ్మాత్మకములు కాని వానినిగాఁ దెలిసికొనుట యజ్ఞాన మూలకము గాన,నట్టి యజ్ఞాన మంతయును పోవుటచే నీ సమస్తప్రపంచమును బ్రహ్మాత్మకమైనదానినిగాఁ దెలిసికొనువాని మనమున బ్రహ్మమునుండి వేఱు గానుండునట్టి వస్తు వొక్కటియు కలదనెడి భావన యుండకూడదుగాన, నట్టి భావనను‘‘యత్ర హిద్వైతమివభవతి’’అను వాక్యమున నిరసించి,యీ జీవాత్మ తనకాత్మగా నుండునట్టి యే పరమాత్మయొక్క యనుగ్రహమువలన జ్ఞానముగలవాడై దీనినంతయును తెలిసికొనఁ గలదియగుచున్నదో,అట్టి పరమాత్మ దేనిమూలముగఁ దెలియ శక్యమని యనఁగా,దేనిమూలముగను అది తెలియ శక్యము కాదనుటచేఁ బరమాత్మను దెలిసికొనుట యశక్యమను విషయమును ‘‘యేనేదంసర్వం విజానాతి తం కేన విజానీయాత్’’ఇత్యాదివాక్యమున ఉపపాదించి, సర్వేశ్వరుండు స్వేతర సమస్త వస్తు విలక్షణమగు స్వరూపుడుగానే యీ సమస్త పదార్థములను తనకు శరీరముగాఁగలిగి యన్నింటిలో నాత్మగా నుండువాడుగాన, నతండు ఆయా చేతనాచేతన పదార్థములకుఁగల దోషములతో నెంతమాత్రము సంబంధము లేనివాడనెడి విషయమును ‘‘స ఏష నేతి నేతి’’ఇత్యాదివాక్యమునఁజెప్పి సమస్త వస్తు విలక్షణుండును, నిఖిల జగదేకకారణుఁడును, సర్వముఁ దెలిసినవాఁడును నగు పురుషోత్తముని మాపైని గనఁబఱిచిన ప్రకారముగా నుపాసించుటకంటెను మోక్షోపాయము వేఱొక్కటిలేదని ‘‘విజ్ఞాతారమరే కేన విజానీయాదితి త్యుక్తానుశాసనాఽసి మైత్రేయ్యేతావదరే ఖల్వమృతత్వం’’అనువాక్యమునఁజెప్పి ముగించియున్నారు. కావున నీపైవాక్యమున పరబ్రహ్మమే యుపపాదింపఁబడుచున్నాఁడు గాన,పరబ్రహ్మమే జగత్కారణము గాని యట్టిది సాంఖ్యసిద్ధాంత ప్రసిద్ధమగు ప్రకృతిగాని దాని, నధిష్ఠించి యుండునట్టి జీవుండుగాని కాడని యేర్పడు చున్నది.

వాక్యాన్వయాధికరణము ముగిసెను.

---

## ప్రకృత్యధికరణము.

**౨౩॥ సూ॥ ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాన్తానుమానాభ్యాం**

టీ॥ ప్రకృతిశ్చ=బ్రహ్మము జగత్తుకు ఉపాదాన కారణమున్ను, ప్రతిజ్ఞా దృష్టాన్తానుపరోధాత్ = ప్రతిజ్ఞకును దృష్టాంతమునకును అను గుణముగా నున్నందున.

తా॥ ప్రతిజ్ఞా దృష్టాంతముల కనుగుణమగుటంజేసి బ్రహ్మము జగత్తుకు ఉపాదానకారణము నయితమని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఇట్లు నిరీశ్వర సాంఖ్యము నిరసింపఁబడగా, సేశ్వరసాంఖ్యు డిట్లు వాదించు చున్నాడు.

ఈక్షణాది గుణసంబంధమునుబట్టి సర్వజ్ఞుండగు ఈశ్వరుండు జగత్కారణమని ఉపనిషత్తులు చెప్పుచున్నను, అవియే ప్రకృతిని జగత్తున కుపాదాన కారణముగాను తెలుపుచున్నట్లు తెలియుచున్నది. ఏలననఁగా, సర్వజ్ఞుండును మార్పునొందనివాడును, అధిష్ఠాతయునగు నీశ్వరుండు తనచే నధిష్ఠింపబడు నదియు, అచేతనమును,మార్పునొందునదియునగు ప్రకృతితోఁ జేరక జగత్కారణము కాదగడని కదా ఉపనిషత్తులు తెలుపుచున్నవి.

అదియేట్లనిన, ఈశ్వరుండు మార్పునొందువాఁడు కాడనియు, ఈతనిచే నధిష్ఠింపఁబడునట్టి ప్రకృతి మార్పునొందునట్టి దనియును గదా కొందరు పఠించుచున్నారు—శ్వేతాశ్వతరోప నిషత్తునందు "నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం" (బ్రహ్మము విభాగరహితమును,మార్పునొందనిదియును, శాంతమును,నిందార్హము కానిదియును,వర్ణరహితమును) అని పఠించుచున్నారు. ఇతరత్ర "సవాఏష మహానజ ఆత్మాఽజరోమరః" (ఈపరమాత్మ గొప్పవాఁడు, జన్మజరామరణములు లేనివాఁడు) అనియు నిట్లు పరమాత్మనుగుఱించి పఠింపఁబడియె. "వికారజననీ మజ్ఞా మష్టరూపా మజాం ధ్రువాం" (మార్పునుబొందునదియు, అచేతనమును, ఎనిమిదిరూపములుగలదియు, పుట్టుకలేనిదియు,నిశ్చలమైనదియు,) అనియు, "ధ్యాయతే ధ్యాసితాయేన తన్యతే ప్రేర్యతేపునః సూయతే పురుషార్థంచ తేనైవా ధిష్ఠితాజగత్" "ఏది యెవనిచే ధ్యానింపఁబడి (ప్రేరింపఁబడి,పురుషార్థమును గలుగఁజేయుచున్నదో దానిచే నీ జగమంతయును నిండియున్నది) అనియు, "గౌరనాద్యన్తవతీ సా జనిత్రీ భూతభావినీ" (ప్రకృతి జన్మమరణములు లేనిదియు, సృజించునదియు,ముందున్నటిదియు,ఇంక మీదు ఉండపోవునదియును) అనియు నిట్లు ప్రకృతినిగుఱించి పఠింపఁబడియె. అట్లె కొన్నిశ్రుతులయందు ఉపాదానకారణమగు ప్రకృతిని యధిష్ఠించినవాఁడై యీశ్వరుండు జగత్తును సృజించుచున్నాడని వినఁబడుచున్నది. ఎట్లనిన, శ్వేతాశ్వతరోప నిషత్తునందు "అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్" (సర్వేశ్వరుండు ప్రకృతినుండి యీజగమును సృజించుచున్నాడు) అనియు, "మాయాంతు ప్రకృతింవిద్యా న్మాయినంతు మహేశ్వరం" (మాయను ప్రకృతినిగాను అట్టి మాయగలవానిని ఈశ్వరునిగాను ఎఱుంగుము) అనియును పఠింపఁబడియె.

స్మృతియందును «మయాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరం" (నాచేన ధిష్ఠింపఁబడినదై ప్రకృతి స్థావర జంగమాత్మకమగు జగత్తును సృజించుచున్నది) అని పఠింపఁబడియె.

ప్రకృతి జగత్కారమను విషయము ఈపైవాక్యములవలనఁ దెలియరాకున్నను, బ్రహ్మము జగత్కారణ మనునది వేఱొక్కవిధముగ సిద్ధింపనందున ప్రకృతియొక్క స్వరూపమును, అది యీశ్వరునిచే నధిష్ఠింపఁబడినదియై జగదుపాదాన కారణమగుటయును సిద్ధించుచున్నవి.

ఇట్లే లోకమునను నిమిత్తోపాదాన కారణపదార్థములు వెవ్వేరుగానుండునవిగాను తెలియవచ్చుచున్నవి. దృష్టాంతము:—మృత్తిక, సువర్ణము మొదలగు అచేతన పదార్థములు ఘటము కటకము మొదలగు వానికి ఉపాదానకారణములుగాను, చేతనులగు కులాలుడు కంసాలి మొదలగువారు నిమిత్తకారణములుగానును తెలియవచ్చుచున్నారు. ఇంతియేకాక లోకమున నెద్దియైన నొకపదార్థము సృజింపబడవలయునన్న, అందులకై యనేకులు పాటుపడవలసినట్లు గన్పట్టుచున్నది. ఈపైని గానఁబఱచిన ప్రకారము నిమిత్తోపాదాన కారణపదార్థములు వెవ్వేరయినవిగా నుండవలయుననెడి నియమమును, ఏదైన నొక పదార్థము ఉత్పన్నము కావలయునన్న, అనేకులు పాటుపడవలసియుండు ననెడి నియమమునున్నువిడిచి బ్రహ్మమొక్కటియే ఉపాదానకారణమును నిమిత్తకారణమునని వేదాంతవాక్యములు ప్రతిపాదింపఁజాలవు. కావున బ్రహ్మము నిమిత్త కారణమే కాని ఉపాదాన కారణము కాదు. ఉపాదాన కారణ మన్ననో, బ్రహ్మముచే నధిష్ఠింపఁబడినట్టి ప్రకృతియే.

## సిద్ధాంతము.

ఇట్లు పూర్వపక్షమురాగా ఇందులకు సమాధానము నీ సూత్రముచేఁ దెలుపుచున్నాఁడు:—సూత్రమునందుండు «ప్రకృతిశ్చ" అను పదమునకుఉపాదానకారణము నయితము అని యర్థము. అనఁగా బ్రహ్మము నిమిత్తకారణము మాత్రమేకాదు. అదియుపాదానకారణము నయితమని ఫలితార్థము. ఏలననఁగా, ఇవ్విధమున, నంగీకరించినచో, శ్రుతియందుఁ గాన్పింపఁబడిన ప్రతిజ్ఞయును దృష్టాంతమున్ను సమన్వితము లగును. అది యెట్లనిన, « స్తబ్ధోస్యుత తమాదేశ మప్రాక్ష్యః యేనాశ్రుతం శ్రుతం భవత్యమతంమత మవిజ్ఞాతం విజ్ఞాతం" (ఏల మాటలాడకుంటివి? దేనిచే వినఁబడనిది వినఁబడినదగునో, చింతింపఁబడనిది చింతింపఁబడినదగునో, తెలియఁబడనిది తెలియఁబడినదియగునో) అను వాక్యమున నొక్కటి తెలియుటచే సర్వము తెలియవచ్చుననెడి

ప్రతిజ్ఞ చేయఁబడినది. దృష్టాన్తమున్ను "యథాసోమ్య ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతంస్యాత్" (ఓసౌమ్యుఁడా! ఒక్క మట్టిముద్ద తెలియుటచే మట్టితో జేయఁబడినదంతయు నెట్లు తెలియవచ్చునో) అనియు "యథాసోమ్యైకేన లోహమణినా" (ఓసౌమ్యుడా ఒక లోహమణి తెలియుటచే లోహమణిచేఁ జేయఁబడినదంతయు నెట్లు తెలియవచ్చునో) అనియు "యథాసోమ్యైకేన నఖనికృన్తనేన" (ఒక్క గోరుగోలు తెలియుటచే ఇనుముతోఁ జేయఁబడినదంతయును ఎట్లు తెలియవచ్చునో" అనియు నీమొదలగుతావుల కారణవస్తువు తెలియుటచే కార్యపదార్థములన్నియు తెలియవచ్చుననిి చెప్పఁబడియె. పూర్వపక్షి వాదించురీతిని బ్రహ్మము నిమిత్తకారణమే యగుపక్షమున, అట్టి బ్రహ్మము తెలియుటచే సర్వము తెలిసినది కాకపోవును. దృష్టాంతము—కులాలాదులు తెలియుటచే ఘటాదిపదార్థములు తెలియరావు. అందువలన వేదాంతశాస్త్రపు ప్రతిజ్ఞయును దృష్టాంతమును బాధింపఁబడినవి యగును. బ్రహ్మము ఉపాదాన కారణమగు పక్షమున, లోకమున ఉపాదాన కారణములగు మృత్తిక లోహమణి వుక్కు మొదలగునవి తెలియుటచే ఘటము మణులు కటకము మొదలగునవి తెలియవచ్చుచందంబున, నిఖిల జగదుపాదాన కారణమగు బ్రహ్మము తెలియవచ్చుటచే తత్కార్యభూతమగు సమస్తప్రపంచమున్ను తెలియవచ్చును. ఏలననఁగా, కారణవస్తువే వేఱొక్క యవస్థను పొందినదైనప్పుడు, కార్యపదార్థ మనిపించుకొనుచున్నది కాని, యట వేఱొక్క పదార్థము కాదనుచు, కార్యవస్తువులుగాను కారణవస్తువులుగాను నుండునట్టి మృత్తికఘటాదులు శ్రుతియందు దృష్టాంతములనుగాను గాన్పించి ప్రతిజ్ఞను సమర్థించుటంజేసి బ్రహ్మమే జగత్తుయొక్క యుపాదానకారణము సయితమని నిశ్చయింపఁబడుచున్నది.

నిమిత్తోపాదాన కారణములకు భేదమున్నట్లు శ్రుతివలననే తెలియునున్నదని పూర్వపక్షి చేయువాదను యుక్తమైనదికాదు. ఏలననఁగా నిమిత్తోపాదాన కారణభూతమగు వస్తువొక్కటియే యనిగదా "ఉత తమాదేశమప్రాక్ష్యః యేనాశ్రుతం శ్రుతంభవతి" ఇత్యాది శ్రుతివాక్యమువలనఁ దెలియుచున్నది. ఈ పైశ్రుతియందు "ఆదేశః" అనఁగా "ఆదిశ్యతే=ప్రశిష్యతే =శాసింపఁబడునది" యని యర్థము. అనఁగా శాసనమని యర్థము. కనుకనే "ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి" అనువాక్యమున నట్టి యాదేశము "శాసన" శబ్దముచే పేర్కొనఁబడుచున్నది. "అన్నింటికంటెను ఎక్కువసాధనభూతమైనది" అను నర్థమును తెలుపు తృతీయావిభక్తిపద మీతావున కర్త్రి

ర్థమున వివక్షింపఁ బడినది. "ఏశాసకునిగుఱించి వినుటచేత వినఁబడని దంతయును వినఁబడిన దగుచున్నదో, ఆశాసకుని గుఱించి యడిగి యుంటివా యని "యేనాశ్రుతం" ఇత్యాది వాక్యమువలనఁ దెలియవచ్చుటచే నిమిత్తో పాదాన కారణవస్తు వొక్కటిగాను తెలియుచున్నది. మఱియు, "సదేవసోమ్యే దమగ్ర ఆసీదేకమేవ" అను వాక్యమున "ఏకమేవ" అను పదముచే సృష్టికి పూర్వము బ్రహ్మమొక్కటియే యుండెనని నిర్ధారణముగాఁ జెప్పి యున్నందునను, "అద్వితీయం" అను పదముచే బ్రహ్మముకంటెను వేఱొక్క నియామకుండు లేడని చెప్పియున్నందునను అట్లు తెలియుచున్నది. అయితే "వికారజననీం" అనియు "గౌరనాద్యన్తవతీ" అనియు నీమొదలగు శ్రుతుల యందు ప్రకృతి యాద్యంతములులేనిదై నిత్యమయినదనియు, జగత్తునకు ఉపాదానకారణమనియును చెప్పియుండుట యెట్లుపొసగునని యడిగెదవేమో, చెప్పెదను. ఈతావునను సృష్టికి పూర్వము నామరూప విభాగములు లేనిదై కారణావస్థలోనుండునట్టి బ్రహ్మమే ప్రకృతి శబ్దముచే తెలుపఁబడుచున్నది. ఏలననఁగా, బ్రహ్మముకంటెను వేఱుగానుండునట్టి వస్తు వొక్కటియు లేనే లేదు గదా! అట్లే "సర్వం తం పరాదద్యో న్యత్రాత్మనః సర్వంవేద" (ఎవఁడు సర్వమును పరమాత్మకంటెను వేరుగా నుండుదానినిగా నెఱుంగునో, వానిని సర్వమును వేఱుచేయును) అనియు "యత్రత్వస్య సర్వమాత్మైవాభూత్ తత్కేనకం పశ్యేత్" (ఎవ్వని మనమున సర్వము పరమాత్మతోఁ జేరియుండునది యనెడి నిశ్చయము కలుగునో, అట్టివాఁడెవ్వఁడు సర్వము నట్టిపరమాత్మకంటెను వేఱుగానుండునట్టిదానినిగాఁ దెలసికొనును,) అనియు నీమొదలగు శ్రుతులివ్విధమునఁ జెప్పుచుండుటంజేసియు, "సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఈసమస్తమును పరబ్రహ్మముతో జేరియుండునది) అనియు "ఐతదాత్మ్యమిదంసర్వం" (ఇదియంతయు పరమాత్మతో సంబంధించినది) అనియు నీమొదలగుతావుల కార్యావస్థలో నుండునదియు, కారణావస్థలో నుండునదియునగు నీప్రపంచమంతయును బ్రహ్మాత్మకమైనదియని తెలియవచ్చుటవలనను అట్లు తెలియుచున్నది. దీని ఫలితార్థమేమనఁగా, "యఃపృథివీ మన్తరే సఞ్చరన్ యస్యపృథివీ శరీరం యం పృథివీనవేద" అనియారంభించి "యోవ్యక్త మన్తరే సఞ్చరన్యస్యావ్యక్తంశరీరం యమవ్యక్తం నవేదయో క్షరమన్తరే సఞ్చరన్యస్య క్షరంశరీరం యమక్షరం నవేద" అనియు, బృహదారణ్యకమున, "యఃపృథివ్యాంతిష్ఠన్పృథివ్యాఅన్తరోయం పృథివీనవేద యస్య పృథివీశరీరం యః పృథివీమన్తరో యమయతి సత ఆత్మాన్తర్యామ్యమృతః" అనుతావుల సమస్తములగు చేత

నాచేతన పదార్థములు శరీరముగాగల వాడగుటంజేసి ఎల్లకాలము వాటికన్నిం టికి నాత్మయగు పరబ్రహ్మము ఒకప్పుడు నామరూప విభాగము గలదిగాను, వేఱొకప్పుడు నామరూపవిభాగము లేనిదిగానునగును,ఎప్పుడది నామరూపవిభా గముగలదియగునో, అప్పుడది అనేకమైనదిగాను కార్యపదార్థముగానును చెప్పఁ బడుచున్నది.ఎప్పుడది నామరూప విభాగము లేనిదగునో, అప్పుడది రెండవది లేనిదిగాను కారణవస్తువుగానును చెప్పఁబడుచున్నది. ఇట్లు సర్వదా చేతనా చేతన శరీరుండగు పరబ్రహ్మముయొక్క నామరూప విభాగము లేనిదియగు కారణావస్థయెద్దియో, అదియే శ్రుతులయందు “గౌరనాద్యన్తవతీ” అనియు, “వికారజననీమజ్ఞాం” అనియు, “అజామేకాం” అనియు నీమొదలగుతావులఁ జెప్పఁబడుచున్నది.

అయితే “ మహానవ్యక్తే లీయతే అవ్యక్తమక్షరే లీయతే” (మహత్తు అవ్యక్తమున లయమగుచున్నది. అవ్యక్తము అక్షరమున లయమగు చున్నది) అని యిట్లు అవ్యక్తమునకు జన్మనాశము లున్నటుల శ్రుతివలనఁ దెలియు చున్నది. అట్లే శ్రీమహాభారతమునను, “తస్మాదవ్యక్త ముత్పన్నం త్రిగుణం ద్విజసత్తమ” (దానినుండి సత్త్వ రజస్తమో గుణములుగల యవ్యక్తము ఉత్పన్నమైనది) అనియు, “అవ్యక్తం పురుషే బ్రహ్మన్ నిష్క్రియే సంప్రలీయతే” (అట్టి యవ్యక్తము నిరాకారుండగు పురుషునియందు లీనమగు చున్నది) అనియును చెప్పఁబడి యున్నదే, యని యడిగెదవేమో, అది యొక దోషము కాదు. ఏలననఁగా, త్రిగుణాత్మకమగు నవ్యక్తమనఁబడునది అచేతన వస్తువు శరీరముగాగల బ్రహ్మముచే సృజింపఁబడిన వస్తువు.మరియు, “యదాత మస్తన్న దివా న రాత్రిః” అనువాక్యమున మహాప్రళయము సంభవించినప్పు డును, బ్రహ్మైకమును, అతిసూక్ష్మమునునగు నచిద్వస్తువు ఉన్నట్లుచెప్పి యుండుటంజేసి జగత్కారణమగు బ్రహ్మముకు శరీరభూతమును, అతిసూక్ష్మ మునునగు నచిత్పదార్థము బ్రహ్మముతో నిత్యముగానుండునదియే గాన, అట్టి యచిత్పదార్థము శరీరముగాగల బ్రహ్మమే “గౌరనాద్యంతవతీ” ఇత్యాది వాక్యములయందుఁ జెప్పఁబడుచున్నాఁడు.కావుననే “అక్షరం తమసి లీయతే తమః పరేదేవ ఏకీభవతి” (అక్షరము తమస్సున లయమగు చున్నది తమస్సు పరమాత్మతో ఏకీభావముగలదియగుచున్నది) ఇత్యాదివాక్యమున ఏకీభావము చెప్పఁబడుచున్నదే కాని లయము చెప్పఁబడుచుండలేదు. ఏకీభావమనఁగా, తమస్సనఁబడు నతిసూక్ష్మమగు నచేతనపదార్థము శరీరముఁగాగల బ్రహ్మము నామరూపవిభాగము లేనివాఁడైయుండునట్టి స్థితి.ఇట్టి స్థితినే,“తమ ఆసీత్తమసా

గూఢమగ్రే ప్రకేతం తమస స్తన్మహినా జాయతైకం" ఇత్యాది వాక్యమున్ను ఈవిషయమునే తెలుపుచున్నది. మనుస్మృతియందును, "ఆసీదిదంతమోభూత మప్రజ్ఞాత మలక్షణం అప్రతర్క్య మవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వశః" (సృష్టికి పూర్వ మిదియంతయును తమస్సుగాను, తెలియనిదిగాను, నామరూప విభాగము లేనిదిగాను, ఇంతమాత్రమని యూహింపనలవి కానిదిగాను అంతటనునిద్ర బోయినట్లుగానుండెను) అనియిట్లు చెప్పఁబడియె. "అస్మాన్మాయీ సృజతే విశ్వ మేతత్" అను వాక్యమురెయొక్క యర్థము ఇంకమీఁదు ఉపపాదింపఁబడును. బ్రహ్మము మార్పునొందునదికాదని తెలుపు శ్రుతుల యర్థమున్ను ఇఁకమీఁదు ఉపపాదింపఁ బడును.

ఒక్కటియే వస్తువు నిమిత్తకారణమును, ఉపాదాన కారణమునునగుట యసంభవమనియు, మఱియును ఒకవస్తువు యుత్పన్నము కావలయునన్న అది యొక్కదానినుండియే యుత్పన్నమగుటయు నసంభవమనియు, అట్లులోకమున నియమము గానఁబడుచున్నదనియు, కావున "అగ్నినా సిఞ్చేత్." ఇత్యాది వాక్యములవలెనే వేదాంతవాక్యములును ఒక్కటియే వస్తువునుండి జగత్తుయొక్క యుత్పత్తి గలుగుచున్నదని ప్రతిపాదింపఁజాలవనియు నివ్విధమున పూర్వపక్షి చేయువాదమునకు సమాధాన మిట్లు చెప్పఁబడుచున్నది. అదియెట్లనిన, పరబ్రహ్మము స్వేతరసమస్త వస్తువులకంటెను విలక్షణుండును, సర్వశక్తుండును, సర్వజ్ఞుండును గాన నతనియొక్కనినుండియే సర్వము ఉత్పన్నమగుట మొదలగునది యంతయును సంభవ మగుచున్నది. మృత్తిక మొదలగు పదార్థములన్నను, అచేతనము లగుటంజేసి వాటికి జ్ఞానము లేదు గాన, నవి యొకదాని నధిష్ఠించి యుండజాలమిఁజేసియు, అధిష్ఠాతయగు కులాలుండు నానావిధములుగ పరిణమించునట్టివాడుకాకపోవుటంజేసియు, సత్యసంకల్పుండును కాకపోవుటంజేసియును లోకమున నవ్విధముగానే కానఁబడవచ్చును. కావున బ్రహ్మమే జగత్తుయొక్క నిమిత్తకారణము ఉపాదానకారణముననిసిద్ధమగుచున్నది.

౨౪॥ సూ॥ అభిధ్యోప దేశాచ్చ

టీ॥ అభిధ్య=సంకల్పించి (సృజించినట్లు) ఉపదేశాచ్చ = శ్రుతులయందుపదేశించి యున్నందునను అట్లు తెలియుచున్నది.

తా॥ సంకల్పించి సృజించినట్లు శ్రుతియందుఁ జెప్పియుండుటంజేసియు బ్రహ్మము జగత్కారణమని తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ ఈక్రిందు గాన్పింపఁబడు హేతువును బట్టియును నిమిత్తకారణమును ఉపాదానకారణమును ఈయుభయమును బ్రహ్మమేయని తెలియు

చున్నది. ఏలననఁగా "సోఽకామయత బహుస్యాం ప్రజాయాయ" అనియు "తదైక్షత బహుస్యాం ప్రజాయాయ" అనియు నీమొదలగు శ్రుతివాక్యముల యందు స్రష్టయగు బ్రహ్మము తానే స్వయముగ అనేకవిధములుగా నగునట్లు యుపదేశింపఁబడియె. ఈతావున భగవంతుఁడు తానే స్వయముగ ననేకముగా నగుదునని సంకల్పించి తరువాత జగత్తును సృజించినట్లుగదా యుపదేశింపఁబడినది.

౨౫॥ సూ॥ సాక్షాచ్చోభయామ్నానాత్

టీ॥ సాక్షాచ్చ=శ్రుతియందే, ఉభయామ్నానాత్=బ్రహ్మము ఉభయమని, ఆమ్నానాత్=ఉపదేశించుటను బట్టియును.

తా॥ బ్రహ్మము నిమిత్తకారణమును ఉపాదానకారణమును ఈరెండునని శ్రుతియందే యుపదేశించియుండుటనుబట్టియును అట్లు తెలియుచున్నది.

శ్రీ॥భా॥ ప్రతిజ్ఞ, దృష్టాంతము, సంకల్పపూర్వకమగు సృష్టి యీమొదలగు వానినిబట్టిమాత్రమే ఈవిషయము నిశ్చయింపఁబడుచుండలేదు. అయితే బ్రహ్మము నిమిత్తకారణమును ఉపాదాన కారణమునని శ్రుతులయందే సాక్షాత్తుగ చెప్పఁబడినది. అదియెటులనిన, "కింస్విద్వనం కఉసవృక్షఆసీద్యతో ద్యావా పృథివీ నిష్టతక్షుః మనీషిణో మనసా పృచ్ఛతే తద్యదధ్యతిష్ఠ ద్భువనాని ధారయన్ (పృథివ్యంతరిక్షములు నిలిచియుండు ఆధారమెద్ది? ఉపాదానమేది? ఓపండితులారా! ఈవిషయమును మనస్సుతో యోచించి అడుగుచున్నాఁడను. ఏది యీలోకములను ధరించియున్నదో తెలుపుము) అనియడుగగా "బ్రహ్మ వనం బ్రహ్మ సవృక్ష ఆసీద్యతో ద్యావా పృథివీ నిష్టతక్షుః। మనీషిణో। మనసా బ్రవీమివో బ్రహ్మాధ్య తిష్ఠద్భువనానిధారయన్" (బ్రహ్మమే యాధారము బ్రహ్మమే యుపాదానము ఇదియే లోకములను ధరించియుండునది. ఈవిషయమును మనస్సుతో నాలోచించి చెప్పియున్నాను.) అను వాక్యమున సృష్టికర్తయగు బ్రహ్మముసృజించుటకై యుపాదానమెద్ది? ఉపకరణము యేది? యని యివ్విధమున లోకానుసారముగ నడుగగా, సకలేతర విలక్షణుండగు బ్రహ్మము సర్వశక్తి గలవాడగుట విరుద్ధముకాదుగాన, బ్రహ్మమే యుపాదాన కారణమును ఉపకరణములునని ప్రత్యుత్తర మీయబడియె. కావున నిమిత్తోపాదానకారణములు రెండును బ్రహ్మమే.

౨౬॥ సూ॥ ఆత్మకృతేః

టీ॥ ఆత్మకృతేః=బ్రహ్మము తానే స్వయముగ జగత్తుగా నయినట్లు చెప్పియున్నందునను

తా॥ తానే స్వయముగఁ జేయఁబడినట్లు చెప్పియున్నందునను అట్లు తెలియుచున్నవి.

శ్రీ॥ భా॥ "సోకామయత బహుస్యాం" ఇత్యాదివాక్యమునఁ జెప్పియున్నట్లు సృజించుట కుద్యుక్తమైన బ్రహ్మము "తదాత్మానం స్వయమకురుత" (బ్రహ్మము తనను స్వయముగా జగత్తునుగా జేసినదాయెను) అను వాక్యమువలన నది స్వయముగ కర్త(చేయునది)గాను, కర్మ (చేయఁబడునది)గానును దెలియ వచ్చుటంజేసి బ్రహ్మమే యనేక పదార్థములుగా జేయఁబడినట్లు తెలియుచున్నది. ఇందువలన బ్రహ్మమే యుపాదాన కారణమును,నిమిత్తకారణము నని తెలియుచున్నది.దీనిఫలితార్థ మేమనఁగా:—నామరూప విభాగము లేనట్టి బ్రహ్మము కర్త. అట్టి విభాగముగల బ్రహ్మము కర్మ.కావున కర్తయును కర్మయును రెండును బ్రహ్మ మొక్కటియే యగుట విరుద్ధము కాదు.బ్రహ్మము తననే స్వయముగ నట్లు చేసినది యని శ్రుతియందుఁ జెప్పియుండుటచే బ్రహ్మమే నిమిత్తోపాదాన కారణములు రెండు నని తెలియుచున్నది.

అవతారిక:—"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనియు, "ఆనందో బ్రహ్మ" అనియు,"అపహత పాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘత్సోఽపిపాసః" అనియు, "నిష్కళం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం" అనియు, "సవాఏష మహానజ ఆత్మాఽజరోఽమరః" అనియు నీమొదలగు శ్రుతులయందు బ్రహ్మము స్వభావసిద్ధముగ నిరస్త సమస్త చేతనాచేతనవర్తిదోషగంధముగాను, నిరతిశయ జ్ఞానానందైక రసముగానును చెప్పఁబడియుండగా, అట్టి బ్రహ్మము అనంతములును నానావిధములును నగు హేయపదార్థముల కాస్పదములగు చిదచిత్పదార్థములతోఁ జేరియుండునట్టి జగత్తుగాను స్వసంకల్ప పూర్వకముగానగుట యెట్లు సంభవమని శంకింపఁగా నందులకు సమాధానము చెప్పుటకై:—

సూ॥ పరిణామాత్

టీ॥ పరిణామాత్ = పరిణమించు స్వభావముగలదియగుట వలనను

తా॥ పరిణమించునట్టి స్వభావముగలది యగుటవలనను అట్లు తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ సూత్రమునందుండు పరిణామశబ్దమునకు పరిణమించునట్టి స్వభావముగలది యగుటవలననని యర్థము. ఈ తావునను పరిణామ మనునది పరబ్రహ్మము విషయమునఁ నొకదోషమును తోపింపఁజేయునట్టిదికాదు. అయితే యది యతని విషయమున నిరంకుశైశ్వర్యమును తోపింపఁ జేయుటయందు తాత్పర్య

ముగలది. ఇట్టిది గానే కదా యదిశ్రుతులచే నుపదేశింపఁ బడుచున్నది. సమస్తములగు హేయగుణములకు విరుద్ధములగు కల్యాణగుణములకు ముఖ్యస్థానమును, తనకంటెను వేఱగు సమస్త పదార్థములనుండియు విలక్షణమైనదియు, సర్వజ్ఞమును, సత్యసంకల్పమును, అవాప్త సమస్త కామమును, మేరలేకుండ హెచ్చియుఁడు ఆనందముగలదియును, తనక్రీడకు ఉపయుక్తములగు సమస్త చేతనాచేతన పదార్థములును శరీరముగా గలదియగుటంజేసి వాటిలో నాత్మగానుండునదియునగు పరబ్రహ్మము, తనకు శరీరమగు ప్రపంచము తన్మాత్రాహంకారాదివరంపరగా పూర్వపూర్వ కారణవస్తువునందు లయమయి తుట్టతుదకు అతిసూక్ష్మమును, తమస్సనంబడు నచేతనవస్తువుమాత్రము మిగిలియుండి యదియును వాని శరీర మగుటంజేసి వానినుండి వేఱుగా దెలియరానంత సూక్ష్మమగు నవస్థను బొందుటచే వానితో నైక్యమును బొందినది కాఁగా, అట్టి తమస్సను నది శరీరముగాఁగల బ్రహ్మము పూర్వమువలెనే నామరూప విభాగముగల చేతనాచేతన పదార్థములతోఁ జేరియుండునదియగు ప్రపంచము శరీరముగాఁగలదిగా నగుదునని సంకల్పించి పూర్వము లయమైన క్రమముగ తన నట్టి జగద్రూపమగు శరీరము గలవానినిగాఁ బరిణమింపఁ జేయుచున్నదని యిట్లు ఉపనిషత్తులయందంతటను పరిణామమును గుఱించి యుపదేశింపఁ బడియె. అట్లే బృహదారణ్యకమున, ‘‘యః పృథివ్యాం తిష్ఠన్ యః పృథివ్యా అన్తరోయం పృథివీ నవేదయస్య పృథివీశరీరం యఃపృథివీ మన్తరో యమయతి సత ఆత్మాన్తర్యా మ్యమృతః’’ అని యారంభించి ‘‘యస్యాపశ్శరీరం’’ ‘‘యస్యాగ్నిశ్శరీరం’’ ‘‘యస్యాన్తరిక్షం శరీరం’’ ‘‘యస్యవాయుశ్శరీరం’’ ‘‘యస్యద్యౌశ్శరీరం’’ ‘‘యస్యాదిత్యశ్శరీరం’’ ‘‘యస్యదిశశ్శరీరం’’ ‘‘ యస్యచంద్రతారకంశరీరం’’ ‘‘ యస్యాకాశశ్శరీరం ’’ ‘‘యస్యతమశ్శరీరం’’ ‘‘యస్య తేజశ్శరీరం’’ ‘‘ యస్యసర్వాణి భూతానిశరీరం’’ ‘‘యస్యప్రాణశ్శరీరం’’ ‘‘యస్యవాక్ఛరీరం’’ ‘‘యస్యచక్షుశ్శరీరం’’ ‘‘యస్య శ్రోత్రంశరీరం’’ ‘‘యస్యమనశ్శరీరం’’ ‘‘యస్యత్వక్ఛరీరం’’ ‘‘యస్యవిజ్ఞానంశరీరం’’ ‘‘యస్యరేతశ్శరీరం’’అనువరకును ఈసమస్తప్రపంచము బ్రహ్మముయొక్క శరీరమనియు, బ్రహ్మమట్టి శరీరమున కాత్మయనియును పఠింపఁబడితిని. ఈపైని గనఁబఱచిన బృహదారణ్యపు కాణ్వపాఠమున ‘‘యస్యవిజ్ఞానంశరీరం’’ అను తావుననుండు ‘‘విజ్ఞాన’’శబ్దమునకు బదులుగా, మాధ్యందినపాఠమున ‘‘యస్యాత్మా శరీరం’’ అనుతావున ‘‘ఆత్మన్’’ శబ్దము ప్రయోగింపఁబడినది. ఇదియే యీరెండుపాఠములకుఁగల విశేషము. అయితే యిచట లోక, యజ్ఞ, వేదములును పరమాత్మ శరీరములుగాను పేర్కొనఁబడినవి. ఇదియే యీమాధ్యందినపాఠమున

నధిగముగాఁ జెప్పఁబడినవిషయము. సుబాలోపనిషత్తునందు “యస్యబుద్ధిశ్శరీరం” “యస్యాహంకారశ్శరీరం” “యస్యచిత్తంశరీరం” “యస్యావ్యక్తంశరీరం” “యస్యాక్షరంశరీరం” “యోమృత్యుమన్తరే సంచరన్ యస్యమృత్యుశ్శరీరం యంమృత్యుర్న వేద ఏషసర్వ భూతాన్తరాత్మాఽపహత పాప్మాదివ్యో దేవ ఏకో నారాయణః” అనువాక్యములయందు పృథివ్యాది తత్త్వములు పరమాత్మయొక్క శరీరములని తెలిపి, ఇంతియేకాక బృహదారణ్యకమునచెప్పఁబడిన తత్త్వములును బ్రహ్మముయొక్క శరీరమనియు,బ్రహ్మము వాటిలో నంతరాత్మగా నుండువాడనియును చెప్పఁబడియె. ఈతావుననుండు “మృత్యు” శబ్దము పూర్వము తమశ్శబ్దముచేఁ దెలుపఁబడిన యచేతనవస్తువు తెలుపఁబడుచున్నది. ఏలననఁగా “ అవ్యక్త మక్షరే లీయతే అక్షరం తమసిలీయతే ” అనుతావున నిచటనే లయక్రమము తెలుపఁబడుచున్నది. అన్నియాత్మలయొక్కయును జ్ఞానమును గప్పివేయుటయను అనర్థమునకు కారణభూతమగుటంజేసి యట్టి తమస్సే యిచట మృత్యువని పేర్కొనఁ దగినది. బ్రహ్మముకు శరీరభూతము లగుటంజేసి బ్రహ్మాత్మకములగు తత్త్వములకు బ్రహ్మమునందే ప్రళయము గలుగుచున్నట్లు “పృథివ్యప్సు ప్రలీయతే ఆపస్తేజసి లీయన్తే తేజోవాయౌ లీయతే వాయురాకాశే లీయతే ఆకాశమింద్రియే ష్వింద్రియాణి తన్మాత్రేషు తన్మాత్రాణి భూతాదౌ లీయన్తే భూతాది ర్మహతి లీయతే మహానవ్యక్తేలీయతే అవ్యక్త మక్షరే లీయతే అక్షరంతమసి లీయతే తమఃపరేదేవ ఏకీభవతి” ఇత్యాది వాక్యములయందుఁ జెప్పఁబడుచున్నది. బ్రహ్మముతో నవిభాగమును బొందునట్టి దశయందును (ప్రళయమునను) అతిసూక్ష్మములును, కర్మసంస్కారయుక్తములునగు చేతనాచేతన పదార్థములుండియే యున్నవని “నకర్మా విభాగాదితిచే న్నానాదిత్వా దుపపద్యతేచా ప్యుపలభ్యతేచ” (బ్ర. సూ. ౨. ౧. ౩౫) అనుసూత్రమున సూత్రకారులు ఉత్తరత్ర ఉపపాదింపఁ బోవుచున్నారు. ఈపైని గనఁబఱచినప్రకారము తననుండి వేఱుయినవిగాను చెప్ప శక్యముగానంత సూక్ష్మము లగుటంజేసి పరమాత్మతో నేకీభూతములై యత్యంత సూక్ష్మములగు చేతనాచేతన పదార్థములు శరీరముగాఁగలదియు, ఒక్కటియు, అద్వితీయమును, నిరతిశయానందమును, సర్వజ్ఞమును, సత్యసంకల్పమునునగు బ్రహ్మము స్పష్టమగు నామరూపవిభాగముగల చిదచిద్వస్తువులు శరీరముగాగలదిగాను కావలయునని నెడి సంకల్పముతో జగదాకారముగ పరిణమించినట్లు “సత్యంజ్ఞాన మనంతంబ్రహ్మ” “తస్మాద్వా ఏతస్మా ద్విజ్ఞానమయా దన్యోన్తర ఆత్మాఽనన్దమయః” “ఏషహ్యేవానందయాతి” “సోకామయత బహుస్యాం ప్రజాయేయే

తి నతపోతప్యత సతప స్తప్త్వా ఇదం సర్వ మసృజత యదిదం కిఞ్చ తత్సృష్ట్వా తదే వాను ప్రావిశత్ తదనుప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్ నిరుక్తంచానిరుక్తంచ నిల యనంచా నిలయనంచ విజ్ఞానంచా విజ్ఞానంచ సత్యంచా నృతంచ సత్యమభ వత్'' ఇత్యాది వాక్యములయందుఁ జెప్పఁబడుచున్నది. ఈ తావునఁ జెప్పఁ బడినట్టి తపశ్శబ్దము ఇంతకుపూర్వమున్న జగత్తుయొక్క ఆకారమునుగురించిన యాలోచన రూపమగు జ్ఞానమును తెలుపునది. ఏలననఁగా, ''యస్యజ్ఞానమయం తపః'' అను వాక్యమునందు సర్వేశ్వరుని తపస్సనునది జ్ఞానరూపమైనదిగాను కదా చెప్పఁబడినది అనఁగా పూర్వము తాను సృజించిన జగత్తుయొక్క యాకా రమును పరిశీలించి ఇప్పుడును ఆప్రకారముగానే సృజించుచున్నాడనుట. అట్లు బ్రహ్మము సర్వకల్పములయందును ఒక్కవిధమైనదానినిగానే జగత్తునుసృజించె ననికదా ''సూర్యాచంద్రమసౌ ధాతా యథా పూర్వమకల్పయత్ దివంచ పృథివీం చాన్తరిక్షమథోసువః'' అనియు ''యథర్తుష్వృతులిఙ్గాని నానా రూపాణి పర్యయే। దృశ్యన్తేతాని తాన్యేవతథాభావా యుగాదిషు'' ఇత్యాది శ్రుతిస్మృతులవలన నట్లు తెలియుచున్నది. దీని తాత్పర్య మేమనగా, స్వయ ముగ అపరిచ్ఛిన్నమగు జ్ఞానానంద స్వభావము గలవాడును, ఎక్కువసూక్ష్మ ములగుటచే నసత్కల్పములును స్వలీలోప కరణములునగు చేతనాచేత నపదార్థములు శరీరముగాగలవాడగుటచే చేతనాచేతన మయుండగు పరమాత్మ విచిత్రములును అనంతములునగు క్రీడోపకరణములను గలుగఁజేసికొనుటకై స్వశరీర భూతములగు ప్రకృతిపురుష సమష్టి మొదలుకొని మహాభూతములవర కును తనను తత్తద్వస్తు శరీరునిగాను పరిణమింపఁజేసి తత్తద్వస్తుమయుండై మరల ''సత్'' అనియు ''త్యత్'' అనియు నీశబ్దములచే తెలుపఁబడునవియు, విచిత్ర చేతనాచేతన పదార్థ మిశ్రమములునగు దేవాది స్థావరాంతములగు పదార్థములతోఁ జేరియుండు జగత్తుగా నాయెను. ''తదేవాను ప్రావిశత్త దనుప్రవిశ్య'' ఇత్యాది వాక్యము కారణా వస్థయందు ఆత్మగా నుండి యున్నట్టి పరమాత్మయే కార్యరూపముగాను పరిణమించునట్టి పదార్థమున కును అంతరాత్మగాను ఆయాపదార్థముగా నాయెనని తెలుపుచున్నది. ఇట్లు పరమాత్మ చేతనాచేతన పదార్థ సమూహ రూపమగు జగత్తుగాను పరిణ మించగా, అన్నిదోషములును శరీరభూతమగు చేతనాంశముతో సంబం ధించి యుండునవి. అన్ని వికారములును అచేతనాంశముతో సంబంధించి యుండునవి. అయితే పరమాత్మయే కార్యవస్తువు. అట్టి యవస్థలో నుండు చేతనాచేతన పదార్థములను నియమించునది యగుటనుబట్టి యదియే

యాత్మ పరమాత్మ యన్నన్నో తనకు శరీరభూతములగు చేతనాచేతనపదార్థములను నియమించునది యగుటనుబట్టి వాటి కంతరాత్మయగుటవలన వాటియందుండు దోషములతోగాని, వికారములతోగాని సంబంధింపడు. అతడు అపరిచ్ఛిన్న జ్ఞానానందమయుండును, ఎల్లకాలము నొక్కటియే స్వరూపముగలవాడై జగత్పరివర్తన రూపమగు క్రీడతోఁ జేరియుండును. ఈవిషయమునే "సత్యంచానృతంచ సత్యమభవత్" అనువాక్యము తెలుపుచున్నది. నానావిధములగు చేతనాచేతన పదార్థములుగాఁ బరిణమించు నదియైనను బ్రహ్మము సత్యముగానే యుండెను. అనఁగా, నిరస్త నిఖిలదోషముగాను అపరిచ్ఛిన్న జ్ఞానానంద మయముగాను, ఏకరూపముగానే యుండెనని యీపై శ్రుత్యర్థము. సమస్తములగు చేతనాచేతన పదార్థములును అనఁగా సూక్ష్మదశయందుండునవిగాని స్థూలదశయందుండునవిగాని యివి యన్నియును పరబ్రహ్మమునకు క్రీడార్థము ఉపయోగపడునట్టి యుపకరణములు. జగత్సృష్టి మొదలగునవి భగవంతుని క్రీడయని ద్వైపాయన పరాశరాదులు "అవ్యక్తాది విశేషాన్తం పరిణామర్ధిసంయుతం క్రీడాహరేరిదం సర్వం క్షరమిత్యుపధార్యతాం" (సూక్ష్మవస్తువు మొదలుకొని స్థూలవస్తువులవఱకును సర్వమును భగవంతుని క్రీడ దీనినంతయును క్షరమని యెఱుంగుము) అనియు, "క్రీడతో బాలకస్యేవ చేష్టాంతస్య నిశామయ" (ఆటలాడు బాలునియొక్క వలెనే సర్వేశ్వరుని చేష్టల నెఱుంగుము) అనియు "బాలః క్రీడనకైరివ" (బాలుఁడు ఆటాడుకొనుటకుగానగు నుపకరణములతోనువలెనే) అనియు ఈమొదలగుతావులఁ దెలిపియున్నారు. సూత్రకారులును "లోకవత్తు లీలాకైవల్యం" (బ్ర.సూ.౨.౧.33) ఇత్యాదిసూత్రమునఁ దెలిపియున్నారు. బ్రహ్మము జగద్రూపముగాఁ బరిణమించినను సమస్తవికారములు (మార్పులు) అట్టి బ్రహ్మముయొక్క శరీరమగు నచేతన పదార్థముతో సంబంధించినవియనియు, సమస్త దోషములు అట్టి బ్రహ్మముయొక్క శరీరమగు చేతనపదార్థముతో సంబంధించినవియనియును ఇట్లు వివేచనపూర్వకముగఁ దెలిసికొనుటకుగాను, బ్రహ్మముయొక్క శరీరభూతములగు నాప్రకృతిపురుషులు అప్పుడు (ప్రళయకాలమున) అట్లు విభజించి గాన్పించుట కనర్హమగు సూక్ష్మమగు స్థితిని బొందుటచే బ్రహ్మముతో నేకీభూతములైనను, "అస్మాన్మాయీ సృజతే విశ్వమేతత్ తస్మింశ్చాన్యో మాయయా సన్నిరుద్ధః" అనువాక్యమున వాటిని భిన్నపదార్థములుగాను ఉపదేశించియున్నారు. ఏలననఁగా, ఈవాక్యము "తదాత్మానం స్వయమకురుత" ఇత్యాదివాక్యములతో నేకార్థమైనందున నట్లు తెలియుచున్నది. అట్లే "సోభిధ్యాయ శరీరాత్స్వాత్ సిసృక్షుర్వివిధాః ప్రజాః అప ఏవ ససర్జాదౌ

తాను వీర్య మసాసృజత్'' ఇత్యాది శ్రుతుల మనుస్మృతియందును తెలుపఁబడి యు. కావుననే బ్రహ్మము దోషరహితమనియును వికారరహితమనియును తెలుపునట్టి శ్రుతులును ఉపపన్నములగుచున్నవి. కావున బ్రహ్మమే జగత్తు యొక్క నిమిత్తకారణమును ఉపాదాన కారణమునని సిద్ధమగుచున్నది.

౨౭॥ సూ॥ యోనిశ్చహి గీయతే

టీ॥ యోనిశ్చ=యోనిగానును, గీయతే=పేర్కొనఁబడుచున్నాఁడు.

తా॥ బ్రహ్మము శాస్త్రమునందు యోనిశబ్దముచే పేర్కొనఁబడుటవలనను అట్లు తెలియుచున్నది.

శ్రీ॥ భా॥ బ్రహ్మము జగత్తుయొక్క నిమిత్తకారణమును, ఉపాదానకారణమునని ఈక్రిందు గాన్పింపఁ బడుచున్నది. ఏలననఁగా, ‹‹కర్తారమీశం పురుషం బ్రహ్మయోనిం'' అనియు ‹‹యద్భూతయోనిం పరిపశ్యన్తిధీరాః'' అనియు నీమొదలగు శ్రుతులయందు బ్రహ్మము యోనియని చెప్పఁబడుచున్నది. యోనియనఁగా ఉపాదాన కారణము. ‹‹యథోర్ణనాభి స్సృజతే గృహ్ణతేచ'' (సాలెపురుగుదారములను సృజించి వాటిని మరల లోనికిఁ దీసికొనుచందంబున బ్రహ్మము గత్తును సృజించి యుపసంహరించుచున్నాఁడు) అనువాక్యశేషమునఁ జెప్పియుండుటచే నట్లు తెలియుచున్నది.

ప్రకృత్యధికరణము ముగిసెను.



సర్వవ్యాఖ్యానాధికరణము.

౨౮॥ సూ॥ ఏతేన సర్వే వ్యాఖ్యాతాః

టీ॥ ఏతేన=దీనిచేత, సర్వే=సమస్తవాక్యములును, వ్యాఖ్యాతాః=వివరింపఁబడినవి.

తా॥ దీనిచే సర్వవాక్యముల యర్థములును వివరింపఁబడినవి.

శ్రీ॥ భా॥ గడచిన నాలుగు పాదములయందును చెప్పఁబడిన న్యాయకలాపముచే ఉపనిషత్తులయందు జగత్కారణమును ప్రతిపాదించునట్టి వాక్య

ములన్నియును చేతనాచేతన విలక్షణుండును, సర్వజ్ఞుండును, సర్వశక్తుండునగు బ్రహ్మమును (జగత్కారణమునుగా) ప్రతిపాదించునవి యని నిరూపింపఁబడియె.

సర్వ వ్యాఖ్యానాధికరణము ముగిసెను.



గద్య॥ ఇది, శ్రీకృష్ణానద్యుత్తరవాహినీతీరస్థ బద్ధరామక్షేత్రాపరనామక వైకుంఠపురవాస్తవ్య, శ్రీమదలమేల్మంగాసమేత శ్రీవేఙ్కటేశ్వరసన్నిధ్యధ్యాపక కైఙ్కర్యధురంధర, శ్రీమద్వాధూలదేశిక కోయిల్ కందాడై అప్పన్ప్రణతార్తిహరాచార్యకృపాపాత్ర, శ్రీపేరరుళాళ రామానుజయతివరపరమానుగ్రహసమధిగత సకల విశిష్టాద్వైత సిద్ధాంతసంప్రదాయ గ్రంథతత్త్వార్థ, వాధూల కులతిలక వేంకటాచార్య రంగమాంబాతనూజ, కావ్యరత్న, వేదాన్తరత్న, వేదాన్తతీర్థ, వేదాన్తవాచస్పతీ త్యాద్యనేక బిరుదాలంకృత, గీర్వాణాంగ్ల ద్రవిడాంధ్రి శుద్ధమాగధ్యవస్థాది ద్వాదశభాషావిశారద, కందాడై. శేషాచార్య ప్రణీతంబగు శ్రీమదాంధ్రి శ్రీభాష్యమునందు ప్రథమాధ్యాయమున

చతుర్థపాదము

శ్రీరస్తు.



